# బాలవ్యాకరణ
# గుప్తార్థప్రకాశిక



గ్రంథకర్త

శ్రీ మన్మహోపాధ్యాయ

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులుగారు.

బాలవ్యాకరణ

# గుప్తార్థప్రకాశిక

బ్రహ్మశ్రీ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి పండితవర్యప్రణీత హరికారికాం
ధ్రీభూతపరవస్తు చిన్నయసూరికర్తృక బాలవ్యాకరణంబునకు

## వ్యాఖ్యానము.

ఇయ్యెడ రాజమహేంద్రవరమందలి గవర్నమెంటార్ట్సుకాలేజీలో
[illegible]యగ పండితులును గీర్వాణభాషాగురు[illegible]లును
కొంతకాలము కొవ్వూరుసంస్కృతకాలేజీ ప్రధానోపాధ్యాయులును
శ్రీమన్మహోపాధ్యాయ బిరుదాంకితులు నైన

## బ్ర॥ కల్లూరి వేంకటరామశాస్త్రులవారిచే

రచియింపఁబడినది

---

రెండవకూర్పు, 2000 ప్రతులు

రాజమహేంద్రవరము.

[illegible]లలితాముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1929



[మూల్యము రూ 5-0-0.

# హారికారికాస్వత్వప్రకటనము

గోదావరిడిస్ట్రిక్టు, అమలాపురముతాలూకా, ముక్తేశ్వరముకా రస్తులు బ్రహ్మశ్రీ శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిలుగారు కాకతాళీయముగా నొకదివసంబుననాకుఁ దటస్థించినపుడు నేనురచించుచున్న గుప్తార్థప్రకాశికావ్యాఖ్యాప్రశంస ప్రసంగవశంబున సంభవిల్లఁగానంతట వారు తెలుఁగు భాష నుద్ధరింపఁజాలిన హారికారికలు తమపితామహులగు శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిలవారిచే రచింపఁబడి లేఖనపూర్వకముగాఁ దమయొద్దనున్నవియనియు, నట్టిపుస్తకంబు నింకొకపర్యాయంబున దాని సారస్వాదులను బరిశీలింపఁగాఁ దెచ్చియిచ్చెదననియు, దయతో వాగ్దానమునేసి, యనతికాలములోనే యాపుస్తకరాజంబును దానికిసంబంధించిన కొన్ని కాగితములతో జోడించి శ్రీరామార్పణముగా రాజకీయన్యాయపత్రింబుపైని లిఖించుచు గ్రంథంబును గుఱించిన సర్వస్వాతంత్ర్యమును యథేచ్ఛముగా ననుభవించుటకై నాకు దానంబొసంగిరి కావున నట్టికారికలు గ్రంథకర్తృత్వాది విమర్శన సందర్భాదులయందు లోకోపకారంబగునన్న బుద్ధితో ముద్రింపఁబడెను. ఇయ్యవి ముద్రింపఁగా నితరులకు నధికారములేదు. గ్రంథకర్తృత్వాది విమర్శనంబునకును బఠనాదిసత్కృత్యంబులకును మిక్కిలి యుపకరించెడి యీకారికారత్నంబుల దయచేసిన శిష్టుకృష్ణమూర్తి శాస్త్రిలవారి మె నెంతయుఁ గృతజ్ఞుఁడ నయ్యెద.

క. మేరుసమశిష్టువంశ । స్ఫారమణిం గృష్ణమూ స్త్రిఁ *బ్రవీణుఁ
శ్రీరామార్పణముగ హారి ! కారికవా కర్తు నుతింతుఁన్.

శ. వేం. శా.

---

*ఇట వీణాశబ్దము వీణాగానమున లక్షణ గాన పాండిత్యము గలవారనియు నర్థాంతరము.

## అభిప్రాయములు.

"బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారికి ............
తమ యుత్తరము గ్రంథము చేరినవి.

తమ గ్రంథము భాషకును లక్షణజ్ఞాన మలవఱచుకొనఁగోరువారికి నత్యంత మావశ్యకమని నొక్కి చెప్పగలను. ఈ గ్రంథప్రకటనముచే నాంధ్రలోకమునకు గొప్పయుపకారము చేసినవారైతిరి. ఇది యాంధ్రలోకమున సర్వత్రవ్యాపకము కలదియగుంగాక.

తమరు సూచించిన 390—404 పుటలను జూచితిని. చిన్నయ్యసూరి కృష్ణమూర్తి గ్రంథముల పౌర్వాపర్యము గురించి మీరువ్రాసినది పండితసాధ్యము యుక్తియుక్తముగానే యున్నది గాని యందుసత్యమెంతమాత్రమో యను సందేహముమాత్రము నన్నుఁ బీడించుచున్నది."

ఇట్లువిన్నవించు,
భవద్విధేయుఁడు.
వా. సుబ్బారావు,
తెలుగుపండితుఁడు ప్రసిడెన్సీ కాలేజీ

చెన్నపట్టణం
1—5—1915

---

I could duly go througha few portions of the stout volume "Balavyakarana gupthartha Prakasika" most of which is tough study. I find that the author has brought to bear on the production of this great work his thorough mastery of the principles of Sanskrit Grammar and succeeded in impressing upon it the stamp of the monumental commentaries on Panini. It is a remarkable work giving proof of the author,s deep scholarship vast research close reasoning and Judgment.

Madras
10—6—15

[Sd] C. BHANUMOORTY.
Telugu Translater to Govt.

I have had the pleasure of going through Brahma Sri Kalluri Venkatarama Sastri Garu,s commentaries on the well-known Telugu Grammar Balavyakaranam by the late Paravastu Chinnayya Suri. Mr. Venkatarama Sastri is a Sanskrit and Telugu Scholar of repute and it augurs well for the future of the Telugu language that Pandits of his type should devote their time and learning for elucidating the laws of that language.

The cammentaries are remarkable for elaborateness of exposition and wealth of illustration,

There may be difference of opinion on some of the points dealt with in the book but there can be no doubt that the way in which they are treated is learned and calculated to stimulate thought. The book will be highly useful to persons wishing to acquire a thorough understanding of the structure of the Telugu language.

GUNTUR | [Sd] J. RAMAYYA;
20-7-1915 |

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులవారిచే రచియింపబడిన బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికావ్యాఖ్యానమును అక్కడక్కడ విన్నాను. ఇదిమిక్కిలి యాంధ్రలోకమునకు మహోపకారమైన గ్రంథము. వీరికి నుభయభాషాపాండిత్యము మిక్కిలి కలిగియున్నందున నిట్టిగ్రంథము రచించుటకు సాధ్యమైనది. వీరికిసంస్కృతవ్యాకరణాది శాస్త్రములయందు పాండిత్యమెక్కువగా గలదు. కావుననే యీగ్రంథమింతరమ్యముగానున్నది.

చిన్నయసూరికి సంస్కృతవ్యాకరణ పాండిత్యము విషయమై బాలవ్యాకరణములోని యంశములుచూడగా నాకుమిక్కిలి సందేహముగానున్నది.

రాజమండ్రి, } ప్రకృతమందువిశ్రాంతులు రాజమహేంద్రవరము
ది 4—10—15 } ఆర్ట్సుకాలేజీ పండితులు;
కస్తూరి శివశంకరశాస్త్రులు.

శ్రీవేదమూర్తులయిన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామ శాస్త్రిలగారికి—

వేదము వేంకటరాయశాస్త్రి నమస్కారపూర్వకముగా విజ్ఞాపించుట:—ఉ॥కు॥

యుష్మద్విరచితమై యుష్మత్ప్రసాదితమైన బాలవ్యాకరణవ్యాఖ్యా గ్రంథముచేరి చిరకాలమయినను అనారోగ్యకారణముచేతనాయభిప్రాయమును వెంటనేవ్రాయఁ జాలనైతిని. ఇటీవలకొంచెమారోగ్యము కలుగుడుపూర్వభాగమును పరికించితిని. వ్యాఖ్య వైయాకరణ సార్వభౌములయిన మీరురచించినట్టిది ఎట్లులుండవలయునో అట్లేయున్నది. ఒక్కటికాదు, తోటందప్ప కడమయంతటను మీయభిప్రాయములను హృదయంగమములవి యభినందించుచున్నాను.

ఉత్తరభాగమును చదువుటకు ఇంకనుసజ్జుడనుగాక యున్నాను. చదివిన పిమ్మట విశేషముతోచినచోఁ వ్రాసెదను. స్థాలీపులాకన్యాయముచేఁ జూడనుత్తరభాగమును ఇట్లే సర్వసమంజసముగా నుండునని తలంచుచున్నాను.

అభిప్రాయము వ్రాయుటకు ఆలస్యముచేసినందులకు మన్నింపవలయును

జ్యోతిష్మతిప్రెస్సు, మూలపేట, 16-10-16, నెల్లూరు. } ఇవ్వియయనేకనమస్కారములు

వేదము వేంకటరాయశాస్త్రి.

---

అయ్యా!

అనేకవందనములు. తాము దయాపూర్వకముగాఁ బంపిన "బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికను" సమగ్రముగాఁ జదివి మిక్కిలి యానందించినాఁడను. వ్యాఖ్యానమెక్కడజూచినను సంస్కృతవ్యాకరణమునందును తద్భాష్యములయందును మీకుఁ గల యసాధారణపాండిత్యమును

వెల్లడించుచున్నది. ఆంధ్రవ్యాకరణజ్ఞానమును నలవరించుకొనఁ గోరువారికందఱకును మీపుస్తకమత్యంతోపయుక్తమైనదనుటకు సందేహములేదు. అయినను ప్రకీర్ణపరిచ్ఛేదావసానమునందు గ్రంథకర్తలవిషయమున మీరిచ్చినయభిప్రాయముతోనే నేకీభవింపఁజాలనందుకు చింతిల్లుచున్నాఁడను.

ఇట్లు, భవద్విధేయాప్తుఁడు,

రాజమండ్రి,
ది 16—10—15

కందుకూరివీరేశలింగము,
(రావుబహద్దూరు.)

---

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిలవారికి—

తమ బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక లక్షణపూర్వముల లక్ష్యముల నభ్యసింపఁ గోరువారికి నత్యంతావశ్యకము. ఆంధ్రభాషకు మహోపకారిణి. లోకమంతటఁ బఠనపాఠనలెసంగుఁ గాత.

ఈషద్భేదముగ సంస్కృతముగానున్న కృష్ణమూర్తి మహిత పండితప్రౌఢకృతియు స్వసంస్కృత గ్రంథమునకుఁ గొంత తెనుఁగసిన చిన్నయసూరి బాలవ్యాకరణమును బూర్ణముగఁ జదివియారసితిని.

ప్రధానము బాలవ్యాకరణమున గుప్తార్థమిది. సమర్థుఁడయి,యాంధ్రశబ్దచింతామణి నుక్తానుక్తదురుక్త చింతనమున నాంధ్రులకు మేలు చేసి, స్త్రీలకునగోప్యములు నర్థపిహితములునయి సరసములగు నధరోరోజాదిపదసధ్రీచీన యాంధ్రభాషయుపదేశింప రాదను నవీనమతముల వడసికవిబ్రహ్మయకీర్తి కింవదంతి మాపు నీయంశమున సమగ్రైకమత్యము నొందితిని.

విద్వద్విధేయుఁడు,

రాజమండ్రి,
ది 22—10—15.

అకుండి వ్యాసమూర్తిశాస్త్రి,
ఇపుడు ప్రకృతివేతనముగొనుచున్న రాజమండ్రి
ఆర్ట్సుకాలేజీ సంస్కృతాంధ్రోపాధ్యాయుఁడు,

[ఇట్టి సజ్జనమండలంబనెడి సప్తర్షిమండలంబునఁ బరివృతంబైనమదీయగ్రంథంబు ధ్రువకీర్తిం దోఁజియుంగాత!] క. వేం. శా.

---

# ఉపోద్ఘాతము.

నేఁటికించుమించుగా నేఁబదియాఱు సంవత్సరముల క్రిందట బాలవ్యాక
రణము పరవస్తు చిన్నసూరిచే విరచింపఁబడియె నందురు. ఇయ్యది
సంస్కృతముననున్న నన్నయభట్టీయమునకు వివరణవృత్తిగాఁగ శిష్టు
కృష్ణమూర్తిశాస్త్రులుగారు సంస్కృతభాషలో రచియించిన హరికారి
కావళికినచ్చుపుఁ దెనుంగైనట్టుకనంబడు. ఆంధ్రమున రచింపఁబడియె నను
నామ మాత్రమేకాని యీగ్రంథరాజ మతికఠినంబుగాన, సామాన్యధీ
మంతులకు దురవగాహంబయి తనర్చు. దీనం గ్రహింపవలసిన విషయం
బులు పెక్కులున్నందున నియ్యుత్తమ గ్రంథమ్ము సర్వజనులకు సుబోధ
ముగానుండిన బాగుండుననునంశం బెల్లవారల మనోరథంబు. అమ్మనో
రథంబీడేర్పనెంచి ప్రథమమునఁ బచ్చప్ప కళాభవనంబునఁ బ్రధానాం
ధ్రోపాధ్యాయులుగా విలసిల్లిన వింజమూరి కృష్ణమాచార్యులవారీ గ్రం
థమునకు విపులమగు వ్యాఖ్య వ్రాయనుద్దేశించిరి. కాని యాంధ్రుల
దురదుష్టవశమున నాయన తనయుద్దేశంబు సిద్ధింపకుండనే కాలధర్మము
నొందుటం జేసి యయ్యది యాదిలోనే శాశ్వతనిద్రం జెందె. పదంబడి మ
ఱికొందఱు పండితులాయన తలంచిన ప్రయత్నము గొనసాగింపనెంచి
రట గాని యిప్పటికిని మనకుసుదినంబులు వాటిల్లమి నదియును మొద
టనే తుదిముట్టె.

ఇప్పుడు రాజమహేంద్రపురంబున సర్వకలాశాలలో గీర్వాణభా
షా గురువులును, ప్రధాన పండితులగు బ్ర॥ శ్రీ॥ కల్లూరి — వేంకట
రామశాస్త్రులవారు బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానమొనరించిరి. ఈ
వ్యాఖ్యప్రారంభంబున గ్రంథకర్తగారికిఁ బ్రియశిష్యుండగు సుంకర రం
గయ్యగారు కుండలీంద్రునకుం (తిక్కనసోమయాజికి) గులాల కులస్థుం
డా గురునాథుండుపోలె (కుమ్మర గురునాథుఁడు) లేఖనాదులయందుఁ

దోడుగాఁగ గ్రంథము చాలవఱకు రచితంబయ్యె. పిమ్మట కొందఱు కలహాశనుల ప్రోత్సాహంబున గురుద్వేషంబూని రంగయ్యగారు శుద్ధముగా వ్రాయుటకై గురుదత్తమైన గ్రంథము తమయొద్దనే యుండినందున గ్రంథకర్తృత్వము తమయందారోపించుకొని గ్రంథకర్త కెఱుకలేనిదియే ముద్రితకారక పరిచ్ఛేదాంత గ్రంథము ప్రథమభాగముగాఁ దమపేరునఁ బ్రకటించుకొనిరి. తామెంతయో విశ్వప్రయత్నంబు సేసినను లభింపని యార్ట్సుకాలేజీ పండితపదంబు శాస్త్రిలవారికి ననాయాసలభ్యంబైనదన్న యసూయయే శాస్త్రిలవారియెడ నీకలహాశనులకు నిష్కారణ వైరంబు గలిగించి యీశూద్రశిష్యుని భేదంబుమూలంబున శాస్త్రిలవారిని వంచింపఁ జూచెనందురు. ఇట్లీ చతుర్థవర్ణశిష్యుండు ద్వేషింపఁగాఁ గీర్తిశేషులగు మ॥ రా॥ శ్రీ—ఏలూరి లక్ష్మీనరసింహముగారు గురుశిష్యులుభయులకును రాజీనామా సలిపిరి. మధ్యవర్తులగు శ్రీలక్ష్మీనరసింహముగారు బాల్యాదిగాఁ బ్రియశిష్యుండును బుత్రప్రాయుండుగాన రంగయ్యగారికింగూడ నప్పటివఱకుసిద్ధంబైన గ్రంథంబునందు సమానస్వాతంత్ర్యమీయవలయునని శాస్త్రిలవారిని గోరఁగా సరసులైన శాస్త్రిలవారు మధ్యవర్తులమాటను, చిరకాల ప్రవర్తమాన శిష్యవాత్సల్యంబును నిరాకరింపఁజాలక యట్లు సమ్మతించిరిగాని రాజీనామా జరిగిన యనతికాలములోనే అక్టోబరు 1910సం॥లో రంగయ్యగారుపరమ ప ద ం బు న కు వేంచేసిరి.

మఱియు సాత్త్వికబ్రహ్మ విద్యావిలాసనిరసన గ్రంథప్రారంభంబున శాస్త్రిలవారిచే రచింపఁబడిన కృత్యాద్యవస్థాభూత వంశముక్తావళీకోశంబున స్వవంశవర్ణనం బొనరించినది మొదలు మ॥ రా॥ శ్రీ॥ శ్రీకృత్తివెంటి నాగేశ్వరరావుగారికి శాస్త్రిలవారియందు నధికభక్తి విశ్వాస గౌరవంబు మెండుగాఁగలదు. దానంజేసి యేతద్గ్రంథముద్రణమూల్యదాన భారంబు తాము వహించెదమని వాగ్దానమ్ముతో శాస్త్రిలవారిపేర నిట్లు వ్రాయుచున్నారు.

శ్రీవేదమూర్తులయిన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి సమ్ముఖమునకు వి॥ శే॥ శ్రీ॥ కృత్తివెంటి నాగేశ్వరరావు అనేకనమస్కారములు—ఉభయకుశలోపరి.

త॥ తాము రచించిన బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక, అనుగ్రంథము చూడగా నాకుచాల సంతోషకరముగాను ఆంధ్రభాషాభిలాషులకు మిగుల నుపయోగకరముగాను నుండినట్లు నాకు కనఫడినందున నాసంతోషపూర్వకముగా తద్గ్రంథము వర్తమానములో ముద్రింపించుచునే యున్నాను గ్రంథపూర్తి అయ్యినపిమ్మట దానివ్యయము నేనే వహించుచున్నాఁడను గాన తమకు ఆగ్రంథముయొక్క కపీరైటును శ్రీరామార్పణముగా సమర్పింపఁ దలంచినాడను. ... ... ... ...

చిత్తగించవలెను.

7—5—1908 }
రాజమండ్రి, } శ్రీకృత్తివెంటి నాగేశ్వరరావు వ్రాలు

ఇట్టివాగ్దానముంబట్టి వారు గ్రంథాది క్రియాపరిచ్ఛేదముందలి 8వ సూత్రమువఱకున్న ముద్రితభాగమునకు ధర్మబుద్ధితోన మూల్యదానం బొనర్చిరి. ధర్మాత్ములకీకలికాలంబులోఁ గష్టంబులు మెండుగావున శ్రీనాగేశ్వరరావుగారు దైవవశంబునఁ గొన్నిచిక్కులంబడి మనోవైకల్యంబు నొందఁగా గ్రంథకర్తగారు శిష్యుని లోకాంతరప్రాప్తి పిమ్మటను బూర్తి చేసిన గ్రంథశేషమునకు ముద్రణమూల్యం బడుగఁగా నోరురాక యూరకుండిరి. తక్కినగ్రంథమునకు నయితము ముద్రణమూల్యము సుసరళహృదయుండైన యాసీతారామమూర్తి సహాయ్యంబుననే లభింపఁగా గ్రంథంబు సాకల్యంబు నొందె.

ఈగ్రంథరాజంబు "బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక" యనునామంబునఁ బరగుచున్నది—మూలగ్రంథమున నున్న సూత్రముల కెల్లను గరతలామలకంబుగా సోదాహరణ వివరణంబుతోనుండి యుదా

హారణములయొద్ద సందర్భానుసారంబైన సూత్రము లమరంగా వ్యాకరణమందలి యుదాహరణముల ననుసరించిన మహాకవిప్రయోగంబులు తండోపతండంబులుగాఁ జూపఁబడి యాంధ్రలోకమున కత్యంతోపయోగకరముగాఁ దేజరిల్లుచున్నది. ఇందలి గుణాంశములను బూర్ణముగా వచియింప నావంటివాని కలవిగాదు. చదువరులే వానిని గ్రహింతురుగాక! ఈగ్రంథకర్తగారు కాళిదాసకృత మేఘసందేశమునకు నాంధ్రీకరణమగు పద్యకావ్యమును, సాత్త్విక బ్రహ్మవిద్యావిలాస నరస మనుశవోత్కర్షసాధక సిద్ధాంత గ్రంథమునకుఁ గృత్యాద్యవస్థమైన వంశముక్తావళియును రచించిరి. మృదుమధురమైన యుభయభాషాకవితాధోరణి తమకుఁ బరిఢవిల్లుచున్ననువీరలు శ్లో॥ శాస్త్రేషుహీనాః కవయోభవంతి కవిత్వహీనాశ్చపురాభట్టాః పురాణహీనా కృషికాభవంతి భగ్నాఃకృషేర్భాగవతాభవంతి॥ అనువచన న్యాయంబునఁ గవితారచనయందుత్సాహంబులేక వ్యాకరణ వేదాంతాది శాస్త్రపఠనంబునందే సమయంబు వినియోగించుచుందురు. ప్రకృతంబున శిష్టు కృష్ణమూర్తిశాస్త్రివిరచిత హరికారికావళికి నాంధ్రంబగు చిన్నసూరి కృత బాలవ్యాకరణంబునకుఁ దేట తెల్లమగు మాటలతో సామాన్య పండితసాధ్యంబుగాని యీవ్యాఖ్యానమొనరించితమ యనన్యసాధారణ సంస్కృతాంధ్రభాషా పాండిత్యమును సార్థక పఱచుకొనుచు లోకంబున కమితోపకారంబొనర్చిన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి పరిశ్రమంబునకు నెల్లరు కోవిదులు కృతజ్ఞులగుదురుగాక!!

మఱియు నీబాలవ్యాకరణంబు కృష్ణమూర్తిశాస్త్రులవారి హరికారికావళికంటెఁ బూర్వమందే యుద్భవిల్లినదని యీగ్రంథాంతమందలి యుక్తులనుఖండించియు వేఱుసాధనంబులను గనంబఱచియు నేరేనిసమ

ర్థించినయెడల వారికి శాస్త్రులవారును నేనును ననేక వందనాచరణంబు లతోఁ గృతజ్ఞులమయి యిప్పటియభిప్రాయంబు మార్చుకొందుముగాని! కృష్ణమూర్తిశాస్త్రిగారి గ్రంథకర్తృతసమర్థనమునందే కేవలము నభినివేశముగలారముగాము. సత్యవాదమే సర్వశ్రేయోనువాదం బగుంగాత!

ఇట్లు గ్రంథకర్తగారి
ప్రియశిష్యుఁడు దేవరకొండ
21—9—15 జగన్నాథరావు బి. ఏ
టీచర్ మిస్సస్. ఏ.వి.యన్ కాలేజీ
విశాఖపట్టణము.

---

## దైవప్రార్థన.



క. శ్రీరాము నఘవిరాముని
బోరాముఁ గెడపి యోముభూసుత్రామున్
ధారాధరసుశ్యాముని
ధారణిసుతనోము ఫలముఁ దద్దయుఁ గొలుతున్.

---

## గురుస్తుతి.

---

క. అలయార్ట్సుకాలేజీలో
వల మాకెల్లరకు నుభయభాషాగురుడై
నలువగుకల్లూరికులో
జ్వాలవేంకటరామశాస్త్రిబ్రహ్మం దలంతున్.

---

శ్రీరామాయనమః

# గ్రంథకర్తృవంశావతారవర్ణన

సీ. శ్రీరమ్యవిటపికాంతారసంతానాతి
శయసాంద్రతరభూమిసంవృతంబు
భూరిసౌరభయుక్తపుష్పావళీ
ఖేలదళినినాదార్భటీ విలసితంబు
వివిధరూపాన్వితవిహగతండోద్భవ
సుమనస్కరారావశోభితంబు
సకలదేశాయాతసాధుభక్తానీక
పూజితశివలింగరాజితంబు

గీ. సిద్ధసాధ్యాది ఖచర సంసేవితంబు
భూరిభవనాశకర శృంగభూషితంబు
పుణ్యజనలోక వాంఛా ప్రపూరితంబు
వసుధ విలసిల్లు శ్రీశైలపర్వతంబు. 1

క. ఆపుణ్యశ్రీశైలము
దాపున గల్లారన బహుధర్మాచరణో
ద్దీపితవిప్రవరేణ్యకు
లోపేతం బగ్రహార మొండు చెలంగున్. 2

గీ. అందు ధర్మపన్నాల వారనఁగఁ దనరు
బ్రాహ్మణులవంగసమునందు బాలుఁడగుచు
వెలసె వీరన్న యనునొక్కవిప్రతిలకుఁ
డబ్ధి వెలయించి పుట్టుమృగాంకుకరణి. 3

క. బాలుఁడు శమదమ సద్గుణ
జాలుఁడు నిగమాది వివిధ శాస్త్రార్థ శ్రీ

లోలుఁడు పశుపతిసేవా
ద్వేలుఁడు వీరన్నఁబోలు విప్రుఁడు గలఁడే 4

ఉ. వీరన బాలుఁడయ్యుఁ గడుఁబెద్దలయొద్దను విద్దెనేర్వఁగాఁ
జేరెను బట్టసంబునకుఁ జేరువఁ బోలవరాఖ్య మేల్జమీం
దారుపురంబు నయ్యెడ నుదారమనీషుఁడు మంగపేశుఁడన్
భూరమణేశుఁ డీతనిని బోషణఁజేసెను బుత్రు కైవడిన్. 5

సీ. మంగళపేశునిసభా మండనులైనట్టి
విబుధోత్తములయొద్ద విద్యనేర్చె
నేయొజ్జలొద్దఁ దా నేవిద్దె గఱచెనో
యొరు లెఱుంగకయుండఁ దిరుగనేర్చె
వేదశాస్త్రపురాణ వివిధకళాజాల
ములఁ దన కీడులే కలుగుచుండె
విద్యాధికుఁడనిన విఱ్ఱవీగక నమ్ర
భావంబుతో నెల్లవారిఁగాంచె

గీ. వీరభద్రేశుచరణము ల్వీడువ కెపుడు
భక్తిసేవించు నేకాంతభక్తుఁడగుచు
నీఱు గవిసిన మెఱయనినిప్పువోలెఁ
జెలఁగె వీరన్న జనముల లచ్చెరువునొంద. 6

శా. అంతం గొండొకవేళ నాపురికి బ్రహ్మానందసామ్రాజ్య భా
స్వంతుండు న్నిగమాది సర్వసుకళా సంపూర్ణుఁడు న్నిర్మల
స్వాంతుండైనఘనేంద్రనామకపరివ్రాట్చంద్రుఁ డేతెంచి భూ
కాంతుం జేరి తదీయపండితసభం గావింప వాంఛించినన్.

క. అప్పుడు మంగపదేవుం
డప్పురమునఁ బండితాళి నంతయు నొకచో
రప్పించి సభను గూర్పఁగ

నప్పావనమూర్తిఁజూచి యాశ్చర్యమునన్.

చ. చదువులప్రోడనై యపరసారసనంభవుఁ డోయనంగఁబెం
పొదవి సమస్తవిద్యలను నుద్ధతి దిగ్విజయంబుఁగొంచు నె
ల్లదిశలు చుట్టివచ్చుయతిలావు నెదుర్కొనఁజాలరైరి సం
విదితఘనైక విద్యలయి పేర్వడుమంగపరెడ్డిపండితుల్. 9

మ. తనయాస్థానపుఁ బండితావళి ఘనేంద్రస్వామితోశాస్త్రగో
ష్ఠిని సల్పందగఁ జాలకుంటకుఁ గడుం జింతించునామంగపే
శునిఁ జేరంజని వీరనార్యుఁడనియెన్ సోమాభకీర్త్యాకరా
ననుమీరంపిన నెల్లవిద్యల ఘనేంద్రస్వామిమెప్పొందెదన్. 10

క. అని వీరన నెమ్మనమునఁ
దనవిద్యామహిమఁజూపఁ దఱి యిది యంచున్.
ఘనకౌతుకమునఁ గోరఁగ
జనపాలుం డట మఱొక్కసభ గావించెన్. 11

సీ. అపుడు వీరన్న యాయతి శేఖరునితోడ
సకలశాస్త్రంబులఁ జర్చసలిపె
వేదార్థ మడిగిన వేదాంత సారమౌ
జీవేశతత్త్వంబుఁ జెలఁగ నుడివె
శాస్త్రార్థమును గోర షట్శాస్త్రములలోన
మేలైనయంశము ల్లీలఁబలికె
గౌతమీయంబునఁ గాణాదమునఁబాద
రాయణసూత్రాళిఁ బ్రౌఢి నెఱపెఁ

గీ. గావ్య నాటకాలంకార ఘనసమస్త
శాస్త్రజాలంబులందలిసరణి యెల్లఁ
దెలిపె సభయందుఁ గరతలామలకముగను
బండితావళి మెచ్చి సెబాసనంగ. 22

క. లంతట యతివరుఁ డోహో
యింతటి విద్యాసమర్థుఁ డిచ్చటఁ గలఁడా!
వింతయ్యె నింకనాతోఁ
బంతముఁ బూనంగవలయుఁ బ్రజ్ఞాశక్తిన్. 12

సీ. పఞ్చాఙ్గములతిథుల్ సర్వంబు నొకపరి
చూచివచింతునే చోద్యమొనఁగఁ
నల్లొనర్పఁగ నీకు నలవియే! యనిపల్క-
సంవత్సరపుతిథుల్ సరవి నొక్క-
మాఱుచూచియె వాని మరలవచించెద
ననుచు వీరన్న తానానతిచ్చె
నంతనబ్బురపడి యతిచంద్రుఁ డట్లునే
యఁగవలెనన్న వీరన్నయపుడు

గీ. పోలవరధారణీశుఁ డద్భుతమునొంద
విబుధలోకంబు నయనము లిప్పిచూడ
నేకవర్షపుఁ దిథులఁ బల్కేఁక నుడివి
తన యశేషసుధీమహత్త్వంబుఁ జూపె. 13

చ. అది గని సంయమీంద్రుఁ డహాహా! పులిమీఁదనుబుట్టియయ్యెనీ
పదములబుద్ధిశాలియని సన్నుతిఁ జేయుచు దిగ్జయంబునం
దొదవినగండపెండెరము నొయ్యన వీరనయంఘ్రిఁ గట్టె స [గన్
మ్మదమున 'నన్నుఁ గెల్చిత'ని భూపతియుబ్బనుమిన్నుమట్టఁగన్

మ. జనలోకాధిప! యీధరామరుఁడు ప్రజ్ఞాశక్తి వీక్షింప నూ
తనరూపంబున ధారణింబొడము మేధాదక్షిణామూర్తియై
కనుపట్టున్ సభకిట్టియుత్తముఁ డలంకారంబుగా నుండ నే
ఘనపుణ్యంబును జేసితీవో! కద ప్రాగ్జన్మంబునం దిమ్ములన్ 16

క. అని మనుజాధిపుతోడను
వినిపించి యతీంద్రుఁడరిగె వీరన కంతన్
ఘనవిబుధులు మ్రొక్కిరి పా
వనమగుపట్టనపువీరభద్రుమండనుచున్ 17

వ. అంత నామంగపధరాకాంతుండమందానంద కందళితహృదయారవిందుండై యాభూసురేంద్రుండు దిగ్విజయంబొనరించిన ఘనేందుని జయించుట, పరిజాచయంబునకుం దెలుప నాతని నొక్కగంధసింధురమునం దధిరూఢుం జేసి రాజమార్గంబున నిజసౌధమునకుం దోడ్కొని పోవుచుండ. 18

సీ. పుడమి నుద్భవమొందుబుధవరేణ్యుల కెల్ల
భూషణంబగు పుణ్యపురుషుఁ డితఁడె
ఘనఘుచేంద్రస్వామికళలెల్లఁ గడకొత్తి
ఖ్యాతినొందినకళాకాంతుఁ డితఁడె
సర్వసంపూజ్యమౌ సద్గుణావళి కెల్ల
స్థానమైపొడమినధన్యుఁ డితఁడె
మంగపేశునికీర్తి మచ్చనొందకయుండ
వెలయునట్లొనరించుమీరుఁ డితఁడె 19

గీ. సకలజనసేవ్యమగుపట్టణమునఁ దనరు
వీరభద్రేశ్వరునియవతార మితఁడె
యనుచు వినుతించుజనముల హర్షకలిత
భాషణంబులు మిన్నంటెఁ బ్రబలమగుచు. 20

క. అంతట వీరన నాభూ
కాంతుఁడు సదనంబుఁ జేర్చి గౌరవ మొప్పన్
వింతగుమణిమయభూషా
సంతతిఁ జీనాంబరాళిఁ జాఁ నొసంగెన్. 21

గీ. అన్ని సదుపాయములు గల్గునగ్రహార
మొండు పంటవలంతి సర్వోచ్ఛగాఁగ
వీరభద్రపురంబను పేరొసంగి
దానమిచ్చె వీరభద్రదాసతాఁ డనుచు. 22

సీ. పదఁపడి వీరన్న బ్రహ్మచర్యంబును,
విడిపింపఁ గోరి యాపుడిమి జేడు
తనసభాస్థలిగల్గుఘనపండితులలోన
నగ్రగణ్యుండగునతనియనుఁగుఁ
గూతు భద్రనా రూపగుణవంతురాలిని
వీరన్నకిప్పించి పెండ్లిసేయ
నెంచి ముహూర్తంబు మంచిది పెట్టించి
వీరన్న వైపున వియ్యమంది 23

గీ. బ్రాహ్మణోత్తములెలమి దీవనల నీఁగ
సకలయాచకనికరంబు సంతసింపఁ
బెండ్లి యొనరించెఁ బ్రియమగువిందులిడుచు
నఖిలజనములు దన్నౌరా! యనంగ. 24

వ. అంతఁ గాలక్రమంబున వీరభద్రబిరుదం బొందినవీరవిబుధుని
పత్నీరత్నంబు పుష్పవతియై భర్తృగృహంబుఁ బ్రవేశించి. 25

చ. వినయముఁ బేర్మి సంపదయు విశ్రుతనిర్మలకీర్తి పుణ్యవ
ర్తనముఁ గృపాంతరంగమును దానము భోగదృఢానురాగమున్
జనవును గల్గి భర్తకనుసన్న మెలంగెడు భద్రకాంత త
న్నయముఁదోడికాంతలు ప్రియంబున మెచ్చుచుఁ జెల్మిసేయఁగన్

సీ. ఈవిప్రునకు నిట్టియింతి చేకూఱుట
బహుజన్మకృతతపఃఫలముగాదె!
యీసతీమణికిట్టి హృదయేశుఁ డొదవుట

తొలిబామునోములఫలముగాదె!
యీభవ్యగుణునకు నిట్టియుత్తమురాలు
సతియౌట చిరపుణ్యసరణిగాదె!
యీపుణ్యచారిత్ర కిట్టిధర్మాత్ముండు
మగఁడౌట ఘనదానమహిమగాదె
గీ. యనుచు జనములు బొగడంగ ననవరతము
నొండొరుల కనురాగంబు నిండికొనఁగ
వీరనార్యుఁడు పత్నియు వివిధగతుల
నతులసౌఖ్యాంబునిధి నోలలాడుచుండ. 25
శా. అష్టైశ్వర్యము లొక్కచోట ధరలో నావిర్భవంబొందెనాఁ
దుష్టింజెందఁగ మంగపేశ్వరుఁడు సంతోషింప బంధుల్ మనో
భీష్టంబౌతనయాష్టకంబుఁ గని రుర్వీదేవతాదంపతుల్
స్పష్టౌదార్యులఁ బుణ్యమూర్తుల లసచ్చంద్రప్రభాకీర్తులన్. 26
క. అష్టాశాపతులో! మఱి
యష్టసుసిద్ధివ్రజంబొ! యష్టవసువులో!
అష్టాశాకరులో! యన
నష్టభ్రాతలు చెలంగి రష్టవిభూతిన్. 27
క. వీరలలో నొక్కొక్కరి
కారయ జన్మంబు నొంది రష్టతనూజుల్
వారికపత్య పరంపర
వారక వర్ధిల్లె కదళి వంశము వోలెన్. 28
గీ. ఇట్లు శాఖోపశాఖలై యెసఁగువంశ
మునకు ధర్మపన్నాలవార నెడువేరు
విడియఁ గల్లూరిపేరయ్యె వీరనార్యుఁ
డరుగుదేరంగఁ గల్లూరియందునుండి. 29

వ. ఈకల్లూరి వంశంబు నానాఁటికి విస్తరించి జనసంఖ్యయమితం బయి జాతాశౌచాదులకతంబున శుభకార్యంబులకెల్ల నంతరాయంబు వాటిల్ల నందలి బుద్ధిమంతు లీవంశంబును గదళీవృక్షంబున కెనయించి బొంత, యమృతపాణి, చక్రకేళి, యను త్రివిధనామంబుల నీకల్లూరివంశంబుఁ దేజరిల్లఁజేసియొండొరులకుం బరుదుపుణ్యాంబులసంబంధంబుఁ దొలి శుభకృత్యంబులు నిర్వర్తించుకొనుచుండిరి. అందుబొంతకల్లూరి వంగసంబున. 30

మ. సకలాంచన్నిగమావధానియును బూజ్యశ్రౌతవిద్యావిధి
ప్రకటప్రజ్ఞుఁడు భూరిశాంతుఁడుఁ గృపావంతుండుఁ నాగంతుక
ప్రకరాన్నార్పణకల్ప భూరుహుఁడు శుంభత్కీర్తిమంతుండుఁద్వ్యం
బక దేవార్చన నిష్ఠితాగ్రహుఁడు రామస్వామియొప్పెంగడుఁ.

కం. శ్రీరామ స్వామ్యవధా
న్యారాధిత పరమశివుఁడై యనఁగాఁబుణ్యా
చారుం డతనకిఁ బొడమె
న్వీరేశ్వర దీక్షితుండు పెదకొమరుండై. 32

వ. అట్టివీరేశ్వర దీక్షితుండు. 33

సీ. గ్రసుబ్రమూర్తి మాతుల సోమావధానిక
న్యను వేదవిద్యతోఁ దనరు సీయ
మొగి గుణాత్రేయ మిట్లు మూర్తీభవించెనాఁ
బాలుపారు సుతుల ముప్వురను గనియెఁ
దనయందు వాత్సల్య తత్పరుండై యెదఁ
గౌరీరమణుఁ డెప్డుఁ డారసిల్ల
నవని యథార్థకతు న్యాయంబునం దాను
గౌరీరమణుఁ డన్న పేరఁ బరఁగెఁ 34

ఆ. వె. బుడమిఁ దనకు మఱలఁ బుట్టువు లేకుండ
భక్తిఁ జేసియొంచె భర్గుపదము
విపులపుణ్యమూర్తి వీరేశ్వరాఖ్యదీ
క్షితుని నెనయువారె యితర నరులు. 35

ఉ. పూతచరిత్రుఁ డీఘుతుని పుత్రులలోపల నగ్రజన్ముఁ డు
గ్రాతను తేజుఁ డుజ్జ్వలసదుదార గుణాఢ్యుఁడును సత్ప్రతి గ్రహా
ఖ్యాత్ముఁడు సంస్కృతాంధ్ర సరసార్థ గతిశ్రుతి పేయమాధురీ
వ్యాతతవాగ్గభీరుఁ డిలయందును వేంకటశాస్త్రి పూర్వజా. 36

చ. క్షితిసుతఁ గొన్న రామనృపశేఖరు పోలిక శీలగోత్ర రా
ట్సుత వరియించినట్టి పురసూదను భంగిఁ గులీనసద్గుణాం
కిత శుభలక్షణాంగి యనుకీర్తిని గాంచుటఁ గామ సోమదే
వ్యతిశయితాఖ్య కర్హయగునా సతి వేంకటశాస్త్రి సోదరున్.

సీ. పతిభక్తియందు నీసతి యరుంధతితోడ
సాయుజ్యమొందఁగా జాలుచుండు.
సూనృతోక్తులయందు సుదతి భారతితోడ
సరసోక్తులాడఁగాఁ బరఁగుచుండు
సౌభాగ్య మహిమను నీచాన యంబికతోడఁ
సరి జేసులాడఁగాఁ జాగుచుండు
జిర సంపదలయందుఁ దరుణి యిందిరతోడ
వియ్యంబు నందఁగా వెలయుచుండు 37

గీ. నవఁగ నలువురు బిడ్డల జననియగుచు
నలరు వేంకటశాస్త్రి యర్ధాంగి కామ
సోమదేవమ్మ యనియెడు సుదతిమిన్న
కుపమయగుదురె? తక్కిన యువిదలెల్ల. 38

కం. ఇల నీసతికిని బతికిం

గల సంతతియందు నగ్రగణ్యుఁడు గిరిజా
లలనాపతి సేవకుఁడు
జ్వాల వేంకటరామశాస్త్రి బ్రహ్మ యొసంగుఁగాత. 39

సీ. భవ్య గీర్వాణాంధ్ర భాషాసముల్లస
త్సాహిత్య కవితావిశారదుండు
స్కంధత్రయాన్వితజ్యోతిషోక్తులయందు
సవరరుచి మహిమతోఁ బ్రబలు బుధుఁడు
సద్వేదముఖశబ్ద శాస్త్రసముత్కృష్ట
పాండితీవైభవమండనుండు
వేదాంత సిద్ధాంత విపుల ధర్మాగమ
శాస్త్రార్థపరిచిత స్వాంతయుతుఁడు 40

గీ. రాజరాజేంద్రనగర విరాజమాన
రాజకీయార్ట్సుకాలేజి రాజమందుఁ
జదువు శిష్యాళి కుభయభాషాగురుండు
రమణ విలసిల్లు వేంకట రామశాస్త్రి. 41

సీ. తన విద్య లవనిసార్థకతఁ బొందెడునట్టు
లెవ్వరడ్గిన నెమ్మి నెలమి నుడువుఁ
దన కిచ్చుజీతమంతయు జీర్ణమగునట్లు
బంధు మిత్రుల గౌరవమ్ము సల్పుఁ
దన గృహస్థత్వంబు ఘనత నొందెడునట్లు
దార పుత్రాదులఁ దనుపఁ జూచు
దన జన్మ మిలలోన ధన్యంబయగునట్టు
లబ్బురంబగుభక్తి హరుని గొల్చు 42

గీ. మహితగురుజనాచారసమన్వితుండు
సతత సద్గ్రంథ పఠన వాంఛాయుతుండు

నిరతహృదయస్థితైకపత్నీవ్రతుండు
జగతినొప్పు వేంకటరామశాస్త్రి వరుఁడు.

కం. శ్రీహరి లక్ష్మీదేవిని
మోహమున వరించినట్లు పూరితసంప
ద్దేహిని లక్ష్మీసతి ను
ద్వాహంబై వెలయు నితఁ డహార్యప్రేమన్.

వ. అప్పుణ్యసతీతిలకం బెట్టిదనిన—

సీ. ఈ యింతి పతిభక్తి యెల్లకాంతాళికి
నాచార్య యనఁదగి యవని మెఱయు
నీతన్వియౌదార్య మెల్లబాంధవులకు
నమృతసంధానమై యలరుచుండు
నీచాన సౌజన్య మెల్లచూపఱకును
గన్నుల పండువై కానిపించు
నీరామమందిరంబే యన్నపూర్ణాంబి
కారామభూమియై యడరుచుండు

గీ. ననుచు లోకులు తన్నెప్డు వినుతిసేయ
నమలకులజాత తరుణీకులావతంస
మగుచు సౌభాగ్యసంపద ననవరతము
నలరు వేంకటరామ వామాంగలక్ష్మి.

కం. ఈరమ్యదంపతులకుఁగు
మారులు నల్వురును బ్రకటమంజులరూప
స్ఫారులు గొమరితలిద్దఱు
ధారణి నిజయించి రతుల దానఫలమునన్. ౪౭

వ. అట్టి యపత్యవర్గంబులోఁ దేజరిల్లు వేంకటవీరసుబ్రహ్మణ్యుండను
నతం డసమానరూపరేఖావిలాసుండును నమేయసద్గుణగణగరిష్ఠుండును

నత్యంతధిషణాఘనుండునునై పదునాలుగు వత్సరంబుల ప్రాయంబుగలిగి

మ. భగవద్భక్తి రసానుభూతి నపరబ్రహ్మాదుడున్ బుద్ధిసూ
క్ష్మగతింజేసి తలంపఁగా వరగుణఖ్యాతిం గనుంగొన్నశ్లా
ఘ్యగుణుండున్ బితృవాక్యపాలనపరుండౌ బాలుఁడౌ యవెన్ధ్రువో
ర్ధ్వగతి న్వేంకటవీరపూర్వపద సుబ్రహ్మణ్యనామాహ్వయుండై.

కం. ఏతత్సూన శేఖరునకు
నాతతసుగుణాకరునకు నవిరతధిషణా
పేతునకుచితాచరణని
నీతున కగజాపతిపద నిష్ఠితమతికిన్. ౧౦

కం. సంతత పితృభక్తియుత
స్వాంతునకున్ సకలతీర్థ్యబాలాదృతధీ
మంతునకున్ నిర్మలహృ
ద్ధ్వాంతునకున్ సద్యశోనిశాకాంతునకున్. ౧౧

కం. పావనలక్ష్మీదేవీ
శ్రీవేంకటరామశాస్త్రి హృద్గణ్యునకున్
శ్రీ „వేంకటవీరసు” పద
భావితనామంబుగల్గు „బ్రహ్మణ్యు”నకున్. ౧౨

వ. శాశ్వతపుణ్యలోకసిద్ధ్యర్థం బాతనిదివ్యనామం బీధాత్రీతలంబున విలసిల్లంగోరి జనకుండు స్వవిరచితంబైన బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక యనునాంధ్రవ్యాకరణగ్రంథం బీజ్యేష్ఠపుత్ర శేఖరుని పరిచర్యాఋణంబుం దీర్చుటకై కృతిగాఁగ నర్పించెంగావున నీబాలచంద్రుండు శరచ్చంద్ర చంద్రికా సాంద్రంబగుపరిశుద్ధయశోరూపంబుతో నిహపరలోకంబుల వర్ధిల్లి తేజరిల్లుంగావుత!

ఇట్లు
గ్రంథకర్తగారిప్రియశిష్యుఁడు

| | |
|---|---|
| విశాఖపట్టణం. | దేవరకొండ జగన్నాథరావు బి. ఎ. |
| 16—1—15 | టీచర్, మిస్సస్, ఎ.వి.యన్ కాలేజీ. |

## —♦గ్రంథారంభమందలి మంగళాదికము.♦—

మ. మనుపంజాలుదువీవు మాతృపితలై మమ్మర్ధనారీశ మూ
ర్తిని విశ్వంబుసృజియించి ప్రోచియును బేర్మిన్ "నేహ నానాస్తికిం
చన" యన్నట్టి శ్రుతిప్రకారమున నీజాగ్రల్లలాటంతపా
క్షిని దున్మాడెదుసాక్షి నీకెరఁగుదుర్ శ్రీకోటిలింగేశ్వరా! ౧

(మద్రచిత కోటిలింగేశ్వరశతకస్థపద్యంబు)

శ్లో. వందే కుమారవినయై రిహ కామసోమ
దేవ్యంబికాం జనకవేంకటశాస్త్రివర్యమ్
యా సార్వమంగళగుణా యక ఉగ్రతేజాః
కౌండిన్యగోత్రరజతాద్రివతంసభూతౌ. (మాతాపితృవందనము)

శ్లో. యా కల్లూర్యభిధానవంశరమణీముక్తామణిః; ర్యాం దయో
త్కృష్టాం కష్టపరంపరానుభవనీం సీతోపమాం౽ శిశ్రియత్
సిద్ధార్థి న్యధిశుక్రకృష్ణనవమి శ్రీకామసోమాఖ్యదే
వ్యస్మన్మాన్యజన న్యశీతిశర దాపుణ్యాయుషా ద్యా మగాత్.

కం. తనయుఁడ జాతూకర్ణీకినని యుత్తరరామచరిత సంబాస్మరణన్
"జనకునకుమాతదశగుణ"మనువిధిఁ దెల్పెఁభవభూతినొఁదలదాల్తున్.

(శ్లో. "పితుర్దశగుణం మాతా। గౌరవేణాతిరచ్యతే" యనుస్మృతి
ప్రకారంబున మహావీరచరితమందుంబలెఁ గాకయుత్తరరామచరితనాటక
మందు నొక్కతల్లినే తలంచిన భవభూతికవికి నమస్కారమనిభావము.)

మ. ప్రథితాస్మాకసగోత్రులై తమరుసూర్యాచంద్రముల్నాన్ దయా
గ్రథితంబౌమతిఁబ్రోడ సద్రచికళాప్రాప్తున్నను౦ జేయ హ్వా
త్పథమందుంతు నృసింహదీక్షితు మహాభాషాద్రిబంధుర్ గురుర్
బృథుమేధాస్పదసాంగ వేదపురుషు న్వీరావధానిం గురున్. ౪

(స్వవంశస్థ గురువందనము.)

ఆర్యాగీతి:॥ భూయస్సుగురూ పేరావధానినరసింహానిక్షితౌ ధ్యా
త్వా। క్రియతే సా గుప్తార్థప్రకాశికా హరికారికాంధ్రోక్తేః॥ —శిష్టు—)
కృష్ణమూర్తిశాస్త్రి విరచితమైన హరికారికల కాంధ్రింబౌ బాలవ్యాకర
ణమునకు వివరణం బొనర్చెదనని భావము)

మ. మును వ్యాసోక్తిని విఘ్ననాథుఁడు లిపీభూతంబుగాఁ గుండలీం
ద్రునివాక్కిని గులాలవర్ణగురునాథుం డక్షరశ్రేణిగా
నొనరంజేసెనటంద్రు నాకటులు శిష్యుండున్ విరించాంఘ్రిజుం
డును రంగాఖ్యుఁడు సుంకరాహ్వయకులాఢ్యుం డెప్డు రంజిల్లెడున్.

కం. ఆతని ప్రోత్సాహంబునఁ బూతాత్మ జ్యేష్ఠపుత్రి భూయశ్శ్రీ
పాతకఋణముం దీర్పఁగ నేతత్కృతి సేసి సుతున కేనర్పింతున్.

మ. పరిభాషావిధిశాస్త్రముల్ స్వపదసంబంధైకవాక్యత్వపై
ఖరితోరంజిలి కార్యకాలమనుపక్షుంబందునున్నట్టు ని
ర్భరరాగంబున నల్లుకొన్నరసికప్రాచీన జాయాపతుల్
పరసౌఖ్యంబిడి ప్రోచుతం దివిని సుబ్రహ్మణ్యు జ్యేష్ఠాత్మజున్. ౮

(కృతినాయకుని కాశీర్వాదము.)

కల్లూరి వేంకటరామశాస్త్రి.
ఆర్ట్సుకాలేజీ సంస్కృతపండితుఁడు
రాజమహేంద్రవరము.





గ్రంథకర్త కీ. శే. బ్రి. కల్లూరి వేంకటరామశాస్త్రిగారు.

శ్రీ॥ శ్రీ॥ శ్రీమన్మహోపాధ్యాయ

## బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి

# జీవచారిత్రము



„శుచి ర్విప్రశ్శుచిః కవిః„ అనుశ్రుతి వచనంబునం జేసి పరిశుద్ధ బ్రాహ్మణ వంశమం దుదయించిన మహాపండిత కవిచరిత్రము కొంచెము వ్రాసినను విశేషఫలప్రదంబని పెద్దలు చెప్పుదురు గావుననాకు గురుప్రాయులును, మాతామహవంశజులు నగు శ్రీ శ్రీ శాస్త్రులవారి జీవచారిత్రము కనుకలి వినుకలిం గలింగించుకొని దిఙ్మాత్రసూచకంబుగా నిట్లు వ్రాయుచుంటి. ఇందలినాయజ్ఞాన కృతంబునకుఁ బెద్దలుమన్నింతురుగాక.

గోదావరీమండలంబున మార్కండేయక్షేత్రంబున కుత్తరదిక్కునందు గవ్యూతిత్రయ దూరంబున మున్ను మండపాటి రాజసంస్థానమునకుం జెందిన “మునిగుళ్ళు„ యనుపేరం బ్రసిద్ధికెక్కి యిప్పుడు ముగ్గుళ్ళ యని వ్యవహరింపఁ బడుబ్రాహ్మణాగ్రహారంబునఁ గల్లూరివారను భూసురోత్తము లొప్పుచుందురు. అందుఁ గామసోమదేవి వేంకటశాస్త్రులను దంపతులకు శాలివాహన శకము 1779 సంఖ్య నొప్పునట్టి పింగళనామ సం॥ర భాద్రపద బ॥౧౩ జయవారమునఁ దెల్లవారుజామున నాశ్లేషా నక్షత్రయుక్త కర్కాటకలగ్నమందు

| | | | |
|---|---|---|---|
| | | గు | రా |
| ల చ శు | రాశి | | |
| | | | |
| కు | ర బు కే | | |

ఇట్లుజాతకచక్రంబుగూడియున్న సమయంబునఁ గల్లూరి వేంకటరామశాస్త్రిగారుజన్మించిరి. ఇమ్మహాపురుషుని గర్భోత్పత్తికిముందొక్కనాఁడా యనతల్లిగారి స్వప్నములోనీశ్వరుండుపొడకట్టి నీగర్భమున నొక్కమహాతేజస్వి పుట్టున నియానతిచ్చినట్లు బిమ్మట నామెగర్భవతియై శాస్త్రి గారిం గన్నయట్లును జెప్పుదురు. ఆరూఢకర్కాట జన్మలగ్నముల

యందుఁ జంద్రశుక్రు లుండుటయును వారియుచ్ఛస్థితిం జెప్పుచున్నది. "ప్రజ్ఞాచకర్మవిజ్ఞానం బుధేనైవ విచింతయేత్" అను ప్రమాణంబు ననుస రించి ప్రజ్ఞాకరుండైన బుధుఁ డుచ్ఛస్థుండై యుండుటయే వీరి ప్రజ్ఞా ప్రభా వము వేనోళ్ళఁ గొనియాడఁ బడుచున్నది. రాజ్యమందుఁ బృహస్పతి యుండి వాగ్విద్యాస్థానములను జూచుచుండుటచేత వారికి విశేషవిద్యా వైశద్యము కలిగిన దని వ్రాయు టతిశయోక్తి కాఁజాలదు.

## విద్యాభ్యాసము.

వీరి కైదువత్సరములు వచ్చినప్పుడు వీరిమేనమామ గారగు బ్ర హ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతి సోమయాజులుగారిచే నక్షరాభ్యాసము చే యింపఁబడి నాఁటినుండియు విద్యలయం దధికాసక్తి గలిగి పదిరెండు వర్షముల ప్రాయము వచ్చునప్పటికే బ్రహ్మశ్రీ బొడ్డపాటి గౌరీపతి శా స్త్రులవారియొద్దఁ గావ్యనాటకాలంకార సాహిత్యజ్ఞానము సంపాదించి జనస్తుతికిం బాత్రమై రని విని యుంటిని. వీరు కావ్యములు చదువున ప్పుడు ప్రతిదినము రెండు మూఁడు శ్లోకముల చొప్పునఁ జదువుచు, పాఠము చెప్పుకొనుటకుఁ బూర్వము క్రొత్తశ్లోకములు సమన్వయము చేసికొని రమ్మని గురువుగా రాజ్ఞాపింపఁగా మన శాస్త్రిగారా మరునాఁడు 90 శ్లోకములు గలసర్గ మంతయు సమన్వయించుకొనుటయే గాక కంఠ పాఠమును జేసికొని వచ్చిరనియు, ఇట్లే ప్రతిదినమును బాఠము చదివి గురువుమెప్పులకుం బాత్రమై ప్రసిద్ధిం గాంచి రనియుఁ బెద్దలు చెప్పుదురు

# శాస్త్రిపాండిత్యము

——(:o:)——

ఇట్లుసాహిత్యజ్ఞానము గలిగినపిమ్మట 13వ సం॥రమున తాళ్ళపూడి యను కుఱునూరు వీరభద్రపురాగ్రహారంబునకుం జని యటంగాశీపురవాసులగు జగదీశపండేజీవారియొద్ద శిష్యులును, భాష్యాబ్ధిమథన సంగృహీత సుధీభావులును, కల్లూరివంశ ముక్తామణులును, నిరుపమానులైన బ్రహ్మశ్రీ నరసింహదీక్షితులుగారి శిష్టాచారమార్గగతి విశిష్ట చరణారవిందంబులయొద్ద శిక్షితులై వ్యాకరణ మహాభాష్యాబ్ధి పారంగతులైరి (సూత్రభాష్యము, గీతాభాష్యము, మహాభాష్యము, ననుభాష్యత్రయమును జదివిరి.) బ్ర॥కల్లూరి వీరావధానులుగారియొద్ద వేదవేదాంగవేదాంత జ్యోతిష ధర్మశాస్త్రాదులయం దపారపాండిత్యము సంపాదించిరి మఱియును వైయాకరణసార్వభౌము లనిపించుకొనుటయే గాక కుశాగ్రబుద్ధి ప్రభాగరిష్ఠులనియు, సాహిత్య చక్రవర్తులనియుఁ బ్రఖ్యాతింగాంచిరి.

---

# ఉద్యోగము

---

క్రీ. శ 1885 మొదలుకొని రాజమహేంద్రపురమున ట్రైనిస్కూలునందు శాస్త్రులుగారు సంస్కృతోపాధ్యాయులుగా నుండి పిమ్మట బోధనాభ్యసన పాఠశాల (ట్రైనింగుకాలేజి) యందును, సర్వకళాశాలయందును సంస్కృతప్రధానోపాధ్యాయులై ప్రసిద్ధిఁ గాంచిరి. పాఠశాలలయం దుపాధ్యాయత్వమును నిర్వహించుచు వ్యాకరణాది శాస్త్రావలోకనము ఉభయభాషాకవిత్వ తత్వవిచారము చేయుచుండుటయే గాకస్వయంకృషిచే మాసత్రయంబులో మిడిల్‌స్కూలు పరీక్షయందుఁ గృ

తార్థులైరి! కళాశాలాధికారులగు నాంగ్లేయులును, హిందువులును, వీరి నెంతో ప్రేమాతిశయంబునం జూచుచుండిరి. వీరి కిచ్చిన యోగ్యతాపత్ర ములే యిందులకు నిదర్శనములు. రాజకీయకళాశాలలనుండి వీరు విశ్రాంతి నొందినతరువాతఁ గొప్పూరు సంస్కృతకాలేజీ ప్రధానోపాధ్యాయులుగా దాదాపు రెండు సం॥రము లుండిరి. వీరియొద్ద నభ్యసించిన విద్యార్థులు పెక్కురు శిరోమణియం దుత్తీర్ణులైరి, ఇయ్యది వీరిబోధనాప్రభావంబుననే కలిగిన దని పాఠశాలాధికారులు ప్రస్తుతించిరి.

—గౌరవబిరుదములు—

రాజమహేంద్రవరము సర్వకలాశాలలనుండి విశ్రాంతి గైకొనిన వెనుక 1920సం॥ ఏప్రిల్ 1వ తేదీని ఆర్ట్సు కాలేజీలో మ. రా. రా. .డి అప్పానరసింహము. యమ్ ఏ. యల్. టి. గారి అధ్యక్షతక్రింద నొక్క మహాసభ గావించి శాస్త్రులవారిని బుష్పమాలాలంకృతులుగాఁ జేసి గౌరవించుచు "శ్రీశాస్త్రులవారు గొప్పవైయాకరణులు, జ్యోతిశ్శాస్త్రంబున స్కంధత్రయంబును దెలిసినవారు, కొన్ని సం॥రములు పంచాంగములను గూడ గుణించిరి. ఉభయభాషాపాండిత్యమందును, వేదాంతశాస్త్రమందును మిగుల సమర్థులు. బాలవ్యాకరణమునకు వీరు రచించిన గూఢార్థప్రకాశిక యనువ్యాఖ్యానమే వీరియ ఖండపాండిత్యమును వెల్లడించుచున్నది. సూర్యరాయాంధ్రనిఘంటు పరిశ్రమలో వీరికిఁగలిగిన సన్మానమును బ్రశంసనీయము." అని మొదలగువిషయములుగ్గడించి శ్లాఘించిరి.

1920 సం॥రము జూన్ 5,6 తేదులందు బరహంపురమున సమావేశమైన 5వ ఆంధ్రసారస్వత మహాసభవారు "ఆంధ్రగీర్వాణములయందసమాన ప్రజ్ఞాధురీణులును సాహిత్యసార్వభౌములును, శాస్త్రపారంగతులు నగు బ్ర॥ శ్రీ॥ కల్లూరి వేంకటరామశాస్త్రిగారి, కీసభవారు శ్రీమన్మహోపాధ్యాయ బిరుదము నొసంగుచున్నారు." అని తీర్మానించుకొని శ్రీమన్మహోపాధ్యాయ బిరుదము నొసంగిరి.

---

—గ్రంథరచనము—

వీరు సర్వదా భాష్యావలోకనముం జేయుచు, ఉపాధ్యాయకార్యఘుల నిర్వర్తించుచు గృహకృత్యములఁ జక్కఁబెట్టుకొనుచు, తీరుబడిలేని వారైనను అప్పుడప్పుడు తీరిక చేసికొని సాత్త్విక బ్రహ్మవిద్యావిలాసనిరసన మను గ్రంథమందు వంశముక్తావళియను నొక గ్రంథమును కాళిదాస మేఘసందేశమున కాంధ్రీకరణమును, జార్జిముక్తావళి యను గ్రంథమును, కోటిలింగేశ్వరశతకమును, చతురాస్యము లోనగు మఱికొన్ని గ్రంథములును, రచించిరి. శైలిం జూపుట కొక్కొకపద్యము.

మ॥ తనచంద్రోపమకీర్తి తోడ వెలయం దన్మండలం బెల్లహా
యనముల్ కొన్ని గతింపఁగా సదరమీనాభిఖ్యుఁడై యొప్పుచో
జనులెల్ల బాగడంగఁ దేల్చె శ్రుతులన్ సంతోషనీరాకరం
బునఁ దాఁబుణ్యజనాత్మహారి యగుచున్ మూర్తిప్రభావంబునన్.

"వంశముక్తావళి"

ఉ॥ తమ్ముఁడ మేఘుఁడా! తిథులఁ దద్దయు నెన్నుచు సాధ్వి మన్నెదుం
జుమ్మి నిజంబుగా వదినెఁ జూచెదు పో గమనంబు సార్థమా
నెమ్మని నిండి పుష్పసరణిన్ విరహంబునఁ దీఁగ బోండ్ల జీ
వమ్మపుడూడఁ జూడ సుమబంధము వైఖరి నాస నిల్పఁగా॥

"మేఘసందేశము"

---

మ॥ పొగ కార్మబ్బులు మింటచాల్మెఱపులున్ బొంగారు కన్నీటియే
టిగమున్ సల్పిన దాండయాత్రికులు ధాటీవృష్టి పేచ స్మహా
యుగమై తోఁచినదుర్దినాళి బహుదుర్యోగంబు మాయించి బల్
సుగముం గూర్చెదు నాంగిలేయ విజయజ్యోతిశ్శరశ్చంద్రికల్.

"జార్జిముక్తావళి"

---

శ్లో॥ అలంకృత్వా వాసం జలధిహృదయస్థాంగలమహా।
నృణా మత్రత్యానాం నయసతిమిరం హంతు ముదితః

చిరాదాస్మాకీనా త్సుకృతపరిపాకా త్సముచితా।
జయ(శ్రీమాగ్జార్జి ర్వ్యాజతి విదితం ఢిల్లినగరం॥

"జార్జిముక్తావళి"

---

మ॥ విను నీవే దలిదంద్రుడు లిద్దఱును గావే యర్ధనారీశ మూ -
ర్తిని విశ్వంబు సృజించి ప్రోచియు నయారే నేహనా నాస్తి కిం
చన యన్నట్టిశ్రుతిప్రకారమున నీజాగ్రల్లలాటంతపా
క్షిని సర్వంబు లయింప సాక్షివి గదా? శ్రీకోటిలింగేశ్వరా.

"కోటిలింగేశ్వరశతకము"

---

మఱియు నాంధ్రమహాభాష్యం బన దగు బాలవ్యాకరణ గుప్తా ర్థప్రకాశిక అనువ్యాకరణశాస్త్రభాష్యమునురచించి యాంధ్రలోకమున కెంతయో మహోపకారము చేసిరి. అయ్యది వీరి యపారశాస్త్రజన్య జ్ఞానమును వేనోళ్ళ వెల్లడించుచున్నయది.

---

## ప్రజ్ఞావిశేషము

మఱియు వీరు పెక్కుకృతివిమర్శనములు, హాస్యకుముదాకరములు, శాస్త్రచర్చలు పెక్కులు చేసియుండిరి. ప్లవసం॥ర ఆషాఢమాసనిర్ణయమున జరిగిన పండితమహాసభలో మూఁడుదివసంబులు వరుసగా నిరర్గళధారాప్రవాహంబుగ నుపన్యసించి పండితమండలి కచ్చెరువు గలిగించిరి. అర్ధోదయ మహోదయ నిర్ణయము వినాయకచతుర్థీనిర్ణయము మున్నగు ధర్మశాస్త్రాది జ్యోతిష విషయములం గూర్చి అప్పుడప్పుడు విపులముగాఁ జర్చించి నిర్ణయ పత్రికలు వ్రాసి లోకపూజ్యతం గాంచిరి. రౌద్రిసం॥ర పుష్కరనిర్ణయ విషయమై పలువురు బహువిధములఁ దగవు లాడ రాజమహేంద్రవర పురమున నొకసభ గావించి సందర్భవశమున నలికాయుతముం గూర్చి చర్చించుచు శ్రావణ

శుద్ధ తృతీయా భానువారమే పుష్కరారంభమని నిర్ణయించి ప్రఖ్యాతిం బడసిరి. ఆంధ్రదేశమునఁ బ్రఖ్యాతిఁ గాంచిన గౌతమీ గ్రంథాలయాధికారులు వీరిపాండిత్యమునకు మెచ్చి వీరినిఁ దమగ్రంథాలయమున యావజ్జీవగౌరవ సభ్యునిగ నెన్నుకొనిరి.

---

## జ్ఞాపకశక్తి

వీరి జ్ఞాపకశక్తి యత్యద్భుతము. ఏదేని యొకశబ్దమందు సందేహము గలిగి వీరి నడిగినప్పుడు దాని సాధుత్వాసాధుత్వములు నిర్ణయించుచు, నిదియీయీపుస్తకములలో , నాయాయాశ్వాసములలో నిన్నియిన్నవపద్యములలో నున్నదని చెప్పి యీపుస్తకములు తెప్పించి రుజువు చేయుట నే ననేకపర్యాయములు చూచియున్నాను. వా రాపద మెప్పుడు చూచియున్నారో అదిమెట్టి జ్ఞాపకశక్తియో చెప్పుటకు శక్యము కాదు, అదియమానుషశక్తి యని చూచినవారికిఁ దోపక మానదు ఈలో వీరి కపస్మార రోగము వచ్చినప్పుడును నీశక్తిపోలేదు మఱియు నేజాతకచక్రమేని యొక్కమాఱు చూచినచో దాని మఱచుట వీరెఱుంగరు 30, 40 సం॥రముల కైన నాజాతకుఁడు వచ్చి నాజాతకము చెప్పఁగలరా యని యడిగినప్పుడు చూచినవానివలెఁ జెప్పుట నేనెఱుంగుదును. ఈజ్ఞానము రోగకాలమందును నిలిచి యున్నది. ఇట్లేవీరు, బాల్యమునుండియుఁ జదివిన శ్లోకములు మొదలగునవి జ్ఞాపకమున నున్నవని చెప్పుటతిశయోక్తి కాఁజాలదు ఇట్టిజ్ఞానమునున్న శంకరాచార్యులకుండెనని వినియున్నారము. ఈవిషయము వారి నెఱింగిన వారికందఱకు ననుభవమే గావున దాని నింతతో విడుచుచున్నాను.

---

## దైవభక్తి

వీరు ప్రతిదినముు స్నానసంధ్యాద్యనుష్ఠానము నిర్వర్తించి పార్థివలింగపూజ గావించి వెనుక లలితామంత్ర జపముం జేయుచుండు వారని

శ్లో॥ లలితాం కలితాంకదంబపుష్పై
ర్మిలితాం సాంబశివేన మాతరం
లలితాంబరధారిణీం లతాంగాం
ఫలితాంతారస వాచమర్థయే.

ఇత్యాది పద్యములవలనఁ దెలియుచున్నది. వీరుప్రత్యహంబును శతరుద్రీయపారాయణము ఉపనిషత్పారాయణముభగవద్గీతా పారాయణము రామాయణ పారాయణముం జేయుచుండెడివారు. బాల్యమున విద్యాభ్యాసము నిమిత్తము కాశీక్షేత్రమునకుం బోదలంచియుః దల్లిగారి యాజ్ఞంజేసి యదిలభింపమిం జేసి సర్వదా కాశీక్షేత్రమును విశ్వేశ్వరుని మనంబున నిలుపుకొని ధ్యానించు చుండువారని - తెలియుచున్నది. 60 సం॥రములు వచ్చువఱకుఁ బ్రతిసాయంకాలమందును. శివదర్శనము చేయక భుజించువారు కారు.

---

## ఆర్థికము

వీరికిఁ బితృపితామహార్జితమైన భూములవలనసాలునకు7, 8నూర్ల రూప్యములువచ్చును. ఉపాధ్యాయ పదమునందుండునపుడు నెలకు30,40, 50, 60 చొప్పున సాలునకు 5, 6, నూర్ల రూప్యములుమాత్రమేవచ్చుచుండును. ఈధనంబునఁ గుటుంబ భరణము చేసికొనుచు గొడుకులకుఁ గూంతులకుం బెండిండ్లులోనగు శుభ కార్యములు చేసికొనుచు గౌరవము చెడకుండఁ గాలక్షేపము చేసినారు. వీరుజ్ఞానమువచ్చినది మొదలుకొని యెప్పుడు నెట్టియిక్కట్టు వచ్చినప్పుడు నొరులవద్ద ఋణపత్రము వ్రాసి

యుంపలేదు. "ఋణశేషము దిం" అను న్యాయంబున వీరెప్పుడును ఋణము చేసి యున్నవారు కారు గావున సర్వజన నమస్కారపాత్ర మైనవారు. ఇట్టివారు లోకములో కొందఱు మాత్రమే యుందురు. ఎంతవాఁడు నెప్పుడైన ఋణముచేయక తప్పడు. వీరు ఋణముచేయలేదని ముమ్మాటికినిం జెప్పవచ్చును.

చరమదశ

వీరు కాలధర్మము నొందుటకు మున్ను రోగగ్రస్తులైరి. ఆకాలములో నేను 2, 3 తడవులు పోయిచూచితిని. తన్ను నెదిరి, నెఱుంగక పిచ్చిమాటలు పలుకుచుండువారు. ఆరోగమస్పటికి వ్యాధిం గలిగింపలేదు గాని మరల భూమిపై నడుగుపెట్టి నడువ నీయలేదు. సర్వదా పల్యంకమే శరణము. అప్పుడప్పు టింటిలో మనుష్యసాహాయ్యంబున నడయాడుచుండు వారు, అప్పుడు మిక్కిలి దౌర్బల్యము నొందినవారయ్యును గ్రంథపరిశీలనముమాత్రము మానలేదు. ఆమరణము జ్ఞాపకశక్తి యొక్కమాదిరిగానే యున్నది, అట్టివీరు విభవసంవత్సరములో నుత్తరాయణమున జ్యేష్ఠమాసములో శుక్లపక్షమున నేకాదశీదివసమునం బగలు పదునాల్గుఘటికలమీఁద దక్షిణకాశియనం జనుపూర్కుండేయుక్షేత్రాంతర్గతకోటిలింగక్షేత్రంబున స్వగృహంబునం బుత్రపౌత్రకాది సమస్తబంధుసముదాయసన్నిధానంబున భౌతికశరీరమును విడిచి పరంధామంబు నొందిరి.

# గుప్తార్థప్రకాశిక

——(:o:)——

శ్రీ వేంకటరామశాస్త్రిగారు చిన్నయసూరికృత బాలవ్యాకరణము గంభీరార్థసందర్భము కలదియై సర్వజనసుబోధము కాకుండుటం జేసి కొందఱు మిత్రులప్రబోధనంబునఁ బైపేరున దానికి వ్యాఖ్యానము లక్ష్యలక్షణసమన్వితముగా నతివిపులముగా వ్రాసియున్నారు. "బాల

వ్యాకరణగుప్తార్థప్రకాశిక, అనఁగా బాలవ్యాకరణములోనిరహస్యార్థమును బ్రకాశింపఁ జేయునదియని యర్థము గుప్తార్థము దాచబడిన యర్థము. బాలవ్యాకరణములో ననేకస్థలములం దర్థము గుప్తమై యున్నదనుట నిశ్చయము దానినిఁ బ్రకాశింపఁ జేయునది గావుననే దీనికి "గుప్తార్థప్రకాశిక" యనుపేరు సార్థకమగుచున్నది. వీరేప్రకాశికలో ననేకవిషయములు పేర్కొని సప్రమాణముగా నుదాహరించినారు. బాలవ్యాకరణమర్థము కాని వారికిని, అందలిసందేహములం గూర్చి చర్చించుచుండువారికి నిది దర్పణము వంటిది. ఇది చదివినపిమ్మట నేవిషయమందు నెవ్వరికి నెట్టిసందేహములును బుట్టవని నానమ్మకము. ఈగుప్తార్థప్రకాశిక ప్రథమముద్రణముకన్న నీముద్రణమందనేకవిషయముల నతిశయించియున్నది. శాస్త్రిగారీగ్రంథములో ననేకవిషయములు వ్రాసియున్నారు. బాలవ్యాకరణము మదరాసుపురవాస్తులు కీ. శే. పరవస్తుచిన్నయసూరిగారు రచించి యున్నారనియు, అది వారి స్వకర్తృకమే యనియు, మనమిదివఱకు వినియున్నారము. అట్లుగాక యీగ్రంథము శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగారు రచించినహరికారికలకు సరియైన యాంధ్రీకరణ మనియు, సూరిగారు దీనినాంధ్రమున వ్రాసిరనియు, సూరిగారాంధ్రీకరణ మని చెప్పక స్వకృత మని లోకులకుఁ దెలియునట్లు నిశ్చయమును మఱుగు పుచ్చి రనియు నీగుప్తార్థప్రకాశికలో సహేతుకముల నుద్ఘోషించి శాస్త్రులవారు వ్రాసియున్నారు. శాస్త్రులవారు వ్రాసినసందర్భములు చక్కని బుద్ధితోఁ జూచినవారికి శాస్త్రిగారివ్రాఁతలు సత్యములేయనియు, బాలవ్యాకరణము హరికారికలకుఁ దెలుగేయనియుఁ దేటతెల్లమగుచున్నది. ఇందుఁ జిన్నయసూరిగారి ప్రమాదము లనేకము లున్నవని సూచించినారు. హరికారికలు నిందు ముద్రితములు. ఈసూత్రమునకిది తెలుఁగని కూడఁ బెక్కులు చూపెనారు దానంజేసి బాలవ్యాకరణము హరికారికలకుఁ

దెలుఁగేయని స్పష్టమగుచున్నది. మఱియు నిందుఁ దమవ్యాఖ్యానమునా క్షేపించుచుఁ బత్రికలలో వ్రాసిన వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారియు మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రిగారియు వ్రాఁతలను సహస్రముఖముల ఖండించుచు వ్రాసినవ్యాసములు ముద్రితములు (ఈవ్యాసములలో సమరాంగణపార్థమూర్తి, ధటాసూర్యప్రదర్శి, కన్నెపల్లివేంకటసీతాపతిశాస్త్రి, ఇత్యాది నామములు కలవు. ఇవియన్నియు నాయావిషయములకుఁ దగినట్లు కల్పించిన పేళ్ళుగాని యన్యులెవ్వరునులేరు. ఇవియన్నియు శాస్త్రిగారి వ్రాఁతలేయని లోకము తెలుంగుఁగాక) అవి చదివినవారికి శాస్త్రిగారి యసాధారణపాండిత్యము ప్రజ్ఞావిశేషము తెలియకపోదు. లోకములో మనశాస్త్రిగారి కన్నమిన్నగాఁ జదివినవారుండిన నుండవచ్చునుగాని వీరివలె "తిమ్మని బ్రహ్మనిగాను, బ్రహ్మని దిమ్మనిగాను, జేయంగలసామర్థ్య మెవ్వరికి నుండఁబోదని నిశ్చయముగాఁ జెప్పఁగలను. "అపశబ్దభయం నాస్తి అప్పలాచార్యసన్నిధౌ" అనునట్లు వారియొద్ద నేయపశబ్దమైనను సుశబ్దము చేయునేర్పుకలదని యిందులోఁ జేర్పఁబడిన "సుమనోల్లాసశబ్దమే" సాక్ష్యమిచ్చుచున్నది. మఱియు ననేకవిషయములు వారి పాండిత్యముం గూర్చి వ్రాయవలసినవియున్నవి కాని గ్రంథవిస్తరభయంబున నింతలో విరమింపవలసినవాఁడనైతిని. కాని మఱియొక్కవిషయము మాత్రము చెప్పుచున్నాను.

"వివిధకళాప్రవీణు లతివిశ్రుత వైభవసాంద్రు లెందఱే।
భువిమునుబుట్టి గిట్టిరొక పూరుషులైన నొకండెఱుంగునే
కవులగు తొంటివారలు జగత్త్రయమందిపుడున్ వసింతురో।
శివకరులైనవారు మృతజీవులు కీర్తిశరీరులెన్నఁగన్"

అనిచెప్పినట్లు వారిపాండిత్యమునకుం దగనేదేనొక్కమహాగ్రంథము రచించియుండవలసి యున్నది. అట్లుచేసినవారు కారు. కొందఱు

మనశాస్త్రిగారిని సూర్యసిద్ధాంతము నాంధ్రీకరింపుఁ డనికోరిరఁట వారును మంచిపద్ధతిని దానిం దెనిఁగింప నిశ్చయించి రఁట కాని యదియును గొనసాగినదికాదు. నేను వారిదర్శనము చేసినప్పుడు సర్వదా "మీరు సర్వాలంకారగ్రంథములం గ్రోడీకరించి తెలుఁగున నొక యలంకార శాస్త్రగ్రంథము రచింపవలయు" నని కోరుచుండువాఁడను. - వారును "నేను నీవుచెప్పినట్లలంకార సర్వస్వమను పేరితో నొకలక్షణగ్రంథము వ్రాయుదు"నని చెప్పినవారేకాని చెప్పినట్లు చేసినవారు కాకపోయిరి. వారికావిషయమునఁ గుతూహలము లేక పోలేదుగాని కాలమలంఘ్యము కదా! ఉపకారవేతనము నొందినది మొదలు వారికేవో యనివార్యములైనపనులు తటస్థించుచునే వచ్చినవి. అంతలో నాల్గుసంవత్సరములు మహారోగము. తరువాతఁ బరమపదయాత్రయుఁ దటస్థించినది. వారి యుద్యమము నెఱవేఱిలోకమునధన్యముకాలేకపోయినది. అట్లయిననువారిగ్రంథములలోని "సుప్తార్థప్రకాశిక" పరమోత్తమమైనది. అదియేవారి కీర్తి నాచంద్రతారార్కముగాఁ బ్రకాశింపఁ జేయుటకుం జాలునని సంతసించుచున్నాను.

ఉభయభాషావిశారదులును, వైయాకరణశిరోభూషణులు, సర్వసమర్థులునగు శ్రీశ్రీ శాస్త్రిగారి పరమపదమగమనము మారాజమహేంద్రవరమునకే గాక ఆంధ్రలోకమునకంతకును దీఱని లోపమును గలిగించినదని చెప్పుట కావంతయును సందేహింప నక్కఱలేదు. అయినను వారియాత్మయు, వారిప్రజ్ఞయు వారి విద్యావైశద్యమును, సుప్తార్థప్రకాశికయుం దావేశించి పాఠకమహాశయుల యుల్లములు పల్లవింపఁ జేయుచుండు నని నమ్ముచు నింతతో నీచారిత్రమును ముగించుచున్నాను

ఇట్లు

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# అభివందనము

సీ. లోకబాంధవము నే, లోగొని యిరుగడ
నిరుగడ వేదంబు గరిమఁ దనరు
రసములం దీయుట్ల రహినొప్ప నిరుదెస
నిరుదెస లక్ష్మీగృహస్థతయగు
నంధకారంబు వోనలరొందు నిరువంక
నిరువంక నిజసేవ కేచ్ఛదీర్చు
వ్యాకరణాదిక వ్యాప్తియక్షా నిరువైపు
నిరువైపు నిజకాంతి నెఱిఁదరిర్చు
తే. గీ. సూర్యభగవాను సాదృశ్య సుకృతమబ్బి
సూర్యలోకముఁ జేదిన సుజనవర్య
మత్పితృభగవానుని మహామహిము మహిత
తేజు వేంకటరామశాస్త్రిని భజింతు.

ప్రథమపుత్రుఁడు వీరవేంకట సుబ్రహ్మణ్యము బి. ఎ. బి. ఇడి.

---

సీ. ఏమహామహుఁడు సురేంద్రపీఠికి నేగ
సురకోవిదాళికిఁ జులుకుసూప
నే మహాశౌరి బుధేంద్రుల జిగిఁ గూర్చి
నిజసమర్థత్వంబు నెఱి నెసంగ
నేపుణ్యచరితుఁ డెంతేఁ దపంబొనరించి
నాత్మనిజాత్మలో నరసికొంచు
నే భవ్యచరితుఁ డెన్నే సుగుణమ్ములు
రంజిల్లె నిద్ధర రహినెసంగ

తే॥ నట్టి మహనీయు ధీమహితాత్ము విద్వ
దగ్రసరుని కల్లూరి వంశాబ్ధి పూర్ణ
చంద్రు వేంకటరామ శాస్త్రీంద్రు నాదు
తండ్రి ననవరతము మదిఁ దలచి కొలుతు

ద్వి॥ పుత్రుఁడు రామచంద్రమూర్తి బి. యే. బి. ఇడి.

---

సీ. కలముచేఁ బూనినగాండీవమూను నా
పాండవమధ్యము పగిదినొప్పఁ
బాత్తంబు చేఁబట్టి బోధింప బుధులకు
ననిమిషేంద్రుని గురునను కరించు
జపమున గూర్చున్న జారుతనొప్పు త
న్మూర్తి వేదవ్యాసమునిని బోలు
జనులమనంబుల సరగున రంజింపఁ
జేయంగ రఘుకులశ్రేష్ఠుఁ బోలు
తే. గీ. నట్టి సార్థకనాము గుణాభిరాము
సత్యసంధు నమలయశస్సాంద్రునతుల
బుద్ధిమంతు బ్రహ్మాంశ సంభూతు మజ్జ
నకు భజింతు వేంకటరామనామశాస్త్రి.

తృ॥ పుత్రుఁడు వేంకటవీరసుబ్రహ్మణ్యము బి యే. (బి. ఇడి. క్లాసు)

---

మ. తృణధాన్యాశనుఁడౌ వనౌకసుఁడు శ్రీకృష్ణాంగుఁడున్ బాదరా
యణుఁడే శంభుపదారవింద మకరందస్వాద శుద్ధాత్ము వా
క్ఫణితిం గన్గొని పల్లబాటెడునో! యాకల్లూరి వంశోజ్జ్వల
న్మణి శ్రీవేంకటరామశాస్త్రివరు బ్రహ్మన్ మద్గురున్ మ్రొక్కెదన్.

ఒకశిష్యుఁడు.

సీ. వేదాంతశాస్త్రముల్ వెదజల్లి విలసిల్లు
శంకరాచార్యుల శక్తితోడ
శబ్దాగమము లెల్ల సాధించి నిపుణుఁడౌ
పాణినీయుల మహాప్రతిభతోడ
న్యాయశాస్త్రము లెల్ల నయమొప్ప రచియించు
భాస్కరాదుల ప్రభావంబుతోడ
నాటకాలంకార నయగుణయుక్తుఁడౌ
కాళిదాసునిలసత్కళలతోడ

తే. గీ. నిన్ను నిర్మించె భారతీనేతగాక
అనుపమాద్వైత తర్కశాస్త్రాదులందు
ని ల్లపరిమితపాండిత్య మేరికుండు
ప్రథిత కల్లూరి వేంకటరామశాస్త్రి.

ఒకపండితుఁడు



శ్రీ

గురుభ్యోనమః

బా ల వ్యా క ర ణ

# గుప్తార్థప్రకాశిక



## ఆంధ్రభాష, వ్యాకరణము.

ఆంధ్రదేశంబున వాడఁబడు భాషకు నాంధ్రభాష యని పేరు. భాష యనఁగా జనులు పరస్పరాభిప్రాయములను దెలియఁ జేసికొనుటకు సాధనంబులై యనాది సంకేతంబులైన ధ్వనులు. ఇయ్యది వాగ్రూప మనియు, లిఖితరూప మనియు ద్వివిధము. ఎఱుకవాండ్రు మున్నగువారు భాషించు భాష వాగ్రూపముగానే కాని లిఖితరూపముగా లేదు. గీర్వాణాంధ్రాంగ్లేయాది భాషలు వాగ్రూపములుగాను, లిఖితరూపములుగాను, గలవు. భాషయందలి సుశబ్దాపశబ్దముల పరిజ్ఞానము గలుగఁ జేయునది వ్యాకరణశాస్త్రము. దీనికే లక్షణశాస్త్రమనియు, శబ్దశాస్త్రమనియు, నామాంతరములు గలవు. శాస్త్రమనఁగా శాసించునది (నియమించునది.) శాస్త్రము—తర్కము, వ్యాకరణము, ధర్మశాస్త్రము, మీమాంస, వైద్యశాస్త్రము, జ్యోతిషము; అనియాది విధములు.

## సంజ్ఞాపరిచ్ఛేదము

వ్యా.—సంజ్ఞ = పేరు: పరిచ్ఛేదము-భాగము. పేరులనుగుఱించి చెప్పు భాగము సంజ్ఞాపరిచ్ఛేదము.

**1. సూ.—సంస్కృతమునకు వర్ణము లేఁబది.**

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః॥ క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య

ర ల వ శ ష స హ ళ॥ ఇందకారాదు లచ్చులు-క కారాదులు హల్లులు-అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది.

వ్యా.—సంస్కృతభాషకు వర్ణంబు లేబది (ఏను + పది) దోషంబులు లేక సంస్కరింపఁ బడెనని కావున దీనికి సంస్కృతం బను పేరు కలిగెను. మఱియు నిద్యాది దేవతలు భాషించుభాష గావున దేవభాష యనియు, అనాదియు వేదసంబంధ కావున నాభాషలకన్నింటికి నాదియైనది గావున నాదిభాషయనియుఁ, దక్కిన భాషలలోని శబ్దంబులు దీని నుండి యుత్పన్నమైనవి గావున నాద్యప్రకృతి యనియుఁ బిలువం బడును. పైయేఁబది యక్షరంబులలో, అకారము మొదలుకొని విసర్గము వఱకును అచ్చు లనియు, కకారము మొదలుకొని ళ కారము వఱకును హల్లు లనియుఁ, జేరు. అజ్ఝల్విభాగము (అచ్ + హల్ + విభాగము = అచ్చులయు హల్లులయు, ఏర్పాటు) ఈలాగుననే అకారాదు లచ్చులనియు, కకారాదులు హల్లు లనియుఁ, ప్రాకృత భాషకును, తెలుఁగునకును, దెలిసికొనునది. మఱియు సంస్కృత వ్యాకరణంబునం జేసి ఌ కారము ప్లుతమే (మూఁడుమాత్రల కాలము) కాని దీర్ఘాక్షరము లేకున్నను ౡ కారదీర్ఘము కల దనుటకు వరరుచి మొదలగు ప్రాకృతవ్యాకరణవేత్తల మతము ప్రమాణ మనుటయే కాక, మంత్రశాస్త్రంబున, అకారాది పంచాశద్వర్ణాళి (50) జపమాలికగా భావింపఁబడినందునఁ బైసంఖ్యాపూర్తికై ౡకారదీర్ఘంబును, సమ్మతింపఁబడినదందురు. వాస్తవంబున సామాన్యంబుగా నచ్చు లుచ్చారణలో వివృతప్రయత్నము కలవి కావున వివృతప్రయత్నము గల ఌకారమునకే దీర్ఘనిషేధముగాని "ఌతి ఌవా" అని సంస్కృతవ్యాకరణంబున విధింపఁబడిన యీషత్స్పృష్టప్రయత్నక ఌకారంబునకు దీర్ఘనిషేధములేదు. కనుకనే "ఌవర్ణస్య ద్వాదశ" అనుసిద్ధాంతకౌముదీస్థవాక్యంబును వివరించుతఱిని శబ్దేందుశేఖరగ్రంథమందు "ఌవర్ణస్యేతి వివృతస్యేత్యర్థః తేన ఌతి ఌవేతి విధేయ స్యేషత్స్పృష్టస్య దీర్ఘత్వేపి నక్షతిః" అని లకారద్వయ గర్భకంబగు నజ్ఝక్తితో లిఖింపఁబడిన ఌకారం బీషత్స్పృష్టప్రయత్నంబుగలిగినను దీర్ఘంబును నుండవచ్చునని వక్కాణింపఁబడ్డది. మఱికొందఱు, "ఆదేశాంతాఃస్మృతావర్ణాః" అను నాగమవేత్తలవ్యవహార మున్నంత మాత్రన క్షకారంబును వేఱువర్ణంబుగాఁ బరిగణించి ళ కారమును వర్ణాంతరము కాదని త్రోసి వేయుదురు. కాని యట్లయినచో స్తకారము మున్నగు సంయుక్తవర్ణములను గూడ వర్ణాంతరములుగాఁ బరిగణించుట సంభవించును. మఱియు ధాతుపాఠంబునయందు ఘుక్ష, వృక్ష, శిక్ష, భిక్ష, దక్ష, దీక్షాద్యాత్మనే పదధాతువు లూష్మాంతంబులలోఁ బరిగణింపఁ బడుటయు గాక, భాష, గేవృ, గ్లేవృ, పేవృ ప్రభృతిధాతువులతోఁ జేర్పఁ బడుటచేత ఘుక్షాది

ధాతువులందుఁ గడపట సూక్ష్మం బగు ష కారమే ప్రధానముగా గ్రహింపఁ బడినట్లు తోఁచుచున్నందునను, నిఘంటువులయందు ధ్వాంక్ష, కక్ష, పక్షాది శబ్దంబులు షాం తంబులలోనే పఠింపఁ బడినందునను, క్ష కారము సంయుక్తాక్షరముగాని, వర్ణాంతర ముగా దని యెఱుంగునది. మంత్రశాస్త్రజ్ఞులు, అకారాదిళకారంబు దనుకఁ బంచాశ ద్వర్ణంబులు (50) జపమాలికగా భావించి క్ష కారమును మేరుపూసగా నెన్నుదు రనిన ప్రసిద్ధి గలదు .కనుకనే జపమాలికకు "అక్షమాల" యనుపేరు గలదు.

"అకారాదిక్షకారాంతః అక్షఃతత్కృతా తత్ప్రితినిధిభూతా వామాలాఅక్షమాలే"

**V. M. Apte. M. A. Sanskrit-English Dictionary 6th Page**

శ్లో॥ "పురఃప్రివాలై రివపూరితార్ధయా।విభాంతమచ్ఛస్ఫటికా క్షమాలయా" మాఘ-౧ సర్గ-శ్లో.9

**2. సూ.—ప్రాకృతమునకు వర్ణములు నలువది.**

అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః॥ క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ స హ ళ ॥ కొందఱ మతంబున హ్రస్వవక్రంబులును బాకృతంబునందుఁ గలవు- కొందఱమతంబున వక్రతమంబులుం గలవు॥ ఎ ఏ ఒ ఓ లు వక్రములని-ఐ ఔలు వక్రతమము లని ప్రాచీనులు వ్యవహరింతురు.

వ్యా.—ప్రాకృతభాషకు నక్షరములు నలువది. (నాలుగు + పది) అనఁగాఁ బై యేఁబది యక్షరంబులలో "ఋ ౠ ఌ ౡ ఐ ఔ ఙ ఞ శ ష" అను నవి తక్కఁ దక్కిన యక్షరములు. ప్రాకృతము = సంస్కృత భాషావికారము (సర స్వతియొక్క బాల్యమందలి తొక్కుపలుకులు) ఈభాష "ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళిక, అపభ్రంశము" అని యాఱు తెఱంగులు. దీనికి వా ల్మీకిమహర్షి వలన మూలసూత్రంబులు వ్రాయం బడెను. కొందఱ యాశయంబున (మతంబున) ఎ ఒ (హ్రస్వవక్రములు) లును, మఱికొందఱ యభిప్రాయంబున ఐ ఔ (వక్రతమము) లును, బ్రాకృతభాషయందుఁ గలవు. సంస్కృతములోని ఋ ౠ మొదలు పైనిం జెప్పిన పది యక్షరము లిందుఁ దగ్గిన వని గ్రహించునది. "ఎ ఏ ఒ ఓ" అనునవి వక్రము లనియు, "ఐ ఔ" అను నవి వక్రతమంబు లనియుఁ, బూర్వులు వాడుదురు.

**3. సూ.—తెనుఁగునకు వర్ణములు ముప్పది యాఱు.**

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం అఁ॥ క గ చ ౘ జ ౙ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ.

6. సూ.—ఇతరము లగు హల్లులు స్థిరములు.

ఖ ఘ జ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ న ఫ భ మ య ర ల వ శ ష స హ ళ

వ్యా.—కకారము మొదల్కొని ళకారము తుదకు నుండు ముప్పదినాలుగక్షరంబులలోని పరుష సరళంబులు పది యక్షరంబులు మాత్రము కాక యితరము లయిన యిరువదినాలు గక్షరములును స్థిరము లనఁ బడును.

7. సూ.—దంత్యతాలవ్యంబు లయిన చ జ లు సవర్ణంబులు.

తాలవ్య చకారంబు దంత్య చకారంబునకును దాలవ్యజకారంబు దంత్య జకారంబునకును గ్రాహకము లని తాత్పర్యము.

వ్యా.—సవర్ణంబులు = సజాతీయములు (సమానము) గ్రాహకములు = స్ఫురింపఁ జేయునవి (అన్యోన్యమిత్రములు.) దంత్యచకారంబునకుఁ దాలవ్యచకారంబును, దంత్య జకారంబునకుఁ దాలవ్యజకారంబును, మిత్రము లని యీ సూత్రముయొక్క భావము. ఈ సవర్ణత యనెడి మైత్రివలన యతిప్రాస కావ్యములయందు దంత్యము తాలవ్యము లొకదానికొకటి ప్రతినిధిగా నుండఁ దగును.

8. సూ.—ఇ ఈ ఎ ఏ లం గూడిన చజలు తాలవ్యంబులు.

చిలుక - చీమ - చెలి - చేమ - జిల - జీడి - జెట్టి - జేజే.

వ్యా.—"ఇ, ఈ, ఎ, ఏ" అను నీయచ్చులతోఁ గలిసిన "చ, జ" అనునవి తాలవ్యములు (దవుడల సాహాయ్యమున నుచ్చరింపఁబడునవి) ఉ. చిలుక, ఈశబ్దమునందలి చకారము "ఇ" అను నచ్చుతోఁ గూడినది (చ్ + ఇ = చి) కనుకఁ దాలవ్యము. ఇట్లే చీమ, చెలి, చేమ, జిల, జీడి, జెట్టి, జేజే. "ఏచ ఇగ్ఘ్రస్వాదేశే" (1 అధ్యా 1 పాద, సూ 47) అను సూత్రముయొక్క భాష్యమందు "నైవంలోకే నాన్యస్మిన్ స్వేదే-అర్ధఏకారః, అర్ధఓకారో వాస్తి" అనుటం జేసి, హ్రస్వమైన "ఎ" కారంబును "ఒ" కారంబును సంస్కృతభాషయందు లేవు తెలుంగుభాషయందే "ఎ" కారంబును, "ఒ" కారంబును గలవు. ఉ. ఎగ్గ ఒప్పిదము ఇత్యాదులు. సమాంశవాచకమైనప్పుడు గూడ "అర్ధ" శబ్దము నపుంసకముగాక, పుల్లింగముగా భాష్యమందుఁ బ్రయోగింపఁబడినది.

9. సూ.—అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చజలు దంత్యంబులు.

చలి - చాప - చుక్క - చూపు - చొక్కు - చోటు - చౌక - జముడు - జాతర

ౙున్ను - ౙూలు - ౙొన్న - ౙోలి - ౙౌను - ఐదంతములయిన చజలు సమేతరశబ్దములందు లేవు.

వ్యా.—"అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ" అను నీయచ్చులతోఁ గూడిన "చ, జ" అనునవి దంత్యములు (దంతములసాహాయ్యమున నుచ్చరింపఁ బడునవి.) ఉ.చక్; దీని యందలి చకారము అకారముతోఁ గూడినది (చ్ + అ=చ) కావున దంత్యము ఇట్లే ౘాప, ౘుక్క, ౘూపు, ౘొక్కు, ౘోటు, ౘౌక, ౙముఁడు, ౙాతర, ౙున్ను ౙూలుఁ ౙొన్న, ౙోలి ౙౌను, ఈ సూత్రాంతమునందు "ఐదంతము లైనచజలు సమేతర శబ్దంబులందు లేవు" అని యుండెను. [ఐకారము - అంతమందుఁగల "చ, జ" అను నవి సంస్కృత సమేతరశబ్దంబులందు (తెలుఁగుశబ్దములయందు) లేవు.] అనఁగా "చై" గాని, "జై" గాని యాదియందుఁ గల పదములు తెలుఁగు నందు లేవు కనుక ఐకారముపై సూత్రమునందు సంఘటన చేయఁబడలేదు. ఇది యెఱుంగకయే కాఁబోలు పైడిపాటి లక్ష్మణకవిగారు తమ యాంధ్రనామసంగ్రహ మందు "చైవులసాకిరిచాయమగఁడు" అని ప్రయోగించిరి; కాని యియ్యది ప్రామాదికము. చెయువులనికాని, చెయ్వులనికాని, యుండఁదగు. అప్పుడు యతిభంగం బనివార్యంబే యగును.

**10.** సూ.—సంస్కృతసమంబులం దికారాంతములైన శబ్దముల యుపధాచజలు బహువచనంబు పరంబగునపుడు దంత్యంబు లగును.

ఇవిదప్పసంస్కృతసమంబులందుదంత్యచజలు లేవు. తాత్పర్యము- ఉపధయనఁగాఁ దుదివర్ణమునకు ముందువర్ణము-అర్చి - అర్చులు - రోచి - రోచులు - వీచి - వీచులు - రాజి - రాజులు — వాజి - వాజులు- మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి. ఇతరము లయిన చజల కుదాహరణములు-చంద్రుఁడు - చామరము - చుక్రిక - చూర్ణము - చోరుఁడు - చౌర్యము - జయము - జాతి - జుగుప్స - జూటము - ఇత్యాదులు.

వ్యా.—ఉపధ=శబ్దముతుదనుండి లెక్కించుచో రెండవయక్షరము. సంస్కృత సమంబులయందు, ఇకారము కడపటఁ గలమాటల యుపధాతాలవ్య చజలు బహువచ

సాంతంబు నందు దంత్య చజలుగామాఱును. ఉ. అర్చులు. సంస్కృతము "అర్చిస్" అనునది. దీనికిఁ దత్సమము "అర్చి". దీని యంత్యాక్షరము. ఇకారము, ఈయికారమునకుఁ బూర్వాక్షరము చకారము, గలను. (అర్ + చ్ + ఇ) ఈ యికారము బహువచనంబగు లు లలు పరంబగునపుడు ఉ కారంబగును. (అర్ + చ్ + ఉ + లు = అర్చులు) ఆదేశముగా వచ్చిన ఉ కారముతోఁ గూడిన చ జలు సాంస్కృతికములైనను, దాలవ్యములుగా నుచ్చరించుట దుష్కరంబు గావున సుఖోచ్చారణార్థమీసూత్రముచే దంత్యము లని శాసింపఁబడ్డవి. ఇట్లే రోచులు, వీచులు, రాజులు(రాజి) వాజులు (వాజి) మొదలయినవి.

అర్చులు. ఈ శబ్దములోని చకారము పైని ఉ కారము ఆదేశ వర్ణము గాదు గనుక లు లలు పరంబగునపుడు తాలవ్య చ కారముగానే యుచ్చరింపఁబడును. ఇదిదంత్యాంతంబైనచో "ముసరి" అన్న యర్థంబిచ్చును: గాని స్వరము లన్న యర్థము గాదు. (మూలము) "రాజుశబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి" రాజుశబ్దం బొక్కటి యేక వచనాంతంబును దంత్య యుక్తముగాఁ గనఁబడు చున్నది. అనఁగాఁ దత్సమ మైనను రాజశబ్దములోని జ కారము దంత్యముగా నుచ్చరింపఁ బడుచున్నదని యభిప్రాయము. "రాజు" అను శబ్దము వైకృతంబునుగలదని (తెనుఁగు శబ్దమని) కొంద ఱందురు. అట్లయినచో దంత్యము కావుటకు సందియ మించుకయు లేదు. ఇయ్యది ముఖ్యంబుగఁ గూచిమంచి తిమ్మకవిప్రభృతులు తమయచ్చ తెనుఁగు గ్రంథముల యందుఁ బ్రయోగించిరి. కనుక నియ్యది యాలోచింపఁ దగ్గయంశము.

"ఆ॰ ఎందు వేఁట రారె యితరు లే మనసుతో
దారసంగసుఖము తప్పఁద్రోచి
తకట! పాండురాజయశ మెన్న వై తతి
క్రూరదశరథేశకులము రోయ"

అను రాఘవపాండవీయప్రథమాశ్వాసపద్యములో భారతార్థమునందు "పాండురాజ" అను నది తత్సమం బగు సంబుద్ధ్యంత పదంబు గావున నిచ్చట రాజశబ్ద జకారంబు చిన్నయసూరిగారి సంజ్ఞాప్రకరణమందలి యీసూత్రింబునంజేసి దంత్యంబు గానుండ వలయు ననియు, రామాయణార్థమునందు "అజయశ" మని పదచ్ఛేద మగుటచేతఁ దాలవ్యముగా నుండ వలె ననియు, నసెడి హేతువులచేత "శ్లేషయందు జకార మొక్కటియు యొకయర్థమున దంత్యమును, వేఱొక యర్థమునఁ దాలవ్యమును

(మూలము) ఇతరములైన చ జ ల కుదాహరణములు; అనఁగా "అ ఆ ఉ ఊ" అను నచ్చులతోఁ గూడి వను తత్సమంబు లగుటచేఁ దాలవ్యములుగా నుచ్చరింప వలసిన చ జ లుగల యుదాహరణంబులని భావము. ఉ. చంద్రుఁడు, చామరము; చక్రికిఁ మార్గము, చోరుఁడు, చౌర్యము, జాతి, జుగుప్స, జూటము, మొదలైనవి.

11సూ.—నకారంబు ద్రుతంబు.

వ్యా.—నకారంబునకు ద్రుతం (చలన భావము గలది)బను పేరు. ద్రుతంబనఁగా నక్క-అలేని యప్పుడు మఱుఁగు పడునదియనిన యర్థమగు. కేవల నకారంబు ద్రుత నామంబున సామాన్యంబుగా వాడఁబడుచున్నను ప్రత్యయంబును, (ఫలమును, నేను, వెళ్లుచున్నాను) ఆగమంబును (వానిచేతను, చేయుమను, మమ్మును) అవ్యయంబును (అప్పుడును, మఱియును, అన్నయును,) నైనయుకారాంత నకారంబే ద్రుతసంజ్ఞ గలది యని చెప్పుట యుక్తము. ప్రథమా బహువచనంబగు లుప్రత్యయంబు నకు ఉకారంబు లేకున్నను "వనముల్, ఫలముల్" ఇత్యాదుల యందు శేషించిన లకారమే వెనుకటి ప్రకృత్యర్థమును దెలిపినట్టులు ద్రుతసంజ్ఞ గలిగిన నుశబ్దముయొక్క ఉకారం బుచ్చరింపఁ బడకున్నను మిగిలిన నకార మాత్రమే మునుపటియర్థంబును విడువకుండును. "ఉన్నాను" ఇత్యాదుల యందలి ఉకారంబునకు ననభిధానంబున లోపంబు గలుగదు. వాగనుశాసనుఁడు కేవల నకారంబునకు "ద్రుతాఖ్యోనః" అను సూత్రంబున ద్రుతసంజ్ఞ విధించుట ను శబ్దంబు యొక్క ఉకారం బుచ్చరింపఁ బడ కున్నను శేషించిన నకార మాత్రమే విశిష్టం బైన నుశబ్దార్థంబును జెప్పునని తాత్పర్యము.

12. సూ—ద్రుతాంతము లైన పదములు ద్రుతప్రకృతికములు.

ప్రథమాకయిపట్టియొక్క తరములయిన విభక్తులు - ఉత్తమ పురుషైకవచనంబులు - భూత తద్ధర్మాద్యర్థకప్రథమ పురుషైకవచనంబులు - ఆశీరాద్యర్థంబులయిన యెడు త వర్ణకంబులు - శతృగుమా నంతర్య చేదాద్యర్థకంబులు - నేనుతానుపదంబులు - వలెప్రభృతులును - ద్రుతప్రకృతికంబులు। - నన్నున్ - నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్ - మాలోపలన్ - మాయందున్ - వత్తున్ - వచ్చెదన్ - వచ్చెన్ - వచ్చున్ - వచ్చెదుగాక - ప్రసన్నుఁ డయ్యెడున్ - కావుతన్ - కొట్టుచున్ - కొట్టన్ - కొట్టఁగన్ - కొట్టుమనున్ -

కొట్టినన్-వలెన్ - ఎంతయున్-పోలెన్-అయ్యున్ - ఇత్యాదులూహ్యంబులు.

వ్యా—ద్రుతము చివరంగలశబ్దములు ద్రుతప్రకృతికములు. ఏవియనిన:—1 ప్రథమావిభక్తియును, (రాముఁడు) కయి, పట్టి, యొక్క, తక్కఁదక్కిన విభక్తులును, (నన్నున్, నాచేతన్, నాతోడన్, నాకొఱకున్, నావలనన్, నాకంటెన్, నాకున్ మాలోపలన్, మాయందున్) 2 ఉత్తమ పురుషైక వచనంబులును, (ఐతున్, వచ్చెదన్) 3 భూతార్థక ప్రథమపురుషైక వచనంబును, (వచ్చెన్) 4 తద్ధర్మార్థక ప్రథమ పురుషైక వచనంబును, (వచ్చున్, వచ్చెడున్) 5 ఆశీరాద్యర్థకంబులైన "ఎడు, త" అను వర్ణకంబులును, (ప్రసన్నులయ్యెడున్, కావుతన్) 6 శత్రర్థకంబును, (కొట్టుచున్) 7తుమున్నాద్యర్థకంబును, (కొట్టన్, కొట్టఁగన్) 8 ఆనంతర్యార్థకంబును (కొట్టుడున్) 9చేదాద్యర్థ కంబును, (కొట్టినన్) 10 "నేను, తాను" అను శబ్దంబులును, 11 వలె మొదలైనవియును, (ఎంతయున్, పోలెన్, అయ్యున్, మిగులన్, కడున్, వెంటన్, వెంబడిన్, మొ.) ద్రుతప్రకృతికంబులుగా నూహింపఁదగ్గవి. . "చ. ఘనతరఘూర్జరీకుచయుగ క్రియగూఢముగాక ద్రావిడీ| స్తనగతిఁదేటగాక యఱచాటగునాంధ్రవధూటిచొక్కపుం| జనుగవఁబోలిగూఢమునుజాటుఁదనంబునులేక యుండఁజెప్పిన నదెవోకవిత్వ మనిపించు నగించుటు కాక యుండినన్" ఇచ్చట "నగించు" అనునది తద్ధర్మార్థకంబు గావున ద్రుతాంతంబై పద్యములో "నగించు నటు" అని యుండవలెను. అప్పుడు గణభంగము గలుగును గావఁ ప్రథమములో "నగించెడు నట్లుగానిచోన్" అని కవిచే రచింపఁబడి క్రమ క్రమముగా ద్రుతము లేని పాఠము ప్రమాద కృతమై యుండవచ్చుచు. ఇప్పద్యము పెద్దన్నగారి చాటుపద్య మని కొంద ఱును, వేంకటనాథకవికృతంబగుపంచతంత్రములోని దని మఱికొందఱును జెప్పుదురు. భాస్కర శతకమునందు "చ. చీఁకుపుర్వుదాఁ| జెవకొలుకింతె గాక పుడిసెండు జలంబిడి పెంపనేర్చునే" అను పద్యతృతీయ పాదములో "కొలుకునింతె "గాక" అనిద్రుతాంతముగా నుండవలసిన దానికి "కొలుకింతెగాక" అనివ్యాకరణ విరుద్ధముగాఁ బ్రయోగింపఁ బడినది. ఇట్టి ప్రామాదికప్రయోగంబులకు 'నిరంకుశాః కవయః" అనెడి లోకోక్తియే శరణంబు గాని వేఱొకగతి గానిపింప కున్నది.

'తే॥గీ॥ తన్ను నిన్ను నన్ను విన్ను మున్నా మిన్ను | చన్నుకన్ను వెన్ను శబ్దములకు | జడ్డలుండుఁ బోవుఁ జర్చింపని వి ద్రుత| ప్రకృతు లెపుడుఁగావు భక్తసులభః' అప్ప 5-అ. ఇప్పద్యమందలి "తన్ను, నిన్ను, నన్ను" శబ్దంబులు ద్వితీయాంతంబులు

కావున ద్రుతప్రకృతికంబులు. పై పద్యంబులో నప్పకవికళాశబ్దంబులలోఁ బరిగణించుట కవిరథసహేతుకంబు.

13. సూ.—ద్రుతప్రకృతులు గాని శబ్దంబులు కళ లనఁబడు.

రాముఁడు - రాములు - హయము - విష్ణువు - గోడ - మేడ - అయ్య - అమ్మ - రామునికయి - జ్ఞానముఁబట్టి - నాయొక్క - వచ్చిరి - వచ్చితివి - వచ్చితిరి - వచ్చితిమి - రాఁడు - రారు - రాము - రావు - రాము - కొట్టక - తిట్టక - ఎత్తిలి - ఒత్తిలి - ఊరక - మిన్నక - బళి - అక్కట - ఏల - ఇత్యాదులూహించునది.

వ్యా.—ద్రుతము కడపట లేని శబ్దంబులు కళ లనంబడును. రాముఁడు, గోడ, అమ్మ, మొద లైన ప్రథమలును, "కయి, పట్టి, యొక్క" అను ప్రత్యయంబులును, వచ్చిరి మొదలగు రేఫాంత క్రియలును, వచ్చితివి, వచ్చితిరి, మున్నగు మధ్యమ పురుష క్రియలును, వచ్చితిమి మొదలగు నుత్తమ పురుష బహువచన క్రియలును, రాఁడు మొదలగు వ్యతిరేక క్రియలును, ఎత్తిలి, ఒత్తిలి మొదలగునవ్యయంబులును, ఊరక, మిన్నక, మొదలగు తూష్ణీమర్థకంబులును, బళి మొదలగు ప్రశంస నార్థకంబులును, అక్కట మొదలగు సంతాపార్థకంబులును, ఏల మొదలగు ప్రశ్నార్థకంబులును, "అట్టులు, ఇట్టులుఎట్టులు" అను ప్రకారార్థ కంబులును, "మఱి, మిక్కిలి" అను నత్యంతార్థకంబులును, "ఎ, ఏ, అ" అను నవధారణార్థ కంబులును, ఇద్యాదులు కళలు.

"క. అనఘ యిది యేటితపమే
మనుపమదుఃఖితులమగుటనాధారములే
కనుసంతానోచ్ఛేదం
బున ద్రేవేలెదమధమలోకముల తెరవుచనన్."

భార, ఆది. 2 ఆ. అను పద్యమందలి "లేకను" అనుప్రయోగము చూచి కొందఱు "లేక" అనువ్యతిరేకక్త్వార్థకము ద్రుతాంతంబుగా నుండనచ్చునని యు, మఱికొందఱానువర్ణ శూ "లేకయున్" అని యుశబ్దపూర్వకంబుగా నుండవలసినను నట్లుచ్చరింపకపోవుట పాదపూరణార్థమనియు, నుడువుదురు. కాని సముచ్చయార్థంబునకు నవసరంబులేని యిట్టి కళాశబ్దంబులమీఁద నకారంబు కాన్పించిన చోట్లనెల్లసము

చ్చయ నకారంబని సవరింపుట సులభంబుగావున నిట్టివి యాభాససమాధానంబులని యెఱుంగునది. «పోకను» అనుచోట «లేమిని» అను పాఠమే కవికృతమై యుండును. «ఆధారము లేదని» అను పాఠము వ్రాఁతప్రతులయందుఁ జూచి నట్లు కొందఱు నుడువుమన్నారు.

14. సూ.—హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును

అడఁకువ - అడంకువ - అరఁటి - అరంటి - ఎఱుఁగుట - ఎఱుంగుట - బలఁగము - బలంగము - మగఁటిమి - మగంటిమి.

వ్యా.— హ్రస్వాక్షరము తరువాతనున్న యరసున్న వైకల్పికము (విధికిఁ బ్రవృత్తియు నివృత్తియుఁ గలుగుట) గా నిండుసున్న యగును. ఉ. అడఁకువ దీనియందలి కుఱుచ యక్షరంబగు డకారము తరువాతనున్న యరసున్న నిండుసున్నగా మాఱి "అడంకువ" అనియగును. వైకల్పిక మగుటచే «అడఁకువ» అనురూపముం గలదు. ఇట్లే అరఁటి, ఎఱుఁగుట, మగఁటిమి, బలఁగము, మొద.

15. సూ.—దీర్ఘముమీఁది సాధ్యపూర్ణము లేదు.

వాఁడు - వీఁడు - రాఁడు - లేఁడు - కాఁబోలు - కాఁబట్టి - గోఁగులు - రేఁగులు.

వ్యా.—దీర్ఘాక్షరము తరువాతను నిండుసున్న శబ్దముయొక్క పుట్టుకలోనే యుండవలయును గాని వ్యాకరణముచేత నిండుసున్న రానేరదు. అరసున్న శాస్త్రముచేత రావచ్చును. ఉ. తాఁజెప్పె. వాఁడు. ఇచ్చట దీర్ఘాక్షరంబగు వకారముతరువాత నరసున్న యున్నది. కావున నిండుసున్న వచ్చి "వాండు" అనురూపము సిద్ధింపదు. ఇట్లే వీఁడు, రాఁడు, లేఁడు, మొద.

16 సూ.—సంస్కృతసమేతరములైన తెలుఁగుశబ్దంబులయందుఁ బరుషసరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది.

వంకర - కలఁకువ - మంచు - త్రాఁచు - దంట - దాఁటు - కొంత - కోఁత. ఇత్యాదులూహ్యంబులు

వ్యా.—సంస్కృతసమేతరములు=సంస్కృతపదములు కానివి. బిందువు అరసున్నయు, నిండుసున్నయు; తెలుఁగుశబ్దంబులలో నరసున్న గాని నిండుసున్న గా

యుండుచోఁ బరుషములకును (క, చ, చ, ట, త, ప లు) సరళములకును, (గ, జ, జ, డ, ద, బలు) ముందుండునుగాని తక్కినవర్ణంబులకు (స్థిరాక్షరములకు) ముందుండదు. ఉ. వంకర. ఇచ్చటఁ బరుషవర్ణమైన కకారమునకు ముందుఁ బూర్ణబిందువు గలదు. "కలఁకువ" ఇచ్చటఁగు వర్ణమునకు ముందునర్ధబిందువుగలదు. ఇట్లే మంచు, త్రాఁచు డంటు, మొదలైనవి గ్రహించునది.

17. సూ.—యకారంబును వువూ వొవోలును దెలుఁగుమాటలకు మొదటలేవు.

ఎవఁడు - ఎక్కడ - ఏమి - ఏల - ఉండ - ఊరు - ఒకఁడు - ఓడ॥ హరియతఁడు నిద్రవోయెనిట్టిచోట్ల సంధివశంబున వచ్చినయకారవకారంబులుగాని పూర్వసిద్ధంబులుగావు - వోఢృవోఢవ్యశబ్దములుదప్ప సంస్కృతసమంబులందు సహితము వు వూ వోవర్ణాదులగుశబ్దంబులు లేవని యెఱుంగునది - ఉదకము - ఊర్మిక - ఓదనము.

వ్యా.—యకారంబును, వు, వూ, వొ, వోలును దెలుఁగు మాటలకు మొదట సిద్ధములు లేవు. ఉ. ఎవఁడు, ఊరు మొదలైనవి. "హరి యతఁడు, (హరి + అతఁడు నిద్ర వోయె (నిద్ర + పోయె)" అను నప్పుడీచోటుల నుండు యకార వోకారంబులు సంధివశముచేత (అకారము యకారముగాను, "పో" అనునది వోకారంబుగాను)) నైనవి. కాని సహజములైన యకార వోకారంబులు గావు. (మూలము) వోఢృ వోఢవ్య శబ్దములు దక్క సంస్కృత సమంబులందుఁ గూడ "వు, వూ, వో" అను నక్షరంబులు మొదటఁ గల పదములు లేవని తెలిసికోవలెను. ఉ. ఉదకము, ఓదనము మొదలైనవి. చిన్నయసూరిగారు యకారంబును, వు, వూ, వొ, వోలును, మాత్రమే పదాది యందుండవని చెప్పిరికాని, ఙకార శకారంబు లాదియందుఁగల పదములుగూడ లేవని చెప్పలేదు. వోళిశా (ఒబ్బట్లు, పోళి) వోఘుః (పితృగృహవాసియై పోషింపఁ బడిన (పోషిత భర్తృక సుతుఁడు) వోఢజః (గర్భిణీస్త్రీని పెండ్లియాడిన పిదపఁ బుట్టిన కొమరుఁడు) వోఢా (కుమ్మరవాఁడు, సారథి) వోటా (దాసి) వోడః (పోఁకచెట్టు) వోడ్రః (గోనస సర్పము, మత్స్యవిశేషము) వోడ్రీ (పణచతుర్థాంశము) వోదః (ఆర్ద్రః = తడసిన) వోదాలః (మత్స్యవిశేషము) వోరకః (లేఖకుఁడు) వోరటః (కుందపుష్పము) వోరపట్టీ (మందుర = అశ్వశాల) వోరవః (ధాన్యవిశేషము) వోరుఖానః (పాటలవర్ణాశ్వము) మున్నగు వోకార సహిత వకారాది శబ్దంబులు శబ్దార్థ కల్పతరు సర్వశబ్ద సంబోధినీ (ప్రకృతిగ్ర)ంథంబులలోఁ గనఁబడుచున్నవి.

"సీ. "జాతివాగలవోఢ్ర శబ్దమొక్కటి దక్క
సంస్కృతాంధ్రముల ముజ్జగములందు
శబ్దంబు మొదల నిశ్చయముగాఁ గొమ్ములు
నోత్వంబులును గల్గ వొకటి కైన
వాకుశృంగముల కైవడి నోత్వములభంగి
శబ్దాదిఁగల యవి స్వరములగును" అప్ప. 2. ఆ.

అను పద్యమునందుఁ జూడఁగా వోఢ్రశబ్దం బొక్కండు దక్క ముజ్జగమ్ముల వెదకినను సంస్కృతాంధ్రములయందుఁ దక్కిన పదములకు వోకారము మొదలనుండ దని చెప్పిన యప్పకవిగారి వచనము సాహసమూలకము.

18. సూ.—య ర ల వలు లఘువులని యలఘువులని ద్వివిధంబు లగు.

హరియతఁడు - ఇత్యాదులందాగమయకారములఘువు- తక్కినయకారమలఘువు ॥ విఱుగుమెఱుఁగిత్యాదులందు రేఫం బలఘువు - ఇదే శకట రేఫమని చెప్పఁబడును - శకటరేఫముతత్సమతద్భవములందు లేదు - పెరుగుకరుగిత్యాదులందు రేఫంబు లఘువు ॥ ఏళులుపాళులుత్రాళులని బహుత్వమందురలడలకాదేశమయినళకారమలఘువు - తలనెల యిత్యాదు లందలి లకారము లఘువు ॥ అతఁడువలికె నిత్యాదులందున్న పాదేశవకారములఘువు - తక్కినవకారమలఘువు ॥ వర్ణసమామ్నాయమందలి ళకారమువర్ణాంతరముగాని యలఘుళకారముగాదని యెఱుంగునది.

వ్యా.—య,ర,ల,వ,లు లఘువులనియు నలఘువులనియు రెండువిధములు. లఘువులన నుచ్చారణలో లాఘవముగలవి. అలఘువులననుచ్చారణలో గౌరవముగలవి. ఈ యక్షరంబులకే యంతస్థములని పేరు. హరియతఁడు(హరి + అతఁడు) మొదలగువానియందలియకారము శాస్త్రముచేత వచ్చినదిలఘువు. తక్కినయకారమనఁగా శబ్దముయొక్క పుట్టుకలోనుండిన యకార మలఘువు. ఉ. కాయ. మొ. క్రమముగా సాధ్యయకారసిద్ధ "యకారంబులులఘ్వలఘువులు." ఇట్లే "నిద్రవోయె" ఇత్యాది వకారస్థలంబునను

గ్రహింపవలెను. విఱుగు మెఱుఁగు మొదలగు వానియందలి శకటరేఫం బలఘువు. (మూలము) శకటరేఫము తత్సమ తద్భవముల యందులేమ.

వ్యా.—"గీ. ఊఁద పలుకు చోటనొగిఁ దేల్చి పలికిన
రేఫగాదు శకట రేఫగాని
తద్భవపుఁ బదములఁ దవిలిన యారేఫ
రేఫగాని శకట రేఫగాదు."

ద్వితీ-త-29 ల. అను కవిసంశయ విచ్ఛేద కారకుని మతంబును
"గీ. పదము మొదల నిడుదఁదుదిఁ దద్భ వంబుల
రేఫగాని శకట రేఫగాదు."

అను దిట్టకవి వేంకటార్యవరుని మతంబును, సూరిగా రను సరించిరి. కానితిమ్మ కవిగారు పైవేంకటార్యునిమాట విశ్వసింపక తమసర్వలక్షణ సారసంగ్రహ శకటరేఫ ప్రకరణమునందు.

"గీ. పదము మొదల నిడుదఁదుదిఁ దద్భవంబుల
రేఫగాని శకట రేఫగాదు
నిక్కమనుచు సుగుణనిధి దిట్టకవి వేంక
టార్యవరుఁడు వలికెనది హుళిక్కి."

అనిత్రోసివేసిరి. మఱియునహోబలపతి కవిశిరోభూషణమందు "ఉక్కెఱ (ఉపశాకికాశబ్దభవము) కఱకు (కర్కరమ్) మొఱకు (మూర్ఖ.)" ఇత్యాది తద్భవముల యందు శకటరేఫముగలుగుట దోషముగావని నొక్కివక్కాణించెను. ఇంకను త్రిలింగ లక్షణ శేషకారకుని మతమంచుఁగూడఁ దద్భవములయందు శకటరేఫంబులుగలపదములు కొన్నింటినిమాత్ర మీదిగువనుదాహరించు చున్నాఁడను. కాఱియ- కాటికాశబ్దభవము పెఱ- పరశబ్దభవము. గోఱజము-గోరోచనశబ్దభవము. పిఱికి-భీరుకశబ్దభవము. గొఱపము- కురపశబ్దభవము. మొఱకు-మూర్ఖశబ్దభవము గఱి-గరుచ్ఛబ్దభవము. గఱుప-గుఱుశబ్దభవము. ఇత్యాద్యుదాహరణంబులును, వీనికిఁ గావ్యలక్ష్యంబులును చెక్కలు గలవు గాని, గ్రంథవిస్తరభీతిచే విరమించితిని. ఇట్లు శకటరేఫంబు నునికికిఁ గవుల యనాది ప్రయోగప్రవాహమేగతిగాఁదోఁచుచున్నది. కాని, తక్కిన య, వ, ల, లయందుం బలె లఘ్వలఘుత్వజ్ఞానంబునకు స్థిరమైన లక్షణసూత్రము కానిపింపదు. పెరుగ మొద

లైన వానియందలి రేఫంబులఘువు. బహువచనమందు ర, ల, ష, లకు నాదేశము (ఒకదాని స్థానంబును వేఱొకటి యాక్రమించునది) గావచ్చు "ఏసలు" మొదలైన శబ్దంబులయందున్న ళ కారము లఘువు. "తల" మొదలగువానియందలి లకారము లఘువు. అతఁడు వలికె (అతఁడు + పలికె) మొదలైనవానియందలి పకారమునకు వచ్చిన వకారము లఘువు. పసము పుట్టుకలో నేయుండు వకారము లఘువు. ఉ. చేవ. (చూ) వర్ణసమ్నాయ (వర్ణచేవము = చేవమువలె వనాది సిద్ధమైనది.) మందలి ళకారము మఱియొక వర్ణముగాని యలఘు ళకారము గాదని తెలిసికోవలెను. ళకారము వర్ణాంతరముకాదని చెప్పశక్యముగాదు. అనగా వర్ణాంతరమే యని ఫలితార్థము. సంస్కృత భాషయందు "ల" కారమునకు "ళ" కారముకూడఁ బలుకవచ్చును. ఇది యట్టిదిగాదు "గళము" "గలము", "మంగళము" "మంగలము" ఇత్యాదిస్థలములయందు "ళ" "ల", లకు భేదములేదు.

ఈ తెలుఁగుభాషయందు భేదము తప్పక యున్నది. దీనికి ననుకూలముగా "ఆద్యాయాః పంచాశద్వర్ణాః" అనిన యహోబలపండితీయసూత్రమునొద్ద "నళస్య వర్ణాంతరత్వం వక్తుంశక్యతే" అనియున్నది గాన ళకారము వర్ణాంతరము కాదని చెప్పశక్యముగాదు. అనగా వర్ణాంతరమేయని చెప్పవలెను.

"కాశీవాసి బ్రాహ్మణుఁడు విద్వాంసుఁడు గాని విప్రుఁడు గాఁడు," అనఁగా విద్వాంసుఁడైన విప్రుఁడే యని సందర్భార్థము చెప్పుకొన్నట్లు యిచ్చటం గూడ ళకారము వర్ణాంతరము గాని యలఘు ళకారముగావనగా వర్ణాంతరమైనయలఘు ళకారమే యనినయర్థంబగును. "శ్లో. స్ఫుటతా న పదై రపాకృతా న చ న స్వీకృతమర్థ గౌరవమ్" భారవియనెడికిరాతార్జునీయము, 2సర్గ27 శ్లో.

ఈశ్లోకమందు నర్థగౌరవము స్వీకరింపఁబడలేదన్నమాటలేదు. వ్యా.—"అర్థగౌరవం చ-న చ న స్వీకృతం — స్వీకృతమే వేత్యర్థః — ద్వైశబ్ద్యప్రసక్తార్థగౌరవాభావ నివర్తనార్థం నఞ్ద్వయం సంభావ్యనిషేధనివర్తనే ద్వౌప్రతిషేధావితి వామనః" నఞ్ద్వయార్థము సంభావ్యంబైన నిషేధమును నివర్తింపఁజేయుటయందు అనఁగా పోఁగొట్టుటయందు వర్తించునని వామనుఁడనెడి వ్యాఖ్యాత నక్కాణించెను అట్లే ప్రకృతంబునను, ళ కారము వర్ణాంతరముగాని యలఘు ళ కారము గావనగా వర్ణాంతరమైన యలఘుళకారమేయని నిశ్చితార్థమును నఞ్ద్వయార్థము సూచించును.

**19. సూ.—సంస్కృతప్రాకృత తుల్యంబగు భాష తత్సమంబు.**

| | | |
|---|---|---|
| సంస్కృతము | ... | ... సంస్కృతసమము |
| రామః | ... | ... రాముడు |
| విద్యా | ... | ... విద్య |
| హరిః | ... | ... హరి |
| ధేనుః | ... | ... ధేనువు |
| భూః | ... | ... భువి |
| పితా | ... | ... పిత |
| గౌః | ... | ... గోవు |
| నౌః | ... | ... నావ |
| ద్యౌః | ... | ... దివి |
| హృద్ | ... | ... హృది |
| జగత్ | ... | ... { జగత్తు / జగము |

ఇత్యాదులూహ్యంబులు.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతసమము |
|---|---|---|
| అగ్నిః ... | అగ్గీ | ... అగ్గి |
| అటిః ... | అడీ | ... అడి |
| అలిః ... / పఙ్క్తిః ... | } ఓలీ ... | ... ఓలి |
| కటుః ... | కారో ... | కారము |
| గౌరవమ్ ... | గారవం ... | గారవము |
| జటా ... | జడా ... | జడ |
| మిరా ... | మేరా ... | మేర |
| యమః ... | జమో ... | జముడు |

రాజ్ఞీ... ... రాణీ ... రాణి

శృఙ్గారః ... సింగారో... సింగారము

శ్రీః ... ...సిరీ... ...సిరి

వ్యా.—సంస్కృతభాషయు, ప్రాకృతభాషయు సమానమైనభాషలౌనవియు. అనఁగాసంస్కృతశబ్దములయుఁ, బ్రాకృతశబ్దములయు, నంతమందుండు నట్టి దీర్ఘము విసర్గము, మొదలగువానిని శాస్త్రప్రకారంబునమార్చి లింగభేదములనుబట్టి ప్రథమాదివిభక్తులను జేర్చినఁ దత్సమంబులగు. ఉ. సం-హరిః-సం-సమ-హరి సం-ధేనుః సం-సమ-ధేనువు-సం-పితా.సం. సమ-పిత.ప్రా.అగ్గీ ప్రా.సమ.అగ్గి. ప్రా-జమో, సమ-జముఁడు.ప్రా-కారో-ప్రా. సమ-కారము. ఇత్యాదులైన సంస్కృత ప్రాకృతసమంబులు సారూప్యంబును బట్టిగ్రహింపవది. చ జ లు సంస్కృతసమంబులయందు దంత్యములు వులే గాని ప్రాకృతసమంబుల యందు దంత్యములు గలవు. ప్రాకృతసమంబులు సంస్కృతభవంబులని వాడవచ్చును. ఇందులకుఁ బ్రమాణము:—

"క. పదలక్ష సిద్ధాక్షరములు
పొదవిన వర్ణములు దూలిపోఁ బలుకఁగ న
ర్థదమై ప్రాకృత నిభమగు
నది తద్భవ పదమునాఁగ నభి మతమయ్యెన్"

అని కావ్యాలంకారచూడామణి. ప్రాకృతసమంబులగు అగ్గి, జముఁడు, రాణి జడ, ఇయ్యవి. వరుసగా అగ్నిః, యమః, రాజ్ఞీ, జటా మొదలగు సంస్కృతశబ్దము నుండి పుట్టినవి మఱియుఁ జిన్నయసూరిగారి యీపుస్తకమందలి ప్రాకృతసమంబుల లోని, "కారము" అనుశబ్దము క్షారశబ్దభవంబనియు క్షారశబ్దముకటు శబ్దపర్యాయం బనియుఁ గొందఱ యభిప్రాయము బాగుగనేయున్నది. దీనికి సామ్యంబును గానబడియెడి "త్రిరాత్రముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యమక్షారలవణవర్జనఞ్చ" ఆపస్తంబసూత్రవాక్యము. "కారము" అనుశబ్దము క్షారశబ్దభవంబని కవి సంశయవిచ్ఛేదకారకుని మతము పూర్వోక్తమతంబును దృఢపఱుచుచున్నయది. వ॥ అక్షారంబులు నలవణంబులును ఉదకంబులు) కాశీ-5 ఆ.

20 సూ.—(సంస్కృత ప్రాకృత భవంబగుభాష తద్భవంబు.

సంస్కృతము ... ... ... సంస్కృతభవము

ఆకాశః ... ... ... ఆకసము.

| | | |
|---|---|---|
| కుడ్యమ్ | ... ... | ...గోడ |
| చన్ద్రః | ... ... | ...చందురుఁడు |
| తమఙ్గః | ... ... | ...తమగము |
| తామరసమ్ | ... ... | ...తామర |
| నారాచః | ... ... | ...నారసము |
| నిభః | ... ... ... | నెపము / నెవము |
| ముఖమ్ | ... ... ... | మొకము / మొగము |
| మృగః | ... ... ... | మెకము / మెగము |
| వక్రః | ... ... | ...వంకర |
| వేసరః | ... ... | ...వేసడము |
| సముద్రః | ... ... | ...సందడ్రము |
| సూచీ | ... ... | ...సూది |
| స్మరః | ... ... | ...మరుఁడు |
| హారమ్ | ... ... | ...హరణము |
| హరిణాళమ్ | ... ... | ...హరిదళమ్ము |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | ప్రాకృతము | ప్రాకృతభవము. |
|---|---|---|
| అఙ్గారః ... ... | ఇంగాలో ... | ఇంగలము |
| అప్సరాః... ... ... | అచ్ఛరా... ... | అచ్చర |
| ఆశ్చర్యమ్ ... ... | అచ్ఛేరం ... | అచ్చెరువు |
| పఞ్చాశత్ ... ... | పణ్ణాసా... ... | పనస |

| | | |
|---|---|---|
| పృథివీ ... | ... పుఢవీ ... | ... పుడమి |
| ప్రయాణమ్ | ... ప్రయాణం | ... పయనము |
| ప్రవాళః... | ... పవాళో... | ... పవడము / పగడము |
| మత్సరః... | ... మచ్ఛరో | ... మచ్చరము |
| యజ్ఞః ... | ... జణ్ణో ... | ... జన్నము |
| లక్ష్మీః ... | ... లచ్ఛీ ... | ... లచ్చి |
| విష్ణుః ... | ... విణ్హూ ... | ... వెన్నుఁడు |
| వైద్యః ... | ... వేజ్జో ... | ... వెజ్జు |
| స్తమ్భః ... | ... ఖంభో ... | ... కంబము |
| స్థూలమ్... | ... థోరం ... | ... తోరము |

ఇత్యాదులు తెలియునది.

వ్యా.—సంస్కృతము నుండియుఁ బ్రాకృతమునుండియుఁ బుట్టినభాష తద్భవంబు. అనఁగా వర్ణలోపము (అక్షరముకనఁబడకుండుట) వర్ణాగమము, (మఱియొక యక్షరమువచ్చుట) వర్ణాదేశము, (ఉన్నయక్షరమును ద్రోసి యాస్థానమునమఱియొక యక్షరమువచ్చుట) వర్ణవ్యత్యయము, (అక్షరములు తాఱుమాఱుకావుట) మున్నగు మార్పులు శాస్త్రప్రకారముపొంది తెలుఁగున వాడంబడుపదములు తద్భవములు. ఉ. ఆగ-సం-రథః సం-భ-అరదము (అకారము క్రొత్తగాఁ జేరినది.) ప్రా-అచ్చేరం-ప్రా-భ-అచ్చెరువు (వువర్ణంబాగమింబు) ఆదే-సం-అంగణమ్.సం-భ అంకణము (గకారంబునకు, కకారమాదేశము) ప్రా-పుఢవి. ప్రా-భ-పుడమి (ఢకారవకారంబులకుఁ గ్రమముగా డకార మకారంబు లాదేశము) లోప-సం-తామరసమ్. సం-భ-తామర (సకారలోపము) ప్రా-పణ్ణాస. ప్రా-భ-పనస (ద్వితీయణకారలోపము) వర్ణవ్యత్యయము సం-శుచిః-సం-భచిచ్చు-సంస్కృతపదంబులో నంత్యంబైనచివర్ణంబు నాంధ్రపదంబులో నాద్యస్థానంబునకు మాఱెను.) ఇత్యాదిక మూహించుకొనునది.

21. సూ.—త్రిలింగదేశవ్యవహారసిద్ధంబగుభాష దేశ్యంబు.

ఊరు-పేరు-ఇల్లు - ముల్లు - కోట - పేట - దూడ - మేడ - కోఁత - లేఁత - కావి - మోవి - ఇత్యాదు లరయునది.

వ్యా.—త్రిలింగదేశమనఁగాః—శ్రీశైలము, దాక్షారామము, కాళేశ్వరము, ఈమూఁడు క్షేత్రములయొక్క మధ్యమందుండు నాంధ్రదేశము. మూఁడులింగములు గలదిగావునఁ త్రిలింగము, ద్రాక్షతోటలు మెండుగానుండుటచే ద్రాక్షారామమను పేరువచ్చినదని ప్రౌఢవాదము గాని, యట్లుగాదు. "దక్షస్యారామభూమిత్వాద్దాక్షారామ ఇతీర్యతే" (దక్షునియారామభూమిగావున దాక్షారామము) అని స్కాందమందు భీమేశ్వరఖండమునందుఁ జెప్పబడియున్నది. ఇదియంతయుఁ గుమారస్వామియజ్వకృత ప్రతాపరుద్రీయవ్యాఖ్యానమగు రత్నాపణమందు వివరింపబడ్డది. కాళేశ్వరమువిషయమై భిన్నాభిప్రాయములుగలవు. కాళేశ్వరమనఁగాఁ బెద్దతిరుపతి క్షేత్రమునకు సమీపముననున్న శ్రీకాళహస్తియని సర్వజనులయభిప్రాయము. ఈకాళహస్తీశ్వరునిఁ గూర్చియే శివభక్తుండగు ధూర్జటికవి "శ్రీకాళహస్తీశ్వరా" అను సంబుద్ధ్యంతంబులగు పద్యంబులతో శతకమును రచించుటే కాక, కాళహస్తిమాహాత్మ్యమును గూడ నాంధ్రీకరించెను. దీనంజేసి యిది స్వయంభువగు శివక్షేత్రమైనట్లు జగద్విదితమగుచున్నది కాని కాళేశ్వరవిషయమైయొకయభిప్రాయవిశేషముగలదు. హైదరాబాదు రాజ్యములోని యెలగందల మండలమున గోదావరీనదితో నింద్రావతి సంగమించెడు స్థలంబందు మంథనియను గ్రామంబు సమీపంబునఁ గాళేశ్వరమను శివక్షేత్రముగలదనియు, నీత్రిలింగములలో నదియే యొకటిగా నెన్నఁబడినది గాని, కాళహస్తి గాదనియుఁ జెప్పుదురు. కాళేశ్వరము విషయమై ధూర్జటికవివంటివారు క్షేత్రమాహాత్మ్యమును గాని, శతకంబును గాని, రచించినట్లు వినము. కాళహస్తిశబ్దములో "నామైకదేశే నామగ్రహణ"మ్మను న్యాయంబున హస్తిశబ్దంబునువిడిచి కాళశబ్దంబుతో నీశ్వరశబ్దంబుచ్చరింపవచ్చును. శాస్త్రదూష్యంబులేదు సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరపీఠికలో "కాళహస్తి" అనియే నిశ్చయించిరి. "తెనుఁగు" అనుపదంబు త్రిలింగశబ్దభవంబనియు దీనికిఁ దెనుఁగురూపాంతరమనియుఁ, గావ్యాలంకారచూడామణ్యాదుల విన్నకోట పెద్దనామాత్యాదులు సెలవిచ్చిరి. మఱికొందరు తెనుఁగు అను శబ్దము త్రినగశబ్దభవంబనినుడివిరి. అట్లయినచో ననుస్వారహీనమైన త్రినగశబ్దమునుండి సానుస్వారరూపంబగు తెనుఁగుశబ్దము జనించుటదుర్లభంబగుటంజేసి తోఁలయొక్క రూపాంతరముతోన యగునట్లు తెలుఁగు శబ్దముయొక్క రూపాంతరము తెనుఁగనిన బాగుగనుండునని కొందఱు వాక్రుచ్చిరి. కవిసంశయవిచ్ఛేదమునందలి తద్భవములను

కూడఁగా లకారముగల సంస్కృతశబ్దములకుఁ దద్భవముఁన వకారమువచ్చుటకిచ్చిన యుదాహరణంబులలోఁ ద్రిలింగశబ్దభవము తెనుఁగనిరియున్నది.

"సీ. కత్వహత్వములకు యత్వమాదేశమగా
జ్ఞణలల నత్వంబు సంభవించు"

కవి-తృతీ-త.43 ల. అనుస్వారరహితంబులగుసంస్కృతశబ్దంబులుదద్భవంబులలోనికి మాఱునపు డనుస్వారసహితంబులుగా నుండుటయుంగలదు. కావునబిందువుకూడదను పైవాదమంతగా సయుక్తికముగాదు. ఉదా. పీఠము-పీఁట. పూగము-పోఁక వ్యాఘ్రము-వేఁగి. వైశాఖము-వేసఁగి మొదలైనవి. ఐనను త్రిలింగశబ్దభవము తెలుఁగనియు రూపాంతరము తెనుఁగనియు గ్రహించుటయే పూర్వోక్తసరసయుక్తులంజేసి సమంజసము. (మూ) తెలుగుదేశమందు వాడుచున్న భాషదేశ్యము. ఉదా. ఊరు, కోట, పేట, ఇత్యాదులు.

వ్యా.—మూలమునందుఁ గోటపేఁట శబ్దంబులు దేశ్యములుగా నుదహరింపఁబడ్డవికానియట్లుగాదు. కోట్టశబ్దభవము కోట. "కోట్టారఘట్టహట్టాశ్చ" అమరత్రిలింగశేషము, పింఠాశబ్దభవము పేఁట. "పిఁఠావిటజనాశ్రయః" అమరపదపారిజాతము. కోట్టశబ్దపర్యాయంబు సంస్కృతమేకోట శబ్దంబొండు గనఁబడుచున్నదియనిప్రౌఢవ్యాకరణకారకుని యభిప్రాయము. దేశ్యములో, అన్యదేశ్యంబని మఱి యొండువిధంబుగలదు. ఉదా. తావు, పైఠాణము, గాడీ, ఇత్యాదిహిందూస్థానిపదములును, తాయి తిరుచూర్ణమిత్యాదిద్రావిడ పదంబులును. బిడార్విత్యాదికన్నడపదములును, ఆంధ్రమునందుఁ గవిసంప్రదాయసిద్ధముగాఁ బ్రయోగింపవచ్చును.

"సీ. మిహిపసిండి పరుంజుమొహదా కెలంకుల
తావు గజ్జినన్నె కేవడంబు"—మను 4 ఆ

"సీ. రాణవొప్పరు పైఠాణంబు సింగిణి
తళుకులకోరీల తరకసంబు"—మను 4 ఆ

"సీ. రమ్యభూషాణాలంకృతి స్త్రీసహస్రంబుఁ
గాంచన శిబికాసహస్రంబుఁ జిత్రలలిత

గతినొప్పునే నూఱు గాఁడీలు సింధుజ
బాహ్లిక కాంభోజ పారసీక"—భార ఆది 8 ఆ

"సీ. కన్నబిడ్డల లేవఁ గాండిసీకులఁ బ్రోవ
బంగారు తాయిమారంగి తాయి"—పాంచా 1 ఆ

"చ. ధవళోర్ధ్వ పుండ్రములయందుఁ
గడుఁ దిరుచూర్ణ మొప్ప"—పర 3 ఆ

"తే. ఈవెలంది యొడల్ స్పైఁడిలో వెలంది
యీనెలంత లలాటంబులే నెలంత
యీసుపాణిరదశ్రేణియే సుపాణి
యీబిడారు మృగీమద శ్రీబిడారు"—విజ 1 ఆ

22. లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు.

వస్తాఁడు. తెస్తాఁడు. వచ్చేని - తెచ్చేని - వచ్చేవాఁడు - తెచ్చేవాఁడు. వచ్చేటివాఁడు - తెచ్చేటివాఁడు ఈభాష ప్రయోగంబున కనర్హంబు.

వ్యా.—వ్యాకరణశాస్త్రమునకు వ్యతిరేకమైనభాష గ్రామ్యము. ఉదా. వస్తాఁడు, వచ్చేవాఁడు, తెచ్చేటివాఁడు మొదలైనవి. ఈభాష గ్రంథములయందు బ్రయోగింపఁదగదు. శా. "ఫా। టించు శ్వేతగలు తద్దనమ్మి నుయిదాఁటే వానికిం జింతయా। కంతైవఁ" పాండు-4 ఆ. "క॥ అచ్చెలిపందిరిలోపల వచ్చ్యముఁబోయేటి వరుసవారికి" హంస-2 ఆ. క. ముద్దారిచనమలమ్మా। ముద్దులు గుల్కేటికల్లికుత్తా లమ్మా। సిద్దాబత్తుల లచ్చిని। బ్రొద్దునసే పంపవమ్మ పోలేరమ్మా" భీమనచాటుధార పైపద్యత్రయంబందలి "దాఁటేవానికి, గుల్కేటితల్లి, పోయేటి" ఇత్యాదికవిప్రయోగంబులును లక్షణ సురక్షితంబులు గావని యెఱుఁగునది. సంస్కృతనాటకంబులలోఁ బ్రాకృతభాషయుం బోలె నొకానొకప్పుడు జాతీయభాషలు గ్రామ్యసంకరంబులు

పయితము పాత్రానుసారముగ రసపుష్టికై యీ తెలుంగునందుఁ బ్రయోగింప నగును. ఉదా "మొక్కేముసామి,, రామా-2ఆ గీ. ,,ఇతని నూసినామేలు బాగెము సేసినాము" యయా-1 ఆ. గీ. ,,సామి దరమరాజ సప్పన్న బూములు। మాసిగాఁడు కట్టిమస్సిగాఁడు ।పోసిగాఁడు కూడిపోయిరి రేతిరి। నూసివచ్చినారు సొర్గమయ్యో" పట్బ-2ఆ "క. సామిద్రోవముగాదే। గామంబులు సొచ్చిసంపె గంపెఁడు లచ్చల్ గామిడి మెకములు మనుజుల। బూములు రచ్చించవయ్య పున్నెపురాజా" పట్బ-2ఆ.

సీ॥ ,,వేఁటసాగించుమీ వేగంబె దుంతనుగానుక బెట్టేము కాటి తేఁడ మాకుఁ దోడైరమ్మ నీకెక్కుఁదెచ్చేము। గరుడాలమంతుని గంబమయ్య । మెకములతోఁ జేయు మీసింగమును నీకుఁ దొలుతగా నిచ్చేము దుగ్గిదేవి। జయమిమ్మ పోతాన జాతరల్సేసేము మాపొకేళ్ళనుగొట్టి మలలతల్లి" తే ,,అనుచు,, పట్బ-2ఆ. ఇత్యాదులు కానంబడుచున్నవి.

23 సూ—ఆర్యవ్యవహారంబులదృష్టంబు గ్రాహ్యంబు.

పెద్దలు వ్యవహరించినమాట గ్రాహ్యంబయిన గ్రహింపందగునని తాత్పర్యము. కలఁకంఠుడు ప్రాణగొడ్డము జీవగఱ్ఱ కపిలకన్నులు కపిలగడ్డము, కపిలజడలు.

ఇదిసంజ్ఞాపరిచ్ఛేదము.

వ్యా—పెద్దలవాడుకయందుఁ గనఁబడునని గ్రహింపఁ దగ్గవి. అనఁగా నీభాషయందుఁ బ్రామాణికులు తమ గ్రంథములయందు నెయ్యవి ప్రయోగింతురో యయ్యవి శాస్త్రమునకు విరుద్ధముగా నున్నను, గ్రహింపవలెనని యభిప్రాయము. కనుకనే యాథర్వణాచార్యులు వికృతివివేకమున ,,శాస్త్రప్రయోగవశతః శాస్త్రంబలవదుచ్యతే। అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితం" అనినుడివిరి. అనఁగా నెచట శాస్త్రముచేఁ బ్రత్యేకముగాఁ గార్యము చెప్పఁబడునో యచ్చట శాస్త్రముబలము గలది. ఎచ్చట శాస్త్రముచేత సామాన్యముగా విధికనఁబడదో యచ్చటఁ బ్రయోగవిశేషము బలవత్తరమని భావము. కావుననే ,, కలఁకంఠుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలగడ్డము" మున్నగు ప్రయోగములు గ్రామ్యములైనను సాధువులని సూరిగారి యభిప్రాయము కాని త్రిలింగలక్షణమందునయ్యవి గ్రామ్యములుగాక తద్భవంబులేయని చెప్పఁబడినవి. ఎట్లనగ కలకంఠశబ్దభవము కలఁకంఠుఁడనియు ప్రాణకుట్టకశబ్దభవము-

ప్రాణగొడ్డమనియు, నియ్యవి యంచయానలోనగు వానివలె మిశ్రింబులనియు, కవిల శబ్దము కపిలశబ్దభవంబు కావునఁ "గవిలగడ్డము, కవిల కన్నులు" అనియే ప్రయోగింప వలెననియు నుడివిరి. "జీవగఱ్ఱ" నీరీతిగా గ్రామ్యంబుగాకుండఁ జేయుటకుఁ దగిన యాధారం బేమియుఁ గానంబడదు. క॥ "ఎఱుకని యెఱుఁగక నీకుఁగా। మఱకువమా ర్గోన్న తప్పుమఱవుమునమ్మం। గఱకంఠాక్షమియింపుము। నెతి నెవ్వరి కెఱుఁగ నగునె నీచరితంబుల్" భార-అర-1 ఆ. సీ॥ "ప్రాణగొడ్డములగుపనుల వారలఁ దీర। దలఁచిన పుణ్యంబు కలిమిఁ జేసి" భార-ఉద్యో-1ఆ.

శా॥ "తావొంచిత్యము జీవగఱ్ఱ హింసశిష్టవ్రాత సంతోషణ। శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే మాఁగఁగ" సుభ-1ఆ. అక్కర॥ "అవసరజ్ఞుండ యివ్యాసుఁడే తెంచె నంత నత్తపసి। కవిలగడ్డంబును గవిలజడలును గవిలకన్నులు నుదవినయన్నవనల్లనైనదీర్ఘ పుఁడనువునుజూచి। యువిద కన్నుంగవ మొగిచి తెఱవక యుండె భయమున" భార-ఆది-4.

---

# సంధిపరిచ్ఛేదము.

---

సంధియనఁగాఁ గూడికయని శబ్దార్థము. దీనిం గూర్చి తెలియఁజేయు భాగము సంధిపరిచ్ఛేద మనఁబడును. లక్ష్యములందు సంధిస్పష్టముకాఁగలదు. ఉత్తనఁగా హ్రస్వమైన ఉకారము. ఇట్లే అత్తు, ఇత్తు మొదలైనవి. ఉత్తు మొదలైనవానిలోనితకారమునకుఁ దపర కరణంబందురు. తపర కరణంబువలని ఫలం బేమనఁగాఁ దకారోచ్చారణమువలనఁ బూర్వాక్షరము దీర్ఘమైనచో దీర్ఘమునకును, హ్రస్వమైనచో హ్రస్వమునకును గ్రహణము.

1. సూ—ఉత్తున కచ్చుపరంబగు నప్పుడు సంధియగు. పూర్వాపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధియనంబడు.

| | | |
|---|---|---|
| రాముఁడు ... ... | అతఁడు ... ... | రాముఁడతఁడు |
| సోముఁడు ... ... | ఇతఁడు ... | సోముఁడితఁడు |
| మనము... ... ... | ఉంటిమి ... ... | మనముంటిమి |
| అతఁడు... ... ... | ఎక్కడ ... ... | అతఁడెక్కడ |
| ఇతఁడు... ... ... | ఒకఁడు ... ... | ఇతఁడొకఁడు |

వ్యా.—హ్రస్వమైన ఉకారమునకు నచ్చు పరమగునప్పుడు సంధికలుగును. పూర్వపరస్వరంబులకున్=ముందటి యచ్చునకును, తరువాతి యచ్చునకును, ఈరెండింటికిని, పరస్వరంబు=తరువాతియచ్చు, ఏకాదేశంబగుట= ఒక యక్షరమే వచ్చుట (రెండువర్ణంబులస్థానంబున నొకవర్ణంబువచ్చుట) సంధియనంబడు=సంధియనంబడును. అనఁగా మొదటి పదము యొక్క కడపటి యచ్చు కనంబడక సంధిలో రెండవ పదము యొక్క యచ్చే కనంబడును, ఉ. రాముఁడతఁడు (రాముఁడు + అతఁడు) ఇచ్చట మొదటి పదమా "రాముఁడు" అనుదాని కడపటి యచ్చు ఉకారము. (రాముఁడ్ + ఉ) "అతఁడు" అనుదానిలోని మొదటి యచ్చు అకారము. "ఉ, అ" అను నీరెండచ్చులకుఁ బరస్వరమైన అకారము వచ్చి "రాముఁడతఁడు" (రాముఁడ్ + అతఁడు డ్ + అ=డ) అని యగును. అనఁగా మొదటి పదము యొక్క యంత్యాచ్చు సంధిలోఁగనంబడదని ఫలితార్థము. ఇట్లే మనము ఉంటిమి, ఇతఁడొకఁడు, మొదలైనవి గ్రహింపవలెను. మఱియు, సంధి, పూర్వరూప సంధి యనియుఁ బరరూప సంధి యనియు, రెండువిధములు. పూర్వరూప సంధి సంస్కృతమునందుఁ గాక తెలుఁగునందు లేదు. ఉదా. తమోంజనము (తమస్ + అంజనము)=తమో + అంజనము ఇచ్చటఁ బూర్వపదంబులకు నోకారాకారంబులకుఁ బూర్వాక్షరంబౌ నోకారమే వచ్చి, "తమోంజనము" అని యగును. సంస్కృతములో సకారాంత శబ్దములకు అకారాది శబ్దములు పరంబగునపుడు, ఈపూర్వరూప సంధివచ్చును. ఇట్లే, "మనోఽశ్వము, యశోఽధికుఁడు, తేజోఽతిశయము" ఇత్యాదులు. ఈసంస్కృత పదంబుల సంధి యాంధ్రికవిత్వమందుఁ గవులు జాగ్రత్తతో గ్రహింపవలెను.

**2.** సూ—ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులందున్న యుకారంబునకు సంధి వైకల్పికంబుగా నగును.

నన్నుఁ.........అడిగె............... { నన్నడిగె / నన్నునడిగె

నాకొఱకుఁ......ఇచ్చె............ { నాకొఱకిచ్చె / నాకొఱకునిచ్చె

నాకుఁ ... ... ఆదరువు ... { నాకాదరువు / నాకునాదరువు

నాయందుఁ ... ఆశ ... ... { నాయందాశ / నాయందునాశ

| | | |
|---|---|---|
| ఇందున్ ... | ... ఉన్నాఁడు... | ఇందున్నాఁడు<br>ఇందునున్నాఁడు |
| ఎందున్ ... | ... ఉంటివి ... | ఎందుంటివి<br>ఎందునుంటివి |
| వచ్చుచున్ ... | ... ఉండెను ... | వచ్చుచుండెను<br>వచ్చుచునుండెను |
| చూచుచున్ | ఏగెను ... | చూచు చేగెను<br>చూచుచు నేగెను |

వ్యా.—ప్రథమగాక తక్కిన విభక్తులయొక్కయు, శత్రర్థకచువర్ణకము యొక్కయు, (సంస్కృతములో శతృప్రత్యయమునకు వర్తమానకాల మర్థము. కాన శత్రర్థకచువర్ణక మనఁగా వర్తమానార్థకచువర్ణకము. "కాంచున్, వచ్చున్" ఇత్యాదితద్ధర్మార్థకరూపంబుల యందలి ధాతుచువర్ణోకారమునకు సంధి రాకుండుటకై యీసూత్రమునందు "శత్రర్థకచువర్ణక" మని చెప్పఁబడినది) ఉకారమునకు సంధి వైకల్పికముగా నగును. ఉదా. నన్నడిగె, నన్నునడిగె (నన్నున్ + అడిగె) ఇచ్చట నన్నుశబ్దముయొక్క కడపటి ఉకారము మొదటి యచ్చు. (పూర్వస్వరము) "అడిగె" అనుదాని లోని అకారము తరువాతియచ్చు (పరస్వరము) ఈఉకారాకారములు రెండింటికినిఁ బరాచ్చు (అకారము) వచ్చి, "నన్నడిగె (ఉ + అ = అ) అని యైనది. ఇచ్చట సంధి వైకల్పికంబుగావున రానియపుడు ఈశబ్దములకు సహజమయిన ద్రుతంబు పూర్వపరాచ్చులనడుమను గనఁబడి "నన్నునడిగె" (న్ + అ = న) అని యైనది. ఇట్లే నాకాదరువు, నాకునాదరువు. ఎందుంటివి, ఎదునుంటివి. చూచు చేగెను, చూచుచు నేగెను మొదలైనవి. ఉకారాంతంబులైన ప్రథమేతర విభక్తులును, వర్తమానార్థకచువర్ణకంబును, తెలుఁగుభాషలో ద్రుతప్రకృతికంబులు. ఈశబ్దములఉకారమునకు సంధి కలుగునపుడు ద్రుతనకారంబు కూడ లోపించినంగాని సంధి సార్థకంబు గాదుకావున నకారంబు లోపించునని యెఱుంగునది.

3. సూ.—సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు. ఆగమంబనఁగా వర్ణాధిక్యంబు.

మా ... ...... అమ్మ ... ... ... మాయమ్మ
మీ ... ... ... ఇల్లు ... ... ... మీయిల్లు
మా ... ... ... ఊరు ... ... ... మాయూరు

వ్యా—సంధి కలియనిచోట నచ్చునకుఁ బరంబై వచ్చినయచ్చునకు యడాగమంబు (యుట్ + ఆగమంబు) అగును. ద్రుతప్రకృతికంబులు నకారాంతంబులు గావున నీవిధి యజంతంబులైన కళలకే చెల్లునని ఫలితార్థము. "ఆద్యంతౌటకితౌ" అను సంస్కృతవ్యాకరణసూత్రంబున టిత్తును, కిత్తును, ఏశబ్దములకు నాగమములుగా విధింపఁబడునో యవిక్రమముగా వానికి నవయవములై మొదటను, చివరను, వచ్చును. అనఁగా నిచ్చట టిత్తైన యడాగమము పరస్వరంబునకు విధింపఁబడినదికావున నాయచ్చునకు మొదలు నిలిచి యవయవము గానుండును. ఉదా. మాయమ్మ (మా + అమ్మ) ఇచ్చట 'మా' అను దానిలోని ఆకారము పూర్వస్వరము. 'అమ్మ' అను దానిలోని మొదటి అకారము పరస్వరము. ఈఅకారమునకు మొదట యడాగమము (య్) రాఁగా 'య' (య్ + అ) అనియయి 'మాయమ్మ' అనురూప మయ్యెను. ఇట్లే మాయూరు మొదలైనవి. యట్, నుక్, టుక్, రుక్, ఇత్యాదులయందలి అకారమును, ఉకారమును, సుఖోచ్చారణార్థముగాని, శాస్త్రీయంబైన ప్రయోజనంబునకై కాదని యెఱుంగునది. ఇట్టి శబ్దంబులయంతమందు హల్మాత్రములేయని గ్రహింపవలెను.

**4.** సూ—అత్తునకు సంధిబహుళముగా నగు.

మేన ... ... అల్లుఁడు ... ... { మేనల్లుఁడు / మేనయల్లుఁడు }

పుట్టిన ... ... ఇల్లు ... ... ... { పుట్టినిల్లు / పుట్టినయిల్లు }

చూడక ... ... ఉండెను...... ... { చూడకుండెను / చూడకయుండెను }

బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమసంబోధనాంతంబులకుసంధిలేదు.

అమ్మ ... ... ఇచ్చెను ... ... అమ్మయిచ్చెను
దూత ... ... ఇతఁడు ... ... దూతయితఁడు
చెలువుఁడ ... ఇందను ... ... చెలువుఁడయిందను

సంస్కృతీయంబునకు సంధియగునని యధర్వణాచార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వ కావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు-ఆధునికకృతులందొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకుసంధిగానంబడీయెడు-గంగనుకాసె- నెలఁతిచ్చెను-వెలయాల్వాదులసంధిలేమిబాహుళకముచేత నేయని యూహింపనది.

వ్యా.—హ్రస్వమైన అకారమునకు సంధి బహుళముగా నగును. బహుళమనగా సంధినిత్యముగా వచ్చుట (ప్రవృత్తి), సంధియెంత మాత్రమునురాకుండుట (అప్రవృత్తి) సంధివచ్చి యొకరూపమును, రాక మఱియొక రూపమును, గలుగుట (విభాష), ఆయావిధి సూత్రములలోఁ జెప్పినచోటునం గాక యన్యత్ర వచ్చుట (అన్యదేవ) శ్లో॥ క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ। విధేర్విధానం బహుధాసమీక్ష్య చాతుర్విధంబాహుళకంవదంతి” అని కాశికావృత్తి కారవచనము. దీని నాలుగువిధంబులకును నుదాహరణంబులు ముప్పదియెనిమిదవసూత్రిమునొద్దఁ జూపంబడును. ఉ. మేనల్లుఁడు, మెనయల్లుఁడు (మేన + అల్లుఁడు) ఇయ్యవి సంధివిభాష (వైకల్పికము) కునుదాహరణములు. మొదటి యుదాహరణంబులో సంధికలిగినది. రెండవదానిలో సంధిలేక పోవుటచేత యడాగమము వచ్చినది; కనుక రెండురూపంబులు. ఇల్లే పుట్టినిల్లు, చూడకుండెను మొదలైనయుదాహరణంబులు. (సూ) బహుళగ్రహణంబుచే స్త్రీవాచకతత్సమ సంబోధనాంతంబులకు సంధి లేదు.

వ్యా.—బహుళమని చెప్పుటచేత స్త్రీవాచకములకును, (స్త్రీలింగార్థమిచ్చునట్టి శబ్దములు) తత్సమపదంబులకును, సంబోధ నాంతంబులకును, (సంబుద్ధిప్రత్యయ మంతమందుగలశబ్దములు) సంధియెప్పుడును రాదు. ‘అమ్మ’ ఇయ్యది స్త్రీవాచకము. ‘దూత’ ఇయ్యది తత్సమము. చెలువుఁడ! ఇయ్యది సంబోధనాంతము. ఈశబ్దములయంత్యాకారంబునకు సంధి రాదని భావము. (మూ. వ్యా.) సంస్కృతశబ్దములచివరనున్న యచ్చునకు సంధికలుగునని యధర్వణాచార్యులు చెప్పిరి; కాని యట్లు సంధికలుగుటకుఁ బూర్వగ్రంథంబులయందుఁ బ్రయోగము మృగ్యంబు (వెదుకఁ దగినది.) శ్లో॥ “భవంతి కేచిచ్ఛబ్దాస్తు సాంగత్యైనైవసాధనః। కుత్రచిత్సంస్కృతీయోఽపి ప్రాణోప్యత్రిమ్యతో భవేత్”

అథర్వణాచార్యవచనము. (సూ-వ్యా) ఇప్పటిప్రబంధములయందు (కృతులయందు) ఒకానొకచోట స్త్రీవాచకంబునకును, తత్సమంబునకును, సంధిగనంబడుచున్నది. ఉదా. గంగనుకాసె (గంగ + అనుకాసె) గంగ శబ్దము తత్సమంబుగావున నిది తత్సమసంధి నెలంతిచ్చెను (నెలంత + ఇచ్చెను) ఇది స్త్రీవాచకసంధి. వెలయాలు మొదలైనవాని యందు సంధిలేకపోవుట బహుళ మనుటచేతనే యని యూహింపనగునది. అనఁగా "వెలాలు" అను రూపము కాదని భావము. తే. గీ. "కొమ్మ పొత్తిలఁ బడిసెత కొమ్మ యింద మనుమని చ్చెదాఁ దెచ్చిన యంబరములు" భార-విరా. 5ఆ. ఇందు "కొమ్మ యిందము" స్త్రీవాచకసంబోధనాంతంబుల కుభయంబులకును సంధిలేమికి యుదాహరణము. ద॥ "అమునకనుండియుం బడిలమై వదలం బెడు కోటనొప్పు ప్రా| ల్చెదని కడంకదంచెనపుఁజేతుల గంగనుకాసె దూలఁగా" ఆము. 2ఆ. (గంగ + అనుకాసె) చ. "వడఁకు పెకాని చేష్టుడఁగె నక్కము పక్షులు జానువుల్ చోరన్" ఆము-4-ఆ (చేష్ట + ఉడిగె) శా. "ఈ బ్రక్కన్ ద్విజుఁ జూడరయ్య సభనారీరంగభర్త్రందు ఆము. 6ఆ. రంగభర్త + అందు) ఇట్టి తత్సమాకారసంధి ప్రయోగంబులు కూడఁ గ్వాచిత్కంబుగా నున్నవి. అకారాంతంబులకు "ఆను, అంత, అయ్య, అమ్మ, అప్ప, అక్క, అన్న" మున్నగువాని యచ్చులు పరంబగునప్పుడు సంధి నిత్యమని పెక్కువ్యాకరణంబులు ఘోషించుచున్నవి; కాని "ఆకు" అను శబ్దము పరంబగునపుడు సంధి లేమియు నిరశంబుగా నున్నది. శా॥ "పా| టింతు ర్పెద్దలు తద్దనమ్మి నుయిదాఁటేవానికిం జింత యూకంతైనన్" పాండు-4ఆ. ఇకారాంతస్థలంబులలో నాకుశబ్దము పరంబగు నప్పుడు సంధిశ్రుతి కటువుగా నుండును; కాన 'ఉ॥ తా| టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాపమంచు" క॥ "మట్టాకున బండెడుదోర| నుట్టానికి రెండుకాళ్లు కోడికివలెనే" మొదలైనవాని యందు "తాటియాకు, మట్టియాకు" అని ప్రయోగించుటయే రమణీయము. "ప॥ ఉదరమునందు విశ్వమును నున్నది వెల్పలకున్నమి మ్మెయిన్ బొదలిన మఱ్ఱియాకుపయిఁ బోఁచెప్పుబాలుఁడవై" హరి-ఉ-9ఆ. "సీ॥ అలరుల ఫణి పీచుల భ్రమంబు నుడిరావియాకుసెకత మంటులతను దోనలు" రుక్మాం-1ఆ. "సీ॥ ఈవఱ్ఱియాకు కొకోర్యేకార్ణమున నాఁడు శేషాహి శాయికి సెజ్జమయ్యె" భో-2ఆ. పరిమాణార్థమైన "అంత" యను తెలుఁగు శబ్దంబుపరంబగు నపుడు ప్రాయికంబుగా సంధి సర్వత్ర నిత్యంబు. ఉదా. కొంచెంత-గోరంత - "తనయంత" ఇత్యాదుల యందు వైకల్పికంబుగ గానంబడుచున్నది. "సీ॥ గీ॥ కానగాఁ దమ్ము వేడుపోగ డ్తురాస| పడెక తనయంత జగములఁ బరఁగుచుండు' నిర్వ -1ఆ. పైని స్త్రీవాచకముమున్నగు వారి మూడింటికే సంధికూడదని గ్రంథకర్తగారి యభిప్రాయము; కానియేవార్థకంబైన (అం, రణార్థకంబైన) యకారంబునకుఁ గూడ నమ్మ పరంబగునపుడు సంధిలేదని గౌణుం

గపది. ఉదా. నీవయనుంగుంజెలివి. ఇచ్చట సంధి కూడదు. అకారంబునకు. "పుట్టినిల్లు" ఇత్యాది కర్మధారయ మందే కాక యితరత్రసహితము సంధి మాప్టెడి. "గీ పాండవజ్యేష్ఠునకుఁ బ్రీతిఁ బరవఁ యావరాజ్యమిచ్చితి కురువృద్ధరాజులొద్ద" భార ఆఁ- 6ఆ. "సీ॥ ఉగ్రమృగంబులయుదరంబులోనున్న దానవేనీతల్లిదండ్రులొద్ద" భార- ఆర- 2ఆ. "గీ॥ సాక్షిగాఁగ మీకు సకలవృద్ధ। రాజులొద్దనరజ్యమిచ్చితి" భార-ఆది-8 ఆ" క॥ పుత్రులుఁ బౌత్రులుఁ భ్రాతలు। మిత్రులనరు రాజులాజ్ఞ మీఁద నో టక" భార-విరా-1ఆ. ఉ॥ అమ్మలఁగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పెద్దమ్మ సురారులమ్మ కడుపారఁబడి పుచ్చిన యమ్మ నిన్నులో।నమ్మిన వేల్పుటమ్మల మనంబున నుండెడి యమ్మ దుర్గ మా యమ్మ కృపాబ్ధి నీవుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్" భాగ-ప్రథమ. "క. చదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ" భాగ-సప్త-"గీ॥ తామరసనేత్ర తలిండ్లు బంధువులుగారె" మను-2ఆ.

5. సూ—ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగానగు. ఏమి, మఱి, కిమష్టి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి. ఇది యాకృతి గణంబు.

ఏమి ... ... అంటివి ... ... { ఏమంటివి / ఏమియంటివి

మఱి ... ... ఏమి ... ... { మఱేమి / మఱియేమి

హరికిన్ ... ఇచ్చె... ... ... { హరికిచ్చె / హరికినిచ్చె

వ్యా.— ఏమి మొదలగు వానియొక్క హ్రస్వమైనయికారమునకు సంధి వైకల్పికముగా నగును. ఉదా-ఏమంటివి, ఏమియంటివి(ఏమి + అంటివి) ఇట్లే హరికిచ్చె మొదలయిన యుదాహరణములు. "కిమష్టి" అనఁగా షష్ఠీవిభక్తియైన కివర్ణకము. ఆకృతి గణంబు= పోలికచేత నూహింపఁ దగినపదసముదాయము. ఇకార సంధి గల యార్య కవి ప్రయోగంబుల ఏమ్యాదులలోఁ జేర్చుకోవలసినదని భావము. ఆంధ్రభాషా భూషణమును "బంతిని" (బంతి + ఇని) అనుదానికిని, సర్వలక్షణసార సంగ్రహమందు "ఆనతిమ్ము, మగనాలు, పురుటాలు, బండెద్దు, పెండ్లాడి, వెంటుంగరము పైఁజందెము, తండ్రేరి" మొదలయిన వానికిని, వికల్పసంధి గలవని యున్నది.

ఇటలాక్షణికుల ప్రయోగంబు లారయునది. విరుద్ధప్రయోగంబులు కనఁబడినంత మాత్రన ధారాళముగా సాధువులని యెంచఁగూడదు. అహోబలపతి "మగనాలు" అనునది ఇకార నిత్యసంధికి నుదాహరణ మిచ్చెను. "సీ॥ ఓర్కిమైమునుప్పిడి రూపవాస ముండనీ మగనాలి సరిఁబోల్పఁ దగమనిగన" కాశీ-2 ఆ. ఉ. ఆసమయంబున న్నగని సూంద్రుడును గన్యలు నాక సొచ్చిరా । శ్రీసురరాజ సైన్యలను దేవసతీయుక యెల్ల బోటులన్" ఉత్తరరామాయణము. ఇచ్చట "మగని మాలు" అనియుం గలదు ఇంకను, ఉ. "ఉండుదు నట్లుగానఁ దేవొంది యరంగు" భార-ఉద్యో 1 ఆ. ఉ॥ ఆతెలి వెందునుంగలదె యండలి నాయను లెవ్వఁడొక్కమా । చేతుల మేటపుత్తుమను చిత్తమకాని చలింపరేమియున్" భార-ఉద్యో-2 ఆ. "ఇదె యొక్క జేలనీవు మదినె య్యడగోరినఁ గ్రేయుమువాఁడ" భార-ఉద్యో-1 ఆ. "గీ॥ కడఁ యనువునఁజేసి ప్రాయ్యుకుడుఁ గాని । కత్తిగొప్పరి యనుగనేఁ గట్టియలను" భార-విరా-1 ఆ. "ఉ॥ ఇట్టితెం। దివ్వెధఁ బొందెనో జగము లెల్లను నేలఁగఁ జాలు తేజమా" భార. విరా 1 ఆ "క॥ తలపొంద యుధిష్ఠిరనిలు । నిలుమని రథసమునఁదాఁకునీసుతుఁగని" భార-ద్రోణ 5 ఆ. "క॥ వలసినఁగడకేగెద । నీరలఁ బెయ్యది యానతిమ్ము ధరణీనాథా" భార. విరా 1 ఆ. "సీ॥ తెలివొంది మనసు నిశ్చల వృత్తిసేయ కాగ్రమై యున్కిగోరి నిష్ఠాతిశయము" భార. శాంతి 4 ఆ. "క॥ ఇరఁడని తలంచి మిగుము । గ్రతినొంపఁగ శల్యుపైఁ బఁగను దోయియున్" భార-శల్య 1 ఆ. "గీ॥ కడిసి దెబ్బదిను కాండంబు లాతని । మేనఁబఱపి యుబ్బుమిగిలినవ్వ" భార. ద్రోణ 4 ఆ. "గీ॥ అలువదేను తూపులనతింపనతికె వ । కర్ణుర వేశ్వరుండు గార్ముకంబు" భార-కర్ణ 2 ఆ. "సీ॥ ఒక నాఁడు తీర్థోప యోగిగాని శతుండు నావల ధరియించు నభ్రగంగ । నాప్రొద్దు ప్రాయి రాజనట్టి నిర్వేదయు భోగంబు లైశ్వర్యము లెనిమిదియు" పాండు. 1 ఆ. "ఉ॥ మేలు బలా బలానుజఁడు మేటి సువిాయబలా బలా రియుం । బాలఁడు వాని వైఖరులు సారమతిన్నతి సేయ నట్టిగో । పాలసహాయుఁ గోరి" రుక్మి. 2 ఆ. "ఉ॥ కంపలింపఁ బాపములఁ గీల్కొనఁ జేసిన యట్టి చిన్నపెఁ । పెండలు గన్నుగిల్లమున నాడును నల్లనఁ జేరవచ్చి" రాజశే. 1 ఆ. "తే॥ గీ॥ తిత్తసంధుంగరము ప్రేలహత్తి యొప్ప" హంస. 4 ఆ. ఇత్యాది ఇకారసంధి ప్రయోగంబులు బాహుళకంబుగా నగపడుచున్నవి. ఇఁకను గవిత్రయేతరగ్రంథంబులయందున్నవో యిట్టిప్రయోగంబులు లెక్కకు మిాఱియున్నవి.

6. సూ—క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు.

వచ్చిరి ... అప్పుడు ... ... { వచ్చిరప్పుడు<br>వచ్చిరియప్పుడు

| | | | |
|---|---|---|---|
| వచ్చితిమి... | ... ఇప్పుడు | ... ... | వచ్చితిమిప్పుడు<br>వచ్చితిమియిప్పుడు |

వ్యా.—క్రియా పదంబులయందు హ్రస్వంబైన యికారమునకు సంధి వైకల్పికము. ఈసూత్రంబునకు వక్ష్యమాణ సూత్రంబు బాధకంబుగావునఁ బ్రథమోత్తమక్రియలయికారంబు దీనికి విషయంబని యెఱుంగునది. ఉదా. వచ్చిరప్పుడు, వచ్చిరియప్పుడు, వచ్చితిమిప్పుడు, వచ్చితిమియిప్పుడు.

7 సూ.—మధ్యమపురుష క్రియలయందిత్తునకు సంధియగును.

| | | | |
|---|---|---|---|
| ఏలితివి | ... ... అపుడు | ... ... | ఏలితివపుడు |
| ఏలితి | ... ... ఇపుడు | ... ... | ఏలితిపుడు |
| ఏలితిరి | ... ... ఇపుడు | ... ... | ఏలితిరిపుడు |

వ్యా.—మధ్యమ పురుషక్రియలయందు హ్రస్వంబైన యికారమునకు సంధి కలుగును. అనఁగా నిచ్చట సంధినిత్యము. ఉదా. ఏలితివపుడు. (ఏలితివి + అపుడు) ఇట్లే, ఏలితిపుడు, ఏలితిరిపుడు మొదలైన యుదాహరణంబులు. ఇచ్చట నిత్యము గావున. "ఏలితివియపుడు" అని చెప్పఁగూడదు: కాని "చ॥ ఇదె శమవాఙ్ఞఁ ద్రోచితిరియెన్నటనుండిట వచ్చినారలు" అను ప్రయోగము విసంధిగాఁ గనఁబడు చున్నది. ఇప్పద్యము కవులషష్ఠమునం దున్నట్లు సర్వలక్షణసారసంగ్రహమందుఁ గలదు. ఇట్టి ప్రయోగములు నిరాకరంబులు. ఆంధ్ర శబ్ద చింతామణి యందో మధ్యపురుషేకారంబునకు సంధి "నిత్యమనుత్తమపురుష క్రియాస్వితః" అను సూత్రముచేత విధింపఁబడినది. సూత్రార్థము—"అనుత్తమపురుష క్రియాసు = ఉత్తమపురుషవ్యతిరిక్తక్రియాపదంబులయందు, ఇతః = హ్రస్వేకారంబునకు నిత్యమ్ = నిత్యముగా సంధియగును" అని పూర్వులు వ్యాఖ్యానము చేయుచు ప్రథమోత్తమపురుషంబులు కిమాదిగణంబులోనివిగాన వాని యికారంబునకు సంధివికల్పమని వ్రాసి దానికిఁ బ్రోద్బలంబుగా "ప్రథమేచోత్తమే చైవ క్రియేతో వా భవేద్యతిః। నిత్యవద్వ్యస్యవికృతౌ క్వాప్యర్థేతో నభవేత్సదా" అను నథర్వణకారికలను బ్రమాణముగాఁ జూపిరి. అప్పతిస్మృకవ్యాదులు మూలసూత్రమునందు "అనుత్తమపురుషక్రియాసు" అని యుత్తమపురుషనే వర్జించినందున మధ్యమపురుషేకారంబునకుం బోలెఁ బ్రథమపురుషేకారంబు

నకును, నిత్యసంధి రాఁగల దనుటకును "మ. బలభిద్వహ్నిపరేతరాజవరుణుల్ పర్యుత్సుకత్వంబునం। దిలఁగూర్చుండిరి యొండొరుంగదిసి యద్దివ్యప్రదేశంబున। న్నలనాళీకమృణాలనాళలతికానవ్యప్రణాళీమిళ।ల్లలనాలాపకథాసుధానుభవలీలాలోలచేతస్కులై" నైష - 3 ఆ "క. విరచించెను శ్రీనాథుఁడు। ధరణిని శృంగారనైషధంబున గూర్చుండిరి యొండొరునని కానక। పరపురుషక్రియలఁ బ్రకృతిభావముగలదే" అప్ప-5 ఆ" అని ప్రథమపురుషంబులకు సంధి కూర్చని శ్రీనాథాదికవీంద్రుల నాక్షేపించిరి. అయ్యది యతిసాహసంబు. "నిత్యమనుత్తమపురుష క్రియాస్వితః" అను సూత్రంబులో నుత్తమశబ్దంబుచేత నుత్తమపురుషంబును, పురుషశబ్దంబుచేఁ బ్రథమపురుషంబును, గ్రహింపఁబడును. అట్లుగాక యీసూత్రంబునందు నొక యుత్తమపురుషనే వర్జింపఁ దలంచినయెడల 'నిత్యమనుత్తమ క్రియాస్వితః" అనియే లాఘవముగా సూత్రము చేయవలసియుండెఁగా వ్యర్థంబుగాఁ బురుషశబ్దంబు సూత్రంబులోఁ గ్రహించుట యేమిప్రయోజనంబు? కావున సూత్రగతమైన పురుషశబ్దంబుచేత 'ప్రథమాతిక్రమణే కారణాభావాత్' అను న్యాయంబునఁ బురుషంబులలోఁ బ్రథమంబైన ప్రథమపురుషంబు గ్రహింపఁబడును. కావున 'ఉత్తమ ప్రథమపురుష క్రియలఁ ఇకారంబునకుఁ దక్క మధ్యమపురుషేకారంబునకు సంధి నిత్యముఁ' అనిన యర్థంబు ఫలించుచున్నది. పై సూత్రంబునకు నట్టియర్థంబు నూహించియే యథర్వణాచార్యులు 'ప్రథమేచోత్తమేచైవ' ఇత్యాది పూర్వోక్తకారికను విరచించియుండిరి. కాన నక్కారికశబ్దశాసనసమ్మతంబుగాని యపూర్వంబుగాదు. పూర్వోక్తసూత్రంబులోఁ బురుషశబ్దంబు నుచ్చరించిన వాగనుశాసనునికి నట్టితాత్పర్యంబున్నది యన్నందులకు నీక్రింది హేతువులు కూడ నిదర్శనముగా నున్నవి. ఆంధ్రశబ్దచింతామణి, హలంత పరిచ్ఛేదము, సూత్రము 37 "పరేషాంతు ప్రథమోత్తమమధ్యమవత్" 38 సూ. "బహుషు మధ్యమవత్" క్రియాపరిచ్ఛేదము. 18 సూ. 'ప్రథమైకవచనలోపస్తద్ద్వితీయోః క్రియాణాం స్యాత్' 25 సూ. "ఉత్వయుతో నకారో స్యాతాం మధ్యోత్తమైకవచనానాం" ఇత్యాదిసూత్రములయందుఁ బురుష శబ్దంబు లేకుండనే సూత్రలాఘవంబునకై యుత్తమమధ్యమాదిశబ్దంబులే సూత్రంబులోఁ బ్రయోగింపఁబడినవి. కాబట్టి తక్కిన సూత్రంబులకు విరుద్ధముగా మధ్యమపురుషసంధిసూత్రంబులో నుత్తమశబ్దంబే కాక పురుషశబ్దంబుచ్చరించుట ప్రథమపురుష సంగ్రహణార్థంబని స్పష్టంబగుచున్నది. క్రియాపరిచ్ఛేదములో "తిఙ్ంత్యనామకాస్స్యుర్మధ్యమపురుషాశ్చయేరమాంతాశ్చ" అనుముప్పదియేడవ సూత్రములోఁ గూడఁ బురుషశబ్దంబునకు సార్థక్యంబు గలదు. ఈసూత్రంబులో 'యేరమాంతాశ్చ' అను రెండవ వాక్యములోనికిఁ బూర్వవాక్యంబులో నున్న 'మధ్యమ పు

గుషాః' అను పదంబులోని పురుషశబ్దంబనుసరించి శేషమకారాంతంబులైన పురుషంబులుగూడ 'తిఙస్మన్య, సంజ్ఞ కలవియగును: అనినయర్థంబిమ్చును. కాన నిచ్చటి పురుష శబ్దంబున్వర్థంబుగాదనియెఱుంగునది. అథవా, స్థానేంతరతమ (1-1-49)సూత్రభాష్యప్రదీపోద్ద్యోతమున (376 పుట.) "ఉత్తమే—ప్రత్యక్త్వరూపాహంకారాత్మకచేతనధర్మః॥ మధ్యమే—అనహంకారాస్పదచేతనధర్మః పరాక్త్వమ్, ప్రథమేత్వ నియతమ్'' అని చెప్పఁబడెను.

నియతచేతన, ధర్మసాదృశ్యంబున ఉత్తమపురుషభిన్నంబగు నియతచేతనధర్మంబుగల మధ్యమపురుషము యొక్క ఇకారమునకే నిత్యసంధియగు. ప్రథమపురుషమునందలి చేతనధర్మ మనియతము

8 సూ. క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు.

వచ్చి ... ... ఇచ్చెను ... ... వచ్చియిచ్చెను.

వ్యా. క్త్వార్థకమై హ్రస్వంబైన యికారమునకు సంధికలుగదు. ఉదా. వచ్చి యిచ్చెను. (వచ్చి + ఇచ్చెను) ఇచ్చట 'వచ్చిచ్చెను' అని యనఁగూడదు. అడిదము సూరకవి తనకవిసంశయ విచ్ఛేదమందలి ప్రథమతరంగమునందు'గీ॥ ఇడగవచ్చును ల్యప్పపైనిత్యసంధి| మాత్ర మొక్కొక్కచోటనుమట్టుమీఱఁ! గొలుతు నఘుమడంపఁగోరిందు శేఖరు| నన్నయట్లు కవిజనానుమతిని' అను లక్షణమును జూపి కొన్నిలక్ష్యంబులను జూపిరి. అట్లుచూపిన లక్ష్యంబులలో రెండు భారతములోనివి. 'క॥ ఇతఁడు మదీయాగ్రపురో| హితుఁ డితనికి నెల్లపనులు నెఱిఁగించిపుడే' భార-ఉద్యో-1. ఆ. పెక్కింటియందు 'ఎఱిఁగించి తగఁగ' అను పాఠముగలదు. 'క॥ నమ్ముమ్ముకైదువు మోపగు జమ్మిపెనంబ్రాఁకిపిడిచి చాపము నాకం| దిమ్మనుఁడుజేయునదిలే|కమ్మగుండమ్మహీజమలసతెనె క్కెఁ' భార-విరా. 4ఆ. ఇప్పద్యమునందలి 'అందిమ్ము' అను ప్రయోగమును జూచి పెక్కురు క్త్వార్థకంబని భ్రమపడుచున్నారు; కాని యియ్యది 'నిలుచుంకి' మన్నగువానివలె ధాతుపల్లవంబని యూహించుట సుకరము. (సీ॥ తమసేఁగి జెప్పలోదయ మీఱవిని శ్రీరఁజించిచ్చు వారి దీవించువారు'ఆశ్వ-6-ఆ. (మ॥ వెఱచిట్లం

బుధినాథనందనులు దోర్వీర్యంబు సాలించియుం। దలుపాడంగ నిశాచరేంద్రుఁడు జయోత్సాహంబునన్ వెన్నడిచె। దలుముంగా' నిర్వ-5ఆ. ('వెంచనిట్లంబుధి' అనిపాఠాంతరము) ఉ॥ ఎటంగెటంగినా! నలువిదయేల కట్టుకొని వచ్చనుదానని, భాగ-9-స్క-౦స. క. ఎటఁగెటఁగియుండియకటా। కొలువిందలఁ గోఁకు కొనుబకుం దలపెట్టెన్' రాజశే-2ఆ. 'శా॥ నేఁడే తెంపు ప్రియత్న మున్న నకటా నీచేరఁ జెప్పింపఁడే' ప్రభా-4ఆ, ('చెప్పింపఁడే' అని కల్పితపాఠము) 'ఉ॥ ఇచ్చెదెడం బదార్థ మడిగిచ్చనో తాదయసేయఁ గాదన। న్వచ్చనో' విజయ-1ఆ. 'చ. అనవలసంటిగాఁ కెటుఁగవా యొకమాటనె మర్త్యకర్మముల్' విజయ-1ఆ. చ॥ మీ। రిదశమునాజ్ఞఁ ద్రోచితిరి యెక్కడినుండిట వచ్చినారు, కవుల పద్యము. చ॥ నిగిడెరువైపులన్ వెసలనేటయి నీటగుపీటకోటడాల్, శుద్ధాంధ్రరామాయణము (అడిదము భాస్కరకవివిరచితము) 'ఉ॥ ఆ। హానిపుణోక్తులుం జెనక నాబిడ మాచిటు రమ్మటన్నచో' హంస-6ఆ ఈప్రయోగంబులు నిరాకరంబులు.

**9. సూ—ఇకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధిలేదు. ప్రథమేతర విభక్తి విధినిరవకాశంబుగావునదీనిని బాధించెడిని.**

| | | | | |
|---|---|---|---|---|
| వచ్చున్ | ... ... | ఇపుడు | ... ... | వచ్చునిపుడు |
| చూడన్ | ... ... | అయితి | ... ... | చూడనయితి |
| ఉండెడిన్ | ... ... | అతఁడు | ... | ఉండెడినతఁడు |

ఇఁక - ఇఁగ - ఎట్టకేలకు - ఎట్టకేని - ఈయవి యికాదులనియెఱుంగునది, వీనికిసంధివైకల్పికము.

వ్యా.—ఇఁక మొదలైనశబ్దంబులకుఁ గాక ద్రుతమంతమందుఁగల శబ్దంబులకు సంధిలేదు. ప్రథమేతరవిభక్తి సూత్రము (రెండవసూత్రము) అవకాశములేని దగుటంజేసి యీసూత్రమును బాధించును. అనఁగా రెండవసూత్రమునందుఁ బ్రథమేతరవిభక్తుల కును, వర్తమానార్థక చువర్ణకంబునకును, సంధివైకల్పికమని చెప్పంబడియె. ఆయుభయంబులును, ద్రుతప్రకృతికంబులు. ఈతొమ్మిదవసూత్రంబులో "ఇఁకాదులకుఁ దప్ప

దుప్రతప్రకృతికంబులకు సంధిలే" దని శాసించుటంజేసి ప్రథమేతరవిభక్త్యులందును; చూర్ణకస్థలంబునందునుసయితము సంధిలేకపోవలసియుండును. అట్లయినచో సంధిప్రకరణంబులోని రెండవసూత్రము (ప్రథమేతరవిభక్తివిధి) నిరవకాశంబగును. అనఁగా నుదాహరణములేక వ్యర్థంబగును; గాన నిరవకాశంబయిన యీ రెండవసూత్రము "వచ్చని పుడు" ఇత్యాది ద్రుతప్రకృతిక స్థలంబులలో సంధి రానీయక సార్థకంబైన యీనవమసూత్రంబును బాధించునని భావము. "వచ్చునిపుడు" అనుదానింబలె ఉండెడినతఁడు, చూడనైతి మొదలగు మిగిలిన యుదాహరణంబులు గ్రహించుకొనునది. ఇఁక ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని: ఇత్యాది యిఁకాదులు వీనికి సంధి వైకల్పికము. ఉ. ఇఁకనైన, ఇఁకైన. ఇట్లే ఇఁగ మొదలైన యుదాహరణంబులు.

10. సూ.—అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగనగు.

ద్విరుక్తముయొక్క పరరూపమామ్రేడిత మనంబడు॥ తఱుచుగ ననుటచేత నొకానొకచోట వైకల్పికసంధియుంగలదని తాత్పర్యము.

| | | |
|---|---|---|
| ఔర... ... ... | ఔర ... ... | ఔరౌర |
| ఆహా ... ... | ఆహా ... ... | ఆహాహా |
| ఎట్టూ... ... ... | ఎట్టూ ... ... | ఎట్టెట్టూ |
| ఓహో ... ... | ఓహో ... ... | ఒహోహో |
| ఏమి ... ... ... | ఏమి ... ... | ఏమేమి / ఏమియేమి |

ఏగిఏగియనుచో క్త్వార్థంబగుట సంధిలేదు.

వ్యా.—అచ్చునకు నామ్రేడితము పరంబగునపుడు సంధి తఱుచుగఁ గలుగును. రెండుమాఱు లుచ్చరింపఁబడు దానిలోని రెండవది యామ్రేడితమనంబడును. ఉదా. ఔరౌర (ఔర + ఔర) దీనిలోని రెండవ "ఔర" అనునది యామ్రేడితము. తఱుచుగ ననుటచేత వైకల్పికముగా సంధి కలుగునని భావము. "ఆమ్రేడితంద్విస్త్రిరుక్తం" అను

నామలింగానుశాసనవచనంబువలన రెండుమూఁడుమాఱు లుచ్చరింపఁబడిన శబ్దంబులలో నన్నింటికిని నామ్రేడితమనునర్థముసుచుండినను వ్యాకరణపరిభాషచే దుదిశబ్దంబునకే యీసంజ్ఞ చెల్లునని తాత్పర్యము. ఈసూత్రంబునందు "తఱుచు" అనుశబ్ద మువయోగించుటచేత "ఏమేమి" (ఏమి + ఏమి) ఇత్యాదులయందు వైకల్పికసంధియు. "ఏగి యేగి" (ఏగి + ఏగి) ఇత్యాది క్త్వార్థంబులయందు సంధ్యభావంబును, నిర్బాధము. "ఆహాహా", ఓహోహో, ఎట్టెట్టు మొదలైనయుదాహరణంబులు "ఔరౌర" అనుదానివలె గ్రహింపవలెను.

11. సూ.—అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు.

| | | | | |
|---|---|---|---|---|
| మూర | ... ... | ఎఁడు | ... | మూరెఁడు |
| వీసె | ... ... | ఎఁడు | ... | వీసెఁడు |
| అర్థ | ... ... | ఇంచు | ... | అర్థించు |
| నిర్జి | ... ... | ఇంచు | ... | నిర్జించు |

అంద్వవగాగమంబులు పరంబులగునపుడు యథాసంభవము గా గ్రహించునది - రాములందు - రాములయందు - హరియందు - ఎనిమిదవది - ఎనిమిదియవది.

వ్యా.—విభక్త్యంతము కానిశబ్దముయొక్క మొదటియచ్చు పరంబగునపుడు సంధివచ్చును. "అందు, అవ" ఈశబ్దంబులు విభక్త్యంతములు కాకపోయినను బహుళ సంధింబొందవచ్చును. ఉ. మూరెఁడు (మూర + ఎఁడు (ఇచ్చట "ఎఁడు" అనునది పరిమాణార్థకమైన ప్రత్యయముగాని, విభక్త్యంతముకాదు.? కావున సంధికలిగినది. అర్థించు) (అర్థ + ఇంచు) నిర్జించు (నిర్జి + ఇంచు)" ఇచ్చట "ఇంచు" అనునది యాగమముగాని విభక్త్యంతముగాదు. కావున సంధికలిగినది. "అందు, అవ,, అనునవి పరంబగునపుడు కవి ప్రయోగానుసారంబుగా గ్రహింపవలెను. అనఁగా "అందు" అనునది పరంబగునప్పుడు "హరియందు" మొదలగువానియందు సంధిలేమియు, "రాములందు

రాములయందు,, మొదలైనచోటులందు వైకల్పికసంధియుఁ గలుగును. అవగాగమంబు పరంబగునపుడు "ఎనిమిదవది, ఎనిమిదియవది. తొమ్మిదవది, తొమ్మిదియవది. పదవది పదియవది" ఇత్యాదులయందువికల్పంబును. "పగునొక్కటవ" ఇత్యాదులనిత్యంబును సిద్ధించును.

12. సూ —కుఱు చిఱు కడు నడు నిడుశబ్దముల ఱ డ లకచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు.

| | | | | |
|---|---|---|---|---|
| కుఱు | ... ... | ఉసురు | ... ... | కుట్టుసురు |
| చిఱు | ... ... | ఎలుక | ... ... | చిట్టెలుక |
| కడు | ... ... | ఎదురు | ... ... | కట్టెదురు. |
| నడు | ... ... | ఇల్లు | ... ... | నట్టిల్లు |
| నిడు | ... ... | ఊరుపు | ... ... | నిట్టూరుపు |

వ్యా. "—కుఱు, చిఱు, కడు, నడు, నిడు" అనుపదంబులయొక్క తుదమన్న ఱ డ లకు నచ్చుపరమైనపుడు ద్విత్వటకారమగును. ఉ. కుట్టుసురు (కుఱు + ఉసురు) ఇచ్చట నచ్చుపరమైనది. కావున "కుఱు" అను దానియందలి శకటరేఫమునకు టకారద్విత్వమువచ్చును. అప్పుడు "కుట్ + ట్ + ఉ + ఉసురు" అనియగును తరువాత టకార ద్విత్వము పదాంతమైన యుకారముతో మిళితంబై "కుట్టు + ఉసురు" అనియగును. పిమ్మట ఉకారసంధిచే "కుట్టుసురు" అనియగును. (కుట్టు + ఉసురు) ఇట్లే నట్టిల్లు, నిట్టూరుపు, చిట్టెలుక, కట్టెదురు మొదలైన యుదాహరణంబులు గ్రహించునది. "క. కడునెండయెక్కునంతకు । నడుగక యచ్చనుప నడిచి యుగాిటవిలో" భార—ఆర—2ఆ. క॥ కడునధికుతోడఁ దొడరినఁ। బొడిచిన నొడిచినను బురుషపుదుష్ప గుణంబేర్పడుఁగాక "భార—సభా—1ఆ." అనుపద్యములందలి "కడునెండ, కడునధికుతోడ" అనుప్రయోగములందిలకించి "కట్టెండ, కట్టధికుతోడ,, అనియుండందగిన వంచునట్లుండుట దోషమని కొందఱు భ్రమింతురు. కాని యట్లనవలదు. "కడునెండ, కడునధికుతోడ,, అనునపుడు సమస్తపదము (సమాసపదము, కాకవ్యస్తపదము, అసమాసపదము) కావుననే మధ్యసముచ్చయనకారంబు గానిపించుచున్నది. ఈసూత్రములో సమాసవని చెప్పకున్నను నీసంధి సమాసస్థలంబులలోనే వచ్చునని యెఱుంగు

నది. ,,కురు, చిఱు,, శబ్దంబులు క్రమంబుగా కుఱుచ, చిఱుత,, శబ్దంబులయొక్క లుప్త శేషంబులు. ఈలోపమీశబ్దంబులకు వృత్తి యందుఁగలుగును. కొందఱు ,,చిట్టెలుక, చిట్టాముదము, చిట్టుముదు, చిట్టడవి,, ఇత్యాదులయందు ,,చిట్టి,, శబ్దంబని యు, నచ్చుపరంబగునపుడు దాని ఇకారంబునకు సంధి నిత్యంబనియు, హల్లుపరంబగునపుడు వికల్పంబుగానేకటకారంబునకు మాత్రము లోపంబనియు. వక్కాణింతురు. ఉదా. చిట్టిచాపచిటిచాప మొదలైనవి. ,,చిట్టిశబ్దమందలి ద్వితీయటకారము వైకల్పికముగా లోపించుటకుఁ బ్రకీర్ణపరిచ్ఛేదమందలి యెనిమిదవ సూత్రము తోడుకొనునది.

13. ప్రథమమీఁది పరుషములకు గ స డ దవలు బహుళముగా నగును.

| | | |
|---|---|---|
| వాఁడు ... ... కొట్టె ... ... | వాఁడుగొట్టె | వాఁడుకొట్టె |
| అపుడు... ... ... చనియె ... ... | అపుడుసనియె | అపుడుచనియె |
| నీవు... ... ... టక్కరివి ... ... | నీవుడక్కరివి | నీవుటక్కరివి |
| మీరు ... ... తలఁడు ... ... | మీరుదలఁడు | మీరుతలఁడు |
| వారు ... ... పోరు... ... ... | వారువోరు | వారుపోరు |

అప్పుడిప్పుడెప్పుడను శబ్దములు నిత్యైకవచనాంతములు-వాగను శాసనులు యదాతదా యని గ్రహించుట ప్రశంచార్హమని యెఱుఁగునది. ఈ కార్యము కళలగు క్రియాపదములమీఁద సహితము కానంబడియెడి.

వ్యా — ప్రథమమీఁదిపరుషములకు (క, చ, ట, త, ప, లకు) గ, స, డ, ద, వలు బహుళముగా నగును. బహుళశబ్దార్థము నాల్గవసూత్రమున వివరింపఁబడ్డది. ఉదా. వాఁడుకొట్టె, వాఁడుగొట్టె (వాఁడు + కొట్టె) ఇచ్చట కకారమునకు గకారము వచ్చినది. ఈయాదేశము తఱచు వికల్పముగా వచ్చును. ఇట్లే మీరు తలఁడు మొదలైన యుదాహరణంబులు. మీరు తలఁడు (మీరు తొలఁగుఁడు) ఇత్యాది తలఁగుధాతువునుండి వచ్చిన రూపము. ఈరూపము పిలుచు మొదలైనవానికిఁ గ్రియాపరిచ్ఛేదమందలి నూటొక్కటవసూత్రంబున 'తలఁగు' అను దానిలోని యంత్యవర్ణము లోపింపఁగా "తలఁడు" అనియైనది. క. నలుఁడును ధరణీరాజ్యము । తలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గముఁడు । నలరి దమయంతి నోడ్కొని । వెలువడియె "భార, ఆర, 2 ఆ. కొన్ని వ్యాకరణపాఠములయందు "తలఁచు" అని యున్నది. కావున నిచ్చటిప్రకరణమును బట్టి చూచినను, క. "నిలువుము కొలువుము పిలువుము । గెలువుము విడువుమనఁగాఁ దగినబహుళశబ్దం । బులకుం దృతీయవర్ణము । తొలఁగిన దోషంబులేదు తుహినాంశుధరా" అను కవిసంశయవిచ్ఛేదప్రథమతరంగమందలి యిరువదియొకండవ లక్షణమందు నిలుచు మొదలైన శబ్దములరూపు చూచినఁ బ్రకరణంబున నన్నియుఁ జువర్ణాంతధాతువులగుటం బట్టి "తలఁడు" అనునది తలఁచు ధాతువునుండి వెడలిన మధ్యమపురుషప్రార్థనార్థకమని కొందఱ యభిప్రాయము. పక్షద్వయంబును విచక్షణులు విమర్శింతురుగాక! "అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు" అను శబ్దంబులు నిత్యైకవచనాంతంబులని మూలంబులోఁ జెప్పంబడియె. నిత్యైకవచనాంతంబులనఁగాఁ బ్రథమావిభక్తి నిత్యైకవచనాంతంబులనియే గ్రంథకర్తగారి తాత్పర్యము. వేఱొక విభక్త్యంతంబులైనచోఁ బ్రథమావిభక్తిస్థలంబునఁ బ్రవర్తించునట్టి యీసూత్రము క్రింద "అపుడు చనియె" అని యుదాహరణంబుగఁ దీసికొనుట యెట్లు యుక్తంబగు? ఇచ్చట నొకపూర్వపక్షి అపుడులోనైన యవ్యయంబులు ప్రథమావిభక్త్యంతంబులు కావనియు, "శ్లో॥ తిఙ్ఙన్య శేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తిః । కిఞ్చిత్ప్రశంసనాద్యుత్థసన్తాపయదాతదాకిమేవాంశ్చ । క్వాకిలతూష్ణీమాద్యాన్యభినవతికలా ద్రుతోనయేషాంస్యాత్" అని నన్నయభట్టారకుండు కళాశబ్దములను వివరించిన యాంధ్రవృత్తంబులో "సుప్కర్మప్రవచనీయజ విభక్తిః" అని ప్రథమావిభక్త్యంతంబులను గళలనుగాఁ బరిగణించి యావృత్తమధ్యంబులోనే "యదాతదాకిమేవాంశ్చ" అని యదాతదార్థకములైన "ఎపుడు, అపుడు" శబ్దంబులుకూడఁ గళలని (నన్నపార్యుఁడు) నుడివెననియు, నిజంబుగా యదాతదార్థకంబులు ప్రథమావిభక్త్యంతంబులైయుండిన వృత్తారంభంబున "సుప్" అనువిభక్తిని (ప్రథమావిభక్తిని) గ్రహించినందుననే "ఎపుడు, అపుడు" శబ్దంబులును యిత్తమఁ గ్రహింపఁబడునుగానన్నట్లు నిరూపించి చెప్పుట పునరుక్తమనియు, నూహించి

యడుపులోనైనశబ్దంబులు ప్రథమావిభక్త్యంతంబులు కావని పూర్వపక్షము చేసెననియెఱుంగునది. ఆపూర్వపక్షంబునకు "వాగనుశాసనులు యదాతదాయని గ్రహింపుట ప్రపంచారమనియెఱుంగునది" అనిన బాలవ్యాకరణంబులోనివాక్యము సమాధానవాక్యము. అనఁగా నన్నయభట్టారకుండు చెప్పినసూత్రంబులో "సుప్" అను విభక్తిని (ప్రథమావిభక్తిని) గ్రహింటచేతనే యదాతదార్థకంబులును, (ఎప్పుడు, అప్పుడు శబ్దంబులు ప్రథమావిభక్త్యంతంబులు కాఁబట్టి) గ్రహింపఁబడినవనియుఁ, దరిదాపువాక్యములో "యదాతదా" అని గ్రహింపుట ప్రపంచార్థమే. (స్పష్టార్థమే) కానియావశ్యకములేదనియు, భావము. (సూ. వ్యా.) ఈకార్యము (గ, స, డ, ద, వ, విధానము) కర్మణైన క్రియలమీఁదఁగూడఁ గనఁబడును. ఉదా. రారుగదా, రారుకదా (రారు + కదా) ఇందలి మొదటిశబ్దము వ్యతిరేకార్థకప్రథమపురుషబహువచనక్రియ. దీని మీఁద వచ్చిన "కదా" అనుదానియందలి కకారమునకు గకారము వచ్చినది. ఇట్లే మిగిలినయుదాహరణములు. ఈగసడదవాదేశంబులవిషయమై వేరువేఱు మతంబులుగలవు.

"శ్లో. పరుషావాస్వరూపేణ ప్రథమాంతోపరిస్థితాః । కాకోసంబోధనేచాపి హ్యవ్యయేకర్మధారయే । అచేతనార్థకేశబ్ద ఇతిశృంగారభూషణే."

అని శృంగారభూషణమందు, ప్రథమాంతంబులను, "కాకుస్వరబోధకంబులైన "ఎ, ఏ, ఆ" ఇత్యాదులను, సంబోధనాంతంబులను, అవ్యయంబులను, అచేతనార్థకశబ్దంబులను, వెంబడించిన కచటతపలు వికల్పంబుగా గసడదవలగును. కర్మధారయసమాసమందుఁగూడ నీయాదేశము వైకల్పికమని చెప్పఁబడియె. "గీ. కాకుసంబోధనావ్యయ కర్మధార। యంబు లనచేతనంబులనగు వికల్ప। మనియె మనుముద్దరాజు రామనసుల త్య్య । మలువినము కాకుసంబోధనలకు భగ్గ" అని సర్వలక్షణసారసంగ్రహమందుదాహరించి తిమ్మకవిగారు కాకుసంబోధనలపై గసడదవాదేశములు గలిగినందులకు నుదుదాహరణంబులు కనఁబడవని నుడివిరి. కవిలోకచింతామణియందుఁ తాతంభట్టుగారు ప్రథమాంతంబులమీఁది పకారంబునకు, ప్రాసస్థానమందు నిత్యముగా గసడవాదేశమనియు, యతిస్థానమందు రాదనియుఁ దక్కినచోట్లవైకల్పికమనియు, దెలిపిరి. కావున నింకనిట్టి యనేకమతంబులు సంగ్రహింపుటకై సూరిగారు గసడదవాదేశవిధి "బహుళ" మనినుడివిరి. తిమ్మకవీంద్రుఁడు "తే॥ కాకుసంబోధనావ్యయ" అనుపైపద్యములోఁ బరిగణించిన ప్రకారంబుగ నవ్యయముమీఁదను గసడదవాదేశము వికల్పమనుచు "మ॥ వనా। వృత వృత్తంబులుగాని సింహములకున్ వేగంబ చేట్పొందుఁగా। నతగం బొందుట కార్యమీయుభయమున్నంతుష్టిమై నుక్కికిన్" అను భారతోద్యోగ పర్వపద్యములోని

"కానన్" అనిన ద్రుతప్రకృతి కావ్యయముమీఁద నున్న "తగన్" అనుశబ్దమందలి తకారంబునకు దకారాదేశము రాలేదని దీనినుదాహరణముగాఁ దమ సర్వలక్షణసారసంగ్రహమందు లిఖియించిరి. కాని యట్లుపలుకుట యవిచారితరమణీయమని తోఁచెడిని. ప్రకృతంబైన "కానన్" అను నవ్యయము ద్రుతప్రకృతికముగదా; ఇచ్చట "ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగును." అను సంధిపరిచ్ఛేదములోని పదునాఱవసూత్రంబున "తగు" శబ్దతకారంబునకు సరళంబైన దకారాదేశము న్యాయ్యముగుచుండఁగా నిట్టి ద్రుతాంతస్థలంబులో నాతండు గసడదవాదేశంబు శంకించుకొని యవ్యయముమీఁద వికల్పముగాన రాలేదని యెట్లువక్కాణించెను? "క. అమరకృతులందుఁ బ్రథమాంతములపయిన్నిల్చు కచటతపలకు నాదే । శము గసడదవలగు న్ని । క్క్రమ యాత్మస్మృదములు గాక మహేశా" అని సర్వలక్షణసారసంగ్రహమందే ప్రథమాంతంబులపై గసడవాదేశవిధి విధింపఁబడినది. ప్రకృతంబైన "కానన్" అను శబ్దంబు పంచమ్యర్థమును (కానన్=ఆ హేతువు వలన) బోధించునట్టి ద్రుతాంతావ్యయమైయున్నయది. తిమ్మకవీంద్రుండు "అపుడు, ఇపుడు, ఎపుడు" ఇత్యాదులువోలె ద్రుతాంతములు: కాని యవ్యయములమీఁదను గసడదవాదేశము రానియందులకు నుదాహరణము చూపెనేని యెంతయు న్యాయ్యంబుగానుండును. ద్రుతాంతము సరళాదేశంబునకును, కళాశబ్దము గసడదవాదేశంబునకును, విషయంబులని సుప్రసిద్ధంబుగదా! కావున నవ్యయముమీఁద గసడదవాదేశంబునకుఁ బ్రకృతస్థలంబుదాహరణంబుగాఁ జూపుట విమర్శనీయంబు. కొందఱు "కానన్" అనునది ద్రుతాంతమే యైనను మహాకవియైన తిక్కనసోమయాజి నకారలోపము నిపతించి సరళాదేశము రాకుండఁ జేసెననియు; నట్టిప్రయోగంబులకు "నిరంకుశాః కవయః" అను లోకోక్తియె శరణంబనియు, వక్కాణింతురు. మఱికొందఱు పైపద్యపాదంబులో "కానతగన్" అను పాఠంబు ప్రామాదికంబనియు, నచ్చో "కాన తెగన్" అని పఠింపవలెననియు, కాన = వనము. తెగన్ = నశింపఁగా నని యర్థముచెప్పుచు నీరెండు శబ్దార్థంబులకును "వనావృతస్వృత్తంబులుగాని సింహములకున్" అనుపదార్థంబులతో నన్వయంబనియు, (అనఁగా- వనమునశింపఁగా వనముచేత నావరింపఁబడని ప్రవర్తనలుగల సింహములకు శీఘ్రముగాఁ గీడు సంభవించునని యన్వయక్రమము) వనార్థకమైనకానశబ్దంబు ప్రథమాంతమైన కళయైనందున "తెగన్" అనుచోట దకారాదేశము వికల్పముగా రాలేదనియు, వాదింతురు. ఇఁక మదీయాశయంబిట్లు తోఁచెడిని. ప్రకృతపద్యంబునకు మాతృకయైన భారతోద్యోగపర్వసంస్కృతశ్లోకముయొక్క యర్థము, ఆంధ్రీకరించిన పద్యంబులో సరిగాఁ దేఁబడినదో లేదో బింబప్రతిబింబభావవిమర్శనంబునకై సంస్కృతాంధ్రపద్యంబు లుభయంబును నిచ్చటఁ బ్రదర్శింపఁబడును. "శ్లో॥ వనం రాజా ధృతరాష్ట్ర

స్సపుత్రో వ్యాఘ్రాస్తే వైసంజయ పాండుపుత్రాః।......................॥

శ్లో॥ నిర్వనోవధ్యతే వ్యాఘ్రో। నిర్వ్యాఘ్రంఛిద్యతే వనం। తస్మాద్వ్యాఘ్రో వనం రక్షేత్। వనంవ్యాఘ్రంచ పాలయేత్". ఆంధ్రీకృతపద్యములు. "మ॥ ధృతరాష్ట్రుండును బుత్రులు న్వనము కుంతీనందనుల్ సింహము। ల్కతినూహింప నసింహమైన వనము న్మర్దింతు రెంగున్వనా। వృతవృత్తంబులు గాని సింహములను న్వేగంబ చేటొందుఁగా। నతగంబొందుటకార్యమీయుభయముస్సంతుష్టిమై నున్కికిన్" పైనుదాహరించిన శ్లోకంబులో రేఖానిర్దిష్టములైన కడపటిరెండుపాదంబులకును బద్యంబులో రేఖాచిహ్నితమైన చతుర్థపాదము ప్రతినిధిగాఁ వ్రాయఁబడెను. వ్యాఘ్రము వనంబును, వనంబు వ్యాఘ్రంబును, రక్షింపవలెనని చెప్పిన శ్లోకతాత్పర్యమేమనఁగా వనవ్యాఘ్రములు పొందుగా నుండవలెనని ఫలితార్థము: కానసట్టితాత్పర్యమునే పైపద్యచతుర్థపాదము తెలియఁజేయుచున్నదని యెఱుంగునది. పైపద్యమునందలి చతుర్థపాదంబుయొక్కయర్థము:—ఉభయమున్=వనవ్యాఘ్రంబులు రెండును, సంతుష్టిమైన్ = సంతోషముతో, ఉన్కికిన్=ఉండుటకై, కాన=వనము, తగన్ = యుక్తముగా, పొందుట = కలిసియుండుట, కార్యము = ఆవశ్యకము. పైపాదములో నుభయసంతుష్టికై వనంబు కలియుట మంచిదని స్పష్టమగుచున్నందున నుభయశబ్దముచేతనే సింహంబు కూడ వనంబుతోఁ గలిసియుండుట మంచిదన్న యర్థము కరతలామలకముగా స్ఫురించుచున్నది. కావున వాక్యంబులోని పదార్థంబుల సంబంధంబుచే సింహవాచకపదంబుయొక్క యవసరంబులేకుండనే యాక్షిప్తమైన సింహంబులు, అధ్యాహార్యంబులని తెలిసికొని సుధీమణులు "కానన్" అను దుష్టసంధిహేతుద్రుతాంతపదపాఠంబును, "కానతగన్" అనుమూలవ్యతిరిక్త పునరుక్తదోషభూయిష్ఠస్వేచ్ఛార్థకశబ్దయుక్తపాఠంబును, వితర్కించుచుఁగవిపై దోషంబుల నారోపింపకుందురుగాక! సంస్కృత శ్లోకములో నున్న వ్యాఘ్రపదంబునకుఁ బద్యములో "సింహము" గ్రహింపంబడియె. అందునఁ బద్యతాత్పర్యము మాత్రము చెడదుగాన నయ్యాదికవిరచనకు దోషంబు మేళగింపదు.

14 సూ.—తెనుఁగుమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలురావు.

వాఁడు ... ... కంసారి ... ... వాఁడుకంసారి

వీఁడు ... ... చక్రపాణి ... ... వీఁడుచక్రపాణి

ఆయది ... ... టంకృతి ... ... ఆయదిటంకృతి

అది ... ... తథ్యము ... ... అదితథ్యము
ఇది ... ... పథ్యము ... ... ఇదిపథ్యము

వ్యా. తెనుఁగు శబ్దముల తరువాత వచ్చిన సంస్కృతపదముల క చ ట త ప లకు (పరుషములకు) గ స డ ద వలు రావు. ఉదా వాఁడుకంసారి (వాఁడు + కంసారి) ఇచ్చట రెండవశబ్దము సంస్కృత సమముగనుక నాక కారము గకారముగా మాఱదు. కనుక "వాఁడుగంసారి" అనఁగూడదు. వీఁడుచక్రపాణి, ఆయదిటంకృతి, ఇది పథ్యము, మొదలైన విట్లే. తిక్కనకవికృతంబగునిర్వచనోత్తరరామాయణమునందు "క. అదిమొదలుగఁగవిష్ణునిఁబుదినిప్పి యతండునాకు మగఁడగునని యిట్లుదపంబు సేయుచుండెన" 5 ఆ. అనియుఁ, గాశీఖండము నందు "క. ఎవ్వండు పఠించెడువాఁడు ధన్యుఁడు మునిప్రవరా" అనియును, వసుచరిత్రమునందు "మ. పెంపుపురక్షింపమొ నింపమో చెలిమి యేభూపాలునం దైన" అనియును! ఉత్తరహరివంశంబునందు "శా. వీరల్గోపించిన నంతనుండుఁ జెడుమీరాయోర్చువారు" 4ఆ. అనియును, నిత్యాది ప్రయోగంబులు సంస్కృతపదంబుల క చ ట త ప లు గసడదవలుగా మాఱియుండుటకుఁ గొన్ని కలవు. తపశ్శబ్దభవము "తపము, తపసు" అని యుంగలదుగావున "ఇట్లు దబంబు" అని గ్రహించిన నిర్దోషంబగును. తక్కినచోట్లంగూడ వీరిమతంబున సవరింపవలసియుండును. "నవికృతిశబ్దాత్పరత స్సాంస్కృతికానాం భవంతి గ స డ ద వాః" అను నాంధ్రశబ్దచింతామణి సూత్రంబునకు సరియైన యాంధ్రీకరణముగా నీసూరిగారు సూత్రము రచియించినారు. దీనంజేసి తెలుఁగుమీఁది తత్సమశబ్దంబుల పరుషంబులకు సరళాదేశము రాఁగూడదు గాని తత్సమంబులమీఁది తత్సమంబులయొక్క గాని, వికృతిశబ్దంబులయొక్క కాని, పరుషంబులకు సరళాదేశము నిర్వివాదమని యెఱుంగునది. కావునసే "క॥ కావక్షీయె సురరాజ్య | శ్రీవాలింపంగఁ దగువిశేషంబునపం | భావితుఁడు నహుషుఁడనఁజను" భార- ఉద్యో- 1ఆ. అను నిప్పద్యమందలి "శ్రీవాలింప" ఇత్యాదులందుఁ దత్సమంబైన "శ్రీ" శబ్దంబుకంటెఁ బరంబగు "పాలించు" అనుతత్సమ శబ్ద పకారంబునకు వాదేశప్రాప్తిసంగతంబగును.

15 సూ —ద్వంద్వంబునం బదంబు పయి పరుషములకు గసడదవలగు.

క్షూర ... ... ... కాయ ... ... క్షూరగాయలు

(గ జ డ ద బ) గలుగును. ఉదా. పూఁచెనుగలువలు (పూఁచెను + కలువలు) ఇచ్చట "పూఁచెను" అను ద్రుతప్రకృతికములోని "ను" అను ద్రుతముతరువాతఁ బరంబైన కకారము గకారముగా మాఱి "పూఁచెనుగలువలు" అనియయ్యెను. "తోఁచెను జుక్కలు, నెగడెను దమములు, మొగిడెను బద్మములు" మొదలైనవియునిట్లే.

17. సూ.—ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు.

సంశ్లేషంబనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట.

పూఁచెనుగలువలు ... ... ... { పూఁచెంగలువలు / పూఁచెఁగలువలు / పూఁచెన్గలువలు

తోఁచెనుజుక్కలు ... ... ... { తోఁచెంజుక్కలు / తోఁచెఁజుక్కలు / తోఁచెన్జుక్కలు

చేసెనుడక్కులు ... ... ... { చేసెండక్కులు / చేసెఁడక్కులు / చేసెన్డక్కులు

నెగడెనుదమములు ... ... ... { నెగడెందమములు / నెగడెఁదమములు / నెగడెన్దమములు

మొగిడెనుబద్మము ... .. ... { మొగిడెంబద్మము / మొగిడెఁబద్మము / మొగిడెన్బద్మము

పక్షంబున స్వత్వంబగు — స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము.

వ్యా.—ఆదేశ సరళములుం (పరుషాక్షరస్థానమందు శాస్త్రముచేత వచ్చిన సరళాక్షరములుం) బూర్వమందున్న ద్రుతంబునకు బిందువును, (అరసున్నయు, నిండుసున్నయు) సంశ్లేషమును, (మీఁదిహల్లుతోఁ గూడికొనుటయు) వైకల్పికముగాఁగలుగును. అనఁగా "పూఁచెనుగలువలు" అనునప్పుడు "పూఁచెను" అనుదానిలోని ద్రుతమైన నకారంబునకు, తరువాతవచ్చిన క చ ట త ప లు, గ జ డ ద బ లు గా మాఱఁగాఁ బూర్వమునన్న నకారమునకు నరసున్నయు, నిండుసున్నయు. సంశ్లేషమును, గలుగునని భావము. ఉదా. "పూఁచెనుగలువలు" అని యుండఁగా నకారమునకు నిండుసున్న రాఁగా "పూఁచెంగలువలు" అనియు, అరసున్న రాఁగా "పూఁచెఁగలువలు" అనియు "ను" ("ను" యొక్క ఉకారములోపింపఁగా "న్", హల్మాత్రము మిగిలినది) మీఁది హల్లుతోఁగూడుకొనఁగా "పూఁచెన్గలువలు", అనియును, రూపములుగలిగెను. వైకల్పికపక్షమునఁ ద్రుతానికి స్వత్వమువచ్చును. స్వత్వమనఁగా ద్రుతంబునకు మొదటిరూపము (ను) అనఁగా "పూఁచెనుగలువలు" అను రూపముంగలదని భావము. ఇట్లే తోఁచెను జుక్కలు, చేసెను పన్కులు, మొగిడెను. బద్మము మొద.

18. సూ.—ద్రుతంబునకు సరళ స్థిరంబులు పరంబులగునపుడు లోపసంశ్లేషంబులు విభాషనగు.

వచ్చెను ... ... గోవులు ... ... { వచ్చెగోవులు / వచ్చెన్గోవులు / వచ్చెనుగోవులు

మెఱసెను ... ... ఖడ్గము ... ... { మెఱఖడ్గము. / మెఱసెన్ఖడ్గము / మెఱసెనుఖడ్గము

వ్యా.—ద్రుతమునకు సరళాక్షరములును, స్థిరాక్షరములును, పరంబగునపుడు లోపమును, (ద్రుతమునకని భావము) సంశ్లేషమును, వైభాషికముగాఁ గలుగును. ఉదా. వచ్చెను గోవులు (వచ్చెను + గోవులు) ఇచ్చట "వచ్చెను" అనుదానిలోని

నకారమునకు "గోవులు" అనునప్పుడు సరళవర్ణమైన గకారము పరమైనప్పుడు నకారమునకు లోపమువచ్చి "వచ్చెగోవులు" అనియును, ద్రుతము (న్) గకారముతోఁ గలిసికొని "వచ్చెఙ్గోవులు" అనియును, లోపంబును సంశ్లేషంబునులేక సహజనకారమున్నయప్పుడు "వచ్చెనుగోవులు" అనియు, విభాషయని చెప్పుటచేత గ్రహింపవలెను. ఇట్లే మెఱసెను ఖడ్గము— మొ. ఇట్లు వెనుకటి రెండుసూత్రంబులచే సరళస్థిరంబులు పరంబగునప్పుడు ద్రుతంబునకు సంశ్లేషాదికార్యంబులు విధింపఁబడినవి. శబ్దశాసనునిమతమందు, ఏకారస్వరంబాదియందుఁ గలిగిన "ఎదుట, ఎల్ల, ఎవఁడు" ఇత్యాదిపదంబులకు యకారము మొదట గలదని సంజ్ఞాపరిచ్ఛేదమునందు "త్రిన్యఃక్రియాసుభూతార్థద్యోతిని మాన్యగం వినాసర్వః" అని యిరువదినాల్గవ సూత్రంబునయందు నిశ్చయింపఁబడినది. ఈసూత్రంబున "ఎదుట, ఎల్ల, ఎవఁడు" ఇత్యాది యెకారాదిపదంబులు "యెదుట, యెల్ల, యెవఁడు" అని యకారాదులయి యుండునని శబ్దశాసనసిద్ధాంతము. ఇట్టి యకారాది శబ్దంబులయందు యకారంబు స్థిరంబుగావున యకారంబుపరంబగునప్పుడు సరళాదులు పరంబగునప్పుడువోలె ద్రుతంబునకు లోపసంశ్లేషంబులు ప్రాప్తించుచున్నవి. ఈకార్యంబులు శబ్దశాసనునికి సయితమిష్టములేదు. కావున సంధిపరిచ్ఛేదమునందు "సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్యద్రుతప్రకృతికేభ్యః" అను నిరువదియొనిమిదవసూత్రంబున "వచ్చెన్ + యెదుట, వారలన్ + యెల్ల" ఇత్యాదిస్థలంబులయందు ద్రుతంబునకు యకారనామక స్థిరంబు పరంబైనను, అచ్చుపరమైనప్పుడువోలెఁ గార్యంబగునని యకారంబందు స్వరసధర్మంబారోపింపఁ బడ్డది. పూర్వోదాహరణంబులయందలి యకారంబునకు స్వరధర్మాతిదేశంబున నేమిబాధంబని ప్రశ్నకలుగఁగా స్పష్టార్థమై "లుక్సంశ్లేషౌనాచి" అని తర్వాతి సూత్రంబు ప్రారంభింపఁ బడినది. కాన "వారలన్ + యెల్ల, వచ్చెన్ + యెదుట" ఇత్యాదిస్థలంబులయందు ద్రుతంబునకు, ఏకారాంతమైన యకారస్థిరంబు పరంబైనను స్వరసధర్మారోపణంబున నకారలోపసంశ్లేషంబులు రావు. కాన "వారలనెల్ల, వచ్చెనెదుట" ఇత్యాది ప్రకారంబుననే రూపంబు లుండును. ఏకారాదులైన తెలుఁగుపదంబుల మొదటి యకారస్థిరంబున్నదన్న శబ్దశాసనమతమందు నకారలోపసంశ్లేషంబులు ప్రాప్తింపుచున్నవి. కానఁ దన్నివారణార్థము "లుక్సంశ్లేషౌనాచి" అనుసూత్రంబు ప్రారంభింపఁబడినది. కాని సామాన్యముగా సర్వాచ్చులు పరంబగునపుడు లోపసంశ్లేషంబులు రాకుండుటకై యోగారంభము చేయఁబడ

తేమ. లోపసంశ్లేష విధాయకసూత్రంబులో సరళస్థిరవర్ణంబులు పరంబగునపుడే నకారలోపాది కార్యంబులు విధింపఁబడినందున నచ్చుపరంబగునప్పుడు పైకార్యంబునకుఁ బ్రాప్తియే లేకపోఁగా "ప్రాప్తిపూర్వోహి నిషేధః" అను న్యాయంబునకు విరోధంబుగా సూత్రారంభ మేమియవసరంబు? కావునఁ దెనుఁగుపదంబులయందు సామాన్యంబుగా సర్వాచ్చులు పరంబగునప్పుడు నకారలోప సంశ్లేషంబులు ప్రాప్తించుచున్నవనియు, దానంజేసి యీనిషేధసూత్రం బారంభింపఁ బడినదనియు, భ్రమింపవలదు. పైనిం జెప్పిన యభిప్రాయమే సంజ్ఞాపరిచ్ఛేదమందలి 'అప్యత్రకి నాసుధాతార్థద్యోతినమాద్యగంవినా సర్వః' ఇత్యాదిసూత్రంబులను వివరించు సమయంబున 'లుక్సంశ్లేషా నాచి ద్రుతస్యేతి సూత్రేఽవిహితమచిలుక్సంశ్లేషాభావలక్షణం కార్యం ద్రుతప్రకృత్యుపరిస్థిత స్యయసాద్యదితిశ్యతే. అచిలుక్సంశ్లేషాభావే ద్రుత స్యాచాసహానిత్యసంబంధక్ల్ప్తః' అని యహోబలపండితీయంబులో, ఏకారస్వరాదులైన తెలుఁగుపదంబులయందే ప్రాప్తించుచున్న నలోపసంశ్లేషంబులను నివారించుటకై స్వరసర్వంబు యకారంబున కతిదేశింపఁ బడుచున్నదని స్పష్టపఱుపఁబడినది. ఇట్లు ఘంటాపథంబైన మార్గంబు ప్రకాశించుచుండఁ గొందఱు సూత్రవ్యాఖ్యానకర్తలయభిప్రాయంబు దెలుఁగక. చ॥ వరదుఁడు పార్థుశౌర్య విభవంబున కాతని ధైర్యశక్తికిన్నరుదుగ' భార-ఆర-1ఆ. (శక్తికిన్ + ను + అరుదుగ) ఉ॥ వర్తిల్లక సర్వమున్నతని దివ్యకళామయమందు విష్ణునందుల్లముచేర్చి' భాగ-7 స్కం (సర్వమున్ + ను + అతని) చ॥ ఘనచక్రాయుధ నిష్ఠురక్షతగళద్రక్తాస్యసర్వాంగునిన్నసుఘాతాప్రతిమప్రగల్భపరివాదాంతహితోద్వృక్రముఁన్' ఉ- హరి- 6ఆ. (సర్వాంగునిన్ + ను + అనుఘాత) చ॥ పడఁతులమీఁద నేయరతి పయ్యెదకున్నను పైనచేతులన్" మను- 3ఆ. (పయ్యెదకున్ + ను + అనుపైన) క॥ అన్వయముగ జగతీలోపలఁ గ్రొవ్వునఁజేరి సురగణంబు శోభము నొందె న్నివిధముత' ఉ- హరి- 6ఆ. (ఒందెన్ + ను + ఇవ్విధము) మ॥ తరుణీశాతకటాక్షవీక్షలకొనల్ద్రావ్యన్నచోట్లుంబలెన్నురుశోభావిభవాకరంబులగుచు న్నోమంకురస్థానముల్' కళా--7ఆ. (బలెన్ + ను + ఉరు) ఇత్యాదిప్రయోగంబుల నిపర్యనంబుగాఁ జూపుచు "లుక్సంశ్లేషానాచి, అనుసూత్రంబున స్వరంబు పరంబగునప్పుడు నకారసంశ్లేషంబు సూత్రకర్త లేవని నిషేధించుచుండఁగాఁ బైనిం జెప్పిన నకారసంశ్లేషయుక్త కవిప్రయోగంబులెట్లు సాధులైనవని శంకింతురు. 'లుక్సంశ్లేషానాచి' అను సూత్రంబు

నకు విషయస్థలంబు, ఎకారస్వరాదియైన శబ్దంబులేయనియు, శబ్దశాసనమతంబున
నట్టిపదంబుల మొదట యకారస్థిరంబున్నది కానఁ బ్రాప్తించిన నకారలోప సంశ్లేషా
దుల నిషేధింపుట యవసరంబైనదనియు, నీవఱలోనె పైని వివరించియున్నాఁడ. పైనిం
గనంబఱచిన పద్యములలో “ధైర్యశక్తికిన్నరుదుగ, సర్వమున్నతని, సర్వాంగునిన్నను
భూతా,పయ్యెదకున్ననువైన, ఒందెన్నివ్వినమునక్, బలెన్నరుశోభా” ఇత్యాదులు న
కారసంశ్లేషంబని భ్రమకు నాస్పదంబైన స్థలంబులు ద్రుతంబునకు అకారాదులు పర
మైనచోట్లుగాని, ఎకారాదిగాదు. ఇచ్చట ద్రుతంబునకును వాగనుశాసనమతంబున య
కారయుక్తస్వరాదులైన తెలుంగు పదంబులు లేకపోవుచుండ సంశ్లేషంబునకుఁ బ్రాప్తి
యేలేదు. కావున నిషేధంబునకును నవసరంబులేదని స్పష్టమగుచున్నది. కాఁబట్టి పైనిం
జెప్పిన నకారద్వయసహితస్థలంబులు సంశ్లేషంబులనఁగూడదని గ్రహింపవలయును.
ఇఁకను ద్విత్వనకారయుక్తమైన పైప్రయోగంబులకుశరణంబేమియని శంకింతురేని సావ
ధానమనమ్ముతోఁ నాకర్ణింపుఁడు. వలనసిచోఁగ్వాచిత్కంబుగా ద్రుతంబుపై ద్రుతం
బుప్రయోగింపవచ్చునని వ్యాకరణకర్తలెల్లరును నిర్వివాదంబుగా సమ్మతించుచున్నారు.
బాలవ్యాకరణ సంధిపరిచ్ఛేదమందలి యిరువదియొకండవసూత్రము పైయర్థమునే తేటప
ఱచుచున్నది. “ద్రుతాద్ద్రుతః క్వచిచ్ఛాత్రిదృశ్యతే కవి భాషితే”అని యధర్వణకారికయు
మ“ ద్రుతంసద్రుతాత్” అని వాసుదేవ వృత్తియును, ద్రుతంబుపై ద్రుతంబు క్వాచి
త్కంబుగఁ బ్రయోగింపవచ్చునన్న యంశమునుద్ఘోషించుచున్నవి. పైనింజెప్పినసంశ్లేష
భ్రమదాయక ప్రయోగంబులన్నియు, ద్రుతంబుపై ద్రుతంబుచే సాధువులగును. “దివం
బునుం బోలె” ఇత్యాదులందు హల్లు పరమగునపుడే గాకుండ నచ్చు పరంబగునపుడు
ను ద్రుతంబుపై ద్రుతంబున్న ప్రయోగంబులు కొన్ని ప్రదర్శింపఁబడుచున్నవి. ఇట్టి
ప్రయోగంబులు కవిత్రయంబుచే సయితమింక నుపయోగింపఁ బడినవి కలవు. క॥ సం
తత సత్కీర్తి పిండ సత్కృతియునున। త్యంత మహీరాజ్యమును, భార. సీ॥ ఆబాల
గోపాల మఖిలసత్ప్రజయును నానందమగు మన్కి నతిశయిల్లె” మ॥ తే। టపడంగాం
చె దఁబంపు మన్ననున ఖండ ప్రేమసామగ్రితోఁ.”

ద్రుతంబుపై ద్రుతప్రయోగము క్వాచిత్కంబు గావున నిట్టి ప్రయోగంబులు
సాధారణమ్ముగా వాడఁగూడదను, కొందఱు లక్షణకర్తలు పైనింజూపిన నకారద్విత్వ

ప్రయోగంబులు సంశ్లేషంబులని భ్రమించి నకారద్విత్వ ప్రయోగంబులు గ్రంథంబులలోఁ గ్వాచిత్కంబుగ నుండవచ్చునని నుడివిరి. వారి వచనంబు శాస్త్రీయతర్కంబునకు విరుద్ధంబుగాని ఫలంబున నావాక్యంబుతో నైకకంఠ్యముగానే యున్నది. కాన" క ॥ ఎన్నఁగ నకారపొల్లులు| కున్నచ్చులు సంధిఁ జేసి కూర్పఁగవచ్చున్ | బన్నగపతిశయనుండో | గ్పన్నఘుములఁ బాపభక్తసులభుండయినన్" సర్వలక్షణసారసంగ్రహమున నకారసంధియు విధించుట భ్రమంబు. ముక్తకోకిల. దీనినెట్టులు గ్రమ్మరింతు నదీయభాషితమెన్నఁడు | న్నేని మోహమునుగాను దగ్గరణీరవిందు లెఱుంగఁగాన్." భార. ఆది. 7 ఆ. క. ఆవ్విబుధఁజగతిలోపలఁ | గ్రొవ్వున జేఁగి సురగణంబు క్షోభమునొందె | న్నివ్విఘ్నమునను త్పాతము" ఉ.-హరి-6 ఆ." పాదావసానంబునందున్న యిట్టి ద్రుతోపరిద్రుతంబులను జూచి పైపద్యంబులలో "భాషితమెన్నఁడున్ |ఏని" "నొందెన్ | ఇవ్విఘ్నము" ఇట్లు విసంధిగా నుండవలెననియు, నకారసంశ్లేషంబుండఁ గూడదు కాన వాక్యావసానంబున విసంధి లోపంబులేదనియు, వాక్యశబ్దంబునకుఁ బాదమన్న యర్థంబున్నదనియు, వాదించుచున్నారు. పై పద్యంబులలో సయితము నకారద్విత్వంబు ద్రుతోపరిద్రుతంబువలనఁ గలిగినదిగాని **స్వరపరక** సంశ్లేషంబున లభ్యమైనదికాదు. కొందఱు చెప్పినట్టులు వాక్యావసానంబున సంహిత (వర్ణంబులు మిక్కిలి దగ్గఱగా నుచ్చరించుట) నిత్యంబు గావని యంగీకరించి "ఎన్నఁడున్ | ఏని" ఇట్లు విసంధిగాఁ జదివితిమేని పైనిం జూపిన భారతపద్యంబులోని చతుర్థపాదంబులో మొదటనున్న, ఏకారస్వరంబునకు "ధరణీ" శబ్దంబులోని ణీకారము యతిగానుండుట యశాస్త్రీయం బగును. కావున నకారద్విత్వంబుతో సంధిచేసి పద్యపాదము పఠించితిమేని పాదాదియైన నేకారంబునకును, ధరణీశబ్ద ణీకారంబునకును, యతి కవిసమ్మతంబుగా నుండును. ఏనిశబ్దంబుభయయతులలోఁ బఠింపఁబడినదికావున, ఏకారస్వరంబునకును, ఏకారపూర్వన్యస్తమైన ప్రాణికిని యతిమైత్రి చెల్లును. ఇందులకు—క. ఏనియను నాంధ్రశబ్దము | తోనది నపూర్వపదము తుదిప్రాయికిన| చ్చైనను వ్యంజనవర్ణం | బైనరచింపుదురు నిత్యయతులనుమంగవుల్." అప్ప-3 ఆ. క. పెట్టెదునారకమార్గం | బెట్టిపహార్కారకర్మఁజేసియుఁదుదని | ట్టట్టనక నెమ్మనమ్మన | నెట్టనహరిఁదలఁపఁగలిగెనేనిమహాత్మా." మఱియు క. విదితముగ నేనియనియెడు | పదమన్యపదంబుతోడ బద్యంబులలో | నదుకునెడనిరుదెఱంగులఁ | బోదవుని

త్య యతియనఁగ భుజగవిభూషా" సర్వ-పు.శ్రమ-ప్ర-22 ల తే. గీ. రాజసరుఁ డైన పార్థివరాజుగాని | యీతఁడనిసేయఁగాదగఁడేనివాని." భార. ఆది.

19. సూ—వర్గయుక్సరళములు పరములగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబయోడి.

వచ్చెను ... ... ధాత్రీపతి ... ... వచ్చెంధాత్రీపతి

పాడెను ... ... గంధర్వుఁడు ... పాడెంగంధర్వుఁడు

కన ... ... దోయి ... ... కందోయి

వ్యా.—వర్గయుక్కులు = వర్గాక్షరము లైదింటిలోను సరియక్షరములు. అనఁ గాఁ బ్రతివర్గలోని రెండవయక్షరమును, నాల్గవయక్షరమును,నని గ్రహింపవలెను (ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ) వర్గాక్షరముల సరియక్షరములలో నేది పరమై నను, సరళాక్షరములలో నేది పరమైనను, కొన్నిచోట్ల ద్రుతంబునకు నిండుసున్న క నఁబడుచున్నది. ఉదా. వచ్చెంధాత్రీపతి (వచ్చెను + ధాత్రీపతి) ఇచ్చట మొదటిపద ములోని "ను" (ద్రుతము) తరువాత ధకారమువచ్చినది. తవర్గలోని నాల్గవది యైన యీధకారము వర్గయుక్కగాన నియ్యది పరంబగునపుడు నువర్ణమునకు నిండు సున్నవచ్చి "వచ్చెంధాత్రీపతి" అని యయ్యెను. "పాడెనుగంధర్వుఁడు." ఇచ్చటగం ధర్వశబ్దములోని గకారము సరళంబుగావున నిది పరమైనయపుడు పూర్వ మందున్న నువర్ణమునకు నిండుసున్నవచ్చి "పాడెంగంధర్వుఁడు" అని యయ్యెను. ఇట్లే "కందో యి" మొదలైనవి. ఉ. క | క్నెంజనియించు దుర్యశము మేల్కనిలే హనవేళ వాజు లూ | ర్పంజెడుమాణిమంథని కరంబుల కాళిమపేరఁ దార్కొనన్." ఆముక్తమాల్యద. క. అంజదవుగాకననుజెం | తం జేరఁగనీక యెంత తగ్గినమిరియా | లుంజొన్న లు సరిగావే | లంజెనములందుఁ గొమరులన్ గెలువనోకో." ఉ. హరి. 1ఆ. శా. నీ|కుందక్కోన్ జతురాననత్వగుణయుక్తుల్ మీఅవాణీమనో | భండారోద్ధతమార కారబిరుదప్రఖ్యాతి సార్థంబుగన్." కవులషష్ఠము. మఱియు ద్రుతంబునకుఁ బొస స్థానంబున మకారంబు పరంబగుచో నిండుసున్న యగునని తిమ్మకవీంద్రుల యభిప్రా యంబును, అట్టి ద్రుతంబునకు మకారంబే కలుగునని మఱికొందఱ యభిప్రాయంబు

ను గలదు. ఉచ్చారణ సమయంబునఁ బూర్ణబిందువైనను, మకారంబుతోఁ గలిసినప్పు డు మకారద్విత్వంబు గానే వినంబడును. కావుననే "అహమాదీనాంద్విత్వం" అనుసూ త్రంబును వివరించుతతి నహోబల పండితీయంబునందు. "శ్లో. శబ్దానామంత్యభాగే షు మోఽనుస్వారః ప్రవృశ్యతే। తత్స్యాచిపరతోమస్యాత్స్వత్ర కవిసమ్మతేరితి. శ్లో. కేచిద్వదంత్యభేదత్వ మనుస్వారమకారయోరితిచోక్తం సర్వత్రసంస్కృతాంధ్ర యోరిత్యర్థః అనుస్వారమకార యోరభిన్నత్వంచ మకారేపరఏవ" అనువచనంబునన నుస్వారంబునకు మకారము పరంబగుచో మకారమేయగునని స్పష్టపఱుపఁబడినది. లక్ష్యగ్రాహి. కమ్మనిలతాంతములకు మ్మొనసినమ్మ మధుపమ్ములనుగీతనినదమ్ములెసగం జూతమ్ములు" (కుఱ్ + మొనసి) భార. ఆది. 5 ఆ. మత్తకోకిలఁ వృష్టిఁజే! సెమ్మహానది దీర్ఘికాసరసీనదమ్ములు నిండఁగన్." (జేసెన్ + మహా) భార-ఆర-3 ఆ. సంస్కృత వ్యాకరణంబందును బదము తుది నిండుసున్నకు మకారంబు పరంబగునపుడు మకారం బు వైకల్పికంబుగా నగును. ఉ. రామంమనసాస్మరామి, రామమ్మనసాస్మరామి. అట్లే తెలుంగున మతిద్వయంబున్నను నుచ్చారణంబులో భేదంబులేదు.

20. సూ.—అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగును.

వాఁడువచ్చెన్॥ వాఁడువచ్చె॥ వాఁడువచ్చెను॥ ఈలోలపంబుపద్యాం తములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయియుండు ॥ గుర్వవ సాయియగుపద్యంబుతుదను స్వత్వంబులేదు॥ అతిశయముగబుద్ధిమంతుఁ డగుబుధసేవన్.

వ్యా.—అవసానమునందు (సమాప్తియందు=నకారాంతపదము తరువాత వర్ణ ములులేకుండుట) ద్రుతముయొక్క యచ్చునకుఁ గాని, ద్రుతమునకుఁగాని లోపము బహుళంబుగాఁ గలుగును. ఉదా. 'వాఁడు వచ్చెను.' ఇచ్చటఁ గడపటనున్న ద్రుతము యొక్క యవయవమైన ఉకారము (అచ్చు) పోఁగా మిగిలిన రూపము 'వచ్చెన్' అ య్యెను. 'వాఁడువచ్చె. ఇచ్చట ద్రుతము (ను) పోఁగామిగిలిన రూపము "వచ్చె" అయ్యె

ను. "వాఁడువచ్చెను"ఇది మొదటిరూపము. (మూలము) 'ఈలోపంబు పద్యాంత ములయందు గణానుసారంబుగ వ్యవస్థితంబయియుండు, గుర్వవసాయి యగు పద్యంబు తుదను స్వత్వంబులేదు.' (వ్యా) అనఁగా ద్రుతమునకుఁ గాని ద్రుతస్వరమునకుఁ గాని, లోపముకలుగుట పద్యముల కడపట గణముననుసరించి మనయిష్టమువచ్చినట్లు (వ్యవస్థిత ము) నియమింపఁబడును. గురువు తుదనుండు పద్యము కడపట స్వత్వము ('ను') లేదు. ఉదా. 'అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్' కందపద్యముయొక్క నాల్గవపాద ముచివర గురువుండవలెను. కనుకఁ బైచతుర్థపాదములోను గడపటి ఉకారమునకు లోపమురాఁగా నకారము హల్మాత్రమే మిగిలి 'వన్', అనునది గురువయ్యెను. కాన నిట్టిపర్యంతపాదంబులయందు యావత్తు ద్రుతంబునకు లోపంబుమాని యందలి ఉకారంబునకే లోపంబు చేసికోవలెను. శ్లోక గీతాది। పద్యంబుల పాదాంతబు నందు లఘువే యుండవలెను కాన ఉకారంబును లోపింపఁ జేయక, నువర్ణ మును గణాను సారముగా నుంచుకోవలెను. లేక నువర్ణంబు సర్వంబునకు లోపంబై నను జేయవలయును.

21. సూ.—కొన్ని యెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడి యెడి.

అదియునున్గాక॥దినంబునుంబోలె॥

వ్యా.—కొన్నిచోటుల ద్రుతముపై మఱియొక నకారంబు గనఁబడుచున్నది. ఉదా. "అదియునున్గాక, దినంబునుంబో లె" మొదలయినవి. ఇచ్చట వాస్తవంబున నొక నకారమంతమందుఁ గలిగి యుండవలెను. ప్రస్తుతము "అదియునున్గాక" (అది యును + న్ + గాక) అన్నచో ద్రుతము పైని బునరుక్తిగా ద్రుతము కనిపించుచు న్నది. అర్థసందర్భముచేత నీపునరుక్తి నకారంబ నవసరమైనను దెనుఁగుభాష శైలిని బట్టి యొకానొకప్పుడు ద్రుతాంతముపైని ద్రుతమున్నచో వాక్యంబునకు గుణమే గాని దోషములేదని తాత్పర్యము. ఉ॥ నాకునుం। బోలఁగ నీవభక్తవది" భార-ఆది. 3ఆ. క॥ సంతతసత్కీర్తి పిండసత్కృతియునున। త్యంతమహారాజ్యమును" భార.

22. సూ.—అఁట యిఁక చుఁడు శబ్దములందప్ప నుకితోల ప్రా

హ్రస్వంబుమీఁద ఖండబిందువును, ద్రుతంబునకు లోపంబును లేవు.

ముంగొంగు ॥ క్రొంబసిఁడి ॥ కన్దోయి ॥

వ్యా.—"అంట, ఇంక, చుండు" అనుశబ్దంబులయందుఁ దప్ప మాట (నుడి) యొక్క మొదటి (తొలి) హ్రస్వముమీఁద నకారపొల్లు గాని, ద్రుతంబునకు లోపంబు గాని, కలుగదు. మఱియుఁ గొందఱు పైమీఁదింటియందుఁ బ్రథమహ్రస్వంబు మీఁద నకారపొల్లు యుండదనుట చూచి "ఎఁడు" అను దానియందుఁ దెల్లుకల్గెనని భ్రమం బడుచుండిరి కాని, "ఎఁడు" అనునది ప్రత్యయంబు కాని పదంబు కాదు. అందుచేతనే పదునొకండవసూత్రంబునను సనంబులలోఁ జేర్చి "మూఁడు" అని యుదాహరించినాఁడు. "ఇఁగ" అనునది "ఇఁక" శబ్దముయొక్క రూపాంతరము గుటచేఁ బైసూత్రంబుచేతనే సంగ్రహింపఁబడియె. 'చుఁడు' అనునది 'చూచుఁడు' అనుదాని సంక్షిప్తరూపము. 'అంట, ఇంక, చుండు' అనియును దెల్పనొప్పును. 'ముంగొంగు' ప్రథమమున 'ముందు + కొంగు' అని యుండఁగా నీపరిచ్ఛేదమందలి ముప్పదిరెండవసూత్రంబునఁ దొలియచ్చుమీఁది వర్ణంబులు లోపించెను. అనఁగా 'దు' అనునది లోపించి మువర్ణము మాత్రము మిగిలెను. పిమ్మట ముప్పదియేడవ సూత్రంబున, లుప్తశేషంబైన మువర్ణమునకు 'కొంగు' శబ్దంబులోని పరుషకకారము పరంబగుచుండఁగా, నుగాగమంబువచ్చి 'మున్ + కొంగు' అనియయ్యెను. తరువాఁత బదునాఱవసూత్రంబున 'మున్' అను ద్రుతప్రకృతిక శబ్దంబుమీఁద 'కొంగు' శబ్దంబులోని కకారము (పరుషము) గకారము కాఁగా 'మున్ + గొంగు' అయ్యెను. ఇప్పుడు పదునేడవ సూత్రంబుచేత నొకపర్యాయము పూర్ణబిందువు వచ్చి 'ప్రాఁచెంగలువలు' అన్నట్లుగాఁ బడఁబట్టె 'ముంగొంగు' అను రూపంబును, వేఱొకపర్యాయము, అర్ధబిందువువచ్చి 'ప్రాఁచెఁగలువలు' అన్నట్లు, అర్ధబిందువువచ్చి 'ముఁగొంగు' అనునట్టి రూపము నగుచుండఁగా నీ యిరువదిరెండవ సూత్రంబున నేకాచ్చుశబ్దంబుపై నర్ధబిందువుండదని నాక్షేపించెను. మఱియుఁ బదునేడవ సూత్రంబున సంశ్లేషము వచ్చి 'ప్రాఁజెన్గలువలు', అన్నట్లు 'మున్గొంగు' అనునట్టియనిష్టసంశ్లేషరూపము ప్రాప్తింపఁగా ముప్పదియేడవ సూత్రముక్రింద సూరిగారిచే వ్రాయఁబడిన వ్యవస్థితవిభాషచే నీనుగాగమద్రుతంబునకు సంశ్లేషంబు లేదు, అన్నవా

క్యంబున నుండఁగూడదు. అవఁగా సంధిపదంబులలో మొదటిపదంబు ఏకాచ్చుకలదైనపు డుపదునేడవసూత్రంబు ప్రవర్తించి సంశ్లేషార్ధబిందుస్వత్వరూపంబులుండవు. 'ముంగొంగు' అన్న పూర్ణబిందుసహితరూపమే యుండును. "కన్దోయి" ఇత్యాదులందు "కన్" శబ్దము ఏకాచ్చుకలదైనను నుగాగమద్రుతంబుకాదు కావున సహజనకారంబుతో సంశ్లేషరూపంబుండవచ్చును. ముప్పదియేడవసూత్రంబుచేతఁ జేయబడిన లుప్తశేషశబ్దంబుల నుగాగమనకారంబునకే సంశ్లేషంబు రాదని సూరిగారిచే నాసూత్రముక్రింద వివరింపబడినదని యెఱుంగవలెను. "క్రొంబసిఁడి" (క్రొత్త + పసిఁడి) ఇచ్చట 'ముంగొంగు' అన్నరూపంబు నొందఁబ్రవర్తించిన సూత్రంబులన్నియుఁ జెల్లునని యూహించుకొనునది. "కన్దోయి" (కన్ను + దోయి) ఇట్లుండఁ బ్రకీర్ణకపరిచ్ఛేదములోని యేడవసూత్రంబున ద్విత్వనకారలోపంబు గలిగి "కనుదోయి" అగును. ప్రకీర్ణకపరిచ్ఛేదములోని పదునాఱవసూత్రంబున "కను" శబ్దంబుయొక్క ఉకారంబునకు లోపంబు రాఁగా 'కన్ + దోయి' అగును. ఇప్పుడీ సంధిపరిచ్ఛేదములోని పదునేడవసూత్రంబున నీద్రుతంబునకు దకారపరత్వంబు పరంబగుచుండఁగా 'వచ్చెగోవులు' అయినట్టులు నకారలోపము గలిగి 'కదోయి' అనిన యనిష్టరూపము ప్రాప్తించుచున్నయది. 'కను' శబ్దనకారము ప్రథమ హ్రస్వంబుమీఁదిది కాన నిరువదిరెండవదియగు నీప్రకృతసూత్రంబున ద్రుతలోపంబు కలుగక 'కన్దోయి' అని సంశ్లేషరూపముండును. ఈపరిచ్ఛేదములోని నుగాగమనకారంబుతో సంశ్లేషంబుండదనియు, సహజనకారంబుతో సంశ్లేషరూపంబు నిర్బాధంబనియు, వెనుకనే చెప్పంబడియె. 'కందోయి' అను పూర్ణబిందుసహితరూపముగూడ నీపరిచ్ఛేదమందలి పందొమ్మిదవసూత్రంబుచే నగును. క. 'కందోయి చల్లగానిటు । గందోయి నృపాలలెస్సగా నీకనొకమా । యందవిముంపనినీవని । చింతఱవం దఱలఁగట్టుచిట్టాడంగన్' సా-3ఆ. 'చెన్ను, కెంపు' ఇత్యాదిశబ్దంబు లాస్వకశ్లేషంబులైనపుడు సిద్ధించిన రూపంబులు గానవించుచున్నవేయని గ్రహింపవలెను "సీ. చెందొవ (చెన్ను + తొవ) తేప ముఖ్యంచంబుగాఁ దీర్చి నమనీయముగఁ దలకంబు వెట్టు' నిర్వ-8ఆ. 'క. అంచలమంచలలేకపు । డంచలమంచలయు యున్నవత్తుమెకంబుల్ । చెందామర (చెన్ను + తామర) కొలనువలెన్ । డెందెప్పలవేమి చెప్ప దేవుఁ డెఱుంగన్' సా-1ఆ. 'సీ. కెంపమ్మి (కెంపు + తమ్మి) తేపల యంచంబుగలిగిన కనుగవకొప్పౌర్మి గదలు కొనఁగ' భాస్క-యుద్ధ.

**23. సూ.** తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

తాను ... ...చదివె ... ... { తాఁజదివె / తానుజదివె

తాను ... ...వినె ... ... { తావినె / తానువినె

దీర్ఘంబుమీఁదిదిగానదీనికి నెఱసున్న లేదు.

వ్యా.—"తాను, నేను" అనుశబ్దంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు రాదు. అనగా" తాఁజదివె, తానుజదివె, నేఁజదివితి, నేనుజదివితి." అనురూపంబులు దప్ప సంశ్లేషముతో "తాఙ్జదివె" ఇత్యాదులు రావు. మఱియు "దీర్ఘముమీఁదనున్న యరసున్న నిండుసున్న కాదు" అను సంజ్ఞాపరిచ్ఛేదమందలి పదునేనవసూత్రంబున 'తాం జదివె' అనియును రూపముండదు. ఇచ్చట "తాను, నేను" శబ్దములు ఉపలక్షణముగా గ్రంథకర్తగారిచే గ్రహింపఁబడినవిగాని యిట్టిదీర్ఘపూర్వకద్రుతాంతశబ్దంబులకు నెచ్చటను సంశ్లేషంబు శ్రుతివిరసంబౌటనుండఁగూడదు. "రాఙ్జూచితి, లెస్సగాఙ్జదివె,, ఇత్యాదులుండవు. తిమ్మకవి ప్రభృతులు "తాను, నేను" శబ్దంబులు నకారాంతంబులగుటచేఁ బరుషంబులకు సరళాదేశకార్యంబును, ప్రథమాంతంబులగుటచే బహుళంబుగ గసడదవాదేశకార్యంబును, నుభయంబును నీశబ్దంబులపైఁ జెప్పనొప్పుననుచు నీశబ్దంబులపై సరళాదేశము రానియందులకు భారతోద్యోగపర్వద్వితీయాశ్వాసములోని యీ క్రిందిపద్యంబును లక్ష్యంబుగా సర్వలక్షణసారసంగ్రహాదులయందుఁ జూపిరి. "క. నీచెప్పినపెద్దలు ద్రో। ణాచార్యులు మొదలుగాఁగనని కొల్లనివా । రైచన్నవారలం గొని। యేచక్కంబెట్టువాఁడ నే పాండవులన్." అన్నచోటున "చన్నవారలన్=వెళ్ళినవారిని, కొని = గ్రహించిరి, ఏ(ఏన్)=ఏను. పాండవులన్= పాండవులను, చక్కంబెట్టువాఁడనే=సంహరించువాఁడనా?" అని యర్థమూహించుచుఁ బైపద్యచతుర్థపాద మొదటిఏకారము "ఏను" శబ్దంబనియు, నది ప్రథమాంతంబుగావునఁ దరువాతి చకారంబునకు సరళాదేశము రాదనియు, నిశ్చయించిరి. మఱికొందఱు నాల్గవపాదమందలి మొదటిఏకారము కాకుస్వరార్థము దెలిగెడి ఆకారమువంటిదనియు "చక్కంబెట్టువా

డనే" అనుపదము చివరనున్న ఏకారము "ఏను" శబ్దంబనియు "చక్కంబెట్టువాఁడనే పాండవులన్" అని పాండవశబ్దంబు సరళాదిగాఁ బలుకవలె ననియు, నిశ్చయించుచు "చన్నవారలంగొనియే చక్కంబెట్టు వాఁడనేన్" అన్నప్పుడు చన్నవారలంగొనియే = చన్నవారలంగొనియా! ఏన్ = నేను, చక్కంబెట్టువాఁడన్ = సంహరించువాఁడను. అనఁగా "ద్రోణాదులనుగొని (నమ్మి) పాండవులను జక్కబెట్టను" అనుచుఁ జతుర్థ పాదాదియందున్న ఏకారము కాకుస్వరార్థకమైన ఆకారము వంటిది గాని అస్మదర్థక ముగాదని చెప్పిరి. అందువనే "చక్క" లోనిచకారంబునకు ద్రుతకార్యంబైన సరళా దేశంబు రాలేదని నుడువుచు "తాను, నేను" శబ్దంబులు సర్వదా ద్రుతప్రకృతికంబు లేయనియుఁ, గాన సదా యాశబ్దంబులపై ద్రుతకార్యంబులే వచ్చుననియు, బహుళం బగు గసడదవాది కార్యంబెన్నఁడును రాదనియు, సిద్ధాంతీకరించిరి. "తాను, నేను" శబ్దంబులపై ద్రుతకార్యమే కలుగును గాని వేఱొకటి రాదని మాయభిప్రాయము. కావునఁ బైవారిలో నేకీభవింపము గాని పూర్వపద్యచతుర్థపాదాదియైన ఏకారంబు నకు నట్టిసందర్భంబులో మామతంబున కాకుస్వరమర్థముగాదు. ఆకారంబునకుంబోలె ఏకారంబునకుఁ గాకుస్వరార్థమున్నను, వాక్యాంతమందలి ఏకారంబునకే కాకుస్వరార్థ ము ప్రయోగంబులఁ గానంబడుచున్నది కాని వాక్యమధ్యంబున నట్టియర్థంబు రానే రదు. వాక్యమధ్యంబుననే వకారార్థమైన యవధారణంబే తోఁచుచుండును. లోకంబు లో "పుస్తకము గైకొనియే వచ్చెదను" అన్నవాక్యంబునకుఁ బుస్తకము నిశ్చయముగాఁ దీసికొనివచ్చునని వినువారు తలంతురుకాని "పుస్తకంబు దీసికొనియే వచ్చెదను" అన్న వాక్యంబునకు "తీసికొనియావచ్చెదను!" అన్నయర్థంబు చేసికొని పుస్తకము దీసికొని రాఁడన్న విపరీతార్థము లోకులెవ్వరును జేసికొనరు. కాఁబట్టిపూర్వపద్యచతుర్థపాదాది లోని ఏకారంబునకుఁ గాకుస్వరార్థంబు చెప్పఁగూడదు. అవధారణంబె యర్థంబని మాతాత్పర్యము. "చక్కంబెట్టువాఁడనే" అన్న వాక్యాంతమందలి ఏకారంబు కాకు స్వరార్థకముగాని "ఏను" శబ్దముగాదు. "చన్నవారలంగొనియే చక్కంబెట్టువాఁడ నా?" అనువాక్యంబులోని యభిప్రాయము నిశ్చయముగా ద్రోణాదులనుగొని పాండ వులను సంహరించువాఁడను గానని యభిప్రాయము. "వాఁడేను" అను నుత్తఁ మ పురుషైకవచనము చేతనే "ఏను" శబ్దార్థమాకాంక్షింపఁబడును. కావునపద్యంబులో "నేను" శబ్దారంభపదంబులేదు, చతుర్థపాదాదియందలి ఏకారంబునకు లోకవిదితంబైన

ఏవకారార్థంబేయనియు, వాక్యాంతమందలిది ఏకారంబనియు, నదికాకుస్వరార్థకమనియు, "ఏను" శబ్దంబుగాదనియు, తెలియునది. ఒకరు "క॥ కవదొనలునుగాండీవము। నవలనిశంబనుపుమునుకరదముడిగువే। నునిశపడిగియొనశుభకర। మవునివ్విసమిత్తునేయుమనుఁడు నతండుక్,, భార-శల్య 2ఆ. అనుపద్య తృతీయపాదమందలి "ఏనువిడప,, అన్నచోటునఁ గళయును, బ్రజమయును, అవుటచేత నే ప్రకారము వకారముగా మాఱినని "ఏను,, అనుపదము కళయని నాలిందువార్లె సాధించుచుండిరి. వేఱొకరు "ఏను,, శబ్దంబు ద్రుతప్రకృతికమే కాఁదఁ గసాకార్యంబు నొందదనియుఁ, బైభారతపద్యంబులో "ఏనువిడప,, అన్నపాఠమే యుండవలెననియు, "నబయోారభేవః ,, అన్నశాస్త్రంబున యతిమైత్రియే కాకుండఁ బ్రాసమైత్రియుం జెల్లుననియు, నింకొక ద్వితీయమార్గమవలంబించుచున్నారు. మాతాత్పర్య మాయిద్దఱుకూళయంబులో నేకీభవింపదు. పైపద్యములో "ఏనువిడప,, అన్నచోటున "ఏనవిడప,, అనియె యుండవలెను. "ఏనవిడప,, అనఁగా "ఏనే,, అనియవధారణార్థకమైనయకారంబుఅవ్యయంబుగావున "అప్పుడు, ఇప్పుడు" శబ్దంబులఁబోలెఁ బైపరుషంబులకుగసడదవాదేశంబు రాచ్చును. కావున సర్వవిధంబుల "తాను, నేను,, శబ్దంబులపైఁ గేవలద్రుతకార్యమే కాకుండగసాకార్యముకూడ గ్రంథాదులయందుఁ గనిపించుచున్నదని భ్రమింపవలదు. మఱియు "ఏనువిడపడిగియొన,, అనుపాఠంబునకు "ఏనువెనుకడిగియొన,, అను పాఠాంతరంబు కొన్నివ్రాతప్రతులయందుఁ గానిపించెడిని.

**24. సూ.**—సమాసంబునయందుద్రుతంబునకులోపంబగు.

ఎల్లయర్థములు - ఎల్లకలుషములు॥ సర్వపర్యాయంబయినయెల్లశబ్దంబుద్రుతాంతంబయిన యవ్యయంబు॥ దీనికిసమాసంబున విశేష్యంబునకుముందుప్రయోగంబులేదు.

వ్యా.—సమాసంబునందు ద్రుతమునకు లోపముకలుగును. ఉదా. ఎల్లన్ + అర్థములు. ఇచ్చట సమాసంబు కావున ద్రుతములోపించి కళగాభావింపఁబడి యడాగమంబుచే ఎల్లయర్థములు, అనురూపమయ్యెను. "ఎల్లన్ + కలుషములు, ఈకర్మధార

యసమాసమందు ద్రుతంబునకు లోపంబువచ్చి ఎల్ల కలుషంబులు, అయ్యోను ద్రుతలోపంబుచేఁ బదునాఱవ సూత్రంబుచేత, కకారమునకు గకారము రాలేదు. సర్వశబ్దము యొక్క పర్యాయపదమై (సమానార్థము నిచ్చునట్టిశబ్దము) న ఎల్ల, శబ్దము ద్రుతమంతమందుఁగల యవ్యయము. (లింగవిభక్తివచన భేదములేనిది) ఈ ఎల్ల, అనుదానికి నసమాసమున (సమాసముకానియప్పుడు) విశేష్యంబునకుఁ బూర్వమువఁ బ్రయోగము లేదు. అనఁగా ఎల్లక్ శిష్యులు, అని ద్రుతంబుతోఁ బ్రయోగింపఁ గూడదని భావము. కాని శ్రీనాథునిచే భీమఖండము (భీమేశ్వరపురాణము 2ఆ.) నందు శా॥ ఏన్నోకఁడనే భిక్షానకు న్వత్తునో। యెల్లక్ శిష్యులఁ గొంచునత్తునో, అని యసమాసమున విశేష్యమునకుముందు ఎల్ల శబ్దము ద్రుతాంతముగాఁ బ్రయోగింపఁబడియె. ఇఁకను పై మూలసూత్రమునందు, సమాసంబున యందు, అను చిన్నయసూరిగారి ప్రయోగము తప్పనియు, సమాసమందని కాని, సమాసమునందని కాని యుండవలెననియుఁ, గొందఱు భ్రమపడుచుండిరి. కాని సమాసమునయందు, అనికూడనుండునని కవిసంశయవిచ్ఛేదకారకుఁడు లోనగువారు సెప్పిరి. ఇందులకుఁ బ్రయోగంబులు తక్కినవారియందకాక కవిత్రయమువారియందును చెక్కులుగలవు. చ॥ ఉరమునయందుఁ గమ్మలు బృథూదరదేశమునందు నోరుఁ బ్ర స్ఫురితభుజద్వయంబుగల, భార-ఆర. 6ఆ. చ॥ అనుమాడ నిందుఁ బ్రిడిట్లనిమ్మె నట్లయినంగడు లెస్స దేవనీ। వనిమిష నాయకత్వమునయందు। భిక్షిక్షుఁడవై ముదంబుతో, భార. ఆర. 5ఆ. క॥ ముని। ప్రవరుని తనువునయందు। ధ్యానమై రమ్యము హారభము లెప్లెను,, భార. ఆర. 3ఆ. మ॥ ఒకరత్నంబు విదర్భదేశమునయం దుద్యాతమైపార్థివ। ప్రకరంబు న్యామియింపుచున్న,, నైష- 3 ఆ. క వినుపిండదానసమయం। బునయందును భక్తిపూర్వముగ,, హరి. పూ. 2. ఆ. "క॥ మనుజుఁడు కార్యంబొనర్పమానుగ దైవం। బునయందుఁ బౌరుషమునం,, మార్క. 3 ఆ. "ఆ. వె॥ జీర్ణమగుచునుండు జీనఁటి దేహంబున। యందునీవు మమతఁ బొందవలదుశ" మార్క. 3ఆ. క॥ మనుదెంచినకార్యమేను సర్వంబుమనం। బునయందుమున్న యెఱుఁగుదు" మార్క. 5ఆ. ఉ॥ దక్కఁగ వ్రాసితిన్మనుపటమున। యందుసుశర్మ పాపముల్" పాండు. 5 ఆ, ఇఁకఁ గాశీఖండమునందిట్టిప్రయోగంబులు లెక్కకు మిక్కిలిగానున్న య

వి. "సీ॥ సంతరించితినిండ జవ్వనంబునయందుహర్షనైషధకావ్యమాంధ్రభాష" "తే. గీ॥ అట్టిగోలోకమునయందు నధివసింతు" "సీ॥ అర్థంబుకాశీపురాంగణంబునయందునానా ప్రకారమైవీనుమిగులు" "తే.గీ॥ ఎన్నఁడును నేగిలేనట్టియుష్ణహోశ్వాసమునయందుఁగా పున్న జంతువులకు" "సీ॥ ఉడుపథంబునయందు నుండినగతిఁ దారగమనవేగంబునఁగా గానఁబడఁగ" "సీ॥ కట్టురింగులవారు కటిభాగమునయందుఁ బసిఁడికమ్ములపట్టుపట్టుచేల" "సీ॥ తన్మత్స్యమునయందు ఘనరాంపు శేఖరుఁడుగ్రీతవిద్యాప్రపరియోగసరణి" "తే॥ గీ॥ ఆపత్రేతాయుగంబునయందొకండు" "సీ॥ యదువంశమునయందు నవనిభారాపనోదార్థంబు దుష్టదైత్యావలేప".

**25. సూ.**—సమాసంబుల నుదంతంబులగుస్త్రీసమంబులకుంబుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు.

ఇచటంబరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులచేమూఁడురూపంబులు ॥ సరళంబులు పరంబులగునపుడులోపసంశ్లేషపూర్ణబిందువులచేత మూఁడు రూపములు॥ విధానసామర్థ్యమువలన దీనికిలోపములేదు ॥ వక్ష్యమాణవిధిచే న్వాత్వములేదు.

చిగురు ... కయిదువు ... { చిగురుంగయిదువు / చిగురుఁగయిదువు / చిగురున్గయిదువు

తళుకు ... ...గజ్జెలు ... ... { తళుకుగజ్జెలు / తళుకున్గజ్జెలు / తళుకుంగజ్జెలు

సింగపు ... కొదమ ... { సింగపుంగొదమ / సింగపుఁగొదమ / సింగపున్గొదమ

ఉన్నతంపు ...గోడుగు... ... { ఉన్నతంపుగోడుగు / ఉన్నతంపుఙ్గోడుగు / ఉన్నతంపుంగోడుగు }

నలుగడాదుల నీయాగమంబు లేదండ్రు - ఈయాగమంబొకానొకచో టస్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి - గఱువపున్మ్రువ్వు.

వ్యా. —సమాసములయందు హ్రస్వోకారము (హ్రస్వ + ఉకారము) అంతమందుఁగల స్త్రీసమములకును, (లోకములో వాడునపుడు ప్రథమావిభక్త్యేకవచనము లోపించిన శబ్దములు) పుంప్రులకును, బరుషములుకాని సరళములుకాని పరంబులగునపుడు నుగాగమంబువచ్చును (నకారాగమము చివరవచ్చును) అనఁగాఁ బరుషంబులుపరంబగునపుడు "అఱసున్న, నిండుసున్న, సంశ్లేషము" అను వానితో మూఁడు రూపములును సరళములు పరంబగునపుడు "లోపము, సంశ్లేషము, నిండుసున్న" అనువానితో మూఁడురూపంబులును గలుగును. (మూలము) విధానసామర్థ్యముచేత నీద్రుతమునకు లోపములేదు. విధానసామర్థ్యము = ఈ యిరువదియైదవ సూత్రముచేత నుగాగమమును విధించుటయనెడి బలముచేత. అనఁగా సమాసమందు వచ్చునట్టియీనుగాగమనకారంబునకు "ఎల్లకలుషములు" ఇత్యాదులయందుంబలె నిరువదినాల్గవసూత్రంబుచేత లోపము వచ్చునేని యీనుగాగమవిధి "ప్రక్షాళనాద్ధిపంకస్య దూరాదస్పర్శనంవరం" (బురద తొక్కనేల కాళ్లుకడుగనేల) అనున్యాయంబున వ్యర్థంబగును. ఇరువదినాల్గవసూత్రము చేవచ్చునట్టి ద్రుతలోపము సహజద్రుతప్రకృతికశబ్దంబులకే కాని శాస్త్రముచేనగు "చిగురుఙ్గయిదువు" ఇత్యాది ద్రుతాంతశబ్దములయెడఁ బ్రవర్తిల్లదు. (మూలము) వక్ష్యమాణవిధిచేత (చెప్పఁబోయెడు నిరువదియాఱవ సూత్రముచేత) స్వత్వము (ను) లేదు. పదునాఱవ సూత్రముచేత "పూఁచెనుగలువలు" అగునట్లు "చిగురునుగయిదువు" కాదని భావము. "చిగురు + కయిదువు" ఈసమాసమునందు ఉకారమంతమందుఁ గల స్త్రీసమపదమునకుఁ బరుషాక్షరంబులగు కకారము మొదలైనవి పరంబగునపుడు నుకారంబువచ్చి "చిగురు + ను + కయిదువు" అగును. తరువాతఁ బదునాఱవ సూత్రంబున "చిగురునుగయిదువు" అగును. తరువాతఁ బదునేడవసూత్రంబున బిందుసంశ్లేషంబులు

రాఁగా "చిగురుంగయిదువు, చిగురుఁగయిదువు, చిగురుగ్గైదువు" అనుమూఁడు రూపంబులు సిద్ధించును. సరళాక్షరములు పరంబగునపుడు పదునెనిమిది పందొమ్మిదియగు సూత్రంబులచేత "ఉన్నతంపుగోడును" అనుచోట నకారలోపముచేతను "ఉన్నతంపుగ్గోడును" అనుచోట సంశ్లేషంబుచేతను, "ఉన్నతంపుంగోడును" అనుచోట పూర్ణబిందువుచేతను గలిగిన మూఁడురూపంబులును కైదానివలె గ్రహింపవలెను. ఇట్లేమిగిలినవి, నలుఁగడలు మొదలైనవానియందు నీయాగమము (ఇరువదియొకటవ సూత్రముచేత వచ్చునాగమము=సంశ్లేషరూపము) లేదందురు. అనఁగా "నలుఁగడలు, నలుంగడలు" అనురూపములుండవచ్చునుగాని "నలుగ్గడలు" అనురూపంబుండఁగూడదని భావము. (మూ—వ్యా) కాని యీయాగమము ఒకానొకచోట స్థిరాక్షరంబు పరంబగునపుడును గనంబడుచున్నది. ఉ. గలువపుమ్మరువు.

26. సూ.—సమాసంబులందు ద్రుతంబునకు సత్వంబు లేదు.

వ్యా.— సమాసములయందు ద్రుతమునకు స్వత్వము లేదు. ఉదా. "చిగురుగ్గైదువు," ఇచ్చట "చిగురును గైదువు, ఇత్యాది నకారస్వత్వరూపం బుండదు.

27. సూ.—తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు.

తలఁబ్రాలు - ఒడిఁబ్రాలు - సేసఁబ్రాలు - ఊరఁబంట - ఊరఁబిచ్చిక - తోడఁబుట్టువు - తోఁబుట్టువు - ఒల్లఁబాటు - ఒడఁబాటు - ఇత్యాదులు.

వ్యా.—తలఁబ్రాలు మొదలైన సమాసముల యందలి ద్రుతమునకు లోపము లేదు. అనఁగా "తలఁబ్రాలు" ఇత్యాదులయందు నిరువదినాల్గవసూత్రముచే ద్రుతలోపంబుగలిగి "తలప్రాలు" ఇత్యాదులు కానేరవు. "తలఁబ్రాలు" "తలంబ్రాలు" ఇత్యాదులుండవచ్చును.

28 సూ.—కర్మధారయంబులందుత్తునకచ్చుపరంబగునపుడు టుగాగమంబగు.

| | | | | |
|---|---|---|---|---|
| కలుకు | ... ... | అమ్మ | ... ... | కలుకుటమ్మ |
| నిగ్గు | ... ... | అద్దము | ... | నిగ్గుటద్దము |
| సరసపు | ... ... | అలుక | ... ... | సరసపుటలుక |

వ్యా.—కర్మధారయ సమాసమునందు హ్రస్వోకారమునకు (హ్రస్వ+ఉకారము) నచ్చుపరంబగునపుడు 'టుక్' (ట్) అనునది వచ్చును ఉదా. 'కలుకు+అమ్మ.' ఇచ్చట మొదటిపదముయొక్క కడపటనున్న ఉకారమునకు నచ్చు పరంబుకాఁగా 'ట్', వచ్చి 'కలుకుటమ్మ', (కలుకు+ట్+అమ్మ) అయినది. ఇట్లేనిగ్గుటద్దము, సరసపుటలుక. మొ. సూరిగారు కర్మధారయ సమాసంబులకే చెప్పినారు కాని యీయాగమము ఉకారాంతవ్యతిరిక్తస్థలంబులయందును, అకర్మధారయసమాసములందుం గూడ నొకానొకప్పుడు గనుపట్టెడిని. ఉకారాంతవ్యతిరేక కర్మధారయమునకు- మిద్దెటిల్లు, పల్లెటూరు, దుక్కిటెడ్లు, తేనెటీఁగ, పక్కటెముక మొ. కర్మధారయేతర సమాసంబునకు- వేల్పుటావు, మదపుటేనుఁగు. మొ.

29. సూ.—కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు విభాషనగు.

| | | | | |
|---|---|---|---|---|
| పేరు | ... ... | ఉరము | ... | పేరుటురము / పేరురము |
| చిగురు | ... ... | ఆకు | ... ... | చిగురుటాకు / చిగురాకు |
| పొదరు | ... ... | ఇల్లు | ... | పొదరుటిల్లు / పొదరిల్లు |

వ్యా.—కర్మధారయమునందు 'పేరు' మొదలైనవానికి అచ్చుపరంబగునపుడు

టకారంబు (ట్) పదాంతమునందు విభాషగా నగును. ఉదా. 'పేరు + ఉరము' ఇచ్చట 'పేరు' అనుదానికి 'ట్' అనునదివచ్చి 'పేరుటురము' (పేరు + ట్ + ఉరము) అని యైనది. విభాషగనుక టుగాగమము రానియప్పుడు 'పేరురము' అని యయ్యెను. ఇట్లే చిగురుటాకు, పొదరుటిల్లు, మొదలైనవానికి రూపద్వయము.

30. సూ.—పేదాదిశబ్దంబులకు ఆలుశబ్దము పరంబగునప్పుడు కర్మధారయమునందు రుగాగమంబగు.

| | | | | |
|---|---|---|---|---|
| పేద | ... ... | ఆలు | ... ... | పేదరాలు. |
| బీద | ... ... | ఆలు | ... ... | బీదరాలు |

పేద- బీద - ముద్ద - బాలెంత - కొమ - జవ - అయిదువ- మనుమ- గొడ్డు - ఇట్టివి పేదాదులు– ఇందు జవ్వనిశబ్దంబునకు జవాదేశం బని యెఱుంగునది - ఏకాంతమునందునున్న జవరాండ్రనని ప్రయోగము.

వ్యా. — 'పేద' మొదలైనశబ్దములకు 'ఆలు' శబ్దముపరంబగునప్పుడు కర్మధారయంబునందు రుగాగమంబు (ర్) కలుగును. ఉదా. పేద + ఆలు. ఇచ్చట పేదశబ్దమునకు 'ఆలు' శబ్దముపరమైనది గనుక 'ర్' అనునదివచ్చి 'పేదరాలు' (పేద + ర్ + ఆలు) అయినది. ఇట్లే బీదరాలు, ముద్దరాలు, బాలెంతరాలు, కొమరాలు, జవరాలు, అయిదువరాలు, మనుమరాలు, గొడ్డురాలు, మొదలైనవి. 'జవ్వని + ఆలు' ఇచ్చట నాలుశబ్దము పరంబగుటచే వృత్తియందు జవాదేశంబు 'జవ + ఆలు' ఇచ్చట రుగాగమంబువచ్చి 'జవరాలు' (జవ + ర్ + ఆలు) అయినది. 'ఉ. ఏ। కాంతమునందునున్న జవరాండ్ర వెదంబడి.' మను– 2ఆ. (మూలము.) ఇచ్చట వృత్తియందు ఆలుశబ్దము స్త్రీమాత్రపరము. వ్యా.—ఇచట సమాసవృత్తియందు 'ఆలు' శబ్దము 'స్త్రీ' అనిన యర్థముకలదిగాని 'భార్య' అనునర్థమియ్యదు.

31. సూ.—కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబునగు.

ధీర ... ... ... ఆలు ... ... ... ధీరురాలు

గుణవంత ... ... ఆలు ... ... ... గుణవంతురాలు

ఇచ్చట వృత్తియందాలుశబ్దము స్త్రీమాత్రపరము.

వ్యా.—కర్మధారయమునందుఁ దత్సమశబ్దములకు ఆలుశబ్దము పరంబగునపుడు మొదటిశబ్దముయొక్క తుది అకారంబునకు ఉకారమును, రుగాగమమును (ర్) వచ్చును. ఉదా. 'ధీరురాలు.' ఇచ్చట 'ధీరా' అని దీర్ఘాంతము సంస్కృతంబులో స్త్రీలింగము. తత్సమపరిచ్ఛేదములోని యేఁబదినాల్గవసూత్రంబున హ్రస్వంబురాఁగా 'ధీర + ఆలు,' అగును. ఇచ్చట ఆలుశబ్దము పరంబగుచుండఁగాఁ దుదిఅకారంబునకు ఉకారంబును, రేఫాగమంబును, రాఁగా 'ధీరురాలు' (ధీరు + గ్ + ఆలు) అయినది. 'గుణవంతురాలు' ఇచ్చట మొదటిశబ్దము సంస్కృతభాషలో 'గుణవంతమ్' అనునది ద్వితీయైకవచనాంతము. తెలుఁగుభాషలో నీద్వితీయైకవచనాంతమే నామవాచకముగాఁ దత్సమపరిచ్ఛేదములోని డెబ్బదివసూత్రముచేత గ్రహింపఁబడి డెబ్బదియొక్కవ సూత్రముచేఁ దుదిమకారంబునకు లోపంబురాఁగా 'గుణవంత + ఆలు' అగును. ఇప్పుడు ప్రకృతసూత్రముచేత ఉకారాదేశంబును, రేఫంబును, రాఁగా 'గుణవంతురాలు,' (గుణవంతు + ర్ + ఆలు) అగును.

32. సూ.—కర్మధారయంబులందు మువర్ణకంబున కుంబుంపులగు.

సరసము ... ... మాట ... ... { సరసపుమాట / సరసంపుమాట }

విరసము ... ... వచనము ... ... { విరసపువచనము / విరసంపువచనము }

వ్యా.—కర్మధారయమునందలి మువర్ణకమునకు, పువర్ణమును, ంపువర్ణమును, వచ్చును. ఉదా. 'సరసము + మాట.' ఇచ్చటి మొదటిశబ్దముయొక్క కడపటి మువర్ణకమునకు, పువర్ణమువచ్చి 'సరసపుమాట' అనియు, ఆమువర్ణకమునకు దాపట నున్నతోఁ గూడిన పువర్ణమువచ్చి 'సరసంపుమాట' అనియుఁ, గలుగునని భావము. ఇట్లె విరసపు వచనము. మొ.

**33. సూ.—ఉదంతమగు తద్ధర్మార్థకవిశేషమున కచ్చుపరమగు నపుడు నుగాగమంబగు.**

చేయు ... ... ... అతఁడు ... ... ... చేయునతఁడు
చేసెడు ... ... ... అతఁడు ... ... ... చేసెడునతఁడు

వ్యా.—ఉకారమంతమందుఁ గల తద్ధర్మార్థకవిశేషణమునకు అచ్చు పరంబగు నపుడు నుగాగమంబు (న్) కలుగును. ఉదా. 'చేయు + అతఁడు.' ఇచ్చట 'చేయు' అనునది తద్ధర్మార్థకవిశేషణము. దీనికి అచ్చుపరము కాఁగా నుగాగమమువచ్చి 'చేయునతఁడు' (చేయు + న్ + అతఁడు) ఆయెను. ఇట్లే చేసెడునతఁడు 'సీ॥ అమరులకడవినోదము చూపుసమయ మాంత్రికునోరవెడలగ్ని దీప్తులనఁగ' హంస-౨ఆ. (వెడలు + అగ్ని) ఇట్టి నుగాగమంబులేని ప్రయోగంబులును గొన్నియెడలఁ గానంబడియెడి. కానియగ్రాహ్యములు.

**34. సూ.—షష్ఠీసమాసమునందుకార ఋకారంబులకచ్చుపరమగునపుడు నుగాగమంబగు.**

రాజుయొక్క ... ... ఆజ్ఞ ... ... రాజునాజ్ఞ
విధాతృయొక్క ... ... ఆనతి ... ... విధాతృనానతి

వ్యా.—షష్ఠీసమాసమునందు ఉకారమునకును, ఋకారమునకును, అచ్చుపరం బగునపుడు నుగాగమంబు గల్గును,

ఉదా. 'రాజు + ఆజ్ఞ' ఇచ్చట 'రాజు' శబ్దము ఉకారమంతమందుఁగల శబ్దముగనుక అచ్చుపరము కాఁగా నుగాగమము (న్) వచ్చి 'రాజునాజ్ఞ' (రాజు + న్ + ఆజ్ఞ) అయ్యెను. ఋకారాంతపదంబులకును నిట్లె. విధాతృనానతి (విధాతృ + న్ + ఆనతి.) మఱియుఁ గొన్నిచోట్ల షష్ఠీసమాసమునం దుకారమునకు నచ్చుపరంబగునపుడు నుగాగమంబు వచ్చు లోపంబు గలిగి సంధి గానంబడియెడి. ఉ॥ గోకులమిల్లిలు దప్పకుండ లక్ష్మీపతి గ్రుమ్మరుఁ గడియ సేపునరేపున' హరి. పూ. 5ఆ. (గోకులము + ఇల్లు) క॥ అప్పుడు జగములు గాల్పఁగ । నొప్పెంపుచునున్న నిర్జరోత్తమబింబం । బొప్పువెసఁ దాల్చెదనుజుం । డప్పరుసున నాడుచుండ । నతనినయనముల్' ఉ. హరి. 6ఆ. (బింబంబు + ఒప్పు.) ఉ. అద్దిరరాకుమారుమొగమందము పున్నమచందమామతో । నుద్దియగుఁ, రుక్మి-5ఆ (మొగము + అందము) 'సీ. దినవెచ్చమునకునై తన మేనఁగల సొమ్ము కొదుకక బచ్చింటఁ గుదువనైచు, పాండు- 3ఆ (బచ్చు + ఇంటు) 'మ॥ శిరసం దంయబరఁగ్.' కళా- 7అ. గీ॥ అలరఁ జేసితి నిషధరాజంతవాని" నైష. (రాజు + అంత) ఉ॥ గట్టురా । జల్లుఁడు వింటిసేర్చున సముచితరూపమునందుఁ జందమామల్లుఁ, రామాభ్యుదయము. (రాజు + అల్లుఁడు) క॥ అన్నన్న మొగము వెన్నని యన్నన్న జయించుఁగన్నులు", విజయవిలాసము 1 ఆ. (వెన్నునియన్న = విష్ణుభార్యయైన లక్ష్మియొక్క, అన్న = అన్నయైనచంద్రుని.) ఇట్టివి కవిప్రయోగంబులు ప్రాచీనంబులే గ్రాహ్యములు.

35. సూ—ఉదంతస్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు.

| | | | |
|---|---|---|---|
| సొగసు | ... తనము | ... ... | సొగసుందనము<br>సొగసుఁదనము<br>సొగసుద్దనము |
| సరసపు ... ... | తనము | ... ... | సరసపుందనము<br>సరసపుఁదనము<br>సరసపుద్దనము |

తెల్ల ... ... తనము ... ... { తెల్లందనము / తెల్లఁదనము / తెల్లన్దనము

వ్యా.—హ్రస్వోకారము (హ్రస్వ + ఉకారము) అంతమందుఁగల స్త్రీసమపదములకును, పుంప్రులకును, హ్రస్వాకార (హ్రస్వ + అకారము) మంతమందుఁగల గుణవాచకశబ్దములకును, 'తన' వర్ణకము పరంబగునపుడు నుగాగమము కల్గును. ఉకారాంత స్త్రీసమంబునకు— సొగసు + తనము. ఇచ్చట నకారము పరముటచేఁ బరుషవర్ణమైన తకారము పరుసాఅవసూత్రింబునఁ దకారముగామాఱి పరుసేడవసూత్రింబున నర్ధబిందు పూర్ణబిందు సంశ్లేషంబులచేఁ గ్రమముగా 'సొగసుఁ దనము, సొగసుందనము సొగసున్దనము' అను మూఁడు రూపంబులు గల్గెను. స్త్రీసమశబ్దార్థము ఇరువదియైదవ సూత్రంబున వివరింపఁబడ్డది. పువర్ణమునకును, అకారమంతమందుఁగల 'తెల్ల, అనుగుణవాచకంబులకును, 'తనము, పరంబగునపుడు పైదానివలెనే యుదాహరణంబులు గ్రహింపవలెను. ఉ. సరసపుఁదనము, సరసపుందనము, సరసపున్దనము, తెల్లఁదనము, తెల్లందనము, తెల్లన్దనము. నెు. 'నల్ల, తెల్ల, పచ్చ" ఇత్యాదులు తద్ధిత పరిచ్ఛేదములోని యాఅవసూత్రింబునఁ జెప్పఁబడును.

36. సూ—సమానంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు.

ప్రాఁత ... ఇల్లు ... ... { ప్రాయిల్లు / ప్రాఁతయిల్లు

లేఁత ... ... దూడ ... ... { లేదూడ / లేఁతదూడ

పూవు ... ... రెమ్మ ... ... { పూరెమ్మ / పూవురెమ్మ }

వ్యా—సమాసమునందు "ప్రాఁత" మొదలైనవాని మొదటియచ్చుతరువాతి యక్షరమునకు లోపము బహుళముగాఁ గలుగును. ఉదా. "ప్రాఁత + ఇల్లు." ఇచ్చట మొదటిశబ్దమైన "ప్రాఁత" యొక్క మొదటియచ్చు (పకారరేఫములపైని ఆకారము) తరువాతి యక్షరమైన యర్ధబిందు తకారములుపోయి "ప్రా + ఇల్లు" అయినది. తరువాత దీర్ఘాచ్చులమీఁద సంధిలేమి యడాగమంబువచ్చి "ప్రాయిల్లు" అని యాయెను. ఇచ్చట తకారలోపము బహుళంబుగావున "ప్రాఁతయిల్లు" అనియుం జెప్పనచ్చును. ఇట్లే లేఁతమాడ, లేమాడ, పూరెమ్మ, పూవురెమ్మ. మొ.

37. సూ—లుప్తశేషంబునకుఁ బరుషములు పరములగునపుడు నుగాగమంబగు.

| | | |
|---|---|---|
| ప్రాఁత ... ... | కెంపు ... ... | ప్రాఁగెంపు |
| లేఁత ... ... | కొమ్మ ... ... | లేఁగొమ్మ |
| పూవు ... ... | తోఁట ... ... | పూఁదోఁట |
| మీఁదు ... ... | కడ ... ... | మీఁగడ |
| కెంపు ... ... | తామర ... ... | కెందామర |
| చెన్ను ... ... | తోవ ... ... | చెందోవ |

చెన్నుశబ్దమువృత్తినిశోణార్థకంబు॥ బహుళగ్రహణముచే మీఁదుప్రభృతులందు నిటలోపంబు నిత్యంబు॥ వ్యవస్థితభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

వ్యా.—లోపింపఁగా మిగిలినదానికి (లుప్తశేషము) పరుషాక్షరంబులు పరంబులైనపుడు నుకారముగలుగును. ఉదా. "ప్రాఁత + కెంపు." ఇచ్చటఁ బూర్వపూతరిము

చేతఁ దొలియచ్చు తరువాతియక్షరములైన యర్ధబిందు సహితతకారంబు లోపింపఁగా "ప్రా + కెంపు" అగును. తరువాత నీసూత్రంబున ప్రాశ్శబ్దంబునకు నుగాగమంబు వచ్చి "ప్రాన్ + కెంపు" అగును. ఇప్పుడు పదునాలు పదునేడు సూత్రంబుల సరళంబును నర్ధబిందువును గలిగి "ప్రాఁగెంపు" అనురూపము సిద్ధించును. "ప్రా" శబ్దము దీర్ఘాంతముగుటచేత నిండుబిందువును ఈసూత్రముక్రింద వివరించిన వ్యవస్థిత విభాషచేత నుగాగమనకారంబునకు సంశ్లేషమును లేవని యెఱుంగునది. ఇట్లేమిగిలినవి. (మూ-వ్యా) చెన్నుశబ్దమునకు సమాసవృత్తి యందు "ఎఱుపు" అని యర్థము. ముప్పదియాఱవ సూత్రములోను బహుళశబ్దముండుటచేత 'మీఁదు' మొదలైనవానియందు లోపము నిత్యము. అనఁగా 'మీఁగడ, అనియే కాని 'మీఁదుగడ' అను రెండవ రూపములేదు. మఱియు, ప్రాఁతశబ్దము మొదలు 'మీఁదు' శబ్దము వెనుకవఱకు నైకల్పికమని గ్రహింపవలెను. ఉదా. ప్రాఁతకెంపు, ప్రాఁగెంపు, లేఁతకొమ్మ, లేఁగొమ్మ, పూవుఁదోఁట, పూఁదోఁట. పదునేడవ సూత్రంబులో 'బిందుసంశ్లేషంబులు విభాషనగు' అని చెప్పం బడియె. (మూలము.) వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబులేదు. వ్యా. ఆ విభాషప్రయోగానుసారంబుగా నియతంబైన వ్యవస్థితవిభాషయగుటచే నీముప్పదియేడవ సూత్రంబుచేనగు నుగాగమద్రుతంబునకు సంశ్లేషంబులేనని యెఱుంగునది. ఈసంశ్లేషము లేదన్నయంశంబు ఇరువదిరెండవ సూత్రంబునొద్ద 'గుంగొంగు, అనురూపంబు సాధించునపుడు వివరింపఁబడినది.

38. సూ—క్రొత్తశబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబునగు.

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్త | ... ... | చాయ | ... ... | క్రొంగాయ |
| క్రొత్త | ... ... | చెమట | ... ... | క్రొంజెమట |
| క్రొత్త | ... ... | పసిఁడి | ... ... | క్రొంబసిఁడి |
| క్రొత్త | ... ... | కారు | ... ... | క్రొక్కారు |
| క్రొత్త | ... ... | తావి | ... ... | క్రొత్తావి |

పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వంబగు.

క్రొత్త ... ... గండి ... ... క్రొగ్గండి
క్రొత్త ... ... నన ... ... క్రొన్నన
క్రొత్త ... ... మావి ... ... క్రొమ్మావి

కెందూళి కెంజడలని ప్రయోగంబులు గానంబడియెడి॥ బహుళగ్రహణముచేతఁ గ్రొత్తకుండలిత్యాదుల లోపంబులేదు॥ క్రీఁగడుపు - క్రీఁగాలు - క్రీఁదొడ - ఇత్యాదులం గ్రిందు శబ్దమునకులుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణముచేతనని యెఱుఁగునది.

వ్యా.—'క్రొత్త' శబ్దములోని తకారద్వయంబు లోపింపఁగా శేషించిన 'క్రొ' శబ్దంబునకుఁ గొన్నిరూపంబులలో నుగాగమంబును, మఱికొన్నిరూపంబులలో మీఁది హల్లునకు ద్విత్వంబును అగును. ఉదా. 'క్రొత్త + చాయ' ఇచ్చట క్రొత్తశబ్దమునందలి తకారద్వయంబు లోపించి 'క్రొ' శబ్దమునకు నుగాగమంబువచ్చి పదునాఱు పదునేడు సూత్రంబులచే సరళంబును, పూర్ణబిందువును రాఁగా 'క్రొంజాయ' అనురూపమాయెను. ఇరువదిరెండవసూత్రంబుచే నిట స్థిరబిందువుండదు. ముప్పదియేడవసూత్రంబులో విధింపఁబడిన నుగాగమంబే యీసూత్రములో ననువదింపఁబడినది. కావున వ్యవస్థితవిభాషచేఁ బదునేడవ సూత్రంబున నీ నుగాగమద్రుతంబునకు సంశ్లేషంబురాదు. ఇట్లే క్రొంజెమట, క్రొంబసిఁడి, మొదలగునవి. ద్విత్వమునకు- క్రొత్త + కారు ఇచ్చట లోపింపఁగా మిగిలిన 'క్రొ' శబ్దంబుమీఁది కకారంబునకు ద్విత్వమువచ్చి 'క్రొక్కారు' అయినది. ఇట్లే క్రొత్తావి మొదలగునవి. (మూ. వ్యా.) పరుషములుతక్క నితరములు (సరళస్థిరవర్ణములు) పరంబగునపుడు నుగాగమము లేకపోవుటచేత వానికి ద్విత్వమువచ్చును. ఉదా. 'క్రొత్త + గండి' ఇచ్చట తకారద్వయము లోపింపఁగా మిగిలిన మొదటియక్షరము 'క్రొ' శబ్దంబు మీఁది సరళగకారంబునకు ద్విత్వమువచ్చి 'క్రొగ్గండి' అయినది. 'క్రొత్త + మావి' ఇచ్చట నాద్యక్షరశేషంబునకు స్థిరాక్షరమగు మాకారము పరమైనది గనుక 'క్రొమ్మావి' ఆయెను. ఇట్లే క్రొన్నన, మొ. (మూ. వ్యా.) 'కెంధూళి, కెంజడలు' కవిప్రయోగంబులయందుఁ గనంబడుచున్నవి

'ధూళి' శబ్దంబుతత్సమంబు పరంబైనను 'కెంపు' శబ్దమునకు సాపేక్షికముగాఁ దక్కినయంశంబు లోపించి నుగాగమ పూర్ణబిందువులు గలిగి 'కెంధూళి' అనియును, 'కెంపు' శబ్దంబునకు 'జడ' శబ్దము పరంబగుచుండఁగా, జకారంబు పరుషేతరంబైనను, ద్విత్వంబు రాక నుగాగమ పూర్ణబిందువులతో "కెంజడలు" అనియును రూపంబులు కవులచేఁ బ్రయోగింపఁ బడినవని యెఱుంగునది. ఈరూపంబులు పైనిం జెప్పిన సూత్రంబుచే నసాధ్యంబులుగాన నిపాతంబులని యెఱుంగునది. (సాధారణవిధికి సంబంధింపని సాధుశబ్దము నిపాతమనంబడును) బహుళమని చెప్పుటచేత "క్రొత్తసంత" మొదలైన వానియందు లోపంబువచ్చి, తరువాత ద్విత్వము వచ్చి 'క్రొక్కారు' అను శబ్దమువలె 'క్రొక్కుండ'ఇత్యాదులనిష్టరూపంబులుండవు. 'క్రిఁగడుపుదు' మొదలైనవానియందు 'క్రింది' శబ్దంబులో లోపింపఁగా మిగిలిన 'క్రి' శబ్దంబునకు దీర్ఘము వచ్చుట ముప్పదియాఱవసూత్రములో బహుళమని చెప్పుటచేతనే యని తెలిసికోవలెను. అనఁగా సూత్రమందు విధింపని దీర్ఘప్రాప్తి బహుళమనుటచే గ్రహింపవలెనని భావము. బహుళశబ్దంబునకు 'ఒకానొకచోఁ బ్రవృత్తియును, వేఱొకచో నప్రవృత్తియును, మఱియొకచో విభాషయును, ఇంకొకచో వేఱొకకార్యంబును,' అని, బహుళశబ్దంబునకు నాలుగర్థంబులు కలవని యీపరిచ్ఛేదములోని నాల్గవసూత్రము వివరణకాలమందు గాశికావృత్తిశ్లోకం బుదాహరించి చెప్పఁబడెను. ముప్పదియాఱవసూత్రంబుచేత నలువిధంబులుగాఁ గార్యభేదంబులు గానంబడుచున్నవి. కాన సూత్రములోని బహుళగ్రహణంబునకుం గల నాలుగర్థంబులును నిచ్చట సార్థకంబులగును. అందులకుఁ గ్రమంబుగా నుదాహరణంబులు క్వచిత్ప్రవృత్తి (తొలియచ్చుమీఁది వర్ణంబునకు నిత్యలోపంబు. చూ. 36 సూ.) ఉ. మీఁగడ, కెందామర, చెంబొవ, మొ. క్వచిదప్రవృత్తి (తొలియచ్చుమీఁది వర్ణంబులకు నిత్యంబుగా లోపాభావము. చూ. 36 సూ) ఉదా. క్రొత్తకుండ మొ. క్వచిద్విభాష (ఒకానొకచో లోపవికల్పములు. చూ. 36 సూ) ఉదా. ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు, లేదూడ, లేఁతదూడ, మొ. క్వచిదన్యము (36 సూత్రములోఁ జెప్పిన లోపవిధి కాక యీక్రింది యుదాహరణంబులలోఁ గనంబడు దీర్ఘంబు బహుళశబ్దార్థములో నిమిడిన యన్యకార్యంబుగా గ్రహింపవలయును.) ఉదా. క్రిఁగడుపు. క్రిఁగాలు, క్రీఁదొడ. మొ.

39. సూ.—అన్యంబులకు సహితమిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.

ఒకానొకశబ్దంబున కొకానొకశబ్దము పరంబగునపుడు తొంటియట్లులోపనుగాగమంబులును గొండొకశబ్దమున కొకానొకశబ్దము పరంబగునపుడు లోపద్విత్వంబులును ప్రయోగంబులందుఁజూపట్టెడునని తాత్పర్యము.

| | | |
|---|---|---|
| పది ... ... | ...తొమ్మిది ... ... | పందొమ్మిది |
| తొమ్మిది... ... | పది ... ... | ...తొంబది |
| వంక ... ... | ...చెఱఁగు ... ... | వంజెఱఁగు |
| సగము ... ... | కోరు ... ... | ...సంగోరు |
| నిండు ... ... | ...వెఱ ... ... ... | నివ్వెఱ |
| నిండు ... ... | వెఱఁగు... ... ... | ...నివ్వెఱఁగు |
| నెఱ ... ... | ...తఱి ... ... ... | నెత్తఱి |
| నెఱ ... ... | నడుము ... ... ... | ...నెన్నడుము |
| నెఱ ... ... | ...మది... ... ... | నెమ్మది |
| నెఱ ... | వడి ... ... | ...నెవ్వడి |

ఇత్యాదులు ప్రయోగంబులవలనం దెలియునది॥

వ్యా.—అన్యంబులకుఁ (పూర్వసూత్రములందు విధింపఁబడని, శబ్దంబులకు) గూడ నిక్కార్యంబులు (లోప, నుగాగమ, ద్విత్వంబులు) కొన్నిచోట్లఁ బ్రయోగానుసారంబుగఁ గానంబడుచున్నది. ఈసూత్రార్థము వివరముగాఁ బుస్తకమునందుఁ గలదు లోప నుగాగమంబులకు- ఉదా. పది+తొమ్మిది. ఇచ్చటఁ బ్రకృతసూత్రంబున "పధి" అనుశబ్దములోని యాద్యక్షరమైన పకారము శేషించి నుగాగమంబుగాఁ

గా పఱునేడవ సూత్రంబునఁ బూర్ణబిందువు మాత్రము గలిగి "పందొమ్మిది" అయ్యెను. ఈనుగాగమ ద్రుతంబునకు ఇరువదిరెండవ సూత్రంబున ఖండబిందువును, లోపంబును లేవు. ముప్పదియేడవసూత్రము క్రిందనున్న వ్యవస్థితవిభాషచే నీనుగాగమ ద్రుతంబునకు సంశ్లేషంబులేకున్న సంగతి స్మరింపకోవలెను. ఇట్లే "తొంబది,, వంజెఱఁగు, సంగోరు" ఇత్యాదులందు సూత్రప్రక్రియ యూహించుకొనునది. ద్విత్వమునకు ఉదా. "నిండు + వెఱ" ఇటు నాద్యక్షరశేషమైన నిండుశబ్దనికారమునకుం బైఁ బరంబైన వకారంబునకు నీముప్పదితొమ్మిదవసూత్రంబున ద్విత్వంబుగలిగి "నివ్వెఱ" అనురూపంబు గలిగెను. "నివ్వెఱఁగు, నెత్తుటి, నెన్నడుము, నెమ్మొగి, నెవ్వగ" ఇత్యాదులిట్లె గ్రహించునది. "పందొమ్మిది, తొంబది, వంజెఱఁగు" ఇత్యాదిరూపంబులు ముప్పదియాఱవ సూత్రంబుచే నగులోపంబుచేతను, ముప్పదియేడవసూత్రంబుచేనగు నుగాగమంబుచేతను, సిద్ధించుచుండఁగాఁదిరిగి లోపనుగాగమంబులను విధించుచున్న యీముప్పదితొమ్మిదవ సూత్రము ముప్పదియాఱు, ముప్పదియేడవ సూత్రంబులకు ననువాద సూత్రము (చెప్పినదానిని దిరిగి చెప్పునట్టిసూత్రము) గాని, నూతనవిధిశాస్త్రంబుగాదు. ముప్పదియెనిమిదవ సూత్రంబులో నాద్యక్షరశేషమైన "క్రొత్త" శబ్దమువీఁది హల్లునకే ద్విత్వంబు విధింపఁబడినందున 'నివ్వెఱ, నెత్తుటి' ఇత్యాదులందుఁ బైముప్పదియెనిమిదవ సూత్రంబుచే హల్లునకు ద్విత్వంబు ప్రాప్తింపనేరదు. కావున ముప్పదితొమ్మిదవ సూత్రంబుచేత ద్విత్వముసిద్ధించి పైరూపంబు లయ్యెను. కాఁబట్టి ముప్పదితొమ్మిదవ సూత్రము ద్విత్వవిధినిగురించి నూతనవిధిశాస్త్రంబని యెఱుంగునది. ముప్పదియెనిమిదవ సూత్రంబులో నాద్యక్షరశేషంబైన యొక్క "క్రొత్త" శబ్దంబునుగూర్చియే ద్విత్వనుగాగమంబులు విధింపఁబడెను. ఆసూత్రము "క్రొత్తాదిశబ్దంబుల కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబునగు" ఇట్లున్నయెడల ముప్పదితొమ్మిదవ సూత్రములోని ద్విత్వవిధికూడ ననువాదమే యగును గాని నూతనవిధి కాకుండును. కాఁబట్టి ముప్పదితొమ్మిదవసూత్రము ప్రాయికంబుగా స్పష్టార్థము. "నెన్నడుము" అనుదాని యందలి మొదటిశబ్దము "నెఱి"అని కొందఱియభిప్రాయము ఏఁయానఁ బెద్దనడుమన్నచో సారస్యములేదుగనుక "నెఱి" అని రమ్యార్థము నిచ్చుపదము ప్రయోగించుట ప్రాశస్త్యము. అనఁగా నడుమునకు రమ్యత సన్నఁదనంబుగాని

స్థాల్యంబుగాదు. ఇట్లే "నెన్నడ, నెమ్మోము, నెమ్మేను, నెమ్మొగము" మొదలైనవా నియందు నర్థసందర్భమునుబట్టి గ్రహింపవలెను. మఱియు నీ ద్విత్వమువచ్చుట తెలుంగుశబ్దములకేకాక తత్సమశబ్దంబులు పరంబులగునపుడు సయితము కొన్నియెడలఁ గనంబడుచున్నది. "చ॥ నీవునె। మ్మనమున సంతసిల్లెడు సమస్తజగంబులు శాంతిఁబొందు" భార- ఆర. 4 ఆ॥ "నెచ్చెలి, నెవ్వగ, నెవ్వడి" ఇత్యాదిస్థలంబుల "నెఱ" అనియే యూహింపవలెను.

40. సూ.—ఆమ్రేడితంబుపరంబగునపుడు కడాదులందొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్లనదంతంబగు ద్విరుక్తటకారంబగు.

ఈసూత్రింబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది.

కడ ... ... ... కడ ... ... ...కట్టకడ

ఎదురు ... ... ...ఎదురు ... ... ఎట్టయెదురు

కడ - ఎదురు - కొన - చివర - తుద - తెన్ను - తెరువు - నడుము-

పగలు - పిడుగు - బయలు - మొదలు - ఇత్యాదులుకడాదులు॥

వ్యా.—ఆమ్రేడితము (రెండుమాఱు లుచ్చరింపఁబడినదానిలోని పరరూపము. చూ. 10 సూ.) పరమైనపుడు "కడ" మొదలైన వానియందలి మొదటియచ్చు తరువాతియక్షరంబుల కన్నింటికి, అకార మంతమందుఁ గల ద్విత్వటకారము కలుగును. (మా. వ్యా.) ఈసూత్రమునకు భృశార్థమునందు (అత్యర్థమునందు) ద్విరుక్తము ప్రయోగించుట లక్ష్యమని తెలిసికోవలెను. ఉదా. "కడ + కడ" ఇచ్చ టరెండవకడ శబ్దమామ్రేడితము. ఇయ్యది పరమందుఁ గలదు గావున మొదటిశబ్దమైన "కడ" అను దానియందలి డకారమునకు ద్విత్వటకారమునచ్చి "కట్టకడ" అయ్యెను "ఎదురు + ఎదురు" ఇచ్చట రెండవ "ఎదురు" శబ్దంబు పరంబగనపుడు మొదటి "ఎదురు" శబ్దములోని ఎకారము తరువాతనున్న "దురు" వర్ణంబులు రెండింటికిని టకారద్విత్వముకలి

"ఏట్టయెదురు" అని యరయ్యోను. ఇట్లే కొట్టకొన, చిట్టచివర, తుట్టతుద, తెట్టతెన్ను, తెట్టతెరువు, నట్టనడుము, పట్టపగలు, బట్టబయలు, పిట్టపిడుగు, మొట్టమొదలు మొదలైనవి.

41. సూ.—ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబు గానగు.

| | | | |
|---|---|---|---|
| అప్పటికిన్ | ... ...అప్పటికిన్ | ... | { అప్పటప్పటికిన్<br>అప్పటికప్పటికిన్ |
| అక్కడన్ ... | ... అక్కడన్ | ... ... | { అక్కడక్కడన్<br>అక్కడనక్కడన్ |
| ఇంటన్ ... | ... ...ఇంటన్ ... | ... | { ఇంటింటన్<br>ఇంటనింటన్ |
| ఊరన్ | ... ... ఊరన్ | ... | { ఊరూరన్<br>ఊరనూరన్ |

ఇంచుకనాఁడిత్యాదులందు బహుళగ్రహణముచేతనంతిమాక్షర లోపంబునగు॥

| | | | |
|---|---|---|---|
| ఇంచుక | ... ... ఇంచుక | ... ... | { ఇంచించుక<br>ఇంచుకించుక |
| నాఁడు ... | ... ...నాఁడు... | ... | { నానాఁడు<br>నాఁడునాఁడు |

వ్యా.—ఆమ్రేడితము పరమగునపుడు విభక్తి బహుళముగా లోపించును. ఉదా. "అప్పటికిన్ + అప్పటికిన్" ఇచ్చట నామ్రేడితము పరమైనదిగనుక మొదటి "అప్ప టికిన్" అనుదానిలోని షష్ఠీవిభక్తి ప్రత్యయమైన "కిన్" అనునది లోపించి "అప్పటి

+ అప్పటికిꣳ" అని యైనది. తరువాతఁ బదియవసూత్రంబున సంధికలిగి "అప్పటప్పటికిꣳ" అనియు, విభక్తిలోపంబు బహుళంబుగావున కిఁవర్ణకము లోపింపనియప్పుడు ఐదవసూత్రంబున "అప్పటి కప్పటికిꣳ" అయ్యెను. "అప్పటికప్పటికిꣳ" అనునది యైదవసూత్రంబుననే "ఏమియేమి" అనుసంధిలేనిరూపంబువోలె "అప్పటికినప్పటికిꣳ" అనియుంగలదు. ఇట్లేఅక్కడక్కడꣳ, అక్కడనక్కడꣳ, ఇంటింటꣳ, ఇంటనింటꣳ ఊరూరꣳ, ఊరనూరꣳ, మొ. (మూ. వ్యా.) బహుళశబ్దమును గ్రహించుటచేత "ఇంచుక, నాఁడు" మొదలైనవానియందలికడపటియక్షరంబునకు లోపంబుకూడఁగలుగును. అనఁగా విభక్తులు కానిచోట ననిభావము. ఉదా. "ఇంచుక + ఇంచుక" ఇచ్చటఁ గడపటియక్షరమైన కకారము లోపింపఁగా "ఇంచు + ఇంచుక" అని యైనది. తరువాత నొకటవసూత్రంబున సంధికలియఁగా "ఇంచించుక" అనురూపమయ్యెను. అంత్యాక్షరము లోపింపనియప్పుడు "ఇంచుకించుక" అనియుంగలదు. ఇట్లే "నా నాఁడు" అనుశబ్దంబును గ్రహించునది.

42. సూ.—అందదుకుప్రభృతులుయథాప్రయోగంబుగగ్రాహ్యంబులు.

అందదుకు - ఇట్టింకులు - ఇల్లిగ్గులు - చెల్లచెదరు - చెల్లాచెదరు - తుత్తుమురు - తుత్తునియలు - మిఱుమిట్లు - ఇత్యాదులెఱుంగునది.

వ్యా—అందదుకు ప్రభృతులు (మొదలైనవి) ప్రయోగము ననుసరించి గ్రహింపఁదగ్గవి. అనఁగాఁ బ్రయోగశరణములే కాని యేకసూత్రంబున సాధింపఁబడవని భావము. ఉదా. అందదుకు (అదుకు + అదుకు)=మిక్కిలి యదుకుకలది. ఇట్టింకులు= (ఇంకులు + ఇంకులు)=మిక్కిలి యింకుటలు. ఇల్లిగ్గులు = (ఇగ్గులు + ఇగ్గులు) మిక్కిలి వెనుకకొఱుకుటలు. చెల్లచెదరు = (చెదరు + చెదరు) మిక్కిలి చెదరినది. తుత్తుమురు = (తుమురు + తుమురు) మిక్కిలిపొడి. తుత్తునియలు =(తునియలు + తునియలు) చిన్నచిన్నతునుకలు. మిఱుమిట్లు = (మిట్లు + మిట్లు) కన్నులు మిక్కిలి మిట్టుటలు మొదలైనవి గ్రహింపవలెను.

**43.** సూ—చేత తోడ వలనలకిత్వంబు సమాసంబులందగు.

నీచేతన్ ... ... ప్రోపు ... ... ...నీచేతిప్రోపు

నాతోడన్ ... ... చెలిమి... ... ...నాతోడిచెలిమి

నీవలనన్ ... ... భయము... ... ...నీవలనిభయము

వ్యా. "చేత, తోడ, వలన" లకు ఇకారము సమాసములయందు గలుగును. ఉదా. నీచేతన్ + ప్రోపు. ఇచ్చట "చేత" ప్రత్యయములోని ద్రుతసహితంబైన అకారంబునకు ఇకారము రాఁగా "నీచేతిప్రోపు" (నీచేత్ + ఇ + ప్రోపు) అయ్యెను. ఇచ్చట "చేత" మొదలైనవర్ణకంబులకు సమాసమందు లుక్కు (లోపము) కలుగమింజేసి యలుక్సమాసంబనంబడియె. ఇట్లే నీవలనిభయము, వానితోడిచెలిమి, మొ. "తోడి" అనుటకు "తోటి" అని కొందఱుపయోగింతురు. ఇయ్యది తప్పు. సమాసమైనచో "తోడి" అని యుండవలెను. లేనిచో "తోడన్" అని యుండవలెను. "గీ॥ భంగమొందినయలరామలింగముఖులు । సాటిరాఁగలవారె నీతోటియార! । ఆంధ్రకవితాపితామహ! యల్లసాని । పెద్దనార్య! వివేకధుర్య!" చాటుధార. ఇయ్యది ప్రామాదికము. తోటిశబ్దమునకుఁ జండాలుఁడే యర్థము. అన్యార్థములేదు.

**44.** సూ—అంద్వాదులకలిగాగమంబు సమాసంబునందగు.

నాయందున్... ... కరుణ ... ... ...నాయందలికరుణ

ఇందున్ ... ... జనులు... ... ... ఇందలిజనులు

ఎందున్ ... ... వారు ... ... ...ఎందలివారు

ఎందుశబ్దమునకలిగాగమముకొందఱులేదండ్రు॥

వ్యా—"అందు" మొదలైనవానికి "అలి" అనునది యంతాగమంబుగ వచ్చుట సమాసమునందగును. ఉదా. "నాయందున్ + కరుణ." ఇచ్చట "అందు" మొదలైనవానికి అలిగాగమంబు పరంబగునపుడు ఉకారసంధి నిత్యముగా నగునేకాని "ప్రథమే

తరవిభక్తి' అను రెండవసూత్రంబున వికల్పము ప్రవర్తింపదు. కావున "నాయందలి కరుణ" అనియేకాని. "నాయందునలికరుణ" అను ననిష్టరూపంబుండదని భావము. ఇట్లే "ఇందలిజనులు" మొదలైనవి. (మూలము.) ఎందుశబ్దమున కలిగాగమము కొందఱు లేదందురు. వ్యా. "ఏంను" శబ్దమునకు "అలి" అనునది వచ్చుటలేదని కొందఱు చెప్పుదురు. అందున "ఎందు" అనుదానికి నలిగాగమంబు వైకల్పికంబుగా ఫలించినది. కావున "ఎందలివారు, ఎందువారు" అను రూపద్వయము కలదని మఱికొందఱి యభిప్రాయము.

45. సూ— అదియవిశబ్దంబులయుత్తునకువృత్తినిలోపంబు బహుళంబుగ నగు.

నా ... ... అది ... ... { నాది / నాయది }

నా... ... ... అవి ... ... ... { నావి / నాయవి }

ఉదంతములగు తద్ధర్మవిశేషణంబులకుమీఁద లోపంబు లేదని యునిదంతంబులగు తద్ధర్మవిశేషణంబులమీఁద నిత్యంబనియు బహుళగ్రహణము చేనెఱుంగునది.

వచ్చునది - వచ్చునవి - వచ్చెడిది - వచ్చెడివి ॥

వ్యా.—"అది, అవి" శబ్దములయందలి అకారమునకు సమాసవృత్తిలో లోపము బహుళముగాఁ గలుగును. ఉదా. నా + అది. ఇచ్చట 'అది' అనుదానియందలి అకారము లోపింపఁగా 'నాది' (నా + ది) అయినది. వైకల్పికంబుగావున ('నా + ది') 'అది' అనుదానిలోని అకారము లోపింపని యప్పుడు యడాగమమువచ్చి 'నాయది' (నా + య్ + అది) అను రూపముగలిగెను. ఇట్లే నావి నాయవి మొదలైనవి. గ్రా

స్వోకారమం (హ్రస్వ + ఉకారము) తమందుఁగల తద్ధర్మార్థకవిశేషణంబులపైని లోపములేదనియు, హ్రస్వేకారము (హ్రస్వ + ఇకారము) అంతమందుఁగల తద్ధర్మార్థకవిశేషణములపైని లోపమునిత్యంబనియు, బహుళవిధిచేతఁ దెలిసికోవలెను. ఉదా. 'వచ్చు + అది' ఇచ్చట వచ్చుశబ్దము ఉకారాంత తద్ధర్మార్థవిశేషణంబుగావునఁ బైబహుళగ్రహణంబుచే "అది" శబ్దంబులోని అకారంబునకు లోపంబురాలేదు. ముప్పదనూఁడవ సూత్రంబుచే నుగాగమంబువచ్చి "వచ్చునది" (వచ్చు + న్ + అది) అయ్యెను. ఇట్లే "వచ్చునవి" ఇత్యాదులు. "వచ్చెడి + అది" ఇచ్చట ఇకారమంతమందుఁగల తద్ధర్మార్థకవిశేషణంబుగనుక, 'అది" శబ్దములోని అకారము నిత్యముగా లోపించి 'వచ్చెడిది' (వచ్చెడి + ది) అయ్యెను. కాని 'వచ్చెడియది, వచ్చెడియవి" అని చెప్పఁగూడదు మఱియుఁ దొమ్మిదవసూత్రంబునొద్ద 'ఉండెడినతఁడు" అన్న యుదాహరణంబువోలె సమాసంబుగానియప్పుడు 'వచ్చెడినది వచ్చెడినవి' అని చెప్పనచ్చును. గీ॥ మీరు నాకు నేనుమీకు నెన్నండును । న్నహితమాచరించినదియులేదు భార-సభా-1 ఆ. (ఆచరించిన + అది) ఇత్యాదిపద్యంబులయందు 'ఆచరించినది' ఇత్యాది రూపంబులలో బ్రకృతిసూత్రంబునఁ 'అది' శబ్దంబుయొక్క అకారంబునకు లోపంబుగలిగిన రూపంబందు మేని యతిభంగంబగును. ఇచ్చట "ఆచరించిన + అది" అని యుండఁగా, అకారసంధియని యంగీకరింపఁబడెనేని పాదాదియందలి 'అహిత' శబ్దములోని అకారంబునకు యతి సందర్భించును. కావునఁ బ్రకృతసూత్రంబున అకారాంతభూతార్థకవిశేషణంబులకు నదియవిశబ్దంబుల యకారంబునకు లోపంబు కలుఁగగా 'ఆచరించినది, (ఆచరించిన + అది) అనురూపంబగును. లోపము రానియప్పుడు 'ఆచరించినయది' (ఆచరించిన + య్ + అది) అనులోపింపనియకారరూపంబు వినిపించుటయేకాక 'అత్తునకుసంధిబహుళముగానగు' అనుసూత్రంబున అకారసంధికలిగి 'ఆచరించినది' అను రూపంబు పక్షాంతరంబుననగు. కాఁబట్టి 'ఆచరించినది' ఇత్యాదిరూపంబులు అకారలోపంబుచేతను, అకారసంధిచేతను, గూడ సిద్ధంబులైనవిగాన నిట్టి స్థలంబులలో అకారంబునకును, నకారంబునకును యతి చెల్లవచ్చునని పూర్వకవుల యభిప్రాయము.

**46.** సూ—షడ్వాదులుపరంబులగునపుడుమువర్ణకంబునకు లోపపూర్ణబిందులువిభాషనగు.

భయము ... ..., పడె ... ... { భయపడె / భయంపడె / భయముపడె }

సూత్రము ... ... పట్టె ... ... { సూత్రపట్టె / సూత్రంపట్టె / సూత్రముపట్టె }

ఈకార్యము కర్తృవాచిమువర్ణకంబునకుఁ గలుగదు ॥ గజముపడియె ॥ అశ్వముపడియె.

వ్యా.—పడు మొదలైనవి పరంబగునపుడు మువర్ణకమునకు లోపంబును, నిండు సున్నయు, విభాషగానగును. ఉదా. ‘భయము + పడు’ ఇచ్చట మువర్ణకములోపింపగా ‘భయపడు’ అయ్యెను. వేఱొకమాఱు మువర్ణకంబునకు నిండుసున్న రాఁగా ‘భయంపడు’ అనియు, లోపపూర్ణబిందువులుభయంబును, వైభాషికమగుటచే సహజంబైన మువర్ణకంబుగలిగిన రూపంబు సిద్ధించి ‘భయముపడు’ అనురూపముంగలదు. (మూ వ్యా.) ఈకార్యము (ఈలోపమును, నిండుసున్నయు) కర్తను జెప్పునట్టి మువర్ణకమునకుఁ గలుగదు. ఉదా. ‘గజముపడియె’ ఇచ్చట ‘గజము’ అనునది పడుధాతువునకుఁ గర్తగనుక ‘గజపడియె, గజంపడియె’ అను రూపద్వయంబు గలుగదు. భయపడు సూత్రిపట్టు మున్నగుచోట్ల నవి కర్మార్థకమువర్ణకంబులైనందునఁ బైవిధికలిగెను. ఈ ప్రథమావిభక్తి మువర్ణకము ద్వితీయార్థమందు వచ్చినదిగానఁ గర్మవాచకమైనదికాని కర్తృవాచకము కాలేదు. ‘ఉ॥ అప్పుడు ధర్మహానికి భయంపడినిల్చితివోకడంకతో। నిప్పుడువచ్చినాఁడవు’ భార. విరా. 5ఆ. ‘గీ॥ పరఁగుపీథులు పురిసూత్రిపట్టినట్లు’ ఆము. 1ఆ, గీ॥ ఎట్టుపబలరిపులనీవునునాపద।కోర్చిభంగపాటుతీర్చికొనుము, భార. విరా 1 ఆ. “అ॥ వె॥ ఎట్టిపాటి। సాహసికులో నారిఁ జంపుదు నోంపుదు। భంగపఱుతునిడుము పఱుతుఁ జెఱుతు” భార. విరా—2ఆ. ఇత్యాదులు. పద్యాదులనఁగా ‘పడు, పట్టు పాటు, పఱుచు, పెట్టు” మొదలైనవి, అని పద్యాదులాకృతిగణంబుగా వ్యాకరణంబుల

వ్రాయఁబడుచున్నవి. ఈగ్రంథంబులో ‹పలుచు, పాటు, అను రెండు శబ్దంబులు పునరుక్తి గాని యవసరంబులేదు. ఇయ్యవి పడుధాతువువలన నిష్పన్నములైనరూపంబులు. పలుచుశబ్దంబు పడుధాతువు యొక్క ప్రేరణరూపంబు, పాటు శబ్దంబును బూర్వోక్తధాతువుయొక్క కృదంతరూపంబు. వ్యాకరణంబుచే సిద్ధించిన ‹భయంపడు,, ఇత్యాది రూపంబులమీఁదనే ‹భయంపలుచుఁ, ‹భయంపాటు, ఇత్యాది ప్రేరణాది రూపంబులును, సులభంబుగ సిద్ధించును కావున ‹పలుచు, పాటు, శబ్దంబులు పరంబగునపుడు పైకార్యంబు ప్రాగ్వంబుగ విధింపవలసిన యవసరంబు లేదు, కొందఱుపూర్వులు ‹అనంతపాదిశబ్దేషుపత్యర్థేబిందుర్లోపకా। వర్ణకస్యాత్రికధితౌక్వచిత్సుకవిసమ్మతే॥, అను నధర్వణాచార్య వచనముచేతను, అకారాంతమైన పకారము మొదటఁ గలిగినశబ్దంబు పరంబగునపుడె మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు కలుగుననియు ‹పాటు, శబ్దంబు ఆకారాంతమైన పకారంబు మొదటనున్న శబ్దముగానఁ బైవచనముచే ‹భయంపాటు ఇత్యాదులందు మువర్ణకలోపాదికార్యంబులు సిద్ధింపవనియు, శంకింపుకొని పైకారికలోని ‹అనంత, అనుచోటున. ‹అ ఆ త్, అని పదచ్ఛేదముచేసి ‹అనంత, శబ్దంబుచేతనే ఆకారాంతమైనపకారమాదిగల శబ్దంబుకూడ సంగ్రహింపఁబడుననియు, అందున ‹భయంపాటు, ఇత్యాదిరూపంబులకు సాధుత్వము కలుగుననియు, వక్కాణింతురు. అది వ్యర్థంబు. ‹ఆనంతపాదిశబ్దేషుఁ అని పాఠమున్నచో ‹ఆనంత, అన్నందున ‹అ ఆ త్, అని దీర్ఘాకారముకూడ సంగ్రహింపఁబడునుగాని ‹అనంత, అనునపుడు అ ఆ త్, అను పదచ్ఛేదముచే అకారసంగ్రహయత్నంబు శశవిషాణంబునకై యుద్యోగించుట వంటిది, కాఁబట్టి యట్టిశ్రమంబ నవసరంబు. వ్యాకరణసిద్ధంబులైన ‹భయంపడు, ఇత్యాది ధాతువులవలననే ‹భయపాటు' ఇత్యాది కృదంతరూపంబులేర్పడును. కొందఱు, ‹అనంతపాదిశబ్దేషు, అన్న యథర్వణకారికచేతను—ఆకారాంతపాది శబ్దంబులు కాని పెట్టు మున్నగుశబ్దంబులు పరంబగునపుడుమువర్ణకలోపాదికార్యంబులు కలుగవనేరవుకాన ‹సూత్రిపెట్టు, ఇత్యాదులసాధువులనియు, ‹ప్రథమావైభక్తికమోర్బిందుశ్చ మహత్పతిక్రియార్థేషు, అను వాగనుశాసను సూత్రములో ‹పతిక్రియార్థేషు, అనఁగా- పతిధాత్వర్థము (పడు) గలశబ్దంబులు పరంబగునపుడు మువర్ణకలోపాదికార్యంబులు కలుగునని చెప్పినందునఁ బతిక్రియార్థకములు గాని పెట్టు మొదలగునవి పరంబగునపుడు మువర్ణకలోపాదికార్యంబులు నిరాకరంబులనియుఁ, జెప్పుదురుకాని యట్టివచనం

బవిహారమాలకంబు. పైసూత్రంబులో 'పతిక్రియార్థేషు' అనుశబ్దంబుచేతఁ బతిధాత్వర్థమిచ్చునట్టి పడుధాతువొక్కటియే గ్రహింపఁబడునేని 'పతిక్రియార్థే' అను నేకవచనము చేతనే పూర్వోక్తార్థంబు సిద్ధించుచుండఁగా 'క్రియార్థేషు' అను బహువచనముచేతను పడుధాతువేకాక యింకను నార్యకవిసమ్మతములైన కొన్ని ధాతువులుకూడ నున్నట్లు విశదమగుచున్నది. దానంజేసి 'పద్యాదుల' నిదగణంబు గ్రహింపఁబడుచున్నది. అందున 'పట్టు' మొదలైనశబ్దంబులు గణంబులో నంతర్భూతంబులగుటంజేసి 'పగఁగుఱీధులు పురిసూత్ర పట్టినట్లు' ఇత్యాద్యాంధ్రకవిప్రయోగంబులు సప్రమాణంబులగును. బహువచనప్రయోగంబుచే గణంబు గ్రహించుట సంస్కృతవ్యాకరణంబునందుఁగూడను ప్రసిద్ధంబైయున్నయది. పాణినీయవ్యాకరణము. 'భృఞామిత్'.—అ 7. పా 4. సూ. 76. ఈసూత్రంబున 'భృఞాం' అనుచోట షష్ఠీబహువచన సామర్థ్యంబుచేత 'భృఞ్, మాఙ్, ఓహాఙ్' అనుమూడుధాతువులు గ్రహింపఁబడును. ఇట్లే పరిష్కృతంబున 'క్రియార్థేషు' అను బహువచనంబున నార్యకవిప్రయోగసిద్ధంబులైన 'పడు పెట్టు, పట్టు' ధాతువులు మూఁడును, కపింజలాధికరణ న్యాయంబున గ్రహింపఁబడుటంజేసి సర్వకవిగ్రంథసామరస్యంబు గలుగుచున్నందున నిఁక గ్రంథవిస్తరంబుతోఁ జాలును.

కపింజలాధికరణన్యాయంబనఁగా 'కపింజలానాలభేత' అనుశ్రుతిలో 'కపింజలాన్' అను ద్వితీయా బహువచనంబుచేఁ గపింజల (కముజుఁ) పక్షులు మూఁడే శ్రుతిలో గ్రహింపఁ బడినవి. అట్లే ప్రకృతంబున మూఁడుధాతువులే గ్రహింపవలెను.

**47. సూ.—మధ్యమపురుషమువర్ణకంబునకు హలవసానంబులు పరంబులగునపుడులోపమువిభాషనగు.**

| | | |
|---|---|---|
| చూడుము ... ... | నన్ను ... ... | చూడునన్ను<br>చూడుమునన్ను |
| చూడుము...... ... | ఇటు ... ... | ఇటుచూడు<br>ఇటుచూడుము |

ఉకారసంధివచ్చి 'నమ్మకిటు' అని యయ్యెను. 'నమ్మకుమిటు' అనులోపములేని రూపాంతరము కూడనుండును.

49. సూ—ఆమ్రేడితంబుపరంబగునపుడుమధ్యమముడు జ్ఞులకులోపంబువిభాషనగు

ఉండుము ... ...ఉండుము ... ... { ఉండుండుము / ఉండుముండుము }

కొట్టుఁడు... ... కొట్టుఁడు ... ... { కొట్టుకొట్టుఁడు / కొట్టుఁడుకొట్టుఁడు }

వ్యా.—ఆమ్రేడితము పరంబగునపుడు మధ్యమపురుషమునందలి యేకవచన మువర్ణకంబునకును, బహువచనమైన డుజ్ వర్ణకమునకును, లోపము విభాషగా నగును. ఉదా. 'ఉండుము + ఉండుము' ఇచ్చట నామ్రేడితమైన రెండవ 'ఉండుము' పరంబగునపుడు మొదటి 'ఉండుము'లోని మువర్ణకమునకు లోపమువచ్చి, ఉకారసంధి కలిగి 'ఉండుండుము' అనియయ్యెను విభాషయనుటచే మువర్ణకము లోపింపనియప్పుడు 'ఉండుముండుము' అనియగును. 'కొట్టు కొట్టుఁడు, కొట్టుఁడు కొట్టుఁడు' అనునపుడు మధ్యమపురుషబహువచనడుజ్ వర్ణకమునకు వైభాషికలోపంబు గలిగి రూపద్వయంబు సిద్ధించెను. 'డుజ్' జిత్తుగాన 'జిత్తుబిందు పూర్వకంబగు' అను తత్సమపరిచ్ఛేదములోని పంచామ్మిదవ సూత్రముచే వర్ధబిందువు డుజ్ వర్ణకమునకు ముందువచ్చెను. నలువది యేడవసూత్రమును నీసూత్రము అపవాదము కాఁబట్టి బాధించెడిని. అపవాదమనఁగా సామాన్యసూత్రమున కన్నఁదక్కిన లక్ష్యంబులయందుఁ బ్రవర్తించునది.

50. సూ—విసర్గంబునకనుకరణంబున లోపంబగు.

వర్ధతాంశ్రీః-అనియె-వర్ధతాంశ్రీయనియె॥

వ్యా.—విసర్గమునకు (ః) అనుకారము (కరణము) చేర్చిచెప్పునప్పుడులోపం

బుగలుగును. ఉదా. 'వక్షతాంల్రః + అనియె' ఇచ్చట 'అనియె' అనునపుడు 'అను ధాతువును జేర్చితిమి గనుక విసర్గము లోపించి 'వక్షతాంల్రి + అనియె' అయినది. తరువాత సంధిలేమి యడాగమమువచ్చి 'వక్షతాంల్రియనియె' (వక్షతాంల్రి + య్ + అనియె) అనురూపము సంఘటించెను. అనుకరణంబునఁగా నొకండన్నశబ్దంబులు వేఱొకండు పలుకుట. ఇట్టిప్రయోగంబులు తెలుఁగుభాషలో 'అను' ధాతువుతోడ నేవాడఁబడును. 'గీ॥ కనమె కార్యార్థినఃకుతో గర్వయనఁగ' చంద్రభానుచరిత్ర.

**51. సూ—అనుకృతినినమశ్శబ్దముతుదియత్త్వనకోత్వము విభాషనగు.**

తుభ్యంనమః ... ...అనె ... ... { తుభ్యంనమోయనె / తుభ్యంనమయనె

ఈకార్యములాంతిచో నహితముగనంబడినయది ॥ గతానుగతి కోలోకో యటంచుక్॥

వ్యా.—అనుకరణమందు 'నమః' అనుశబ్దముయొక్క కడపటి అకారమునకు ఓకారము విభాషగా నగును. ఉదా. 'తుభ్యంనమః + అనె' ఇచ్చట 'నమః' అను దాని తరువాత 'అను' ధాతువుచేర్చుటచే విసర్గము పేఁటియను సూత్రముచే లోపించి మకారము నిూఁది అకారమునకు ఓకారమువచ్చెను. సంధిలేమి యడాగమంబువచ్చి 'తుభ్యంనమోయనెఁ (తుభ్యంనమో + య్ + అనె) అయ్యెను విభాషయనుటచే విసర్గము మాత్రము లోపించి 'తుభ్యంనమయనె' అనురూపాంతరము గలదు. సీ. గీ. మానమథనాయ మదనాయ మధుసఖాయ। మనసిజాయ నమోనమ యనుచుఁబ్రొక్కి, వసు- 3ఆ. 'ఉ. పాయక దైత్యకోట్లు బహుభంగుల బాహులాన్వు విష్ణవే। వాయనమో నిరంతవిభవాయనమో జలజాలయాకళ। త్రాయనమో నిశాచరహరాయనమో యను గానిఁ నరా-ఆ, మొ. (సూ. వ్యా.) ఈకార్యము (ఈఓకారమువచ్చుట) మఱియొక చోటఁగూడఁ గనఁబడుచున్నది. అనఁగా నమశ్శబ్దమునకేకాక తక్కిన శబ్దంబులకుఁ గూడనని యర్థము. ఉదా. 'గతానుగతికోలోకోయటంచుక్' సంస్కృతభాషలో "గతానుగతికోలోకః" అని విసర్గాంతముగా నున్నదానిట్టివిసర్గంబునకు ననుకరణంబు

సందు లోపంబుగలిగి విసర్గంబునకు ముందున్న కకారంబుమీఁదిఅకారంబునకుఓత్వంబు గలిగెను. నమశ్శబ్దమొక్కటియేకాకుండ నిట్టిఓకారాంత ప్రయోగంబులు విరళంబుగా నుండవచ్చును.

**52.** సూ.—అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు.

కింతత్ ... ... అనియె ... ... కింతత్తనియె

కస్త్వమ్ ... ... అనియె... ... ...కస్త్వమ్మనియె

వ్యా.—అనుకరణమునందుఁ గడపటిహల్లునకు ద్విత్వమువచ్చును. ఉదా. 'కింతత్ + అనియె' ఇచ్చటఁ గడపటిహల్లు 'తత్' అనుదానిలోని రెండవతకారము దానికి ద్విత్వమువచ్చి 'కింతత్తనియె' (కింతత్ + త్ + అనియె) అనియయ్యెను. 'కస్త్వమ్మనియె' ఇచ్చటఁ గడహల్లు మకారము దీనికి ద్విత్వము పూర్వమునందుంబలెఁ గలిగెను. 'శా॥ జ్ఞాతిశ్శ్వానలేనకిమ్మనెడి వాచారూఢిసత్యమ్ముగన్' వసు. 8 ఆ 'శా॥ ఆత్మార్థంపృథివీంత్యజేత్తనెడు వాక్యం బ్రుతంబే నృపా' కాశీఖండము.

**53.** సూ.—అనుకరణంబునందహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు.

దాసోహమ్ ... ...అనె ... ... { దాసోహమ్మనె / దాసోహమనె

తత్కర్తవ్యమ్ ... అనె ... ... ... { తత్కర్తవ్యమ్మనె / తత్కర్తవ్యమనె

వ్యా.—అనుకరణమునందు 'అహమ్' మొదలైనశబ్దముల మకారమునకు ద్విత్వము విభాషగానగును. ఉదా. 'దాసోహమ్ + అనె' ఇచ్చట 'అహమ్' అనుదానికి 'అను' ధాతువు పరముకాఁగా మకారమునకు ద్విత్వమువచ్చి 'దాసోహమ్మనె' (దాసోహమ్ + మ్ + అనె) అను రూపముకలిగెను. విభాషయనుటచే ద్విత్వముకలుగక

'దాసోహమనె' అను మాయుడి లేని రూపములూఁ గలవు. ఇట్లే తత్కర్తృవ్య వ్యనె, తత్కర్తృవ్యమనె, మొదలైనవి.

**54.** సూ—ఉదంతనామంబునకనుకరణంబునందు వుగాగమంబగు.

ఇయంధేనుః ... ...అని ... ...ఇయంధేనువని ॥

అనుకృతినినిడుదరూఁగుఱుచ యగునని యొకంతవలికెనది నిరాకరంబు ॥ దుర్బలస్యబలంరాజాయనవినవే.

వ్యా.—హ్రస్వోకారము (హ్రస్వ + ఉకారము;) అంతమందుఁగల నామవాచకములకు అనుకరణమునందు వుగాగమంబు గలుగును. అనఁగా కిత్తుకావున ఉకారంబునకు నంతాగమంబుగా వచ్చును. ఉదా. 'ఇయంధేనుః + అని' ఇచ్చట నేఁబడియున సూత్రమున 'ధేను' శబ్దముయొక్క విసర్గము లోపింపఁగాఁ బిక్కటిసూత్రంబున వకారమంతాగమంబుగావచ్చి 'ఇయంధేనువని', (ఇయంధేను + వ్ + అని) అనురూపము సిద్ధించెను. (మూ. వ్యా.) అనుకరణమందు నిడుదకు, (దీర్ఘమునకు) కుఱుచ (హ్రస్వము) కలుగునని యొక్కఁడు చెప్పెనుగాని యది నిరాకరము (నివృత్తిమార్గము!) ఉదా. దీర్ఘాంతము సంస్కృతఇచ్చట 'రాజా' అను రాజాయనవినవే' దుర్బలస్యబలం భావములోఁ బ్రయుక్తమైకవనము. ఇట్టి దీర్ఘంబులకు హ్రస్వంబు గలుగదు.

**55.** సూ.—వాక్యావసానంబునసంధిలేమిదోషంబుగా దని యార్యులండ్రు.

సత్యముసర్వశ్రేయము - అదిలేనిచోసర్వధర్మములు వ్యర్థములు ॥ ఇట్లుసంధి విరహంబు కావ్యంబులం బాదాంతమందచూపట్టెడు

వ్యా.—వాక్యసమాప్తియైనపుడు సంధిలేకపోవుట దోషముకాదని పెద్దలందురు. ఉదా. సత్యము సర్వశ్రేయము—అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు. 'శ్రే

యము + అని' ఇచ్చట ఉకారమునకు నిత్యసంధి విధించినను, వాక్యాంతముగనుక సంధిలేకపోవుట దోషముగాదని యభిప్రాయము. ఇట్లు సంధి లేకపోవుట పద్యకావ్యములలో పాదపరిసమాప్తియందును గనఁబడుచున్నవి. పద్యకావ్యములలోఁ బద్యములోని వాక్యాంతమందు సంధియేయుండవలెనుగాని పాదాంతమందుంబలె లేకపోఁగూడదు. మూలంబులో ఉకారంబునకే సంధి రానియెడలకు నుదాహరణము చూపంబడెనుగాని తక్కిన యికారాదులకుఁ గూడ సంధిలేకపోవచ్చును. 'గీ॥ పడగనున్నహాను మభయవిహ్వలుఁడుగాఁడు। అరదమునకు సూతుఁడమ్యతుండు' 'గీ॥ సర్వతీర్థాభిగమనంబు సర్వవేద। సమధిగమము సత్యంబుతో సరియుఁగావు। ఎఱుఁగుమెల్ల ధర్మములకు నెందుఁబెద్ద। యందుఁ బ్రసత్యంబు ధర్మజ్ఞులైనమునులు' భార. ఆది. 4ఆ. ఇత్యాది బహుప్రయోగంబు లీసూత్రంబుచే సాధితంబులయ్యె గొందఱు 'విహ్వలుఁడుగాఁడు—అరద' అని పద్యంబులో నున్న 'విహ్వలుఁడు' శబ్దంబు పూర్ణబిందుయుక్తముగా వచించి గణభంగంబు సవరింపఁబోనుచుఁ బద్యంబులయందును సంధి నిత్యంబుగా రావలయునే కాని భయవిహ్వలుండుఁగాఁ డరదమునకు) సంధివిరహంబుకూడదని వక్కాణించెదరు. ఇట్టిచోట్లను యథేష్టసంధి నన్నయభట్టారకాదుల మతమందు నిర్వివాదంబుగాన మతాంతరుల యభిప్రాయంబు ప్రామాదికంబని ద్వితీయోదాహరణంబుచే నైన నూహింపవలయును.

ఇదిసంధిపరిచ్ఛేదము

---

# తత్సమపరిచ్ఛేదము

---

సంస్కృత శబ్దంబు తెలుంగు ప్రత్యయంబులను బొందునప్పుడు వికారాగమాదులను బోధించుభాగము తత్సమపరిచ్ఛేదము.

డుమువులు ప్రథమ ॥ 1 ॥ నువర్ణంబుద్వితీయ ॥ 2 ॥ చేతతోడతృతీయ ॥ 3 ॥ కొఱకుకయిచతుర్థి ॥ 4 ॥ వలనకంటెపట్టిపంచమి ॥ 5 ॥ కుయొక్కలోపలషష్ఠి. ॥ 6 ॥ అందునసప్తమి॥7॥

1 సూ—డు, ము, వు, లు, ప్రథమ.
2 సూ—నువర్ణకంబు ద్వితీయ.
3 సూ—చేత, తోడ, తృతీయ.
4 సూ—కొఱకు, కై, చతుర్థి.
5 సూ—వలన, కంటె, పట్టి, పంచమి.
6 సూ—కు, యొక్క, లోపల, షష్ఠి.
7 సూ—అందు, న, సప్తమీవిభక్తి.

'డు, ము, వు, లు ప్రథమావిభక్తి, అనుసూత్రము మొదలు 'అందు, న' సప్తమీవిభక్తి అను యేడవ సూత్రము వఱకు సులభంబేగావున వివరింపఁ బనిలేదు.

8 సూ—తృతీయాదులకు నుగాగమంబగు.

రామునిచేతను - రామునితోడను - రామునికొఱకును - రామునివలనను - రామునికంటెను - రామునకును - రామునియందును.

వ్యా.—తృతీయ మొదలు సప్తమివఱకు విభక్తులకు నువర్ణకంబంతాగమంబగును ఉ. రామునిచేతను. ఇచ్చటఁ జైసూత్రముచేఁ గడపట నుకారము వచ్చినది. ఇట్లే తక్కినయుదాహరణంబులలో విభక్తి తుదను కారమాగమంబని యెఱుంగునది.

9 సూ—కయిపట్టియొక్కలకు నుగాగమంబు లేదు.

రామునికయి - జ్ఞానముఁబట్టి - రామునియొక్క.

వ్యా.—'కయి, పట్టి, యొక్క, వీనికి యెనిమిదవసూత్రంబుచే నుగాగమంబు ప్రాప్తింప నీసూత్రంబుచే నిషేధింపఁబడియె. కాన 'కయి, పట్టి, యొక్క, ఇయ్యవి విభక్తులలోఁ గళలని యెఱుంగునది. కావున 'కయిని, పట్టిని, యొక్కను' అని

పదచ్ఛేదాదికాలములయందు నకారాంతంబులుగా నుచ్చరింపఁ గూడదు. ఉ. రామునికయి, మొ.

10 సూ — చేతతోడలోపలవర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు.

ప్రత్యయంబు వర్ణకంబని ప్రాచీనులు వ్యవహరింతురు.

రామునిచే - రామునితో - వనములలో.

వ్యా. — 'చేత, తోడ, లోపల' అను నీవర్ణకములయొక్క మొదటియక్షరములు మిగిలి 'చే' ఇత్యాదులగును. ఎనిమిదవసూత్రంబుచే నుగాగమంబువచ్చి' 'చేను, తోను, లోను' ఇత్యాదికముగా నగును. వైకల్పికమనుటచే 'చేతను' ఇత్యాదులు పక్షమున నగునని యెఱుంగునది. ప్రత్యయంబునకు వర్ణకంబనుసంజ్ఞ తెలుఁగు వ్యాకరణంబునందే వ్యవహరింపఁబడును. ఉ. రామునిచే. మొ.

11 సూ — డుముపున లేక వచనంబులు.

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు. రాముఁడు - సోముఁడు - వనము - ధనము - ధేనువు - భానువు॥

వ్యా. — 'డు, ము, వు, న' అను వర్ణకంబు లేకవచనంబులు. ఈవర్ణకంబులవలనఁ బదార్థమొకటియై యున్నయట్లు బోధింపఁ బడును. ఉ. రాముఁడు, వనము, ధేనువు, మొ. నవర్ణకంబునకు నుదాహరణమ్ము పుస్తకంబునందియ్యఁ బడలేదు. నకారము సప్తమీవిభక్తి. ఉ. గృహమున.

12 సూ — లువర్ణంబు బహువచనంబు.

బహుత్వసంఖ్యనుబోధించు ప్రత్యయంబు బహువచనంబు॥

రాములు - సోములు - వనములు - ధనములు ధేనువులు - భానువులు

వ్యా.—'లు, అను వర్ణకంబు బహువచనము. అనఁగా ననేకపదార్థములను బోధించు నట్టి ప్రత్యయము బహువచనము. ఉ. రాములు. మును. ఈసూత్రంబున లువర్ణంబని యున్నది. లువర్ణకంబనుట యుక్తంబు.

13 సూ.—తక్కినవి యుభయంబులు.

మిగిలినప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములనియర్థము॥ వనమును - వనములను - వనముచేతను - వనములచేతను - వనముతోడను - వనములతోడను.

వ్యా.—'మిగిలినవర్ణకంబు లేకవచనంబును, బహువచనంబును, బోధించునవి. అనఁగా ‘డు, ము, వు, న' అను వర్ణకంబులుదక్క మిగిలినద్వితీయావిభక్తి యొక్క వర్ణకంబైన ‘ను' మొదలయినవి యేకవచనంబునందును, బహువచనంబునందును, గలుగునని భావము. ఉదా. వనమును. బహు. వనములను. ఇచ్చట ‘ను' అను ద్వితీయావిభక్తి వర్ణకంబేకవచన బహువచనంబులయందు వచ్చినది. ఇట్లే వనముచేతను, వనములచేతను, మొదలైనవి.

14 సూ.—ఓయామంత్రణంబునందగు.

ఓయనుశబ్దము సంబోధనంబునందగుననియర్థము - ఇదిసంబోధ్యవాచకంబునకు ముందేప్రయోగింపంబడును - ఓశబ్దంబుతో లంగియుసంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును - ఓరాముఁడ - ఓరాములార - రాముఁడ - రాములార.

వ్యా.—‘ఓ' అనునది పిలుచుట (ఆమంత్రణంబున) యందుఁ గలుగును. అనఁగా ‘ఓ' యనుశబ్దంబు సంబోధనంబునకు నుపయోగింపఁబడును. ఆయుపయోగించుట లోఁ బిలువఁ దగినపదార్థములఁ జెప్పునట్టిపదంబునకు (సంబోధ్యవాచకంబునకు) ముందుపయోగింపఁబడును. (సూ వ్యా) ఓశబ్దము విడిచిపెట్టియు (తొలంగియు) సంబోధ్యవాచక ముపయోగింపవచ్చును. ఉ ఓ రాముఁడ. ఇచ్చట రాముఁడు సంబోధ్యుఁడు

గనుక ఓశబ్దము రామశబ్దంబునకుముందు ప్రయోగింపఁబడ్డది. రాముఁడ. ఇచ్చట ఓ' శబ్దములేకుండఁ బ్రయోగింపఁబడ్డది. ఇట్లే బహువచనమందు. ఉ. ఓరాములార ,రాములార.

15 సూ—ఓశబ్దంబునకుంబురుషనీచ స్త్రీపురుషామంత్రణంబులందు యి సి రి వర్ణంబులు విభాషనంతాగమంబులగు.

ఓయిరాముఁడ - ఓరాముఁడ - ఓసిదుష్టురాల - ఓదుష్టురాల ఓరిదుష్టుఁడ - ఓదుష్టుఁడ.

వ్యా.—1 పురుషామంత్రిణంబునందును, 2 నీచ స్త్రీ యామంత్రిణంబునందును, 3 నీచపురుషామంత్రిణంబు నందును, గ్రమంబుగ 1 ,యి' 2 సి, 3 రి' అనువర్ణంబులు ఓశబ్దంబునకు విభాషనంతాగమంబులగును. ఉ. ఓయి రాముఁడ ఓరాముఁడ— ఓసి దుష్టురాల-ఓదుష్టురాల. ఓరిదుష్టుఁడ. ఓదుష్టుఁడ. విభాషయనుటచే ,యి, సి, రి వర్ణంబులు లేకయుఁ గేవలమోకారంబుతోఁ బైయుదాహరణంబులు పక్షంబునఁజూపఁబడినవి.

16 ఓరియోసిమైత్రియందుంగలవు.

ఓరిచిన్నికృష్ణ - ఓసిముద్దుబాల॥ ఓయిమొదలయినవానికిస్వతంత్రప్రయోగముంగలదు ॥ సంగతియెయోయి ॥ ఓసిపోవే ॥ ఓరోరియింకెందుఁబోవచ్చు ॥ వీనికిదీర్ఘంబుంగలదు ॥ ఓయీవిప్రకులావతంస ॥ ఓరీదుష్టనిశాటులార ॥ ఓసీననుఁజెనకరాకు.

వ్యా.—,ఓరి, ఓసి' అనునవి స్నేహమందుపయోగించుటకలదు. అనఁగా నీచత్వమందే కాక స్నేహమందును, బురుషులకు ,ఓరి' అనునదియు, స్త్రీలకు ,ఓసి' అనునదియు నుపయోగింపవచ్చునని భావము. పురుషునకు- ఓరిచిన్నికృష్ణ. స్త్రీకి- ఓసిముద్దుబాల. ఓయిమొదలైన వానికి సంబుద్ధి పదములేకుండఁ బ్రయోగంబుగలదు.

ఉ. సంగతియె యోయి (ఓయీ! సంగతియే? = సంగతేమో!) మొ. ‘ఓయి’ ఇత్యాదుల యికారంబునకు దీర్ఘంబును గలదు. ఉ. ఓయీ విప్రకులావతంస. ఇట్టే మిగిలినవి. స్త్రీలింగములైన సంబోధ్యవాచకముల పయిని ‘రో’ అను నవ్యయంబు గానంబడి యెడి. (తత్సమంబైన రోశబ్దంబు భనార్థకంబు.) ఈరోశబ్దంబు హ్రస్వాంతంబును న య్యెడిని- చ. ‘కమలదళాక్షిరో పసవుగా కలయొక్కటి కంటివేమనక్’ ప్రభా-1ఆ చ. రమణిరో భృత్యులందు నపరాధము గల్గిననాయకుల్ ప్వప ।_ తుమునలపోసి యుగ్రతరశాసనముం దగఁజేయరు’ భాగ-4 స్క-ం. సంబోధ్యవాచకంబులైన దేశ్య స్త్రీవాచక స్త్రీసమశబ్దంబులపైని నేకత్వంబున ‘కొన’ అను శబ్దంబులు, ‘అల’ అనునవ్య యంబును, సంబుద్ధిద్యోతకంబులుగా నుపయోగింపఁబడును, కొని ‘అల కొన’ శబ్దంబు లు నావఃవాచకంబు లగునప్పుడు మాత్రము క్రియలుగాఁ బ్రయోగంబును అపేక్షించును. నర్థమిచ్చును. తే. గీ. భవ్యపతి దేవతాచారపరుఁడవు శ్రేష్ఠసుకుమారి కుంభజుమీతల్లి కొన. నై-7 ఆ. మాసామికొన, ‘సా. 1ఆ. సీ. ‘దైవమన్నను గురువన్న సర్వమన్నఁ బ్రాణనాథుండు సుమ్మునాయున్నకొన, కళాప- 3ఆ. ఉ. అక్కల కన్యకాత్వమిటు లాఁచిపోవ నకారణంబనిరి కొక్కడి చూఁడబడెచ్చె, విద్యా- 2ఆ. ‘అల’ అనునది దీర్ఘాం తంబును నయ్యెడిని. క. ‘వ్రేలెడు వెంట్రుక లిరుగడ మాలఁగఁడల యమ్మ దొప్ప దొప్పన నోరిం। నేల నడిచికొను వెలవుల। లాలలు నొరగంగ నన్నలాయని యొ లుక్, ఉ- నారి-4ఆ.

17 సూ—తిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తుల నంబడు.

తిర్యక్కులనఁగాఁ బశుపక్ష్యాదులు - జడములనఁగా నచేతనములు.

వ్యా. —స్త్రీలును, దివ్యపుంసులును, (పశువులు, పక్షులు) జడములును, (చల నము లేనివి) గాక తక్కిన పదార్థములును వానివిశేషణంబులును, మహత్తులనంబడు. అనఁగా—స్త్రీలు, పశువులు, పక్షులు, గమనహీనములైనపదార్థములు మొదలైనవి యమహత్తులనియుఁ, బురుషవాచకంబులును, వానివిశేషణంబులును, మహత్తులనియు, భావము. స్త్రీలకుఁ బ్రత్యేకముగా మహతి యనియుం గలదు.

18 క్లీబంబులుమిత్త్రాదులు మహద్వాచకంబులువిభాషంబుంలింగతుల్యంబులగు.

మిత్త్రశరణప్రధానపాత్త్రాదులుమిత్త్రాదులు॥

వ్యా.—నపుంసకలింగంబులగు మిత్త్ర, మొదలైనమహద్వాచకశబ్దంబులువిభాషగాఁ బుంలింగంబులతో సమానంబులగు. అనఁగా మిత్త్ర, మొదలైనశబ్దంబులు సుహృదాదివాచకంబులు సంస్కృతంబునందు నపుంసకలింగంబులు. వీనిని దెనుఁగులోనికి నుపయోగించునపుడు డువర్ణకము చేర్చి పుంలింగంబుగాను, మువర్ణకంబుచేర్చిన పుంసకలింగతుల్యంబుగాను, నుపయోగింపవచ్చును. ఉ. మిత్త్రుఁడు, మిత్త్రము. సూత్త్రములోనపుంసకలింగమని చెప్పుటచేత మిత్త్ర, శబ్దము సూర్యపరమైనపుడు మిత్త్రమనియు, మహత్త్వనిచెప్పుటచేత, "సింగంబుమిత్త్రముగజంబుకంబు," అనునప్పుడు మిత్త్రుఁడనియు, నుపయోగింపఁగూడదని తెలిసికోవలెను. మిత్త్ర, శరణ, ప్రధాన పాత్త్ర, అను నీశబ్దంబులకుమిత్త్రాదులని పేరు. మఱియు మిత్త్రాదిశబ్దంబులకు రూపద్వయంబనిముప్పదితొమ్మిదవసూత్త్రముక్రింద నుదాహరింపఁబడ్డది. శరణశబ్దంబునకు శరణు, అనియు రూపాంతరంబుగలదు. గృహవాచకశరణశబ్దంబు సర్వదామువర్ణకాంతంబై యుండును. తే॥ గీ॥ ఇంకనైన నన్ను నేల నూలింపవు! నాకుశరణముసము నానయనుము, భార – ఆర – 2౩. తక్కుంగలమిత్త్రాది శబ్దంబులకుఁ బ్రయోగంబులు సులభంబగుటచేఁ బ్రయోగింపఁ బడవయ్యె.

19 సూ—జిత్తుబిందుపూర్వంబగు.

జకారమిత్తుగాఁగలదానికిముందుబిందువు వచ్చుననియర్థము. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడు వర్ణమిత్తనాఁబడు - ఉదాహరణముమీఁద స్పష్టంబగు.

వ్యా.—జకారము, ఇత్తుగాఁగలదానికి ముందుబిందువు గలుగును. ఇత్తనఁగా, కార్యమునిమిత్తము ప్రత్యయములు మొదలైనవానియందుఁ గూర్పఁబడ్డదై లక్ష్యమునం

త్రింబున 'డిద్ధ' శబ్దంబునకు ఉకారమువచ్చి 'డిద్ధు' అని కాఁగా నీసూత్రంబున బిందుపు ముందుగలిగిన డువర్ణకమువచ్చి 'డిద్ధుఁడు' అనియైనది. తరువాత హ్రస్వము మీఁద నున్న యఱసున్న నిండుసున్నయగును' అను నర్థమిచ్చు సంజ్ఞాపరిచ్ఛేదమందలి పదునాల్గవ సూత్రంబున 'డిద్ధుండు' అని యగును. రాముండు మొదలైన విశే గ్రహించునది.

23 సూ—డుమంతంబునకుద్వితీయాద్యేకవచనంబు పరంబగునపుడు నిగాగమంబు సర్వత్రవిభాషనగు.

రామునిని – రాముని - రామునిచేతను - రాముచేతను - రాము నికిని - రామునకును ॥ సర్వత్రయనుటనగాగమ బాధనార్థము॥

వ్యా.—డుమంతం బనఁగా 'డుక్' అను ప్రథమావిభక్తియుండుటకు యోగ్య మైన 'డిద్ధు– రాము – మగ' ఇత్యాదులు. ఇట్టి శబ్దంబునకు ద్వితీయావిభక్తి మొద లైననాని యేకవచనంబు పరంబగునపుడు 'ని' అనునది యొల్లెడలను (అన్నివిభక్తుల యందును) విభాషగా వచ్చును. ఉ. రామునిని– రాముని. రామునిచేతను– రాము చేతను. రామునికిని– రామునకును. ఇచ్చట నికారము విభాషయనుటచే 'రామునిచేతను' రాముచేతను' అనియుం జెప్పవచ్చును. 'సర్వత్ర' అని చెప్పుటచేత నిరువదియొనిమిదవ సూత్రంబున షష్ఠీవిభక్తిలోనే విధింపఁబడిన నగాగమంబును సయి తము వికల్పంబుగా బాధించునని భావము. ఉ. రామునకును– రామునికిని. 'రాము నిని' ఇచ్చటఁ బ్రక్రియ సంబోధమునకై వ్రాయఁబడును. అకారాంతమైన 'రామ' శబ్దంబు ఇరువదియొకటవ సూత్రంబుచే 'రాము' అగును. ఇది డుమంతంబు గావున ద్వితీయైకవచనంబుపుట్టి 'రాము + ను' ఇట్లుండు. ఇరువదిమూఁడవదగు నీసూత్రంబున నువర్ణకంబునకు ముందునిగాగమంబువచ్చి 'రాము + ని + ను' అగును. ఇటవక్ష్యమాణం బైన 'ఇకారంబు మీఁది' అను నిరువదియావసూత్రంబున నిగాగమంబుయొక్క యి కారము తరువాతనున్న ద్వితీయావిభక్తి నువర్ణకంబునకు నిత్యంబు వచ్చి 'రామునిని' అగును. నిగాగమంబు విభాష గావున రానిపక్షమందు 'రాము + ను' ఇట్లుండును,

డుమంతంబు విూఁది, అను నిరువదిరెండవసూత్రంబున నువర్ణకంబునకు నిత్యంబుగలిగి రాముని, అగును. ఇట్లే నిగాగమ వికల్పంబుచేతఁ దృతీయాదివిభక్తులయందుఁ గూడ రూపద్వయం బేర్పడును.

**24 సూ —అనుదంతమగు తెనుఁగుడుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును.**

మగనిని - మగనిచేతను - మగనికిని ॥ అనుదంతంబను పర్యుదాసముచేత - తమ్మునిని - తమ్ముని - తమ్మునిచేతను - తమ్ముచేతను ॥ అల్లునిని - అల్లుని - అల్లునిచేతను - అల్లుచేతను ॥ బల్లిదునిని - బల్లిదుని - బల్లిదునిచేతను - బల్లిదుచేతను - ఇత్యాదులందునిగాగమంబు పాక్షికంబనియెఱుఁగునది॥

వ్యా.— హ్రస్వోకార (హ్రస్వ + ఉకార) మంతమందులేని తెనుఁగుడుమంతంబులకు నిగాగమము నిత్యముగా నగును. ఉ. మగనిని- మగనిచేతను- మొ. మగ, ఇది యుకారము తుదలేని డుమంతంబు దీనికి ద్వితీయైకవచనము చేర్పఁగా మగ + ను, అని యగును. ఈయిరువదినాల్గవ సూత్రంబుచేత నువర్ణకంబునకు ముందు నిగాగమంబు నిత్యంబుగానయి మగని + ను, ఇకారంబు, అను నిరువది రెండవసూత్రంబుచే నువర్ణకంబున కిత్వంబువచ్చి మగనిని, అగును. ఇట్టి శబ్దంబులయందు నిగాగమంబు నిత్యంబుగాన మగనిచేతను, ఇత్యాది తృతీయాది విభక్తులు నిగాగమంబుతోఁ గూడికొన్నవై యొక్కొక రూపంబుతోనే యుండును. నిగాగమంబువిడిచి మగచేతను, ఇత్యాదికముగాఁ బ్రయోగింపఁ గూడదు. (మూలము)-అనుదంతంబను పర్యుదాసముచేత, "తమ్మునిని, తమ్ముని తమ్మునిచేతను, తమ్ముచేతను, అల్లునిచేతను, అల్లుచేతను" ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికంబని యెఱుంగునది. (వ్యా.) పర్యుదాసప్రసజ్యప్రతిషేధంబులకు లక్షణము— శ్లో॥ ప్రసజ్యప్రతిషేధోయం క్రియయా సహయత్రనఞ్। పర్యుదాసస్సవిజ్ఞేయో యత్రోత్తరపదేనన ఞ్, అర్థము నషేధార్థకమైన నకారము క్రియతో నన్వయించినచోఁ బ్రసజ్యప్రతిషేధమనంబడు. ఉ.. రాముఁడు బ్రాహ్మణుం

డుకాఁడు. ఇచ్చట (కాఁడు, అనుక్రియతో నిషేధము సంబంధించినది కావున రాముఁడు బ్రాహ్మణజాతిలోనివాఁడు కాఁడనియుఁ, దక్కినవర్ణంబులలో నేవర్ణస్థుఁడో యనియు, భావం బిచ్చును. నిషేధార్థము (క్రియతో నన్వయింపక) సమాసంబులోని యుత్తరపదంబుతో నన్వయించినప్పుడు పర్యుదాసంబు నాఁబడు. ఉ. రాముఁడబ్రాహ్మణుఁడు. ఇచ్చట (రాముఁడు అబ్రాహ్మణుండు, నఁగా జాతిమాత్రంబుచే బ్రాహ్మణుండైనను కొన్నిగుణంబులచే బ్రాహ్మణుఁడనంబడక భిన్నుఁడని చెప్పఁబడినవాఁడని భావము. నిషేధార్థకమైనశబ్దంబు సమాసంబుతో మిళితమైనప్పుడు సాదృశ్యమును, భేదమును, గూడ బోధించును. కావున. రాముఁడుకొన్ని గుణములచే బ్రాహ్మణభిన్నుఁడనియు, మఱికొన్ని గుణంబులచే బ్రాహ్మణసదృశుండనియు, నర్థమగును గాని ప్రసజ్యప్రతిషేధమునందుంబలె రాముఁడు బ్రాహ్మణవర్ణేతరుఁడని స్ఫురింపదు. అట్లే (అనుదంతంబైన తెనుఁగు డుమంతంబు, అను సూత్రంబులో నిషేధార్థక నకారము, ఉదంతశబ్దంబుతో నన్వయించినది కాన నుదంతంబులుకాని (మగ, పాప, ఇత్యాదులు కొన్నిధర్మంబులచే నుదంతశబ్దంబులతో సమానములైననే యీసూత్రంబునందు గ్రహింపఁబడును. ఇచ్చట మగశబ్దంబకారాంతము గావున నట్టిధర్మంబుచేత నుకారాంతడుమంతంబుతో సామ్యములేనిదయ్యెను. ఈయకారాంతశబ్దంబే మహత్త్వధర్మంబుచేత నుకారాంతడుమంతంబుతోఁ దుల్యంబైనదై యుండవలెను. అట్టిధర్మముగల తెలుఁగుశబ్దంబులు (మగ, మనము, పాప, ఏ, వ్రే, ఈకాప్రత్యయాంతంబులు ఇత్యాదులగును. ఇట్టిశబ్దంబులకు నిత్యంబుగా నిగాగమంబగును. (ఉదంతడుమంతంబులైన తమ్ము, అల్లు, బల్లిదు' ఇత్యాదిశబ్దంబులకు (డుమంతంబునకు, అను నిరువదిమూఁడవ సూత్రంబుచే నైకల్పికంబుగా నిగాగమంబు వచ్చును.

25 సూ—డుమంతంబుమీఁదినువర్ణకంబునుత్వంబునకిత్వంబగు.

నువర్ణంబుద్వితీయయను సూత్రముచేత - రామును - అనిప్రాప్తింపఁగా నీసూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె - రాముని - భార్గవుని॥

వ్యా—డుమంతము తరువాతి నువర్ణకముయొక్క ఉకారంబునకు . ఇకారము

వచ్చును, అనఁగా ‘నువర్ణకము ద్వితీయకువచ్చు, నను కింది సూత్రమువలన ఉత్వాంతం బగు ‘రాము, అనుదానికి నువర్ణకము రాఁగా ‘రామును, అయ్యెను. పిమ్మట నీసూత్ర మువలన నువర్ణకముయొక్క ఉకారంబునకు, ఇకారమువచ్చి ‘రాముని, అని యైనది. ఇట్లే ‘భార్గవుని, సౌందర్యవని.

26సూ—ఇకారంబుమీఁదికునువు క్రియావిభక్త్యుత్త్వంబున కిత్త్వంబగు. హరిని - హరికిని - శ్రీని - శ్రీకిని - వారిని - వారికిని॥

వ్యా.—ఇకారము తరువాతనున్న ‘ను, కు, వు, అనువానియొక్కయుఁ, క్రియలయందలి విభక్తులయొక్కయు, ఉకారంబునకు, ఇకారమగును. ఉ. హరిని. ఇచ్చట ‘హరి, అనుశబ్దము ఇకారాంతమైయున్నది. దానితరువాత వచ్చిన ‘ను, అనుదాని యుత్వంబున కిత్వంబువచ్చి ‘హరిని, అయ్యెను. కువర్ణకమునకు - హరికి, వువర్ణకమునకు- హరిస్తుతివి. క్రియావిభక్తికి—వచ్చితిరి (వచ్చితి + రు) ఈసూత్రమునందలి ఇకారమునం బు (ఇత్) లేకుండ ‘ఇకారంబుమీఁది, అనుటంజేసి దీర్ఘంబైన ఈకారంబునకుం గూడ గ్రహింపంబడునని ‘శ్రీకిని, శ్రీని, ఇత్యాదిరూపంబులయందుఁ నువర్ణకంబుల యుత్వంబున కిత్వంబగుననెను.

27 సూ— ఈధాతువుయొక్కయు నీవర్థంబులమీఁది వానియుత్వంబున కిత్త్వంబు రాదు.

ఈఁగు - ఈవు - ఈను - ఈము - ఈకు-నీకు - మీకు.

వ్యా.—‘ఈ, అను ధాతువుయొక్కయు, ‘నీ, మీ, అనువానియొక్కయు, తరువాతనున్న, ఉకారంబునకు, ఇకారంబు రాదు. ఉ. ఈఁగు (‘ఈయఁగు, అనియర్థము) ఇచ్చట, ఇద్ధాతువుయొక్క వ్యతిరేకార్థకమైన ‘ఈఁగు, అనుదానియందలి ఈకారము తరువాతవచ్చిన ఉకారము, ఇకారముగామారక ‘ఈఁగి, అనికాదు. ‘నీ, మీ, శబ్దంబుల విభక్తులయొక్క ఉకారమునకు, ఇకారమువచ్చి ‘నీకి, మీకి, ఇత్యాదికముగా

నునకు ఇట్లే మిగిలినవి. కొందఱు మహమ్మదీయులు ,నీకి, మీకి, అనివాడుటలోక ప్రసిద్ధము.

28 సూ.—కువర్ణకంబుపరంబగునపు డుకారఋకారంబులకునగాగమంబగు.

రామునకును-విష్ణునకును-సవితృనకును-విధాతృనకును.

వ్యా.—,కు,వర్ణకము పరంబగునపుడు, ఉకారంబునకుఁ గాని ఋకారంబునకు గాని, ,న, అనునది యంతాగమంబుగావచ్చును. ఉ. రామునకును - విధాతృనకును. ఇచ్చట మొదటిది ఉకారంబునకును, రెండవది ఋకారంబునకును, వరుసగా నుదాహరణంబులు. తెలుఁగులో ఋకారాంతంబులైన ప్రాతిపదికంబులు, ఏఁబదియాఱవసూత్రంబులోఁ జెప్పఁబడెను. ఇట్లు శాస్త్రంబునంజేసి ఉకారాంత ఋకారాంతశబ్దంబులకు షష్ఠీవిభక్తి పరంబగునపుడు నగాగమవిధి నిత్యంబైనను ప్రాచీనకవిప్రయోగంబులుమాత్రము నగాగమరాహిత్యంబుగాఁగన్పి కానవచ్చుచున్నవి. దీనికిఁ గారణము సంస్కృతవ్యాకరణంబులోఁ బ్రసిద్ధంబైన ,ఆగమశాస్త్రమనిత్యం,, అను పరిభాషయే తెనుఁగువ్యాకరణంబులోఁ గూడ శరణంబని కొందఱు చెప్పియున్నారు. పైపరిభాష చేతను, ,సాగరంతర్తుకామస్య, అను ప్రయోగమునందు, ఇడాగమము రానియందున ,తర్తుకామస్య, అని ప్రయోగింపఁ బడ్డదనియు, నాగమశాస్త్రము నిత్యమైనచో ,తరీతుకామస్య, అని, ఇడాగమంబుతోఁ దప్పక యుండవలెననియుఁ, జెప్పుదురు. ప్రకృతిభాషయందుంబోలె వికృతియందుం గూడఁ బైపరిభాషయే శరణంబుగా నెంచుకొని షష్ఠీవిభక్తియందలి నగాగమంబు లేకుండినను దోషంబులేదని చెప్పుదురు. నగాగమంబు లేనిచోఁ ఋవర్ణాంతనామవాచకములమీఁద షష్ఠీవిభక్తిసంబంధంబల్లిలదోషభ్రాంతి కరంబయి శ్రుతికటువగుఁ గాన నట్టిస్థలంబులందు నగాగమప్రయోగము తప్పక యుండుట మేలు. ,సీ. సీతూపుకోర్వక నిటలాక్షుఁడును దనూఫలకంబుచాటున, బాయదెపుడు, కవికర్ణరసాయనము. దనుజరిపుకు, ఇట్టిచోట నగాగమముండినచో మేలుగానుండును. ,సీ॥ పహదేవనకులవాసవసుతభీముల గ్రమమున

రాමునందును- విష్ణునందును - విధాతృనందును॥

వ్యా.—ఉకారంబునకును, ఋకారంబునకును, 'అందు' అనుసప్తమీ విభక్తి ప్రత్యయము పరంబగునపుడు నకారమంతాగమంబుగావచ్చును. ఉ. రామునందును. విధాతృనందును. ఇచ్చట 'రాము + అందు, అనియుండఁగా నందువర్ణకంబు పరంబగునపుడు, 'ఉకారఋకారంబులకును నకారకంబునచ్చును, అను దానింబట్టి 'ను, రాఁగా 'రామునందును, (రాము + ను + అందును) అని యయ్యెను. ఋకారాంతంబునకును నిట్లేగ్రహింపవలెను.

30 సూ—ఆగమములువువర్ణకంబుల కందుకర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాషనగు.

వనమునందును - వనమందును - ధేనువునందును - ధేనువందును

వ్యా—ఆగమములైన 'ము, వు, అను వర్ణకంబులకు 'అందు, అనునది పరంబగునపుడు నకారంబంతాగమంబై విభాషనగును. 'ఉ. వనమునందును, వనమందును. ధేనువునందును, ధేనువందును, ఇచ్చట 'వన, అను శబ్దంబునకు ముగాగమమువచ్చి 'వనము, అయ్యెను. దీనికి 'అందు, పరంబగునపుడు నకారమంతమందు రాఁగా 'వనమునందును, అయ్యెను, ఈమువర్ణము నలునదియువసూత్రముచేత నాగమముగాని ప్రథమావిభక్తికాదు ప్రథమావిభక్తియేయైనచో సప్తమీవిభక్తికిని, ఈప్రథమకును నెట్లుసాంగత్యముకూడును? కావున నిట్టిస్థలంబుల ముకారవుకారంబులు విభక్తులని భ్రమింపవలదు. విభాషయగుటచే నకారము రానియపుడు ఉకారసంధికలిగి, 'వనమందు, అయినది. వువర్ణాంతంబును నిట్లేగ్రహించునది.

31 సూ—బహుత్వంబునద్వితీయావిభక్తులకు లడాగమంబగు.

రాములను - రాములచేతను - విధాతృలను - విధాతృలచేతను॥

వ్యా— 'బహువచనమందు ద్వితీయ మొదలైన విభక్తులకు మొదట లకారము వచ్చును. ఉ. రాములను రాములచేతను, విధాతృలను, విధాతృలచేతను, ఇచ్చట

బహువచనము చెప్పఁబడినదిగనుక ద్వితీయయైన నువర్ణకమునకు మొదట లకారమువచ్చి నది. 'రాములచేతను, ఇత్యాది మిగిలిన విభక్తులయందును నిట్లే గ్రహింపవలెను.

32 సూ—సంబోధనంబునందేకార్థంబయిన పదంబుతుదియుకారం బునకకారంబగు.

ఓరాముఁడ - ఓవృక్షమ - ఓశంభువ - ఓకొడుక॥

వ్యా—సంబోధనంబునందు, ఏకవచనాంతమైన మాటయొక్క కడపటి ఉకా రంబునకు' అకారంబగు. ఉ. ఓరాముఁడ. ఇచ్చట 'రాముఁడు, అనునుకారాంతశబ్దం బేకవచనంబుగనుకను, సంబోధకముగనుకను, కడపటనున్న ఉకారంబునకు అకారము వచ్చి 'ఓరాముఁడ, అనియయ్యెను. ఇట్లే 'ఓవృక్షమ, ఇత్యాదులు గ్రహింపవలెను.

33 సూ.—సంబోధనంబునందుఁబదంబుతుదియకారేకారంబులకుదీ ర్ఘంబువిభాషనగు.

ఓరాముఁడా - ఓరాముఁడ - ఓచెలియా - ఓచెలియ - ఓహరీ - ఓహరి - ఓతండ్రీ - ఓతండ్రి॥

వ్యా—సంబోధనమందు మాటయొక్క తుదనున్న అకారమునకును, ఇకారం బునకును దీర్ఘంబు విభాషగానగును ఉ. ఓరాముఁడా—ఓరాముఁడ ఓహరీ—ఓహరి మొ. ఇచ్చట సంబోధనమందు చివరనున్న అకారమును, ఇకారంబును, విభాషగా దీర్ఘంబులౌనుగనుక దీర్ఘాంతంబుగా నొకసారియు, హ్రస్వాంతంబుగా నొకసారియుఁ బ్రయోగింపఁబడెను.

34 సూ—కృతోత్కంబగుసంస్కృతనామంబు సంబుద్ధిడుజ్ఞునకు లోపంబువిభాషనగు.

ఓరామ - ఓకృష్ణ - పూర్వసూత్రముచేత దీర్ఘంబు - ఓరామా

ఓకృష్ణా॥ సంస్కృతనామంబనుటంజేసి - ఓతమ్ముఁడ - ఓబల్లిదుఁడ - ఇత్యాదులందులోపంబు లేదు॥

వ్యా.—‘శాస్త్రముచే సాధింపఁబడిన ఉకారముగల సంస్కృతనామంబుల డువర్ణకంబునకు లోపము విభాషగాఁ గలుగును. ఉ. ఓరామ. ఇచ్చట ‘రామఁ శబ్దము సంస్కృతనామము. దీనికి నిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నత్వ డుజ్ఞులు గలిగి ‘రాముఁడు, అయ్యెను. తరువాత ముప్పదినాల్గవసూత్రంబుచే సంబుద్ధి డువర్ణకములోపించి, ముప్పదిరెండవసూత్రంబుచే నుకారంబునకు నకారమువచ్చి ‘(ఓ) రామ, అనియైనది. దీనికి ముప్పదిరెండవసూత్రంబున దీర్ఘంబువచ్చి ‘(ఓ) రామా, అనియైనది. ఈసూత్రంబులో సంస్కృతనామమని చెప్పుటచేత (ఓ) బల్లిదుఁడా, అనునపుడు డువర్ణకము లోపాదికార్యంబులుగలిగి ‘(ఓ) బల్లిద, ఇత్యాది దుష్టరూపంబులు కావయ్యె. ఈసూత్రంబులోఁ గృతోత్కంబను విశేషణంబు లేకపోయెనేని దోషంబు గలుగును. నలువదినాల్గవసూత్రంబుచేతను ఇకారాంతాది శబ్దంబులకుఁ బ్రథమైకవచనమునకు లోపంబు నిత్యంబుగఁ జెప్పబడ్డది. ఈముప్పదినాల్గవసూత్రంబులో సంస్కృతనామంబు సంబుద్ధిడుజ్ఞునకు లోపంబు విభాషయని సూత్రింపఁబడె. నలువదినాల్గవసూత్రము సామాన్యసూత్రమై యీసూత్రంబు విశేషసూత్రంబగు. కాన సంబుద్ధికాని ప్రథమైకవచనంబునకు లోపంబుచేసి సావకాశమైననలువదినాల్గవ సూత్రంబును సంబుద్ధిడుజ్ఞు విషయంబులో నీముప్పదినాల్గవసూత్రంబు బాధించును. అందున ‘హరి, ఇత్యాది శబ్దంబులు సంబుద్ధ్యేకవచనంబులో విభాషగా డుజ్ఞుతోనిల్చి ‘హరిడా, ఇత్యాదిరీతిగా దుష్టరూపంబు కావలసివచ్చును. ఆదోషము నివారింప నీముప్పదినాల్గవసూత్రములో ‘కృతోత్కం, బనినవిశేషణంబుంపఁబడినది. అందున శాస్త్రంబుచే నుకారాంతంబులైన ‘రాము, డిద్ధు, ఇత్యాదుల సంబుద్ధిడుజ్ఞునకేలోపంబు గలుగునుగాని ‘హరి, ఇత్యాదిశబ్దంబులందు వైభాషికసంబుద్ధిడుజ్ఞులోపము ప్రసక్తింపనేరదు. కృతోత్కంబని సూత్రించుట శాస్త్రముచేగలిగిన ఉకారముగలవియే యనుటంజేసి సహజముగా నుకారాంతంబులైన ‘శంభు, విష్ణు, భాను, ఇత్యాది సాంస్కృతికంబులమీఁది సంబుద్ధిడుజ్ఞునకు విభాషగా లోపంబుగలిగి ‘శంభొ’ విష్ణొ, భానొ, ఇత్యాద్యనిష్టరూపంబులు కలుగుచు ‘శంభూ’ విష్ణూ, భానూ ఇత్యాది ప్లుతాంతసంబుద్ధి సాధురూపంబు

36 సూ—సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు

ఓ రాములార - ఓకృష్ణులార - దీనికిం బాక్షికంబుగ దీర్ఘంబగు - ఓ రాములారా - ఓకృష్ణులారా॥

వ్యా—సంబోధనంబునందు బహువచనంబునకు ఆరగాగమంబువచ్చును. ఇదికకారేత్వముగాన సంబోధ్య వాచకములకు నిత్యము నిర్దేశం వచ్చును. ఇచ్చట 'రాములు' అనునది బహువచనము. దీనికి 'ఆర' అనునది సంబోధనంబునందు రాఁగా సుకారసంధి కలిగి రాములార, 'రాములారా', కృష్ణులార, కృష్ణులారా. ఇత్యాదులగును. సంబోధ్యవాచకంబులును, వారికి విశేషణంబులును, బహువచనాంతంబులైనను క్రియమీఁద వచ్చెడి యవ్యయగులు మాత్రమేకవచనాంతంబులగును. ఉ. ఆ. వె. మనయశోద చిన్నినగవానిఁ గనెనఁట మాచిన త్తమన్మసుదతులార' భాగ.. 10 స్కం— పూ.

37 సూ—మధ్యమపురుషయోగంబునందారగాగమంబువిభాషనగు

వినుఁడు బాలకులు - వినుఁడు బాలకులార - వచ్చితిరి కాంతలు - వచ్చితిరి కాంతలార॥ అన్నలారమిమ్మునడిగెద నొకమాట - ఇచ్చటమధ్యమపురుషయోగంబు లేమింజేసి యారగాగమంబునిత్యంబు॥

వ్యా— మధ్యమపురుషంబుతో సంబంధించినప్పుడు సంబుద్ధ్యంతంబునకు ఆరగాగమంబు వైభాషికంబుగా నగును. ఉ. వినుఁడు బాలకులు- వినుఁడుబాలకులార ఇచ్చట 'వినుఁడు' అను క్రియకు బాలకులే కర్తలుగావున బహువచనాంతంబైన బాలశబ్దంబుపై ఆరగాగమంబు విభాషగానయి 'బాలకులారా', బాలకులు' అని రూపద్వయమైనది. 'అన్నలార మిమ్మునడిగెద నొకమాట' అనువాక్యంబులోఁ క్రియయైన 'అడిగెదఁ' అను దానికి 'నేను' అనునది కర్త సంబంధిమను గాని 'అన్నలార' అను బహువచనాంతంబుచే సంబోధ్యులైనయన్నలు కర్తలుకారు కావున 'అన్నలుమిమ్మునడిగెద నొకమాట' అని చెప్పఁగూడదు. ఇట్టిచోట్లను, ఆరగాగమంబు నిత్యంబుగా నుండవలెను. క. ఒప్పులు గలిగిన మెప్పుఁడు । తప్పులుగలిగిన వెత్తింగి

తగఁ దిద్దుఁడుత । ప్పొప్పనకుఁ డొప్పుతప్పని । చెప్పఁడేకవులుపాస్తిచేసెదమిమ్మున్. ఆంధ్రభాషాభూషణము. చ. అనఘ మదీయవర్తనమునందొక దోషము గన్నవారొ నా । యనుజుఁడు లక్ష్మణుండు తనకర్హముగానిగతిం జరించెనో! । జనకతనూజనాకు బరిచర్యలుసేయుతఱిన్ దపస్వినీ । జనపరిచర్య లేమఱెనొ! సంభ్రమకారణమేమి సంయముల్, రామాయణము. గీ. దిక్ప్రదర్శనముగఁ దెలిపెదునిందుల । క్షణముకాన బూర్వకవుల లక్ష్య । ములనుఁజూచిలక్ష్యములఁ గాంచి తప్పుల । క్షణమెఱింగికొనుఁడు చతురమతులు, బాలవ్యాకరణము.

38 సూ—అదంతంబయిదీర్ఘపూర్వలోపధంబయినమహత్తుమీఁది విభక్తిలకారంబునకు రేఫంబగు.

బాలురు - బాలురను - బాలురచేతను - నృపాలురు - నృపాలురను - నృపాలురచేతను ॥ దయాళుశబ్దంబున కిట్లు రేఫంబుగానంబడియెడి ! దయాళురు - దయాళురను - దయాళురచేతను॥

వ్యా—హ్రస్వాకార (హ్రస్వ + అకార) మంతమందుఁగలదై దీర్ఘముముందు గల లకారము, ఉపధగాఁగలదైనమహద్వాచకముమీఁది విభక్తిలకారమునకు రేఫము వచ్చును. ఉ. బాలురు. మొ. ఇచ్చట (బాల, శబ్దంబు. పుంలింగము, అకారాంతశబ్దము ఈశబ్దంబునకునుపధ లకారము. (శబ్దంబులతుదివర్ణంబునకు ముందువర్ణము. ఈబాల శబ్దమందుఁ దుదివర్ణము అకారము. దానికి ముందువర్ణము లకారము. అయ్యది ఉపధయనంబడును.) ఈలకారంబునకుఁ బూర్వాక్షరము బకారముమీఁది దీర్ఘాకారము. (బాలురు.) (బాల + లు, అని యుండఁగా బాలశబ్దము హ్రస్వాకారాంతంబును, దీర్ఘపూర్వ లకార ముపధగాఁగలదియును, మహద్వాచకంబును, గాననిచ్చటివిభక్తిలకారంబునకు రేఫంబుగలిగి 'బాల + రు' అయ్యెను. ఇరువదియొకండవసూత్రంబునఁ బ్రకృతికి నుత్వంబుగలిగి 'బాలురు' అయ్యెను. ఇట్లే 'నృపాల, గుణశీల' ఇత్యాదిశబ్దంబులును హ్రస్వాకారాంతమై సూత్రోక్తమైన లక్షణంబులు గలవిగావున బహువచనలకారమందు రేఫాదేశంబునుబొంది (నృపాలురు, నృపాలురచేతన్ --గుణశీలురు, గుణశీలుర

యొక్క, ఇత్యాదికముగానుండును. ప్రకృతము తత్సమపరిచ్ఛేదము కావునను, సంస్కృతనామపదంబుతో మిళితంబైనముప్పదినాలుగు ముప్పదియైదు సూత్రంబులకు నీసూత్రంబు సన్నిహితమైనదికావునను, దీనిలో సంస్కృతనామంబని వేఱవచింపనక్కఱలేదు. తెలుంగుశబ్దంబులగుటచే 'గోల, చేల, మాల' ఇత్యాదిశబ్దంబులకును, అదంతబనుటచే 'కరుణాశాల్కి, దృఢతాలు' అనువానికినిఁ మహచ్ఛబ్దంబనుటం జేసి 'పుష్పమాల, మొదలైనవానికిని నీరేఫవిధి సెల్లనేరదు. దయాళుశబ్దంబును గుఱించి యొకవిశేషంబుగలదు, 'దయాంలాతి (గృహ్ణాతి) అనునర్థమునందు సంస్కృతవ్యాకరణంబుచేఁ, కప్రత్యయంబుగలిగి 'దయాల, అనెడి యకారాంతరూపంబు 'బాలశబ్దంబువలె నుండును. అట్టిశబ్దంబుయొక్క బహువచనలకారంబునకు రేఫంబు నిర్బాధంబు గావచ్చును. ఇట్లే 'కరుణాల. అనుశబ్దంబుగూడ నకారాంతంబుండును. దానిబహువచనలకారము సయితము రేఫాదేశంబును బొంది 'కరుణాలురు, ఇత్యాదికముగా నగును. 'సంస్కృతంబులో 'దయ,ధాతువునకు,ఆలుచ్,ప్రత్యయంబున్నదికాని కరుణాశబ్దంబుకంటె నట్టి ప్రత్యయం బుప్పతిల్లనేరదు. కరుణాలశబ్దంబు చిన్నయసూర్యాదు లకారాంతత్వమతిచేఁ బ్రయోగించినారు (నీతిచంద్రికలో) అట్లేఅకారాంతమైన దయాలశబ్దంబైనపుడు రేఫాదేశంబునకు బాధలేకున్నను 'ఆలుచ్, ప్రత్యయాంతంబై ఉకారాంతదయాలుశబ్దంబునకుఁ బ్రకృతసూత్రంబు సంబంధింపనేరదు కావున 'దయాలులు, ఇత్యాదిలకారసహిత దుష్టరూపంబులు కాకుండ నీసూత్రమునొద్ద రేఫాదేశంబు దానికివిశేషించి చెప్పవలసివచ్చెను. రేఫాదేశంబునకు లక్ష్యములు—తే॥ గీ॥ దేవతాభర్తశంభుప్రతిష్ఠఁ జేసి । సురగణంబులలోకపాలురను జూచి, భీమఖండము - ఉ ॥జలస్తోమంబునల్పాంకలం । దెలరన్నాభిచయంబులోఁగొనియె వానింజాలగాంభీర్యశ్రీ । లురుసంక్షోభము నొందువారినెచటఁ లోఁగొంచువర్తింపరే,' పారి - 4ఆ. క॥ ఇరువదియేవురుపాంచాలురు నూర్వురుకేకయులును లూనాంగకులై । ధరఁదొరఁగిరి పెఱమొత్తము । కరినికరముఱొంపిఁబడినగతినుండెన్నృపా., భార - ద్రోణ- 8 ఆ.

39 సూ—అమహన్నపుంసకముల కదంతంబులకు ముర్ణవకంబగు.

వృక్షము - ఋక్షము - దైవము — కళత్రము - అపత్యము॥

41 సూ—ముువర్ణకంబునకు విధించిన కార్యము ముగాగమంబున కునగు.

ముువర్ణకంబునకు విధించు లోపాదేశాది కార్యములు ముగాగమమునకు సహితము వచ్చునని యర్థము॥

వ్యా—ముువర్ణకంబునకు విధించు కార్యము ముగాగమమునకును వచ్చును. అనగా ముువర్ణకమునకు వచ్చు లోపము, ఆదేశము, మొదలగు కార్యములు బహువచనమునకు ముందున్న ముువర్ణమునకును గలుగునని యర్థము.

42 సూ—ముువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణంబేని విభాషనగు.

వృక్షమ్ము - వృక్షంబు॥ ఋక్షమ్ము - ఋక్షంబు పూర్వసూత్రముచేత ముగాగమమునకీ కార్యంబగు - వృక్షమ్ములు — వృక్షంబులు ఋక్షమ్ములు - ఋక్షంబులు॥

వ్యా—ముువర్ణకంబునకు ద్విత్వమకారముగాని పూర్ణబిందుపూర్వకబువర్ణకంబు గాని విభాషగానగును. ద్విత్వమునకు - వృక్షమ్ము. పూర్ణబిందుపూర్వకబువర్ణంబున వృక్షంబు ఇట్లే ఋక్షమ్ము మొదలైనవి. ముువర్ణకంబునకు వచ్చు కార్యము బహువచనము మొదలైనవానియందు వచ్చు ముగాగమంబునకును గలుగును, అను నలుపదియొకటవ సూత్రముంబట్టి ద్విత్వము రాంగా వృక్షమ్ములును, పూర్ణబిందుపూర్వకబువర్ణంబు రాంగా వృక్షంబులును, అయ్యెను. ఇట్లే మిగిలినవి.

43 సూ—లులనలుపరంబులగునపుడో కానోకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు.

వజ్రాలు - వజ్రాలను - వజ్రాన ॥ పగడాలు - పగడాలను

పగడాన ॥ ఒకానొకచోటననుటచే నీకార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపంబడియె॥

వ్యా.—లు, ల, న, లుపరంబగునపుడు, ఒకానొకచోట ముగాగమంబునకు లోపంబును, దానిముందున్న యచ్చునకుదీర్ఘంబును విభాషగా నగును. ఉ. వజ్రములు వజ్రాలు, వజ్రాలను, వజ్రాన, పగడాలు, పగడాలను. ఇచ్చట బహువచనమునకు ముందాగమముగావచ్చిన ముచర్ణంబునకు లోపంబువచ్చి 'వజ్రలు' అయినది. పిమ్మటఁ బూర్వమైన రేఫముమీఁదిఅకారమాకారముకాఁగా 'వజ్రాలు' (వజ్ర్ + ఆ + లు) అయినది. విభాషయనుటచే వజ్రములనియుంగలవు. ఇట్లే పగడాలు మొదలైనవి. పైసూత్రంబునందు 'ఒకానొకచోట, అనుటంజేసి యిట్టి ప్రయోగంబులు తఱుచుగా నుండవు.

44 సూ.—ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకులోపంబగు.

ఇకారాంతములకు గ్లౌరైశబ్దములకు మఱియుగాగమాంతంబులకుం బ్రథమైకవచనలోపంబగు ॥ హరి - గిరి - శ్రీ - ధీ.

వ్యా.—ఇ, గ్లౌ, రై లయొక్కయు, ఉగాగమాంతంబులయొక్కయుఁ, బ్రథమావిభక్త్యేకవచనంబునకు లోపంబుగల్గును, అనఁగా ఇకారాంతశబ్దంబులకును గ్లౌ. రై, అను శబ్దంబులకును, ఉగాగమాంత శబ్దంబులకును, (అఱువదియొనిమిదవ సూత్రంబుచేత ముగాగమము విధింపఁబడుచున్నది.) ప్రథమావిభక్త్యేకవచనము లోపించును. అనఁగా డువర్ణకము మొదలైనవి కనఁబడవు. ఇకారాంతంబునకు- హరి ఇచ్చటఁ బుంలింగంబునకుఁ బ్రథమైకవచనము పుట్టిలోపించినది. ఉగాగమాంతశబ్దంబునకు- రుక్కు. ఇకారమనుటచే దీర్ఘంబులకును గ్రహణంబు గలిగె, శ్రీ, ధీ, ఇత్యాది శబ్దంబులమీఁదనున్న ప్రథమైకవచనంబునకును లోపంబు గలిగెను.

45 సూ.—ఇత్తునకుబహువచనంబు పరంబగునపుడుత్వంబగు.

హరులు - గిరులు కవులు - రవులు - యామినులు - భామి

నులు ॥ తపరకరణంబుచే దీర్ఘంబునకుత్వంబులేదు ॥ శ్రీలు - స్త్రీలు - లకోరీలు॥

వ్యా.—హ్రస్వేకారంబునకు బహువచనంబు పరంబగునపు డుత్వమగును ఉ. హరులు. ఇచ్చట 'హరి, అనుశబ్దంబునకు బహువచన ప్రత్యయంబగు 'లువర్ణకము రాగా 'హరి + లు, అయినది అప్పుడు ఇకారముపోయి ఉకారము రాఁగా హరులు (హర్ + ఉ + లు) అయినది. ఇట్లే గిరులు, కవులు, రవులు, యామినులు, భామినులు. మొదలైనవి. (విశేషము) 'రశ్మి, రాశి, పరదేశి, పేశి' ఇత్యాది శవర్ణపూర్వకేకారాంతంబులకు బహువచనంబు చేర్చునపుడు వాని శవర్ణంబు సవర్ణంబగు. ఉ. రస్ములు రాసులు, పరదేసులు, పేసులు. 'గోచి, వాజి' ఇత్యాది తత్సమశబ్దంబుల తాలవ్యచజలకు బహువచనంబు పరంబగునపుడు దంత్యచజలుంబోలెఁ బైశబ్దంబులయందలి తాలవ్యశవర్ణంబునకు బహువచనంబులందు దంత్యంబైన సవర్ణాదేశము కవులప్రయోగంబులఁ గాన్పించుచున్నది. పైమూలసూత్రంబునందుఁ దపరకరణంబున హ్రస్వేకారమే గ్రహింపఁబడినది కాన 'శ్రీ, ధీ' ఇత్యాదులందలి దీర్ఘేకారంబులకు నుత్వంబురాదు. ఉ. శ్రీలు, స్త్రీలు, లకోరీలు. 'నచదేశ్యపదే' అనువాగనుశాసన సూత్రంబుంబట్టి దేశ్యంబుల దీర్ఘంబు హ్రస్వంబు కానేరదు కావున వాగనుశాసనమతంబునే యనుసరించి సూరిగారు 'లకోరీ' శబ్దంబు దీర్ఘాంతముగానే యిచ్చట నుదాహరించిరి కాని నవలా, నేజా, లకోరీ, తేజీ' ఇట్టి దీర్ఘాంత శబ్దంబులకు హ్రస్వమును గలదు. మఱియు నేజా' శబ్దంబునకు 'నేజము' అను రూపంబును గలదు. దీర్ఘమునకు- మ. 'నతనాభిన్నవలానొకానొకమరున్నాగీశిరోరత్నమున్' మను - 2ఆ. హ్రస్వంబునకు- క. అన్నవల ముద్దుమోమును। దిన్నని నెన్నడుమునగవు దేరెడుకన్నుల్' విక్ర-6ఆ. నేజాకు—ఉ. కల్వమొగ్గనే। జానటుచిమ్మి' భాను 3ఆ. నేజకు- సీ. అనఁగఁ జుట్టంబైన యలవసంతునిరాకఫిరవాజి బలునేజవిఱుగఁ జూచి' చంద్ర - 3 ఆ. నేజమునకు- క. నేజముగొని యిప్పొటున। నేజమునింజేర్తునను' శశాం-5 - ఆ. లకోరికి- ఉ. హెచ్చిన బొమ్మవిండ్ల గదియించిన చూపులకోరికోలలన్' చంద్రా - 1ఆ. లకోరీకి- క. ఈరీతిం గొందలిరులు। కోరికసురతాణికాఁకఁ గూర్చుచకోరీ' చంద్ర. సీ. రాణనొప్పారు పైఠాణంబు

సింగిణి గుఱుకులకోరీల తరకసంబు, మను - 4ఆ. క. తెల్లని యొకకత్తళాని తేజీహాయముఁ, నైష - 5ఆ. ఉ. కోహళంతెల్ల నర్థపుఁబుఱ్ఱములెల్లను తేజీలస్వారిఁ, విక్ర-1ఆ. ఇయ్యవి యిట్లుండఁగాఁ గొందఱు 'అన్యదన్యాపి శబ్దస్య దీర్ఘాంతత్వం క్వచిద్భవేత్' అను నథర్వణాచార్యులసూత్రంబుంబట్టి తత్సమంబైన 'పల్లకి' శబ్దంబు, 'పల్లకీ' అని దీర్ఘాంతము నొందియున్నదని చెప్పుదురు. అప్పుడును బహువచనంబున 'పల్లకీలు, పల్లకులు' అని రూపద్వయంబు. మఱికొందఱు 'పొల్లు పల్లకి శిబికే' అని సంస్కృతమునంగూడఁ బల్లకీశబ్దంబు ప్రయోగింపఁబడిన దగుటం సంస్కృతశబ్దంబని యందురు అప్పుడును తెనుఁగునందు దీర్ఘాంతంబుగాఁ బ్రయోగింపఁ గూడదని. పల్లకీలునం దలములు వారువంబులును ... నాడిగఁ గ్లు ... బు, కళా - 2ఆ. ఉ. పల్లకులన్ మహోష్ట్రముల భద్రగజంబులనందలంబులన్ గొల్లనబంధువుల్ నడవ, జై-2ఆ.

46 సూ—వికృతియందికారాంతములయుపోత్తమేత్వంబునకు బహువచనముపరంబగునపుడుత్వంబగు.

ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింప వలయు. కలికి - కలుకులు మొలికి - ములుకులు చెలిమి - చెలుములు- బలిమి - బలుములు ॥ ఉపోత్తమేత్వంబున కనుటంజేసి - జిగి నిసి - ఇత్యాదులందుత్వంబులేదు-జిగులు-నిసులు॥

వ్యా.—'త్ర్యాదీనామంత్యముత్తమం తస్య సమీపముపోత్తమం. అనువచనముం బట్టి:—ఉత్తమమనఁగా - మూడక్షరములు మొదలుకొని కలిగినశబ్దంబులోఁ గడపటియక్షరము. ఉపోత్తమమనఁగా ఉత్తమమునకుఁ బూర్వాక్షరము. తెనుఁగునందు హ్రస్వేకారమంతమందుఁగల శబ్దంబుల యుపోత్తమముయొక్క ఇకారంబునకు బహువచనంబు పరంబగునపు డుత్వముకలుగును. సూత్రంబునందు 'వికృతి' అని చెప్పుటచేత సంస్కృతసమములు కావని గ్రహింపవలెను ఉ. 'కలికి' ఈశబ్దంబులో మూఁడక్షరములున్నవి కాన మూఁడవదియైనకివర్ణంబుత్తమము రెండవదియైన లివర్ణంబుపోత్తమంబునగును. ఈకలికిశబ్దంబునకు బహువచనంబైన లువర్ణకము పరమైనది కావున నలు

పదియైదవసూత్రంబుచే కలి, వర్ణంబుయొక్క ఇకారంబునకు ఉకారంబువచ్చి కలికులు, అగును. (కలిక్ + ఉ + లు) పరిష్కృతసూత్రంబుచేత నుపోత్తమంబైన లివర్ణంబుయొక్క ఇకారంబునకు ఉత్వంబువచ్చి కలుకులు, (కల్ + ఉ + క్ + ఉ + లు) అయినది. తెలుఁగుశబ్దంబుల కనుటచే సమితి, మొదలగు సంస్కృతసమంబుల ఉపోత్తమమైన మివర్ణంబునకు ఉత్వంబురానియందున సమితులు, అగును. ముఱికి, చెలిమి, బలిమి, మొదలైనవానిక రూపసిద్ధి కలికి శబ్దంబునకుంబోలె గ్రహింపవలెను ఉపోత్తమమైన ఇకారమనుటంజేసి రెండక్షరంబులుగల జిగి, నిసి, ఇత్యాదిశబ్దంబుల మొదటి ఇకారంబునకు ఉకారముగలుగదు. ఉ. జిగులు, నిసులు,

47 సూ—రలడోపధనవార్థాదుల యుపోత్తమేత్వంబునకుత్వంబు గలుగదు.

పందిరి - పందిరులు ॥ పిడికిలి - పిడికిళ్లు ॥ రాపిడి - రాపిడులు॥ తొమ్మిది - తొమ్ముదులు.

వ్యా.—ర. ల, డ, అనునవి ఉపధగాఁగలిగినవానియొక్కయు, నవసంఖ్యార్థకప్రభృతిశబ్దంబులయొక్కయు, ఉపోత్తమమైన ఇకారంబునకు ఉకారంబురాదు రేఫోపధకు—పందిరి, ఇచ్చటరేఫ ముపధగాఁగలది గనుక దీనియుపోత్తమమైన దకారంబుమీఁది ఇకారంబునకు ఉత్వంబురాక పందిరులు, అని యగును. పిడికిళులు, రాపిడులు మొదలైనవిట్లే గ్రహింపవలెను. తొమ్మిది, ఇచ్చటఁ గూడ నుపోత్తమమైన మకారద్వయంబుమీఁది ఇకారంబునకు ఉత్వము రాదు. ఉదా. తొమ్మిదులు. ఈసూత్రంబునందు నవార్థాదిశబ్దంబందలి ఆది, శబ్దంబు ప్రకారార్థంబుగావున ఎనిమిది, పగిది, చెయిది ఇత్యాదిశబ్దంబుల ఉపోత్తమేత్వంబునకు ఉత్వంబురాదు.

48 సూ—ఉకారాంతగోశబ్దంబుల కంతటవువర్ణకంబగు.

తరువు-ధేనువు-మధువు - గోవు॥ అంతటననుట స్త్రీలింగప్రథమైకవచనలోపబాధనార్థము॥

వ్యా.—ఉకారాంతంబులకును, గోశబ్దంబునకును, అన్నిలింగంబులయందును, 'వు' వర్ణకంబువచ్చును, ఉ. 'తరువు, ధేనువు, గోవు'. మొదలైనవి. 'తరు, అనుశబ్దంబుకారాంతంబు. దీనికి వువర్ణకంబు రాఁగా 'తరువు, అని యైనది. 'గో' అనుశబ్దంబునకు వువర్ణకంబు రాఁగా 'గోవు, అని యైనది. అంతటననుటచేత 'స్త్రీలింగంబుల, అను నేఁబదియేడవసూత్రంబుచే విధింపఁబడిన ప్రథమైకవచనలోపంబు ఉకారాంత స్త్రీలింగ గోశబ్దంబులపైఁ జెల్లదని తెలిసికొనునది.

49 సూ.—వువర్ణకేతరవిభక్తిపరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగాగోశబ్దంబునకునిత్యంబుగావుగాగమంబగు.

తరువులు - తరులు - ధేనువులు - ధేనులు — గోవులు॥

వ్యా.—వువర్ణకంబుకంటె నితరవిభక్తి పరంబగునో నుకారాంతపదంబులకు బహుళముగాను 'గో, శబ్దంబునకు నిత్యంబుగాను, వుగాగమంబగును. ఉ. తరువులు, ధేనువులు, గోవులు. ఇచ్చట 'తరు + లు, అనియుండఁగా నీసూత్రంబుచేత వువర్ణంబు బహువచనంబునకు ముందుచేరి 'తరువులు, అయినవి. ఈవిధి బహుళంబు గావునఁ బక్షంబున 'తరులు, అయినవి. 'గోవులు. ఇచ్చట గోశబ్దంబునకు వుగాగమవిధి నిత్యంబుకాఁబట్టి రూపాంతరంబులేదు. మఱియు 'రాహు, బాహు, కేతు, బిందు, శబ్దంబుల ప్రథమావువర్ణకంబునకు లోపంబు వికల్పంబని కొందఱందురు. ఉ. 'రాహు,—రాహువు. బాహు—బాహువు' ఇత్యాదులు. 'క॥ పర్వములేకయును రాహు భానుని బట్టెన్, భార, శల్య. 2ఆ. సీ॥ విద్యుత్సహస్రముల్ నిలిచినట్లుగా రాహు పర్వంబుగాకయు భానుఁగప్పె, భార- సభా 2 ఆ. తే॥ అగ్గలించి నారెముదుర బాహువ్వలించి కడవజాలినమల్లురఁగాన నెందు, భార- విరా- 2ఆ. మొ. ఇట్టిలోపంబు సంస్కృతశబ్దంబులకేకాక 'పుట్టు, చట్టు, తట్టు, గట్టు, మొదలైన తెలుఁగుశబ్దంబులకు నేకవచనంబందు వువర్ణకలోపంబు వైకల్పికంబు గానగును. ఉ. పుట్టు, పుట్టువు. మొ.

50 సూ.—ఉకారాంతంబగు మహాత్మునకువువర్ణకముబహుళముగానగు.

విష్ణువు - విష్ణుఁడు ॥ శంభువు - శంభుఁడు ॥ వసువు - వసుఁడు.

వ్యా.—ఉకారమంతమందుఁగల మహద్వాచకములకు వువర్ణకము బహుళముగా నగును. ఉ. విష్ణువు, విష్ణుఁడు ఈసూత్రంబుచేత సుకారాంతశబ్దంబులకంటె వువర్ణకంబు వైకల్పికంబుగావున గతించిన యిరువదిరెండవసూత్రంబుచేత డువర్ణకము పక్షంబున వచ్చి విష్ణుఁడు,అను రెండవరూపమయ్యె, ఇట్లే శంభువు, శంభుఁడు. వసువు. వసుఁడు, ఇత్యాదులు. చ॥ సతినడిగెంమభవ్యగుణశాలి వసుండఁట. వేఁడవచ్చువాఁ। డతుశిత దేవరాజ్యభరణై కధురంధరుఁడైన సూశత। క్రతుఁడఁట. వసు- ఆ- తే॥ గీ॥ వఱలు భవ్యవిభావిభావసుఁడువసుఁడు' వసు ఆ...చిన్నయసూరిగారుమన్వాదిశబ్దంబులకుడువర్ణకముంగూర్చి యేమియుఁజెప్పక విడిచిపెట్టిరి. అయినను నియ్యది వివాదాంశంబుగావున దీనింగుఱించి కొంతస్థాలీపులాకన్యాయంబుగ విమర్శింపవలెఁ. 'మనుపట్వాదిశబ్దానాం నడుఙ్నిశ్చప్రయుజ్యతే' అని యథర్వణాచార్యులును, అహోబలపతియున్నగు వారలును డువర్ణకమును నిగాగమమును నిషేధించిరి. (మను, మఘ, పటు, వటు,కటు, దను మొదలైనవి మన్వాదులు) కానిమధుపటుశబ్దంబులకుఁ బ్రయోగంబులు కానంబడు చున్నవి. చ. అలర మృషాపటుండు బలియాచనసేయుటకైనివేశముఁ వెలువడె' తే గీ॥ యాగశాలకువచ్చె మాయావటుండు, తే॥ గీ॥ అంతఁ జిఱునవ్వుతోడ మాయావటుండు' దశావతారచరిత్ర. శా॥ చండస్ఫూర్తిపటుండుగాంచె, భాగవతము. ఆ వె. వేశ్యమాతఁగనియెవిజనకాలాశ్రయా। కృతపటుండు శాంబరీపటుండు, వైజయంతీ విలాసము. క॥ ఈమహిమయెందుఁగలదే! భూమండలిలోననితఁడె పాచక్రనివాడో మగువలార మునువిని! మామన్మథునతని మేనమామన్మథుని, వైజయంతీవిలాసము ఆ! వె! గురువుప్రభువునాఁగగురుఁడు ప్రభుఁడనంగ। శర్మవర్మనాఁగశర్ముఁడనఁగ। వర్ముఁడనఁగఁజెల్లు; వటువును మనువును। బటువు డులకుఁబాసిపరఁగుచుండు, ఆంధ్రభాషాభూషణము. అథర్వణాచార్యులతో నేకీభవించి కేతనకవీంద్రుఁడు డువర్ణకాంతంబైన మన్వాదిశబ్దంబులుండవని యేసిద్ధాంతీకరించుచున్నాఁడు.

51 సూ—కద్రువనాగమాత.

కద్రువ - కద్రువలు - కద్రువను - కద్రువలను॥

ఇట్టివిధినిసన్నియోగశిష్టమందురు. సన్నియోగశిష్టమనఁగానొక్కసూత్రంబునందువిధింపంబడినకార్యద్వయంబులో నొకటివచ్చునప్పుడు రెండవదికూడఁ దప్పకవచ్చుట. విధాతృశబ్దంబునకుస్త్రీత్వధర్మాతిదేశంబుచేతఁ బ్రథమైకవచనలోపంబును, శబ్దాంత్యవర్ణంబునకు నత్వంబునుగలిగెను. విభాషకాఁబట్టి పక్షంబున ఋకారమునుబర్ణకంబులతో 'విధాతృఁడు' అనురూపంబగును. ఇట్లేధాత, ధాతృఁడు మొదలైనవి.

54 సూ—నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు.

రమా - రమ - వనితా - వనిత - విద్యా - విద్య - లక్ష్మీ - లక్ష్మి - సేనానీ - సేనాని - ఇట్లు కృతహ్రస్వములకు హ్రస్వాంతములకుఁబోలెఁగార్యంబగు - లక్ష్ములు - సేనానులు - సిరులు.

వ్యా—నామవాచకంబుల కడపటి దీర్ఘంబునకు హ్రస్వముకలుగును. ఉ, రమా. ఇది నామవాచకంబుగనుక దీనితుదనున్న దీర్ఘంబునకు హ్రస్వముకలిగి 'రమ' అనియైనది. ఇట్లే వనిత, విద్య, లక్ష్మి, సేనాని, మొదలైనవి. సహజముగా దీర్ఘంబులై యీసూత్రంబుచే హ్రస్వంబు విధింపఁబడిన యికారోకారాంతశబ్దంబులకు సహజహ్రస్వాంతంబులకుంబోలెఁ బైసూత్రవిధులు సెల్లును. లక్ష్మీశబ్దవధూశబ్దంబులు సంస్కృతంబునందు దీర్ఘాంతంబులైనను నీసూత్రంబుచే హ్రస్వంబుగలిగి పూర్వోక్తవిధులచే 'హరి, ధేను' శబ్దంబులవలె నీభాషయందుఁ బ్రయోగింపఁబడును. ఇట్లేసకలస్త్రీకారోకారాంతంబులకుఁ గార్యంబగునని యెఱుంగునది. ఉ. లక్ష్మి లక్ష్ములు. వధువు, వధువులు, ఇత్యాదులు.

(1) సాంస్కృతికంబులైనదీర్ఘంబులకు హ్రస్వంబు తెలుంగుభాషయందు నిత్యంబుగాఁ గలుగును. సంస్కృతభాషలో సయితము, ఒకానొకప్పుడు సమాసమందు దీర్ఘాంతంబులు హ్రస్వాంతంబులగును. ఉ. అజక్షీరము, రేవతిపుత్రుఁడు. ఈహ్రస్వము 'జ్యాప్యోస్సంజ్ఞాచ్ఛందసోర్బహుళం' (జీబంతజీషంతంబులకును,ఆబంతంబునకును (ఈకారాంతంబులును ఆకారాంతంబులును అగును.) సంజ్ఞయందును, వేదమందును, బహుళముగా హ్రస్వము) అనుసంస్కృత వ్యాకరణసూత్రంబునఁ గలిగెను. అజాశబ్దరేవతీశబ్దంబులు వ్యస్తంబులో దీర్ఘాంత స్త్రీలింగంబులు. క॥ పదిదినములైనప్రొద్దులు । పదపడి

రెన్నాళ్ళునొక్కొ పగలుఁ రేయుఁ । గదనంబుచేసిమడిసిరి ! నదిసుతగురుకర్ణశల్య నాగపురీశుల్' భార. ఆది. 1ఆ. దీనిలోని 'నదిసుత' శబ్దంబుపైసూత్రంబుచేతనేసాధువగును. నదీసుతయనియుంగూడ నుండవచ్చును. ఇట్లే 'కాళిదాసు' కాళీదాసు. కాశిపతి కాశీపతి, ఇత్యాదిసంజ్ఞావాచకములు సాధువులు అథవాస్థానివత్సూత్రే భాష్యమ్- వార్తికం (కార్యవిపరిణామాద్వాసిద్ధమ్ ------ ననుచకార్యాబుద్ధి) విపరిణామాదితి భవితవ్యమ్। సంతిచైవహ్యాకృతరపదికాని హ్రస్వత్వాని ॥ ప్రదీప ॥ సంతీతి॥ జ్యాపోరిత్యత్ర బహుళగ్రహణాత్ ॥ ఉద్యోతే ॥ సంజ్ఞాఛందసోరభావాదాహ ॥ బహులేతి ॥ కార్యవిపరిణామశబ్దంబునంబతె సంజ్ఞాఽభావంబునను హ్రస్వత్వంబగు. కనుకనె "క్లిప్తపుష్పశయ్యాంల్లతాగృహే । జాల్యమానతిక్ష్ణతిమార్గదర్శనః । అన్వభూత్పరిజనాంగనారతం । సోఽవరోధభయవేపథూత్తరమ్"॥ రఘు--19సర్గ-23శ్లో. "ప్రతిపద్యమనోహరం వపుః । పునరప్యాదిశతావదుత్థితః । రతిదూతిపదేషుకోకిలాం । మధురాలాపనిసర్గపణ్డితామ్" కుమారసం - 4సర్గ, 16 శ్లో. జ్యాపోరితి బహుళగ్రహణాత్ హ్రస్వ ఇతివల్లభః॥ అపిమాషం మషంకుర్యాచ్ఛందోభంగంత్యజేద్గిరామ్ ॥ "శ్లో. కలత్రనిందాగురుణాకిలైవ । మభ్యాహతం కీర్తివిపర్యయేణ । అయోఘనేనాయ ఇవాభితప్తం । వైదేహిబంధోర్హృదయం విదద్రే॥- మల్లినాథకృతసంజీవనీ వ్యాఖ్యా—వైదేహిబంధోః వైదేహీవల్లభస్య "సూ॥ జ్యాపోస్సంజ్ఞాఛందసోర్బహుళమ్" ఇతిహ్రస్వః । కాళిదాసవత్ ॥ అని వైదేహిబంధుశబ్దము సంజ్ఞావాచకంబుగాన (శ్రీరామమూర్తినిఁ జెప్పినందున) బాహులకంబగు. హ్రస్వమును బసరింపఁబడియె. వైదేహిబంధుశబ్దమే సంజ్ఞావాచకమైనప్పుడు "నదిసుత" శబ్దము సంజ్ఞావాచకమనుట యేమివింతే! (2) 'గ్రామణిపుత్రుఁడు ఇచ్చట 'గ్రామణీ' శబ్దంబున్ల సమాసంబులో దీర్ఘాంతమైనను సమాసమందు వైకల్పికహ్రస్వాంతంబగును, పక్షంబున గ్రామణీపుత్రుఁడు. సూత్రము 'ఇకో హ్రస్వోఽఙ్యో గాలవస్య' అను సూత్రంబునఁ గలిగె. భ్రూశబ్దంబు దీర్ఘాంతమైనను సమాసంబులో వికల్పంబుగ హ్రస్వంబగును. ఉ. 'భ్రుకుంసుఁడు, భ్రూకుంసుఁడు, భ్రుకుటి, భ్రూకుటి' ఈ విధి ప్రయోగానుసారిగాని సార్వత్రికముగాదు (3) సమాసంబులందేగాక వ్యస్తమందు సహితము స్త్రీవాచకంబులైన ఈకారాంతశబ్దంబులు వికల్పంబుగా హ్రస్వాంతంబులగు. ఉ. 'ధరణిః, ధరణీ. క్షోణిః, క్షోణీ. పురంధ్రిః, పురంధ్రీ. యువతిః, యువతీ. రాత్రిః, రాత్రీ. రజనిః, రజనీ. ఇత్యాదులు. 'కృదికారాదక్తినః, సర్వతోఽక్తిన్నర్థా

దిత్యేక్తే, అనుగుణాంత్రికంబులచే హ్రస్వదీర్ఘలోపాగమాదేశంబులు గానుండపను. వైనింబూ
పిన సాంస్కృతిక వ్యాకరణసూత్రలబునంజేసియే యీక్రిందనుదాహరించుహ్రస్వాంతం
బులు సాధువులయ్యె. తే॥ గీ॥ ధరణిధవదత్తవివిధోపధావిధాస । మార్జితశ్రీవినిర్జితనిర్జ
రాల । యేశ్వరుఁడు తిమ్మభూపతియీశ్వరుండు' ఆము|ఆ. మ॥ కనరత్నోణిధరంబుకా
ర్ముకామునగాఁ గద్రూతనూజుండు' నైష. 'శ్లో॥ పురంధ్రిభిశ్చక్రమశః ప్రయుక్తం, అని
కాళిదాసుసంస్కృతప్రయోగము. చ॥ (అపుడుపురంధ్రివర్గవృతయైవరణాంకకృతార్థమై
న, వసు. ఇత్యాదులు గ్రహింపునది.

55 సూ—ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు.

క్ష్మా - మా - భా - శ్రీ - స్త్రీ - హ్రీ - ధీ-భీ - భ్రూవు॥

వ్యా—ఒకయచ్చుగలపదంబులకు హ్రస్వంబు రాదు. ఉ. క్ష్మా - మా—భా
ఇవి యేకాచ్చుగలవి. కనుక నీశబ్దంబులయెడ నేఁబదినాల్గవసూత్రంబు నిషేధింపఁబడు
చున్నది. క॥ సకలక్ష్మానేలురాజు సరసిజనేత్రా' క్ష్మాదిగవర్ణించె, ఇత్యాద్యాంధ్ర
కవితాపితామహప్రయోగంబులు గ్రహింపవలెను. (భ్రూవు, ఇయ్యదిఉకారాంతశబ్దం
బుగావున నలువదియెనిమిదవసూత్రంబులోఁ దపరకరణములేక (ఉకారాంతగోశబ్దంబు
లనిసూత్రింపుటచే వువర్ణకంబు గలిగెను.

56 సూ—వృద్ధాదులకుఁజునకులోపమువిభాషనగు.

వృద్ధు = వృద్ధుఁడు - మూర్ఖు - మూర్ఖుఁడు - నీచు -నీచుఁడు
గృహస్థు - గృహస్థుఁడు - చార్వాకు = చార్వాకుఁడు.

వ్యా—వృద్ధ మొదలైనశబ్దంబులయందలి డువర్ణకంబునకు లోపంబు విభాషగా
నగును. ఉ. వృద్ధు - వృద్ధుఁడు. ఈశబ్దంబు పుంలింగమహద్వాచకంబుగావున నిరువది
యొకండవసూత్రంబుచేతనుత్వంబుగలిగి యిరువదిరెండవసూత్రంబుచేతను గలిగినడుజున
కుఁ బ్రకృతసూత్రంబుచే వైకల్పికలోపంబుగలిగి పైరూపద్వయంబయ్యె. ఇట్లే మూ
ర్ఖు - నీచు - గృహస్థు - చార్వాకు, మొదలైనవి. క ॥ కలఁడేనిక బాలుఁడైనఁ గడు

వృద్ధమహీశ' భార - ఆర - 3 ఆ' వ॥ నీవుమా । కృష్ణు శిశుపాలయింకఁ బలుకక వలసెఁ సభలోననున్నయీ । యవనిపులెల్ల నాతనినయుంబ్రబిముక్తులు' భార-సభా-ఆ. క॥ అనిపలికిన పలుకులకుం । ఘనకోపము నదరినీచుఁగావున, భార - విరా-2ఆ, తే॥ గీ॥ విదురుఁ డిట్టులనియె నిదియొకకార్యంబు । గాఁగఁబూనియుండు గాఁగనునె। దుష్టబుద్ధి నీచదుర్యోధనుండు నా । మాటవినుము నినుగతోపమన్న నుండు, భార-ఉద్యో-3ఆ. ఇచ్చట దుష్టబుద్ధి నీచదుర్యోధనుండు. అని యేకపదముగాఁ జెప్పవలన్న (అవిమృష్టవిధేయాంశము, అను కావ్యదోషము సంభవించును. ఇచ్చట దుర్యోధనునియందు నీచత్వము విశేషణముకావున నీచశబ్దార్థము ప్రధానముగానుండవలయును. సమాసమునందుఁ జేరినచోఁ దత్పురుష ముత్తరపదార్థము ప్రధానముగాఁ గలది కావున నీచశబ్దార్థము అప్రధానతను బొందును. (అవిమృష్టవిధేయాంశంగుణీభూతవిధేయకమ్, అనఁగా విధేయాంశంబును దెలుపునట్టి విశేషణము సమాసములోఁ జేర్చి చెప్పుట అవిమృష్టవిధేయాంశము, కావున (దుష్టబుద్ధి, నీచ, దుర్యోధనుఁడు, అని వ్యస్తపదంబులుగానే యుండవలయును. (నీచ, శబ్దంబునకు దుర్యోధనపదంబుతో సమాసంబుండరాదనఁ గలిగినది.

57 సూ—స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకులోపంబగు.

రమ-ఉమ - వనిత - ఘనత - విద్య - దేవత - మీననేత్ర

వ్యా—స్త్రీలింగంబులయొక్క ప్రథమైకవచనంబునకు లోపంబగలుగును. అనఁగా స్త్రీవాచకపదములకడపటి ప్రథమైకవచనంబునకు లోపంబుగలుగును. ఉ. రమ ఇచ్చటఁ బ్రథమైకవచనముపుట్టి లోపించినది. ఇట్లే ఉమ, వనిత, ఘనత, విద్య దేవత, మీననేత్ర మొదలైనశబ్దంబులు.

58 సూ—చరిత్రాదులమువర్ణకంబునకులోపంబుబహుళంబుగానగు.

చరిత్ర - చరిత్రము - చరిత - చరితము ॥ అలక - అభిలాష-అక్షత - ఘోష - తరంగ - భ్రమ - విజృంభణ - వధ - వేగ స్ఫు

రణ - హంస - ఇత్యాదులు చరిత్రాదులు॥ బాహుళకమువలన దర్భాదులకు ములోపంబు నిత్యంబు - దర్భ - పనస - ఇత్యాదులు.

వ్యా—చరిత్ర మొదలైనశబ్దంబులయొక్క మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగాఁ గలుగును. అనఁగా 'చరిత్ర, మొదలైనవానియొక్క కడపటనున్న మువర్ణకమునకు వికల్పంబుగాఁ లోపంబుగలిగి 'చరిత్ర—చరిత్రము' అని యుండును. ఇట్లే అలక — అక్షత - హంస - చరిత — అభిలాష - ఘోష - తరంగ - భ్రమ- విజృంభణ - వధ — వేగ - స్ఫురణ— మొదలైనవానికి రూపద్వయంబు గ్రహింపవలెను. క॥ నెరపెసుపర్వులకువిభునిటలాలకముల్ 'కవికర్ణరసాయనము. సీ. నిటలాలకములంటి నివురుజుంఝుమ్మని ముఖసరోజమునకు ముసరుదేంట్లు' భాగ - అష్ట- స్కం. 'అలక' అనుట సులభము. తే. గీ. భోజుఁడప్పుడు వేడ్కతో బుధసతీవి| తానములతోడ నార్ద్రాక్షతములతోడ' ఇందుమతీకళ్యాణము. తే. గీ. అహిమభానుఁడు చనుదేర నస్తశిఖరి | పరవిసర్పించుకుంకుమాక్షతములయ్యె' కవికర్ణరసాయనము. రెండవరూపము సులభము. క॥ బలశాలియైన హంసముఁ| బిలిచితి బురణించిపారఁ దోలుచుఁదనమునన్' భార- కర్ణ. ఉ. ఇందునిభాస్యలప్పుడు సమీక్షణచేసిరి రాజహంసముల్' నైషధము. చరిత్రాదులలోఁ జేరినతక్కంగలశబ్దంబులు సులభంబులు కావున లక్ష్యంబు లుదాహరింపఁబడవయ్యె. ఈసూత్రంబులో మువర్ణంబునకే లోపంబు చెప్పఁబడినది. కాని తక్కినవిభక్తులయొద్దవచ్చుముగాగమంబునకుఁ గూడఁ లోపంబగునని యెఱుంగునది. ఉ. చరిత్రను, చరిత్రమును. చరిత్రలను- చరిత్రములను మొ. దర్భ మొదలైనవానియందుమాత్రము మువర్ణకలోపంబు నిత్యముగాఁ గలుగును. ఉ. 'దర్భ-పనస' ఇత్యాదులు ఇట్లే 'కుశ, కుండ' మొదలైనవి. 'కుండ, పనస' శబ్దంబులు వైకృతంబులని కొందఱయభిప్రాయము- 'కుశ' శబ్దంబునకు 'నీరు' అను నర్థమిచ్చునపుడు 'కుశము' అని చెప్పవచ్చును.

59 సూ—స్వర్గివాచి దేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు.

దేవుఁడు - సకలసురలు ॥ స్వర్గివాచియనుటచే భూదేవులు - భూసురుఁడను ప్రయోగంబులబాధితంబులయ్యె.

వ్యా—స్వర్గనివాసులను జెప్పు దేవశబ్దమును, సకలశబ్దంబును నిత్యము నేక వచనమందును, బహువచనమందును బ్రయోగింపఁబడును. ఉ. 'దేవుఁడు' ఇచ్చట స్వర్గనివాసియర్థము. కాన నేకవచనముగలది. 'సకలసురులు' ఇయ్యది కర్మధారయసమాసము. నిత్యబహువచనము. 'భూదేవులు' 'భూసురులు' ఇచ్చట నీశబ్దంబులకు బ్రాహ్మణులర్థము. దేవసురశబ్దాంతంబులైన యీసమాసంబులచే భూనివాసులు బోధింపఁబడినందునఁ బైవిధి రాక సామాన్యముగా నేకవచనబహువచనంబులు కలిగెను.

60 సూ—సురశబ్దంబునిత్యంబుగానసురశబ్దమువైకల్పికముగాస్త్రీతుల్యంబులగు సంస్కృతసమాసంబునఁగావు.

సురలు - అసుర - అసురుఁడు ॥ నిశాసురులు - రావణాసురుఁడు ॥ ఎల్లసురలు - ఎల్లయసురలు - ఎల్లయసురులు.

వ్యా—'సుర' అనుశబ్దంబు నిత్యంబుగాను, 'అసుర' అనుశబ్దంబు వైకల్పికంబుగాను, స్త్రీలింగంబులతో సమానంబులగును; కాని సంస్కృతసమాసంబునమాత్రంబునఁ గావు. ఉ. సురలు. ఇచ్చట 'సుర' శబ్దంబు నిత్యంబుగా స్త్రీలింగంబుతో సమానంబు గావున నుకారమువచ్చి 'సురులు' అనికాలేదు. 'అసుర' శబ్దంబు వైకల్పికంబుగా స్త్రీలింగసమంబుగనుకఁ బ్రథమైకవచనలోపంబుగలిగి 'అసుర' అనియును. బక్షంబునముత్వముబ్వర్ణకంబులతో 'అసురుఁడు' అనియును రూపంబులైనవి; కాని సంస్కృతసమాసంబున స్త్రీత్వధర్మాతిదేశంబు లేనియందున ముత్వంబు గలిగి 'రావణాసురుఁడు' అనియయ్యెను. 'సుర' శబ్దంబునకుఁ దెలుఁగుసమాసమందు స్త్రీత్వధర్మంబు నిత్యంబు. ఉ. ఎల్లసురలు. 'అసుర' శబ్దంబునకు వైకల్పికము, ఉ. ఎల్లయసురలు' ఎల్లయసురులు. మొ

61 సూ—దూతాదులకుస్త్రీత్వంబుబహుళంబుగనగు.

దూత - దూతుఁడు - యోధ - యోధుఁడు - శుంఠ - శుంఠుఁడు॥ బహుళగ్రహణముచే సమహత్త్వంబునందు స్త్రీత్వంబునిత్యంబు ॥ సింగంబుదూతయగుజంబుకంబు

వ్యా.—దూత మొదలైన శబ్దంబులకు స్త్రీవద్భావము బహుళముగాఁ గలుగును. 'దూత' ఇచ్చటఁ బ్రథమైకవచనలోపము. 'దూతుఁడు, స్త్రీవద్భావంబు పాక్షికంబు. గావున నుత్వదుజ్వర్ణకంబులు కలిగెను. ఇట్లేయోధ- యోధుఁడు. శంస- శంసుఁడు. మొ. సీ. నిత్యసత్యవ్రత నిషదేశ నీవు మాకమరంగ దూతవై యభిమతంబు| సేయుము భార - ఆర- 2ఆ. క|| కోపింపం| జనదు జననాథున కుదూ| తునిజంపుటనరకమౌట ధ్రువమని రార్యుల్, భార - శాంతి. మఱియు బహుళమని చెప్పుటచేత నమహత్తును జెప్పునపుడుమాత్రము స్త్రీసమముగానుండుట నిత్యమని భావము. ఉ. 'సింగంబు దూతయగు జంబుకంబు' ఇచ్చట 'సింగంబు దూతుఁడగు జంబుకంబు, అని మహత్తుగాఁ బ్రయోగింపఁగూడదు. మహద్విపక్షచేయునపుడు దువర్ణకంబుతోఁ బ్రయోగింపవచ్చును. ఉ. మేఘుఁడు, దూతుఁడు. 'ముద్దరాజు రామన్న కవిజనసంజీవిని యందుదూతయనియేకాని దూతుఁడని లేదనెను గాని రెండును గలవు, అని తిమ్మ కవీంద్రుఁడువచించెను.

62 సూ—పృథ్వీవాచి భూశబ్దంబునకు భువియగు.

భువి - భువులు - భువిని - భువులను.

వ్యా—భూమ్యర్థకమైన భూశబ్దంబునకు నామవాచకము 'భువి, అగును. ఉ. భువి— భువిని- భువులను- మొ.

63 సూ—నౌశబ్దంబునకు నావయగు.

నావ - నావలు - మహానావ - కొందఱునావియనియునాదేశం బగునందురు.

వ్యా—'నౌ, అనుశబ్దంబునకు నామవాచకము 'నావ, అనియగును. ఉ. నావ- నావలు- మహానావ. కొందఱు 'నౌ, అనుశబ్దంబునకు 'నావి, అనికూడ నామవాచకముండునందురు.

64 సూ—. రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాషనగు.

ఇగ్లౌ సూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు ॥ రో — రై గ్లో - గ్లౌ.

వ్యా—'రై, గ్లౌ, అనుశబ్దంబులకు ఓకారము విభాషగానగును. అనఁగా:— 'రో, అనియు, 'గ్లో, అనియుఁ, జెప్పవచ్చునని భావము. ఉ॥ రోగలవాఁడు—రై యిచ్చెను. గ్లోలు- గ్లౌలు. ఇత్యాదులు 'రై, గ్లౌ, ఈశబ్దంబులకు 'ఇగ్లౌ, అనునలువది నాల్గవ సూత్రంబునఁ బ్రథమైకవచనలోపంబుగలుగును.

65 సూ.—ఐకారం బీత్తుల్యంబు.

రైని - రైకి — కైని - కైకి — పైని— పైకి.

వ్యా—ఐకారం బీకారాంతములతో సమానము. అనఁగా నీకారాంతంబులకు నిరువదియాఱవసూత్రంబుచేఁ గునువులకి౯ గా విభక్తుల ఉత్వంబున కిత్వంబగు,నని చెప్పంబడియె. అది ఐకారాంతంబులమీఁద నగును. 'రై + ను, ఐకారం బీకారతుల్యంబు గావున నువర్ణకముయొక్క ఉకారంబునకు నిరువదియాఱవసూత్రంబుచే నిత్వంబు కలిగి 'రైని, అయ్యెను. ఇట్లే కైని, పైని రైకి— కైకి, ఇత్యాదులు. 'పైనక౯, అని పెక్కు, రుతప్పుగాఁ బ్రయోగింతురు. ఈసూత్రంబుచేత 'పైనిక౯, అనవలయును.

66 సూ—కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగును.

కంధరము - కంధర॥ విధాతృశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు — విధము॥ కంధరా నాసికా భిక్షా దంష్ట్రా గ్రీవా పాదుకోల్కాప్రభృతులు కంధరాదులు.

వ్యా—కంధర మొదలైనశబ్దంబులు నపుంసకలింగసమంబులు బహుళంబుగా నగును. 'కంధర, మొదలైనశబ్దంబులు సంస్కృతంబున స్త్రీలింగంబులు. తెలుంగున

బహుళంబుగా నపుంసకత్వము అతిదేశింపఁబడుచున్నది. కావున స్త్రీత్వంబునఁ బ్రథమైకవచనలోపంబుచే 'కంధర' అనియు, క్లీబత్వాతిదేశంబుచేత 'కంధరము' అనియు రూపద్వయంబేర్పడును. విధాశబ్దంబునకు నపుంసకలింగసమత్వంబు నిత్యంబుగానగును. అనఁగా 'విధము' అని నపుంసకలింగముగానే ప్రయోగముగాని 'విధ' అని ప్రయోగింపఁగూడదు, ఇయ్యది కొన్ని నిఘంటువులయందుఁ బ్రకారార్థమునందుఁ బుంలింగముగాఁ బ్రయోగింపఁబడ్డది. 'విధో విధానే హస్త్యన్నే ప్రకారే వేతనే పిచ' అని పుంలింగమందునజహల్లింగప్రయోగము. దంష్ట్రాశబ్దంబును బుంలింగంబుగాఁ గానంబడుచున్నది. 'కంధర, నాసిక, భిక్షు, దంష్ట్రి, గ్రీవ, పాదుక, ఉల్క, ఇత్యాదిశబ్దంబులు కంధరాదులు:

---

ఇంకహలంతప్రకరణము.

67 సూ.—హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామంబగు.

రుక్ - రాట్ — మరుత్ — పీసుత్ — కర్మ - వర్మ॥ శ్వశబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచన తుల్యంబులె యగునని యెఱుంగునది.

—హలంతశబ్దంబులం గూర్చి చెప్పెడిభాగము.—

వ్యా—సంస్కృతమునందుఁ బ్రథమావిభక్త్యంతమెద్దియో యాశబ్దంబు తెలుంగుభాషయందు హలంతంబులను నామవాచకంబగు. నామమనఁగా:—ధాతువుకానిదియుఁ, బ్రత్యయముకానిదియుఁ, బ్రత్యయంబు కడపటలేనిదియు, నగునర్థముగలరూపము. ఉ॥ రుక్' మొదలైనవి హలంతంబులు. 'శ్వ' అనుశబ్దంబుతక్క 'కర్మ' వర్మ, మొదలైన నకారాంతంబులెల్లను సంస్కృతప్రథమైకవచనములే యిందు నామవాచకములగును.

రూపాంతరంబు గ్రంథంబులం గవులువాడుచుండిరి. ఇట్లే. ధర్మము - ధర్మువు. అర్ఘము - అర్ఘువు. వర్గము - వర్గువు. (వర్గు, అనియు మఱియొకరూపంబు) మొదలైనవియు గ్రంథంబులయందుం గలవు. ఇందులకుం బ్రమాణము. ఛవేదర్మాది శబ్దానాంముశ్చవుశ్చాత్రికుత్రచిత్, అని యహోబలపండితీయమునందుదాహరింపం బడినది.

చ॥ అవని యరాజకంబయినయప్పుడు భూప్రజలందు సర్వధర్మువులు దొలంగుదేవమునిముఖ్యులు వాయుదురోలి వృష్టిలే దవు వాఙియర్ఘువుల్ దరుగునందురు గావునం గాలయాపనం । బనితథవాక్యచేయకరయంబున రాజ్యము నిల్పుమిత్త జిన్, భార- ఆది - 4ఆ. నకారాంతషైన (సుధన్వన్, అను శబ్దంబుయొక్క ప్రథమైకవచనంబులు సంస్కృతంబులో (సుధన్వా, అని దీర్ఘాంతంబుగ నుండును. ఈదీర్ఘాంతంబే తెలుఁగు భాషలో నామంబై (నామంబులకుది, అను నేఁబదినాల్గవసూత్రప్రకారంబు హ్రస్వంబుకలిగి మహద్వాచకశబ్దంబగుటచే నిరువదియొకటి యిరువదిరెండవసూత్రంబులచేత నుత్వడుజ్జులు గలిగి (సుధన్వుఁడు, అయినది. ఇట్లే (సుత్రాముఁడు, ఇత్యాది మహద్వాచకనకారాంతశబ్దంబు లూహించుకొనవలయును.

69 సూ—దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబు బహుళంబు గానగు.

వాక్కు — వాకు॥ స్వరాట్టు - స్వరాటు.

వ్యా—దీర్ఘముతరువాతనచ్చు హల్లునకు ద్విత్వము బహుళముగా నగును. (వాక్, అను నీశబ్దంబున కంతంబైన కకారంబునకు ముందుదీర్ఘంబుండుటచే ద్విత్వంబు బహుళంబై (వాక్కు, అనియుం, బాక్షికంబై (వాకు, అనియు నగును. ఉగాగమంబు మాత్రంబు అజుపదియేనిమిదవసూత్రంబునే నిత్యంబుగానగును. అజుపదియేనిమిదవసూత్రంబులో ఉగాగమద్విత్వంబులు సన్నియోగశిష్టంబులైనను, ఈప్రకృతసూత్రంబులో ద్విత్వంబొక్కటియే బాహుళికంబుగ నిర్వరింపఁబడినది. కావున ద్విత్వములేనియప్పుడుకూడ, ఉగాగమంబు నిర్బాధంబుగావచ్చును అందున (వాకు-స్వరాటు ఇత్యాది ద్విత్వరహితరూపంబు లుగాగమంబుతో నుండెందగు.

70 సూ.—మతుబాదికంబు ద్వితీయైక వచనాంతతుల్యంబు నామంబగు.

శ్రీమంతమ్ — గుణవంతమ్ — విద్వాంసమ్ — అనడ్వాహమ్ — శ్వానమ్ — ఉపానహమ్ — అప్సరసమ్ — ఇత్యాదులు.

వ్యా.—కలది, కలవాఁడు, అనునర్థములందు (మతుప్, వతుప్) మొదలైనప్రత్యయాంతంబులుఁ గలిగినసంస్కృతశబ్దములు ద్వితీయైకవచనాంతములై తెలుఁగునందు నామం బగు. (ప్రాతిపదికము) అనఁగా సంస్కృతంబునందు ద్వితీయైకవచనంబు మకారాంతం బగును. అదియే యీభాషయందుఁ బ్రాతిపదికంబగు. శ్రీనికి శ్రీకలదు. గుణముకలదు, అను నర్థమందు శ్రీమత్, గుణవత్, అనిన శబ్దంబులగు. వానియర్థము బోధించునప్పుడు పైశబ్దంబులే ద్వితీయావిభక్తిలో శ్రీమంతమ్ గుణవంతమ్, అని సంస్కృతంబునందుఁ బ్రయోగింపఁబడు. మకారాంతంబులైన శ్రీమంతమ్ గుణవంతమ్, విద్వాంసమ్, అన డ్వాహమ్ శ్వానమ్, ఉపానహమ్, అప్సరసమ్, ఇత్యాది సంస్కృతద్వితీయాంతంబులు తెలుఁగునందు నామంబులగునని యెఱుంగునది.

71 సూ.—దాని యంతిమమకారంబునకు లోపంబగు.

శ్రీమంత - గుణవంత - విద్వాంస - అనడ్వాహ - ఇత్యాది వీనికజంతములకుంబోలె డుజాదులు యథాయోగ్యంబుగ నగు॥ అతఁడు శ్రీమంతుఁడు - ఇతఁడు గుణవంతుఁడు - వానివంశము శ్రీమంతము - వీనివంశము గుణవంతము ॥ విద్వాంసుఁడు - విద్వాంసము ॥ అనడ్వా హము - శ్వానము - అప్సరస॥ వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదులుజ్యంతంబులై యిందు గ్రహింపఁబడు - శ్రీమతి - గుణవతి విదుషి - శుని॥ మహతివాచ్యంబగునపుడు శ్రీమంతురాలు - గుణవం తురాలు - విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు.

వ్యా — శ్రీమంతమ్, అనుదాని తుదిమకారంబునకు లోపంబు కలుగును. ఉ శ్రీమంత, గుణవంత, విద్వాంస, మొదలైనవి. వీనికి, (శ్రీమంత మొదలైనవానికి) అజంతంబులైన, రామ, మొదలగు శబ్దంబులకుంబలె డుజ్ఞాదులు వచ్చును. ఉ, అతఁడు శ్రీమంతుఁడు ఇద్దరో నపుంసకలింగమైనయపుడు మువర్ణకమువచ్చి, వాని వంశము శ్రీమంతము, అని యగును. ఇట్లే, వీనివంశము గుణవంతము, మొ. అప్సరస, అను దానికి అప్సరస్సు, అను హలంతరూపంబు గలదని యొకానొకరుచెప్పిరి; కాని యది విచారణీయము. (సూ-వ్యా) నక్షత్రనామలక్షణంబుచేత= ముందుచెప్పబోవు సూత్రంబుచేత (౩౭సూ) స్త్రీలింగమునందు, మతుప్పు, మొదలైనవి జ్యంతంబులే (జీ+ అంత=జ్యంత. అనఁగా నీకారాంతంబులమాత్రమే) యిందు గ్రహింపఁబడును. మతుబాదిప్రత్యయాంతంబులు మహద్వాచకాదులను తెలియఁజేయునపుడు, శ్రీమంతమ్, ఇత్యాది సంస్కృతస్వతీయాంతంబులే యాతెనుఁగులో నామంబులగుననియుఁ, బైప్రత్యయాంతంబులే సంస్కృతంబున స్త్రీలింగంబున బోధింపునప్పుడు, శ్రీమతీ, గుణవతీ, విదుషీ, శునీ, ఇత్యాదిప్రకారంబుగా సాంస్కృతిక ప్రాతిపదికములై యుండును గాన నట్టిదీర్ఘాంతంబులే యీభాషయందు నామంబులుగా గ్రహింపఁబడునని భావము. పిమ్మట నేఁబదినాల్గవసూత్రంబుచే దీర్ఘంబులకు హ్రస్వంబులుగలిగి యేఁబదియేడవసూత్రంబుచేఁ బ్రథమైకవచనలోపంబుగలిగి, శ్రీమతి, గుణవతి, విదుషి, ఇత్యాదికముగా హ్రస్వాంతంబులై యుండును. శ్రీమంతురాలు, ఇచ్చట శ్రీమంత, శబ్దాదులు మహతికి విశేషణంబుగానే వాడఁబడి, సిరిగలది, అన్న యర్థముచెప్పునప్పుడు వృత్తియందు స్త్రీమాత్రబోధకమైన, ఆలు, శబ్దంబుతో సమాసంబుచేయుచో సంధిపరిచ్ఛేదములోని ముప్పదియొకండవ సూత్రంబుచే నుత్వరుగాగమంబులుగలిగి, శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురాలు, ఇత్యాదికముగా నుండును. సిరిగలస్త్రీ, గుణముగల స్త్రీ, ఇత్యాదికంబుగా నర్థంబగును. ఈమతుప్ప్రత్యయాంతరూపంబులు సంస్కృతంబుతో వాడునపుడు వకారమకారంబులు తబ్బిబ్బుగా భ్రమతోఁ బ్రయోగింతురు. అనఁగా బుద్ధిమంతుఁడు, అనుటకు బుద్ధివంతుఁడు, అనియును, గుణవంతుఁడు, ఇత్యాదిస్థలంబులయందు గుణమంతుఁడు, అనియు నపభ్రంశంబుగా వాడుదురు. ఈ చెప్పునట్టియంశంబు సంస్కృత వ్యాకరణంబులోనిదియైనను దెలుఁగుకవులకుఁ దెలి

యుట యనవసరంబు గావున నిరూపింప స్పష్టపఱుపఁబడకున్నది. మకారాకారాంతంబులైన శబ్దంబులమీఁదను, మకారాకారోపధికంబులైన శబ్దంబులమీఁదను, మన్మతుప్ప్రత్యయమకారము సాధారణంబుగ వకారంబగును. ఉ. (బుద్ధి-మతి-శ్రీ), ఇత్యాదులకారాంతంబులు కావు గావున బుద్ధిమంతుఁడు, మతిమంతుఁడు, శ్రీమంతుఁడు, ఇత్యాదికముగా మకారముతోనే యుచ్చరింపవలయును. (ధన, ఆచార, విద్యా) ఇత్యాదులకారాంతంబులును, దీర్ఘాకారాంతంబులును, గావున మతుప్ప్రత్యయము వకారంబును బొందఁగా ధనవంతుఁడు, ఆచారవంతుఁడు, విద్యావంతుఁడు, ఇత్యాదికముగా వకారంబులతో నుచ్చరింపవలయును. (శక్తి, లక్ష్మీ. ఇత్యాదిశబ్దంబులు ఈకారాంతంబులైనను మకారోపధికంబులు గావున (శక్తిమంతుఁడు లక్ష్మీమంతుఁడు, ఇత్యాదికముగా మకారంబుతోనే యుండును. (యశస్ తేజస్, ఇత్యాదిశబ్దంబులు అకారోపధికంబులు గావున (యశస్వంతుఁడు, తేజస్వంతుఁడు ఇత్యాదికముగా వకారసహితంబుగానే యుండును. పక్షంబున సకారాంతంబులు మతుబర్థంబునందు (యశస్వి. తేజస్వి, ఇత్యాదికముగ (విని, ప్రత్యయాంతంబుగా నుండును. తెలుఁగునకిది ప్రయోజనకారియైనదిగా నవసరంబుగావునఁ బ్రసక్తానుప్రసంగంబున నిచ్చట నీయంశము వివరింపఁబడెను.

## 72సూ - ముదాదులకు ప్రథమైకవచన లోపంబులేదు

ముదము - ఉపానహము - స్రజము.

వ్యా —(ముత్, మొదలైనశబ్దంబులకుఁ బ్రథమైకవచనలోపంబు గలుగదు అనఁగా ముచ్ఛబ్దంబు మొదలైనవి హలంతస్త్రీలింగంబులుగావున నఱువదియొనిమిదవ సూత్రంబుచే ఉగాగమవత్త్వంబులు గల్గి నలుబదినాల్గవసూత్రంబుచేఁ బ్రథమైకవచనలోపంబుగల్గి (ముత్తు, ఇత్యాదికముగా ననిష్టరూపంబు కావలసియుండెఁ. తన్నివారణార్థము ముదాదులు డెబ్బదియవసూత్రములోని మతుబాదిగణంబులోఁ బఠింపఁబడియె. అందున (ముదమ్, ఉపానహమ్, స్రజమ్, ఇత్యాది మకారాంత సంస్కృత ద్వితీయైకవచనాంతంబులే ప్రాతిపదికంబులై డెబ్బదియొకటవసూత్రంబుచేత మకారలోపంబుగలుగు స్త్రీలింగత్వహేతుకమైన ప్రథమైకవచనలోపంబు (మువర్ణకలోపము

ఏఁబదియేడవసూత్రంబుచేఁ బ్రాప్తించుచుండఁగాఁ బ్రకృతసూత్రంబుచే నిషేధింపఁబడి మువర్ణకంబుతో ‘ముదము’, ‘ఉపానహము’, ‘స్రజము’, ఇత్యాదిరూపంబులు సిద్ధించెను.

73 సూ-ఋత్విగాదులుద్వితీయైకవచనాంత తుల్యంబులువిభాష నగు

ఋత్విజుఁడు - ఋత్విక్కు - నీవృతము - నీవృత్తు॥ ఋత్విగాదికంబాకృతిగణంబు.

వ్యా—ఋత్విక్కు మొదలైనశబ్దంబులు సంస్కృతద్వితీయైకవచనాంతంబులతో సమానమై విభాషగానగును. అనఁగా ఋత్విక్ఛబ్దముయొక్క సంస్కృతద్వితీయైకవచనము ‘ఋత్విజమ్’, అనియుండు. ఇదియే తెలుఁగులోఁ బ్రాతిపదికము కాఁగా డెబ్బదియొక్కటవసూత్రంబుచే నంత్యమకారంబు లోపించి ‘ఋత్విజ’, అయినది. పిమ్మట నిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వడుజ్వర్ణకంబులు కలిగి ‘ఋత్విజుఁడు’, అయినది. విభాషయనుటచే ఋత్విక్ఛబ్దము హలంతంబు గావున నలువదియొనిమిదవ సూత్రంబుచే నుగాగమ ద్విత్వంబుగలిగి నలువదినాల్గవసూత్రంబుచేనైన ప్రథమైకవచనలోపంబుతో ‘ఋత్విక్కు’. అనురూపంబు పక్షంబునయ్యె. నీవృచ్ఛబ్దముయొక్క సంస్కృతద్వితీయైకవచనము ‘నీవృతమ్’, దీనియంతిమమకారంబు డెబ్బదియొకండవ సూత్రంబుచే లోపించియనుహాద్వాచకంబుగావున ముప్పదితొమ్మిదవ సూత్రంబుచే మువర్ణకంబువచ్చి ‘నీవృతము’, ఇట్లయ్యె. విభాషయగుటచే నీవృచ్ఛబ్దంబు హలంతంబు గావున నలువదియొనిమిదవ సూత్రంబుచే నుగాగమ ద్విత్వంబులు గలిగి నలువదినాల్గవసూత్రంబుచేనైన ప్రథమైకవచనలోపంబుతో ‘నీవృత్తు’, అను రూపంబు పక్షంబునయ్యె. వణిక్కు - వణిజుఁడు. పుష్పముక్కు - పుష్పముచుఁడు. వేదవిత్తు - వేదవిదుఁడు. పాలితకకుప్పు- పాలితకకుభుఁడు. ఘృతస్పృక్కు - ఘృతస్పృశుఁడు. సురద్విట్టు - సురద్విషుఁడు, అమృతలిట్టు - అమృతలిహుఁడు. త్వక్కు - త్వచము. తటిత్తు - తటితము. జలముక్కు - జలముచము. మధులిట్టు - మధులిహము. కకుప్పు - కకుభము. ప్రావృట్టు - ప్రావృషము. మొదలైనశబ్దంబులు. ఆకారసాదృ

శ్యంబునంజేసి ఋత్విగాద్యాకృతిగణంబులోనివని యూహింపఁదగినది. మఱియు. ఆపత్తు—ఆపద. తృట్టు - తృష. సంపత్తు - సంపద. క్షుత్తు—క్షుధ, వృక్కు—వృశ. దిక్కు—దిశ. రుట్టు - రుష. త్విట్టు — త్విష, ఈమొదలైనశబ్దంబులు ఋత్విగాదిగణంబులోనివి. ఇవి హలంతంబులు. పక్షంబున ద్వితీయైకవచనాంతతుల్యంబులు హలంతంబులు ప్రాతిపదికములైనప్పుడు అజుపధియౌనిమిషత్సూత్రంబుచే సుగాగమ ద్విత్వంబులు గలిగి నలువదినాల్గవసూత్రంబుచేఁ బ్రథమైకవచనలోపంబుతో ఆపత్తు, సంపత్తు, తృట్టు, ఇత్యాదికములుగా రూపంబులు. పక్షంబున ద్వితీయైకవచనాంతతుల్యంబులైనచో ఆపదమ్, తృషమ్, సంపదమ్, ఇత్యాది మకారాంతంబులు సంస్కృతద్వితీయైకవచనంబులే ప్రాతిపదికంబులై సంస్కృతభావంబున స్త్రీలింగంబులగు శబ్దంబుల ప్రథమైకవచనముదర్శకంబు ఏఁబదిరెండవసూత్రంబుచే లోపింప ఆపద, తృష. సంపద ఇత్యాదిరూపాంతరంబులనొందు.

74సూ-ఒకానొకచోమహత్త్వంబునందుమతుప్రకారంబునకానాదేశంబువిభాషనగు.

హనుమానుఁడు - హనుమంతుఁడు - భగవానుఁడు - భగవంతుఁడు - ఇత్యాది.

వ్యా—ఒకానొకచోట మహత్త్వార్థకమగునపుడు మతుప్ప్రత్యయాంతంబునకు ఆన, అనునది విభాషగానగును. ఉ. హనుమానుఁడు. దీనిప్రాతిపదికము మతుబంతము 'హనుమత్' అనియుండుముగానఁ బ్రత్యయాంతకారంబునకు 'ఆన' అనునాదేశము గలిగి ప్రకృతిసూత్రంబున 'అనుమ + ఆన' ఇట్లుండు అనునప్పుడు సవర్ణదీర్ఘ (సూ11॥ సంధి-ప) చేసయిన హనుమాన, శబ్దంబునకు నిరువదియొకటి-యిరువదిరెండు సూత్రంబులచే ముత్త్వదుఙ్వర్ణకంబులు వచ్చి హనుమానుఁడు, అనురూపంబయ్యె. హనుమంతుఁడు హనుమచ్ఛబ్దంబు మహత్త్వను బోధించునపుడు ద్వితీయావిభక్తిలో హనుమంతమ్, అని సంస్కృతంబునందుఁ బ్రయోగింపఁబడును. మకారాంతంబైన హనుమంతమ్, ఇత్యాది సంస్కృతద్వితీయాంతంబులు తెలుఁగునందు నామంబులు కాఁగా నెబ్బదియొక్కటవ సూత్రంబుచే హనుమంతమ్, అనుదానిలోని యంత్యమకారంబునకు లోపంబుగలిగి

'హనుమంత, అయినది. పిమ్మట నిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నత్వ దుజ్వర్ణకంబులుగలిగి (హనుమతుండు, అయినది. ఇట్లే భగవానుఁడు – భగవంతుఁడు మొదలైనవి. మఱియు (హనుమంతుఁడు, అనుదానికి (హనుమ, అనియు రూపంబు గలదు. ఆ॥ వె॥ పడగనున్న హనుమభయవిహ్వలుఁడుగాఁడు । అరదమునకునూతుఁ డచ్యుతుండు' భార– క॥ నారూపం। బనుపమ మగునని హనుమ కనిలజుఁడనియెన్ భార – ఆర – 3 అ.

75 సూ—విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు.

స్త్రీలింగత్వాతి దేశంబుచేతనుత్వదుజ్ఞులులేవని యెఱుంగునది ॥ విశ్వకర్మ - కృష్ణవర్త్మ - అశ్వత్థామ - యువ - యజ్వ - ఇత్యాదులు.

వ్యా—విశ్వకర్మ మొదలైనశబ్దంబులు స్త్రీలింగతుల్యంబులు. అనఁగా స్త్రీలింగ ధర్మం బారోపించుటచేత నుత్వదుజ్ఞులు రాక ప్రథమైకవచనలోపంబు గలుగును. ఉ. విశ్వకర్మ సంస్కృతంబులో 'విశ్వకర్మన్' శబ్దంబు నకారాంతము. మహద్వాచకంబు. దీని ప్రథమైకవచనము (విశ్వకర్మా, అని దీర్ఘాంతంబుగానుండును. ఇదియే తెలుఁగులో నలువదియేడవసూత్రంబుచేఁ బ్రాతిపదికంబుగా నెంచఁబడును. తరువాత నేఁబదినాల్గవసూత్రంబుచేత హ్రస్వంబుగలిగి ప్రకృతసూత్రంబున స్త్రీత్వాతిదేశంబుచే నేఁబదియేడవసూత్రంబుచేఁ (బథమైకవచనలోపంబుగలిగి (విశ్వకర్మ, అనురూపం బేర్పడినది. ఇట్లే (కృష్ణవర్త్మ, అశ్వత్థామ, (అశ్వ + స్థామ.) ఇది పృషోదరాదిగణంబులో నిది గాన సకారమునకుఁ దకారముగలిగి "అశ్వత్థామ" అయినది. చిన్నయసూర్యాది గ్రంథంబులందు (అశ్వత్థామ, అనియుంటప్రామాదికము) యువ, యజ్వ, మొదలైనవి. మఱియుఁ బ్రదిలింగలక్షణశేషమందు 'సీ॥ విశ్వకర్మని కుంతుని పలాణ్య సముజ్జ్వల జేకొని మూరిఁబోయి' 'హరి- ఉ- 4అ. అనులక్ష్యంబునుజూపి 'విశ్వకర్ముఁడు, అనురూపంబు గలదని తద్గ్రంథకర్తగారు నుడివిరి. కాని (విశ్వకర్మను కూఁతు, అని సవరించినచో గణభంగము గలుగక సలక్షణంబుగ నుండునని యెఱుంగునది. ఉ. స్వార్థేకన్ ఇట్లు. భార. ఆది 4 ఆ23 బప. క॥ పడయం గావలయు వాఁడు సంతతిఁగావించు విచిత్రవీర్యక క్షేత్రములన్ (విచిత్రవీర్యక = స్వార్థేకన్.

76 సూ—మహద్వాచకమయి పుంలింగంబగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు.

బ్రహ్మ - ఈశబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు॥ తత్త్వతపోవేదయోగ వాచకంబగునేని బ్రహ్మమునాఁబడు.

వ్యా—మహత్త్వంబునఁ బుంలింగంబగు ‘బ్రహ్మ’శబ్దంబునకు స్త్రీత్వంబు గలుగును. అనఁగా ‘బ్రహ్మ’ అనునపుడు ‘బ్రహ్మదేవుఁడు, యజ్ఞములోని కర్మకారకుఁడు, బ్రాహ్మణుఁడు’ అనునర్థంబగు. ‘బ్రహ్మన్’, శబ్దంబు నకారాంతము. ప్రథమైకవచనము. ‘బ్రహ్మా’, అని దీర్ఘాంతంబుగా నుండును. పిమ్మట నేఁబదినాల్గవసూత్రంబుచేత హ్రస్వంబు కలిగి ప్రకృతసూత్రంబుచే ‘బ్రహ్మ’, అని హ్రస్వాంతంబుగాఁ దెలుంగు ప్రథమారూపంబగు. ‘బ్రహ్మ’, శబ్దంబునకు ‘పరమాత్మ, వేదము, తపస్సు, ఒకగ్రహయోగము’ అను నర్థము చెప్పునపుడు ‘బ్రహ్మము’ అని మువర్ణకంబుతోఁ జెప్పవలెను,

77 సూ—ఆత్మేమనిజంతంబులకు నాంతములగు మనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగానగు.

ఆత్మ - ఆత్మము - ఆత్ముఁడు - మహిమ - మహిమము - అణిమ - అణిమము - గరిమ - గరిమము - లఘిమ - లఘిమము - దేవశర్మ - దేవశర్ముఁడు.

వ్యా—‘ఆత్మన్’ శబ్దంబునకును, ‘ఇమనిచ్’ ప్రత్యయాంతంబులకును, నకారాంతంబులైన మనుజసంజ్ఞావాచకంబులకును, స్త్రీత్వంబు బహుళంబుగా నగును. ఉ. ఆత్మ - ఆత్మము - ఆత్ముఁడు. ఇచ్చట స్త్రీలింగత్వంబుచే ‘ఆత్మ’ అయినది. ‘ఆత్మము’ ఇది బ్రహ్మము మనస్సు శరీరము స్వభావము, ఇత్యాదికము తెలియజేయునపుడు మువర్ణకాంతంబుగా నిల్చును. ‘ఆత్ముఁడు’, ఇచ్చట స్త్రీత్వాభావము వైకల్పికంబుగావునఁ బక్షంబున నుత్వడువర్ణకంబులు గలిగెను. ‘మహిమ, గరిమ’ మొదలైనవి ‘ఇమనిచ్’ ప్రత్యయాంతంబులు స్త్రీత్వాభావంబున నేఁబదియేడవసూత్రంబుచే మువర్ణ

కంబు లోపించియుఁ బక్షంబున మువర్ణకంబుతోఁ గూడియుఁ రూపద్వయంబగును. ఉ. మహిమ - మహిమము- ఇట్లే అణిమ - అణిమము- గరిమ- గరిమము_లఘిమ- లఘిమము. మొ. 'దేవశర్మ' ఇత్యాదినాంతము- సంజ్ఞావాచకము. స్త్రీత్వముబహుళముగుటచేత 'దేవశర్మ' అనియుఁ, బక్షంబున 'దేవశర్ముఁడు' అనియు రెండురూపంబులు ఇట్లేకృతవర్మ-కృతవర్ముఁడు ను. ఉ. ఉజ్జ్వలనుచలకి వెనిక కృతవర్మనిబాహులనొంచి ధైర్యనిశ్చలమతి' భార. ద్రోణ- 4ఆ.

78 సూ—మహత్త్వంబునస్వార్థపరంబగు రాజశబ్దమురాజునాఁబడు.

రాజు-ఖగరాజు ॥ అమహత్త్వంబునందు - రాజము- వృక్షరాజము ॥ ఉపసర్జనత్వంబునందు - హతరాజుఁడుపరశురాముఁడు.

వ్యా.—మహత్త్వంబునందు 'రాజ' శబ్దార్థము విశేషణంబు గాకుండఁ బ్రధానముగాఁ నెంచఁబడునపుడు రాజు, అనఁబడును ఉ. రాజు- ఖగరాజు-ఇవి మహద్వాచకంబులు,ఖగరాజు, అనునపుడు పక్షులకు రాజని యర్థము కావునషష్ఠీతత్పురుషసమాసము 'ఉత్తరప్రధానస్తత్పురుషః' అనుటంజేసి సమాసంబులో నుత్తరపదంబైన రాజశబ్దంబుయొక్క యర్థమే ప్రధానమైనది; కావున డుజ్వర్ణకలోపంబుతో నకారాంతమయ్యె. అమహద్విషక్షయందు నకారాంత 'రాజన్' శబ్దము అఱువదియేడవసూత్రంబుచే సంస్కృతప్రథమైకవచనాంతతుల్యంబై యనఁగా 'రాజా' అని దీర్ఘాంతంబై యేఁబదినాల్గవసూత్రంబుచే హ్రస్వంబుగలిగి ముప్పదితొమ్మిదవ సూత్రంబునంజేసి మువర్ణకంబుతో 'రాజము' అను రూపమేర్పడెను. 'వృక్షరాజ' శబ్దంబు టచ్ప్రత్యయాంతంబై 'రామ' శబ్దంబువోలె సంస్కృతంబులో నదంతంబు. అమహదర్థకంబు గావున ముప్పదితొమ్మిదవ సూత్రమ్మునచే 'వృక్షరాజము' అయినది. ఇట్లే 'ఖగరాజ' శబ్దము సంస్కృతంబులో నదంతంబైనను మహద్వాచకంబగుటంజేసి యీసూత్రప్రకారంబునడుజ్వర్ణకలోపంబు నిపతింపఁబడినది కావున 'ఖగరాజు, అని యుత్వమాత్రంబుతోనే ప్రథమాంతంబయ్యె. ఉపసర్జనత్వంబునందు (అప్రధానార్థమందు.) 'హతరాజుఁడు పరశురాముఁడు పరశురాముచే చంపఁబడ్డ రాజులుగలవాఁడు

ఇత్యాదులు పెక్కులుగలవు. పైశబ్దంబులువోలె రాజుశబ్దము వైకృతంబుగాను, తత్సమంబుగాను, నుండునన్నందురు. అచ్చతెనుంగులో వ్రాయంబడిన పెక్కు ప్రబంధంబులందును. నిఘంటువులయందును, రాజశబ్దంబుపయోగింపఁబడినది. అయ్యది వైకృతమనక తప్పదందురు. అట్టి ప్రయోగంబులఁ గొన్నింటి నుదాహరించెద. సీ॥ రాచవాఁడనఁగను రాజన క్షత్త్రియుఁ డొప్పు నేలికసామి యొడయఁడుదొర। రాయఁడు రాజేఁడు రాజేకిమీఁదన నరపాలసంజ్ఞలై పరఁగుచుండు' ఆంధ్రభాషార్ణవము బ్రహ్మవర్గము. సీ॥ వానిఁజు రారాజువడచక్కియొకిమీఁదుతత్తడినెక్కెడిదంట యనఁగ' సాంబనిఘంటువు—దేవవర్గము. తే. వెలయు తెల్లతేజి గలుగురాజ' ఆంధ్రరత్నాకరము. 1ఆ, తే॥ గీ॥ వలయుఁ జెలువంబు తెలితేజికలుగురాజ' ఆంధ్రరత్నాకరము 1ఆ. తే॥ గీ॥ ఇంపు। మామయలుఁడు వలరాజుమరుఁడులచ్చి।కొమరుఁడు' ఆంధ్రనామసంగ్రహము—దేవవర్గు. క॥ తేజీడిగితనయంతటి। రాజుల మేలప్పయనుచు రాఁగాఁ జనితాఁ' యయాతి—4ఆ చ। అలవలరాజుచేతి యలతమ్ముల నందగుఁజేమి చెల్వపుం బొలఁతుల మోముఁదామరలఁ బోలనిక్కిన వీఁగె పెక్కురూ। పులఁ జని' యయాతి-4ఆ. ఇట్టి ప్రయోగంబులు కాన్పించుచున్నవిగాని తత్సమరాజుశబ్దంబు తాలవ్యజకారంబుతో నుండే యుచ్చారింపఁబడవలెనన్న నియమంబు విశదంబుగానుండును. 'రాజు' అనితాలవ్యంబుగా నుచ్చరించు సామాన్యులలో నేకాక పండితులలో సయితము లోకంబులోవినుచుండుము. పైనిం జెప్పినరీతి వ్యాకరణంబునుని మనంబున రాజశబ్ద భేదంబుదృఢనిశ్చయంబుతో నుంచుకొని యిప్పుడెట్టి పండితుఁడైనఁ దాలవ్యంబుగనుచ్చరింప సాహసించినను వది శ్రోతలైనవారలకు సందేహంబు కలిగింపకమానదు. కాఁబట్టి సంజ్ఞాపరిచ్ఛేదదశమసూత్రంబునొద్దఁ దత్సమశబ్దంబులవంత్యాక్షరప్రకరణంబులో రాజుశబ్దము దంత్యఘటితమని యుదాహరించినసూరిగారివచనంబే యుదారసరణిగానున్నది. రాజుశబ్దంబుతత్సమమేకాని వైకృతంబేలేనిచో నచ్చతెనుంగులోఁ బ్రయోగింపఁగూడనియట్టిశబ్దంబు కవులెట్లు ప్రయోగించిరని శంకింతురేని వినుండు. మహాకవులు గ్రామ్యశబ్దములుసయితము గ్రంథములలోఁ బ్రయోగించినచోనవి గ్రాహ్యములుగా నెంచవలెననియు, నార్యప్రయోగంబు లక్ష్యపాదులకుఁ బ్రవర్తకములనియు, శిరసావహించుచు 'నిరంకుశాః కవయః' అను న్యాయంబు జ్ఞప్తినుంచుకొని బహూకరింపవలెనని పెద్దలు చెప్పుదురు.

అట్టి గ్రామ్యంబులే మహాకవులు ప్రయోగించినంతమాత్రన గ్రామ్యంబైనప్పుడు సుశబ్దంబై తత్సమంబైన రాజశబ్దంబన్న తెనుంగులోఁ బ్రయోగింపఁబడినంతమాత్రన నేల గ్రామ్యంబుగాదు? కవులన్న తెనుఁగు గ్రంథంబులని చెప్పను నన్యదేశ్యపదంబులను వేనవేలు ప్రయోగించుచున్నారు. మహాకవులు నియమంబున్న యన్యదేశ్యపదంబులన్న తెనుంగులోనికి నాహ్వానము చేసి గౌరవించినట్లే యీ బాలగోపాలము ప్రసిద్ధంబైన తత్సమరాజశబ్దంబును బొత్తిగాంబలలోఁ బొత్తుపడచిరని తోఁచుచున్నది. కావున నేతిమ్మకవిగారు తత్సమశబ్దప్రకరణంబులో "సీ॥ దిక్పాలనంబునకు విద్వేషణవనం జెల్లు భూభృత్పదంబు నకు భూభృత్తులయ్యె। రాట్పదంబునకును రాట్టనమేయూను రాజపదంబొప్పు రాజ నంగ॥ సర్వాల'- అనుపద్యంబున రాజశబ్దంబు నుదాహరించిరి. వైకృతంబుగాదనున్నదని వారికిఁదోఁచినయెడల నీశబ్దంబు వైకృతమన్న నుదంబొందు గలదని చెలచెప్పకుందురు? విశేషపరిశోధకులైన సీతారామాచార్యులవారును దమనిఘంటువునందు రాజశబ్దము నిరూపించునప్పుడు, దీనిఁ గొందఱు వైకృతంబుగా వాడియున్నారనియు, నయ్యది చింత్యమైనయంశంబనియుఁ జెప్పిరి. వారు రచించిన ప్రౌఢవ్యాకరణంబునందుఁ గూడ రాజశబ్దంబు వైకృతత్వంబును గూర్చి కొందఱనుమతమనిరో వ్రాసిరి కాని సర్వకవిసమయసిద్ధంబని నిశ్చయింపరైరి. తాలవ్యజకారంబుతోఁ నుండుట విధియని యంగీకరించి రాజశబ్దంబును బహుశ్రమాపాదకవ్యాకరణమునకు భాజనముతోఁ బరిహాసాస్పదమైనవిరసోచ్చారణ చేయుటకంటె నన్నయ తెనుంగులో నీశబ్దంబును సకలజనప్రసిద్ధంబగుటంజేసి మహాకవులు నన్యదేశ్యాదులతోఁ బాటుగఁ బ్రయోగించిరని సంతృప్తిఁజెందుచు నీశబ్దంబు దంత్యజకారఘటితమైనతత్సమంజేయుని లోకవిదంబుగానంగీకరించుట మేలని మదాశయము.

79 సూ—జగదింద్రజిత్తులతకారంబునకులోపంబువిభాషనగు.

జగము - జగత్తు - ఇంద్రజి - ఇంద్రజిత్తు - ఋత్విగాదియగుటంజేసియింద్రజితుండనియువాడంబడు.

వ్యా—జగత్, అనుశబ్దంబుయొక్కయు, ఇంద్రజిత్, అనుశబ్దంబుయొక్కయు, తకారంబునకు లోపము వైకల్పికంబుగానగును. "జగత్" అనుశబ్దంబులోని త

కారము ప్రకృతసూత్రంబున లోపింపఁగా నపుంసకంబు గావున ముప్పదితొమ్మిదవ సూత్రంబున మువర్ణకంబు వచ్చి 'జగము" అనియైనది. వైకల్పికంబనుటచే లోపము రానియపుడు అరువదియేడవసూత్రంబుచే "జగత్" అను తకారాంతంబే ప్రాతిపదికంబై యఱువదియెనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులుగలిగి "జగత్తు" అనియైనది. 'ఇంద్రజిత్' అనునపుడు ప్రకృతసూత్రంబుచే, తకారములోపింపఁగా "ఇంద్రజి" అని యొకరూపంబును, తకారలోపము లేనియపుడు అరువదియెనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులు గలిగి "ఇంద్రజిత్తు" అను మఱియొకరూపంబును, డెబ్బదిమూఁడవసూత్రంబుంబట్టి ఋత్విగాదులతోఁ జేరినదగుటచేఁ బ్రాతిపదికము ద్వితీయైకవచనాంతతుల్యంబుగావున "ఇంద్రజితమ్" అనికాఁగా డెబ్బదియొకండవసూత్రంబుచే నంత్యమకారము లోపించి యిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వముజ్వర్ణకంబులు రాఁగా "ఇంద్రజితుఁడు" అను రూపాంతరంబును నయ్యెను. నాకొమరుఁడింద్రజిత్తుఁడు । లేకుండుట చేటునాటి లెక్క" అచ్చ-రా- యుద్ధకాం. ఆ॥ వె॥ ఇంద్రజిత్తుఁడప్పుడీనకులోద్భవునిచే ! మూర్ఛనొంది తెలిసి మూర్ఖగతిని' మొల్ల-యుద్ధ- ఆ॥ వె॥ చారులరుగుదెంచి సౌమిత్రిచే నింద్రి । జిత్తుఁడీల్గెననుచుఁ జెప్పుటయును" మొల్ల-యుద్ధ-2 ఆ. పైప్రయోగంబులు, ఉగాగమద్విత్వంబులపై డువర్ణకంబుతోఁ బ్రయోగింపఁబడి శాస్త్రీయసాధుత్వంబునకు సంశయాస్పదంబుగ నున్నవి. పైమూఁడవ ప్రయోగంబు "ఇంద్రి । జితుఁడునీల్గెననుచుఁ జెప్పుటయును" అని సవరించినసలక్షణంబుగనుండును. ఆంధ్రకౌముదియందు మాత్రము 'ఇంద్రజిత్తుఁడు' అను ప్రయోగము సాధీయముగా జెప్పఁబడినది. ఇంద్రజి, ఇంద్రజిత్తు" శబ్దంబులకు నింద్రజితుండనుపదంబు రూపాంతరంబేకాన దీనియర్థము-ఇంద్రుని జయించువాఁడు. మఱియునీశబ్దంబు-ఇంద్రునిచేత జయింపఁబడినవాఁడనియు, నర్థమిచ్చును. కావున "ఇంద్రజితుండు" అను శబ్దంబునకు-ఇంద్రుని జయించిన రావణజ్యేష్ఠపుత్రుఁడును, ఇంద్రునిచేజయింపఁబడినవాడును ననియు, నర్థమై శ్లేషయందును, ! ప్రయోగించుటలోఁ జమత్కృతిగానుండును.

80 సూ.--సాంతంబుల తుదిసకారంబునకు లోపంబు బహుళంబుగానగు.

ఉరము - ఉరస్సు - వక్షము - వక్షస్సు — అర్చి-అర్చిస్సు -ధనువు - ధనుస్సు - ఆయువు - ఆయుస్సు ॥ బహుళగ్రహణంబునంజేసి పయఃప్రభృతుల సకారంబునకు లోపంబులేదు ॥ పయస్సు -వయస్సు- సరస్సు.

వ్యా—సకారాంతమందుఁ గలపదముల కడపటిసకారంబునకు లోపంబుబహుళంబుగానగును. 'ఉరస్' అనుశబ్దము సకారాంతపదము. దీనియందలి యంత్యాక్షరంబైన సకారము ప్రకృతసూత్రంబున లోపింప నపుంసకలింగమవుటచే ముప్పదితొమ్మిదవసూత్రంబున మువర్ణకంబురాఁగా 'ఉరము' అనినైనది. సవర్ణములోపింపనియప్పుడు అటునదియొనిమిదవసూత్రంబు చే ద్విత్వనుగాగమద్విత్వంబులతో 'ఉరస్సు' అనినైనది. 'వక్షము' అనుశబ్దంబు పైదానివలెనే యెఱుంగనది. 'అర్చిస్' అనుశబ్దంబునందలి కడపటి యక్షరంబైన సకారంబు ప్రకృతసూత్రంబున లోపింపఁగా'అర్చి' అని యైనది. మఱియు నలువదినాల్గవసూత్రంబుచేఁ బ్రథమైకవచనంబునకు లోపంబు గలిగినదని యెఱుంగునది. సవర్ణలోపము కలుగనియప్పుడు అటువదియొనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులచే 'అర్చిస్సు' అయినది 'ధనుస్' అనునపుడు కడపటియక్షరంబగు సకారంబు ప్రకృతసూత్రంబున లోపించి నలువదియొనిమిదవసూత్రంబుచే వువర్ణకంబువచ్చి 'ధనువు' అనియు, సవర్ణములోపింపనియప్పుడు అటువదియొనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులుగలిగి 'ధనుస్సు' అయినది. ఇట్లే 'ఆయువు' మున్నగుశబ్దంబులు గ్రహింపనది. బహుళమని చెప్పుటచేత 'పయః' మున్నగు వానియొక్క సకారంబునకు లోపంబుకలుగదు. అనఁగాఁ గడపటివర్ణమైన సకారంబునకు లోపంబు కలుగక 'పయస్సు' అనియేకాని 'పయము' అనియుండదు. ఆధునికుఁడొకండు 'పయము' అని ప్రయోగించెను, ఇయ్యది కావ్యంబులమృగ్యంబు. 'వయస్' అనుశబ్దము పక్షికర్థమైనపుడు 'వయస్సు' అనియు, ప్రాయమున కర్థమైనపుడు వయస్సు, వయసు, అను రెండురూపంబులుగలవు. కాని 'వయస్సు' అనునపుడు పక్షిపర్యాయముగాఁ దెలుఁగునఁ బ్రయోగంబు మృగ్యంబు. 'ఓజస్సు' అనస్సు, అంభస్సు, వర్చస్సు, రక్షస్సు, పాథస్సు, సరస్సు, ఆయుస్సు, హవిస్సు, చేతస్సు, మహస్సు, అంహస్సు, ఆగస్సు, ఇత్యాది శబ్దంబులకు మువర్ణకంబురాదు. తుదిసలోపంబు బహుళంబుగ నగు 'పథిన్' శబ్దంబునకు 'పథము', 'పుర్' అనుశబ్దంబునకు 'పురము', ఇయ్యవి ప్రథమైకవచనాంతంబు

లగును. (సరము, అనుటకు- సీ॥ తే॥ గీ॥ ఘటితకిసలయపమజటూపటలనిటల| ఫలకతిల కితశశిసితభసితలసిత| రసితపరమసమాధి మద్విపరరుచిర| రసఘురభరంబు వొల్చుమానస సరంబు॥ ఘటికాచలమాహాత్మ్యము- 1ఆ, అను నీపద్యముయొక్క ముఖ్యమగు సీసమం దలి ప్రతిపాదాంత్యమందును గ్రహముగా, పరిసరంబు, కలధురంబు, మౌక్తికసరవ రంబు, రోలం బపరికరంబు, అను నంత్యనియమముతో (మానససరంబు; చేర్పఁబడి ప్రయోగింపఁబడినది. ఈప్రయోగంబునకు సహాయమైన ప్రయోగాంతరంబుగాఁ నిపింపదు.

81 సూ—మహద్వాచకంబులగుసాంతంబులకంతలోపంబేనిద్వితీయైకవచనాంతతుల్యత్వంబేనగు.

అంగిరుఁడు - అంగిరసుఁడు - ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు- ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు - ఊర్ధ్వరేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు.

వ్యా.—మహత్తును జెప్పునట్టి సకారాంతపదంబులకుఁ గడపటియక్షరములోపిం చుటగాని ద్వితీయైకవచనసమత్వముగాని కలుగును. ఉ. అంగిరుఁడు - అంగిరసుఁడు. ఇచ్చట (అంగిరస్, అనియుండఁగాఁ గడపటియక్షరంబగు సకారంబు ప్రకృత సూత్రంబున లోపించి యిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వడుజ్వర్ణ కంబులు రాఁగా (అంగిరుఁడు, అయినది. పక్షంబున (అంగిరసమ్, అను ద్వితీయైక వచనాంతంబే తెలుఁగునఁ బ్రాతిపదికంబై- డెబ్బదియొక్కవసూత్రంబుచే మకారంబు లోపించి యిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వడుజ్వర్ణకంబులతో (అంగిరసుఁడు, అనియైనది. ఇట్లే(ఉగ్రశ్రవుఁడు, ప్రచేతుఁడు, ఊర్ధ్వరేతుఁడు, మొదలైనవానికి రూపద్వయంబు గ్రహింపవలెను. తే॥ గీ॥ ఉత్తమాశ్రమనిష్ఠుఁడూర్ధ్వ రేతుఁ| డైనకణ్వమహాముని యనఘచరితుఁ! డట్టిముని కెట్లుపుట్టితుర వైతిదీని| నాకు నెఱుఁగంగఁ జెప్పుము నలిననేత్ర॥ భార- ఆది- 4ఆ. క॥ సుతు లనఘులువేవురువమ| యుతులయి యుదయించి సాంఖ్యయోగాభ్యాస| న్నతిఁజేసి ముక్తులయి భూ|రి తేజులంద ఱును నూర్ధ్వరేతసులైరెఁ, భార-ఆది- 3 ఆ.

82 సూ—వేధపురోధపురోధసుఁడు.

వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు వైకల్పికముగా సలోపస్త్రీవద్భావంబులు దీనిచే నిపతింపంబడియె.

వ్యా—వేధ - పురోధ - పురోధసుఁడు. అనఁగా బైయెనుబదియొకండవ సూత్రంబుచేత నవి సాంతంబులగుటచే వేధుఁడు - వేధసుఁడు - పురోధుఁడు—ఇట్లు నిష్టరూపంబులగుచుండ ‹వేధశ్శబ్దంబునకు సకారలోపంబును; స్త్రీత్వాదిదేశంబును, నిత్యంబుగాను; ‹పురోధ› శబ్దంబునకు సకారలోపంబును, స్త్రీత్వాతిదేశంబును, నీసూత్రంబుచేత వైకల్పికముగాను; నిపతింపఁబడినవి, (నిపాతమనఁగా—మఱియొక రీతిప్రయోగము సామాన్యసూత్రముచేతఁ గలుఁగుచుండఁగా దానికి విరుద్ధముగాఁ బఠించిన, రూపము.) ‹వేధ› ఇచ్చట సకారములోపించి స్త్రీత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపంబుగలిగినది. ‹పురోధ—› పురోధసుఁడు, ఇచ్చట సకారములోపించి స్త్రీత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపంబుకలిగి ‹పురోధ› అయినది పక్షంబున ‹పురోధసమ్› అను ద్వితీయాంతము ప్రాతిపదికంబై డెబ్బదియొకండవసూత్రంబుచే నంతిమమకారలోపంబును, ఇరువదియొకటియిరువదిరెండుసూత్రంబులచే నుత్వానుస్వార్ణకంబులు గలిగి ‹పురోధసుఁడు› అయినది.

83 సూ—మనఃప్రభృతులసకారంబునకుద్విత్వంబువిభాషనగు.

మనసు - మనస్సు - శిరము - శిరస్సు - సదసు - సదస్సు - సలోపంబయ్యెనేని - మనము - శిరము - సదము.

వ్యా—‹మనస్› మున్నగునశబ్దములయొక్క సకారంబునకు ద్విత్వంబు విభాషగానగును. ఉ. మనసు- మనస్సు. ఇచ్చట “మనస” అనియుండఁగా నలువదియెనిమిదవసూత్రంబుచే నుగాగమద్విత్వంబులు రాఁగా ‹మనస్సు› అయినది. పిమ్మట నీసూత్రంబునందు ద్విత్వంబు విభాషగావున నేకసకారంబుతో నుగాగమాంతరూపంబును నుండు. ఉ. మనసు— మనస్సు ఇట్లే ‹శిరసు. సదసు, తపసు- వక్షసు- యశసు -

తపసు - తమసు - తేజసు - మొదలైనవి గ్రహింపనలయును. వీనియంత్యసకారంబునకు నెనుబదియవసూత్రంబుచే లోపంబుగలిగి యదంతనపుంసకలింగంబుగావున ముప్పదితొమ్మిదవసూత్రంబుచే మువర్ణకంబు రాఁగా మనము, శిరము, సదము, ఉరము-వక్షము- యశము- తపము- తమము- తేజము, మొదలైనవి యయ్యెను.

84 సూ—ద్యుహృచ్ఛబ్దంబులకుదివిహృదియగు.

దివి - దివులు - హృది - హృదులు॥

వ్యా—(దివ్, అను వకారాంతశబ్దంబునకు (దివి అనియు, హృద్, అను దకారాంతశబ్దంబునకు "హృది" అనియుఁ బ్రథమావిభక్తియగును. ఉ. దివి-దివులు హృది-హృదులు.

85 సూ—స్త్రీలింగంబులెల్లస్వస్వనియతంబులగుస్త్రీప్రత్యయంబులంగూడియిందుఁబ్రవర్తిల్లు.

| నామము... | ...స్త్రీప్రత్యయాంతము... | తత్సమము. |
|---|---|---|
| కర్తృ... | ... కర్త్రీ ... | ... కర్త్రి |
| జనయితృ... | ...జనయిత్రీ ... | ...జనయిత్రి |
| భాగ్యశాలిన్ | ...భాగ్యశాలినీ ... | ...భాగ్యశాలిని |
| బుద్ధిశాలిన్ | ...బుద్ధిశాలినీ ... | ...బుద్ధిశాలిని |
| మతిమత్ ... | ...మతిమతీ ... | ...మతిమతి |
| గుణవత్ ... | ...గుణవతీ ... | ...గుణవతి |
| విద్వత్ ... | ...విదుషీ ... | ...విదుషి |
| వనజముఖ ... | వజనముఖీ ... | ...వనజముఖి |
| | వనజముఖా... | ...వనజముఖ |
| మీననేత్ర... | ...మీననేత్రా ... | ...మీననేత్రి |

అంగాదులకుఁదప్ప సంయోగోపధంబులకు జీప్రత్యయంబులేమింజేసి - మీననేత్రి - పద్మనేత్రి - ఇత్యాదులసాధువులు.

వ్యా—సంస్కృతభాషలో స్త్రీత్వము బోధింపఁబడినపుడు స్త్రీప్రత్యయంబులేవేవి సంస్కృతవ్యాకరణంబునఁ గలుగునో యట్టిప్రత్యయాంతంబులే యీభాషయందుఁ బ్రాతిపదికంబులగును ఉ. కర్త్రి, జనయిత్రి, బుద్ధిశాలిని, గుణవతి, మీననేత్రి- మొదలైనవి. కర్త్రి, జనయిత్రి, ఈశబ్దంబులకు సంస్కృతభాషలో కర్తృ జనయితృ, శబ్దంబులు మహద్వాచకంబులైనపుడు ఋకారాంతంబులుగా నుండును. సాంస్కృతికంబులైన ఋకారాంతశబ్దంబులు స్త్రీలింగంబులో నీకారాంతంబులై "కర్త్రీ-జనయిత్రీ" అని దీర్ఘాంతంబులగును. పిమ్మట నేఁబదినాల్గవసూత్రంబుచే హ్రస్వాంతంబులగు. "భాగ్యశాలిన్- బుద్ధిశాలిన్" ఇత్యాదిసాంస్కృతికనకారాంత పుంలింగంబులు సంస్కృతభాషలో నీకారాంతంబులై తెలుఁగున హ్రస్వాంతంబులై "భాగ్యశాలిని, బుద్ధిశాలిని" ఇట్లుండును. మతిమత్, గుణవత్ ఇత్యాదితకారాంత సాంస్కృతికపుంలింగంబులు స్త్రీత్వంబున నీకారాంతంబులై తెలుఁగున హ్రస్వాంతంబులగును. ఉ మతిమతి-గుణమతి. సంస్కృతభాషలో ఋకారాంత నకారాంత తకారాంతశబ్దంబులు సామాన్యంబుగా నీకారాంతంబులగు. తెలుఁగులో నట్టిదీర్ఘంబునకు, హ్రస్వంబు కలుగును. ధాతృ-ధాత్రి. దుష్టశాసితృ-దుష్టశాసిత్రి. నేతృ-నేత్రి గుణిన్ - గుణిని. ధనిన్ - ధనిని. కాశీవాసిన్ - కాశీవాసిని. ధీమత్ -ధీమతి. మహత్ - మహతి. సౌందర్యవత్ - సౌందర్యవతి. (మూలము) అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు జీప్రత్యయంబులేమింజేసి, మీననేత్రి, పద్మనేత్రి, ఇత్యాదు లసాధువులు. (వ్యా) అంగమొదలైనశబ్దంబులకుఁ దక్క హల్సముదాయం బుపధాస్థానమందుఁగల తక్కినశబ్దంబులకు జీప్రత్యయము! (స్త్రీలింగబోధకమైన ఈకారము) లేకపోవుటచేత మీననేత్రి — పద్మనేత్రి, మొదలైనశబ్దంబులు దుష్టములు. ఉపధయనఁగా:—శబ్దంబుతుదినుండి లెక్కించినచో రెండవదియైనయక్షరము. కాఁబట్టి ప్రకృతంబున శబ్దముయొక్క యక్షరంబుల నంతంబునుండి లెక్కించుతఱిని సంయోగము (హల్లులకుమి) రెండవస్థానమం దుండవలయును. మీననేత్రి, అనుశబ్దంబులో మొదవర్ణంబకారము. పూర్వవర్ణంబులు తకారరేఫంబులు.

ఆవర్ణంబులకే సంయోగమని పేరు. ఈశబ్దంబులలో సంయోగముపధయైనందున నీకారాంతంబుకాలేదు. ఇట్లే పద్మనేత్ర మొదలైనవి. 'మీననేత్రి, ఇత్యాదులు, 'మత్స్యములవంటి నేత్రములుగలది, అనునర్థంబునన సాధువులైనను 'మీనంబులకు నాయకురాలు, అనునర్థంబున సాధువేయగును. మీనంబులకు నాయకురాలనఁగా దన నేత్రంబులు మీనంబులనుమించి యున్నవి గావున నట్టినయనంబుల ద్వారంబున మీనంబుల నేలుచున్నదని నేత్రంబులకు నుత్కర్షముం భించును. మీనంబులు కన్నులకు సమానముగుట జగద్విదితంబు గావున నయనార్థకశబ్దంబు లేకపోయినను, ఉపమానవాచక మీనశబ్దంబుచేతనే నేత్రంబులూహింపఁబడు. ఇట్టియర్థము సౌందర్యవర్ణనాప్రకరణంబునందుఁ బైశబ్దంబులు ప్రయోగించునప్పుడు స్ఫురించుననియెఱుంగునది. 'నాసిక - ఉదర-ఓష్ఠ - జఙ్ఘ - దన్త - కర్ణ - శృఙ్గ- అఙ్గ - గాత్ర- కణ్ఠ, ఈశబ్దంబు లీకారాంతస్త్రీలింగంబులుగను, ఆకారాంతస్త్రీలింగంబులుగాను నుండును; గానఁ దెలుఁగులో హ్రస్వంబుగలిగి ఇకారాంతంబులుగాను అకారాంతంబులుగాను నుండును. ఉ. చంపకనాసికి-చంపకనాసిక. కలకణ్ఠి కలకణ్ఠ. పల్లవోష్ఠి-పల్లవోష్ఠ. మొదలైనవి. ఇట్లు రెండువిధంబుల స్త్రీబోధకములైనప్పుడు వాడవచ్చును. మిగిలినబహ్వచ్క-శబ్దంబులకు (రెంటికన్న నెక్కువయచ్చులుగల శబ్దంబులకు) స్త్రీత్వబోధకము జీప్రత్యయంబు రాదు. ఉ. 'పద్మలోచన-కుటిలకుంతల-పల్లవాధర' మొదలైనవీనిని, పద్మలోచని, కుటిలకుంతలి, పల్లవాధరి, ఇత్యాదికమికారాంతంబుగా వాడవలదు. పెక్కురు తెలియక 'నేత్రి' అనియే ప్రయోగించుచుండిరి గీ॥ శరణు జగదంబ లలితవాచాకదంబ । చందనము కుందరదన పూర్ణేందువదన । సత్ప్రణామంబు మృగనేత్రి చారుగాత్రి । దండమలివేణి నీకుఁ బద్మజునిరాణి' పట్చ. 4ఆ. తే॥ గీ॥ పద్మదళనేత్రి ప్రౌఢభూపాలపుత్రి । చిక్కవిరుపాజి మరునిరాచిల్క తేజి' చాటుధార. ఇచ్చోట్ల నంత్యప్రాసనియమము. ఈప్రయోగమునకు నాధునికులగ్రంథములయందు లెక్కయేలేదు. మఱియు దంతశబ్దంబునకు మత్వర్థమందు 'సు' వర్ణంబు పూర్వమందున్నచో 'దతి' గా మాఱును. ఇది తెలియక పెక్కురు 'సుదతి' అనుటకు 'సుదంతి' అని ప్రయోగించిరి. సీ॥ 'దాడిమీఫలమియ్యెడను నేల కొనితెమ్ము దాడిమీఫలమ్ము సుదంతికిమ్ము' అప్ప-2ఆ. (ఇచ్చో 'దాడిమీఫలము సుదతికిమ్ము' అన్న నెన్నికగా నుండును) క॥ 'తానూరక యలిగి యా సుదంతిని జేరక' అప్ప-3ఆ. (ఇచ్చో 'తానూరక యలిగి యా సుదతినిం జేరక' అన్న సరిపోవును) మ॥ ఎదవో (జూ చెదవో సుదంతికిఁ బొలంతీ క్షాంతి

యొప్పంచుఁజె | ప్పనుచే' పాం-నా-౫౯. ఇచ్చో 'యోగ్యమైనదంతంబులుగలది' అ న్నయర్థంబునందు 'సుదతి' అనిపదరించుటకు వలనుపడదు; కాని స్త్రీలకు గజయాన లన్నప్రసిద్ధముకలదుగావున నడకచే నేనుంగువంటిదని యర్థము చెప్పుకొనుమఁ శైశబ్దం బులున్నరీతినుంచి కవిప్రయోగమునందు గౌరవముంపవచ్చును.

86 సూ.—మహాతితరంబులగు స్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబువిభాషనగు.

పద్మలతమనోహారి - పద్మలతమనోహారిణి - హృద్యంబగువి ద్య - హృద్యయగువిద్య॥ మొదవులలోఁగపిల వరిష్ఠంబు - కపిలవరిష్ఠ

వ్యా.—మహాతులుకాని స్త్రీలింగంబుల విశేషణంబులకు నపుంసకలింగధర్మంబు విభాషగానగును. అనఁగాఁ నిర్జగిజడబోధకములైన స్త్రీలింగంబులవిశేషణంబులు స్త్రీ లింగముగాను, నపుంసకలింగంబుగాను, నుండును. ఉ. పద్మలతమనోహారి – పద్మలత మనోహారిణి. ఇచ్చట 'లత' అనునది జడంబుగావున 'మనోహారి' అనినపుంసకలింగము గాను, 'మనోహారిణి' అని స్త్రీలింగంబుగాను, విశేషణంబుచెప్పవచ్చును. 'మనోహా రిణ్' శబ్దము సంస్కృతంబులో నాంతంబుగనుక నెనుబదియైదవసూత్రప్రకారంబున స్త్రీలింగరూపము 'మనోహారిణి,' అవవలయును. ఇట్లే 'హృద్యంబగువిద్య-హృద్య యగువిద్య' మొదవులలోఁగపిలవరిష్ఠంబు, మొదవులలోఁగపిలవరిష్ఠ, మొదలైనవి గ్రహింపనలెను.

87 సూ.—భవచ్ఛత్రాదులకిందుఁబ్రయోగంబులేదు.

భవదాదులగు హలంతసర్వనామంబులకును శతృరేఫాంతాదులకు ను దెనుఁగుభాషయందువ్యవహారంబు లేదనియర్థము - సమాసంబులం దొలుతంగడిసి యిందుఁ బ్రయుక్తంబులగు ॥ భవద్గుణంబులు - త్వదా శయము - మత్పుణ్యము - అస్మద్రూపము - భవిష్యత్కాలము - ధూ ర్వహము -ఇత్యాదులెఱుంగునది

వ్యా—భవత్ మొదలైనశబ్దంబులును, శతృప్రత్యయాంతరూపంబులును, రేఫాంతంబులును, దెనుఁగుభాషయందుఁ బ్రయోగింపఁగూడదు. అనఁగా భవత్-త్వత్-మత్, మొదలైనశబ్దంబులును, లసత్-భవిష్యత్, మొదలైనశతృప్రత్యయాంతంబులును, ధూర్-గిర్, మొదలైన రేఫాంతశబ్దంబులును, దెనుఁగుభాషయందుఁ బ్రయోగింపఁదగవుకాని సమాసాంతంబులయందుఁగాక తక్కినసమాసాదిమధ్యభాగంబులయందుఁ బ్రయోగింపవచ్చును. ఉ. భవద్గుణంబులు - త్వదాశ్రియము - మత్సాహాయ్యము, ఇత్యాది సమాసస్థలంబులయందు భవత్ - త్వత్ - మత్. మొదలైనశబ్దంబులు సమాసాంతర్భాగంబుగాఁ బ్రయోగింపఁ బడ్డవి. సమాసాంతంబునందును, వ్యస్తంబునందును వీనికిఁ బ్రయోగములేదు.

---

# ఆచ్ఛికపరిచ్ఛేదము.

---

అచ్చతెనుఁగుంగూర్చి తెలుపునట్టిభాగమునకు నాచ్ఛికపరిచ్ఛేదమని పేరు

1 సూ—సంస్కృతసమేతరంబయిన యీభాషయచ్ఛయనంబడు స్పష్టము.

వ్యా—సంస్కృతసమములుకాని యీభాష యచ్చతెనుఁగనఁబడును.

2 సూ—ఆచ్ఛికశబ్దంబులెల్లందఱుచుగస్త్రీసమంబులుంక్లీబసమంబులయియుండు.

స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపాదికంబును గ్లీబసమత్వాతిదేశంబుచే మువర్ణకంబునగునని యెఱుంగునది॥ అన్న-మిన్న -

అద్ద - గద్ద - జాణ - గాణ - ఓడ - గోడ - ఇత్యాదులు స్త్రీసమంబులు॥ బియ్యము - నెయ్యము - అల్లము - మొల్లము - సున్నము - సన్నము - ఇత్యాదులు క్లీబసమంబులు ॥ తఱుచుగననుటచేఁ బుంలింగతుల్యంబులుం గొండొకకలవని తాత్పర్యము ॥ కొమరుఁడు- చందురుఁడు - జముఁడు - కందుఁడు - ఇత్యాదులు.

వ్యా—అచ్చతెనుఁగు శబ్దంబులన్నియు సాధారణంబుగ స్త్రీలింగసమంబులుగాను, నపుంసకలింగసమంబులుగాను, నుండును. స్త్రీత్వారోపించుటచేతఁ (స్త్రీలింగసమములని చెప్పుటచేత) బహుత్వైకవచనంబునకు లోపంబుకల్గుట మొదలైనవియు నపుంసకలింగత్వారోపించుటచేత (నపుంసకలింగసమములని చెప్పుటచేత) ముఁవర్ణకము వచ్చుటయుఁ గలుగునని తెలిసికొనునది. ఉ. అన్న—మిన్న—అద్ద—గద్ద—జాణ—గాణ—ఓడ— గోడ మొదలైనవానికిఁ బహుత్వైకవచనలోపంబు గలదుగావున స్త్రీలింగసమంబులు. బియ్యము—నెయ్యము..అల్లము—మొల్లము—సున్నము—సన్నము మొదలైనవానికిముంవర్ణకముండినదిగనుకనపుంసకలింగసమంబులు. (తఱుమగ, (సాధారణముగ) అని సూత్రంబునయందుఁ జెప్పుటచేత స్త్రీలింగసమంబులును, నపుంసకలింగసమంబులును మాత్రమే కాక పుంలింగముతో సమానంబులును కొండొక (కొన్ని) కలవనితాత్పర్యము. ఉ. కొమరుఁడు — చందురుఁడు — జముఁడు — కందుఁడు — మొదలైనవి, ఇచ్చటఁ బుంలింగసమంబులని చెప్పుటచేత డుజ్వర్ణకంబువచ్చినదని గ్రహింపఁబడెను.

3 సూ—బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు.

మహత్త్వంబున వీనికుత్వడు జాదులు నమహత్త్వంబున ముఁవర్ణకాదులును స్త్రీత్వంబునందాలు శబ్దముతోడ సమానంబునుంగలుగునని యెఱుంగునది॥ బల్లిదుఁడు - బల్లిదము - బల్లిదురాలు ॥ బల్లిద - అక్కజ - కావల - బెట్టిద - బెడిద - మిసిమింత - మొక్కల - ఇత్యాదులు బల్లిదాదులు.

వ్యా—బల్లిద, మొదలైనశబ్దంబులు సంస్కృతశబ్దంబులతో సమానములు. అన్యగా మహత్త్వంబునందు బల్లిద, మొదలైనవానికి, తత్సమపరిచ్ఛేదమందలి యిరువదియొకటి యిరువదిరెండు సూత్రంబులచే నుత్వమువర్ణకాదులును (ఆమలనుటచే నిగాగమనగాగమంబులు) అమహత్త్వంబునందు ముగ్వర్ణకాదులును (ఆదిశబ్దంబుచేముగాగమంబును) స్త్రీత్వంబునందు ఆలు, శబ్దంబుతో సమాసముకలుగునప్పుడు సంధిపరిచ్ఛేదమునందలి ముప్పదియొకండవసూత్రంబుచే నుత్వరుగాగమంబులును, కలుగునని తెలిసికోవలెను. ఉ. బల్లిదుండు - బల్లిదము - బల్లిదురాలు. మొ. ఇట్లే అక్కజ-కావల-దిట్టిప-దిశిద-మిసిమింత- మొక్కల- మొదలైనవానికి బల్లిదశబ్దంబునలెనే రూపత్రయంబు గ్రహింపవలెను.

4 సూ—మహత్తులగుమగాదులకుం గయిరాదులకునుడుజ్జగునుత్వంబుగాదు.

మగండు - మనుమండు ‖ కయిరండు - కత్తెరండు ‖ మగ - మనుమ - రాయ - పాప - ప్రే - త్రే - ఈకాప్రత్యయాంతంబులు - ఇత్యాదులుమగాదులు ‖ కయిర - కత్తెర - జన్న - నీల — ఇత్యాదులు కయిరాదులు.

వ్యా—మహద్వాచకములైన 'మగ, మొదలైనశబ్దంబులకును, 'కయిర' మొదలైనశబ్దంబులకును, డుజ్వర్ణకంబువచ్చును. ఉత్వంబురాదు. ఉ. మగండు-మనుమండు రాయండు-పాపండు-ప్రేండు-త్రేండు-ఈ-కా- ప్రత్యయాంతంబులుమగాదులు. కయిరండు-కత్తెరండు-జన్నండు-నీలండు-మొదలైనవి కయిరాదులు ఈమగాదులకును, కయిరాదులకును, ద్వితీయాద్యేకవచనంబునందుబల్లిదాదులకువలెనిగాగమంబుసాక్షికంబుగా తత్సమపరిచ్ఛేదమునందలి యిరువదివాల్గవసూత్రంబుచే నిత్యంబనిజ్ఞప్తినుంచుకోవలెను. ఈకాప్రత్యయాంతంబులు = ఈప్రత్యయంబును, కాప్రత్యయంబును, వంతమందుగల శబ్దాంబులు. ఈప్రత్యయాంతంబునకు— ఉ. అనుమేండు మొ (సూ - తద్ధిత-15సూ) కాప్రత్యయాంతంబునకు- ఉ. అనుకాండు- మొ. (సూ- తద్ధిత- 11సూ) ఈమగావి

ంబునకు రేఫంబు కలుగఁగా 'పగతురు' అనియైనది. ఇట్లే అల్లురు-నెయ్యురు-కలియురు- మార్తురు మొదలైనవి గ్రహింపవలెను. 'మల్ల' శబ్దము సాంస్కృతికంబై నను దానిబహువచనలకారంబునకు రేఫంబు పాక్షికంబుగఁ గానిపించెడిని. ఉ. మల్లలు మల్లురు. చ. దలమును విస్ఫులావు మెయిదర్పముఁ బేర్చి పెనంగు జెట్టిమ|ల్లులవిఱుతుల్ మఱిక గడియలోననమాండ్కి వేడ్కఁ జేయుచుల్' భార- విరా. 2 ఆ. మవీరారిపు| ల్లురకునట్టియుగుండదీయబలఘూర్ణుల్ సంగడాలౌవియు | చ్చరకాంతాననపాళివిన్న రడి కాశ్చర్యంబు చర్పింపఁగన్' రామాభ్యుదయము. 1ఆ.

6 సూ—కొన్ని డుమంతంబుల బహువచనలకారంబునకు రేఫంబును దానికిముందు పూర్ణబిందుపూర్వకడకారంబునగు.

గండండ్రు - మిండండ్రు - ఇత్యాదులు.

వ్యా—'కొన్ని డుమంతంబులయొక్క బహువచనలకారంబునకు రేఫంబును, ఆరేఫంబునకుఁ బూర్వము నిండుసున్నదాపలగలిగిన డకారంబునువచ్చును. ఉ. గండఁడు- గండండ్రు. మిండఁడు - మిండండ్రు. ఇచ్చట 'గండ + లు' అనియుండఁగాఁ బ్రికృతసూత్రంబున లకారంబునకు రేఫంబురాఁగా 'గండ + రు, అయ్యె. ఈరేఫంబునకుముందు దాపలసున్నగల డకారంబురాఁగా 'గండండ్రు. అయినది. ఇట్లే 'మిండండ్రు, గ్రహించునది. నరసింహావ్యాకరణకారకునిమతంబున 'గండలు, మిండలు, అను బహువచనరూపంబులునుగలవు.

7 సూ—కాపశ్రిత్యయంబుమీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును లఘు రేఫంబునకు ముందు బిందుపూర్వకడకారంబునగు.

విలుకాండ్రు - విలుకాఱు - వేఁటకాండ్రు - వేఁటకాఱు - వేడుకకాండ్రు - వేడుకకాఱు.

వ్యా.—కా ప్రత్యయంబు పరువాతిబహువచనలకారంబునకు లఘురేఫంబును, అలఘురేఫంబును, కలుగును. అలఘురేఫంబునకు దాపలనున్న గలడకారంబు వచ్చును. ఉ. విలుకాండ్రు - విలుకాలు ఇచ్చట 'విలుకా' అనునది ప్రాతిపదికము. దీనికి బహువచనార్థమందు 'విలుకా + లు' ఇట్లుండఁ బ్రకృతసూత్రంబునఁ బ్రత్యయలకారంబునకు లఘురేఫంబును, దానికిముందు దాపలనున్న గలడకారంబును రాఁగా 'విలుకాండ్రు' అయ్యెను. పక్షంబున 'విలుకా' శబ్దంబుపైని బహువచనలకారంబునకు నలఘురేఫంబుమాత్రమే కలుఁగగా 'విలుకాలు' అయ్యెను. ఇట్లే 'వేటకాండ్రు—వేడుకకాండ్రు అను నవియు గ్రహింపవలెను. ఉ. వేడుకకాండ్రకై తిరుగు వేశ్యలనాడిన జాడ నున్నని| ల్లాడఁగఁ బాడియౌనె, ఉ- రా 4ఆ. క. పాకెండు నీరెడ్రతెన్వఁగఁ దాఱజేసి సమైనయొందెదనుకఁ గని పురం| బాజెనుడువంత వేడుక| కాలులుజాలరులుసూచి క్రందుకొనంగన్, భార- శాంతి- 3ఆ.

8 సూ—త్రిప్రభృతుల బహువచనమునకు ముందు డుఙ్గగు.

మూఁడులు - మూండ్లు.

వ్యా—'త్రి' మొదలైనశబ్దంబులు బహువచనంబునకుముందు డుఙ్వర్ణకంబు వచ్చును. ఉ. మూఁడులు- మూండ్లు 'మూఁడులు' అనుశబ్దంబునందు డుఙ్ఙకారేత్కంబు గావున బిందువు పూర్వమునందుఁ గలిగె. 'మూ' శబ్దంబు దీర్ఘాంతంబగుటచే వర్ణానుస్వారంబుమాత్రించే కలిగెను. 'మూ + లు' ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున లువర్ణకంబునకు ముందు డుఙ్వర్ణకంబుగలిగి 'మూ + ఁడు + లు' ఇట్లుండఁ బండ్రెండవసూత్రంబుచే బహువచనలకారంబునకు ముందున్న డుఙ్వర్ణకంబుయొక్క ఉకారంబునకు లోపంబు కలుఁగగా డకారలువర్ణకంబులు సంయుక్తంబులయ్యె (మూ + ఁడ్లు) పిమ్మట నీపరిచ్ఛేదమునందలి పదునేడవసూత్రంబున డలకారసంయోగంబునకుఁ బూర్వమందున్న యఱసున్న నిండుసున్నయయి 'మూండ్లు' అయ్యెను. ఇట్లే ఏఁడులను- ఏండ్లను. మొదలయిన ద్వితీయాదులు.

9 సూ—కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు.

కూఁతురు - కూఁతులు కూఁతురులు - కూఁతుళ్లు - కూఁతురిని త్యాదిరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది.

వ్యా—కూఁతు, అనుశబ్దంబుయొక్క ప్రథమైకవచనంబునకు రు, అనునక్షరంబు వచ్చును, ఉ॥ కూఁతురు—దీనిబహువచనము—కూఁతులు కూఁతురులు—కూఁతుళ్ళు—కూఁతురిని, ఇత్యాదిరూపంబులు దుష్టంబులు. కూఁతు, శబ్దంబు నామవాచకంబు; కావున దానిపైని బహువచనప్రత్యయమొక్కటియె యుండునుగాని యేకవచనంబగు రువర్ణంబుండ నేరదు. ఏకవచనబహువచనంబులకు నొక్కవచనాంతంబున సమావేశంబు విరుద్ధము కావున "కూఁతురులు" ఇత్యాదిప్రయోగంబు లసాధువులు.

10 సూ—చెయువు బహువచనలకారంబున కలఘురేఫంబు విభాషనగు.

చెయువులు - చెయువులు - చెయువులను - చెయువుల‌ను.

వ్యా—చెయువు, అనుశబ్దంబుయొక్క బహువచనలకారంబునకు శకటరేఫంబువిభాషగానగును. ఉ॥ చెయువులు—చెయువులు. చెయువులను—చెయువులను. ఈ శబ్దంబుయొక్క యకారంబుమీఁది యుకారంబునకు లోపంబును గాన్పించెడిని. ఉ॥ ఇంపు పల్లొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటిగాంచి యెలర్చు చెయ్యులం జిత్తజుకేళిఁదేలె విలసిల్లుచు జక్కవదోయివేడుకన్ భార—ఉద్యో— 2ఆ. శా॥ చేరం జోటాకటెందుఁ గానక భ్రమంజెయ్వేది భృంగావలిం! గారామారఁగ నుద్ధరించె, ఎఱ్ఱాప్రెగడ హరివంశము. సీ॥ మాఱువక పూనెమై మరువువరూధిని చెయ్యులన్నియు, దక్కఁ జిత్రరేఖ వసు—౬ ఆ. ఉ॥ సింగంబులున్ని బాలికల్ దిరుగుచుం జెయ్వేది మోదించు సా। రంగంబుద్దిరుగండపోవ నసకృల్లాజీవముల్ గోయుటల్ ఉత్తరరామాయణము.

11 సూ.—అల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును ముందటి లువర్ణంబునకు బిందుపూర్వకడకారంబునగు.

అంమ్రి - అంప్రిను - ఆలు - చెలియలు చెల్లెలు - కోడలు మఱందులు- ఇవి యాల్వాదులు.

వ్యా—ఆలు, మొదలైనశబ్దంబుల బహువచనలకారంబునకు రేఫంబును ముందఱనున్న ప్రకృతిలువర్ణంబునకు డాపలనున్నగల డకారంబును వచ్చును. ఉ. ఆలు-ఆండ్రు. ఇచ్చట ఆలు + లు, ప్రత్యయలకారంబునకు రేఫంబురాఁగా ఆలు + రు, ప్రకృతిలువర్ణంబునకు డాపలనున్నగలడకారంబు రాఁగా ఆండ్రు, (ఆండ్ + రు) అయ్యెను. ద్వితీయాబహువచనము- ఆండ్రను. ఇట్లే చెలియలు-చెల్లెలు, కోడలు- మఱఁదలు. మొదలైనవి. గ్రహింపవలెను.

12 సూ—బహువచనముపరంబగునపుడు డలటరలయుత్వంబునకులోపంబు బహుళంబుగానగు.

గుండ్లు - గుండులు-గిండ్లు - గిండులు - కాళ్లు - కాలులు మొసళ్లు - మొసలులు - గోండ్లు - గోంటులు - తుంట్లు - తుంటులు గోళ్లు - గోరులు - సీవిర్లు - సీవిరులు - బహుళగ్రహణముచే విల్లులు పిల్లులు పులు లిత్యాదులందు లోపంబులేదు ॥ తత్సమంబులంగోటి పిప్ప లిశబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు ॥ కోట్లు - కోటులు-పిప్పళ్లు -పిప్పలులు,

వ్యా—బహువచనలకారము వచ్చునప్పుడు 'డ - ల - ట - ర' ఈయక్షరంబుల ఉకారంబునకులోపంబు బహుళంబుగాఁ గలుగును. ఉ. గుండులు-గుండ్లు. ఇచ్చట 'గుండు' అనునపుడు బహువచనలకారంబురాఁగా డకారముయొక్క ఉకారంబు లోపించి 'గుండ్లు' (గుండ్ + లు) అయినది. బహుళమని చెప్పుటచేత 'గుండులు' అని సంయోగరహితంబుగనుగలదు. ఇట్లే 'గిండ్లు' మొదలైనవి. 'కాలు' శబ్దంబునకు 'కాలులు - కాళ్ళు' అని రూపద్వయంబు. ఇచ్చట 'కాలు + లు' అనియుండగాఁ బ్రకృతసూత్రంబునఁ బ్రకృతిలువర్ణముయొక్క ఉకారంబునకు లోపంబురాఁగాఁ దుత్

సోల్లవసూత్రంబుచేతను బహువచనసంశ్లిష్టమయిన ప్రకృతిలకారంబునకు వలఘులకారంబు గలిగి 'కాళ్లు, అయ్యెను. పదమూఁడవసూత్రంబున 'కాలులు' అనియునుండవచ్చును. ప్రకృతసూత్రంబున నుకారలోపంబు బహుళంబుగావునఁ బక్షంబున 'కాలులు' అని సంయోగరహితంబుగ నుండును. గొంటులు - గొంట్లు. తుంటులు - తుంట్లు. ఈశబ్దంబులు 'గుండు, శబ్దంబునకుంబలె గ్రహింపవలె. గోరులు - గోర్లు. సీవిరులు — సీవిర్లు. ఈశబ్దంబులుఁ ప్రకృతసూత్రంబున నుత్వలోపంబుచేతనే గ్రహింపవలెను. పైనుదాహరింపఁబడిన 'గుండులు — కాలులు - తుంటులు -సీవిరులు' శబ్దంబులు క్రమముగా 'డ - ల - ట - ర' లకుదాహరణంబులు మఱియు శ్లో॥ దాసః క్రమస్సమచ్ఛత్రో వ్యమృదుత్వం ఛేదనం ఘటాః ఉపాయముగుపాయశ్చ 'వ' పూర్వాః పతితా ఇమె ॥ శకటరేఫనిర్ణయము. ఈశ్లోకమునందలి ఛత్రశబ్దంబునకు గ్రంథకర్తగారు 'సీవిరులు' అని తెలుఁగువ్రాసి, 'చిఱుగొడుగులు' అని యర్థము వ్రాసిరి. కాని వింజామరలను నర్థము సరియైనది. సీ॥ వింజామరములవింజామలనంగవీచోపులనఁ సీవిరులనంగఁ । జామరాహ్వయములు' వేంకటేశ్వరాంధ్రము -మానవవర్గము. క॥సీవిరులనవీచోపులు । నావింజామరములకును నామములయ్యెన్' దేశ్యనామార్థకోశము. శకటరేఫనిర్ణయంబును, శుద్ధాంధ్రపదపారిజాతంబును, బట్టిచూడఁగా 'సీవిరులు' అను బహువచనరూపంబును నున్నయట్టులు గానిపించుచున్నది. కాని 'వీచోపులనఁగ సీవిరులనంగ' అను వేంకటేశ్వరాంధ్రనిఘంటుపద్యమునందలి యతిస్థానంబుచూచినను, దత్సమపరిచ్ఛేదమునందలి నలుపదిరెండవసూత్రంబుచే యోజించినను 'సీవిరులు, అనియేకాని 'సీవురులు' అని యుత్వవకారంబుగాదు. సీతారామాచార్యులవారు 'సీవిరుల్ కవలిడన్' భార- శాంతి. 1ఆ. అనుప్రయోగంబుదాహరించి '(ఇది వ్రాఁతప్రతులయందలి పాఠము)' అని వ్రాయుట ఇత్వవకారపాఠమునెడియూహచేతనేయని గ్రహింపవలెను. సీవిరులనఁగా వింజామరములనుటకు భారతప్రయోగంబులు. శా॥ సారథ్యంబు వహింప భీముఁడు సితచ్ఛత్రంబు గాండీవి చే । ల్వారంబట్టఁగ సీవిరుల్గవలిడన్' భార- శాంతి- 1 ఆ. క॥ రచియించిన వజ్రంబుల । రుచులంబోలుపారు సీవిరులు దెరయంగన్, భార క॥ ద్విరదంబుల నరదంబులఁ। దురగంబులఁ గాల్బలములఁ దూర్యంబులసీ । విరులన్గొడుగులఁ బడగలఁ । బరిస్ఫురితమయ్యెనతని పయనంబునకున్, భార. హైమాలయమందు

బహుళమని చెప్పుటచేత (విల్లులు, పిల్లులు, పులులు, ఇత్యాదులందు నుత్వలోపంబు లేదు. తత్సమపదంబులలో (కోటి-పిప్పలి, శబ్దంబులకు నుకారలోపంబును, గనంబడుచున్నది. ఉ. కోట్లు — కోటులు. పిప్పళ్లు —పిప్పలులు. మొదలైనవి. అప్పకవి ఛే॥ గీ॥ యుష్మపంచకమునఁ బ్రతిక్రియొజ్ఝహాళిగాళ్ళటంచు రచించుటఁ గాంచికవులు అనియుష్మపంచకంబులోఁ దిక్కనసోమయాజులు కాళ్ళని ప్రయోగించినాఁడనియు, దానంజేసి మీఁగాళ్ళని కవులు తఱుచుగఁ బ్రయోగించుచున్నారనియు, వక్కాణించుచు, సారంగధరచరిత్రయందలి (సీ॥ ఉష్మిత్తపువ్వనానోక పైనిగుచ్చిస్తనెలఁగ మీఁగాళ్ళ మెఁ జిందులాడ' అను ప్రయోగంబును జూపెను అప్పకవిగారి మతంబున (వారి మన్యకార్తె గుళ్ళనఁగరాదు, అనుపపన్నంబుచే (కాళ్లు, అని ప్రయోగింపఁగూడదనియే సిద్ధాంతపఱిచిరి; కాని కాళ్ళనుటకుఁ గవిశేఖరుల ప్రయోగంబులు భారతమునందుఁ పెక్కులుగలవు. క॥ ఉడుగకరక్త ప్రవాహ మొలుకుచునుండం । గడకాళ్లువట్టివానిని' భార- ఆది. క॥ వనికోలయుతీఁగ కాళ్ళం । చెనఁగెఁగదాయఁ దుఁ బొంగిభీష్ముఁడు ప్రాణుఁడా, భార - ఆది - ౮ ఆ. సీ॥ కాళ్ళ యొప్పిదమూడుకట్ల నజ్వలముసేయంగ నందుల బాహులందమొదల, భార - విరా - 1 ఆ. ఇంకను బ్రయోగంబులు పెక్కులుగలవు.

13 సూ—బహువచనము పరంబగునపుడ సంయుక్తంబులయి యుదంతంబులయిన డలరలకోలఘు లకారంబు బహుళంబుగా నగు.

(త్రాడు - త్రాడులు - గుమ్మళ్లు - గుమ్మడులు - మొగిళులు మొగిలులు - పిడికిళులు - పిడికిలులు - ఊళులు - ఊరులు-పందిళులు పందిరులు.

వ్యా—బహువచనంబు పరంబగునపుడు సంయుక్తంబులు కానివై ఉదంతంబులైన (డ - ల - ర, లకు నలఘు లకారంబు బహుళంబుగానగును. ఉ. త్రాడు - త్రాడులు - త్రాళ్ళు. (త్రాడు, ఇచ్చట బహువచనలకారము వచ్చి (త్రాడు + లు) అని కాఁగాఁ బ్రకృతసూత్రంబున డకారంబునకు నలఘు లకారంబు (ళ) వచ్చి (త్రా

ళులు' అనురూపాంతరంబయ్యెను. 'గుమ్మడి + లు, ఇట్లుండఁదత్సమపరిచ్ఛేదమునందలి నలువదియైదవసూత్రంబుచే ఇకారంబునకు ఉకారంబువచ్చి ఉదంతంబైనదిగనుక ప్రకృతసూత్రంబున 'గుమ్మళులు - గుమ్మడులు, అనురూపంబులయ్యెను. ఇట్లే పిడి కిలిపందిరిఇత్యాదులయందు ఇకారాంతస్థలంబులయందుఁ దత్సమపరిచ్ఛేదమందలి నలువదియైదవసూత్రంబుచే నుత్వంబుగలిగినపిమ్మటనీప్రకృతసూత్రంబు ప్రవర్తిల్లుననియే యెఱుంగునది. 'త్రాడు - మొగిలు - ఊరు, ఇవి సహజంబుగానే, ఉకారాంతంబులు. ఈసూత్రంబుచే బహువచనమందు నలఘు లకారంబుమాత్రంబు కలుగును.

14 సూ— బహువచనశ్లిష్టంబులయి యద్విరుక్తంబులయినడకారలకారంబుల కలఘు లకారంబు నిత్యంబగును.

తాళ్లు - గుమ్మళ్లు - మొగిళ్లు - మొసళ్లు - విళ్లు-సిళ్లు.

వ్యా—బహువచనలకారముతో సంయుక్తములై ద్విత్వములేని డకారంబునకును, లకారంబునకును, నలఘులకారంబు నిత్యంబుగానగును. ఉ. త్రాళ్లు. 'త్రాడు + లు' ఇచ్చటఁ బంద్రెండవసూత్రంబుచే డకారంబుమీఁది యకారంబునకు లోపంబుగలిగి ప్రకృతిడకారంబునకును, ప్రత్యయలకారంబునకును, సంయోగంబుగలిగి 'త్రాడ్లు' అయ్యెను. పిమ్మటఁబ్రకృతసూత్రంబుచే డకారంబునకు నలఘులకారంబు గల్గి 'త్రాళ్లు, అనురూపంబు నిష్పన్నంబయ్యె. పంద్రెండవసూత్రంబుచే నుత్వలోపంబు బాహుళకంబుగావునఁ బదునూఁడవసూత్రంబున 'త్రాళులు - తాడులు, అని యుత్వలోపాభావమందు రూపద్వయమేర్పడును; గుమ్మళ్లు - మొగిళ్లు - మొసళ్లు - విళ్లు - సిళ్లు, వీనికి నేకవచనంబులు గ్రమంబుగా 'గుమ్మడి - మొగిలు - మొసలి - విడి - సిడి, అనియుండును. వీనిలో నికారాంతనామంబులకు బహువచనలకారంబు పరంబగునప్పుడు తత్సమపరిచ్ఛేదమునందలి నలువదియైదవసూత్రంబున వీని ఇకారంబునకు ఉకారంబుగలిగి యీపరిచ్ఛేదములోని పంద్రెండవసూత్రంబున లోపంబుగలుఁగఁగాఁ బ్రకృతసూత్రంబున నలఘులకారంబు నిత్యంబుగనయి పైబహువచనరూపంబులు సిద్ధించెనని యెఱుంగునది.

నంబు. వ్రేఁడు బహువచనంబు. వ్రేలు (గొల్లలు) స్త్రీప్రత్యయరూపము వ్రేత (గోపికాస్త్రీ)

16 సూ.—ఔపవిభక్తికంబులు లివర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగానగు.

కొడవలి - కొడవండులు ఉల్లోపంబు - కొడవండ్లు - పక్షంబున దలఘులకారంబు - కొడవళులు - కొడవళ్లు - కొడవలులు॥ రోఁకలిప్రభృతులకిట్లు రూపంబు లెఱుంగునది॥ ఇల్లు - ఇండులు - ఇండ్లు - ఇల్లులు ॥ ఇట్లు - కల్లు - పల్లు ముల్లు - విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది ॥ మద్యనిమ్నార్థకంబులయిన కల్లు పల్లుశబ్దంబులును త్రెల్లు ప్రభృతి శబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటంజేసి వాని కీకార్యంబు లేదు.

వ్యా—ఔపవిభక్తికంబులనఁగా విభక్తిసంబంధంబున మార్పునొందు శబ్దంబులు. అట్టిశబ్దంబుల లివర్ణంబునకును, లకారముతోఁ గూడిన లువర్ణంబునకును, (సలలువర్ణంబునకు = లకారముతోఁ గూడిన లువర్ణమునకు - ఉ. ఇల్లు - విల్లు మొ) బహువచనంబు పరంబగునపుడు నిండుసున్న పూర్వమందుఁ గలిగిన 'డు' అనునక్షరము బహుళంబుగావచ్చును. 'కొడవలి' ఇచ్చట బహువచనమందు లువర్ణకంబురాఁగా నాలివర్ణంబునకు నిండుసున్న పూర్వమందుఁగల డువర్ణంబువచ్చి 'కొడవండులు' అనియును, డువర్ణంబుయొక్క ఉకారంబునకుఁ బండ్రెండవసూత్రంబుచే లోపంబుగలిగి 'కొడవండ్లు' అనియును, డకారయుక్తమైనరూపంబులు రెండేర్పడును. డువర్ణంబుపాక్షికంబుగావున 'కొడవలి' శబ్దంబునకు బహువచనలకారంబు పరంబగుచుండఁ దత్సమపరిచ్ఛేదంబునందలి నలువదియైదవసూత్రంబుచే నుత్వంబుగలిగి యీపరిచ్ఛేదంబులోని పదుమూఁడవసూత్రంబున నలఘు లకారంబురాఁగా 'కొడవళులు' అనియును, పదునాల్గవసూత్రంబుచే 'కొడవళ్లు' అని బహువచనశిష్టంబుగాను, లకారయుక్తమైన రూపద్వ

యంబేర్పడినది. అలఘులకారంబునకు బాహుళకంబగుటచే ‘కొడవలులు’ అని లఘు లకారయుక్తరూపంబొందును. ఇట్టిశబ్దంబులకు బహువచనలకారంబునందు రూపపంచకంబగును. ‘రోఁకలి’ మొదలైన శబ్దంబుల నిత్యంబునవే రూపంబులని తెలిసికొనవలెను. ఇయ్యది తివర్ణమంతమందుఁగల యౌపవిభక్తికాంతపదంబుల కుదాహరణము. ఇఁక ద్విత్వలువర్ణంబునకు — ‘ఇల్లు’ దీనికి బహువచనంబున లుసర్గకంబువచ్చి ‘ఇల్లులు’ అనియును, పూర్ణబిందు పూర్వకడువర్ణము వచ్చినపుడు ‘ఇండులు’ అనియును, పంచ్ఛిండవసూత్రంబుచే డువర్ణంబుయొక్క ఉకారంబునకు లోపంబుగలుగఁగా ‘ఇండ్లు’ అనియును, రూపంబులు. ఇట్లే ‘కల్లు - ముల్లు — పల్లు — విల్లు’ మొదలైనశబ్దంబుల రూపంబులు గ్రహింపవలెను. మఱియు ‘కల్లు’ శబ్దంబునకు మద్యమర్థమైనపుడును, ‘పల్లు’ శబ్దంబునకుబల్లమర్థమైనపుడును, ఒల్లు మొదలైనశబ్దంబులకు, ఔపవిభక్తికంబులకీసూత్రవిధిజేసి వానికాకపోవుటం జెల్లదు, కల్లుశబ్దంబునకు నేత్రమువియొడియర్థ మరుదుగాఁ గానఁబడియెడి. సీ॥ ఏవేల్పు వేలుపఁగని నచంద్రులనుబండిఁ గల్లుగాఁ గండ్లుగాఁ ఘనతజేసెభల్లా — 1 ఆ. ఔపవిభక్తులనుగుఱించి యౌపవిభక్తిక ప్రకరణంబులో వివరింపబడును.

17 సూ—ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బయిబహువచనంబు నెనయు.

కొడవండ్లులు - కొండవండ్లులను -కొడవళ్లులు - కొడవళ్లులను ఇట్టిప్రయోగదృష్టంబులు గ్రహించునది.

వ్యా—ఒకానొకచోటఁ బ్రాతిపదికము (నామము) బహువచనలకారంబుతోఁ గూడికొని పునరుక్తంబుగ బహువచనంబు నొందును. ఉ. కొడవండ్లులు మొదలైనవి. ‘కొడవళ్లు’ ఇచ్చట బహువచనలకారాంతంబౌ ప్రాతిపదికమై వేఱొకబహువచనలకారంబును బొంది ‘కొడవళ్లులు’ అయినది. ఇట్టిరూపంబు కవిప్రయోగంబులనుసరించి యుపయోగింపవలయును. ‘క॥ సుందరి నాకొడండ్రుమన, యుంపభ్యక్తిశవునీన, భార-సభా — 2 ఆ. తే॥ గీ॥ అచ్చెరువుగాదె యొక్కరి ... రింకఁ । బరిభవంబునుబొందక

ప్రబుకువారు, భార - విరా - 3ఆ. చ॥ వినిమదినాదునల్లభకు నీం(డురు(గమణి నింతచేసితే, భార-విరా - 3 ఆ. తే॥ గీ॥ ఒక్కసతికిఁబతులు పెక్కం(డురగుటిది సతులకోర్కి గానవతివక్ష్మణ్ణ, భార - అది - 4 ఆ. సీ॥ వెలయాం(డురనుగొండియల బరిచారికా(శ్రేణుల నొండొంటచెఱులునట్టి, హరి - ఉ. 6ఆ. క॥ వేడుకకాండు9కుర నిచ్చు వివిధార్థంబుల్, వి(క - 2 ఆ. క॥ పెక్కండు9రతోడ్పనెనఁ బెనఁగఁగఁ జెల్లున్ విజ్ఞా - వ్య - తే॥ గీ॥ చూపఱులచూడ్కి కొకవింతసొబగొనర్చె, కళా - 7 ఆ ఇంకను బహువచనాంతంబుపై బహువచనంబు గలశబ్దంబులు ప్రయోగంబులం బెక్కులుగలవు.

18 సూ—కలన్వాదుల నువర్ణంబు కుజగు బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు.

కలఁకు-కలను-కలఁకులు ॥ కలను- కెలను-కొఱను - కొలను - గవను - నెఱను - మా9ను - వరను - వలను - ఇవికలన్వాదులు.

వ్యా—కలను మొదలైనశబ్దంబులయొక్క నువర్ణంబునకు కుజ్, అనునదివచ్చును. కుజ్' జకారేత్కమగుటచేత జిత్తు బిందుపూర్వకంబగు, ననుసూత్రంబుచే బిందుపూర్వకకువర్ణంబని గ్రహింపవలెను. బహువచనంబునందు కుజ్, అనునది నిత్యంబుగానగును. అనఁగా నేకవచనంబున వైకల్పికము. ఉ. కొలను — కొలఁకు. బహువచనంబున నిత్యంబగుటంజేసి కొలఁకులు, పక్షంబున హ్రస్వంబుపైన నఱసున్న నెఱసున్నయై 'కొలంకులు, అనియుంగలవు. కలను - కెలను - కొఱను - గవను - నెఱను మ్రాను — వరను, మొదలైనవానికి నేకవచనంబునఁ బైదానిఁబలె రూపద్వయంబును, బహువచనంబున రూపంబొకండును, గ్రహింపవలెను. మ॥ గాం తురునమ్రుత్వముగానలో మ్రాకుల్గా వితర్కింపఁగాన్, వసు- 1ఆ. పైరెఖానిర్దిష్టంబైన శబ్దంబునకు తురుష్కులును, జీర్ణవృక్షంబులును, ప్రకృతంబున నర్థద్వయంబు చెప్పికొనవలెను. వృక్షపరమైనపుడు మాకుల్, అనియుండవలెను. అయినను శ్లేషాలంకారతత్పరత్వంబునఁ బ్రౌఢముగాఁ జెప్పబడినదని వ్యాఖ్యానంబున వ్రాయంబడియెను. ఇట్టివి పెక్కులుగలవు గాని కొన్నింటినిమాత్రము యుదాహరించెదను. మ॥ జగ

వ్యా—బహువచనలకారంబు పరంబగునపుడు ‘చేను, పేను, మీను’ అనుశబ్దంబుల కడపటియక్షరంబైననువర్ణంబులోపించును. ఉ. చేలు. ‘చేను, ఇచ్చట లువర్ణకంబుగాఁగా ‘చేను + లు, అయ్యెను. పిమ్మటఁ బ్రకృతసూత్రంబున నువర్ణంబులోపింప, గా ‘చేలు, అయినది. ఇట్లే పేను మొదలైనశబ్దంబులు గ్రహింపవలెను. ‘మీనుఁ అనుశబ్దంబునకు బహువచనంబు ‘మీనులు, అనుప్రయోగంబొండుగలదు. చ॥ ‘జలజములకా మృణాళములఁ జక్రయుగంబుల గండుమీనులకా, కవికర్ణరసాయనము. ఇచ్చోట ‘గండుమీలకా, అని పఠించినచో నిర్దుష్టంబు.

**21 సూ—బహువచనంబుపరంబగునపుడు రేయిప్రభృతులతుదియక్షరంబులోపించు.**

రేయి - రేలు॥ తోయి - తోలు॥ వేయి - వేలు॥ వ్రాయి - వ్రాలు ॥ ఇత్యాదులు ॥ ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడు. రేరాజు - మగతోపతకము - వేవెలుఁగు.

వ్యా—బహువచనలువర్ణకంబు పరంబగునపుడు ‘రేయి, మొదలైనశబ్దంబుల కడపటియక్షరంబులోపించును. ఉ. రేలు. రేయి, ఇచ్చట లువర్ణకంబు పరంబగునపుడు కడపటియక్షరంబైన యివర్ణములోపింపఁగాఁ బైబహువచనరూపంబేర్పడెను. ఇట్లే ‘తోయి = వేయి = వ్రాయి, శబ్దంబులకుఁ గ్రహింపఁగ ‘తోలు—వేలు—వ్రాలు, అనురూపంబులు గ్రహింపవలెను. [illegible] పలుగు తోలివిగానఁబడియెనింక | నంపలంబులుమాని యగుదేరనివికంబై యందలంబులుచేర నయ్యెనిపుడు’ రామాభ్యు—5 ఆ. క॥ ‘నీలంపుమేనిసూత్రపు | తాలకనుంగవయుఁ బువ్వరాగపుటెన్నకా, చంద్రభానుచరిత్రము. కొందఱు ‘తాయి’ శబ్దంబునకు బహువచనరూపము ‘రాళ్ళు’ అని వ్యాకరణంబులయందును, గ్రంథంబులయందునుఁ బ్రయోగించుచుండిరి. అయ్యది ప్రామాదికము. ఈపైయంత్యాక్షరలోపము సమాసంబులయందుఁగూడఁ గనఁబడుచున్నది. రేరాజు (రేయి + రాజు) వేవెలుఁగు (వేయి + వెలుఁగు) మగతోపతకము (మగతోయి + పతకము).

22 సూ.—బహువచనంబు పరంబగునపు డావు ప్రభృతుల తుదియక్షరంబునకు లోపంబు విభాషనగు.

ఆవు - ఆలు - ఆవులు ॥ జాము - జాలు-జాములు ॥ చుట్టము చుట్టలు - - చుట్టములు ॥ మీసము - మీసలు-మీసములు

వ్యా—బహువచనలకారంబు పరంబగునపుడు 'ఆవు' మొదలైనశబ్దంబుల కడ యక్షరంబునకు లోపంబు వైకల్పికంబుగానగును. ఉ. ఆవులు — ఆలు. 'ఆవు + లు'. ఇచ్చటఁ గడనున్న 'వు' వర్ణంబులోపించి 'ఆలు' అయ్యెను. ఇట్లే 'జాము - చుట్టము మీసము' మొదలైనవానికి బహువచనంబులు రెండురూపంబులు గ్రహింపవలెను. 'ఆవు' శబ్దంబునకు బహువచనమందేకాక వృత్తియందును అంత్యాక్షరలోపంబగును. ఉ. 'ఆదూఁక-ఆఁగదుపు-ఆఁబెయ్య-ఆఁబోతు' ఇచ్చట నర్ధానుస్వారంబును, ఉత్తరపదపరుషంబునకు సరళంబును విశేషంబు. 'ఆమూఁడ' ఇచ్చట లోపంబుమాత్రమే కలుగును. సీ॥ తే॥ గీ॥ 'ఆలగాపరి వేత్రితల మేలువాఁడు' ఆంధ్రనామ-దేవ. ఉ॥ 'అశ్రువుల్ జాలుగ నాల్గుజాలునిఁక జాలు భవంబునఁ తకాఁకకుం | బాలయిరాత్రిపంచశరబారికిఁ జిక్కితినంచుఁ దక్కితిన్' మను - 3ఆ. మ॥ 'చెలుగుం జుట్టలు నిష్టభృత్యులు మహాజింగ్రాణముల్ డాపకు | జ్వలులై' భార - ఉద్యో - 2ఆ. క॥ 'చెలులుం జుట్టలు దేశం | బులరాజులు వినఁగ నీదుపుణ్యచరిత్రం | బులు' భార - ఉద్యో - 3ఆ. తే॥ నిడుదబాహాయుగంబును వెడదయురము | గొనబుమీసలు దీర్ఘనేత్రములు మెఱయ, రాజశే- 2ఆ. తక్కుఁగలరూపంబులు సులభము.

23 సూ.—ఇయయుమములుగా నామాంతంబున కేత్వంబు బహుళముగానగు.

కన్నియ - కన్నె॥ జన్నియ-జన్నె॥ వన్నియ - వన్నె॥ కొంచియము - కొంచెము॥ కొండియము ॥ కొండెము ॥ బహుళగ్రహణముచే సందియము కాఱియము మొదలగుశబ్దంబులకు ఏత్వము లేదు। ఇయ

శబ్దంబునందికారలోపంబు కొందఱు వక్కాణించిరి - అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు॥ ముత్తియశబ్దంబునందు మాత్రమిత్వలోపంబు గానంబడియెడి - ముత్తియము - ముత్తెము - ముత్యము.

వ్యా—'ఇయ' అనుదానికిమాఱుగా నామముయొక్క కడపట, ఎకారము బహుళముగాఁగలుగును. ఉ. కన్నియ-కన్నె - జన్నియ - జన్నె - వన్నియ-వన్నె- కొంచియము - కొంచెము. కొండియము. - కొండెము. ము. 'కన్నియ' ఇచ్చట 'ఇయ' అనుశబ్దంబునకంతకు ఎకారంబువచ్చి 'కన్నె' (కన్న్ + ఎ) అయ్యెను. ఇట్లే జన్నె [దేవతాదులనుద్దేశించి యథేచ్ఛముగా పెట్టిన కూడు (కేలు) యొద్దు] ము. (మూ. వ్యా.) బహుళంబను పంజేసి 'సందియము-కావియ' మొదలగుశబ్దంబులయందు 'ఇయ' అనుదానికి ఎత్వములేదు. 'ఇయ, శబ్దంబునందలి ఇకారలోపంబు కలదని కొందఱు చెప్పిరి; కాని యయ్యది ప్రయోగంబులయందుఁ గనఁబడదు. ముత్తియ శబ్దంబునకు మాత్రము ఇత్వలోపంబు గనఁబడుచున్నది. ఉ. ముత్యము - ముత్తియము ముత్తెము. 'ముత్తియము' ఇచ్చట ఇకారలబునకు లోపంబుగలిగి 'ముత్యము. (ముత్ + యము) అయ్యెను. కొందఱుమతంబున 'మల్లియ' మొదలైనశబ్దంబు లకు ఎత్వంబుగలుగును. క॥ మల్లెయు, లంజెయు, గద్దెయు । నొల్లెయు, ననుపగిదిఁ బలుకులొప్పుఁగ గృతులన్ ! మల్లియ, లంజియ, గద్దియ, యొల్లియ, యనిపల్కఁ జేని యొప్పుం గృతులన్, ఆంధ్రభాషాభూషణము. పైచెప్పినవానిలో ఇత్వలోపంబుగలుగదు. పైపద్యంబుయొక్క క॥ మల్లెయు, లంజెయు, గద్దెయు। నొల్లెయు ననుపగిదిఁ బలుకులొప్పవు కృతులన్ అనుపాఠంబునుజూచి తిమ్మకవ్యహోబలపండితులు నిరాకరించుట సమంజసంబు. మాలమూలల మల్లెలెంతటి మోహమోహరిణాక్షి డాచితి। వేలయేలకిఁ బోదలు వెదకెద వింతవింతలె యెందుఁజూచితి' వసుచరిత్ర. క॥ లంజెతనమునఁ బనుఁ గొమరులను గెలువనోకో' హరి - ఉ. 1 ఆ. తే॥ పెద్దకాలంబు ముత్యాలగద్దెయొక్క । వసునఁ బాలించు నేకోష్ణచాగణముగ' కాశీఖండము తే॥ నారికేళాసవపుఁ దీపుటారుశాలయు । వలిపెయుంబెల్లెతో సుస్థపులు 'హంసు' శుక్తమాల్య ప. చ॥ ఒక్కపరిశుద్ధపుసైకపుటొల్లె గట్టి' ప్రభా- 4 ఆ. త్రిలింగలక్షణశేషకారుఁడు ముత్తియశబ్దభేదంబులను వివర

గాక మువ్విధయశబ్దేతరంబులయందుఁ గూడ, ఇకారంబునకు లోపంబుగలదని గ్రహింపవలెను. "నామములయందె కాక క్రియలయందును, ఎత్వంబు చూపఁబడె" నని యహోబలపతి. ఉ. కదియంబడె - కదెఁబడె" ఇత్యాదులు.

## సర్వనామప్రకరణము.

విశేష్యములయొక్క పునరుక్తిదోషంబు కలుగకుండఁగ వానికి బదులుగా బ్రయోగింపఁబడుపదంబులు సర్వనామంబులు. (పూర్వోక్తపదార్థపరామర్శకములు అట్టివానిం గూర్చి తెలుపునట్టిభాగంబునకుసర్వనామప్రకరణము.

24 సూ — అన్నిప్రభృతులు సర్వనామంబులు.

అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు - ఆ - ఈ - ఏ - నీ - నా - మన - తా - సంఖ్యావాచకంబులు - అన్నిప్రభృతులు॥ వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద- వీనిలోఁడుమంతంబులకెల్ల న్వాగమంబు పూర్వోక్తంబు స్మరించునది ॥ బహువచనలకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమాబహువచనంబునకుంబోలె నెఱుంగునది ॥ విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచో ద్వితీయవఱకును గొండొకచోఁ దృతీయయందొక్కరూపంబువఱకును రూపభేదంబులు వక్కాణించెద - శేషంబూహించునది ॥ అన్ని మొదలగుశబ్దంబులాఱు నుద్విప్రభృతిసంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు - అమహదర్థంబులేక వచనాంతంబులగు ॥ ఇందు నీమొదలగునాలుగుశబ్దంబులు సర్వార్థంబులందుల్యరూపంబులయి యుండు.

మ - అనునది మహదర్థమనుటకు - అ- అనునదియమహదర్థమనుటకు - ప్ర - మొదలయినవి ప్రథమావిభక్త్యాదులకును సంకేతములుగా నిందు గ్రహించునది.

మ. అ.

సర్వతావదర్థకము.

ప్ర { అందఱు / అందోఱు } ...అన్ని.

ఇయదర్థకము

ప్ర॥ ఇందఱు......ఇన్ని.

కియద్యావదర్థకము.

ప్ర॥ ఎందఱు......ఎన్ని.

కతిపయార్థకము

ప్ర॥ కొందఱు......కొన్ని,

బహ్వర్థకము. పెక్కు

ప్ర { పెక్కండ్రు / పెక్కురు } దీనికిబహువచనముంగ లదు॥ పెక్కులు

ఈశబ్దంబు లోపవిభక్తికంబులగుటంజేసి - అన్నిటి - అన్నింటి - ఇన్నిటి - ఇన్నింటి - ఎన్నిటి - ఎన్నింటి - కొన్నిటి - కొన్నింటి - పెక్కిటి - పెక్కింటి - యనురూపంబులు ద్వితీయాద్యేకవచనంబులు పరంబగునపు డమహత్త్వంబునందగునని తెలియునది

బహ్వర్థకము.

ప్ర॥ { పలుగురు / పలుగుండ్రు } అమహత్త్వంబున దీనికిప్రయోగంబు లేదు.

మ.

తదర్థకము.

ప్ర॥ వాడు..... { వారు / వారలు / వాండ్రు }

ద్వి॥ వానిని..... { వారిని / వారలను / వాండ్రను }

అ.

ప్ర { అది........అవి / అద్ది... ...అవ్వి / ఆయది......ఆయవి / అయ్యది.....అయ్యవి }

ద్వి { దానిని / ఆదానిని / అద్దానిని } ......వానిని..

మ.

ఇదమర్థకము.

ప్ర॥ వీఁడు { వీరు / వీరలు / వీండ్రు }

ద్వి॥ వీనిని { వీరు / వీరలను / వీండ్రను }

అ.

ప్ర { ఇది............ఇవి / ఇద్ది............ఇవ్వి / ఈయది....... ఈయవి / ఇయ్యది........ఇయ్యవి }

ద్వి { దీనిని... / ఈదానిని / ఇద్దానిని } వీనిని

మ.

యత్కిమర్థకము

ప్ర

ఏఁడు............ఏరు

ఏవాఁడు { ఏవారు / ఏవారలు / ఏవాండ్రు }

ఎవ్వాఁడు { ఎవ్వారు / ఎవ్వారలు / ఎవ్వాండ్రు }

ఎవ్వఁడు { ఎవ్వరు / ఎవ్వండ్రు }

ఎవఁడు { ఎవరు / ఎవండ్రు }

ద్వి

ఏనిని........ఏరిని

ఏవానిని { ఏవారిని / ఏవారలను / ఏవాండ్రను }

ఎవ్వానిని { ఎవ్వారిని / ఎవ్వారలను / ఎవ్వాండ్రను }

ఎవ్వనిని { ఎవ్వరిని / ఎవ్వండ్రను }

ఎవనిని { ఎవరిని / ఎవండ్రను }

ఎది... ... ...ఎవి

ఏది... ... ...ఏవి

ప్రై. ఎద్ది... ... ...ఎవ్వి

ఏయది ... ...ఏయవి

ఎయ్యది ... ...ఎయ్యది

ద్వి { దేనిని.........వేనిని
ఏదానిని......ఏవానిని
ఎద్దానిని......ఎవ్వానిని

మహతీవాచ్యంబగు నేనేకత్వంబున యత్తికార్థకశబ్దంబు - ఎవ్వరిత - ఎవర్త - ఎవ్వత - ఎవరిత - ఎవర్త - ఎవత - ఎవ్వరితి - ఎవ్వర్తి - ఎవ్వతి - ఎవరితి - ఎవర్తి - ఎవతి - ఎవ్వరిత్తె - ఎవ్వర్తె - ఎవ్వత్తె - ఎవరిత్తె - ఎవర్తె - ఎవత్తె - ఎవ్వర్తుక - ఎవ్వతుక - ఎవర్తుక - ఎవతుక - అని యిరువది రెండురూపంబులు వడయు

తదాదులు మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజవివక్షించునపుడు - అతఁడు - ఆతఁడు - ఇతఁడు - ఈతఁడు - ఎతఁడు - ఏతఁడు అనురూపంబులువడయు ॥ మహతీవాచకంబులు. ఆమె - ఆపె - ఆకె - ఈమె - ఈపె - ఈకె - ఏమె - ఏపె - ఏకె - అను రూపంబులు వడయు.

యుష్మదర్థకము.

ప్ర { నీవు, ఈవు } { మీరు, మీరలు, ఈరు, ఈరలు }

ద్వి॥ నిన్నును... ...మిమ్మును

తృ॥ నీచేతను ... మీచేతను

అస్మదర్థకము,

ప్రై { నేను, ఏను } ... { మేము, నేము, ఏము }

ద్వి॥ నన్నును... ...మమ్మును

తృ॥ నాచేతను......మాచేతను

ఉభయార్థకము.

నిత్యబహువచనాంతము.

ప్ర॥ మనము. ద్వి॥ మనలను.
తృ॥ మనచేతను – మనలచేతను

ఆత్మార్థకము.

ప్ర॥ తాను... | తాము / తారు / తమరు

ద్వి॥ తన్నును...తమ్మును.

తృ॥ తనచేతను...తమచేతను

ఇంకసంఖ్యావాచకంబులు

వక్కాణించెద.

వ.

ఏకార్థకశబ్దము.

ప్ర.

ఒకఁడు... { ఒకరు / ఒకండ్రు

ఒకాఁడు...... { ఒకారు / ఒకాండ్రు

ఒక్కఁడు...... { ఒక్కరు / ఒక్కండ్రు

ఒక్కాఁడు... { ఒక్కారు / ఒక్కాండ్రు

ఒకరుఁడు...... { ఒకరులు / ఒకళులు / ఒకళ్లు

ఒకారుఁడు... { ఒకారులు / ఒకాళులు / ఒక్కళ్లు

ఒక్కరుఁడు { ఒక్కరులు / ఒక్కళులు / ఒక్కళ్లు

ఒక్కారుఁడు... { ఒక్కారులు / ఒక్కాళులు / ఒక్కాళ్లు

ఒకరువుఁడు.........ఒకరువులు
ఒకారువుఁడు......ఒకారువులు
ఒక్కరవుఁడు......ఒక్కరువులు

ఒక్కొరువుఁడు. ఒక్కొరువులు
ఒరుఁడు ... ... ఒరులు
ఒరువుఁడు ... ... ఒరువులు

ఒండు...... { ఒండులు / ఒండ్లు

ఒడ్డు...... { ఒడ్డులు / ఒడ్లు

ద్వితీయాది విభక్తిరూపంబులూహించుకొనునది.

అ.

ప్రథమైకవచనాంతములు.

ఒకటి - ఒకొటి - ఒక్కటి - ఒక్కొటి - ఒక్కటి - ఒకఁడు - ఒకొఁడు - ఒక్కఁడు - ఒక్కొఁడు - ఒండు - ఈశబ్దంబునకు సంఖ్యావాచకంబునకు బహువచనంబు లేదు.

దీనికి మహతి వాచ్యంబగునపుడేకత్వంబున వక్ష్యమాణ రూపంబులెఱుఁగునది.

మహత్వార్థకము.

ఒకరిత - ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక - ఒకత - ఒకతుక - ఒకొరిత - ఒకొర్త - ఒకొర్తు - ఒకొర్తుక - ఒకొత - ఒకొతుక - ఒక్కరిత - ఒక్కర్త - ఒక్కర్తు - ఒక్కర్తుక - ఒక్కత - ఒక్కతుక - ఒక్కొరిత - ఒక్కొర్త - ఒక్కొర్తు - ఒక్కొర్తుక - ఒక్కత - ఒక్కొతుక - ఒకరితి - ఒకర్తి - ఒకతి - ఒకొరితి - ఒకొర్తి - ఒకొతి - ఒక్కరితి - ఒక్కర్తి - ఒక్కతి - ఒక్కొరితి - ఒక్కొర్తి - ఒక్కొతి - ఒకరితె - ఒకర్తె - ఒకతె - ఒకొరితె - ఒకర్తె - ఒకొతె - ఒక్కరితె - ఒక్కర్తె - ఒక్కతె - ఒక్కొరితె - ఒక్కరితె - ఒక్కొర్తె - ఒక్కొతె - ఓర్త - ఓర్తి - ఓర్తు - ఒర్తుక.

ఇంక ద్విప్రభృతి సంఖ్యావాచకంబులు ప్రథమాంత రూపంబులు వక్కాణించెద.

| | | | |
|---|---|---|---|
| డెబ్బండ్రు ... | డెబ్బది | నూఱుగురు... | నూఱు |
| ఎనుబండ్రు... | ఎనుబది | వేగురు... ... | వేయి |
| తొంబండ్రు... | తొంబది | పదివేగురు ... | పదివేలు |

రెండు మొదలగునవి యాఁపవిభక్తికశబ్దంబు లగుటంజేసి ద్వితీయావిభక్తులు పరంబులగునపుడు టింటులగునని యెఱుంగునది ॥ రెండిటిని - రెండింటిని - రెంటిని ॥ మూఁడిటిని - మూఁడింటిని - మూఁటిని ఇత్యాదులు॥ ఏకశబ్దమునకు - ఒంటి - ఒకానొకఁడు - ఒకానొకటి - ఒకానొకరిత - ఒరిమ - ఒండొకరు - ఓరట్ట - అనురూపంబులును - ద్విశబ్దార్థంబునకు -ఇనుమడి - ఈరాఱు - అనురూపంబులు సర్వవిశేషంబులం జూపట్టెడు.

"వ్యా—అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు - పలు - ఆ - ఈ - ఏ - నీ - నా - మన - తా - సంఖ్యావాచకంబులు - అన్నిప్రభృతులు. వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద. వీనిలో డుమంతములకెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు స్మరించునది. బహువచనలకారంబునకు గాదేశంబును బూర్వాగమంబును, బ్రథమాబహువచనంబునకుంబోలె నెఱుంగునది. విశేషాకారంబులు గలిగెనేనిఁ గొండొకచోఁ ద్వితీయవిభక్తినిఁ గొండొకచోఁ దృతీయయందొక్క రూపంబువలెను, రూపభేదంబులు వక్కాణించెద. శేషం బూహించునది. అన్ని మొదలగుశబ్దంబులాఱును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును, మహదర్థంబులు బహువచనాంతంబులగు. అమహదర్థంబు లేకవచనాంతంబులగు ఇంతు 'నీ' మొదలగు నాలుగుశబ్దంబులు సర్వార్థంబులం దుల్యరూపంబులయి యుండు. ను- అనునది మహదర్థమనుటకు. అ- అనునది. యమహదర్థమనుటకు. ప్ర - మొదలైనవి ప్రథమాది విభక్తులకును, సంకేతములుగా నిందు గ్రహించునది."

వ్యా—'అన్ని - ఇన్ని' మొదలైనవియు, సంఖ్యావాచకంబులును, సర్వనామంబులు. వీనికిఁ బ్రథమాదివిభక్త్యంతరూపంబుల నుదాహరించెదను. వీనిలో డుమం

తృతీయాదులు వీనినిబట్టి యూహించుకొనునది. మఱియు నమహదర్థకమైనపుడు, ఈ, శబ్దంబుయొక్క బహువచనంబు ,వీనిని, అనియుండుట విధియైనను నప్పకవిగారు చతుర్థాశ్వాసమ్మునందుఁ గంధపద్యలక్షణనిరూపణంబున, సీ॥ వీటిలోపల నొక మాఁటి చేపడిలేని హీనపాదము ముందు గానఁబడును,వీని,అనుటకు,వీటి, అని ప్రయోగించిరి. ,వీని, అని దిద్దవచ్చుఁ బ్రాసభంగమగును. ఆకవియే యిట్లు వచియించి యుండినచోఁ బ్రామాదికంబు.

మహదర్థకయత్కిమర్థకమైన ,వే, శబ్దము ,వా, శబ్దముయొక్క రూపంబువలెనే ప్రథమాదివిభక్తుల యేకవచనబహువచనరూపంబులు గ్రహించునది.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | ఏఁడు | ఏరు | ద్వి. | ఏనిని | ఏరిని |
| | ఏవాఁడు | ఏవారు, ఏవారలు, ఏవాండ్రు | | ఏవానిని | ఏవారిని, ఏవారలను, ఏవాండ్రను |
| | ఎవ్వాఁడు | ఎవ్వారు, ఎవ్వార్లు, ఏవ్వాండ్రు | | ఎవ్వానిని | ఎవ్వారిని, ఎవ్వార్లను, ఎవ్వాండ్రను |
| | ఎవ్వఁడు | ఎవ్వరు, ఎవ్వండ్రు, ఎవరు | | ఎవ్వనిని | ఎవ్వరిని, ఎవ్వండ్రను, ఎవరిని |
| | ఎవఁడు | (ఎవండ్రు) | | ఎవనిని | ఎవండ్రను |

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | వేఁడు | వేరు | ద్వి. | వేనిని | వేరిని |

తృతీయాది విభక్త్యేకవచనబహువచనరూపంబులు,ఆ, శబ్దము మొదలు,ఏ, శబ్దంబు వఱకును ద్వితీయావిభక్తుల రూపంబులంబట్టియే గ్రహించునది. తే॥ నిలిచిచూరులరా వించి యిలయందివియు । ముంచుకపివీర సేనలమిందుగాంచి । వీరిలో ముఖ్యులెవ్వారు వేఁడు రామ । [illegible]

ఆ — ఈ — ఏ — శబ్దంబులకుఁ బూజ్యతయందు మహదేకవచనంబునఁదవర్ణాగ గమంబును, దీని దీర్ఘంబునకు వికల్పంబుగా హ్రస్వంబును; మహత్యేకవచనంబున వానికంటెఁ బరంబైన, అక — అప — అవ, అనుశబ్దంబుల తొలియకారమునకు లోపంబును, తుదియకారంబున నేకారాదేశంబునగు. ఉ. అతఁడు — ఆతఁడు. మొ. మహదర్థకములు. ఆమె. (ఆ + అవ + ఎ) ఈపె. (ఈ + అప + ఎ) ఏకె (ఏ + అక + ఎ) మొ. మహత్యర్థకములు. ప్రౌఢ — శబ్ద — ఇక్లైమిగిలిన రూపంబులు గ్రహింపవలెను.

## యుష్మదర్థకము.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | నీవు, ఈవు | మీరు, మీరలు, ఈరు, ఈరలు | ద్వి. | నిన్నును | మిమ్మును |
| | | | తృ. | నీచేతను | మీచేతను |

## అస్మదర్థకము.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | నేను, ఏను | మేము, నేము, ఏము | ద్వి. | నన్నును | మమ్మును |
| | | | తృ. | నాచేతను | మాచేతను |

## ఉభయార్థకము.
### నిత్యబహువచనము.

ప్ర. మనము. ద్వి. మనలను. తృ. మనచేతను — మనలచేతను.

## ఆత్మార్థకము.

| | ఏ. | బ. | | ఏ. | బ. |
|---|---|---|---|---|---|
| ప్ర. | తాను | తాము, తారు, తమరు | ద్వి. | తన్నును | తమ్మును. |
| | | | తృ. | తనచేతను. | తమచేతను |

ఒకఁడు — ఒకోఁడు - ఒక్కఁడు - ఒక్కోఁడు - ఒండు: సీ॥ కనలుబింకపుఁగింక-గలుగువేఁడిమి యొల్లనెక్కటిరాయి యొడలెత్తెనవఁగ, లక్ష్మీ - 2 ఆ. తక్కుంగలవి ములభేమ.

ఒక, శబ్దంబునకు స్త్రీలింగైకవచనరూపంబు లేఁబదిరెండు. ఉ. ఒకరిత - ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక - ఒకత - ఒకతుక - ఒకొరిత - ఒకొర్త - ఒకొర్తు - ఒకొర్తుక - ఒకొత - ఒకొతుక - ఒక్కరిత - ఒక్కర్త - ఒక్కర్తు - ఒక్కర్తుక - ఒక్కత - ఒక్కతుక - ఒక్కొరిత - ఒక్కొర్త - ఒక్కొర్తు - ఒక్కొర్తుక - ఒక్కొత - ఒక్కొతుక - ఒకరితి - ఒకర్తి - ఒకతి - ఒకొరితి - ఒకొర్తి - ఒకొతి - ఒక్కరితి - ఒక్కర్తి - ఒక్కతి - ఒక్కొరితి - ఒక్కొర్తి - ఒక్కొతి - ఒకరితె - ఒకర్తె - ఒకతె - ఒకొరితె - ఒకొర్తె - ఒకొతె - ఒక్కరితె - ఒక్కర్తె - ఒక్కతె - ఒక్కొరితె - ఒక్కొర్తె - ఒక్కొతె - ఓర్త - ఓర్తి ఓర్తు - ఓర్తుక —

సంఖ్యను జెప్పు రెండు మొదలైనశబ్దంబులకు మహదమహదర్థకప్రథమాంత రూపంబులు.

| మ | అ | మ | అ |
|---|---|---|---|
| ఇద్దఱు<br>ఇరువురు | రెండు | పదుమూవురు<br>పదుముగ్గురు<br>పదుముగురు | పదుమూఁడు |
| మూవురు<br>ముగ్గురు<br>ముగురు | మూఁడు | పదునలుగురు<br>పదునయిదుగురు | పదునాలుగు<br>పదునయిదు |
| నలుగురు | నాలుగు | పదునాఱుగురు | పదునాఱు |
| అయిదుగురు | అయిదు | పదునేడుగురు | పదునేడు |
| ఏగురు | ఏను | పదునెనమండ్రు | పదునెనిమిది |
| ఆఱ్వురు | ఆఱు | పందొమ్మండ్రు | పందొమ్మిది |

రంబులో నటపక్రీశయనతానజ్ఞానాభులు నూటుకైదుపదులు (నూటు నేబండ్రు లేక నూఱేబండ్రు, క—6ఆ. సీ॥ మూఁడర్బుదములు (మూఁడర్బుదముల సంఖ్యలవారు మత్స్యధ్వజాటోపవిజయ ఘోరేయులు నిరథులు! జై—5 ఆ. ఉ॥ నేఁడిపెలుంగులోఁ (బదివేల సహస్రములు (పదివేలసహస్రముల సంఖ్యలవారు) న్నభంగినె! న్వాఁడు వెలుఁగ నట్టిబాహ నెన్నలుఁడేన నమృశ్యమూర్తి, రా, భోజ—4ఆ.

రెండు మొదలైనశబ్దంబులతో ద్వితీయవిభక్తి శబ్దంబులగుటచే ద్వితీయయున్నను విభక్తులు పరంబగునపుడు (టి—ంటి, అనునవి వచ్చునని తెలిసికోవలెను. ఇచ్చట స్పష్టార్థము ప్రక్రియ వ్రాయంబడును. వ్యుత్ప॥ రెండు + ను; ప్రకృతసూత్రంబున టివర్ణంబు. రెండు + టి + ను; తత్సమపరిచ్ఛేదములోని (ఇకారంబుమీఁది, అను నిరువదియాఱవసూత్రంబున నువర్ణకంబుయొక్క ఉత్వంబునకిత్వంబు. రెండు + టిని; అచ్చికపరిచ్ఛేదములోని ముప్పదియాఱవసూత్రంబున నువర్ణముయొక్క ఉకారంబునకు ఇత్వంబు రెండిటిని పక్షంబున (రెండు, శబ్దంబు (ంటె, వర్ణంబుకలుగునో (బహువచనసూత్రంబులో నిత్యంబులు కలిగి (రెండింటిని, అనును. (రెంటిని, ఈరూపమీపరిచ్ఛేదములోని ముప్పదియొకండవ సూత్రంబుచే నంతిమడువర్ణంబునకు టివర్ణాదేశంబురాఁగా నైనది. ఇట్లే (మూఁడిటిని 'మూఁడింటిని - మూఁటిని' ఇత్యాదులందు రెండుశబ్దంబునొద్ద నుపయోగింపఁబడిన సూత్రంబులన్నియుఁ బ్రక్రియలో నూహించుకొనునది. నామాదికము విశేషించి నిరూపింపనియప్పుడు 'ఒక, శబ్దంబునకు (ఒకాను, శబ్దంబు పర్యాగమంబగు. ఉ. దేవతులలో నొకానొకఁడు. ఇచ్చట నామంబు విశేషించి చెపఁబడలేదు. (ఒకానొకటి, ఇదియు మహావర్థకము. 'ఒకానొకరితి' ఇది మహత్వార్థకము. ఒరిమ=ఐకమత్యము. (ఒండొరకరు' పరస్పరమని ఫలితార్థము. (ఓరట్టి = ఏకత్వసంఖ్యాబోధకముకము. (ఇనుమడి, రెండుశబ్దంబునకు (ఇను, శబ్దాదేశంబును, మడుగుశబ్దంబునకు వృత్తియందు (మడి. శబ్దాదేశంబును, అగును. ద్విగుణమనియర్థము. ఇట్లే ముమ్మడి (త్రిగుణము) నలుమడి (చతుర్గుణము) 'ఈరాఱు, ఇచ్చట (ఇరు' శబ్దంబునకు వచ్చుపరమైనది కాన నాన్యత్వసంగంబు దీర్ఘంబయ్యె. (ఈరాఱు, అనుటకుఁ బిమ్మట నిగాడు తనరుక్మిణీపరిణయమందు (ఇరాఱు, అనిప్రయోగించిరి. దీనికిఁ బ్రయోగాంతరంబు గానఁబడదు

26 సూ—సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుంబోలెమహతికగు.

వారిద్దఱురుక్మిణీసత్యభామలు - వీరుముగ్గురు శ్రీభూనీళలు.

వ్యా—సర్వనామములయొక్కయు, క్రియాపదంబులయొక్కయు, బహువచనము మహద్వాచకమునకువలె స్త్రీలింగమునకు నగును. ఉ. వారిద్దఱు రుక్మిణీసత్యభామలు. ఇచ్చట 'వారు' అనునది సర్వనామము. 'వారిద్దఱు రామలక్ష్మణులు' అనునప్పుడు మహద్వాచకంబునకు 'వారు' అనునది యెట్లుబహువచనంబయ్యెనో యట్లే ఇచ్చటస్త్రీలింగంబునకును 'వారు' అనుశబ్దంబు సంబంధించినది. ఏకవచనంబులో మహతీమహద్వాచకంబులైన సర్వనామరూపము వేఱుగానుండును. ఉ. అది (మహతి)రుక్మిణి. వాఁడు (మహత్తు) కృష్ణుఁడు. బహువచనంబున మహతీమహదర్థంబులకు సర్వనామంబులకు రూపభేదంబులేదు. వారు రామకృష్ణులు. వారు సీతారుక్మిణీదేవులు. క్రియాపదంబుల బహువచనంబులకు నుదాహరణము. రాముఁడుకలఁడు. సీతకలదు. ఇట్లేకవచనంబులో మహత్తునకును, మహతికిని, సంబంధించునట్టి క్రియప్రత్యయంబుచే భేదంబుగానున్నను బహువచనంబులో మహత్తులకును, మహతులకును, సంబంధించునట్టి క్రియయేకరూపంబైయుండు. రామకృష్ణులుకలరు. సీతారుక్మిణులుకలరు. ఇచ్చట 'కలరు' అనునది పుల్లింగమునకును, స్త్రీలింగంబునకును, సంబంధించును నేకరూపంబుతో నుండె. ఏకవచనంబున మాత్రంబు క్రియభిన్నరూపంబగు. ఉదాహరణము పైనినియ్యంబడె.

27 సూ—అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు.

పలుగురు - పలువురు - ఇరుగురు - ఇరువురు - వేగురు - వేవ్వురు - తొగ - తొవ - - పగలు - పవలు.

వ్యా—పదముయొక్క మొదటిదికానిదై మఱియొక్క హల్లుతోఁ గూడుకొని గకారమునకు వకారంబు వైభాషికంబుగాఁ గలుగును. ఉ. పలుగురు - పలువురు. ఇచ్చట గకారమనాద్యమైనదియు, హల్లుతో- గూడనిదియుఁ, గావున విభాషగా వకారంబయ్యె. వ్యవస్థితవిభాషకావున 'గొడుగు-గొడగము-నిగారము' ఇత్యాదులయం దువత్వము లేదు. అసంయుక్తమనుటచే 'నిగ్గు-ఉంగరము' ఇత్యాదులయందును వత్వంబు రాదు. 'ఇరుగురు-వేగిరి-తొగ-వగలు-పగ-పగతుఁడు-పగిది-తెగ-తెగడు — ' ఇత్యాదులఁ బలుగురుశబ్దంబునందుంబలె వత్వము గ్రహింపనది. తే|| తేఁగతేవ మనుచు దివిరిపల్కఁగవమ్ము! భగవమునఁగనొప్పుఁ బనవమనఁగ! ... బోడెమిపో ణిమి| వేగవేవనాఁ గవలయుఁ గృష్ణా' అనంతుని ఛందము.

## ఔపవిభక్తికప్రకరణము.

విభక్తిసామీప్యంబునం జేసి వచ్చువికారంబులను బోధించుభాగము, ఔపవిభక్తికప్రకరణము

28 సూ—ఇటితివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు.

విభక్తినిమిత్తంబులయి యాదేశాగమాత్మకంబులయిన ఇ-టి-తి- అనువర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.

వ్యా—'ఇ - టి - తి' అనునక్షరంబులు రాఁబోవు సూత్రంబులచే విధింపఁబడునవి యౌపవిభక్తికంబులను నామంబున వ్యవహరింపఁబడును. ఈయౌపవిభక్తికంబు లాదేశాగమస్వరూపములైన 'ఇ - టి-తి' అనునక్షరంబులే యని గ్రహింపనది.

29 సూ—ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగనగు.

కాలు - కాలిని- కాలిచే॥ నాఁగలి - నాఁగటిని - నాఁగటిచే॥ నేయి - నేతిని - నేతిచే॥ ద్వితీయైకవచనంబుపరంబగు నపుడౌపవిభక్తికంబులు రావని కొందఱువక్కాణించిరి-అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధంబగుటం జేసి యనాదరణీయంబు.

వ్యా—'ఇ-టి-తి' అనువర్ణంబులు ద్వితీయ మొదలైనవిభక్తులయొక్క యేకవచనంబులు పరంబులగునపుడుకొన్ని ప్రాతిపదికంబులకుఁదఱచుగాఁగలుగును. ఉ. కాలు. ద్వితీయావిభక్తి 'కాలిని' ఇచ్చట 'కాలు + ను' అనియుండఁగా నీసూత్రంబుచే 'కాలు' శబ్దంబుయొక్క ఉకారంబునకు ఇకారంబు వచ్చి 'కాలి + ను' ఇట్లుండె. పిమ్మట 'ఇకారంబుమీఁది' అను తత్సమపరిచ్ఛేదమందలి యిరువదాఱవసూత్రంబున నువర్ణకంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబుగలిగినది. 'కాలినొప్పి' ఇత్యాది సమాసస్థలంబులయందలి షష్ఠ్యాదివిభక్తులు లోపించినను, ఇత్వంబనపాయంబుగనుండును. 'కాలిచే' ఇత్యాదులిట్లే. 'నాగలి - నాగటిని - నేయి - నేతిని' ఇత్యాదులయందు 'టి - తి' వర్ణంబులు క్రమంబుగనయ్యెను. పైద్వితీయాంతంబులయందు 'కాలిని' అనుచోటునందుంబలె సూత్రంబులచేఁ బ్రక్రియయూహించుకొనునది. ద్వితీయావిభక్త్యేకవచనంబు పరంబగునపుడు, ఔపవిభక్తికంబులు రావని కొందఱు సెప్పిరనియు, ఆవచనము లక్ష్యలక్షణవిరుద్ధంబనియు, సూరిగారు వ్రాసిచ్చిరి. ఉ॥ 'విన్నన నేఁగు తామరల విందుకిలాత్తపునీడలెప్పుడున్' యయా- 2ఆ. క॥ 'వీడుచదివించెనయ్యెడ। వీడనివేడుకబలారివిబుధులతో వే। వీడుమణులనఁగఁదగుతన। వీడునఁగలమానికములు వివిధాంబరముల్' పారి- 6ఆ: క॥ 'కనకమయమైనయాప్రో। లునఁ దమసుతులావహంబులోనమరులచే' భార- ఆర- 4 ఆ. ఇట్లు, ఔపవిభక్తికశూన్యంబులగు ప్రయోగంబులు గలవు. కావునఁ బైవిధి కొన్నియెడల నిత్యంబుగాదు.

30 సూ—ఊరు మొదలగువాని కిత్వంబగు.

ఊరు — ఊరిని-కాలు-కాలిని-మ్రాను-మ్రానిని-నోరు - నోరిని-చోటు - చోటిని.

వ్యా— ఊరుమొదలైననామములకు ఇత్వంబుగలుగును. ఊరు - ఊరిని. ఇచ్చట ఊరు + ను, అనియుండఁగాఁ బ్రకృతసూత్రంబున రేఫంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబుగలిగి తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదియాఱవసూత్రంబున నువర్ణంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబుగలిగినది. మ్రానిని - నోరిని - నీరిని - చోటిని, ఇత్యాదులయందుఁ బైసూత్రంబులచే శబ్దసిద్ధిని గ్రహించుకొనవలయును క॥ నకులుఁడు సహదేవుఁడును! బ్రకటభుజాస్ఫురణమునను రతిబలము నే! లకు గోలలుఁ దత్తరునో! ఊరి వచ్చినయట్టులాడిరే యుబ్బంగిక్, భార- కర్ణ- 8ఆ రే॥ నీరిలోనఁ దోఁచుతారక ప్రతిబింబ! మొక్కయనఁగ వెలుఁగుచున్నదాని, రావకొడుకులెల్లఁ జూచుచునుండిరి! దానిఁ బుచ్చికొను విగంబులేక, భార-ఆది- 5 ఆ.

31 సూ— టివర్ణంబు గొన్నింటి యంత్యాక్షరంబున కాదేశంబును గొన్నింటికంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగనగు.

ఆదేశము - త్రాడు - త్రాటిని॥ కాడు - కాటిని॥ నోరు - నోటిని॥ ఏఱు - ఏటిని॥ ఆగమము - అన్ని - అన్నిటిని॥ ఎనిమిది - ఎనిమిటిని వేయి - వేయిటిని॥ ఉభయము - ఏమి - ఏటిని - ఏమిటిని॥ పగలు-పగటిని-పగంటిని మొదలు-మొదటిని-మొదలిటిని॥ రెండు-రెంటిని రెండిటిని॥ మూఁడు-మూఁటిని-మూఁడిటిని॥ నూఱు-నూటిని-నూఱిటిని.

వ్యా— 'టి' అనునక్షరము కొన్నిశబ్దంబుల కడపటియక్షరంబునకు నాదేశము గావచ్చుటయు, గొన్నిటికి శబ్దంబులకుఁ గడపట నాగమంబుగవచ్చుటయు, మఱికొన్ని శబ్దంబులకు నాదేశాగమంబులు రెండునుగలుగుటయు, నగును. ఆదేశంబునకు— త్రాడు-త్రాటిని. ఇచ్చట నాదేశమనుటచేఁ గడపటియక్షరమైన డువర్ణంబునకు టివర్ణంబు గలిగి తత్సమపరిచ్ఛేదమునందలి యిరువదియాఱవసూత్రంబున నువర్ణంబుయొక్క ఉకా

ర్ణంబునకు నిత్యంబు గల్గినది. ఇట్లే 'కాటిని-నోటిని-ఏటిని' అనునవి గ్రహింపవలెను. ఆగమంబునకు — అన్ని-అన్నిటిని. ఇచ్చట నాగమంబగుటచేఁ గడపటి యక్షరంబునకు సామీప్యంబున 'టి' అను నక్షరంబు చేరి 'అన్నిటిని' అయినది. ఇట్లే 'ఎనిమిదిటిని-కొ యిటిని' మొదలైనవి. ఉభయంబునకు — ఏమి-ఏటిని-ఏమిటిని. ఇచ్చట బహ్వాగమం బగుటచే 'టి' వర్ణము ఆదేశంబును, ఆగమంబును నైనదని గ్రహింపవలెను. 'ఏమిని' ఇచ్చట 'మి' అను నక్షరంబునకు బహుళ టివర్ణంబు వచ్చి 'ఏటిని' అయినది. 'ఏమిటిని' ఇచ్చట 'మి' అను నక్షరంబునకు సామీప్యంబున టివర్ణంబు చేరినది గనుక నాగమంబు. ఇట్లే 'పగటిని-పగలిటిని, మొసటిని-మొసలిటిని. రెంటిని - రెండిటిని' మూఁటిని - మూఁడిటిని, నూటిని - నూఱిటిని.' ఇత్యాదులు గ్రహింపవలెను. అహోబలపతి యాపవిభక్తికాంతంబగు నీరు శబ్దంబు సంస్కృతసమంబని చెప్పెను; కాని తత్సమంబునకు నాపవిభక్తికంబు దుర్ఘటంబు. ఇయ్యది నీరశబ్దసంబంధమని గ్రహింపవలెను. 'నీరము' ఇయ్యది తత్సమంబు. చ॥ 'అనిన సుయోధనుండు పవమాత్మజు నిట్లను నిర్జగంబుల | న్నొకట గ్రమింగనేనియును నెట్టన సర్వము గావనేనియు | న్వినుము ముసుంపుఁ డర్జును నెచ్చెరి నాఁడె వులావవించునిం | కనకేని నొక్కఁ జామునకుఁ గాంగ్ధృతి పెంపెం నాకొయింతునే' భార - ఉద్యో - 2 ఆ' అను పద్యమందు "అన్నిటిని" అను ద్వితీయాంతం బుండవలయునని యు 'అన్నిని' అనునది యసాధువనియుఁ, గొందఱు భ్రాంతి చెందిరి. ఇయ్యది సముచ్చయార్థకద్రుతాంతంబైన ప్రథమాంతంబు. ద్వితీయార్థ మందున్నదని గ్రహింపవలెను. 'నీకేమిని వేగిరపడకు, హరి - పూ - 8 అ. ఇచ్చటను సముచ్చయార్థకద్రుతాంతంబైన ప్రథమా విభక్త్యంతము.

32 — సూ — హ్రస్వము మీఁది టివర్ణంబునకు ముందు పూర్ణ బిందువు బహుళముగా నగు.

అన్నింటిని - ఎనిమిదింటిని - పగంటిని పగలింటిని - రెండింటిని - మూఁడింటిని.

వ్యా — హ్రస్వాక్షరంబుమీఁది వాలయినట్టి 'టి' అనునక్షరంబునకు ముందు నిండు

సున్న బహుళంబుగాఁ గలుగును. ఉ. అన్నింటిని. ఇచ్చట (న్ని, అనునక్షరము హ్రస్వముగనుక దీనికి .టి, వర్ణంబు పరంబగునపుడు పూర్ణబిందువాగమంబయ్యె. ఇట్లే (ఎనిమిదింటిని, పగంటిని, పగలింటిని, రెండింటిని, మూఁడింటిని, ఇత్యాదులయందుఁ బర్యాయంబుగ ననుస్వార పూర్వకటివర్ణంబుండునని యూహింపవలెను.

33 సూ—పదాద్యంబగు హ్రస్వంబుమీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువగు.

కన్ను - కంటిని ॥ మిన్ను - మింటిని॥ ఇల్లు - ఇంటిని॥ పల్లు-పంటిని.

వ్యా—పదముయొక్క మొదటిహ్రస్వంబునకు టివర్ణంబు పరంబగునపు డనుస్వారం బాగమంబుగనగు. ఉ. కన్ను – కంటిని. ఇచ్చటను ద్విత్వంబునకును ముప్పదియొకండవ సూత్రంబున టివర్ణం బాదేశంబు కాఁగా నీముప్పదిమూఁడవ సూత్రంబున టివర్ణంబునకు ముందు బిందువాగమంబయ్యెను ఇట్లె (మింటిని ఇంటిని- (ఇల్లు) పంటిని (పల్లు) వింటిని (విల్లు), ఇత్యాదిశబ్దంబులయందు ముప్పదియొకండవ సూత్రంబున టివర్ణంబు గలిగి ప్రకృతసూత్రంబున ననుస్వారాగమంబుగలుగును.

34 సూ—అఱ్ఱు మొదలగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటి లోపంబునగు.

అఱ్ఱు - అఱితిని ॥ అఱ్ఱు - కఱ్ఱు-కొఱ్ఱు - గొఱ్ఱు - మిఱ్ఱు - వఱ్ఱు- ఇవి యఱ్ఱు మొదలయినవి.

వ్యా—అఱ్ఱు మొదలైన శబ్దంబులకు నంతమందు (తి. అనునక్షరంబు వచ్చుటయు ఱకారరేఫంబొక్కదానికి లోపంబును గలుగును. ఉ. అఱ్ఱు. అఱితిని. ఇచ్చట

అటు + ను, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబుననాముంబు చివరతివర్ణాగమంబును, శకట రేఫంబొక్క దానికి లోపంబును గలుగ, అటు + తి + ను. అయ్యెను. తత్సమపరిచ్ఛేదంబు నందలి యిరువదియాఱవ సూత్రంబున, తి, వర్ణంబుమీఁది నువర్ణకంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబుగలిగి, అటు + తి + ని, అయ్యెను. పిమ్మట నీక్రిందిముప్పది యాఱవసూత్రంబుచేత శకటరేఫంబుయొక్క ఉకారంబునకు ఇత్వంబు గలిగి, అటితిని, అనురూపము సిద్ధించెను. ఇట్లే, కట్టు-కొట్టు-గొట్టు-మిట్టు-వట్టు, ఇత్యాదుల ద్వితీయాదివిభక్తులందు రూపసిద్ధి యెఱుంగునది.

35 సూ—విభక్తిపరంబగునపుడు గోయిప్రభృతుల తుదియొకారంబు తివర్ణంబగు.

గోయి - గోతులు - గోతిని - గోతులను ॥ గోయి - చేయి-దాయి - నూయి - నేయి - వాయి - రోయి - ఇత్యాదులు.

వ్యా—విభక్తి పరంబగునపుడు (ప్రథమాబహువచనాదివిభక్తులు) గోయి మొదలైనశబ్దంబుల కడపటి యివర్ణంబునకు, తి, అనునక్షరంబాదేశంబగును. ఉ. గోయి - గోతులు. గోతిని - గోతులను. గోయి ప్రభృతులు స్త్రీసమంబులు గావునఁ బ్రథమైకవచనము లోపించెడిని. అందున విభక్తిపరత్వంబులేమింజేసి ప్రథమైకవచనాంతమందు యివర్ణంబునకు, తి, వర్ణాదేశంబు రాదు. గోయి + లు, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున యికారంబునకు, తి, వర్ణాదేశంబు గలిగి గోతి + లు, అయ్యెను. పిమ్మటఁ దత్సమపరిచ్ఛేదమందలి నలుబదియేడవసూత్రంబునఁ దివర్ణంబుయొక్క ఇకారంబునకు ఉత్వంబుగల్గి, గోతులు, అయ్యెను, గోతిని, ఇచ్చట గోయి + ను, ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున ఇకారంబునకు, తి, వర్ణంబుగల్గి తత్సమపరిచ్ఛేదమందలి యిరువదియాఱవ సూత్రంబున నువర్ణంబుయొక్క ఉత్వంబునకు ఇత్వంబుగలిగెను. ఇట్లే చేయి-దాయి-నూయి-నేయి - వాయి- రోయి' ఇత్యాదిశబ్దంబుల శబ్దసిద్ధి యూహించునది. ఈతివర్ణాదేశంబు జౌపవిభక్తికమైన టివర్ణంబువలె ; ద్వితీయాద్యేకవచనమందే కాకుండఁ బ్రథమాబహువచనంబును మొదలుగాఁగల యేకవచనబహువచనంబులయందును నామాంత్యవర్ణంబు

లకాదేశంబగు. 'చేఁదుతుది ద్రావాయి తివర్ణంబగునండ్రదు' శబ్దల-శబ్దప- 212 సూ. ఉ. చేఁ దబీర - చేఁతిసార-చేఁతిసాట్లు=చేఁతిపుచ్చ. మొ.

36. సూ-టితివర్ణంబులు పరంబులగునపు డుత్వంబునకిత్వంబగు.

రెండిటికి - మూఁడిటికి - నాలుగిటికి - పగలిటికి - మొదలిటికి - పెక్కిటికి - కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు ॥ నెత్తుటికి.

వ్యా— టి-తి, అను నక్షరంబులు పరంబగునప్పుడు ఉకారంబునకు ఇకారంబు గలుగును. ఉ. రెండిటికి. ఇచ్చట రెండు + కు, ఇట్లుండ ముప్పదియొకండవ సూత్రంబున రెండు, శబ్దంబుపైని టివర్ణాగమంబు కలుగఁగా రెండు + టి + కు, అయ్యెను తత్సనుపరిచ్ఛేదంబులోని యిరువదిమూఁడవసూత్రంబున టివర్ణముపైని కు, వర్ణంబు యొక్క ఉత్వంబున కిత్వంబుగలిగి 'రెండు + టి + కి అయ్యెను. పిమ్మటఁ బ్రకృత సూత్రంబున 'రెండు, శబ్దంబు యొక్క యంత్యాక్షరమగు వర్ణోత్వంబునకు నిత్వంబు గలిగి రెండిటికి, అయ్యెను. ఇట్లే మూఁడిటికి, నాలుగిటికి, పగలిటికి, మొదలిటికి, పెక్కిటికి, ఇత్యాదిశబ్దంబుల నూహించునది. (సూ. వ్యా.) కొన్నిచోట్ల టివర్ణంబు పరంబగునపు డుత్వంబునకు నిత్వంబు రాదు. ఉ. నెత్తుటికి, ఇచ్చట టివర్ణంబు పరంబయినను, తకారద్వయంబుమీఁది ఉకారంబునకు ఇత్వంబు రాలేదు. ఇట్లే ప్రొద్దుటికి మొదలైనవి, కొన్నిచోట్ల వైకల్పికంబును గలదు. ఉ, చవుటి. చవిటి, మొదలైనవి.

37 సూ—టివర్ణంబుపరంబగునపుడు క్రిందు మీఁదు ముందు పువర్ణంబుల కత్వంబగు.

క్రిందు - క్రిందటిని — మీఁదు - మీఁదటిని - ముందు - ముందటిని - మాపు - మాపటిని — అప్పుడు - అప్పటిని.

వ్యా—'టి' అనునక్షరంబు పరంబగునప్పుడు, క్రిందు, మీఁదు, ముందు, శబ్దంబుల ఉత్వంబునకును, పువర్ణంబునకును. అత్వంబుగలుగును. ఉ. క్రిందు- క్రిందటిని ఇచ్చట, క్రిందు, శబ్దంబునకు ద్వితీయయందు, టి, అనునక్షరంబు పరంబగునప్పుడు ముప్పదియారవ సూత్రంబున ఉకారంబునకు ఇకారంబు ప్రాప్తించుచుండఁగా నపవాద విధియైనసూత్రంబున ఉకారంబునకు అకారాదేశంబుకలిగి, క్రిందటిని, అయ్యెను ఇట్లే మీఁదటిని, ముందటిని, మొదలైనరూపములందు సూత్రప్రక్రియ యూహింప. వలయు. పువర్ణంబునకు- ఉ. మాపు, మాపటిని. అప్పుడు. అప్పటిని. అప్పుడు శబ్దంబున డువర్ణంబునకు టివర్ణంబాదేశంబయి వచ్చెను. తక్కినపైయుదాహరణంబులయందు టివర్ణంబాగమంబు. టివర్ణంబు పరంబగుచుండ నీసూత్రంబుచే పువర్ణంబునకు అత్వంబు కలిగి, అప్పటిని, అయ్యెను.

38 సూ—ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వంబాదేశంబు బహుళంబుగానగు.

గోరనుగీఱెను - ఊరనున్నాఁడు ॥ గొడ్డటనటికెను ॥ ఇంట లేఁడు ॥ వఱుతఁగలిసె॥ కఱుతదూఁటె ॥ పక్షంబునందు గోరిచేత- నూరియం దిత్యాదులు.

వ్యా—ఔపవిభక్తికంబులయొక్క తృతీయావిభక్తికిని, సప్తమీవిభక్తికిని అకారంబు బహుళంబుగానగును. ఉ. గోరనుగీఱెను. ఊరనున్నాఁడు. ఇచ్చట, గోరు + (చేత)ను' అని యుండఁగాఁ బ్రకృతసూత్రంబున విభక్తిలోని చేవర్ణ తవర్ణంబులు రెండింటికిని అకారాదేశంబు సర్వాదేశంబయ్యెను. పిమ్మట, గోరు + అను, అనియుండె. ఉకారసంధికల్గి 'గోరను' అయ్యె. సప్తమికి-,గోరు + (అందు)ను' ఇట్లుండఁ బ్రకృత సూత్రంబున, అందు' వర్ణంబులు రెండిటికిని అకారంబు సర్వాదేశంబయి, గోరు + అను' అయ్యె. పిమ్మట ఉకారసంధికలిగి, గోరను' అయ్యెను. ఇట్లే ఊరను మొదలైనవి. ఉ: గోరనుబోవునేకలను గొడ్డటయన్నఁ దొరంగిరో! వినం। గోరు, కన్నప్పఁ రిత్రి (కంఢిరాజు సూరయ (పణీతము) గొడ్డటనఱికెను. గొడ్డు + (చేత)ను, అని

యుండఁ(బ్ర)కృతసూత్రంబున చేవర్ణతవర్ణంబులు రెండిటికిని అకారంబును, ఇరువదితొమ్మిదవసూత్రంబున రివర్ణంబునకు టివర్ణంబును గలుగంగ 'గొడ్డటి + అను' అయ్యెను. పిమ్మట సంధిపరిచ్ఛేదంబులోని పదునొకండవసూత్రంబున టివర్ణంబుయొక్క ఇకారంబు అపదాదిస్వరంబుగావున సంధిగలిగి పరస్పరాదేశంబై 'గొడ్డటను (గొడ్డట్ + అను) అయ్యెను. గొడ్డటను=గొడ్డటిచేతను గొడ్డటియందును. వఱుతను-వఱ్ఱు + (చేత)ను, ఇట్లుండ బ్రకృతసూత్రంబున చేవర్ణతవర్ణంబులకు రెంటికిని అకారంబాదేశంబయి 'వఱ్ఱు + అను, ఇట్లుండె. పూర్వోక్తంబైన ముప్పదినాల్గవసూత్రంబుచే 'తి' వర్ణాగమంబును రేఫద్వయంబులో నొక్కదానికి లోపంబుగలిగి 'వఱుతి + అను' అయ్యె. పిమ్మట సంధి పరిచ్ఛేదంబులోని పదునొకండవసూత్రంబున 'తి' వర్ణంబుయొక్క ఇకారంబు అపదాదిస్వరంబగుటచే సంధిగలిగి 'వఱుతను' అయ్యెను. గోరుశబ్దంబునకుం బలె రువర్ణాంత శబ్దంబులకును, గొడ్డలిశబ్దంబునకుం బలె లికారాంతశబ్దంబులకును, వఱ్ఱుశబ్దంబునకుం బలె ద్విరేఫాంతశబ్దంబులకును, తృతీయాసప్తంబులయందు రూపంబు లెఱుంగునది. చేతశబ్దంబును స్వీకరించి యుదాహరణంబు చెప్పఁబడినది కాని 'చేన్' 'తోన్', 'తోడన్', వర్ణంబులకును, ఈసూత్రంబుచే నకారాదేశంబుగల్గి 'గోరను, ఇత్యాదికముగానే రూపంబు లంగ్రహించునది. 'చేతను, ఇత్యాదివిభక్తులయందు చేవర్ణతవర్ణంబులకుబోలె నుకారంబునకుఁ గూడనేల యకారాదేశంబురాదని శంకింపవలదు. ఆనుకారము విభక్తికిఁ దత్సమ పరిచ్ఛేదంబులోని యెనిమిదవసూత్రంబున నాగమంబుగా వచ్చినది: కావున దానిని విడిచి కేవలవిభక్తికే అకారాదేశంబగునని తెలిసికొనునది. ఈవిధి బాహుళకంబైనందున బక్షంబున 'గోరిచేతను గోరియందును, గొడ్డటిచేతను, గొడ్డటియందును, వఱుతిచేతను, వఱుతియందును, ఇత్యాదిరూపంబులగును.

---

ఇది యాచ్ఛికపరిచ్ఛేదము.

---

# కారకపరిచ్ఛేదము

ప్రథమాదికారకంబులనుగుఱించి చెప్పునట్టిభాగము. ఇయ్యది కర్తృకారకము, కర్మకారకము, కరణకారకము, సంప్రదానకారకము, అపాదానకారకము, అధికరణకారకము, అని షడ్విధంబు. కారకమనఁగాఁ గ్రియాన్వయంబు గలదని కొందఱును, క్రియాజనకంబని మఱికొందఱును, లక్షణంబును జెప్పుదురు. అనఁగాఁ గ్రియతో నన్వయించునది కారకంబని కొందఱి యభిప్రాయము. క్రియను బుట్టించునదియని మఱికొందఱియభిప్రాయము. లక్షణద్వయంబును బర్యవసానంబున నిర్వివాదంబు.

1 సూ—ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమయగు.

ప్రాతిపదికార్థమునందు - రాముఁడు ॥ రావణుఁడు - నియతోపస్థితికము ప్రాతిపదికార్థము ॥ సంబోధనమునందు - ఓరాముఁడ - ఓరావణుఁడ॥ఉక్తార్థమందు - రాముఁడు రావణునిసంహరించెను - ఉక్తమనఁగాఁ జెప్పఁబడినది - ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినదిగావునఁ దద్వాచకమగు రామశబ్దమునకుఁ బ్రథమ యయ్యె ॥ రామునిచేత రావణుఁడు సంహరింపఁబడెను - ఈవాక్యమందాఖ్యాతము కర్మమును జెప్పినదిగావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమయయ్యెనని యెఱుంగునది.

వ్యా—ప్రాతిపదికార్థంబునందును, సంబోధనార్థంబునందును, ఉక్తార్థమునందును, ప్రథమావిభక్తి యగును. (సూ) ప్రాతిపదికార్థమునందు — రాముఁడు; రావణుఁడు నియతోపస్థితికము ప్రాతిపదికార్థకము. (వ్యా) ప్రాతిపదికార్థములు 1 జాతి, 2 వ్యక్తి, 3 లింగము, 4 సంఖ్య, 5 కారకము అని పంచకంబుగాఁ జెప్పంబడియెను. ఇందుకు ప్రమాణము వైయాకరణభూషణసారము. శ్లో॥ ఏకద్వికత్రికచతుష్పంచకం ప్రాతిపదికార్థః।

నామార్థ ఇతి సర్వేచపక్షాశ్శాస్త్రేనిరూపితాః' ఇట్లు జాతివ్యక్తిసంఖ్యాకారకంబులలోఁ బ్రాతిపదికార్థము క్రమంబుగా 'నేకంబనియు, (జాతి) ద్వికంబనియు, (జాతివ్యక్తులు) త్రికంబనియు, (జాతివ్యక్తిలింగములు) చతుష్కంబనియు, (జాతివ్యక్తిలింగవచనంబులు) పంచకంబనియు, (జాతివ్యక్తిలింగవచనకారకంబులు)' అని వివిధమతంబులు గలవు. అనఁగా జాతివ్యక్తిలింగసంఖ్యాకారకంబు లైదింటిని నామవాచకమే బోధించుననియు నామంబుమీఁది ప్రథమాదివిభక్తులు, అగ్నికి సహజంబైన దహనశక్తిని బ్రకటింపఁజేయుటలో శుష్కేంధనము (ఎండుకట్టె) సాధనమైనట్టులు పైనిం జెప్పిన నామవాచకార్థంబులను నామంబుమీఁది ప్రథమావిభక్తి స్ఫుటీకరించుననియు, (ద్యోతకమనియు) శాస్త్రజ్ఞులయభిప్రాయంబు. 'రాముఁడు' ఇచ్చట రామత్వము జాతి. (రామత్వధర్మముతోఁ గూడిన) రాముఁడు వ్యక్తి. ఈశబ్దంబు పుల్లింగము; ఏకవచనము; కర్తృకారకము. ఈయైదర్థంబులును రామశబ్దంబునకే కలవనియు, ప్రథమావిభక్తియైన డువర్ణకంబు పైని నిరూపించిన నామార్థంబులకు ద్యోతకంబనియు; (నామములకున్న యర్థములను స్పష్టపఱచుటలో సహాయమైనది తాత్పర్యము. 'రాముఁడు' అన్నప్పుడు 'రామత్వరూపజాతియును, రాముఁడనెడివ్యక్తియును పుంలింగంబును, ఏకవచనంబును, కర్తయనునర్థంబును,' ఈయైదును బుద్ధికి గోచరమవుచున్నవి. జాతియనునది పదార్థంబులనేకంబులైనచో వానియందు వర్తిల్లుధర్మము వృక్షంబు లనేకంబు లున్నచో వృక్షత్వజాతి యాచెట్లయందుండును. బ్రాహ్మణులనేకులున్నచో బ్రాహ్మణత్వజాతి వారియందు వర్తిల్లును. ప్రకృతంబున 'వ్యక్తేరభేదస్తుల్యత్వం' అనుశాస్త్రంబున నేకవ్యక్తియేయుండునప్పుడు జాతి సంభవింపనేరదు గావున నేకవ్యక్తియైన దశరథజ్యేష్ఠాపత్యరామునియందు రామత్వజాతి యెట్లుసంఘటిల్లునని శంకింతురనియే యాకర్ణింపుఁడు. కల్పభేదంబులచే మత్స్యాది దశావతారంబులును బ్రతికల్పంబునను నవతరించునని శాస్త్రంబులుద్ఘోషించుచున్నవి. కనుక రామాద్యవతారంబులు కల్పంబుల బాహుళ్యంబున ననేకంబులు సంభవిల్లును. అందునఁ గల్పభేదంబున ననేకులైన రాములను నాశ్రయించుకొని రామత్వజాతి వర్తిల్లుట నిర్బాధంబని యెఱుంగునది. కొందఱు శాస్త్రజ్ఞులు జాతివ్యక్తిలింగంబులే నామంబున కర్థంబులనియు, సంఖ్యాకారకంబులుమాత్రము విభక్త్యర్థంబులేయనియు, వక్కాణింతురు. పైనిఁజెప్పినజాతివ్యక్తిలింగవచనకారంబులైదును 'రావణుఁడు' అనెడి యుదాహరణంబునొద్దఁగూడఁ బూర్వోక్తప్రకారంబున సమన్వ

యించుటకొఱకు. 'నియతోపస్థితికము ప్రాతిపదికార్థము' అనఁగా: ఏప్రాతిపదికంబు ను (నామవాచకంబును) ఉచ్చరింపఁగా నెట్టియర్థంబునకు నియతంబుగ (సర్వదా) స్ఫురణగలుగునో యట్టియర్థము నియతోపస్థితిక మనంబడును. నియతోపస్థితికము; నియత = యెల్లప్పుడును గలుగునట్టి ఉపస్థితికము = స్ఫూర్తిగలయర్థము. అనఁగా నిత్యలింగంబులుగల పదంబు లర్థనియతోపస్థితికి నుదాహరణంబులగును. ప్రకృతంబున రామరావణశబ్దంబులు సర్వదా పుంలింగంబులై రామ రావణులనెడి పురుషులను దెలుపుచున్నవి కాఁబట్టి ప్రాతిపదికార్థనియతోపస్థితికి నుదాహరణంబులయ్యె. 'లక్ష్మి' ఈశబ్దంబు సర్వదా స్త్రీలింగంబై లక్ష్మీరూపస్త్రీని బోధించుచున్నదిగాన స్త్రీలింగంబు లో నియతోపస్థితికి నుదాహరణము. 'జ్ఞానము', ఈశబ్దంబు సర్వదా నపుంసకలింగమై తెలివిని బోధించుచున్నది కావున నపుంసకలింగంబులో నియతోపస్థితికి నుదాహరణ మ్మని యెఱుంగునది. ప్రాతిపదికార్థము నియతోపస్థితికము కానియందులకు నుదాహర ణంబెట్లనఁగా వినుండు. పరమాత్మశబ్దంబులోనైన శబ్దంబులకు డువర్ణవిభక్తిలోపమువర్ణ కంబులు గల్గునప్పుడే పుంస్త్రీనపుంసకలింగంబులు (పరమాత్ముఁడు, పరమాత్మ, పర మాత్మము) క్రమంబుగా స్ఫురించుచున్నవి. కాని 'కేవలనామవాచకమువలనను నెట్టి లింగంబును నియతంబుగ స్ఫురించుచుండలేదు కావున నేతాదృశలింగరూపార్థము ప్రాతిపదికముచేత నియతోపస్థితికముగాదని యెఱుంగునది. కాఁబట్టి యిట్టి యనియత లింగశబ్దంబులకుఁ బ్రాతిపదికార్థంబునందు మూలసూత్రముచేఁత బ్రథమవచ్చుననుట య సందర్భంబు. కావున సూత్రంబులో 'ప్రాతిపదికలింగసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అని సూత్రము రచియించుట యుక్తమ్ము. 'నియతోపస్థితికము ప్రాతిపదికా ర్థము' అని చిన్నయసూరివివరణము చేయకుండనేని యుక్తంబుగానుండును. అట్లను జాతివ్యక్తిలింగసంఖ్యాకారకంబులైదును బైనిం జూపిన వైయాకరణభూషణసారశ్లోక ప్రామాణ్యముచేఁ బ్రాతిపదికార్థమే కావున ననియతలింగ ప్రాతిపదికంబులమీఁద సయితము ప్రాతిపదికార్థమందే నిర్బాధంబుగాఁ బ్రథమవచ్చును. మిత్రశబ్దము సంస్కృ తభాషలో నిత్యనపుంసకమైనను దెలుంగునందుఁ దత్సమపరిచ్ఛేదంబులోని పన్నెండవ సూత్రంబుచేఁ బుంలింగంబునునయి యుండునని చెప్పంబడినది. కను మిత్రశబ్దంబు సర్వదా నపుంసకలింగార్థబోధకంబేగాక పుంలింగార్థబోధకంబునునగు. ఈశబ్దంబునకుఁ

బులింగనపుంసకలింగంబులు పాక్షికంబులగుటం జేసి మిత్రశబ్దార్థము నియతోపస్థితికము గాదు. కాఁబట్టి 'మిత్రము' అనుచో ముపర్ణకంబును, 'మిత్రుఁడు' అనుచో డువర్ణకంబును, ప్రాతిపదికార్థమందే వచ్చునని చెప్పం గూడదు. ఈయుదాహరణంబునందు మిత్రశబ్దంబు సఖుఁడన్న యర్థంబును దీనిపైనుండు డువర్ణకముపర్ణకంబులు పుంలింగనపుంసకంబులనెడి లింగార్థంబును బోధించునని యెఱుంగునది. 'రాముఁడు-రావణుఁడు' అనునుదాహరణంబులయందుఁ బ్రాతిపదికార్థంబులు రామరావణులని చెప్పినవెంటనే పుల్లింగార్థముకూడ భాసిల్లుచున్నది. కావలింగమనెడి యర్థము ప్రాతిపదికార్థంబులో నంతర్భూతమైనది. మిత్రనామవాచకమునొద్దసఖిరూపార్థంబు స్ఫురించినవెంటనే పుల్లింగనపుంసకంబులు స్ఫురింపక యాశబ్దంబుపై డువర్ణకముపర్ణకంబులు చేర్చినప్పుడే పుల్లింగనపుంసకలింగంబులన్నయర్థము స్ఫురించును. గాన నిచ్చట విభక్తి ప్రాతిపదికార్థమందుఁ గాక లింగార్థమందని యెఱుఁగునది ఇట్లనేక లింగంబులు గలశబ్దంబులయొద్ద లింగము ప్రాతిపదికార్థంబులో నంతర్భూతంబని యంగీకరింపక విభక్త్యర్థమే యని గ్రహించుకొనునది. ఈసూత్రంబుచేఁ బంచకంబులో నొక్కటియైన కారకార్థమునందుసహితము ప్రథమావిభక్తిసామాన్యంబుగా విధింపఁబడినప్పటికిని దరువాతి సూత్రంబులచేఁ గర్మకారకాద్యర్థంబులయందు విశేషించి విధింపంబడిన ద్వితీయాదివిభక్తిప్రత్యయంబులు ప్రథమావిభక్తికి బాధకంబులని యెఱుంగునది. ఈప్రాతిపదికార్థాంశంబునందు నింకను వ్రాయవలసియున్నను గ్రంథవిస్తరంబునకు భీతిల్లి సంగ్రహముగా సారాంశంబు ప్రదర్శింపంబడెను. (మూలము) సంబోధనంబునందు ఓరాముఁడ; ఓరావణుఁడ.

వ్యా-ఇచ్చట రామరావణశబ్దంబులమీఁది ప్రథమావిభక్తులకుసంబోధనమర్థము. సంబోధనంబన నక్త (పిలుచువాఁడు) తనకు నితరుల నభిముఖునిగాఁ జేసికొనుట. (మూలము) ఉక్తార్థమందు. రాముఁడు రావణునిసంహరించెను: ఉక్తమనఁగాఁ జెప్పఁబడినది. ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది కావునఁ దద్వాచకమగు రామశబ్దమునకు ప్రథమయయ్యె. (వ్యా) పైనుదాహరించిన 'సంహరించెను' అనుశబ్దంబునయందు భూతార్థకలిట్ప్రత్యయంబు కర్త్రర్థంబునందు విధింపంబడియె. కావుననే 'సంహరించెను.' అనిచెప్పుటతోడనే 'ఎవ్వఁడు' అని ప్రథమావిభక్త్యంతంబునకుఁ బ్రశ్నవేసికర్తను నాకర్షించుకొనుచున్నది. అందున "సంహరించెను" అనుచో లిట్ప్రత్యయంబుచేతనే కర్త

చెప్పంబడియె. కనుక రామశబ్దంబుకంటెఁ బ్రాతిపదికార్థమాత్రమందే ప్రథమావిభక్తి కంబు వచ్చినదని యెఱుంగునది. ఆఖ్యాతంబునఁ దిజ్ విభక్తి (క్రియావిభక్తి). (మూలము) రామునిచే రావణుండు సంహరింపఁబడియె. ఈవాక్యమందాఖ్యాతము కర్మమును జెప్పినది కావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమయయ్యెనని యెఱుంగునది. (వ్యా) 'సంహరింపఁబడియె' అనుశబ్దంబునందు భూతార్థకలిట్ప్రత్యయము కర్మార్థమందు విధింపఁబడియె. కావుననే 'ఎవ్వఁడు సంహరింపఁబడెను' అని కర్మకారకమాకర్షింపఁబడుచున్నది, పైవాక్యంబునందు సంహరించుటకుఁ గర్త రాముఁడును కర్మకారకము రావణుండును. కర్మకారకంబు క్రియావిభక్తిచేతనే చెప్పంబడినది. కావున రావణశబ్దంబుకంటెఁ బునరుక్తంబుగఁ గర్మార్థంబునందు ద్వితీయావిభక్తి రాక ప్రాతిపదికార్థమాత్రంబునందుఁ బ్రథమావిభక్తి వచ్చినదని తెలిసికొనునది.

## 2 సూ—కర్మంబునద్వితీయయగు.

ధాత్వర్థఫలాశ్రయంబుకర్మమునాఁబడు ॥ దేవదత్తుఁడువంటకమును వండెను ॥ ఇటవండెననుమాటకు వంటచేసెననియర్థము - వంటఫలము- చేయుటవ్యాపారము - వంటయనఁగా బాకము - పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మంబయ్యెననియెఱుంగునది.

వ్యా—కర్మార్థంబున ద్వితీయావిభక్తియగును. ద్వితీయకు వికృతియని వ్యవహారము కానిపించెడిని. (మూలము) ధాత్వర్థఫలాశ్రయంబు కర్మమునాఁబడు. వ్యా— ధాతువుయొక్క యర్థమైన ఫలమునకు నాధారము కర్మమనఁబడును. అనఁగా ఫలమును బొందునది యనియర్థము. ఉ. దేవదత్తుఁడు వంటకమును వండెను. ఇచ్చట వండెననఁగా వంటచేసెనని యర్థము. చేయుటవ్యాపారము. వంటయనఁగాఁబాకము (విక్లిత్తి= మెత్తన) మెత్తనకు నాశ్రయమైనది వంటకము (అన్నము) కనుకఁ గర్మసంజ్ఞగలదైనది. కావునఁ గర్మమైన యన్నమర్థమిచ్చునట్టి వంటకముశబ్దంబునకు ద్వితీయావిభక్తియయ్యెను. ధాతువునకు ఫలమును వ్యాపారమును అర్థములు. వంటఫలము. చేయుటవ్యాపారము. ఫలాశ్రయము కర్మమగును, వ్యాపారాశ్రయము కర్తయగును, ప్రకృతమందు

'వంటచేయుట' అనెడుక్రియకు నాశ్రయుండు దేవదత్తుండు కావునతండు కర్తయయ్యె. అట్టియాశ్రయుండు 'చేసెను' అనుశబ్దంబులోని చేయుధాతువుపై విధింపఁబడిన ప్రత్యయముచేఁ జెప్పంబడెను అనఁగా ప్రత్యయంబునకు నాశ్రయుండర్థము. కావుననే వైయాకరణభూషణసారంబునందు నిట్లు సెప్పఁబడినది శ్లో॥ ఫలవ్యాపారయోర్ధాతు రాశ్రయేతు తిఙస్స్మృతాః। ఫలేప్రధానం వ్యాపారస్తిఙర్థస్తు విశేషణమ్॥ అర్థము — ఫలమును, వ్యాపారమును, ధాతువునకు నర్థంబులు. తిఙునకు క్రియాపైఁ బ్రయోగింపఁబడు భూతాదికాలబోధక(ప్రత్యయమునకు) నాశ్రయ మర్థము. ధాత్వర్థఫలంబు ధాత్వర్థవ్యాపారంబునకు విశేషణంబగు. వ్యాపారంబు విశేష్యంబగు. అనఁగా దేవదత్తుని వ్యాపారంబు వంటకమందలి మెత్తనను గలిగించినది; కావున వ్యాపారంబు విశేష్యంబును, వంటకంబుయొక్క మెత్తనవిశేషణంబునునయ్యెను. 'మెత్తన' అనుఫలంబునకు నాశ్రయం బన్నంబు కావున వంటకము (అన్నము) కర్మంబాయెను

### 3 సూ — చేతవర్ణంబు కర్తకగు.

ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు॥ దేవదత్తునిచే తవంటకము వండఁబడియె - వండఁబడియెననఁగా వంటచేయఁ బడియెనని యర్థము - చేయుటకాశ్రయుండగుటంజేసి దేవదత్తుండుకర్తయయ్యె.

వ్యా—'చేత' అను ప్రత్యయంబు కర్తృవాచకశబ్దంబుకంటెఁ గలుగును. (మూ) ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు. వ్యా- ధాతువుయొక్కయర్థంబైన వ్యాపారంబునకు నాధారంబగు. పదార్థంబు కర్తయనంబడును. ఉ: దేవదత్తునిచేత వంటకము వండఁబడియె ననఁగా వంటచేయంబడియెనని యర్థము. ఇచ్చట 'చేయుట' అనుక్రియకు నాధారభూతుండు గనుక దేవదత్తుండుకర్తయాయెను. అట్టి కర్తృవాచకపదంబు కంటె 'చేత' విభక్తి కలిగెను. ఇచ్చట ధాత్వర్థమైన 'వంట' (విక్లిత్తి = మెత్తపడుట) అనుఫలంబునకు నాధారంబన్నంబు కాఁబట్టి తద్వాచకంబైన పదంబు వంటకమనెడిశబ్దంబు. ఇచ్చట వంటకము ఫలాశ్రయమైనది. కాన, వంటకము గర్మమైనను 'వండఁబడియె' అనుక్రియచేఁ నాకాంక్షింపఁబడి యభిహితమై (తిఙ్ప్రత్యయం

బునేఁ జెప్పంబడినది) నదికాన బ్రథమాసూత్రప్రకార ముక్తార్థంబునందు సన్నవాచకంబైన వంటకమను శబ్దంబుకంటెఁ బ్రథమావిభక్తి కలిగెను.

4 సూ—చేతివర్ణకంబు హేతుకరణంబులకు గ్రాహ్యాదియోగజంబగుపంచమికిని బహుళంబుగానగు.

ఫలసాధనయోగ్యంబగుపదార్థంబు హేతువు ॥ క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు ॥ హేతువునకు - ధనముచేత సౌఖ్యంబుగలుగు - విద్యచేతయశంబుగలుగు - పక్షుంబునవలన వర్ణకంబగు - కరణంబునకు - ఖడ్గంబుచేతఖండించె - కోలచేతఁగూలనేసె - పక్షుంబునందోడవర్ణకంబగు ॥ గహ్యాదియోగంబునందు - జరాసంధుండు రాజులచేతఁగప్పంబుగొనియె - మైతుంరిందుచైత్రునిచేత ఋణంబుఁగొనియె - ఈయర్థంబును నీచేత నెఱింగితి — ఈవృత్తాంతంబువానిచేతవింటి - పక్షుంబునవలనవర్ణకంబగు ॥ ఇత్యాదికంబు లెఱుంగునది.

వ్యా—హేత్వర్థమందును, కరణార్థమందును, గ్రహించుట మొదలైనధాత్వర్థంబులతో సంబంధించు పంచమ్యర్థమందును, బహుళంబుగా ,చేత, అను ప్రత్యయంబు వచ్చును, (మూలము) ఫలసాధనయోగ్యంబగు పదార్థంబు హేతువు. వ్యా—ఫలమును సాధించుటకు దగినపదార్థంబు హేతువనంబడును. ఈహేతువు ద్రవ్యముతోడను, గుణముతోడను, అన్వయించునది. ఉ. ధనముచేత సౌఖ్యంబు గలుగు; విద్యచేత యశంబుగలుగు ప్రథమోదాహరణంబునందలి ,సౌఖ్యము, అనునది గుణమును తెలియఁజేయునదిగనుక గుణహేతువైన ధనంబును జెప్పుపదంబుకంటె ,చేత, వర్ణకంబు గలిగెను, ద్వితీయోదాహరణమ్మునందలి ,యశము, అనునది ద్రవ్యంబును దెలియఁ జేయునదిగనుక ద్రవ్యహేతువైనవిద్యను జెప్పునట్టి పదంబుకంటె ,చేత, వర్ణకంబుగలిగెను. వీనికి వికల్పంబుగ ,వలన, అనుప్రత్యయంబుకూడవచ్చును. ఉ. ధనమువలన సౌఖ్యంబు గలుగును. మొ. మఱియు గుణంబును, ఫలంబును హేతువగు. మూలంబులో ద్రవ్యము హేతువైనంతులకే యుదాహరణంబు లీఁబడెను. గుణఫలంబులు హేతువులుగా నున్నం

దులకు నుదాహరణమ్ములు — పుణ్యంబుచేత హరిచూడంబడియె. అధ్యయనంబుచేత నివసించెను. పైప్రథమోదాహరణంబునందలి పుణ్యము గుణము. ఇయ్యది హరిదర్శనంబునకు హేతువుకావున (చేత, వర్ణంబుగలిగె. ద్వితీయోదాహరణంబునందు నివాసమునకు ఫలంబు విద్యాభ్యయనంబుకావునఁ దద్వాచకపదంబుకంటె (చేత, వర్ణకంబుగలిగె

(మూలము) క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. వ్యా— క్రియసిద్ధించుటలో నతిశయంబుగనుపకరించునది కరణము. అనఁగాఁ గ్రియాసాధనంబు. ఉ. ఖడ్గంబుచేత ఖండించె; కోలచేతఁ గూలనేసె. మొదటిదానియందు ఖండించుటకు సాధనంబు ఖడ్గంబు గావున దానిం జెప్పునట్టిశబ్దంబుకంటె (చేత, వర్ణకంబుగలిగె. రెండవదానియందుఁ గూలనేయుటకు సాధనము కోలగానఁ దదర్థంబునందు (చేత, వర్ణంబుగలిగె. వీనికి వికల్పంబుగ (తోడ, వర్ణకంబునగు. ఉ. ఖడ్గముతోడ ఖండించె' మొ: గ్రహ్యాదియోగంబునకు- జరాసంధుఁడు రాజులచేతఁ గప్పంబుగొనియె: గొనియెననఁగా గ్రహించుట, ఇచ్చట గ్రహించుటతో రాజులన్వయించిరి కావునఁ దద్వాచకరాజశబ్దంబుకంటెఁ దృతీయ వచ్చెను. ఇట్లే ఎఱుంగుట, వినుట, తెలిసికొనుట, మొదలైనవానికి గ్రహింపవలెను. మైత్రుఁడు చైత్రునిచేత బుణంబుగొనియె; ఈయర్థంబును నీచేతనెఱింగితి; ఈవృత్తాంతంబు వానిచేత వింటి. మొ. వీనికి వికల్పంబుగ (వలన, అనుప్రత్యయంబుగలుగును ఉ. జరాసంధుఁడు రాజులవలనఁ గప్పంబుగొనియె. ఇత్యాదికముగాఁ దక్కుఁగలయుదాహరణంబులు గ్రహించునది. కొన్నియెడలఁ జేతవర్ణకార్థకప్రత్యయంబులకును, వలనవర్ణకంబునకును (చేసి, అనుక్త్వాంతంబనుప్రయుక్తంబగు. ఉ॥ కాదనకిట్టిపాటియుపకారముఁ దత్కుఁడేకవిప్రసం | బోధనఁ (జేసి జేసె. భార- ఆది-1 ఆ. చ॥ మజ్జనకు బరీక్షితుఁ భుజగజాల్మఁ డసహ్యవిషోగ్రధూమకే ॥ తనహతిఁ జేసి చేసెనతిదాంతుఁ గృతాంతనికేతనాతిథిన్, భార-ఆది-1ఆ. చ॥ ప్రీతినేగుదెంచిరి బహువేదఘోషములఁ జేసి నిరస్తసమస్తకిల్బిషు ! తక్కురులసుమన్న ధన్యులు, భార-అర- 1ఆ. ఇత్యాదిప్రయోగంబులు పెక్కులు గలవు. చేతవర్ణకార్థకప్రత్యయాంతంబులు పెక్కులు సముచ్చయంబుగా నున్నయప్పుడు వానిలో నంతిమపదంబునకు (చేసి, అను ప్రయుక్తంబగు. సీ॥ నలరాజు సచివులనమ్మున బెడఁగగు శర్కశస్త్రముల గరమువాఁడి | చూడ్కులనతిరాగ సురుచిరాధరముల మదవిలాసాలసమందగతుల | వక్రాలకంబుల వలుద పిఱుందుల దర్పగద్గదభాషితములఁ జేసి, భార-ఆది- 3ఆ. ఇట్లేఁ జేతవర్ణకార్థకలవర్ణకంబుపై

శల్ల యొడలనుండవలసిన (జేసి, యొక్క-చోటుననే యున్నయది తోడ, అనుదానికి స్వతంత్ర ప్రయోగంబును గొండొకచోఁ గానంబడియెడి. తే॥ గీ॥ స్తంభగతరత్నపుత్రి కలవదు బోటి! యనివిలోకించి తోడమాటాడకునికి! నలుగడలు చూచి తెలిసి యచ్చెలువ దేరి! వెడలనుంకింపఁ జేఁదమ్మి యొడిసిపట్టె' రామా - 4 ఆ. ఇచ్చోఁ దోడననఁ దనతోడనని గ్రహింపుడి. కొన్ని ప్రతులయందు 'వెడల నూహింప' అను పాఠముంగలదుగాని పైపాఠమే సందర్భశుద్ధిగ నున్నయది. ఒకానొకచో సముచ్చయార్థకశబ్దంబుతో నన్వయంబుగలుగునప్పుడు 'తోడ' కులోపంబును, వ్యవధానంబును, బహువచనంబును గానంబడియెడి. ఆ॥ వె॥ అమపురికిఁ జనినతనికిఁ బరలోక | విధులశాస్త్రదృష్టి వెలయఁ జేసి| నాపగాతనూజుఁడఖిలబాంధవులయు | బ్రాహ్మణులయుఁ దోడ భానునిభుఁడు' భార-ఆది-4ఆ. క॥ నెమ్మినిధర్మజ్ఞానులువురు | దమ్ములు దమశస్త్రములతోఁ దను శస్త్రపరిగ్రహములతోడను సకలహి| తమ్ములఁ బాటింగవలయు దాస్యములనకా, భార-సభా-2ఆ. 'అఖిలబాంధవులయు' అనుచోటునఁ దోడకులోపంబుగలిగె 'బ్రాహ్మణులయుఁదోడ' అనులక్ష్యంబునఁ దోడవర్ణకంబునకును, దానియాగమంబగు లడాగమంబునకును సముచ్చయార్థకయుశబ్దంబు వ్యవధానంబుగలిగించె. ఇత్యాదులూహింపునది. ఒకానొకచోఁ దోడకుఁ దోడుతనను రూపాంతరం బుపయోగింపఁబడును. తే॥గీ॥ కౌరవాన్వయజాతులై గారవమునఁ| జెరిగెనట్టి మీరొండొకనరుని గొలిచి ! మసలి వర్తిల్లి యీ వావాయాసమాలకు| నోర్చి యడఁకువతోడుతననికి యరిది' భార - విరా- 1 ఆ. చ॥ పగతురచేతిలోఁ బడక ప్రాణముతోడుత నున్నవాఁడవే' భాగ 10 - స్కం. పూ. జడార్థకపదంబుమీఁది 'తోడ' వర్ణకంబునకు, బాక్షికంబుగ 'మెయి, మై, లాదేశంబగు. ఉ॥ అందఱుఁగూడి పోసలకునర్థి మెయింజనుదెంచి సర్వ- 2ఆ. చ॥ ఏ| గృహ నొనరించుచో నుచితభక్తిమెయి న్గురు సేవసేయుకై | వశివడినాలకించుఁ బలవాంఛఁ బరాకగుఁ గొంతవింతగన్, కావ్యా-3ఆ. చ॥ ముక్తికు | న్మఖితపహింపఁ గావలయు మోహముఁబాయఁగఁ ద్రోచిభక్తిమై, లక్ష్మ్-4ఆ. సీ॥ ఓర్పుమై మెప్పించెడి యుపవాసవ్రత డనీమగవాలిపరిఁబోల్పఁదగుదువిభవ, కాశీ - 2ఆ. కొన్ని ప్రతులయందు (ఓర్పుమైనుప్పిడియుపవాసములనుండి,అనియుంగలదు. (ఉప్పు + ఇఁడి) ఇచ్చట (ఇఁడి, ప్రత్యయంబు భావార్థకంబు. (చూ-తద్ధిత-24సూ) (ఉప్పిఁడి, అనునపుడు సంజ్ఞాపరిచ్ఛేదంబునందలి

పదునాల్గవసూత్రిఁబునంజేసి నెఁసున్నగగ్గి ఁఉప్పిండి, అనురూపంబుననయ్యె. ఇఁడి, ఎఁడు, ఇత్యాదిప్రత్యయంబులు తొలిహ్రస్వంబుమీఁద నఱసున్నగలవైనను బదంబులు కావు గావున సంధిపరిచ్ఛేదమునందలి యిరువదిరెండవసూత్రంబులోని పరిగణనకు విరోధంబు లేదని యెఱుంగునది. (చూ-సంధి 22సూ)

5 సూ — కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకంబగు.

కరణంబునందు — కోలతోడఁ గూలనేసె ॥ సహార్థంబునందు-రాజు సేనలతోడవచ్చె - సేనాసహితుండయి వచ్చెననియర్థము ॥ తుల్యార్థయోగంబునందు - చైత్రునితోడ మైత్రుండు తుల్యుఁడు - తృతీయకనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియునగు.

వ్యా—కరణంబునందును, సాహచర్యార్థంబునందును, ఉపమానార్థమందును, తృతీయకుఁ దోడవర్ణకంబుకల్గు. కరణంబునందు—కోలతోడఁగూలనేసె. ఇచ్చటఁగూలనేయుటయను క్రియకు విశేషసాధనమ్ము బాణమ్ముగావునఁ గోలశబ్దంబుకంటెఁదోడవర్ణకంబుగలిగె. సహార్థంబునందు—రాజు సేనలతోడవచ్చె, ఇచ్చట సేనాసహితుండని యర్థంబు కావున సేనశబ్దంబుకంటెఁ దోడవర్ణకంబు. తుల్యార్థయోగంబునందు—చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు. ఇచ్చట సామ్యంబును దెలియఁజేయుచున్నది. కాఁబట్టి యుపమానార్థకశబ్దంబుకంటెఁ దోడవర్ణకంబు. (మూలము) తృతీయకనుటం జేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబునషష్ఠియునగు వ్యా—మూలసూత్రంబునయందుఁ దృతీయకుఁ దోడవర్ణకంబని చెప్పుటవలనఁ దృతీయావిభక్తి వివక్షింపఁబడునపుడే తోడవర్ణకంబు వచ్చునుగాని షష్ఠివివక్షింపఁబడునప్పుడు తోడవర్ణకంబు షష్ఠికి నాదేశంబుగాదని భావము.

6 సూ—వచ్యర్థా-ముఖ్యకర్మంబు కు. దోడకువర్ణకంబులు ప్రాయికంబుగానగు.

మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె - మైత్రుండు చైత్రునకిట్లనియె - ప్రాయికంబనుటచే నొకానొకచో ద్వితీయయునగు.

వ్యా—అను, పలుకు మొదలగునవి వచ్యర్థకంబులు. వీనిలో నముఖ్యకర్మంబునకు 'తోడ, కు, అను ప్రత్యయములు తఱచుగాఁగలుగును. అనఁగా 'అను, ఇత్యాది ధాతువులు ప్రయోగించునప్పుడు ముఖ్యకర్మమనియు, నముఖ్యకర్మమనియుఁగర్మంబులు రెండుండు నేశబ్దంబుపై ద్వితీయయేకాని తక్కుంగలవిభక్తులు సందర్భింపవో యయ్యది ముఖ్యకర్మార్థకంబు. ఏశబ్దంబుపై ద్వితీయయేకాకతృతీయాషష్ఠీవిభక్తులు సందర్భవశంబున నుంపఁదగునో యవిముఖ్యకర్మార్థకంబులు. అముఖ్యకర్మంబునకు గౌణ (అప్రధానము) కర్మంబనియు వ్యవహారంబుగలదు. ఇట్టి యముఖ్యకర్మంబునకుఁదోడ,కువర్ణకంబులువచ్చును. ఉ. మైత్రుండు చైత్రునితోడనిట్లనియె. ఇచ్చట సంధి విరహంబున 'చైత్రునితోడన్ + ఇట్లు + అనియె, అనికలదు ఇచ్చట 'అనియె, అనునది వచ్యర్థక ధాతువు 'ఇట్లు , (ఈప్రకారమైనవాక్యము) అనునది ముఖ్యకర్మంబు. 'చైత్రునితోడన్, అనునది యముఖ్యకర్మంబు, అట్టి యముఖ్యకర్మంబునకుఁ దోడ కువర్ణకంబులు గలుగును గావున "మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె; మైత్రుండు చైత్రునకిట్లనియె" అని రూపద్వయంబు మూలంబునఁ బ్రాయికంబనుటచే నొకానొకచో ద్వితీయావిభక్తియుఁ గలుగును. కావుననే "మైత్రుండు చైత్రునిట్లనియె" ఇత్యాదిప్రయోగంబులు సాధువులు తే॥ గీ॥ శాంతస్వాంతు । జరభ్రుకుంతీసుతాగ్రణిసంయమీంద్రుఁ బ్రిగికెనిట్లని వినయసంపదలువోలఁడు" హరిశ్చంద్రోపాఖ్యానము. ఇచ్చట "పలుకు" అనునది వచ్యర్థకధాతువు గావున నముఖ్యకర్మమైన సంయమీంద్రుని జెప్పునట్టిపదంబుకంటె ద్వితీయకలిగెను. సంయమీంద్రుననఁగా సంయమీంద్రునితోడ నని యర్థము.

7 సూ—ఉ. యోగంబువం దాఖ్యాతకుం దోడవర్ణకంబగు.

నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగంబనంబడు ॥ రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులం జదివిరి - సాందీపునివలన నని యర్థము.

వ్యా—ఉపయోగంబునందు, ఆఖ్యాతకుఁ దోడ, ప్రత్యయంబు కలుగును. (మూలము) నియమపూర్వకవిద్యాస్వీకారంబుపయోగమనంబడును. వ్యా—శ్రద్ధాపూర్వకంబుగా విద్యను గ్రహించుట యుపయోగమనఁబడును. నియమంబున గురువుచ్చరించిన దానిని దబ్బిబ్బులులేకుంట శిష్యుండుచ్చరించుట, గ్రహించుట మొదలైనవి. ఆఖ్యాత యనఁగా బోధకుఁడు ఉ. రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులం జదివిరి. ఇచ్చోట సాందీపుఁడు బోధకుండుగావునఁ దద్వాచకపదంబుకంటెఁ దోడవర్ణకంబు గలిగెను. సాందీపునితోడ ననఁగా సాందీపునివలనని యర్థము. సహార్థము వివక్షింపఁబడునప్పుడు బూర్వోక్తంబైన తోడవర్ణకంబునగును. ఉ. రాముఁడు కృష్ణునితోఁ జదివె. ఇచ్చట బలరాముఁడు కృష్ణునకు సహాధ్యాయియని యర్థము. ఇట్టియర్థభేదంబులు ప్రకరణసందర్భంబున గ్రహించుకొనునది.

8 సూ—సంప్రదానంబునకుం జతుర్థియగు.

త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబనంబడు ॥ జనకుండు రాముని కొఱకుఁ గన్యనిచ్చెను ॥ కొన్నియెడలనుద్దేశ్యమాత్రంబున కగు - పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు॥ చతుర్థికిని మాఱుగా షష్ఠియు తఱుచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి - జనకుండు రామునకుం గన్యనిచ్చెను ॥ పురుషార్థంబునకు యత్నింపవలయు.

వ్యా—సంప్రదానమునకుఁ జతుర్థీవిభక్తియగును. (మూలము) త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబనంబడు. వ్యా—త్యాగంబునకు నుద్దేశింపఁబడిన పదార్థంబు సంప్రదానంబనంబడును. ఉ. జనకుండు రామునికొఱకుఁ గన్యనిచ్చెను. ఇచ్చట కన్యాదానంబు విధేయము. కన్యాదానంబున కుద్దేశింపఁబడినవాఁడు రాముఁడు; కావున నుద్దేశ్యవాచకమైన రామశబ్దంబుకంటెఁ జతుర్థి (కొఱకు) యయ్యె. కొన్నియెడలఁ ద్యాగంబునకుఁ నుద్దేశింపఁబడినదే సంప్రదానంబుకాక త్యాగంబు లేకున్నను నుద్దేశింపఁబడినంతమాత్రంబుననే సంప్రదానసంజ్ఞ కలిగి తద్వాచకశబ్దంబుకంటెఁ జతుర్థియగును. ఉ. పురుషార్థంబుకొఱకు యత్నింపవలయును' [illegible] బురుషార్థముద్దేశింపఁబడి

జుగుప్సకు - పాపంబువలన నేవగించె ॥ పరాజయమునకు - అధ్యయనమువలనడస్సె॥ ప్రమాదంబునకు - పాడివలనం బరాకుపడియె ॥ గ్రహణంబునకు - మనువువలనంబ్రజలుపుట్టిరి ॥ త్రాణంబునకు - చోరునివలనంగాచె॥ విరామంబునకు భోగంబులవలనవిరమించె ॥ అంతర్ధికి - కృష్ణుండుతల్లివలనదాఁగె॥ వారణంబునకు - శోకంబువలనవారించె ॥ ఈపంచమికి షష్ఠియుంగొండొకయెడలనగు - చోరునకువెఱచె పాపంబున కేవగించె - అధ్యయంబునకుడస్సె - పాడికింబరాకువడియె - మనువునకు నిత్యాదులూహించునది.

వ్యా—అపాయము, (విశ్లేషము = ఎడఁబాటు) భయము, (వెఱపు) జుగుప్స (ఏవగించుట = నింద) పరాజయము, (డయ్యుట = (డస్సుట) ప్రమాదము, (పరాకు) గ్రహణము, (కొనుట, గ్రహించుట, తెలియుట, ఎఱుంగుట, వినుటమొదలైనవి) భవనము, (పుట్టుట) త్రాణము' (కాచుట) విరామము, (విరమించుట=ఊడుగుట) అంతర్ధి (మఱుగుట=దాఁగుట) వారణము,(నివారణము) ఇయ్యాభిదేనివలనఁ గలుగునో యావస్తువును జెప్పునట్టిశబ్దంబునకు వలనవర్ణకంబగు. అపాయంబునకు-మైత్రుండు రాజ్యంబువలనభ్రష్టుండయ్యె. ఈవాక్యంబునందు "భ్రష్టుఁడయ్యెను" అనఁగా నెడఁబాసినాఁడని యర్థము. రాజ్యంబునుండి యెడఁబాటు కలిగినందున నట్టియెడఁబాటునకు నవధి (మేర) భూతమైన రాజ్యంబును బోధించునట్టి రాజ్యపదంబుకంటె వలనవర్ణకంబుగలిగినది. భయంబునకు — చోరునివలనభయపడియె. ఇచ్చోట భయంబునకు నవధి (మేర)యైన చోరునిదెలుపునట్టి చోరశబ్దంబుకంటె వలనవర్ణకంబుగలిగినది. ఈసూత్రంబువలన భీత్యాదులైనయర్థంబులతో యోగంబునఁబంచమియే విధింపఁబడినందున ,చోరభీతి, ఇత్యాదిసమాసంబులయందుఁ బంచమీతత్పురుషంబే తప్పక జెప్పుకొనవలయును. షష్ఠీతత్పురుషాదు లశాస్త్రీయంబులు. షష్ఠీతత్పురుషంబు చెప్పికొనినచోఁ జోరుండేభయంపడినయట్టు లర్థమిచ్చును. అట్టియర్థంబునకు శాస్త్రవ్యవహారంబుల రెంటింటివలనను, శీఘ్రస్ఫురణంబు కలుగనేరదు. కావుననే సమాసపరిచ్ఛేదంబునందలి తృతీయాసూత్రం

40 సూ—ఉండిపదం బాకానోకచో వలన వర్ణకంబునకనుప్రయుక్తంబగు.

హిమగిరివలననుండి గంగవొడమె - నాకంబువలననుండి నారదుండువచ్చె.

వ్యా—"ఉండి అనుక్త్వార్థకావ్యయంబు పంచమీవిభక్త్యర్థంబునుస్ఫుటపఱచుచు సహాయమైనవలన వర్ణకంబును వెంబడించునని యర్థము. ఉ. హిమగిరివలననుండి గంగవొడమె. ఇట హేత్వర్థంబునందు వలనవర్ణకంబు విధింపఁబడియెను. గంగయుత్పత్తికి హిమవత్పర్వతము హేతువన్న యర్థంబును స్ఫుటపఱచుటకై వలన వర్ణకంబునకు 'ఉండి' అనుక్త్వార్థకావ్యయంబు జతపఱుపఁబడినది. 'నాకంబువలననుండి నారదుండు వచ్చెను. ఇచ్చట నారదుఁడు నాకంబునువిడిచివచ్చెనని ఫలితార్థము. నారదుని రాకడ బాటునకు స్వర్గమవధి (మేర) యైనదికావున నట్టియర్థమందు వలనవర్ణకంబు విధింపఁబడఁగాఁ దాదృశార్థంబును స్పష్టపఱచునిమిత్తము 'ఉండి' పదంబు వలనవర్ణకంబునకు జోడింపఁబడియె కాఁబట్టి 'ఉండి' అనుదానికిని వసియించియున్నయర్థంబిట్టిచోటుల నెప్పుడును లేదని యెఱుంగునది:

11 సూ—ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగనగు.

వనమునుండివచ్చె - వనమందుండివచ్చె - ఊరినుండివచ్చె - ఊరనుండివచ్చె ॥ వనమునుంచి ధనమునుంచి యనియుంచి శబ్దానుప్రయోగంబులోఁ గొందఱు వ్యవహరించెదరుగానియది సాధుకవిప్రయోగారూఢంబుగాదని యెఱుంగునది.

నితరంబునదోషంబులేదు - ఇచటషష్ఠియునగు .. రామునకన్యుండు ధాను ష్కుండులేడు - అన్యము - ఇతరము - పూర్వము - పరము - ఉత్తరము - ఇత్యాదులన్యాదులు.

వ్యా—అన్యము మొదలైన యర్థములతో సంబంధించున్నయప్పుడు పంచకిమి ,కంటె, వర్ణకంబగు. ఉ. రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేడు ఇచట నన్యార్థముపయోగింపఁబడినది. కావున రామశబ్దంబుమీఁద ,కంటె, వర్ణకంబువచ్చెను. ,లోభంబుకంటె నితరంబు దోషంబులేదు, ఇచ్చటఁ గూడనితరశబ్దంబన్యార్థకంబే కావున ,కంటె, వర్ణకంబయ్యె. ఇచ్చట షష్ఠియునగును. ఉ. రామున కన్యుండు ధానుష్కుండులేఁడు. లోభంబునకు నితరంబు దోషంబులేదు, అనఁగా రామునికంటె నన్యుండనియు. లోభంబుకంటె నిరతంబనియు, షష్ఠికి బంచ్యర్థంబు చెప్పికొనవలయును ,అన్యము, పూర్వము, పరము, ఉత్తరము, దక్షిణము, దూరము, సమీపము, ఇత్యాదు లన్యాదులు. ,వెలి, పెఱ, దవ్వు, దగ్గఱ, తూర్పు, పడమర, ఇత్యాదులన్యాద్యర్థకంబులు కావున నిట్టి పర్యాయపదప్రయోగంబునయందుఁ బంచమికిఁ గంటె వర్ణకంబగును.

13—సూ. కంటెవర్ణకంబునిర్ధారణ పంచమికగు.

ఎచ్చటనిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబుకలిగియుండు నచటంబంచమియగు - ఆపంచమికింగంటె వర్ణకంబగుననియర్థము - జానపదులకంటె నాగరులువివేకులు - మానహానికంటె మరణముమేలు.

వ్యా—ఒకానొకచోటువచేతనొక పదార్థంబుకంటె వేఱొకవానికిఁ బృథక్కరణంబు (వేఱుచేయుట) తోఁచునప్పుడవధి వాచకశబ్దంబుమీఁద ,కంటె, వర్ణకంబగునని పర్యవసానార్థము. (మూలము) ఎచ్చటనిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబె కలిగియుండు నచటంబంచమియగు. వ్యా— ఎచ్చోటను (ఏవాక్యమునందు) బృథక్కృ-చేయఁబడుచున్నపదార్థము (వేఱుచేయఁబడుచున్నది) జాతిగుణక్రియలచేఁ దారతమ్యముకలిగి యుండునో యచ్చట (ఆవాక్యమునందు) నవధి (మేరను) బోధించు శబ్దంబు

కంటెఁ బంచమియగు. అట్టిపంచమికిఁ గంటెనర్థకంబగునని యర్థంబు ఉ: జానపదుల కంటె నాగరులు వివేకులు. జానపదులు = పల్లెయందుండువారు. నాగరులు = నగర నివాసులు. కుత్సితత్వంబును. ప్రావీణ్యంబును, తోఁచుచున్నప్పుడు నాగరకులనఁబడు దురు. చోరశిల్పకులు నాగరకులు. నాగరులనఁగా బురనివాసులనియె తోఁచునుగాని కుత్సితత్వప్రావీణ్యంబులు వివక్షితములు కావు. కొందఱాధునికకవులు గ్రంథంబుల యందు నాగరికులని యికారాంతరేఫఘటితంబుగ వాడుచున్నారు. శబ్దరత్నాకరాది నిఘంటువులయందును నట్లే యున్నది. అయ్యది ప్రామాదికంబు. నాగరకులనే యకా రాంతరేఫంబుతో నుండవలయును. పైయుదాహరణంబునందు నాగరత్వ జానపదత్వ ధర్మంబులొండొరులతో నంతర్భూతంబులు గాకుండ నత్యంతభిన్నంబులు. అట్టిభేదం బిచ్చట స్పష్టంబగుచున్నది కావున నిర్ధారణకు నవధిభూతులైనజానపదులను బోధించు నట్టి జానపదశబ్దంబుమీఁద కంటె, యర్థకంబు గలిగెను సామాన్యవిశేష ధర్మంబులుండి పృథక్కరణంబున్నచోటునఁ బంచమ్యుపసూత్రంబుచేనిర్ధారణషష్ఠి వచ్చునని యెఱుంగునది. మానహానికంటె మరణము మేలు' ఇచ్చట మానహానిమరణ క్రియలన్యోన్యము నంతర్భూతంబులుకాక యత్యంతభేదవంతంబులు. కావున నిర్ధా రణంబునకు నవధియైనమానహానిని బోధించునట్టి మానహానిశబ్దంబుమీఁద కంటె. యర్థకంబాయె.

14—సూ. పట్టివర్ణకంబు హేతువులగు గుణక్రియలకగు.

జ్ఞానముఁబట్టిముక్తుఁడగు - నీవువచ్చుటంబట్టిధన్యుఁడ నయితి - ఇచటవలననర్థకంబునగు - జ్ఞానమువలనముక్తుండగు.

వ్యా—పట్టి, అనుపంచమీవిభక్తి కారణంబులగు గుణంబులకును, క్రియలకును, గలుగును, గుణమునకు—ఉ. జ్ఞానముంబట్టి ముక్తుండగు. ఇచ్చటను ముక్తుండగుటకు హేతువు జ్ఞానంబు. జ్ఞానంబనునది గుణంబు కావున దీనికంటె పట్టి, విభక్తి వచ్చెను. క్రియకు— ఉ. నీవు వచ్చుటంబట్టి ధన్యుండనైతి. ఇచట ధన్యుండు కావుటకు వచ్చుట యనుక్రియ హేతువయ్యెంగావునఁ దద్వాచకశబ్దంబుకంటె పట్టి, వర్ణకం బాయె. ఇచట వలనవర్ణకంబునువగు. ఉ. జ్ఞానమువలన ముక్తుండగు.

15—సూ. శేషషష్ఠికి యొక్క యునగు.

ఇచట శేషంబనఁగా సంబంధంబు - రామునియొక్క గుణములు నాయొక్క మిత్రుడు - వానియొక్క తమ్ముఁడు - కువర్ణకంబును గొన్ని యెడల సంబంధంబునందగు నాకుందమ్ముడు - మీకునెచ్చెలి.

వ్యా—శేషంబనఁగాఁ
కర్మకరణాదులు చెప్పంబడె తత్తదర్థములయందుఁ బ్రథమాద్వితీయా తృతీయావిభక్త్యాదులు విధింపఁబడినవి. అట్టియర్థంబులకంటె మిగిలినదియని తాత్పర్యంబు. అనగా స్వస్వామిభావము (సేవకత్వంబును, స్వామిత్వంబును) గుణగుణిభావమును, మొదలైనవి. అట్టిసంబంధంబులు దెలియఁజేయును షష్ఠీవిభక్తియగును. ఉ. రామునియొక్క గుణములు. గుణములు గుణియందు గుణగుణిసంబంధము (నిత్యసంబంధము) చేత నుండును. కాఁబట్టి రామునియొక్క గుణములన్న వాక్యంబున శేషషష్ఠియయిన యొక్క విభక్తిచే సమవాయసంబంధము తెలియఁజేయఁబడుచున్నది. రామసమవేతము (నిత్యసంబద్ధము) లైనగుణములని యర్థము ఇట్లే నాయొక్క మిత్రుఁడు - వానియొక్క తమ్ముఁడు, మొదలైనచోటులందు షష్ఠ్యర్థంబులు స్వస్వామిభావాపత్యజనకాది సంబంధంబులు సందర్భవశంబున నూహించుకొనునది. కువర్ణకంబుగూడ గొన్నియెడలఁ గారకషష్ఠియందేకాక (రామునికిచ్చె నిత్యాదులయందుఁ గ్రియాన్వయముగల షష్ఠియందేకాక) సంబంధార్థంబునందు నయుక్తము వచ్చును. ఉ. నాకుందమ్ముఁడు మీకునెచ్చెలి, మొదలైనవి.

16—సూ. నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకంబగు.

జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణంబనంబడు - ఎద్దానివలన నిర్ధారణంబగు నచ్చోటి షష్ఠికి లోపల వర్ణకంబగునని యర్థము. మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు - గోవులలోపలఁ గపిల బహుక్షీర - అశ్వములలోపల

పాఱువాఁడు శీఘ్రగామి - ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు॥ ఇచట సప్తమియుంగలదు - మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు- ఇత్యాదులెఱుంగునది.

వ్యా—నిర్ధారణంబైన షష్ఠీవిభక్తికి, లోపల, అనుప్రత్యయంబువచ్చును. (మూలము) జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుఁ బృథక్కరణంబు నిర్ధారణం బనంబడును (వ్యా) జాతిచేతను, గుణంబుచేతను, క్రియచేతను, సంజ్ఞచేతను, సముదాయమునుండి (విశిష్టమునుండి) యేకదేశంబునకు, (అంతర్భూతమైన వస్తువునకు) వేఱుచేయుట నిర్ధారణమనంబడును. పైచెప్పిన జాత్యాదుల నాలుగింటిలో నొక్కొకటిం బురస్కరించుకొని యెద్దానివలన (యేవస్తువు నవధిగా నెంచుకొని) నిర్ధారణంబగునో యట్టియవధిని దెలియఁజేయు శబ్దంబుయొక్క షష్ఠికి లోపలవర్ణకంబగునని యర్థము. జాతికి— మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు. మనుష్యత్వము విశిష్టధర్మము. (సామాన్య ధర్మము) క్షత్రియత్వము మనుష్యత్వధర్మంబులో నేకదేశ ధర్మము. అనఁగా నంతర్భూతమైన విశేషధర్మము, మనుష్యత్వరూపమైన సామాన్య ధర్మంబుతో విశిష్టులైన మనుష్యులనుండి క్షత్రియత్వరూపవిశేషధర్మంబును బురస్కరించుకొని క్షత్రియుండు వేఱుచేయఁబడినందున నిర్ధారణావధిభూతులైన మనుష్యులను దెలియఁజేయునట్టి మనుష్యశబ్దంబునకు షష్ఠీవిభక్తియైన లోపలవర్ణకంబుగలిగె. క్షత్రియత్వము జాతికావున నియ్యది జాతికుదాహరణంబు. గుణమునకు- గోవులలోపలఁ గపిలబహుక్షీర. ఇచ్చటఁ గపిలయనఁగాఁ గపిలవర్ణంబుగల యావు. గపిల వర్ణంబుగల యావు గోత్వవిశిష్టంబైన గోజాతినుండి విడదీయఁ బడినందున నవధివాచకమైన గోవుశబ్దంబునకుంబై లోపలవర్ణకంబుగలిగె. ఇయ్యది కపిలత్వగుణముచే వేఱుచేయఁ బడినది. క్రియకు-అశ్వగులలోపలం బాఱువాఁడు శీఘ్రగామి ఇచ్చోటఁ బాఱువాఁడనఁగాఁ బరుగిడువాఁడు. ఈయది క్రియ కావునఁ గ్రియచే వేఱుచేయఁబడెను. అవధివాచకమైన యశ్వగశబ్దంబునకుంబై లోపలవర్ణకంబయ్యె. సంజ్ఞకు - ఛాత్రులలోపల మైత్రుఁడు సమర్థుండు. ఇట మైత్రుండనునది సంజ్ఞ, ఛాత్రులలో నొకండు. ఛాత్రత్వము సామాన్యధర్మంబును, మైత్రత్వంబు విశేషధర్మంబునని యెఱుంగునది. సామాన్యంబునుండి విశేషంబు గ్రహింపఁబడినందున నవధియైన శిష్యులను బోధింప

శబ్దంబుకంటె లోపలవర్ణకంబుగలిగె. పదుమూఁడవసూత్రంబులోను, ప్రకృతసూత్రంబులోను, నిర్ధారణంబు సమానంబైనను నిర్ధార పంచమివచ్చుటను సామాన్యవిశేషభావస్ఫురణలేమి కావునఁ గంటె వర్ణకంబునకే కాని 'లోపల' వర్ణకంబునకుఁ బ్రసక్తి లేదని యెఱుంగునది. ఇచట సప్తమీవిభక్తియుం గలదు. ఉ. మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు. ఇట్టి యుదాహరణములకు నిట్టె పంచమీవిభక్తి గ్రహింపవలెను.

17—సూ. అధికరణంబునకు సప్తమి యగు.

అధికరణంబు నా నాధారంబు ॥ ఔపశ్లేషికంబు వైషయికంబ భివ్యాపకంబని యాధారంబు త్రివిధంబు ॥ ఘటమందు జలమున్నది - మోక్షమందిచ్ఛ గలదు - అన్నింటియందీశ్వరుండు గలండు.

వ్యా—అధికరణార్థమందు సప్తమీవిభక్తి ప్రత్యయంబయిన 'అందు' అనునది కలుగును. (మూ-వ్యా) అధికరణంబన నాధారంబు (ఆశ్రయము) ఆధారము—'ఔపశ్లేషికము, వైషయికంబు, అభివ్యాపకంబు' అని త్రివిధంబులు. ఔపశ్లేషికంబనఁగా సంయోగ (కూడిక) సంబంధంబుతో నున్నది. దీనికి వ్యుత్పత్తి; శ్లేషంబునకు (సంబంధంబునకు) సమీపము ఉపశ్లేషంబు. తత్కృతంబౌపశ్లేషికంబు. వైషయికంబనఁగా విషయతా సంబంధంబు ప్రయోజనంబుగాఁ గలది. విషయంబులనఁ బదార్థంబులు. విషయిభూతంబులు జ్ఞానేచ్ఛాకృతులు (ప్రయత్నము) ఇయ్యవి పదార్థంబులయందు విషయతా సంబంధంబుతో సంబంధించును. అభివ్యాపకంబనఁగా నేవస్తువు సర్వపదార్థంబును నాధారంబుగఁ జేకొని వ్యాపించియుండునో యావస్తువుయొక్క యాధారంబు ఔపశ్లేషికంబునకు—ఘటమందు జలమున్నది. ఇచట జలము సంయోగసంబంధంబుచే ఘటంబును నాధారంబుగాఁ జేసికొనియున్నయది కావున నౌపశ్లేషికాధారమున కుదాహరణము. 'చాపయందు మనుష్యుండు కూర్చుండె' అను వాక్యంబులోఁ జాపలో నేకదేశంబందు మనుష్యుఁడు కూర్చున్నందున మనుష్యునకుఁ జాప యావత్తును నాధారంబుగాక యేకదేశంబే యాధారంబైనను నట్టియేకదేశసంబంధంబునకు మిగిలిన చాపసమీపస్థంబగుటచేఁ జాపయంతయు నాధారంబుగ భావింపఁబడి చాపశబ్దంబుపై సప్తమీవిభక్తి వ్యవహరింపఁబడుచున్నది. ఇట్లు ఘటంబున స్వల్పజలంబుండి తక్కిన యధికభాగము శూన్యంబుగా నున్నను జలసంబంధ [illegible] తక్కిన ఘ

భాగము సమీపస్థంబగుటచే యావత్తు ఘటంబును నాధారంబుగ నెంచం బడి లోకంబులో సప్తమీవిభక్తి వాడఁబడుచున్నది. కావున నౌపశ్లేషిక (ఏకదేశసంబంధ సామీప్యముచే నెన్నంబడిన విశిష్టాధారము) శబ్దంబనర్థసంజ్ఞ గలది యయ్యెను. వైషయికంబునకు—మోక్షమందిచ్ఛగలదు. ఇచ్చట నిచ్ఛ సవిషయకపదార్థంబుగావున మోక్షంబును విషయతా సంబంధంబుచే నాధారంబుగాఁ జేసికొనియె. ఆధారవాచకమైన మోక్షశబ్దంబుకంటె సప్తమీవిభక్తి కలిగినది. అభివ్యాపకంబునకు- అన్నింటియం దీశ్వరుండు గలఁడు. ఇచట సర్వపదార్థంబులను వ్యాపించి యీశ్వరుండు న్నందున నభివ్యాపకాధారంబును దెలియఁ జేయు ఁనన్ని, శబ్దంబుకంటె సప్తమీవిభక్తి కలిగినది.

18—సూ. ఉకారాంతజడంబునకు నవర్ణకంబగు.

ఘటంబున జలంబున్నది. దేవదత్తునకు మోక్షమునఁ నిచ్ఛగలదు.

వ్యా—ఉకారంబంతమందుఁగల జడవాచకశబ్దంబునకు ఁన' వర్ణకంబువచ్చును. ఉ. ఘటంబునజలంబున్నది. ఇచ్చట ఘటంబుశబ్దం బుకారంబంతమందుఁగలజడవాచకంబు (జ్ఞానహీనమైనవస్తువు) గావున ఁన, అనుసప్తమివచ్చెను. ఉ. దేవదత్తునకు మోక్షమున నిచ్ఛగలదు. ఇట మోక్షమను శబ్దంబుకారాంతజడవాచకంబుగావున దీనికంటె నవర్ణకంబుగలిగె. మూలసూత్రంబున ఁజడంబునకు నర్ణకంబని, విధింపఁబడినది. జడపదార్థంబుకంటె నశబ్దంబుండుట యసందర్భము గావున జడవాచకశబ్దంబునకని లక్ష్యార్థంబూహించుకోవలయును.

19—సూ. విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబులగు.

నందతనయుండు కృష్ణుండునాకుదిక్కు - దేవకీపుత్రుహరిని నుతింతునెపుడు - శుభవిధాయులరామకృష్ణులభజింతు - భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు.

మాటలు పెక్కేల - మాటలుపెక్కులేల - కులిశధారల్కుంతితంబులయ్యె - ఇష్టమగుపదార్థములు - ఇష్టములగు పదార్థములు.

వ్యా — స్త్రీసమంబులగు విశేషణంబుల యొక్కయు, మువర్ణకంబు కడపటఁగల విశేషణంబుల యొక్కయు, బహువచనంబునకు నేకవచనంబు బహుళంబుగనగు: స్త్రీసమంబులనఁ బ్రథమైకవచనలోపంబుగలవి. ఈసూత్రంబునందు స్త్రీసమంబులును, మువర్ణకాంతంబులును, జడవిశేషణంబులే గ్రహింపవలెను. ఇందులకుఁ బ్రమాణములు.

క॥ తెలుఁగునఁ బ్రాణిపదంబులు। వెలిగా బహువచనమునకు విస్పష్టముగా। నిలుచును విశేషణంబై। పొలుపొందఁగ నేకవచనము ముఖ్యస్వంసీ, సర్వల—క్రియా ప్ర 31 ల.

క॥ జడపదబహువచనములకు । నిడఁదగును విశేషణముల నేకవచనముల్। వృద్ధులిఘన కీర్తులు బెడఁ। గడరెన్ దట్టముయి దశలనన్నవినమునన్, కవిసం-ప్రక్రమ- 20 ల. ఉ.

'మాటలు పెక్కేల; మాటలు పెక్కులేల, ఇచ్చట 'పెక్కు', శబ్దంబు ప్రథమైకవచనలోపంబుగలది గావున స్త్రీసమంబు. ఇయ్యది 'మాటలు, అనుబహువచనంబునకు విశేషణంబైనను బ్రకృతసూత్రంబు పూర్వసూత్రంబునకు (సూ19) బాధకంబుకావున నేకవచనాంతంబై వికల్పంబుగ నుండవచ్చును. మువర్ణకాంతవిశేషణంబునకు— కులిశధారల్కుంతితంబయ్యె. 'కులిశధారల్కుంతితంబులయ్యె" ఇచ్చోట 'కుంతితంబు, అనునది మువర్ణకాంతంబు. (తత్సమపరిచ్ఛేదంబందలి నలువదిరెండవసూత్రంబుచే మువర్ణకంబునకుఁ బూర్ణబిందుపూర్వకంబువర్ణము విధింపఁబడెను) ఇయ్యది యేకవచనంబైనను బ్రకృతసూత్రంబున 'కులిశధారల్' అను బహువచనాంతంబునకు విశేషణంబు కావచ్చును. 'ఇష్టమగుపదార్థములు, ఇష్టములగుపదార్థములు, ఇట 'పదార్థములు, అను బహువచనాంతంబునకు 'ఇష్టము, అను నేకవచనాంతంబు నీసూత్రంబుచేత విశేషణంబు కావచ్చును. మాలిని॥ సురపతిసభఁజూడం జూడనంగారవృష్టుల్। గురిసెఁ గులిశధారల్ గుంతితంబయ్యె దిక్కుల్। జరమదములఁదంగెన్ సర్వదిక్పాలకాంతః, కరసములు భయోద్వేగంబునన్వంపలించెన్. భార- ఆది- 2ఆ. శా॥ ప్రాతర్వేళలనట్టినట్టసాగసైపాటిల్ల గుంభోంభనో। ద్భ్రూశాలాబ్దుస్వనివాద్యమై నురుపక్షఃపుంజీభవత్పాటల । ప్రాశామేద్రిడేశ

సిక్తభూసురక్షీరాంబుకుల్యాబహుళ। ప్రోతస్సంధులసంధుయంత్రిపతిక్రతోద్దీతగే యహోమములన్, ఆము- 2 ఆ.

21—సూ. ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తి యునగు.

మైత్రుండు గృహమును వెడలెను - గృహమునుండియని యర్థము॥ వాఁడు వాహనమునుదిగెను - వాహనమునుండి యనియర్థము॥ వారుసుఖమున్నారు। సుఖముతోనని యర్థము - ఇత్యాదులెఱుంగునది.

వ్యా—కొన్నిచోట్ల నొకవిభక్తికి మఱియొక విభక్తి వచ్చును. మైత్రుండు గృహమును వెడలెను; వాఁడు వాహనమునుదిగెను.— అనఁగా గృహమునుండియనియు వాహనమునుండియనియు నర్థము. ఇచ్చటఁ బంచమీవిభక్తికి బదులు ద్వితీయావిభక్తి వచ్చెను. వారు సుఖమున్నారు, వారు సుఖముతోననియర్థము. ఇచ్చోటఁ దృతీయా విభక్తికిఁ బ్రథమకలిగె. చ॥ గుణములనొప్పి బ్రాహ్మణులకుం గడు భక్తుఁడవై సమస్తధా। త్రిజనప్రజం బ్రోచుచు న్విగతరోషుఁడవై సుఖముండుమింక' భార-ఆది -7 ఆ. సీ॥ తే॥ గీ॥ ఎవ్వరికి నీకలిమతనయుండ్లఁ బోలి। కొనిసుఖంబుండి రథము లైకొండటం గు, భార-ఆది--7ఆ. సప్తమికిఁ బ్రథమావిభక్తి ప్రయోగము. చ॥ వ్రతములులేనివారు నుపవాసపరాఙ్ముఖులైనవారు దు। ర్మతులు విహీనశౌచులు గ్రమంబున, దీర్థములాడనోపరు, భార_ఆర- 2 ఆ. (తీర్థములందు) తే॥ గీ॥ ఎఱుకునన్నునుఁ జేయేసిన శరములు। నెఱుకులాడినాకు నిశితదివ్య। విశిఖశతులయట్లు వేదనరూపించె। నిది యపూర్వమీతఁ డెవ్వఁడొకొ, భార—ఆర- 1ఆ. (నెఱుకులందు) చ॥ పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ మూర్ధ్వబాహుఁడై' భార- శల్య- 1ఆ. (మోమునందు) సీ॥ తే॥ గీ॥ ఎండయవియాటలాడుచు నాడమిడిన, బగిది పోవుటయు భార-స్త్రీ-1ఆ. (ఆటవులయు)

శా॥ భావంబుల్ భయముజ్జగించి చోరుఁ డీభవ్యాద్రి చాటందఱున్' హరి-పూ-7 ఆ (చాటునందు) మ॥ కనుఁగొంటిం బరమేష్ఠిఁదొట్టిసురసంఘుం బేకతంబుండఁగన్' హరి-పూ- 5ఆ. (సంఘమందు) క॥ అదియున్ మేనుచ్చి, రా- ఆర, కాం-2ఆ. (మేనియందు) సీ॥ వినుశేరశాధీశ్వరున కాత్మజుఁడు నభాస్యుఁడు మూలతారయందుదయమయ్యె। నొకకొన్ని దివసంబులకు వైరుల నెదిర్చి జనకుండు గండదోషమునఁ జచ్చె। జనయిత్రి చిచ్చుఁజికిన దాదులా బాలకునిఁ గొంతలమునకుఁ గొంచువచ్చి జైమిని-8ఆ. (చిచ్చునందు) తే॥ గీ॥ పంకము గోరి జదిగఁబడి పఱవలేవు। మన్నులిన్నే లశేగటిమన్నులందు, మను- 4ఆ. (పంకమునందు) ఇత్యాది ప్రయోగంబులందునే, అన్యస్యాపి క్వచిద్భవేచ్చాన్యా॥ హలంత- 41 సూ., అనుశబ్దశాసనుల సూత్రంబు సార్థకంబగుచున్నయది.

22—సూ. జడంబుతృతీయాసప్తములకుద్వితీయ బహుళంబుగానగు.

రాముఁడు వాలినొక్కకోలంగూలనేసె - కోలతోననియర్థము. లంకంగలకలంబుపుట్టె - లంకయందనియర్థము. బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకుబహుత్వమందెయగు - అర్జునుండు శత్రుసేనలను బాణంబులనురూపుమాపె- బాణములచే ననియర్థము ॥ మీనంబుజలంబులనుండు - జలంబులందని యర్థము.

వ్యా—జడవాచకశబ్దంబుమీఁది తృతీయావిభక్తికిని, సప్తమీవిభక్తికిని, ద్వితీయావిభక్తి బహుళంబుగావచ్చును. తృతీయకు—ఉ. ,రాముఁడు వాలినొక్కకోలంగూలనేసె. ఇచ్చట ,కోలన్, అనునది ద్వితీయావిభక్తి . తృతీయావిభక్తికివచ్చెను. కాఁబట్టి కోలతోనని యర్థమును జెప్పుకోవలెను. సప్తమికి—,లంకంగలకలంబుపుట్టె, ఇచ్చట లంకన్, అనుచో ద్వితీయ సప్తమీవిభక్తికి నాదేశంబాయెను. కాన నీద్వితీయకు లంకయందనిసప్తమ్యర్థంబు చెప్పికోవలెను. (మూ) బాహుళకంబుచే నిక్కార్యం

బునంతంబునకు బహుత్వమం దెయగు. వ్యా— బహుళగ్రహణంబుచేనీద్వితీయావిభక్తియు దంతశబ్దంబులకు బహువచనంబునం దేయగును. ఉ. అగ్గినుండు శత్రుసేనలను బాణంబులనురూపుమాపె, బాణంబులన బాణంబులచే ననియర్థము. ఇచ్చట 'బాణంబు' అనునది యుకారాంతంబు. దీనిపై బహువచనద్వితీయావిభక్తియే తృతీయాదివిభక్తులయర్థంబును, జెప్పునుగాని యేకవచనంబు తాదృశార్థంబును బోధింపలేదు. సప్తమికి— వీనం బుజలంబులనుండు, ఇచ్చోట 'జలంబులన్' అనుబహువచనద్వితీయావిభక్తి 'జలంబులందున్' అను సప్తమ్యర్థంబునందు వచ్చెను. 'జలంబున్' అను నేకవచనద్వితీయావిభక్తి 'జలమునందున్', అనెడి సప్తమ్యర్థ మందు రాదు. అజంబు తృతీయాసప్తములకును గొన్నింట బహుత్వంబున ద్వితీయ గానంబడియెడి. తృతీయకు— తే॥ గీ॥ అతని దోర్దర్పసరణినో లాయుదన్న। ఘనతరస్తనచక్రవాకములనలరు। నంబసుకేంద్రుకుహాంతరింపారంగనియె, హరి- ఉ- 7అ. (చక్రవాకములచేత) సీ॥ తే॥ గీ॥ బలిమిఁ గొనినధనము పదివేల యొంటెలఁ। బేటికిరాఁగ వైరిభీకరుండు వచ్చినవులఁ పమితవాహినీపహతిఁ। దల్లడిల్లుమంద ధరణిలము, భార-సభా— 1ఆ. (ఒంటెలయందు) తే॥ గీ॥ అనిననలుగాసవాన గోవుసు నశేప। శబ్దములమంత్రమను లోహజాతిఁ గాంచు। నము నుమనుజుల విప్రుండు సమధికత్వ। భాజనములంద్రడు వేదప్రపంచవిదులు, భార- శాంతి- 1ఆ. (మనుజులయందు) వెం.

## 23 సూ—ఉదంతజడంబుతృతీయకు నవర్ణకంబగు.

రాముఁడొక్క-బాణంబున వాలింగూలనేసె - బాణముచేనని యర్థము.

వ్యా— ప్రాసోకారంబు కడపటఁగలజడవాచకశబ్దంబులయొక్క తృతీయావిభక్తికి 'న', ప్రత్యయంబువచ్చును. ఉ. రాముఁడొక్క-బాణంబున వాలింగూలనేసె. ఇచ్చట 'బాణంబు' అనునది జడవాచకశబ్దంబు. దీని తృతీయకు నాదేశంబుగ నవర్ణకం బయ్యెను. బాణంబుననఁగా బాణంబుచేత నని యర్థంబు. కొండొకచో నుదంతంబగుజడవాచకశబ్దంబుమీఁద తృతీయకును 'న', వర్ణకంబు రాఁబట్టెడిని. ఉ. ఏపునఁ

గిట్టి యేనుఁగున సేనగు వైచుచు వాజివాజిచే। రూపడఁగంగ మోఁదుమను, రా-యు. కాం.

24 సూ—జడంబు ద్వితీయకుం బ్రథమబహుళంబుగానగు.

వాఁడుపూవులు దెచ్చె - వాఁడుపూవులను దెచ్చె॥ ఆకెసొమ్ములుదాల్చె ఆకెసొమ్ములనుదాల్చె ॥ వాఁడిల్లువెడలె. - వాఁడింటినివెడలె ॥ బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించినద్వితీయకుం బ్రథమరాదు.

వ్యా—జడవాచకశబ్దంబుయొక్క ద్వితీయావిభక్తికిఁ బ్రథమావిభక్తి బహుళంబుగాఁగల్గును. ఉ. వాఁడు పూవులుదెచ్చె; (పూవులను దెచ్చెననియర్థము.) ఇచ్చట పూవులు అనునది జడవాచకశబ్దంబుగావున ద్వితీయార్థంబునందుఁ బ్రథమవచ్చెను. వాఁడు పూవులనుదెచ్చె, ఆకెసొమ్ములుదాల్చె; ఆకె సొమ్ములనుదాల్చెను. వాఁడిల్లు వెడలె; వాఁడింటినివెడలె. (ఇంటినుండియని యర్థంబు. చూ-31 సూ.) ఇత్యాద్యుదాహరణమ్ములయందు ద్వితీయార్థంబునఁదుఁ బ్రథమయని గ్రహింపవలెను. (మూలము) బాహుళకముచేఁదృతీయాసప్తములకు విధించినద్వితీయకుం బ్రథమరాదు. వ్యా-బహుళగ్రహణంబుచేఁ దృతీయాసప్తమ్యర్థంబులయందు నిరువదిరెండవసూత్రంబుచేత విధింపఁబడిన ద్వితీయకుఁ బ్రథమరాదు. అనఁగాఁ గర్మార్థకద్వితీయావిభక్తికే ప్రథమావిభక్తి వచ్చుచుగాని కరణాధారార్థకమైన ద్వితీయకుఁ బ్రథమరాదనినిష్కృష్టార్థము. (సిద్ధాంతము) ‹వాలినొక్కకోలం గూలనేసె› అనునుదాహరణంబులో ‹కోలన్› అనెడి ద్వితీయావిభక్తి ‹కోలతోన్› అనికరణార్థంబును జెప్పుచున్నది. ‹లంకంగలకలంబుపుట్టె› అనువాక్యంబులో ‹లంకన్› అనిన ద్వితీయావిభక్తి ‹లంకయందున్› అనియధికరణార్థంబును (ఆధారార్థము) జెప్పుచున్నది, కాఁబట్టి యీయర్థద్వయంబును దెలుపునట్టి ద్వితీయావిభక్తికిఁ బ్రకృతసూత్రంబునఁ బ్రథమరాదు. ఈపరిచ్ఛేదంబులో రెండవ సూత్రంబుచే సామాన్యంబుగాఁ గర్మార్థంబునందే ద్వితీయ విధింపఁబడినందున నట్టిద్వితీయకే ప్రకృతసూత్రంబునఁ బ్రథమయని యెఱుంగవది. కొన్నియెడలనజడంబు ద్వితీ

యనును ప్రథమ కానంబడియెడి. చ॥ అనిలజవంబునంబుదమునమ్మువవానగ మేదిని క్రమ్మె లీల దినపతికాంతులు నీలక గగనంబుపయిం బాసమునిట్లుక్రమ్మెకంబులు దునె, భార-ఆది 4ఆ. చ॥ కరినికరంబుతోఁ గడఁగి గర్వితుఁడై తనవారణేంద్రము! కుక్కురుపులపీరుమీఁద నెనకొల్పెనఁ దద్రథసూత్రకంబులక్, భార-ఆర-6ఆ. (తనవారణేంద్రముం! గురుపుల పీరుమీఁద, అని పాఠాంతరము) చ॥ ఉపహతి సేయఁ దద్రక్తముహయోత్తమ మొక్కెడఁ గట్టి బంపుదుక్, జైమి-5ఆ. (తద్రక్తముహయోన్నము నొక్కెడ, అని పాఠాంతరము.)

25 సూ—కాలాధ్వములగుఁ ద్వితీయకంబుగాఁ బ్రథమ యగు.

వాఁడు నిన్న వచ్చె - వీఁడు నేఁడు వోయె - మాపు నిలువుము - రేపు పొమ్ము - వారు క్రోశము నడచిరి - వీరామడవోయిరి.

వ్యా—కాలవాచకపదంబులకును, మార్గవాచకపదంబులకును, తఱచుగాఁ బ్రథమావిభక్తి యగును. కాలవాచకపదంబులకు—ఉ. వాఁడునిన్నవచ్చె. నిన్నటిదినమందని యర్థము. ఇచ్చట 'నిన్న' అనునది కాలంబును దెలియఁజేయుచున్నది కావున సప్తమ్యర్థంబునఁ బ్రథమవచ్చెను. వీఁడునేఁడుపోయెను. నేఁటిదినమందని యర్థంబు. ఇచ్చట నేఁడు, అనుదానికి సప్తమ్యర్థంబునఁ బ్రథమకలిగె. 'మాపు నిలువుము' సాయంకాలమందని యర్థము, ఈవాక్యంబునందు 'మాపు' అనుదానికి సప్తమ్యర్థంబునఁ బ్రథమ. 'రేపు పొమ్ము' ప్రాంతఃకాలమందని యర్థము. ఇందు 'రేపు' అనుదానికి సప్తమ్యర్థంబునఁ బ్రథమావిభక్తి. మార్గవాచకపదంబులకు—'వారు క్రోశము నడచిరి' క్రోశమాత్రమార్గమున నడచిరని యర్థము. ఇచ్చట 'క్రోశ' శబ్దంబు మార్గవాచకంబుగావున సప్తమ్యర్థంబునఁ బ్రథమవచ్చెను. 'వీరామడవోయిరి' యోజనమాత్రమార్గంబున నడచిరని యర్థము. ఇచ్చట నధ్వవాచకంబైన 'ఆమడ' శబ్దంబధికరణార్థకప్రథమాంతము. ఇందులకుఁ గవిచింతామణి- ఆ॥ కాలవాచకముల కడనున్న సప్తమి। ప్రథమ

యనుకును రాత్రి పవ్వళించె | దానఁగాల మెంతవానికిఁ బోరాదు| కేయివో యి పగలు వ్రేలవచ్చె,

26 సూ—సర్వనామసంఖ్యాభిధానతద్విశేష్యంబుల యందె య్యది ముందుప్రయోగింపఁబడుదాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగానగు.

అన్నిగుఱ్ఱములకు-అన్నింటికిగుఱ్ఱములకు-గుఱ్ఱములన్నింటికి-గుఱ్ఱముల కన్నింటికి - సాహిణులుముప్వురు ॥ రెండుగుఱ్ఱములకు రెండింటికి గుఱ్ఱములకు - గుఱ్ఱములు రెండింటికి - గుఱ్ఱములకు రెండింటికి - సాహిణులునలుగురు ॥ లక్షగుఱ్ఱములకు - లక్షకుగుఱ్ఱములకు - గుఱ్ఱములు లక్షకు - గుఱ్ఱములకులక్షకు రవుతులు లక్ష॥ ఇత్యాదులెఱుంగునది.

వ్యా—సర్వనామంబును, దానివిశేష్యంబును, ఈరెండింటియందు నెయ్యది ముందు ప్రయోగింపఁబడునో దాని ద్వితీయాదివిభక్తులకుఁ బ్రథమబహుళంబుగానగును. అట్లే సంఖ్యావాచకశబ్దంబును, దానివిశేష్యంబును, వీనిలో ముందు ప్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుఁ బ్రథమావిభక్తి బహుళంబుగాననుని భావము, సర్వనామ విశేష్యములకు—అన్నిగుఱ్ఱములకు; అన్నింటికి గుఱ్ఱములకు, గుఱ్ఱములన్నింటికి; గుఱ్ఱములకన్నింటికి సాహిణులుముప్వురు. ఇచ్చట ‚అన్ని‚ శబ్దము సర్వనామము. ‚గుఱ్ఱములకు‚ అనునది విశేష్యము. వీనిలోఁ బ్రథమోదాహరణంబునందు సర్వనామంబైన ‚అన్ని‚ శబ్దంబు మొదటఁ బ్రయోగింపఁబడ్డది కావున ‚అన్నిగుఱ్ఱములకుఁ‚ అనిప్రథమావిభక్తి యొకసారియును,వేఱొకసారి ‚అన్నింటికి గుఱ్ఱములకు‚ అనివిశేష్యంబులైన గుఱ్ఱములకుంబలె ‚అన్ని‚ శబ్దంబునకు షష్ఠీవిభక్తియును గలిగెను. రెండవయుదాహరణమందు విశేష్యంబులైన గుఱ్ఱములు సర్వనామంబునకు ముందు ప్రయోగింపఁబడి నందువఁ బ్రథమావిభక్తి యొకపర్యాయంబును, ‚అన్నింటికి‚ శబ్దంబునకుంబోలెఁ‚గుఱ్ఱములకు‚ అనిషష్ఠి వేఱొకపర్యాయంబును, వచ్చెను. సంఖ్యావాచకతద్విశేష్యంబులకు-

దీనికి విశేషణంబైన సుగుణాభిరామశబ్దంబునకంటెఁ బ్రథమావిభక్తియును, విశేష్యంబు ననుసరించి షష్ఠీవిభక్తియును, బర్యాయంబుగా నయ్యెను. తే॥ గీ॥ భేదభేద్యకముల భేదంబు సెల్లదు। వరవిభక్తి లింగవచనములకు। నొండు భేదకమున కుండును బ్రథమయ్యు। జయము రక్షకుండు శౌరికనఁగ' కవిలోకచింతామణి. ఇందులకు సర్వలక్షణసారసంగ్రహవిభక్తిప్రకరణనవమలక్షణంబునందు 'క॥ ప్రథితముగఁ గృతుల షష్ఠికిఁ। బ్రథమవిశేషణము సెల్లుఁబరి పంథిసుదో। న్మథనుఁడు రామున కనయే పృథివిం జెలువారలనంగ నృపపతిగమనా' అనులక్షణంబు చూపఁబడి పారిజాతాపహరణంబులోనిది 'చ॥ ఇచ్చెనా। యనములు రుక్మిణీప్రభృతులైనసతుల్ పదియాఱువేలకున్' అనులక్ష్యం బుదాహరింపఁబడినది. తిమ్మకవిగారు 'సతుల్ పదియాఱువేలకున్' అను షష్ఠ్యంతవిశేషణంబు ప్రథమయైనందులకు నుదాహరణంబుగా గ్రహించిరి 'పదియాఱువేలకున్' అను సంఖ్యావాచకంబునకు 'సతుల్' అనునది విశేష్యమేకాని విశేషణముకాదు. ఈయుదాహరణంబు సంఖ్యాభిధానతద్విశేష్యంబులకు నిదర్శనంబుగా నిఱువదియాఱవసూత్రముయొక్క సందర్భమునఁ జూపినచో రమణీయముగానుండును. క॥ అపరాహ్ణసమయమునని। ట్లుపమాతీతాతిఘోరయుద్ధంబయ్యెన్। రిపుభయదభుజుఁడు భీమున। కపరిమితబలుండు గౌరవాధీశునకున్' భార- భీష్మ - 2ఆ. 'భీమునకు' 'కౌరవాధీశునకున్', అను షష్ఠీవిశేష్యంబులకు 'రిపుభయదభుజుఁడు, అపరిమితబలుఁడు' అను ప్రథమావిశేషణంబులు గ్రమంబుగాఁ బ్రయోగింపఁబడియె. శా॥ భ్రాతవ్యాజపవిత్రగోత్రవిపులాపస్తంబసత్సూత్రువి। ద్యారాజీవభవుండు మారయకుఁ బుణ్యాచారధీమాంబకున్, నైష. 1ఆ. (మారయకు అను షష్ఠీవిశేష్యంబునకు 'భవుండు' అను ప్రథమావిశేషణము ప్రయోగింపఁబడెను) మ॥ అకలంకాపసనసత్వముం దెలియు మాయాన్వారకావంతికా। శికురుక్షేత్రగయాప్రయాగముల నే సేవింప కుద్దండగం। డకవేనండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్రమివ్యాంచుకొం। డకురాఁజెల్లనె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదాశ్రోత్రియుల్, మను- 2ఆ. (ఇమ్ముంచుకొండకు. అనుషష్ఠీవిశేష్యంబునకు 'ఉద్దండగండకవేనండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్రము, అను ప్రథమావిశేషణం బుపయోగింపంబడెను.) సమాసాంతర్యాతిషష్ఠ్యంతంబునకుం గూడఁ బ్రథమాంతవిశేషణంబుగాఁ గొండొకచో

సమన్వయించు. క॥ మీపసువున రాజ్యము లీపాండుతనూభవులకు నీకున్న భుజా | టోపభయంకరుఁడర్జును కోపానలమునఁ బడి మ్రగ్గికొనదే నాఁడున్, భార-ఉద్యో-1ఆ. ఉ॥ మీకు మాయెడన్ | విగ్రహమేల నెయ్యమున విద్యుఁడు కౌరవరాజు పార్థివ | ప్రాగ్రసరుండు ధర్మసుతు పక్షమునీకు సలక్ష్యమిత్తుఁ డెడన్, భార-ఆర-6ఆ. ప్రథమపద్యంబులో భుజాటోపభయంకరుండు, అను తత్పురుషాంతము అర్జునకోపానలము, అను షష్ఠీతత్పురుషంబులో నేకదేశంబులు నయిన షష్ఠ్యంతంబును నైనయర్జునశబ్దంబునకు విశేషణంబుగా నన్వయించుచున్నదిద్వితీయపద్యంబులో పార్థివప్రాగ్రసరుండు, అను ప్రథమాంతంబు, ధర్మసుతుపక్షము అను షష్ఠీతత్పురుషంబులో నేకదేశంబును, షష్ఠ్యంతంబును, నైనధర్మజశబ్దంబునకు విశేషణంబుగా నన్వయించుచున్నది. ఇట్టివి పెక్కులు ప్రయోగంబులుగలవు ఇట్టిప్రయోగంబులు శాస్త్రదృష్టిచే నాలోచింపఁగా సాధులైనవి కావని చెప్పవలయును. సమాసపరిచ్ఛేదంబులోఁ బ్రథమసూత్రంబుచే సామర్థ్యంబుగలపదంబులకు సమాసంబు విధింపఁబడినది. సామర్థ్యంబనఁగాఁ బృథగర్థంబులగు నర్థంబుల కేకార్థీభావంబనియుఁ, బృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తిసామర్థ్యంబనియు, వివరింపంబడియె. కనుక అర్జునకోపానలంబు, అన్న సమాసంబులో నర్జునుండును, కోపాగ్నియు నిట్లు వేర్వేఱుగా రెండుపదార్థంబులు స్ఫురించుచున్నను నర్జునుండు కోపాగ్నికి విశేషణంబై కోపాగ్ని విశేష్యంబై విశేషణ విశేష్యభావంబున నర్జునసంబంధి కోపాగ్నియనెడి యఖండార్థంబు స్ఫురించుచున్నయది. లోకంబులో వేఱువేఱుగా నున్నతంతువు (దారములు) లనెడి బహుపదార్థంబుల నన్యోన్యము మేళగించినపిమ్మట వస్త్రమనెడి యేకపదార్థంబగుచున్నది. బహుసంఖ్యాగానున్న యిష్టకలను (ఇటుకలను) నొండొంటిపై దృఢంబుగాఁ జేర్చినపిదపఁ గుడ్య (గోడ) మనెడి యేకపదార్థంబు కలుగుచున్నయది. చిందఱవందఱలై భిన్నంబులుగానున్న శిరోజంబు లల్లిబిల్లికతో నల్లంబడినపుడు జడయనెడి యేకపదార్థంబు జనించుచున్నయది. తంతువులకుఁ బటంబ (వస్త్రము) నెడివ్యాజంబున, నేకార్థవ్యవస్థితి కలిగినపిమ్మట వేఱుగానున్న యింకొకతంతువునకుఁ బటాంతర్గతమైన తంతువుతోఁ గలియుట దుర్లభంబు. పరస్పరమిళితంబులైన యిష్టకలు కుడ్యంబనెడి వ్యవహారంబును బొందినపిమ్మట నట్టికుడ్యంబులో నేకదేశభూతమైన యిష్టకతో వేఱొకయిష్టకకు సంబంధంబు దుర్లభంబు. శిరోరుహంబులు పరస్పరమే

శనంబున వేణి (జడ) యైన యనంతరంబుననట్టి వేణ్యంతర్భూతశిరోజంబులతో ‘ప్రమా
దవశంబున దిగవిడిచిన యితరశిరోజంబు కలియుట దుర్లభంబు. అట్లే సమాసంబు
నందుఁ బరస్పరభిన్నంబుగా నున్న పదార్థంబు లేకార్థీభావశక్తిచే నేకపదార్థంబుగా
భావింపఁబడినపిమ్మటను నట్టిసమాసైక దేశంబైనయర్థంబుతో సమాసబహిర్భూతప
దార్థంబునకు నన్వయంబు దుర్ఘటంబు. కాన సంస్కృతభాషలో ‘ఋద్ధస్య
(సంపదగల) రాజమాతంగః (రాజుయొక్క యేనుఁగు), అన్న యుదాహరణమ్మునందు
షష్ఠీతత్పురుషాంతర్భూతంబైన లుప్తషష్ఠీవిభక్తికి రాజశబ్దార్థంబుతో ‘ఋద్ధస్య’ అనెడి
షష్ఠ్యంతవిశేషణం బన్వయించుట దుర్ఘటమైన యట్టులు ‘భుజాటోపభయంకరుఁడు’,
అనువిశేషణంబు ‘అర్జునకోపానలంబు’, అనుసమాసంబులో నేకదేశవర్తియైనయర్జున
పదార్థంబుతో నన్వయించుటయు ‘పార్థివప్రాగ్రసరుండు’, అను విశేషణంబు ‘ధర్మసు
తుపన్పిది’, అనుసమాసంబులో నంతర్భూతంబైన ధర్మసుతపదార్థంబుతో విశేషణ
భావంబున నన్వయించుటయు దుష్కరంబు. ఐననుసంస్కృతవ్యాకరణంబులో ‘కిమో
దనంశాలీనాం; కేషాంశాలీనామోదనమిత్యర్థః (ఏశాలిధాన్యము (వరిధాన్యము) యొక్క
యన్నము?) ‘సక్త్వాఢకమాపణీయానాం; ఆపణీయానాం సక్తూనామాఢకమిత్యర్థః=(అంగడి
యందలి పేలపిండియొక్క యాఢకము; = పరిమాణవిశేషము) ఇత్యాది స్థలంబుల
లో ‘శాలీనాం’ అనెడి సమాసబహిర్భూతషష్ఠ్యంతంబునకు ‘కిమోదనం’ అనెడి సమాసం
బులో నంతర్భూతంబైన ‘కిం’ శబ్దంబుతో నన్వయంబు కలిగినట్టులును; ‘ఆపణీయా
నాం’ అనెడి షష్ఠ్యంతవిశేషణంబునకు ‘సక్త్వాఢకం’, అనెడి సమాసంబులో నేకదేశ
వర్తియైన సక్తుపదార్థంబుతో నన్వయంబు సంభవించినయట్టులును, పైనింజెప్పిన
మహాకవుల తెలుఁగుప్రయోగంబులు క్వాచిత్కంబులై యుండవచ్చునని తెలిసికొను
నది. విశేషణంబులషష్ఠికే ప్రథమావిభక్తి గాక విశేషణంబుల ద్వితీయాదివిభక్తులకును
బ్రథమావిభక్తి మహాకవి ప్రయోగంబులఁ జూపట్టెడిని కావుననే యడిదము సూరకవీం
ద్రుఁ డిట్లు లక్షణపద్యంబును రచియించుచున్నాఁడు. ‘క॥ అగనను క్రియతోఁ బాసి
యుఁ। దగు పెక్కువిభక్తులం బ్రథమచెందును భక్తగణాదయమానచిత్తుం।డగజాధిపుకీర్తి
దిశలనలమెననంగఁ, కవిసంశయవిచ్ఛేదము. ప్రథమ .– త– చ॥ అహీనబాహుబల
సారఘుమల్ మధుకైటభాదిదై । త్యపతులనెల్లఁ ద్రుళ్లడఁచె, నిర్జ–గ్జు, ఇచ్చట ...

త్యపతులనెల్ల, అనెడిద్వితీయాంతవిశేష్యంబునకు ఘనుల్, అను ప్రథమావిశేషణముప యోగింపఁబడియె. ఉ॥ పూనిప్రతిజ్ఞ చేసి కృతపుణ్యుఁడు లక్ష్మణుతోడ జొచ్చియుక్ భార- ఆర-7ఆ. క॥ మాతండ్రి పరాశరసుతు। చేతంబడసితి ననుజ్ఞ శీలపరత్వో। పేతుఁడగుధర్మతనయుఁడు। ప్రీతినొడంబడియె బంధుబృందయుతముగన్, భార-ఆశ్ర-1ఆ. క॥ నీఁడుకులమ్మునకుఁ దగఁబ్రతాపముగొని రణముగడుపఁదొడఁగుము నృపధర్మోదయు, డర్జునుతోడను। గాదనక రణంబుసేయఁగా నీకగుసే, భాగ-ఆది-6ఆ. (నృపధర్మోదయుఁడగు నర్జునుతో, అనిపాఠాంతరము) క॥ తండ్రీ ఘటోత్కచుఁడు మాతండ్రి గలుగఁగాదె తల్లిద్రౌపదితోడన్। దండ్రులహరిదీశ్వరులెవ- మండ్రువొగడఁ దెచ్చెగంధమాదనమునకున్, జైమి-1ఆ. పైపద్యంబులయందు లక్ష్మణుతోడన్, పరాశరసుతుచేతన్, అర్జునుతోడన్, ద్రౌపదితోడన్, అను తృతీయావిశేష్యంబులకుఁ గ్రమంబుగా కృతపుణ్యుఁడు, తండ్రి, నృపధర్మోదయుఁడు, తల్లి, అను ప్రథమవిశేషణంబులు ప్రయోగింపఁబడియె. అహోబలపతి షష్ఠీవిశేషణానాం ప్రథమాస్యాత్, అనిన నన్నయభట్టారకునిసూత్రంబులో విశేషణానాం, అన్న బహువచనసామర్థ్యంబుచే నొక్క షష్ఠ్యంతవిశేష్యంబునకే ప్రథమాంతంబు విశేషణంబుగానుంట గాక తక్కినకొన్ని షష్ఠీతరవిభక్త్యంతంబులకుఁ గూడఁ బ్రథమాంతంబువిశేషణంబున నుండవచ్చుననియు సీ॥ గీ॥ అద్యుఁడు హిరణ్యగర్భునందంతకంటె, ఆము-3ఆ. అనిన కవితాపితామహుని వచనము నిర్మూలమనియు, సప్తమ్యంతవిశేష్యంబునకుఁ బ్రథమాంతంబు విశేషణంబు కూడదనియుఁ జెప్పెను.

28 సూ.—భవత్యర్థవ్యవహితంబులగువిశేషణంబులకుం బ్రథమయగు.

అగు మొదలగునవిభవత్యర్థములు ॥ విద్యాశాలియగుపురుషుని సకలజనులు సన్మానింతురు ॥ భూతదయాశీలురగు మహాత్ములకు శ్రేయంబుగలుగును ॥ అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమయిన కేశవార్జునకృతి.

వ్యా—'అగు, 'అవు, 'జో, (భూధాతుతద్ధర్మవిశేషణంబులు) అయిన 'ఐన, (భూతార్థకవిశేషణంబులు) కాని, (వ్యతిరేకార్థకవిశేషణము) ఇత్యాది భవత్యర్థకంబులచే (విశేష్యంబుతో) నెడపఱుపంబడిన విశేషణంబులకుఁ బ్రథమయగు. 'ఉ. విద్యాశాలియగుపురుషుని సకలజనులు సన్మానింతురు., ఇట 'విద్యాశాలి, అను విశేషణంబు 'పురుషుని; అను ద్వితీయాంతవిశేష్యంబునకు సంబంధించియున్నందున ద్వితీయాంతంబు కావలసియున్నను 'అగు, అనిన భవత్యర్థకధాతుజవిశేషణంబుతో వ్యవహితంబగుటంజేసి ప్రథమావిభక్త్యంతంబైయుండె. 'అగు, అనుభవత్యర్థకంబులేనియపుడు 'విద్యాశాలిని బురుషుని సకలజనులు సన్మానింతురు' అని ద్వితీయాంతంబుగ నుండవలెను. ఇట్లే 'భూతదయాపరుఁడగు మహాత్ములకు శ్రేయంబు గలుగును; అతిమానుషమత్యద్భుతమతిగుప్తంబయిన కేశవార్జునకృతి' ఇత్యాదిస్థలంబులయందు నీసూత్రమునఁ బ్రథమావిభక్తి విశేషణంబులకు గలిగెనని తెలియునది.

29 సూ.—భవత్యర్థకంబుసన్నిహితవిశేష్యంబునకును దానిముందువిశేషణంబులకయిపదంబును బహుళంబుగానప్రయుక్తంబగు.

అతులుఁడయియప్రమేయుఁడౌ హరినిగొలుతు

వ్యా—భవత్యర్థకంబులైన 'అగు' 'జౌ' శబ్దంబులు విశేష్యంబునకు నవ్యవధానంబుగఁ బూర్వమందున్న విశేషణంబుపైనగును. ఎడముగానున్న విశేషణంబుపై 'అయి' 'ఐ' అనుక్త్వార్థకావ్యయంబులుపయోగింపఁబడును. ఉ. అతులుఁడయియప్రమేయుఁడౌ హరినిగొలుతు ఇందు 'హరిని, అను విశేష్యంబునకు 'అప్రమేయుఁడు, అనునది సమీపవిశేషణంబుగావున దానిపైని భవత్యర్థకమైన 'జౌ' అనునది ప్రయోగింపఁబడె 'అతులుఁడు అను విశేషణంబు హరికి దూరవర్తియగుటంజేసి దానిపై 'అయి, అనునది చేర్పంబడియె.

30 సూ.—అయిపదాను ప్రయోగంబులేనిచోఁ దుదివిశేషణంబునకేనివిశేషణంబులన్నింటికేని మీఁదసముచ్చయార్థంబువిభాషం బ్రయోగింపంబడు.

ఆద్యుఁడప్రమేయుఁడునగు హరినిఁగొలుతు ॥ ఆద్యుఁడు నమేయ గుణుఁడునౌ హరినిఁగొలుతు ॥ ఆద్యుఁడప్రమేయుండగు హరినిఁగొలుతు

వ్యా—ఁ అయి. అనుపదము మార్గస్థవిశేషణంబుపైఁ జేర్పనియప్పుడు తుది విశేషణంబునకుఁగాని, విశేషణంబులన్నింటికిఁగానిఁ సముచయార్థకశబ్దంబు విభాషగా జోడింపఁబడును. ఉ. ఆద్యుఁడప్రమేయుండునగు హరినిఁగొలుతు ఇయ్యెడ ఁఆద్యుడు, అనువిశేషణంబుకంటె ఁఅయి, పదంబు మానంబడినందునఁ దుదివిశేషణంబైన అప్రమేయుఁడు, అనుదానికి సముచ్చయార్థకంబైన ఁను' శబ్దంబు చేర్పంబడినది. ఁఆద్యుడునమేయగుణుండు నౌ హరినిఁగొలుతు' ఇచ్చోట నన్నివిశేషణంబులకును సముచ్చయార్థక ఁను, శబ్దంబు చేర్పఁబడియె. ఁఆద్యుఁడప్రమేయుండగు హరినిఁగొలుతు ఈవిధి వైభాషికంబుగావున నీయుదాహరణంబునందు విశేషణంబులలో దేనికిని సముచ్చయార్థక ఁను, శబ్దంబు చేర్పంబడలేదు.

31 సూ.—క్రియాజన్యవిశేషణాన్వవధానంబునవిశేషణంబులన్నింటికయిపదంబనుప్రయుక్తంబగు.

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడు దేవుని నభినుతింతు ॥ ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబుగలదని ప్రయోగంబుల నెఱుంగునది.

వ్యా—విశేష్యంబునకుఁ బదార్థాన్వయక్రియ విశేషణంబన్యవధానంబుగాఁ బూర్వంబందుండినచోఁ బక్కనవిశేషణంబు లన్నింటికిని ఁఅయి, పదంబు చేర్పంబడు: ఉ. ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడు దేవుని నభినుతింతు. ఇచ్చట ఁఒసంగెడు, అను క్రియాజన్యవిశేషణంబుతో విశేషణ విశేష్యంబు లెడపెట్టఁబడమున్నది కావున ఁఆద్యుఁడు, అప్రమేయుఁడు, అఖిలసేవ్యుఁడు' అను విశేషణంబులన్నింటికిని ఁఅయి, అనుపదంబు చేర్పంబడియె. (మూలమున) ఇచ్చట

మఱియుం బ్రయోగవైచిత్ర్యంబుగలదని ప్రయోగంబుల నెఱుంగునది. (వ్యా) ప్రయోగవైచిత్ర్యంబునా సూత్రంబునం జెప్పినరీతిగా ౘఅయి, పదంబు ఎల్లవిశేషణంబులకును ననుప్రయుక్తంబుగాక కొన్నివిశేషణంబులకును, గడపటివిశేషణంబునకును, ననుప్రయుక్తంబుగాఁగఁ గవిప్రయోగంబులు గ్రంథంబులయందుఁ గలవు కావున ౘఆద్యుఁడు నప్రమేయుఁడు నఖిలసేవ్యుఁడునై యొసంగెడు దేవుని నభినుతింతు ఇత్యాది ప్రయోగవైచిత్ర్యంబు లుండవచ్చునని భావంబు.

32 సూ.—భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమయగు.

రాముఁడువచ్చుట - రాముఁడు రాఁగా లక్ష్మణుఁడుగాంచె - రాముఁడువిల్లందినం ద్రిలోకంబులాకులంబులగు - రాముఁడు పట్టినవ్రతిన వారింపందరంబుగాదు.

వ్యా—భావంబనఁగా ధాత్వర్థము. ధాత్వర్థమందుఁ గ్రియాపరిచ్ఛేదంబులోని ముప్పదియైదవసూత్రంబుచే ౘట, వర్ణకంబును. ముప్పదియాఱవసూత్రంబున ౘకజె, వర్ణకంబును, ముప్పదియేడవసూత్రమ్ముచే వ్యతిరేకభావంబున ౘమిజ్ప్రత్యయంబును, విధింపబడినవి. కావునఁ బైనిం జెప్పిన టవర్ణకాదులు భావార్థకంబులు. ఆదిశబ్దంబుచే నలువదవసూత్రంబుచే నయిన భావలక్షణార్థంబునందలి ౘనుజి, వర్ణకంబును, నలుపదియొకండవసూత్రంబుచేనయిన ద్రుతాంత ౘన, వర్ణకంబును, నలువదిరెండవసూత్రంబులోని ౘడు, వర్ణకంబును, నలువదియాఱవసూత్రంబులోని భూతార్థక ౘన' వర్ణకంబును, ఇత్యాదిప్రత్యయంబులూహించుకొనునది. ఈప్రత్యయాంతశబ్దంబులతో నన్వయించిన కర్తకుఁ బ్రథమావిభక్తి గలుగును.ౘఉ. రాముఁడువచ్చుట.,ఇచ్చట,ౘట,వర్ణకాంతవచ్చుధాతువుతో రామునకు నన్వయంబుకానఁ బ్రథమవచ్చెను. సంస్కృతభాషలో నిట్టిభావార్థకతిఙంతస్థలంబులోఁ గర్తకుఁ దృతీయయగును. రాముఁడువచ్చుట = రామేణాగమ్యతే. ఇట్లు సంస్కృతాంధ్రభాషల శైలిం జేసికొన్నిచోటులఁ బ్రయోగభేదంబు చూపట్టెడి. ౘఉ. రాముఁడు రాఁగా లక్ష్మణుండు గాంచె., ఇచ్చట ౘరాక, అనునది నుజివర్ణకాంతము. ఈశబ్దంబునకుఁ గ్రియాపరిచ్ఛేదంబందలి నూటపదునేనవసూత్రంబుచే

నుజీ, వర్ణకాంతంబైన యనుధాతు వనుపయుక్తంబుకాఁగా రాఁగా, అనురూపంబునిష్పన్నంబాయె. ధాత్వర్థంబైన నమ్ముక్రియకు రాముఁడు కర్తగావున రామశబ్దంబుకంటెఁ బ్రథమావిభక్తి కలిగెను, ఉ. రాముఁడు విల్లందిన త్రిలోకంబు లాకులంబగు, ఇచ్చట అందినన్, అనెడి నవర్ణకాంతంబునకు రాముఁడు కర్తకాఁబట్టి ప్రథమవచ్చెను ఉ. రాముఁడు పట్టినప్రతిన వారింపనరంబుగాదు, ఇచ్చట పట్టిన, అనెడికర్తృపదర్థక నవర్ణకాంతశబ్దంబుయొక్క యర్థంబునకు రాముఁడు కర్తగావున వెనుకటికితిగ రామశబ్దంబుకంటెఁ బ్రథమవచ్చెను. జాబిలితోఁ తెంచినం గువలయంబులు వికసిల్లె, ఇట దువర్ణకాంతంబైనతోఁతెంచుధాతువుయొక్క యర్థంబునకు జంద్రుఁడు కర్తగావున జాబిలిశబ్దంబుకంటెఁ గర్త్రర్థద్యోతకంబై ప్రథమావిభక్తి కలిగెను. ఇట్లు:—రాముఁడు వండకమునుపు, రాముఁడువండుము, ఇత్యాదులం బ్రథమ యూహ్యంబు.

33 సూ.—ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబులకే కత్వంబున-వు-నులును బహుత్వంబున-రు-ములునంతాగమంబులు ప్రాయికంబుగనగు.

వ్యా—యుష్మదస్మచ్ఛబ్దంబులైన నీశబ్ద నాశబ్దవిశేషణంబులు ప్రథమావిభక్త్యంతంబులైనయపుడే యేకవచనంబునఁ గ్రమంబుగా నీశబ్దవిశేషణంబుపై వువర్ణాగమంబును, నాశబ్దవిశేషణంబుపై నువర్ణాగమంబునునగు బహువచనంబున నీశబ్దవిశేషణంబుపై రువర్ణాగమంబును, నాశబ్దవిశేషణంబుపై ముర్ణాగమంబును, దటుముగాఁ గలుగును.

34 సూ.—ఈయాగమంబులు పరంబులగునపుడుత్వంబున కత్వంబగు.

నీవుధన్యుఁడవు - నేనుధన్యుఁడను - మీరుధన్యులరు - మేము ధన్యులము ॥ ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగునను సూత్రముచేత వునులకిత్వంబగు - నీవుసుకృతివి - నేను

**సుకృతిని-ఆర్తిహరుఁడవౌ. నినుఁగొల్తునంబుజాక్ష॥ గర్వగరిష్ఠుండగునన్ను మీరలుపెద్దలు-ఇత్యాదులు ప్రాయికగ్రహణముచే రక్షితంబులయ్యె.**

వ్యా—పైనిం జెప్పిన (వు, న్నురు,ము, శబ్దాగమంబులు పరమైనప్పుడు విభక్తి యొక్క యుత్వంబునకు నత్వంబుగలుగును, (ఉ. నీవు ధన్యుఁడవు, ఇచ్చోట నీవు + ధన్యుండు. ఇట్లుండ ధన్యుఁడనునది 'నీవు, అనిన యుష్మచ్ఛబ్దార్థంబునకు విశేషణంబు గావున, పై ముప్పదిమూఁడవ సూత్రంబుచే డుపర్ణకంబుపై వువర్ణాగమంబు గలిగి, నీవు ధన్యుఁడువు, అని ప్రథమంబున నయ్యెను. పిమ్మట ముప్పది నాలుగవ సూత్రంబున వువర్ణాగమంబునకు, పూర్వంబునందుండిన డువర్ణకోకారంబునకు నత్వంబుగలుగ (నీవు ధన్యుఁడవు, అయ్యె. ఇట్లు (నేనుధన్యుడను, మీరు ధన్యులరు, మేము ధన్యులము, ఇత్యాదులందుఁ బైసూత్రంబులచేఁ బ్రక్రియాంశంబూహించుకొనునది "చ॥ భరతకుల ప్రసిద్ధులరు భాసురశస్త్రమహాస్త్ర విద్యలం।గరము ప్రసిద్ధుఁడై పరఁగు గౌతము శిష్యుల రిట్టి మీరిదు।వ్క రముగ నూతిలోఁబడిన" భార-ఆది- క॥ మీరును గుంతియు సహపరి। వారమహామాత్యభృత్యవర్గులరై నా। నా రాజ్యలీలతోఁ జని। సారమతింజేయుడెందు సతతోత్సవముల్, భార-ఉద్యో సీ॥ వడముడియును నీవు వాయువాసవుల శక్తులు ధరియించిన దుర్జయులరు, భార-శాంతి (మూలము) ఇకారంబుమీఁది కు, ను, వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగునను సూత్రముచేత వునుల కిత్వంబగు. ఉ. నీవుసుకృతివి నేను సుకృతిని; ఆర్తిహరుఁడవౌనినుఁ గొల్తునంబుజాక్షు వ్యా—సుకృతిశబ్దంబికారాంతంబు. దీనిపై వునువర్ణాగమంబులు మధ్యమోత్తమ పురుషంబులయందు రాఁగా "సుకృతి + వు, సుకృతి + నుఁ" అయ్యె పిమ్మట (ఇకారంబుమీఁది, అనుపైనిం జూపిన తత్సమపరిచ్ఛేదంబునందలి యిరువదియెనిమిదవ సూత్రంబుచే వానికి నిత్వంబువచ్చి (సుకృతివి, సుకృతిని, అని యికారాంతంబులయ్యె ఆర్తిహరుఁడవౌ నినుఁ గొల్తునంబుజాక్షు, ఆర్తిహరుఁడవుఁ ఇయ్యది (నిను, అనిన యుష్మదర్థంబునకు విశేషణంబుగాన నీపరిచ్ఛేదమందలి ముప్పదిమూఁడవ సూత్రంబుచే వువర్ణాగమంబును ముప్పదినాలుగవ సూత్రంబుచే డువర్ణకోత్వంబునకు నత్వంబునుగలుగును (మూలము) గర్వగరిష్ఠుండగు నన్నుఁ; మీరు పెద్దలు; ఇత్యాదులు ప్రాయికగ్రహణముచే రక్షితంబులయ్యె (వ్యా) పై ముప్పదిమూఁడు ముప్పదినాలుగు సూత్రంబులచే (గర్వగరిష్ఠుండనగునన్ను, మీరు పెద్దలరు' ఇట్లు ప్రాప్తింపఁ బై ముప్పదిమూఁడవ సూత్రంబులోఁ బ్రాయికగ్రహణంబుచే క్వచిత్తుగా నాగమశూన్యంబుగా నుండవచ్చునని తాత్పర్యము. చ॥ వరమునఁ బుట్టితి

వారునుమీరునుధన్యులరు ॥ మీరునుమేమునుధన్యులము.

వ్యా—ప్రథమ మధ్యమోత్తమ పురుషంబులకార్యంబులకు నొక్కచో సమావేశంబు గలిగినపుడు క్రమంబుగాఁ బరకార్యంబు ప్రబలంబు. అనఁగా నొకవాక్యంబులోఁ బ్రథమ మధ్యమ పురుషంబులకు సమావేశంబు గలిగినపుడు క్రియావిభక్తి మధ్యమ పురుషంబుతో నేకీభవించును. మధ్యమోత్తమ పురుషంబులకు నేకవాక్యంబులో సమావేశంబు కలిగినప్పుడు క్రియ యుత్తమపురుషమై యుండునని తాత్పర్యము. ఉ. ‘వారును మీరును ధన్యులరు’, ఈవాక్యంబునందు ‘వారును’ అను తచ్ఛబ్దంబునుబట్టి ప్రథమపురుషంబును, ‘మీరును’ అను యుష్మచ్ఛబ్దంబునుబట్టి మధ్యమపురుషంబును బ్రాప్తించుచుండఁ బ్రకృతసూత్రంబుచేఁ గ్రియావిభక్తి మధ్యమపురుషంబుతో నన్వయించినది కావున ముప్పదిమూఁడు ముప్పదినాలుగు సూత్రంబులచే ‘రు’, శబ్దాగమత్వంబులుగల్గి ‘ధన్యులరు’, అనురూపంబాయెను. ‘మీరును మేమును ధన్యులము’, ఈ వాక్యంబునయందు మధ్యమపురుషోత్తమపురుషంబులున్నందునఁ గ్రియావిభక్తులవిధికి సంశయంబు రాఁగాఁ బ్రకృతసూత్రంబున నుత్తమపురుషకార్యంబు ప్రబలంబై ముప్పదిమూఁడవసూత్రంబుచే ముశబ్దాగమంబును, ముప్పదినాల్గవసూత్రంబున నత్వంబును గల్గినవి. వాస్తవంబున నాలోచింపఁగా ‘వారునుమీరును ధన్యులరు’, అనువాక్యంబునందు ‘మీరును’, అనిన యుష్మచ్ఛబ్దార్థంబువోలె ‘వారును’, అనినతచ్ఛబ్దార్థంబును బ్రథమాంతంబగుటవలనను, బ్రథమాంతంబు శాస్త్రంబునంజేసి కర్తగానుండుటవిధియౌటవలనను, కర్తకుఁ గ్రియాన్వయ మవసరమగుటవలనను, ‘వారును’ అనినతచ్ఛబ్దార్థంబునకుంగూడఁ గ్రియతో నన్వయంబు తప్పక యుండవలసియున్నది. కావుననే ధన్యత్వము యుష్మదర్థంబునందు సంబంధించినట్టులే తచ్ఛబ్దార్థంబునందుంగూడ నన్వయించుచును, ‘మీరును ధన్యులరు, వారును ధన్యులు, అని స్ఫురించుచున్నది, అందున 1 వారును 2 మీరును 1 ధన్యులు, 2 ధన్యులరు, ఇట్లుండ ‘రాములు, అనిన బహువచనాంతమైన యుదాహరణంబునందుఁ బక్కన రెండు రామశబ్దంబులను లోపించి యొక్క రామశబ్దంబే శేషించినయట్టులు ‘ధన్యులు’ అనిన ప్రథమపురుషంబు లోపించి ‘ధన్యులరు’ అనిన మధ్యమపురుషంబు శేషించినదనియు, భాషాపరిపాటింజేసి తెలుంగులోఁ బ్రథమపురుష మధ్యమపురుషంబులకు సముచ్చయంబున మధ్యమపురుషంబునకు నేక శేషంబు గలుగు ననియు. మధ్యమోత్తమ పురుషంబులకు సముచ్చయంబున నుత్తమపురుషంబునకు

సముచ్చయంబు గలుగుననియు, నూహింపవలయును. మ॥ అనమాన్యుఁ సభలోన మాన్యుఁ డని సౌహార్దంబునం గౌరవస్థవిరచేష్టల నిన్నుఁ బాండుతనయుల్ దప్పంగఁబూజింపఁ జిరవ్యావివేకాస్పదులైన పాండవులు మోహాంధుండు భీష్ముండు గాశివనీవుంగడఁగుండు నాకు నెదురై సంగ్రామరంగంబునన్' భార-సభా. 2 ఆ. అనుపద్యంబునందు 'నవివేకాస్పదులైన పాండవులు కడంగునది: భీష్ముండు కడంగునది నీవుకడంగుము' అని పాండవభీష్మకృష్ణులు ముఖ్యగుణము గ్రియలతో నన్వయించుచున్నది. ఇటఁ బ్రథమపురుషంబు లోపించి మధ్యమపురుషంబున కే శేషంబు కలిగినది. తక్కినపురుషంబులు లోపించినట్లు గానంగను, అనినబహువచనంజే దెలుపుచున్నది. ఇట్టిపురుషంబుల సమావేశంబున సంస్కృతభాషయందును, ఆంధ్రభాషయందును, గొంతెము సాదృశ్యంబున్నంగున బాలవ్యాకరణంబులో నుదాహరింపఁబడిన తెలుఁగువాక్యంబులు సంస్కృతంబులోనికి మార్చి చూపంబడుచున్నయవి. 'వాఁడును మీరును ధన్యులగు' దీనికి సంస్కృతము 'యూయంధన్యాః' అని యుండును. త్యదాదీనామిత్యేకశేషసహోక్తౌ యత్పరంతచ్ఛిష్యతే, అను సాంస్కృతిక వ్యాకరణంబునఁ దైవాక్యంబులోని 'యూయం, అను రూపంబు, తేచ(వాఁడును) యూయంచ(మీరును)=యూయం (వారును,మీరును), అను నర్థంబుంగల రూపంబయ్యె. త్యద్శబ్దంబుమొదలైన శబ్దంబులకు నన్యోన్యము సహవాసంబు గలిగినప్పుడు త్యదాదిగణంబులోఁ బాఠక్రమంబున నేదిశబ్దంబు పరంబోయది శేషించి తక్కినయవిలోపించునని యర్థము. త్యదాదులు—త్యద్, తద్, (వాఁడు,అది) యద్ (ఎవఁడు,ఏది) ఏతద్, ఇదం, అదస్ (వీఁడు,ఇది) ఏక, ద్వి, (ఒకటి,రెండు) యుష్మత్ (నీవు)అస్మత్ (నేను) భవత్ (నీవు),అనునీయవి ద్విశబ్దంబువఱకేకాక భవచ్ఛబ్దమువఱకు నీవార్తికంబులోఁ ద్యదాదులని వ్యవహరింపఁబడుచున్నవి ఈశబ్దార్థంబులకు సముచ్చయంబుసంభవించినప్పుడు పైగణపాఠంబులోఁ జూపినక్రమంబున నేశబ్దంబుపరమో యది శేషించితక్కినశబ్దంబులోపించు. 'యూయం,అనునపుడు 'తేచ,యూయంచ(వాఁడును, మీరును)అన్నవృత్తి పైనింజూపఁబడెను. ఈవృత్తిలోఁ దచ్ఛబ్దార్థంబును,యుష్మచ్ఛబ్దార్థంబును, మిళితంబులై యున్నయవి. పైగణపాఠంబులోఁ దచ్ఛబ్దంబుతరువాత యుష్మచ్ఛబ్దంబు పఠింపబడినందునఁ బూర్వోక్తసూత్రంబుచేఁ దచ్ఛబ్దంబు లోపించి యుష్మచ్ఛబ్దంబు శేషించినది. ఇట్లు 'యూయం' అనినయుష్మచ్ఛబ్దంబు శేషించినప్పటికి నార్థాపత్తిఁబునకే 'వారును మీరును, అనునర్థంబు చెప్పికొనవలయును. అనఁగాఁ

పదశ్శబ్దంబు లోపించినను దాని యర్థంబుమాత్రంబు లోపింపక యేకశేషవృత్తిలో నిమిడి యున్నయది. ఇట్లు సంస్కృతంబులో 'తేచ యూయంచ, అను సుబంతంబులకు నేకశేషము గలిగినప్పుడు పరమైనయుష్మచ్ఛబ్దంబే మిగిలినప్పటికిఁ దచ్ఛబ్దార్థము పోనియట్టులు తెలుంగుబాషశైలింజేసి 'వారును మీరును ధన్యులరు, అను వాక్యంబులోఁ దృదాది పర్యాయంబులైన 'వారును మీరును, అనువానికి నేకశేషంబు గలుగక వాని విధేయవిశేషణంబులకును, వాని క్రియలకును, నేకశేషంబు సంభవించి తదర్థముపోదని గ్రహింపవలయును. పై తెలుంగువాక్యంబులో ధన్యులరు, అన్నది విధేయవిశేషణంబు. పైసంస్కృతవాక్యంబులో 'యూయం, అనునప్పుడు 'తేచ(వారును), అన్న యర్థంబిమిడియున్నట్లె 'ధన్యులరు, అన్నప్పుడు 'ధన్యులు, అనిన ప్రథమపురుషంబిమిడి యున్నయది యనియు, నాంగ్లభాషాశైలింజేసి ప్రథమపురుష మధ్యమపురుష సమావేశంబున మధ్యమపురుషంబు శేషించుననియు, మధ్యమపురుషోత్తమపురుష సమావేశంబున నుత్తమపురుషంబునకు నేకశేషంబు గలిగి మధ్యమపురుషంబు లోపించుననియు, లోపించిన పురుషంబులయర్థంబు శేషించిన పురుషంబులలోనే యిమిడి యుండుననియు గ్రహించునది. కావుననే పైచిన్నయసూరికృతసూత్రంబులో 'ఉత్తరోత్తరకార్యంబులు బలములని చెప్పంబడినందునఁ బ్రథమాదిపురుషంబుల యర్థంబులు, నిర్బాధకంబుగ స్ఫురించునని తోఁచుచున్నది. ఇఁకను మీరును మేమును ధన్యులము, అను తెలుంగువాక్యంబునకు 'వయంధన్యాః, అన్న సంస్కృతవాక్యంబు పర్యాయంబగు (పైవాక్యంబులోని) 'వయం=యూయంచ, వయంచ (మీరును మేమును), అనిన యస్మచ్ఛబ్దంబుచేతనే యుష్మచ్ఛబ్దార్థ మేకశేషవృత్తిచే గ్రహింపఁబడుచున్నయది. 'ధన్యాః' అనునట్టి ధన్యశబ్దార్థంబుకూడ లోపించిన యుష్మచ్ఛబ్దంబుయొక్క యర్థంబుతో సమన్వయించుచున్నది. (పైవాక్యంబులోని) 'ధన్యాః'= ధన్యాశ్చ ధన్యాశ్చ (ధన్యులరు, ధన్యులము), అని యేకశేషవృత్తిచే నుభయశబ్దార్థంబులకును సమన్వయించును. 'వయం ధన్యాః, యూయం ధన్యాః, అనువాక్యంబులలో లోపించిన యుష్మచ్ఛబ్దార్థతచ్ఛబ్దార్థంబులను సమన్వయించుటకై ధన్యాః, అను చోటునం గూడ నేకశేషంబైనయట్టులు 'వారును మీరును ధన్యులరు, మీరును మేమును ధన్యులము' అనిన ధన్యశబ్దంబునొద్ద నేకశేషవృత్తి యున్నదనియు, వాక్యంబులో శ్రుతంబులైన పైరేఖానిర్దిష్టతచ్ఛబ్ద యుష్మచ్ఛబ్దార్థంబులతో సమన్వయించుననియు గ్రు

హించునది. ఇక నేక శేషవృత్తిచే బహువచనాంతక్రియలు కాక యేకవచనాంతక్రియ గలిగిన యీక్రింది మహాకవిప్రయోగంబుల వాక్యాంతరంబు చేసికొని పురుషవిపరిణామం (మార్పుట) బూహించుకొనవలయును. ఉ. విప్రకులుండ. వెల్వడుము వేగమ నీవును నీనిషాదియుక్, భార-ఆది-2ఆ. క. మనకాప్తుండు సంజయుఁడీ। తనియుపదేశంబు నట్టి ధర్మమున ముకుం। దుని నాశ్రయింపవయ్యా యా। తనిఁ బొందిన బ్రదుకుదీవుద మ్ములు సుతులుక్, భార-ఉద్యో-2ఆ. ఉ. నేను నా। సేనయు దాడివెట్టెద విశృంఖలతక్' హరి ఉ. 3ఆ. ఉ॥ వె॥ ఎలుఁగుబంటు పడఁగనిల్లునఁ బసునాలు। గేండ్లు రాఘవుండు నీవు నన్ను। రణ్యభూములందు రక్షించినేఁడుకా। [illegible] విడిచెదనిన, జైమి. 6ఆ. పైప్రయోగపద్యంబునందు 'వెల్వడుము' అను నేకవచనాంతంబు 'నిషాదియుక్' అను దానితో సమన్వయించుటకై 'వెల్వడునది', అని విభక్తి విపరిణామంబున వాక్యాంతరంబూహించుకొనవలయు, ఇట్లే పైనిం జూపిన తక్కుంగల యుదాహరణమ్ముల యందును 'తమ్ములు సుతులు', ఇత్యాదిప్రథమాంతంబులు విభక్తివచనంబుల విపరిణామంబున సాక్షిప్తంబైన 'బ్రదుకుఁడు', ఇత్యాది క్రియలతో వాక్యాంతరంబున నన్వయించునని యెఱుంగునది.

ఒకానొకరు 'యుష్మదస్మదర్థంబులగును. అనాఖ్యాతంబులగును, వాక్యంబున సమావేశంబు గలిగినప్పుడు క్రియలకు యుష్మదస్మదర్థంబులే కర్తలగునుగాని యితరంబు కర్తలుకావని చెప్పిరి. అయ్యది న్యాయ్యంబు. సర్వపురుషంబులకు సమావేశంబులోఁ బ్రథమపురుషంబుకంటె మధ్యమపురుషంబును, దానికంటె నుత్తమపురుషంబును, బ్రబలంబైనందునఁ గ్రియాపదాయుపురుషవిశేషంబులు గలవియైనను యుష్మదస్మదర్థంబులకంటె నన్యంబులు కర్తలతో సామానాధికరణ్యమొందకుండుట యాశ్చర్యంబు. అట్లన్వయింపనిచో వాక్యంబునకు ననన్వయాపత్తి గలిగి వాక్యదోషంబు సంఘటిల్లును. కావుననే యుష్మదస్మదర్థంబులేకాక తక్కినవి కర్తలైనప్పుడును గ్రియ యేకవచనంబులో నుండినకొన్ని కవిప్రయోగంబులు గలవు. ఇట్టి యేకవచనాంత క్రియతోను; కర్తలనేకులను సంభవించినచో భిన్నవాక్యంబు చేసికొని సమన్వయించుకోవలయును. క. తనయోజించిన యర్థంబొరుఁ। డనఘా యుదిరొట్టు-

చెప్పుమని యడిగినఁ జెప్పనివాఁడును సత్యము చెప్పనివాఁడును ఘోరనరకపంకమునఁ బడుదురు, భార-ఆది- 2ఆ. ఇత్యాదులూహించుకొనవలయును. కర్తలు బహువుగానుండి క్రియ బహువచనంబునందున్నచో నిర్బాధంబు. గీ. బలవంతుఁడుపయికెత్తిన బలహీనుఁడు ధనము గోలుపడినయతఁడు ప్రయుద్ధిఁ జేయు నతఁడుఁ గాముఁ | కులచిత్తుఁడు నిద్రలేక యుందురధిపా!, భార- ఉద్యో- 2ఆ. గీర్వాణభాషయందును గర్తృబహుత్వంబున్నను క్రియ యేకవచనంబులో నుండుట తఱచుగలదు. శ్లో. జయత్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః, రామాయణము. సుందరకాండ. 42 సర్గ. (అతిబలుండైన రాముఁడును లక్ష్మణుండును జయించెను) శ్లో. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః, పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః, మహాభారతస్థ భీష్మపర్వఘటిత భగవద్గీత-ప్రథమాధ్యాయము. (కృష్ణుండు పాంచజన్యంబును అర్జునుండు దేవదత్తంబును, భీముండు పౌండ్రంబనుశంఖంబును, బూరించెను) శ్లో. సఖా గరీయాన్ శత్రుశ్చ కృత్రిమః, మాఘము. 2 సర్గ-36 శ్లో. (కృత్రిమశత్రువును, కృత్రిమస్నేహితుండును, బలీయుండు) శ్లో. మదేన భాతి కలభః ప్రతాపేన మహీపతిః, కువలయానందము దీపకాలంకారము. (మదముచేత నేనుఁగుగున్నయుఁ, బ్రతాపముచేత రాజును బ్రకాశించును.)

37 సూ—ఏకవాక్యంబునందొకానొక్కఁడుతక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగఁ బ్రయోగింపంబడును.

పూర్వమిది పరమిదియను నియమమపేక్షింపక వాక్యమందెల్ల పదంబులు వలచినట్లు ప్రయోగింపందగును - ఏన్నిప్రభృతిశబ్దములు కొన్నినియమసాపేక్షంబులయియుండు - గాలిచల్లగావీచెను - వీచెనుజల్లగాగాలి - చల్లగాగాలివీచెను - వీచెనుగాలిచల్లగా - గాలివీచెనుజల్లగా - చల్లగావీచెనుగాలి.

వ్యా—వాక్యంబునందు నొకానొకపదంబుతప్ప నన్నిపదంబులు సాపదముతెఱు

వాత నీపదమే ప్రయోగింపవలయునని నిరుసలో నియమము నవసరంబులేకుండ వాక్యం బునందుఁ బదంబులు వాక్యార్థంబు చెడకుండునట్లుగ యథేచ్ఛం బ్రయోగింపవచ్చును. (మూలము) పూర్వమిది పరమిదియను నియమ మపేక్షింపక వాక్యమందెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపందగును. (స్పష్టము) (వ్యా) ఏనిప్రభృతిశబ్దంబులుకొన్ని నియమ సాపేక్షంబులయియుండు; 1. గాలి చల్లగా వీచెను 2. వీచెను చల్లగా గాలి 3. చల్ల గా గాలి వీచెను, 4. వీచెనుగాలి చల్లగా 5. గాలివీచెను చల్లగా 6. చల్లగావీచెనుగాలి. వ్యా—ప్రభృతిశబ్దంబుచేత ‘పోలెన్, వలెన్, అట్లు, అయ్యెడను, పోండెన్, ఇత్యాది పదంబులు నియమం బపేక్షించి ప్రయోగింపంబడు. అనంగా ఏని, శబ్దాదులు తమయ ర్థంబేపదంబులయర్థంబులతో నన్వయించునో యాపదంబులయొద్దనే వచనకావ్యమందు గాని పద్యకావ్యమందుఁ గాని ప్రయోగింపందగును కాని తదన్వయంబాకాంక్షించు పదార్థంబులకు దూరంబునఁ బ్రయోగింపఁబడఁ గూడదు. ప్రకృతోదాహరణంబునందు ‘వీచెను’ అనుశబ్దంబునందలి క్రియాపదార్థమే సాకాంక్షితంబై ‘గాలి’ అనుకర్త ‘వీచు’ క్రియతో నన్వయించుచున్నయది. కానఁ గర్తయును, క్రియయును సాన్నిధ్యనియమంబు ప్రాప్తించుచుండఁగాఁ బదార్థంబులకు వ్యవధానంబున్నను దోషంబు లేదనుటంజేసి ‘చల్లగా’ అను క్రియావిశేషణంబు ‘గాలి, వీచెను’ అనుశబ్దంబులకు మధ్యగానున్నను దోషంబులేదు. ద్వితీయోదాహరణంబునందుఁ గ్రియ మొదటనుండినను ‘చల్లగా’ అను క్రియావిశేషణంబు క్రియాకర్తల మధ్యనుండి యెడముకలిగించుచున్నను దోషంబు లేదు. తృతీయోదాహరణంబునందు ‘చల్లగా’ అనునది క్రియావిశేషణంబుగావున ‘వీచెను’ అనుక్రియయొద్ద నుండుట యత్యావశ్యకంబైనను దూరస్థితమైన వాక్యంబనర్థ కంబుగాదు. చతుర్థోదాహరణంబునందుంగూడఁ గర్తకుమున్నె క్రియయున్నను ‘చల్ల గా’ అనుక్రియావిశేషణంబు దూరస్థంబైనను నశాస్త్రీయంబుగాదు. పంచమోదాహ రణంబునందు విశేషణంబు విశేష్యంబునకు ముందుండుట యవసరంబుగావున ‘చల్లగా’ అనుక్రియావిశేషణంబు ‘వీచెను’ అనుదానికి ముందుండుట యుక్తంబు. ఇటం గ్రియ తరువాత నున్నను గుణంబె. షష్ఠోదాహరణంబునఁ గర్తకుఁ బూర్వంబునఁ గ్రియయు న్నను సరసంబ. సంస్కృతభాషయందుంబలె నాంధ్రభాషయందును వాక్యంబున న న్వయక్రమంబు నపేక్షించి పదంబులు ప్రయోగింప నత్యావశ్యకత లేదుగనుకనే ‘వ్యవ హితాశ్చసర్వేస్యుః’ అనివన్నయభట్టారకపండితాగ్రేసరుండు సూత్రించి రచియించెను.

ప్రత్యర్థంబులను వాక్యంబు నవ్యవధానాన్వయధానంబులు వివక్షింపనవసరంబు లేక యథేష్టంబుగాఁ బ్రయోగింపనగునని పైసూత్రార్థము) శ్లో॥ వ్యవధానంచ సాధుత్వ్యాత్కారకాద్యంత భాగయోః। మధ్యభాగే తత్ప్రయోగో నసాధుర్వ్యవయం గమః' వాక్యార్థంబునకు విఘాతంబుసేయక యర్థంబును బ్రకాశింపఁజేయునట్టి పదవ్యవధానంబు సమీచీనమే యనియుఁ గ్రియా ప్రయోగంబు కర్తృకారకంబులకుఁ బ్రథమమునఁగాని కడపటఁగాని యుండవలెననియు, కర్తలమధ్యను గ్రియ ప్రయోగించినచో వాక్యంబు నిరర్థకంబగుననియు, వ్యాకరణాచార్యులు నన్నయభట్టారకసూత్రంబును గొంత స్పష్టపఱచుచున్నారు. 'నడచె నేనుఁగు గుఱ్ఱము; ఏనుఁగు గుఱ్ఱము నడచెను' అని కర్తృద్వయంబునకు మొదటనైనను గడపటనైనను గ్రియ ప్రయోగింపవలెనుగాని 'ఏనుఁగు నడచెను గుఱ్ఱము' అని కర్తల మధ్యను గ్రియాప్రయోగము సాధువు కాదని వ్యక్తపఱుచుచు నహోబలపతి నన్నయభట్టారకసూత్రంబును వివరించెను. ప్రౌఢవ్యాకరణంబున 'వాక్యార్థజ్ఞానంబునకు నాసత్తియుఁ, (పదంబుల యాసన్నత) యోగ్యతయు, ఆకాంక్షయు, నావశ్యకంబుల'ని చెప్పంబడియె. ఇట్టు లక్షణాచార్యులలో నొక్కొక్కరు నన్నయభట్టారక సూత్రంబును శక్తివంచన లేకుండ వివరించిరి. మదీయాభిప్రాయంబేమనఁగా వాక్యార్థజ్ఞానంబునకు నాసత్తి యోగ్యతాకాంక్షాతాత్పర్య జ్ఞానంబులు నాలుగును సహకారులుగా నుండవలయును. కావున నే, శ్లో॥ ఆసత్తిర్యోగ్యతా కాంక్షా తాత్పర్య జ్ఞానమిష్యతే కారణం సన్నిధానంతు పదస్యాసత్తిరుచ్యతే। పదార్థే తత్ర తద్వత్తా యోగ్యతా పరికీర్తితా। యత్పదేన వినా యస్యాననుభావకతా భవేత్। ఆకాంక్షా వక్తురిచ్ఛాతు తాత్పర్యం పరికీర్తితం' అని సిద్ధాంత ముక్తావళియందు నుదాహరింపఁబడినది. అర్థము — ఆసత్తి యోగ్యతాకాంక్షా తాత్పర్యజ్ఞానంబులు శాబ్దబోధంబునకు (వాక్యార్థజ్ఞానంబునకు) సహకారికారణంబులు. ఏపదార్థంబుల్తో నేపదార్థంబునకు నన్వయమపేక్షింపఁబడునో యట్టి పదార్థంబులకు నితరపదార్థంబుతో వ్యవధానంబు లేకుండుట యాసత్తి యనంబడు. ఉ. దేవదత్తునిచేతఁ బక్వాన్నము భుజింపఁబడెనన్నంతము. ఇచ్చటను 'దేవదత్తునిచేత' అనెడి పదార్థంబునకు 'భుజింపఁబడెడు' అనుపదార్థంబుతో నన్వయంబపేక్షింపఁబడినది. ఇట్లు పరస్పరమన్వయాపేక్షకలిగిన దేవదత్త పదార్థంబునకును భుజింపఁబడుట యనుపదార్థంబునకును నడుమ 'పక్వాన్నము' అనెడు పదార్థంబు చొచ్చి వ్యవధానంబు గలుగఁజేయుచున్నది కాననీవా

క్యంబాసత్తి లేనియందున నిరర్థకంబు. మఱియు 'పర్వతమగ్నిమంతము' అనివాక్యం బంటు న్యాయ్యంబు. ఇట్లుండవలసినదానికి నీరంబు పదార్థంబులను 'భుజింపఁబడియె' అనెడి వేఱొకయనన్వితపదార్థంబు మధ్యస్థమై యనన్వయంబు కలిగించి వాక్యంబును వ్యర్థమొనరించుచున్నయది. కాన నాసత్తి లేని యిట్టినిరర్థకవాక్యంబులు ప్రయోగింపంజనదు. 2. ఒకపదార్థంబుతో వేఱొక పదార్థంబునకు బాధలేకుండు సంబంధంబు యోగ్యతయనంబడును. ఉ. దేవదత్తుఁ డగ్నిచేఁ దడుపుచున్నాఁడు. ఈవాక్యంబున నగ్నిచేఁ దడుపుట యసందర్భంబుగావున నిట్టివాక్యంబు యోగ్యతాకారణంబు లేనియది. కాన నిట్టివాక్యం బుపయోగింపం దగదు. 3. ఏపదంబులేకుండ వేఱొకపదంబునకు నన్వయజ్ఞానంబు గలుగకుండునో యట్టిపదంబుతో వేఱొకపదంబునకు సాపేక్షసంబంధం బాకాంక్షయనంబడు. ఉ. ఇతఁడు పుత్త్రుండు రాజునకు మిత్త్రునిదెమ్ము. ఈవాక్యంబున 'రాజునకు' అనెడిపదంబులేనిచోఁ బుత్త్రుండనెడిపదంబునకు నన్వయజ్ఞానంబు లేదుగానఁ బుత్త్రరాజశబ్దంబులకుఁ బరస్పరాన్వయం బాకాంక్షితంబయ్యెను. 'రాజునకు' అనుషష్ఠ్యంతంబు పుత్త్రశబ్దంబుతో నన్వయించినందున 'మిత్త్రునిదెమ్ము' అనువాక్యంబులోని మిత్త్రశబ్దంబుతోఁ జేరిన యన్వయం బాకాంక్షితంబుగాదు. కాఁబట్టి రాజమిత్త్రశబ్దంబులకు నన్వయంబుగలిగి వాక్యార్థంబు గానేరదు. రాజమిత్త్రుఁడని యుద్దేశించుకొని యిట్టివాక్యంబు ప్రయోగింపంగూడదు. 4. అన్వయార్థంబు శ్రోతకుఁ దెలియ వలెనని యుచ్చరించుట తాత్పర్యంబనాఁబడు. ఉ. సైంధవంబును దీసికొని రమ్ము (భోజనప్రకరణంబందలి వాక్యంబు) సైంధవశబ్దంబునకు నశ్వంబును, లవణంబును నుభయంబును నర్థమైనను బ్రకృతంబున లవణంబును దెచ్చినశ్రోతయే స్తుతిపాత్త్రుండగును గాని యశ్వంబును దీసికొనివచ్చినచో స్తుత్యుండు కాఁడు. అందున వాక్యార్థజ్ఞానంబునకుఁ బైనిం జెప్పిన యాసత్త్యాదులు నాలుగును శాబ్దబోధంబునకు, గారణంబులు. బాలవ్యాకరణంబులోఁ బ్రకృతసూత్త్రంబున 'సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంజను' అని వక్కాణింపంబడినను వాక్యంబు నిరర్థకంబుకాకుండునంతటి పదవ్యవధానంబులేకుండఁ బూర్వోక్తాసత్త్యాదికారణచతుష్టయంబు గాంచనుండవలయును. ప్రసంగవశంబున వాక్యస్వరూపంబు విషయంబై యాసత్తి మొదలైనవి నిర్వచించి ప్రదర్శింపంబడియెను.

ఇది కారకపరిచ్ఛేదము.

# సమాసపరిచ్ఛేదము

సమాసంబులఁ గుఱిచి తెలియఁజేయు భాగంబు సమాసపరిచ్ఛేదంబనంబడును.

**1 సూ—సమర్థంబులగు పదంబు లేకపదంబగుట సమాసంబు.**

పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు - పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందువృత్తి సామర్థ్యము.

వ్యా—సమర్థంబు లగుపదంబులనఁగా సామర్థ్యంబు గలిగిన పదంబులు. సామర్థ్యంబు వ్యపేక్ష యనియు, ఏకార్థీభావంబనియు, ద్వివిధంబు. వ్యపేక్షాసామర్థ్యంబు వాక్యంబునందును, ఏకార్థీభావసామర్థ్యంబు సమాసంబునందును, వైయాకరణులచే నంగీకరింపంబడియె. కొండొకచో నుభయంబును సమాసమందంగీకరింపం బడుచున్నది. తమతమ యర్థంబులఁ దెలియంజేయుపదంబులకు నాకాంక్ష (అపేక్ష) వలన నన్యోన్యంబును సంబంధంబువ్యపేక్షాసామర్థ్యంబనంబడును. ఉ. దేవదత్తునియొక్క గురువు. ఈవాక్యంబునందు 'గురువు' అనియర్థంబు చెప్పినతోడనే యెవనియొక్క గురువనియాకాంక్ష కలిగినపిమ్మట 'దేవదత్తునియొక్క' అనిన పదార్థంబు సమాధానంబుగా సమర్పింపఁబడుచున్నది. కావున దేవదత్తపదార్థంబునకును, గురుపదార్థంబునకును నన్యోన్యాపేక్షవలన సంబంధంబు కలదు. వాక్యంబునందలి యిట్టిసంబంధంబే వ్యపేక్షాసామర్థ్యంబు. ప్రక్రియావస్థయందు వేర్వేఱుగానున్న పదంబులయర్థములను నన్యోన్యంబును విశేషణవిశేష్యభావంబున మేళగించి యేకపదార్థంబుగా భావించుట యేకార్థీభావసామర్థ్యంబు. ఉ. దేవదత్తుని గురువు. ఈసమాసంబున 'దేవదత్తుండును, గురువును' అనిన రెండుపదార్థంబులు గలవు. దేవదత్తునిగురువనఁగా దేవదత్తసంబంధియైన గురువని యర్థంబగుచున్నందున గురువు విశేష్యంబుగాను, గురుపదార్థంబునకు దేవదత్తుండు విశేషణంబుగాను దెలుపఁబడుచున్నారు. తెలుఁగులు [illegible] [illegible] యేకపదార్థంబుగా భావింపఁబడినట్టులును, [illegible] భాగంబులు [illegible] [illegible]

చెనంగాని వేణీయను నెపంబున నేకపదార్థంబుగా భావింపఁబడి నట్టులును, దేవదత్తగురుపదార్థంబులు రెండును విశేషణ విశేష్య సంబంధంబుచేనన్యోన్యంబును మిళితంబులై దేవదత్తసంబంధిగురువని యఖండార్థంబుగా భావింపఁబడును. వాక్యమునందంగీకరింపఁబడిన వ్యపేక్షాసామర్థ్యంబుగాక సమాసంబునందు నేకార్థీభావంబని వేఱొకసామర్థ్యంబంగీకరించుటకుఁ గారణంబేమన నాకర్ణింపుము 'సుందరుండు దేవదత్తునియొక్క గురువు' అనిన వాక్యంబునఁ బైనిం జెప్పిన ప్రకారంబున దేవదత్తగురు పదార్థంబులకు వ్యపేక్షా సామర్థ్యంబు గలుగుగదా! ఈవాక్యంబున 'సుందరుండు' అనిన విశేషణంబు దేవదత్తున కన్వయించి సుందరుఁడైన దేవదత్తునియొక్క గురువని తోఁచుచో సౌందర్యము దేవదత్తునకుఁ సలుపంబడును. (ఏకార్థీభావంబునుగూర్చి కారకపరిచ్ఛేదంబునందలి 27 సూత్రంబునొద్ద విస్తరంబుగ వ్రాయఁబడె) 'సుందరుఁడు దేవదత్తునిగురువు' అనిన స్థలంబున దేవదత్తుని గురువనఁగా దేవదత్తసంబంధిగురువని యఖండార్థముగా (ఏకార్థముగా) భావింపఁబడినందున 'సుందరుఁడ'నిన విశేషణంబు గురువుతో నన్వయించుంగాని షష్ఠీతత్పురుషంబులో నేకదేశవర్తియైన దేవదత్తునితో నన్వయింపదు. ఇఁకను 'పార్థివ! ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పిది నీకునలంఘ్యము' భార-అర-6ఆ. 'భుజాటోపభయంకరుఁ డర్జును కోపానలము' భార-ఉద్యో-1ఆ. ఇత్యాది స్థలంబులయందు 'ధర్మసుతు పన్పు' అనిన సమాసంబులో నేకదేశవర్తియైన ధర్మసుతునితో 'పార్థివ ప్రాగ్రసరుండు' అనిన విశేషణంబును 'అర్జును కోపానలంబు' అనిన ద్వితీయోదాహరణంబులో నంతర్గతంబైన యర్జున పదార్థంబుతో భయంకరుఁడు, అనిన విశేషణంబును నెట్టులన్వయించెనని శంకింతురేని యట్టిప్రయోగంబులగతికగతికంబులగుటంజేసి క్వాచిత్కంబుగాఁ బ్రయోగింపఁజనునని కారకపరిచ్ఛేదంబునందలి యిరువదియేడవ సూత్రంబువివరింపు తఱిని విస్తరంబున వివరించి యంగీకరింపఁబడియె. కనుకనే పైని సమాసంబునందుఁ గొండొకచో నేకార్థీభావంబును, వ్యపేక్షయును నుభయంబును నుండునని చూపఁబడె. ఇట్టి యుదాహరణంబులందు నేకార్థీభావంబేకాక వాక్యంబున నుండునట్టి వ్యపేక్షాసామర్థ్యముకూడ నంగీకరింపఁబడినందున 'పార్థివ ప్రాగ్రసరుండు, ధర్మసుతునియొక్క పన్పు' ఇత్యాది వాక్యంబులందు 'పార్థివప్రాగ్రసరుండు, ఇత్యాది విశేషణంబులు ధర్మసుతునితో నన్వయించినట్టులు 'పార్థివ ప్రాగ్రసరుండు, ధర్మసుతుపన్పు' అనిన సమాసస్థలంబునందుంగూడ విశేషణంబు వ్యపేక్షా

సామర్థ్యంబున నుండవచ్చును. పైని వివరించినయేకార్థీభావంబునే మూలంబులో 1 పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబనియు, (2 పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తిసామర్థ్యమనియు, లక్షణద్వైవిధ్యంబు చూపి సూరిగారు వివరించిరి. అన్యథా 1 వేఱుగానున్న యర్థంబులకు నేకార్థత్వభావన సామర్థ్యంబనియును, 2 వేఱుగాఁ ప్రసిద్ధంబులైన యర్థంబులం దెలియంజేయు పదంబుల కేకార్థంబుస్ఫురింపించునట్టి శక్తి సామర్థ్యంబనియుఁ బూర్వోక్త లక్షణ ద్వయార్థంబు. ఈలక్షణార్థంబు లుదాహరణసహితంబుగా శాఖాచంక్రమణంబు చేసి పైని వివరింపంబడియెఁ గావునఁ బునరుక్తంబుగ విశదీకరించుట యనావశ్యకంబు. పైనిం జెప్పిన సామర్థ్యంబు గలిగిన పదంబులు చేరి యఖండపదంబు కావుట సమాసంబనంబడు. సమాసంబనఁగాఁ గూడికవలననైనది యని యవయవార్థంబు. వాస్తవంబున నాలోచింపఁగా మూలసూత్రంబున 'సమార్థంబులగు పదంబులు' అని సవర్ణదీర్ఘసంధితో నుండవలయును. అయినను 'సమ + అర్థ' ఇట్లుండ శకంధ్వాది గణంబున గణనం జేసి పరరూపసంధి కలిగి 'సమర్థ' అయ్యెను. దీనియందలి సమశబ్దంబునకు 'ఏకము' అనిన యర్థము. (సమర్థము=ఏకార్థము) ఏకార్థీభావశక్తిచే మిళితంబులైనపదంబులు సమాసంబనంబడునని లక్షణార్థంబు.

2 సూ.—సాంస్కృతికాచ్ఛిక మిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు.

సాంస్కృతికంబని యాచ్ఛికంబని మిశ్రంబనిన సమాసంబు త్రివిధంబు- అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు- కేవలసంస్కృతశబ్దంబుల సమాసంబు సిద్ధంబనంబడుఁ - రాజాజ్ఞ - తటాకోదకము - లక్ష్మీవల్లభుఁడు ॥ సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబనంబడు- రాజునాజ్ఞ - తటాకంబునుదకము - లక్ష్మివల్లభుఁడు ॥ తక్కిన తెనుఁగుల సమాసం బాచ్ఛికంబనంబడు ॥ తేనియమాఁగతి - చెఱువునీరు - సిరిచె

లువుఁడు ॥ ఉభయంబులుగూడినది మిశ్రంబనంబడు - రాజుముదల - చెఱువునుదకము - సిరివల్లభుఁడు.

1 సాంస్కృతికంబని, యాచ్ఛికంబని మిశ్రంబని, సమాసంబు త్రివిధంబు 2 అందు సాంస్కృతికంబు సిద్ధంబని, సాధ్యంబని ద్వివిధంబు 3 కేవలసంస్కృతశబ్దంబుల సమాసంబు సిద్ధంబునాఁబడు; రాజాజ్ఞ, తటాకోదకము, లక్ష్మీవల్లభుఁడు 4 సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబునాఁబడు; రాజునాజ్ఞ, తటాకంబునుదకము, లక్ష్మీవల్లభుఁడు. 5 తక్కిన తెనుఁగుల సమాసంబాచ్ఛికంబనఁబడు; తేనియానతి, చెఱువునీరు, సిరి చెలువుఁడు 6 ఉభయంబులు గూడినది మిశ్రంబనంబడు; రాజుమునల, చెఱువునుదకము, సిరివల్లభుఁడు.

వ్యా—1 సాంస్కృతికంబు, ఆచ్ఛికంబు, మిశ్రంబు, అను భేదంబులచే సమాసంబుమూఁడువిధంబులు. సంస్కృతశబ్దంబులు కారణంబు గాఁగల సమాసంబు సాంస్కృతికంబు. అచ్చతెనుఁగుపదంబులు కారణంబుగాఁగల సమాసం బాచ్ఛికంబనంబడు. అనేక పదంబులు నేరి సమాసంబైనది కావున నంతర్వ్యాఖ్యానంబులగు పదంబు విశిష్టంబైనసమాసంబునకుఁ గారణంబగు. ఇచ్చట సంస్కృతాంధ్రశబ్దంబులకంటెఁ బ్రయోజనార్థంబు నందు శక్తి ప్రత్యయంబు గలిగి పైరూపంబులు సిద్ధించెను. 2 పైసమాసంబులు మూఁడింటిలో సాంస్కృతికము సిద్ధంబనియు, సాధ్యంబనియు రెండువిధంబులు 3 కేవలము సంస్కృతశబ్దంబుల సమాసంబు సిద్ధంబనంబడును. అనఁగా సంస్కృత సమాసంబాంధ్ర వ్యాకరణాపేక్షలేకయే సంస్కృతంబున సిద్ధంబైనదియని భావము, ఉ. రాజాజ్ఞ మొదలైనవి 4 సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబనంబడును. అనఁగా నాంధ్రవ్యాకరణంబుచే సంస్కృతపదంబులకు సంస్కారము సాధించుకొని చేయఁబడిన సమాసంబని భావంబు. ఉ. "రాజునాజ్ఞ" మొదలైనవి. ఇచ్చట రాజశబ్దసమంబు తెలుంగులో రాజు (తత్స-78సూ.) ఆజ్ఞాశబ్దంబు సంస్కృతంబులో దీర్ఘాంతంబు తెలుంగులో హ్రస్వాంతబగును. (తత్స—54సూ.) రాజు (యొక్క) + ఆజ్ఞ" అని యుండ "యొక్క" విభక్తి లోపంబుగలిగి సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పది మూఁడవసూత్రంబుచే నుగాగమంబున "రాజునాజ్ఞ" అయ్యెను. పైవలెనే "తటా

కంబునుదకము" యిత్యాదులూహించునది. "లక్ష్మీవల్లభుఁడు" లక్ష్మియొక్క వల్లభుఁడని విగ్రహంబు. సంస్కృతభాషలో లక్ష్మీశబ్దంబీకారాంతంబైనను తెలుఁగున హ్రస్వంబు గలిగె. 'కాళిదాసు, రేవతిపుత్త్రుఁడు, కాశీనాథశాస్త్రి, నదిసుతుఁడు, (భీష్ముఁడు) భ్రుకుంసుఁడు, భ్రుకుటి' (సంస్కృతంబులో భ్రూశబ్దంబూకారాంతంబు) గ్రామణిపుత్త్రుఁడు ఇత్యాదిసమాసంబులయందుఁ బూర్వపదంబు హ్రస్వాంతంబగుట సంస్కృతవ్యాకరణంబుచేత నని యెఱుంగునది (చూ-తత్స-54సూత్రవ్యాఖ్య) 5 సంస్కృతపదంబులు గాక కేవలము తెలుఁగుపదంబుల సమాసంబాచ్ఛికంబనంబడును. దీనికే సమాసకంబనియు నామాంతరంబు ప్రాచీనులచే వ్యవహరింపఁబడియె. ఉ. "తేనియావతి" మొదలైనవి తేనియొక్క యావతి యనివిగ్రహము. ఇచ్చటఁగాగమంబు తత్సమపరిచ్ఛేదంబునందలి యిరువదినాల్గవసూత్రంబుచే నామంబునకు నిత్యంబుగాఁ గలుగును. యొక్క విభక్తికి సమాసంబుగావున లోపంబుగలిగె. 6 తత్సమాంధ్రపదంబు లుభయంబులుఁజేరిన సమాసంబు మిశ్రంబనంబడును. ఉ. "రాజుముదల" మొదలైనవి, ఇచ్చట "రాజు" తత్సమంబు "ముదల" తెలుఁగు. "చెఱువునుదకము" ఇచ్చటనుదకము తత్సమము "సిరివల్లభుఁడు" ఇచ్చట వల్లభుఁడు తత్సమము.

**8 సూ—తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబయగు.**

తత్పురుష బహువ్రీహిద్వంద్వంబులనిసమాసంబులెల్లం ద్రివిధంబులయియుండు - అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదార్థ ప్రధానంబులయియుండు - అందుఁదత్పురుషంబు వ్యధికరణంబనిసమానాధికరణంబని ద్వివిధంబు - ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికరణంబునాఁబడు - నెలతాల్పు - నెలతక్కువవాఁడు - దేవరమేలు - దొంగభయము - రాముని బాణము - మాటనేర్పరి ॥ విశేషణంబునకు విశేష్యంబుతోడసమాసంబు సమానాధికరణంబునాఁబడు - ఇదియేకర్మధారయంబునాఁబడు - సరసపువచనము - తెల్లగు

జ్జము — మంచిరాజు — ఇదిసంఖ్యాపూర్వంబుద్విగువునాఁబడు - ముజ్జగములు - ముల్లోకములు ॥ బహువ్రీహి - ముక్కంటి - చలివెలుఁగు ॥ ద్వంద్వము - తల్లిదండ్రులు - అన్నదమ్ములు ॥ ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబుఁదోడరని సమాసంబుంగలదని సూచింపంబడియె — దానంజేసి చిగురుఁగేలు జుంటిమోవి యిత్యాదులయిన యుపమాన పూర్వపదకర్మధారయంబులు గ్రాహ్యంబులు॥ ముఖపద్మము - చరణకమలములు - ఇట్టియుపమానోత్తరపదంబులు గలవుగాని విపరీతంబులుసిద్ధంబులు లేవనియెఱుంగునది ॥ సిద్ధంబుసర్వంబుగ్రాహ్యంబు - రాజపురుషుఁడు - నీలోత్పలము - పీతాంబరుఁడు - రామలక్ష్మణులు ॥ కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు - దానంజేసియనేకమాఱు లల్పదంశీత్యాదులు దుష్టములని తెలియునది.

1 తత్పురుషబహువ్రీహిద్వంద్వంబులని ,సమాసంబు లెల్లంద్రివిధంబులయియుండు; అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయ పదార్థ ప్రధానంబులయియుండు; 2 అందుఁ దత్పురుషంబు వ్యధికరణంబని సమానాధికరణంబని ద్వివిధంబు; 3 ద్వితీయాదులకు మీఁది పదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు; నలతాల్పు, నెలతపుట్టువ వాఁడు, దేవరమేలు, దొంగభయము, రాముని బాణము, మాటనేర్పరి. 4 విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబునాఁబడు; ఇదియే కర్మధారయంబునాఁబడు; సరసపు వచనము, తెల్లగుఱ్ఱము, మంచిరాజు. 5 ఇది సంఖ్యాపూర్వంబు ద్విగువునాఁబడు; ముజ్జగములు, ముల్లోకములు. 6 బహువ్రీహి—ముక్కంటి, చలివెలుఁగు 7 ద్వంద్వము—తల్లిదండ్రులు, అన్నదమ్ములు. 8 ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబుఁ దొడరని సమాసంబుగలదని సూచింపఁబడియె; దానంజేసి చిగురుఁగేలు, జుంటిమోవి యిత్యాదులైన యుపమానపూర్వపదకర్మధారయంబులు గ్రాహ్యంబులు 9 ముఖపద్మము, చరణకమలములు, ఇట్టి యుపమానోత్తర పదంబులు గలవు గాని విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది. 10 సిద్ధంబు సర్వంబు

గ్రాహ్యంబు - రాజపురుషుఁడు, నీలోత్పలము, పీతాంబరుఁడు, శ్యామలత్వంబులు. కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు; దానంజేసి యనేకమాఱు ... ల్ల ... త్యాదులు దుష్టములని తెలియునది.

వ్యా—తత్పురుష మొదలైనవానికి లక్షణంబు తెలుపుగ సంస్కృతంబునందు చెప్పఁబడియె శ్లోకము. తత్పురుషంబన:—ఉత్తరపదంబుయొక్క యర్థంబు ప్రధానంబు గాఁగలది 1సమాసంబులన్నియు-'తత్పురుషము-బహువ్రీహి, ద్వంద్వము, అని మూఁడువిధము లు. ఆమూఁడును దఱచు గాఁదత్పురుషంబుత్తరపదంబుయొక్క యర్థంబు ప్రధానం బుగఁగలదియు, బహువ్రీహిసమాసఘటకంబుగాని పదంబుయొక్క యర్థంబుప్రధానం బుగాఁగలదియు, ద్వంద్వంబు. సమాసఘటకపదార్థంబు లన్నింటియొక్క యర్థంబును ప్రధానంబుగాఁగలదియు నైయుండును, 2 అందుఁదత్పురుషంబు—వ్యధికరణంబనియు సమానాధికరణంబనియు రెండువిధంబులు 8 ద్వితీయ మొదలు సప్తమివఱకు మీఁదిపదం బులతో సమాసంబు వ్యధికరణం బనంబడును. ఉ. నెలతాల్పు (నెలను దాల్చినవాఁడు) ద్వితీయాతత్పురుషంబు. నెలతక్కువవాఁడు (నెలచేతఁదక్కువవాఁడు) తృతీయ. దేవర మేలు (దేవరకొఱకు మేలు) చతుర్థి, దొంగభయము (దొంగవలనిభయము) పంచమి. ఈ పంచమికిఁ గారక పరిచ్ఛేదంబునందలి తొమ్మిదవ సూత్రంబును జూచునది. రామునిబా ణము (రామునియొక్క బాణము) షష్ఠి. మాటనేర్పరి (మాటలయందు నేర్పరి) సప్తమి. విశేషణంబు విశేష్యంబుతోఁ గలియు సమాసంబుసమానాధికరణంబనంబడును. ఇదియె కర్మధారయసమాసంబు. ఉ. సరసపు వచనము మొదలైనవి. 'సరసము' ఇయ్యది విశేష ణంబు, 'వచనము' ఇయ్యది విశేష్యంబు ఇచ్చట సంధిపరిచ్ఛేదంబునందలిముప్పదిరెండవ సూత్రంబునఁ బువర్ణంబు. ఇట్టి తెల్లగుఱ్ఱము మున్నగు వానియందుగ్రహించునది. సమా నాధికరణంబనగానవయవార్థంబు-సమాన=ఏకమైనఅధికరణము=ఆధారంబుగలది. అనఁ గా రెండుగాని యంతకంటె నెక్కుడైన ధర్మంబులుగాని యొక్క వస్తువును నాధా రంబుగాఁ జేసికొనియుండుట. కర్మధారయ సమాసంబు నందుండు. ఉ. సరసపువచన ము. ఇట సరసత్వ ధర్మంబును వచనత్వ ధర్మంబును నీరెండును వచనంబు నాధారంబు చేసికొని యున్నవి. కావున సామానాధికరణ్యంబు కర్మధారయంబునందును. సామా నాధికరణ్యంబు విశేషణ విశేష్యభావంబున్న చోటుననే సంభవించును. ... సంఖ్యావా

చకశబ్దంబు పూర్వమందుఁగలదై యుత్తరపదార్థ ప్రధాన సమాసంబు ద్విగుసమాసంబనంబడు. ఉ. ముజ్జగములు. (మూఁడు + జగములు) మొదలైనవి. ఇచ్చట జగమను శబ్దంబునకుఁ బూర్వము 'మూఁడు' అను సంఖ్యావాచకశబ్దంబున్న యది. అది, 'జగములు' అన్న శబ్దంబునకు విశేషణంబు. ఈసమాసంబునందు 'జగములకు' ప్రాధాన్యము. ఇట్లే ముల్లోకములు మొదలైనవి. 6 'ముక్కంటి' ఇయ్యది బహువ్రీహిసమాసము. ఇట సంఖ్యావాచకశబ్దంబు పూర్వంబునందున్నను నుత్తరపదార్థంబైన కన్నులకుఁ బ్రాధాన్యంబుకాక విశిష్టసమాసంబుచే శివుండు ప్రధానుండై చెప్పంబడి నందున బహువ్రీహికిని ద్విగువునకును భేదంబు స్పష్టంబగుచున్నయది. ఇట్లే 'చలివెలుఁగు' (చల్లనికిరణములు గలవాఁడు=చంద్రుఁడు) మొదలైనవి. 7 తల్లిదండ్రులు (గలరు) ఇయ్యది ద్వంద్వసమాసంబు. ఇచ్చట 'తల్లి, తండ్రి' అను రెండు పదంబుల యొక్క యర్థంబును బ్రధానంబు. 'తల్లి దండ్రులు గలరు' ఇత్యాది వాక్యంబులయందు సమాసఘటకంబులైన మాతాపితృపదార్థంబులు రెండును 'కలుగు' అను క్రియతోఁ గర్తలై యన్వయించినందున ద్వంద్వసమాసంబునందు నుభయపదార్థంబులకును బ్రాధాన్యంబు గలదు. ఇట్లే 'అన్నదమ్ములు' మున్నగునవి. ద్వంద్వసమాసంబునందక్క సమానఘటక పదార్థంబులన్నింటికిని బ్రధానత యేసమాసంబునందును లేదు. ఇట్టిసర్వపదార్థ ప్రాధాన్య విశేషంబును బట్టియే 'శ్లో' అక్షరాణామకారోస్మి ద్వంద్వస్సామాసికస్యచ। అహమేవాక్షయః కాలోధాతాహంవిశ్వతోముఖః' అనినభగవద్గీతా దశమాధ్యాయంబునందు శ్రీకృష్ణభగవానులుసమాసంబులలో సర్వపదార్థ ప్రాధాన్యంబునంజేసి ద్వంద్వసమాసంబు సర్వప్రధానుండగు తనస్వరూపంబని సెలవిచ్చిరని శ్రీమధుసూదనసరస్వతీవిరచితశ్రీభగవద్గీతాగూఢార్థ దీపికావ్యాఖ్యయందు వివరింపఁబడినది. 8 మూల సూత్రంబునఁ బ్రాయికంబ (తఱచు)ని చెప్పుటచేత సంస్కృత లక్షణంబు పొందని సమాసంబుంగూడఁగలదని చూపంబడినది. అందుననే 'చిగురుఁ గేలు, జుంటిమోవి' మొదలగు నుపమానము పూర్వమందుఁ గలసమాసంబులాంధ్రభాషాశైలింజేసి గ్రహింపఁదగినవి. ఇందుఁబూర్వపదార్థంబులు 'చిగురును, జున్నును' ఉపమానంబులు. ఇయ్యవిహస్తాధరోష్ఠంబులకుఁబోల్పఁబడెను. సంస్కృతంబులో 'హస్తకిసలయము, అధరమధుపూపము (మధుకోశము, తేనెపెర) ఇట్లుపమాన వాచకంబు లుత్తరపదంబుగా నుండవలెను 9 'ముఖపద్మము, చరణకమలములు' అను నిట్టి యుపమాన వాచకంబులు కడపటఁ గల సమాసంబులు గలవి

గాని విపరీతము (ఉపమానవాచకంబు పూర్వపదంబులుగాఁ గలవి) లైనవి (పద్మముఖము, కమలచరణములు) సంస్కృత సమాసంబులు లేవని తెలిసికొనునది. 'ఉపమితంవ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే అ2పా2-సూ56' అను సూత్రంబునఁ బురుషవ్యాఘ్రము, నృసోముఁడు, రామచంద్రుఁడు ముఖపద్మము, చరణకమలములుఁ ఇత్యాది సమాసంబు సమాసఘటకంబులందు నుపమానవాచకపదంబు పరమందేయుండవలెను. సాధారణధర్మ వాచకపదంబుకానిచో నుపమానపదంబు పూర్వపదంబుగానుండఁగూడదుగాని ధర్మవాచకంబు సమాసమిళితంబయ్యేనేని యుపమానవాచకంబు పూర్వ పదంబు కావచ్చును. ఉ. ఘనశ్యాముఁడుఁ తటిద్గౌరి ము. తెలుంగులోఁగూడనుపమానోత్తరపదకర్మ ధారయంబులు మహాకవులచేఁ బ్రయోగింపంబడె. ఉ. మోముఁదమ్మి మోము-తామర, కాఁదీఁగ, మైదీఁగ, కేలుఁదమ్మి మొ. ఉ॥ వాడిన మోముఁదమ్మి తెలివాలిక కన్నులు విన్నఁ బోవమను—3ఆ. తే. గీ॥ ఒప్పుపుప్పొడి పఱపుపైనొత్తగిల్లి। మోముఁదమ్మి తలాడత్తె మోపి యడుగు' వసు —4ఆ చ॥ అనయము మ్రోల నేకతమహార్ధగతిం దనచిన్ని రామచంద్రునివగు మోముఁదామరసిరుల్ గనుపండువుగాఁ జెలంగ, రాఘ—2ఆ. సీ॥ అన్నువకాఁదీఁగెయందఁబు మదినిల్పు జఘనతలంబుపై జరుపుదృష్టి' భార-ఆది 3ఆ. సీ॥ పాలిండ్లతనువెద వ్రాలింపఁజెన్నొందునసదు కాఁదీఁగ యల్లాడుచుండు' భార-విరా-4ఆ. మొ. 10 సంస్కృతవ్యాకరణంబునన్నైన సమాసంబులన్నియుఁ దెలుంగులోవాడవచ్చును. ఉ. రాజపురుషుడు (షష్ఠీతత్పురుషము రాజాయొక్క భృత్యుఁడనియర్థము.) నీలోత్పలము (కర్మధారయంబు). పీతాంబరుఁడు (బహువ్రీహి; విష్ణువు). రామలక్ష్మణులు (ద్వంద్వము.) 11 కేవలసంస్కృత శబ్దంబు తెలుఁగు శబ్దంబుతోఁగలియదు. అందువనే, అనేక మాఱులు, అల్పదండు మొదలైనవి దోషయుక్తంబులు. తెలుగు విభక్తిచేఁజిహ్నితంబు గాని కేవలసంస్కృత ప్రాతిపదికంబులకుఁ దెలుంగుతో సమాసంబుగూడదని భావము. ఇచ్చటను 'అనేక' శబ్దంబును, 'అల్ప' శబ్దంబును దెలుంగు విభక్తిలేకుండఁ బ్రయోగింపంబడియె. అనేకపు మాఱులు 'అల్పపుదండు' అనినచో సాధువులగు 'హంసనడకలు, ధరణిఱేఁడు, పాండువిభుకోడలు' ఇత్యాదిసమాసంబులయందుఁ బూర్వపదంబుపై విభక్తి జనించి లోపించినది. కావుననయ్యవి సాధ్యంబులుగాని కేవలసిద్ధపదంబులు కావు.

**4 సూ—ఆ ఈ ఏ యను సర్వనామంబులు త్రికంబనంబడు.**

వ్యా—ఆ-ఈ-ఏ, అను సర్వనామంబులు త్రిక మనంబడును. 'త్రికము' అను దానియందలి క ప్రత్యయంబు సంఘార్థంబునందు వచ్చును ఇట్లే చతుష్కము, పంచకము, షట్కము, సప్తకము, అష్టకము, నవకము, మున్నగునవి గ్రహింపవలెను.

**5 సూ—కర్మధారయంబు త్రికస్త్రీసమముగంతధాతుజ విశేషణపూర్వపదంబయియుండు.**

**ఆచందము - ఈచిందము - ఏబృందము - వాఁడిమాట - పోఁడిపాట - బెడిదపుటడిదము - మడిసెడుదడము లు ॥ ఈనియమముచే - బల్లిడుఁడుమల్లుఁడు - కావలుఁడురావణుఁడు - ఇత్యాదుల సమాసంబు లేదు.**

వ్యా—కర్మధారయ సమాసంబు—త్రికము. (ఆ-ఈ-ఏ) స్త్రీసమ శబ్దంబులు (ప్రథమైకవచన లోపంబుగల శబ్దంబులు) ముగాగమాంత శబ్దంబులు, (సూత్రంబులో నిముగంత శబ్దంబుచే ముపర్ణకంబును గ్రహింపబడును. చూ. తత్స—39 సూ) క్రియాజన్య విశేషణంబులు, పూర్వపదంబులుగలవియైయుండును. త్రికంబునకు—ఆచందము, ఈచిందముఁ ఏబృందము. స్త్రీసమంబునకు—వాఁడిమాట, పోఁడిపాట, ఇచ్చట 'వాఁడి పోఁడి' శబ్దంబులకు నాచ్ఛికపరిచ్ఛేదంబులోని రెండవసూత్రంబున స్త్రీసమత్వాతిదేశంబునంజేసి ప్రథమైక వచనలోపంబు. ఈసూత్రంబునొద్దఁ గర్మధారయోదాహరణంబులు పూర్వోత్తర పదంబులు తెలుంగుపదంబులైన సమాసంబులే చూఁపబడినవి కాని పూర్వపదంబు తెలుంగును, ఉత్తరపదంబు సాంస్కృతికంబును నైన కర్మధారయంబునందు నాంధ్రపదంబు 'శ్లో॥ సంస్కృతప దేన పరిమితమాన్ధ్రపదం కర్మధారయోభవతి' ఆంధ్రభాషా-హలంత-48సూఁ అను సూత్రంబుంబట్టియు, ఆంధ్రపదం వద్వర్ణ పర్యంతేఁసంస్కృతేనసమస్యతే' అనిన యాథర్వణ కారికను బట్టియు, నాలువర్ణంబులకంటె మించి యుండఁగూడదని నియమంబేర్పడుచున్నది. కావున 'వాఁడిమయూఖములు, వేఁడిశ

లాంధారలు' ఇత్యాది విశేషకర్మధారయంబులు సాధువులయ్యె. ఉ॥ వాఁడిమయూఖ ములగువాఁడ పరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్ నేఁడిటవచ్చె' భార-ఆది.౩ఆ. ఉ॥ అన్నవబ్రహ్మచారి ముఖమంబు రుహంబు సమంబు చూడఁగన్.' భార-ఆర-౩ఆ. ఉ॥ మేలిమదావళంబులును మేటిహయంబులఁ దమ్మిపిండునా! ఖీలతఁ జుట్టిరాఁగ' భార-కర్ణ-౩. '॥ జిలుగు సంధ్యారాగ చీనాంబరముఁ గట్టికుసుమ గర్భపుఁగేలు కొప్పుగుటిమి' కాశీఖండము. ఆముక్తమాల్యదయం దలి ప్రథమాశ్వాసమ్మున 'మ॥ పునుఁగుందావిన వౌదనంబు మిరియంపుంబొళ్లతో' అన్నచోట 'పునుగుందావిన వౌదనంబు' అనునది కర్మధారయంబనియు, పునుఁగుందావి' శబ్దంబయిదు వర్ణంబులు గలదిగావున 'నవౌదనంబనెడి సంస్కృత సమంబుతో సమాసంబు యుక్తమనియుఁ గొందఱు చెప్పుదురు. 'పునుఁగుందావి' అనునది వరిపైరులలో నొకవిధంబగు పైరు. పునుఁగుందావియనెడి పైరు సంబంధమైన నవౌదనంబని యర్థంబు గాని పైరే నవౌదనంబైన దనిన యర్థముగాదు. కాఁబట్టి సంబంధార్థంబునందు షష్ఠీవిభక్తి యుక్తంబు గావున 'పునుగుందావియొక్క (సంబంధమైన) నవౌదనంబని షష్ఠీతత్పురుషసమాసంబు చెప్పికొనవలయు. కర్మధారయంబునకుఁ బ్రసక్తియేలేదు ఇట్లే మనుచరిత్ర ప్రథమాశ్వాసమునందు సీ॥ కటికి చీఁకటితిండి కరముల గిలిగింత నెవ్వాఁడు తొగ కన్నెనవ్వఁజేను' అనుచోట 'కటికి చీఁకటితిండి' అను పదంబు పూర్వోక్త ప్రకారంబున షడ్వర్ణంబులకు మించినది కావునఁ గరంబులనెడి సంస్కృతసమపదంబుతోఁ గర్మధారయం బయుక్తంబని యుఁ బెద్దనామాత్యుని ప్రయోగంబు ప్రామాదికంబనియుఁ గొందఱు ధిక్కరింతురు. 'కటికిచీఁకటితిండి=గాఢాంధకారంబును మ్రింగునట్టి కరము లగిలిగింత=కిరణములనెడి హస్తంబులయొక్క చక్కిలిగింతచేత' అనివాక్యంబునకు వ్యాఖ్యవ్రాయంబడియె. దీనింబట్టి లోకులు కర్మధారయంబని కల్లోలపడుచున్నారు. తిండిపదంబునకు మ్రింగునట్టి యనిన వ్యాఖ్యప్రౌఢమార్గంబున ఫలితార్థంబును జెప్పినది కాని తిండి పదార్థంబునకును గరపదార్థంబునకును సామానాధికరణ్యంబున నన్వయంబు రానేరదు. తిండియన నాహారము; భోజనము కటికి చీఁకటి తిండియనఁగా గాఢాంధకారభోజనము. 'గాఢాంధకారభోజనము' అన్నట్టులు 'కటికి చీఁకటి సంబంధమైన తిండి' (భోజనము) యని సంబంధార్థంబున నన్వయించుకొనవలెను. ఒకవేళ తిండి శబ్దంబునకు భక్ష్యంబనిన

లాక్షణికార్థంబే యంగీకరించినచోఁ గటికిచీఁకటి యనెడుతిండి (భక్ష్యము) అని సా
మానాధికరణ్యంబున రెండుపదార్థంబులకుఁ గర్మధారయంబు చెప్పికోవలెను. తిండి య
నునది స్వతస్సిద్ధంబుగా నామవాచకంబే గాని విశేషణార్థంబుగాదు 'తిండికరము' అ
నఁగా భోజనహస్తము. భోజనహస్తమను నపుడు భోజనసంబంధమైన హస్తంబనున
ట్టులు తిండిసంబంధంబైనకరములని సంబంధార్థంబుతోఁబదార్థద్వయంబును సమన్వయిం
పఁజేయవలెను. సంబంధార్థంబునందు శేషషష్ఠి గలుగును. 'భోజనముయొక్క హస్త
ము' అనిన విగ్రహంబు వోలె 'తిండియొక్క హస్తము' అనిషష్ఠీతత్పురుషంబు చెప్పక
తప్పదు. భోజనంబునకును. హస్తంబునకును సంబంధంబేమనఁగా భుక్తికి హస్తముసాధ
నంబు గావున 'రాజపురుషుఁడు' అన్నచో షష్ఠికి సేవ్య సేవక భావమర్థంబయినట్టు
లు, ఇచ్చట సందర్భవశంబున సాధ్యసాధన భావంబు షష్ఠ్యర్థంబు కావలయు 'ఎంగిలి
హస్తము' ఇత్యాది ప్రయోగంబులయందు నెంగిలి సంబంధంబైన హస్తంబని సంబంధా
ర్థంబున షష్ఠీతత్పురుషంబు వోలె 'తిండికరము' అన్నచోటునఁదిండి సంబంధంబైన క
రమని సంబంధార్థంబున షష్ఠీతత్పురుషంబే శాస్త్రంబునఁ జెప్పనొప్పగు. కావుననే
యాముక్తమాల్యదయందుంగూడ సంఘటితంబైన యిప్పద్యంబును వివరించుతఱిని నిట్టి
సమాసంబేల కలిగెనన్న ప్రశ్నయును, సమాధానంబును ప్రశంసింపఁబడలేదు, మఱియు
నీవ్యాఖ్యయందు 'కటికిచీఁకటి తిండికరములన్నచో 'కటికిచీఁకటి భక్షణముగాఁగల
హస్తములని' బహువ్రీహ్యర్థక విగ్రహంబు విశదీకరింపఁబడినది. ఈపదంబునకే మనుచ
రిత్రవ్యాఖ్యానంబునందుఁ గర్మధారయార్థక విగ్రహంబు గ్రహింపంబడినది. కాన ని
య్యవి ప్రౌఢమార్గంబునంజేసిన వ్యాఖ్యానంబులుగాని సమాసానుకూలంబుగా లిఖింపం
బడిన వివరణంబులుగావు. పైనిందెప్పినచొప్పున సమాసంబు షష్ఠీతత్పురుషంబే సయు
క్తికంబు గావునఁ గర్మధారయంబని భ్రమంజెంది యిట్టిది ప్రామాదికంబని పెద్దనార్యు
నిపైనెదిరితద్దయు గద్దించుట పెద్దతనంబుగాదు. కావుననే తిమ్మకవీంద్రుఁడుసర్వలక్షణ
సారసంగ్రహమందలి ద్వితీయాశ్వాసచతుర్థలక్షణంబందు 'కటికిచీఁకటి తిండికరముల'
అనుసమాసంబు మిశ్రంబునందు లక్ష్యంబుగా నిరూపించెనుగాని దీనిం గర్మధారయంబు
నొద్ద నుదాహరింపలేదు. మువర్ణకాంత విశేషణంబులకు—'బెడిదపుటడిదము (బెడిద
ము + అడిదము)' సూత్రంబులోని ముగంతశబ్దంబు మువర్ణకంబువకును గ్రాహకంబు
గావున మువర్ణకాంతంబౌ 'బెడిదము' శబ్దంబు కర్మధారయసమాసంబునకుఁ బూర్వపద

టుగానుండె. సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదిరెండవ సూత్రంబుచే, ఋవర్ణంబును, ఇరువది యెనిమిదవ సూత్రంబుచేఁ టు'గాగమంబును, గలుగ 'బెడిదపుటడిదము' అయ్యెను. బెడిదపుటడిదము=భయకరమైన ఖడ్గము. సమాసఘటకశబ్దంబులకువిభక్తిలోపంబు శాస్త్రీయంబైనను సంధిపరిచ్ఛేదంబులోని ముప్పదిరెండవ సూత్రంబుచేఁ గర్మధారయంబునందలి మువర్ణకంబునకుఁ బుంపు వర్ణవిధానసామర్థ్యంబున నిచట 'బెడిదము' అనుదాని మువర్ణకంబునకు లోపంబురాదని యెఱుంగునది. ముగంతవిశేషంబునకు—'బెడిదపుటడిదమును' ఇచ్చట 'బెడిదములు + అడిదము' అనియుండఁగా సమాసంబునకు లోపంబురా 'బెడిదము + అడిదములు' అని ముగాగమాంత 'బెడిద' శబ్దంబు శేషించె. మువర్ణకకార్యంబు ముగాగమంబునకును గలుగును (తత్స-41సూ) గావున సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పది రెండవసూత్రంబుచేఁ బువర్ణంబును,ఇరువదియెనిమిదవసూత్రంబున 'టు' గాగమంబునుగలిగి, 'బెడిదపుటడిదము' అయ్యెను. 'బెడిదములు' అనుచోటఁ దత్సమపరిచ్ఛేదమునందలి నలువదియొకండవసూత్రంబుచే ముగాగమంబని గ్రహింపనగు. ధాతుజవిశేషణంబునకు—'మడిసెడుదడములు' ఇచ్చట 'మడిసెడు, అనునది ధాతుజవిశేషణము. మడియుధాతువుపైఁ గ్రియాపరిచ్ఛేదంబునందలి నలువదినాల్గవసూత్రంబున 'ఎడు' వర్ణకంబును, ఏఁబదినాల్గవసూత్రంబుచే సకారంబును నయ్యెను. (మూలము) ఈనియమముచే 'బల్లిదుఁడు, మల్లుఁడుకావలుఁడు రావణుఁడు ఇత్యాదుల సమాసంబులేదు (వ్యా)—త్రికాదిపరిగణనచే 'బల్లిదుఁడు, మల్లుఁడు, కావలుఁడు రావణుఁడు' ఇత్యాది డమంత విశేషణంబుతోఁ గర్మధారయంబు రాదుగావున 'బల్లిదమల్లుఁడు, కావలరావణుఁడు' ఇత్యాదికముగా సమాసంబులుండవు. వ్యస్తంబుగానే యుండవలయును.

6 సూ—స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహిచూపట్టెడు.

ముక్కంటి-వేగంటి - చలివెలుఁగు - వేవెలుఁగు - మోటబరి- ఇత్యాదులు వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులు.

వ్యా—స్త్రీసమంబులైన పదంబులతోఁ గూడిన యొకానొక బహువ్రీహిగానంబడును. అనఁగా సమాసంబులోని విశేషణవిశేష్యంబుల మీఁది ప్రథమైకవచనంబు

లోపించియుండును. ఉ. ముక్కంటి-వేగంటి చలివెలుఁగు, మోటబరి. ఇత్యాదులు వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులు' 'ముక్కంటి' అనఁగా మూఁడు కన్నుల గలవాఁడు ఇచ్చట 'మూఁడు + కన్ను' అనిన రెండు శబ్దంబులును ప్రథమావిభక్తిలోఁ గానిపింపక నామవాచకంబులు మాత్రంబే ప్రకృతంబగుచున్నందున స్త్రీవాచక శబ్దతుల్యంబులాయె. 'మూఁడు + కన్ను" ఇట్లుండ నీపరిచ్ఛేదంబులోని పదునేడవ సూత్రంబును 'మూఁడు' శబ్దంబుయొక్క యంత్యాక్షరంబునకు లోపంబును, మీఁది 'కన్ను' శబ్దంబులోని కకారంబునకు ద్విత్వంబునునగును. పదుమూఁడవ సూత్రంబుచే 'మూఁడు' అగును. బహువ్రీహియైన 'ముక్కన్ను' శబ్దంబుయొక్క సవ్వయంబునకు నీపరిచ్ఛేదంబునందలి యిరువదిరెండవ సూత్రంబుచే 'టి' వర్ణంబగును. (ము + క్క + టి) ఆచ్ఛికపరిచ్ఛేదంబులోని ముప్పదిమూఁడవ సూత్రంబుచే టివర్ణంబునకుముందు పూర్ణబిందువయి (ము + క్క + ం + టి) 'ముక్కంటి' అను విశిష్టరూపంబగు. 'వేగంటి' వేయి కన్నులు గలవాఁడు. క॥ 'మొగములు నేగల శేషుం | డగణిత వాగ్గరిమ నోడునని పల్కఁగనా | లుగు మొగములు గలయజుఁడేన | యగునావీరికన వీటనలరుచురు ద్వాజుల్ కవి - 1 ఆ. అన్యప్రయోగంబుంబట్టి సమాసంబులోని 'వే' శబ్దంబునకు 'వేయి' అని యర్థంబు. పైవలెనే భాషాశైలింజేసి సమాసాంతంబైనటివర్ణంబూహింపఁదగునది. చలివెలుఁగు (శీతకిరణుఁడు) వేవెలుఁగు (సహస్రకిరణుఁడు) మోటబరి (బరువు మోపెడి యెద్దు) ఇచ్చట 'మోట + బరువు' ఇట్లుండ సమాసాంతంబైన ఇవర్ణంబుగల్గి వృత్తియందు 'బరువు' శబ్దంబుయొక్క యంత్యవర్ణంబులోపింప సంధిగలిగి 'మోటబరి' అయ్యె. అధికమైన బరువుగలయెద్దని యర్థంబు. పైనంజెప్పిన సమాసాంతంబైన టివర్ణాదులకు వేఱుసూత్రంబులు లేమింజేసియే మూలంబులో వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులని చెప్పంబడియె.

7 సూ—ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగాద్వంద్వంబగు.

అన్నదమ్ములు - తల్లిదండ్రులు - ఊరువల్లెలు - ఆలుమగలు! మగఁడును బిడ్డలును - పల్లనునుగల్లెమును - ఇత్యాదులు సమసింపవనియో నియమంబున నెఱుంగునది.

వ్యా—ద్వంద్వంబునందు స్త్రీసమంబైన తెలుఁగుపదంబు పూర్వపదంబైయుం డు. 'ఉ. అన్నదమ్ములు' ఇచ్చటఁ బూర్వపదంబైన 'అన్న' శబ్దంబు వ్యస్తప్రయోగం బులోఁ బ్రథమైకవచనలోపంబుగలదికావున స్త్రీసమంబు. ఇట్లే 'తల్లిదండ్రులు, ఊరు వల్లెలు, ఆలుమగలు' మున్నగుద్వంద్వంబులలోని 'తల్లి ప్రభృతిపూర్వపదంబులు వ్యస్త ప్రయోగంబులో 'వనిత, లక్ష్మి' ఇత్యాదిస్త్రీవాచకశబ్దంబులువోలెఁ బ్రథమైకవచన హీనంబై వాడంబడుచున్నందున స్త్రీసమంబులని యెఱుంగునది. (మూలము) మగఁడు నుబిడ్డలును, పల్లమునుగల్లెమును, ఇత్యాదులును సమసింపవని యీనియమంబున నెఱుం గునది. వ్యా—ద్వంద్వంబులోని పూర్వపదంబు స్త్రీసమంబుకావలెనన్న నియమంబు చేత 'మగఁడునుబిడ్డలును' ఇత్యాదులందలి పూర్వపదంబునకుఁ బ్రథమైకవచనలోపంబు లేనియందున నట్టిశబ్దంబులతో ద్వంద్వంబు ఘటింపనేరదు (మగఁడు బిడ్డలు, పల్లము గ ల్లెములు) వ్యస్తంబుగానే ప్రయోగింపవలయును.

8 సూ—సర్వశబ్దంబులు సంబంధంబునందుఁదచ్ఛబ్దంబుతోడ స మసించు.

నావాఁడు - నాయది - ఇంటివాఁడు - ఇంటిది - రామునివాఁ డు - రామునిది.

వ్యా—తెలుఁగుశబ్దంబులన్నియు సంబంధార్థంబుతోఁదుమండ దచ్ఛబ్దపర్యాయం బులైన 'వాఁడు, అది, అవి, ఇత్యాదికముతో సమసించును. (కలియును) 'ఉ. 'నా వాఁడు, నాయది, ఇంటివాఁడు, ఇంటిది, రామునివాఁడు, రామునిది' 'నాయది' సం ధిపరిచ్ఛేదంబునందలి నలువదియైదవసూత్రంబున 'నాది' అనురూపాంతరంబు, ఇంటి ది, రామునిది' పైసూత్రంబుననే 'అది' శబ్దంబుయొక్క 'అ' కారంబునకు లోపంబు.

9 సూ—ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు త చ్ఛబ్దంబనుప్రయుక్తంబగు.

వచ్చినవాఁడు - వచ్చినది - రానివాఁడు - రానియది.

వ్యా—క్రియాజన్య విశేషణంబులపై విభక్తిచెప్పఁదలంచు నప్పుడు, 'వాఁడు, అది' మున్నగు తచ్ఛబ్దంబుల ననుసరించి ప్రయోగింపఁబడును. 'ఉ. వచ్చినవాఁడు, వచ్చినది, రానివాఁడు, రానియది, ఇచ్చట 'వచ్చిన' అనునది క్రియాపరిచ్ఛేదంబునందలి నలువదియాఱవసూత్రంబున భూతార్థంబునందుఁ 'న, వర్ణకంబుచే సిద్ధంబైనరూపంబు; 'రాని, అనునది క్రియాపరిచ్ఛేదంబునందలి నలువదియేడవ సూత్రంబున 'నిజె' వర్ణకాంతరూపంబు; క్రియాపరిచ్ఛేదంబునందలి తొంబదియొకండవ సూత్రంబుచే వచ్చునకు రాదేశంబు.

10 సూ—ఎల్లయెడలధాతుజవిశేషణంబులకట్టియనుపదంబు విభాషనప్రయుక్తంబగు.

వచ్చినట్టిరాముఁడు - వచ్చినరాముఁడు - వచ్చునట్టివాఁడు - వచ్చువాఁడు.

వ్యా—అన్నిచోటులను గ్రియావిశేషణంబులకు 'అట్టి, అనుపదంబు వైకల్పికంబుగా ననుసరించి ప్రయోగింపంబడును. 'ఉ. వచ్చినట్టి రాముఁడు, వచ్చిన రాముఁడు, వచ్చునట్టివాఁడు, వచ్చువాఁడు,' ఇచ్చట 'వచ్చిన, అనునది భూతార్థకవిశేషణంబు కావున దీనికి 'అట్టి, అనునదియనుప్రయుక్తంబయ్యె. (వచ్చినట్టిరాముఁడు) వికల్పంబుకావున 'అట్టి, పదంబు వెంబడింపలేదు. (వచ్చినరాముఁడు) 'వచ్చు, అనునది తద్ధర్మార్థకవిశేషణంబు. సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదిమూఁడవ సూత్రంబుననుగాగమంబు. (వచ్చునట్టివాఁడు); వికల్పంబుగావున 'అట్టి, శబ్దంబులేక 'వచ్చువాఁడు, అని యగును.

11 సూ—యుష్మదస్మదాత్మార్థకంబులకుత్తరపదంబు పరంబగునపుడుదుగాగమంబు విభాషనగు.

నీదుకరుణ - నీకరుణ ॥ నాదునేరిమి - నానేరిమి ॥ తనదురూపు - తనరూపు.

వ్యా—క్రమముగా యుష్మచ్ఛబ్దంబుయొక్కయు, అస్మచ్ఛబ్దమ్ము యొక్కయు ‹ఆత్మన్›, శబ్దముయొక్కయు నర్థంబుగల ‹నీ-నా-తా›, శబ్దంబులకు నుత్తరపదంబు పరంబగుచో దుగాగమంబు వికల్పంబుగా నగును. ఉ. నీదుకరుణ, నీకరుణ; నాదునేరిమి, నానేరిమి; తనదురూపు. తనరూపునీదుకరుణ, నీకరుణ, ఇచ్చట నీయొక్క కరుణ యనివష్ఠీతత్పురుషంబు. ‹యొక్క› విభక్తిలోపింపఁగాఁ గరుణశబ్దంబు పరంబైనప్రథమ నీశబ్దంబునకు దుగాగమంబుగలిగె. దుక్కు కిత్తుకావున ‹నీ› శబ్దంబునకు నంతావయవమై చేరె. అందున ‹నీదుకరుణ› అనురూపంబాయె. వికల్పంబుగావున దుగాగమవిరహితంబైన రూపాంతరంబు ‹నీకరుణ› అనియగును. ఇట్లే ‹నాదునేరిమి› ఇత్యాదులందూహించుకొనునది. వక్తకు సమాసరచనయందిచ్ఛలేనియపుడు ‹నీదికరుణ› ఇత్యాదికముగా నుండును. ఉత్తరపదంబనియుఁ బూర్వపదంబనియు వ్యవహరించుట సమాసఘటకపదంబులకే గనుక నీసూత్రంబునందు ‹సమాసమం› దని వేరనుడువనవసరంబులేదు. కొందఱు సూత్రంబులోనేకవచనంబులైనయుష్మదస్మదాత్మార్థకంబులు-నీ-నా-తా,-శబ్దంబులే గ్రహింపఁబడుననియు, దానం జేసి ‘మీదుకరుణ, మీదు నేరిమి, తమదురూపు, ఇత్యాది దుగాగమయుక్త బహుత్వవాచక రూపంబులు సాధువులు గావనియు వివరింప సాహసించుచున్నారు, ఆంధ్రశబ్దచింతామణియందు దీనికి మూల సూత్రము ‹యుష్మదస్మదాత్మభ్యః ద్వితివర్ణకః సూ. 26, అని హలంత పరిచ్ఛేదంబునందు రచియింపంబడియె. అచ్చటి పూర్వోత్తర సూత్రంబుల ప్రకరణంబునం గూడ నేకవచనంబులైన యుష్మత్ప్రభృతిశబ్దంబులన్న యర్థంబు రాదు. ‹అస్మద్యుష్మత్తదాత్మవాచ్యాదేకత్వ ఇతో నిపీ; హలం. 36. సూ. ‹పరేషాంతు ధరోక్తమమధ్యమవత్; హలం. 87 సూ, ఇత్యాది సూత్రంబులయం దేకవచనంబునందనియు, బహువచనమందనియు వచించుచు శాస్త్రవిధివిధింపఁబడు చున్నది. దువర్ణకవిధాయక ప్రకృతసూత్రంబునందు నట్టి వచనభేదంబు విశేషించి వివరింపఁబడలేదు. కాన ‹నీదుకరణ ఇత్యాదులవలెనే ‹మీదుకరణ, మీదునేరిమి, తమదురూపు, ఇత్యాది రూపంబులు నిర్భాంతకంబుగాఁ బ్రయోగింపందగు. కావుననే తే. గీ. దాశుజాతునిచే రఘునాయకుండు। వ్యాసుచేఁ బాండవులు; కాళిదాసుచేత। భోజుఁడు; ప్రసిద్ధినొందిరిభువివిధమదు పడకలెల్లను గథలుగా నడుగకతన, అప్పక- 1 ఆ. తే. గీ. పంచవర్గంబులను గ

పట్టినట్టి| పొల్లులను నాసికాక్షరంబులను గదిసి| తమదుపంచమములు ద్వితీయములు నగుచు| నమరుఁబ్రాసంబులకు వికల్పాహ్వాయములు, అప్పక- 3ఆ. అనుప్రయోగంబు లప్పకవిగారిచేఁ బ్రయోగింపంబడినవి. సూత్రగతమైన (యాత్మన్ శబ్దార్థకంబునకు బహువచనంబులో దుగాగమంబు దృఢంబగుచుండ నట్టియాత్మన్ శబ్దంబుతో సాహచర్యంబుననున్న యుష్మదస్మచ్ఛబ్దార్థకంబులకు మాత్రంబు దుగాగమంబేల ప్రవాళించి రాకుండును? కాఁబట్టి యిప్పటికి నాధునికకవు లుపయోగించెడి (మీదుకరుణ, ఇత్యాది ప్రయోగంబులు ప్రామాణికంబులనియే ప్రకటింపందగు. ఏకవచనంబునందే దువర్ణకమి ష్టమైనచో (యుష్మదస్మదాత్మభ్యః ద్వితివర్ణకః, హలం. 26 సూ. అనుసూత్రంబునకు బదులుగా (త్వన్మదాత్మభ్యోద్వితివర్ణకః, అనివాగనుశాసనుండు లాఘవంబుగసూత్రం బు నేలరచింపలేదు? అట్లురచించినచో (అర్థమాత్రాలాఘవంపు త్రోత్సవంమన్యంతే వైయాకరణాః, అను న్యాయంబున సూత్రంబునందు మాత్రాలాఘవంబునుఁలభించుచుండును. (త్వత్, మత్, శబ్దంబులసాహచర్యంబున సూత్రంబులోని (ఆత్మన్, శబ్దంబును నేక వచనంబనియే గ్రహింపంబడును. కావున నేకవచన బహువచన సామాన్యంబుగా (దు, వర్ణకప్రాప్తి నిమిత్తమే (యుష్మదస్మదాత్మభ్యః, అని యుభయార్థలాఘవంబునకై గురుసూత్రంబును రచియించెను. దానంజేసి వచనద్వయంబందును (దు, గాగమంబు నిర్దిష్టంబని యెఱుంగునది. బహువచనంబునందు (దు, గాగమంబురాదని యనవసర ప్రసంగవాచోయుక్తి విజృంభణంబులు కొందఱు విచ్చలవిడి వెదజల్లుచుందురుగాని యయ్యవి యంతస్సారశూన్యంబులు.

12 సూ—గుణవచనంబులగు నల్లాదులకుఁగర్మధారయంబునం దునిగాగమంబు బహుళంబుగానగు.

నల్లనిగుఱ్ఱము - నల్లగుఱ్ఱము || నల్ల - తెల్ల - పచ్చ - ఎఱ్ఱ - చామ - తియ్య - కమ్మ - పుల్ల - విన్న - తిన్న - అల్ల - ఇత్యాదులునల్లాదులు.

వ్యా—గుణంబును జెప్పునట్టి (నల్ల, మొదలైన శబ్దంబులకుఁ గర్మధారయ సమా

సంబునందు నిగాగమంబు బహుళంబుగాఁ గలుగును. ఉ. నల్లనిగుఱ్ఱము. ఇచ్చట నల్ల + గుఱ్ఱము, అనియుండఁగా నిగాగమంబు కిత్తుకావున 'ఆద్యంతౌటకితౌ' అనుసూత్రంబునఁ బూర్వపదంబైన 'నల్ల' శబ్దంబునకు నంతమందువచ్చినది. పాక్షికంబు గావున 'నల్లగుఱ్ఱము' అను రూపాంతరంబులగును. ఇట్లే 'తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, చామ, తియ్య, కమ్మ, పుల్ల, విన్న, తిన్న అల్ల' మన్నగు నల్లాదులకు రూపద్వయంబు గ్రహించునది. బహుళంబని చెప్పుటచేత 'చక్క, చిక్క, ఇత్యాది గుణవాచకంబుల కంటె నిగాగమంబు నిత్యంబును, చిన్న, పెద్ద, దొడ్డ, సోగ, కోల' ఇత్యాలయందు నిగాగమాభావంబును, ఉకారాంతంబైన 'సవురు' శబ్దంబుకంటె నిగాగమంబును పూర్వోత్వంబున కత్వంబును గలుగునని గ్రహించునది. మూలంబునందు నదంతగుణవచనంబులనుట యూవశ్యకంబు. అందున 'తెలిదమ్మి, వెలిదామర' ఇత్యాదులందు నిగాగమంబులేదు.

13 సూ—ద్విరుక్తంబగుహల్లు పరంబగునపుడాచ్ఛికంబగు దీర్ఘంబునకుహ్రస్వంబగు.

వ్యా—ద్విత్వహల్లు పరంబగునపు డచ్చతెలుంగు దీర్ఘంబునకు హ్రస్వంబు గలుగును.

14 త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకుద్విత్వంబుబహుళంబు గానగు.

అక్కన్య - ఆకన్య ‖ ఇక్కాలము - ఈకాలము ‖ ఎల్లోకము- ఏలోకము - అయ్యశ్వము - ఆయశ్వము ‖ బాహుళకముచే నూష్మరేఫంబులకు ద్విత్వంబుగలుగదు — ఆరూపము - ఈశబ్దము - ఏషండము - ఆసుకృతి - ఆహాయము.

వ్యా—'ఆ, ఈ, ఏ, అను త్రికంబుకంటెఁ బరంబై యొంటిగానున్న హల్లునకు ద్విత్వంబు బహుళంబుగాఁ గలుగును. ఉ. అక్కన్య. ఇచ్చట గన్యాశబ్దంబులో

నైదవసూత్రంబుచే నాకారంబు పూర్వపదంబై 'ఆ+కన్య, ఇట్లుండఁ బ్రకృత సూత్రంబునఁ గకారంబునకు బాహుళకంబై ద్విత్వంబుగలిగి 'ఆ+క్కన్య, అయ్యెను తరువాతఁ బదునూఁడవ సూత్రంబుచేఁ బూర్వపద దీర్ఘాకారంబు హ్రస్వంబయ్యెను. (అక్కన్య) ద్విత్వంబు బాహుళకంబుగావున రానియప్పుడు హ్రస్వంబు గలుగదు. ఇట్లే 'ఇక్కాలము' ఈకాలము; ఎల్లోకము; ఏలోకము; అయ్యశ్వము, ఆయశ్వము, ఇత్యాదులయందుఁ బ్రక్రియ పూర్వరీతిని నూహించునది. (మూలము) బాహుళకముచే నూష్మరేఫంబులకు ద్విత్వంబుగలుగదు. ఉ. ఆరూపము, ఈశబ్దము, ఏషండము, ఆసుకృతి, ఆహాయము. (వ్యా) బాహుళకమనుటచేత శషసహరేఫంబులకు ద్విత్వంబుగలుగదు. మూలంబులోని రేఫశబ్దంబు శకటరేఫంబునకును గ్రాహకము. దానంజేసి 'అఱాఁగ, ఇత్యాదిశకటరేఫస్థలంబులందు ద్విత్వంబురాదు. కొందఱు 'ఆకడ, అక్కడ, ఈ, కడ, ఇక్కడ; ఏకడ, ఎక్కడ, అనురూపంబు లీసూత్రంబుచే సాధువులనియు, వర్ణలోపంబుగలిగి ‚ఆడ, ఈడ, ఏడ, అనెడి రూపంబులు గ్రామ్యంబులగుటంజేసి యగ్రాహ్యంబులనియు, ఘోషించుచున్నారు. ఇందులకుఁ బ్రమాణంబులు. తే. గీ, ‚తగిలివర్ణంబులెక్కువ తక్కువలుగ। నియమమెడలించి పల్కునవి యెతలంప। గ్రామ్యమగుచుండ్రే నొరులఁదెగడెడుచోట్లఁ। జెప్పఁదగునది కలధౌతశిఖరిసదన' ఆ. వె. ప్రాకటముగఁ గృతుల నాకడనీకడ। యనుచుఁ బల్కుచోటఁ నాడనీడ । యనిన వర్ణలోపమగు ఫలములకు ఘలాలనంగ హెచ్చునీలకంఠ, సర్వల - అచ్చు. ప్రక, ‚సీ. పంచాకుమయ్యలోపించాకుమయ్య వాటీదెచ్చుతారు మమ్మాదలంచి । యేగగొంటూరమ్మ యేదాలువోదాలుసూసేటివారు చేసేటివారు! వాడివిరాళితోఁ బాడిగవోకుమీ యీాడే కదామమ్మ యినుతిసేసె। పంపేరు తెంపేరు పాడేరు నూసేరు యిందాము కందాము పొందుమిస్తి ‚ఆ. అటుకు దవ్వెనగడు నషునలె నిషునలె। నాడనీడ నేడ నచ్చ నిచ్చ। మోయగాయ నేయమోను దాడ్బాపుడు। గద్ద నంగగ్రామ్యమయ్యె, ఆంధ్రభాషాభూషణము. ఇట్లు పైగ్రంథంబులయందు ‚ఆడ, ఈడ, ఏడ, అనునవి గ్రామ్యంబులని చెప్పుట యమూలదర్శనమూలకంబు. ఈక్రింది మహాకవిప్రయోగందులయునికి, యొఱింగి బుద్ధిమంతులు శాస్త్రీయరూపంబులని గ్రహింతురుగాక !! ‚రగడ, అఱిమినను జిగురు వెనునగునెకంటకమాడఁ। జూలునుమనె నేఱొక్కచోటఁ గంటకమాడ, మను- చరి,

తిక్కనసోమ. ఏనేడనిండ్రిదు లేడ వారలకునెప్పుడు మ్రొక్కుదు నేను నీదనమ్, భార-ఆర-౨౫. ఉచ. అపమున మీదెఱుంగక మహాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరన్ ఖసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యేడయెం! టిపనుటయేడ భార-విరా-౫౪.

15 సూ—కృతహ్రస్వంబగు త్రికంబుమీఁదిచోటు శబ్దంబునో త్వంబున కత్వహ్రస్వంబులు విభాషనగు.

అచ్చోటు - అచ్చటు - అచ్చొటు ॥ ఇచ్చోటు - ఇచ్చటు - ఇచ్చొటు ॥ ఎచ్చోటు - ఎచ్చటు - ఎచ్చొటు ॥ వీనిద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగలోపంబగు - అచటు - అచోటు - ఇచటు - ఇచోటు - ఎచటు - ఎచోటు ॥ ముచ్చోటులు - ముచ్చటులు - ముచ్చొటులు - అనురూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.

వ్యా—పదుమూఁడవ సూత్రంబుచే హ్రస్వంబును బొందిన 'అ, ఇ, ఎ' శబ్దంబులమీఁది చోటుశబ్దంబు నోకారంబున కకారహ్రస్వంబులు విభాషగానగును. ఉ. 'అచ్చోటు, అచ్చటు, అచ్చొటు' 'అచ్చోటు' ఇచ్చటఁ బదునాల్గవసూత్రంబుచే ద్విత్వంబును, పదుమూఁడవసూత్రంబుచే హ్రస్వంబును గలిగె. 'అచ్చటు' ఇచ్చట ద్విత్వహ్రస్వంబులపిదపఁ బ్రకృతసూత్రంబున 'చోటు' శబ్దంబుయొక్క యోకారంబున కకారంబయ్యె. 'అచ్చొటు' అకారంబు వైభాషికంబుగావునఁ బక్షంబున నోకారంబు హ్రస్వంబయ్యె, ఇట్లే 'ఇచ్చోటు, ఇచ్చటు' ఇచ్చొటు, ఎచ్చోటు, ఎచ్చటు, ఎచ్చొటు' ఇత్యాదులయందుఁ బ్రక్రియాంశంబు నూహింపునది. (మూలము) వీని ద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగ లోపంబగు. వ్యా—ప్రకీర్ణకపరిచ్ఛేదంబునందు నెనిమిదవసూత్రంబందలి వక్ష్యమాణవైకల్పికద్విత్వలోపవిధిచేఁ గ్రింది 'చ' కారంబునకు లోపంబు వైభాషికంబు. ఉ. అచటు, అచోటు; ఇచటు, ఇచోటు;

ఎచటు, ఏచోటు. (మూలము) 'ముచ్చోటులు, ముచ్చటులు, ముచ్చోటులు' అను రూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి. వ్యా—అనఁగా హ్రస్వంబులైన 'అ, ఇ, ఎ, అను వానిపైనివచ్చు 'చోటు' శబ్దంబుయొక్క యోకారంబున కత్వ హ్రస్వంబులు విధింపంబడెను. కాన 'మూఁడు' శబ్దంబుపైనివచ్చు 'చోటు' శబ్దంబునందత్వ హ్రస్వంబులు ప్రయోగింపంబడవు. 'క॥ కటకట పేరినపెన్నె। త్తుట జొత్తిలియున్న మోముతోడం గొమకె। చ్చటఁ బడియున్నాఁడో య।చ్చోటుఁ జూపెడువారలేరె చూచెదవానిఁ భార.' 'తే॥ గీ॥ చరణములు కేల్గడిగి ముచ్చట్లు చఱచి। పీఠమున నుండి కాళ్లునాఁ బృథివిమోపి। యర్థినాపోశనమును బ్రాణాహుతులును। గొనిగృహస్థుండు మానియై కుడువవలయు' విజ్ఞా-ఆచా-కాం. తక్కుంగలవానికిఁ బ్రయోగంబులు సులభము.

16 సూ—ఉత్తమపదం బగుచోటు శబ్దముటాక్షరమునకు లోపంబు విభాషనగు.

చోటుశబ్దం బౌపవిభక్తికంబు గావున దాని యంతిమాక్షరంబు సప్తమ్యాదేశమయిన యకారంబుతోడం బాక్షికంబుగ లోపించుననియర్థము ॥ అచ్చోనున్నాఁడు - అచ్చోటనున్నాఁడు - ఒకచోనుండె - ఒకచోటనుండె.

చోటుశబ్దంబౌపవిభక్తికంబుగావున దానియంతిమాక్షరంబు సప్తమ్యాదేశమైన యకారంబుతోడం బాక్షికంబుగ లోపించునని యర్థము. ఉ. అచ్చోనున్నాఁడు, అచ్చోటనున్నాఁడు; ఒకచోనుండె, ఒకచోటనుండె.

వ్యా—సమాసంబులో నుత్తరపదంబైనట్టియు, ఆచ్ఛికపరిచ్ఛేదంబులోని 'ముప్పది, యెనిమిదవసూత్రింబుచే నంతంబునందకారాదేశంబుగలిగినట్టియు 'చోటు' శబ్దంబుయొక్క యకారయుక్తటకారంబునకు లోపంబు వైకల్పికంబుగానగును. అనఁగా

చోటుశబ్దం ౯బౌపవిభక్తికంబుగావున దానికడపటి యక్షరంబైన టకారంబు సప్తమీవిభక్తియందు ధాదేశంబైన యకారంబుతో సహితంబు వైకల్పికంబుగా లోపించును. 'అచ్చోనున్నాఁడు' ఇచ్చట వాచ్ఛికపరిచ్ఛేదంబులోని ముప్పదియొనిమిదవ సూత్రంబుచే సప్తమీవిభక్తికత్వంబురాగా నకారయుక్తటకారంబునకుఁ బ్రకృత సూత్రంబుచే వైకల్పికలోపంబు. లోపాభావంబున 'అచ్చోటనున్నాఁడు' ఇట్లే ఒకచోనుండె, ఒకచోటనుండె' ఇత్యాదులు.

17 సూ—సమానాధికరణంబగు నుత్తరపదంబుపరంబగునపుడు మూఁడుశబ్దము డువర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబునగు.

మూఁడుజగములు ముజ్జగములు - మూఁడులోకములు-ముల్లోకములు.

వ్యా—సమానవిభక్త్యంతపదంబులలో నుత్తరపదంబు పరంబగునపుడు 'మూఁడు' శబ్దంబు డువర్ణంబునకు లోపంబును, మీఁదిహల్లునకు ద్విత్వంబునునగు. ఉ. మూఁడుజగములు, ముజ్జగములు. ఇచ్చట 'మూఁడు + జగములు' అనియుండ 'జగములు' సమానాధికరణంబు (బ్రాహ్మణునియందు బ్రాహ్మణత్వంబువోలె జగత్తులయందు జగత్త్వరూపధర్మంబును, త్రిత్వరూపధర్మంబును నున్నందునఁ బైరెండుధర్మంబులకు జగత్తులేకాధికరణంబు) కావున డువర్ణలోపంబుగలిగి పై జకారంబునకు ద్విత్వంబు గలుగఁగాఁ బదుమూఁడవసూత్రంబుచే 'మూ' శబ్దంబునకు హ్రస్వంబుగలిగె. లోపము వికల్పంబుగావునఁ బక్షంబున మూఁడుశబ్దంబు ప్రకృతిభావంబుతో నుండు. ఇట్లే మూఁడులోకములు, ముల్లోకములు. కొన్ని పొత్తంబులలో మూలసూత్రంబునందు 'డువర్ణంబునకు' అని పాఠముగలదు. అయ్యది ప్రామాదికంబు. నకారాదియైన యుత్తరపదంబు పరంబగునపుడు పూర్వపదాంతిమడకారంబునకు నకారంబగు. ఉ. రెన్నాళ్లు (రెండు + నాళ్లు) మూన్నాళ్ళు (మూఁడు + నాళ్లు, వేన్నీళ్లు)(వేఁడి + నీళ్ళు.) (క॥ పదిదినము లైదు ప్రొద్దులు। పదపడి రెన్నాళ్లు నొక్క పగలుఁ రేయుఁ

నిజప్రభావములు మూఁడుగద్దియ మీఁదనెక్కి- ముల్లోకము దాన యేలఁగలి లోలవిలోచన యేమి చెప్పఁదుర్ల, పారి - 1 ఆ. ముమ్మొగహారా త్త ముఖను, జైమిని-7 ఆ.

19 సూ—కొండొకచో సమాసంబులందు నామ్వాదికనుమ్వాద్యుల మువర్ణంబులు పఙ్ఫవర్ణంబులగు.

నాఁపచేను - పాపఁతేఁడు ॥ కనుపపులు - జనుపనార॥ నాము - పాము - ప్రేము - వేము - అమ్ము - ఎమ్ము - ఇవి నామ్వాదులు ॥ కనుము - ఇనుము - ఉడుము - ఎనుము - జనుము - మినుము - ఇత్యాదులు కనుమ్వాదులు.

వ్యా—కొన్నిచోటుల సమాసంబులయందు 'నాము' మొదలైనశబ్దంబులయు, 'కనుము' మొదలైనశబ్దంబులయు, మువర్ణంబులకు క్రమంబుగాఁ బిన్వర్ణంబును, (ఁప) పవర్ణంబునునగు. ఉ॰ నాఁపచేను. 'నాము + చేను' ఇట్లుండఁ బూర్వశబ్దాంత్య మువర్ణంబునకుఁ బిన్వర్ణంబు గలుగునయ్యదిజిత్తుగావునఁ దత్సమపరిచ్ఛేదంబులోని పంచవిమ్శదవసూత్రంబున దీర్ఘంబుపై నర్ధానుస్వారంబు గలిగెను. ఇట్లే 'పాము, (పాఁప తేఁడు) ప్రేము, (ప్రేపసజ్జ) వేము,( వేఁపచెట్టు)అమ్ము, (అంపకోలలు) ఎమ్ము, (ఎంపగూఁడు); ఇత్యాదులు. పవర్ణంబునకుఉ. కనుపపులు. (కనుము + పులు) ; (గడ్డి)ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున మువర్ణంబునకు 'ప' వర్ణంబువచ్చెను. ఇట్లే 'జనుము' (జనపనార) ఇనుము, ఉడుము, ఎనుము, మినుము' ఇత్యాదులూహ్యంబులు. సీ॥ తగుసీరపుఁ బెగ్గ తడఁబడనిడుపడు పాఁప తేఁడన శేషఫణికిసంజ్ఞ' ఆంధ్రభా-పాతాళభోగివర్గము. క॥ అను టయురసలింగమునిడు । తనవ్రతువ ప్రేఁపసజ్జవంతపుబరణికా' మను-1 ఆ 'ఆ॥ వె॥ ఒక్కయెలుకు తేఁడు నక్కకొమ్మును నిత్తి । గోఁఅదంబుజున్ను చాఁపప్పు । పీలిగ ఱాల యంపకోలలు సెలవిండ్లు । గానుకిచ్చి కరయుగంబు మొగిచి' వసు-4 ఆ.'సీ॥ గీ ముస్తామిచ్చిచ్చును విరాళిఁగొన్న చోటుఁ కనుపపులుపేల్పు పఁవాలుఁ గన్నచోట

మను-2 ఆ. 'చ॥ నరసెను వెంట్రుకల్ జడపడార తెఱంగున విప్రమాళికల్' ఇ త్యాదులు.

20 సూ — నిక్కాలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

నిక్కాల - కన్వడి - పువ్విలుకాఁడు ॥ ఇత్యాదులు.

వ్యా—'నిక్కాల' మొదలైన సమాసంబులయందుఁ బూర్వపదం బాద్యక్షర శేషంబగుటయు, నుత్తరపదాదివర్ణంబు ద్విత్వంబు నొందుటయు' నిత్యాదికార్యంబులు ప్రయోగశరణంబులై యుండును. ఉ. నిక్కాల, కన్వడి, పువ్విలుకాఁడు మొదలైనవి. 'నిక్కము + కాల' ఇచ్చట 'నిక్కము' శబ్దం బాద్యక్షరంబుతో శేషించె. ఉత్తరపదాదియైన కకారము ద్విత్వంబునొందె. 'కను + వడి + కాఁడు' ఇచ్చట కనుశబ్దం బాద్యక్షరశిష్టంబగుటయు, ఉత్తరపదవకారంబు ద్విత్వంబొందుటయు, తత్పురుషపరిచ్ఛేదంబులోని పదునొకండవ సూత్రంబు చేనయిన కాప్రత్యయంబు లోపించుటయుఁ గలిగె. 'కన్వడి' శబ్దం బికారాంతంబు గావునఁ దత్సమపరిచ్ఛేదంబునందలి నలువదినాలుగవసూత్రంబుచేఁ బ్రథమైక వచనలోపంబు. 'పువ్విలుకాఁడు' ఇచ్చట సార్థకంబునందుఁ దద్ధితపరిచ్ఛేదంబునందలి పదునొకండవ సూత్రంబుచే 'కా' ప్రత్యయంబు గలుగంగ డువర్ణకంబు. 'గీ- నాకు నిక్కాలయయ్యెడు | శోకింపకు మమ్మ నీవు సుందరిపుణ్య | శ్లోకుం డుత్తరశోభనకలుప | మింత ప్రియుని బొందఁగలుగు వేగమె నీకున్' భార-ఆర-6 ఆ. 'క॥ కడఁగి ద్రుపదాత్మజుఁడును | కన్వడికన్వడి నేసెనూటఁ బాఁడిశరంబుల్' భార-ఆర-6 ఆ. 'ఉ॥ పువ్విలుకాఁడు నాహృదయముల్ నొగిలించుచునున్నవాఁడు' ఉ-రా-7ఆ.

21 సూ—ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబున కయి యాయియనుశబ్దంబులు విభాషనగు.

వక్ష్యమాణ విధిచేతనయి యనుదాని కైకారాదేశంబునగు ॥ ఆయయికాలము - ఆయాయికాలము - అయ్యాయికాలము - అయ్యా

యకాలము - ఆయైకాలము - అయ్యైకాలము - ఆయాకాలము - ఆయక్కాలము - అయ్యాకాలము - అయ్యక్కాలము.

వ్యా—తత్పురుషార్థ మిచ్చునట్టి యామ్రేడితాకారంబునకు ‘అయి’ ‘ఆయి’ అను శబ్దంబులు పర్యాయంబుగ నగును. (సూత్రము) వక్ష్యమాణవిధి చేత నయియును దాని కైకారాదేశంబునగు. వ్యా—క్రియాపరిచ్ఛేదంబునందలి నూటమూఁడవ సూత్రంబుచే ‘అయి’ శబ్దంబున కైకారాదేశంబు గలుగును. ఉ. అయయికాలము, ఆయాయికాలము, అయ్యయికాలము, అయ్యాయికాలము, ఆయైకాలము, అయ్యైకాలము, ఆయాకాలము, ఆయక్కాలము, అయ్యాకాలము, అయ్యక్కాలము, ‘ఆయాయికాలము’ (ఆ + ఆ + కాలము) ఇచ్చటఁబరంబైన యాకారంబునకు ‘అయి’ ఆదేశంబును, సంధిపరిచ్ఛేదంబులోని మూఁడవసూత్రంబుచే యడాగమంబును గలిగెను. ‘ఆయాయికాలము’ పరంబయిన యాకారంబునకు వైభాషికంబైన యాయి యాదేశంబు. ‘అయ్యయికాలము’ పరాకారంబునకు యడాగమమాయి యాదేశంబులుకాఁగాఁ బదునాల్గవ సూత్రంబుచే ద్విత్వంబును, పదుమూఁడవ సూత్రంబుచే మొదటి యాకారంబునకు హ్రస్వంబునయ్యె. ‘అయ్యాయికాలము’ యడాగమంబును, పరాకారంబునకాయి యాదేశంబును రాఁగ, బదుమూఁడు పదునాలుగు సూత్రంబులచే హ్రస్వద్విత్వంబులు. ‘ఆయైకాలము’ ఇటఁబరాకారంబున కాదేశంబయిన ‘అయి’ కిఁ గ్రియా పరిచ్ఛేదంబులోని నూటమూఁడవ సూత్రంబుచే నైకారాదేశంబును, సంధిపరిచ్ఛేదంబులోని మూఁడవ సూత్రంబుచే యడాగమయకారంబును నయ్యెను. ‘అయ్యైకాలము’ యడాగమయకారంబునకుఁ బదునాలుగవ సూత్రంబుచే ద్విత్వంబును, పదుమూఁడవ సూత్రంబుచే మొదటి యాకారంబునకు హ్రస్వత్వంబును నయ్యె. ‘ఆయాకాలము’ అయి’ ‘ఆయి’ ఆదేశంబులు భయంబును విభాషగాన, బరాకారంబు ప్రకృతితోనుండ యడాగమంబుగలిగె. ‘ఆయక్కాలము’ ప్రకృతితోనుండిన పరాకారంబుమీఁది కకారంబునకుఁ బదునాల్గవ సూత్రంబున ద్విత్వంబును, పదుమూఁడవ సూత్రంబున యాకారంబునకు హ్రస్వత్వంబును నయ్యె. ‘అయ్యాకాలము’ ప్రకృతితోనుండిన పరాకారంబునకు యడాగమంబురాఁగాఁ బదునాలుగవ సూత్రంబుచే యకారంబునకు ద్విత్వంబును పదుమూఁడవ సూత్రంబుచే మొదటి యాకారంబునకు హ్రస్వత్వంబును గలిగెను. ‘అయ్య

క్కాలము' పరాకారంబునిమీఁది కకారంబునకుఁ బదునాలుగవ సూత్రంబుచే ద్విత్వంబును, పదుమూఁడవ సూత్రంబుచేఁ బరాకారంబునకు హ్రస్వత్వంబును, పైసూత్రంబుల (14-13)చేత నేకరూపంబుగా యడాగమయకారంబున కుద్విత్వంబును, మొదటి యాకారమునకు హ్రస్వత్వంబును గలిగె.

22 సూ—బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గొనంబడి యెడి.

ముక్కంటి - కడలిరాచూలి - నలువ - గట్టువిలుతుఁడు.

వ్యా—బహువ్రీహి సమాసంబుయొక్క యంత్యంబున 'టి' కారంబుమొదలైన కార్యంబులు చూపఁబడెను. ఉ. ముక్కంటి; కడలిరాచూలి; నలువ; గట్టువిలుతుఁడు. 'ముక్కంటి' (మూఁడుకన్నులు గలవాఁడు=ఈశ్వరుఁడు) అను బహువ్రీహియందు సమాసాంతంబగుచు 'టి' వర్ణంబయ్యె. అచ్చిక పరిచ్ఛేదంబునందలి ముప్పదిమూఁడవ సూత్రంబుచే 'టి' వర్ణంబునకు ముందు పూర్ణబిందువు గలిగె. 'కడలిరాచూలి' ఇచ్చట 'చూలు' శబ్దంబుకారాంతంబైనను బహువ్రీహిఘటకంబు గావున నికారాంతంబు సమాసాంతంబయ్యె. సముద్రుఁడను రాజుయొక్క గర్భముగలది=లక్ష్మి. ఇకారాంతంబగు చూలిశబ్దంబును గలదు. ఆపదంబుతో సమాసంబుచేసినప్పుడు సమాసాంతకార్యం బనవసరంబు. అప్పుడు షష్ఠీతత్పురుషంబుచే నీయర్థంబు లభించును. 'నలువ' ఇచ్చట నుత్తరపదంబు 'వా' శబ్దంబు. నోరర్థము. నాలుగునోళ్లు కలవాఁడన్న బహువ్రీహియందు 'వా' శబ్దంబుహ్రస్వంబయ్యె. వృత్తియందు 'నాలుగు' శబ్దంబునకు హల్లుపరంబుకాఁగా 'నలు' ఆదేశంబయి 'నలువ' అను రూపంబు సిద్ధించె. 'గట్టువిలుతుఁడు' పర్వతంబు ధనుస్సుగాఁ గలవాఁడను బహువ్రీహియందు 'త' కారంబు సమాసాంతంబయ్యె.

23 బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకుఁబోఁడియగు.

అలరుఁబోఁడి - ననఁబోఁడి - పూఁబోఁడి - విరిఁబోఁడి.

వ్యా—బహువ్రీహి సమాసంబుచేత 'వనిత' వాచ్యమైనపు డుపమానపదంబు మీఁది 'మేను' శబ్దంబునకు 'బోఁడి' శబ్దంబాందేశంబగు. ఉ. అలరుబోఁడి; ననబోఁడి పూబోఁడి; విరిబోఁడి. 'అలరుబోఁడి, పుష్పంబునంటి మేనుగలదియును బహువ్రీహి యందు 'మేను' శబ్దంబునకు 'బోడి, అనునది యాదేశంబయ్యె. ఇట్లే 'ననబోఁడి, ఇత్యాదులు బహువ్రీహిసమాసంబులనియు, వానియందలి 'మేను, శబ్దంబునకు 'బోఁడి; అనునది సర్వాదేశంబైనదనియు, సూరిగారి యాశయంబు. వాస్తవంబున నాలోచింపఁగా 'అలరుఁబోఁడి, తీయఁబోఁడి, పూఁబోడి ఇత్యాదులయందు 'పోఁడి, శబ్దంబుగాని 'మేను' శబ్దంబున కాదేశంబుగావచ్చిన 'బోఁడి, శబ్దంబుకాదు. 'మేను, శబ్దాదేశంబైన 'బోఁడి, శబ్దంబనిసమ్మతించినచో 'మించుబోఁడి, ఇత్యాదులసాధువులగును గాని 'మించుఁ బోఁణి, ఇత్యాదిణకారఘటితరూపంబులు సాధువులగును. 'పోఁడి, శబ్దంబని గ్రహించిన చోఁ బ్రకీర్ణక పరిచ్ఛేదంబులోని పదుమూఁడవ సూత్రంబునందు నడంగ్వాదులలో 'పోఁడి, శబ్దంబున్నది కావున 'పోఁణి, అనుణకారఘటితరూపంబు సాధునగుటయేకాక 'మించుబోఁణి' ఇత్యాదిరూపంబులు శాస్త్రీయంబులగును. కావుననే యీక్రిందిప్రయోగంబు సాధువగుచున్నది, సీ॥ గీ॥ మేటిరతులకు సురతాణి మించుఁ బోఁణి, తారా—4ఆ. మఱియు 'పోఁడి' శబ్దంబుపరంబగుచుండ నుదంతంబులకే గాక సరాఁ జంతపూర్వపదంబులకు నుగాగమంబగును. అందున శా॥ అయ్యా మీరలుబాడ బాగ్రిలులో బాహాజన్ములో ద్రోవదక్ ! దియ్యంబోఁడి వరింపఁగా వసుధకే తేఁ జూచునాదిత్యులో' పాంచా—3ఆ. ఇత్యాదుకారాంత పూర్వపదక స్థలమ్ములందుఁ బూర్ణానుస్వారంబసాధువగు. 'అలరుఁబోఁడి, ననఁబోఁడి, విరిఁబోఁడి' ఇత్యాదులందుత్తర పదంబు 'పోఁడి' శబ్దంబుకావునఁ బూర్వపదంబునకు నుగాగమంబురాఁగాఁ బకారం బునకు సరళాదేశంబగుచో నాదేశసరళంబునకు ముందునర్ధబిందువును, పక్షంబునఁబూ ర్ణానుస్వారంబును గలుగును కనకఁబైసమాసంబులందలిపూర్వపదంబుపై నర్ధానుస్వారా దులుండవలయు. సూరిగారి మతంబునఁ బూర్వపదంబుపై నర్ధానుస్వారంబు 'మించు బోఁణి' ఇత్యాదులందు ణకారంబును నశాస్త్రీయంబులు కావలసివచ్చును. కాఁబట్టి 'అలరుఁబోఁడి' ఇత్యాదులు బహువ్రీహిసమాసంబులనుకొని ప్రకృతసూత్రంబుచేబహు వ్రీహిని 'మేను, శబ్దంబునకు 'బోఁడి' శబ్దాదేశంబు కలుగునన్నవిధికి సూరిగారిభ్రమ

వ్యా—ద్వంద్వసమాసంబునందుఁ బూర్వపదాంతంబైన ఋకారంబునకురవర్ణంబు (ౘావడి) వైకల్పికంబుగా నగును. ఉ. మాత్రపితలు; మాతాపితలు. 'మాతృపితలు' ఇచ్చటఁ బూర్వపదంబైన 'మాతృ' శబ్దంబు ఋకారాంతంబు. ఈసమాసంబు సిద్ధసమాసంబు. 'ఆనఙృతో ద్వంద్వే' అనుసూత్రంబుచే నుత్తరపదంబు పరంబగుచుండఁ బూర్వపద ఋకారంబునకు విధింపబడుచున్న యానఙాదేశంబును బాధించి యంతకుమున్ను ప్రకృతసూత్రంబుచే రేఫాదేశంబు కలుగునని భావంబు. రేఫాదేశంబు రానియపుడు 'ఆనఙృతో ద్వంద్వే' అనుపూర్వోక్త సాంస్కృతిక వ్యాకరణసూత్రంబున నాఋకారంబున కానఙాదేశంబుగలిగి 'మాతాపితలు' అగును. ఈరేఫాదేశంబు 'ద్వంద్వే గీర్వాణికే దీర్ఘాత్పరతో పి వికల్పతః' అనుకారికచేతను గీర్వాణద్వంద్వ సమాసంబునందు (సిద్ధసమాసమందు) దీర్ఘంబుతరువాత వచ్చుఋకారంబునకు రేఫాదేశంబు కలుగునని చెప్పుటచేత 'మాత్రపితృబుద్ధినంభోధపుత్రిఁగొలుతు, ఇత్యాది కవిప్రయోగంబులు సాధువులయ్యె. హ్రస్వంబుతరువాతవచ్చు ఋకారంబునకు నీసూత్రంబుచే రేఫాదేశంబుగలుగదు. అందున 'పితాపుత్రులు, అన్న యానఙాదేశయుక్తరూపంబే సాధువగును గాని 'పితపుత్రులు, అని రేఫాదేసంయుక్తరూపంబు శాస్త్రీయంబుకాదు. గీర్వాణద్వంద్వసమాసంబునందు (సిద్ధసమాసము) హ్రస్వంబుతరువాతిపూర్వపదసంబంధి ఋకారంబునకు రేఫంబు రాదుకావుననే యీక్రిందిపద్యంబునఁ బితృశబ్దంబు రేఫాదేశాంతము కాలేదు. 'క॥ నామములఁ బితృపితామహ। నామంబులకుగ బిరుదనామంబుల సాంగ్రామికులెల్లఁగెంతురుచము। నామెున నీమెునను జాతుల్యులవరకయుక్తా.,' మఱియు నీరేఫాదేశంబు సంస్కృతద్వంద్వంబునందు నానఙాదేశంబువోలె సమాసచరమావయవమైనపదము (కడపటిపదము) పరంబగునప్పుడే దానికిఁ బూర్వంబైన పదంబుయొక్క ఋకారంబునకు వచ్చునుగాని బహుపదంబులు మేళగించిన ద్వంద్వంబునందు ఋకారాంతపదంబు కడపటిపదంబునకుఁ బూర్వంబైయుండనిచోఁ బ్రకృతరేఫాదేశంబురాదని యెఱుంగవలయు. కావుననే రేఫాదేశరహితంబులైన యీక్రింది ప్రయోగంబులు సాధువులగుచున్నవి. 'తే॥ గీ॥ మాతృపితృదారపుత్రక భ్రాతృశిశు। హస్తకంబులు సంస్కృతినసుభవింపఁబడియె నెందులనెవ్వనికడలువాఁడు ॥ నరుఁడనిత్యత నూహించుటరయనిరవు' క॥ మాతృపితృగురువులకుఁగ। నేతెంపున, ఇచ్చటి ద్వంద్వంబునం

ను మాతృశబ్దంబు కడపటిపదంబునకు ముందు రాలేదు. కావున రేఫాదేశయుక్తంబు గాని యానఙాదేశయుక్తంబుగాని కాలేదు. (ఉ॥ క్షత్రియవంశ్యులై ధరణిగావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ। క్షత్రియవైశ్యశూద్రులనఁగాఁ గలనాలుగు జాతులకున్ స్వచా। రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితుఁగాచిన యట్లు రాఘవమాం। ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబునన్, భార-ఆది. 2 ఆ. ఈపద్యంబునందు 'మాంధాతృరఘుక్షితీశులు', అనిన ద్వంద్వంబునందు మాంధాతృశబ్దంబు రేఫాదేశయుక్తంబై భారతంబునందున్నట్లు తెంచియుడినము సూరకవి. (గీ॥ ధర ఋకారాంతశబ్దంబు ద్వంద్వమైన। రేఫమగునుఁ బ్రవర్తిల్లుపృథముగాను। పత్రివరవాహయవాగ్వధూనేత్రముఖను। రాభినందితపాదాబ్జ యన్న యట్లు, కవిసం-ప్రథమ-28 ల. అనుపద్యలక్షణంబునకు లక్ష్యంబుగాఁ జూపెను. అప్పకవి పైపద్యచతుర్థపాదంబునందు మాంధాతృశబ్దంబు భారతరచనాసమయంబున ఋకారాంతంబుగానే రచింపఁబడినదనియెంచి రేఫశ్లిష్టమైన యక్షరంబులకు రేఫశ్లిష్టంబుగాని యక్షరంబు ప్రాసంబుగానుండవచ్చు నన్నదానికిఁ బైపద్యం బుదాహరణంబుగా నిరూపించెను. కొన్ని ప్రాచీనభారత పుస్తకంబుల రేఫయుక్తంబుగాను, మఱికొన్నిటియందు రేఫవిరహితంబుగాను మాంధాతృశబ్దం బుండవచ్చును కావునఁ బూర్వోక్తకవు లిద్దఱును నుభయవిధంబుగా నభిప్రాయపడిరి శాస్త్రంబున 'మాంధాతృరఘుక్షితీశుల' అన్న ద్వంద్వంబులో రఘుక్షితీశశబ్దంబు సమాసచరమపదంబు (కడపటిపదంబు) కానదానికిఁ బూర్వంబునందున్న మాంధాతృశబ్దంబునకు రేఫాదేశంబు రావచ్చును. ఆయాదేశంబు విభాష. కావున మాంధాతృశబ్దంబు ద్వంద్వంబందు ఋకారాంతంబుగానుండవచ్చును. 'మాతాపితలు', అన్న ద్వంద్వంబునందు రేఫాదేశాభావంబునందు నానఙాదేశంబునట్లె 'మాంధాతృరఘుక్షితీశులు', అన్నచోటున రేఫాదేశంబు రానియపుడు నానఙాదేశంబు రాదు. 'ఆనఙృతో ద్వంద్వే', అను సూత్రంబుచే విహితంబైన యానఙాదేశంబు విద్యాసంబంధవాచకంబులును, యోనిసంబంధవాచకశబ్దంబులును నైన ఋకారాంతపూర్వపదంబులకే వచ్చును. 'మాతాపితలు', అనుచో మాతృశబ్దంబు యోనిసంబంధవాచకంబు. 'హోతాపోతలు', అను ద్వంద్వంబునందు హోతృశబ్దంబు విద్యాసంబంధవాచకశబ్దంబు. కావున నానఙాదేశంబు సాధీయంబు. మాంధాతృశబ్దంబు విద్యాయోనిసంబంధవాచకంబులలో నేదియుంగానియందున రేఫాదేశాభావపక్షంబున

బుకారాంతయుక్తంబే సాధిష్ఠంబగు. కావున నప్పకవి బుకారాంతంబనియెంచి రేఫ శ్లిష్ట ప్రాసంబునకు నుదాహరణంబుగాఁ జూపుట సర్వపథంబుల రమణీయంబని యెంచవలయు. శ్లో॥ పితుర్దశగుణం మాతా గౌరవే ణాతిరిచ్యతే, అను శాస్త్రంబున మాతజనకునికంటెఁ బూజ్యతమురాలుగాన 'మాతాపితలు' ఇత్యాదిద్వంద్వంబులం దు జననీవాచకశబ్దంబు ముందుండుట శాస్త్రీయంబు.

25 సూ—సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు.

రామునిబాణములు ॥ సరసపువచనములు ॥ వేవెలుఁగు ॥ గుణములప్రోక.

వ్యా—సమాసంబులయొక్క విభక్తికి లోపంబుగలుగును. తత్సమపరిచ్ఛేదంబు నందలి ముప్పదియొకండవ సూత్రంబుచే విభక్తులకు విహితంబైన లడాగమంబునకు లోపంబుగలుగదు లడాగమంబుటిత్తుకావున విభక్తికి నాద్యవయవమై సమీపంబునఁ జేరెను. వృషభాదులకు జన్మకాలంబున లేకుండి మధ్యకాలంబున శృంగంబు లుద్భూతంబులైనను శృంగావయవవిశిష్టంబునందే వృషభశబ్దవ్యవహారంబు శాస్త్రలోకసమంజసమగు నట్టులు లడాగమవిశిష్టంబైనవిభక్తియందే విభక్తిత్వధర్మంబు పర్యాప్తంబగునుగాని లడాగమంబువిడిచిన కేవలవిభక్తియందుఁ దాదృశవ్యవహారంబు రానేరదు. కాఁబట్టి సమాసవిభక్తికి లోపంబు విధించుచో లడాగమయుక్తస్థలంబులో లడాగమవిశిష్ట విభక్తికి లోపంబు ప్రాప్తించుచున్నది. 'ప్రాప్తిపూర్వకోహినిషేధః' అను శాస్త్రంబునఁ బ్రాప్తించుచున్న లడాగమలోపంబు రాదనియుఁ, గేవలవిభక్తికే వచ్చు ననియు నపూర్వంబుగా నిషేధంబు సూత్రితంబయ్యె: తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదియొకండవ సూత్రంబుచే విహితంబైన నిగాగమంబునకు లోపనిషేధంబు చెప్పంబడలేదు. నిగాగమంబు డుమంతంబునకు విధింపంబడినది. కాన నాయాగమంబు ప్రకృతికి నవయవంబుగాని విభక్తికి నవయవంబుగాదు. కనుక లోపంబునకుఁ బ్రసక్తియేలేదు. 'ఉ. రామునిబాణములు' ఇచ్చట రామునియొక్క బాణంబులని విగ్రహంబుండఁగాఁ బూర్వోత్తరపదంబుల సంబంధంబైన యొక్కప్రథమావిభక్తులకు లోపంబుగలిగె. అనంతరము 'రామునిబాణ' అనువిశిష్టంబుకంటెఁ దిరిగి ప్రథమావిభక్తి యుదయించె ఇట్టు

తక్కినయుదాహరణంబులయందును బూర్వోత్తరపదవిభక్తులు లోపింపవనియు విశిష్ట సమాసంబుకంటెఁ దిరిగి యాయావిభక్తి యుత్పత్తిల్లుననియు నూహింపఁ దగవలయును. సరసపువచనములు' ఇచ్చట, సరసములు + వచనములు' ఇట్లు కర్మధారయవిగ్రహం బుండఁ బ్రకృతసూత్రంబునఁ బూర్వపదబహువచనంబునకు లోపంబుగలిగె. తత్సమపరిచ్ఛేదంబునందలి నలుపదియవ సూత్రంబుచే ముగాగమంబు ప్రకృతికి విధింపంబడినది కావునఁ బ్రకృతసూత్రంబున దానికి లోపంబు ప్రసక్తింప లేదయ్యె. తత్సమపరిచ్ఛేదం బునందలి నలువదియొకండవ సూత్రంబుచే మువర్ణకకార్యంబు ముగాగమంబునకును నగు ను గాన సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదిరెండవ సూత్రంబుచే ముగాగమంబునకుఁ బు వర్ణంబయ్యె. పుంవర్ణంబైనచో 'సరసపువచనములు, అను విశిష్టరూపంబగును 'వేవెలుఁగు, ఇచ్చటఁ బూర్వపదంబైన 'వే, శబ్దంబునకు సహస్రమర్థంబు. దీనికంటెఁ బ్రథమావిభక్తి యుత్పత్తిల్లి సమాసంబుకానఁ (బహువ్రీహి) బ్రకృతసూత్రంబున లోపంబుకలిగె. 'గుణ ములప్రోక గుణములయొక్క ప్రోక, ఇట్లు విగ్రహవాక్యంబుండ యొక్కాదివిభక్తులు లోపించె. లట్టునకు లోపంబునిషేధింపంబడినది కావున సమాసఘటితలకారంబునకు లోపంబురాలేదు. ఇచ్చట సమాసశబ్దంబు వృత్తికి నుపలక్షణంబు. కనుక 'జాలరి, ఇత్యాదితద్ధిత వృత్తియందు విభక్తి లోపంబుగలిగె.

26 సూ—కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులుకర్తతోడంబోలె వానితోడసమసించు.

రాముఁడురక్షించిన భృత్యుఁడు - రాముఁడువాలినేసిన బాణము - రాముఁడుగోవునిచ్చిన విప్రుఁడు - రాముఁడు వెడలిన వనంబు- రాముఁడు వసించిన పర్ణగృహము - రాముఁడు వసించినచోటు.

వ్యా—కర్మముఖ్యముగా నెఱవేలుమనట్టి వ్యాపారంబు కర్మాదికారకంబుల పై నారోపింపంబడినచో ధాతుజ విశేషణంబులు కర్తృసంబలెఁ గర్మాదికారకంబుల కును విశేషణంబగునని యర్థము. ఉ. 1 రాముఁడు రక్షించినభృత్యుఁడు, 2 రాముఁడు వాలినేసిన బాణము, 3 రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు, 4 రాముఁడు వెడలిన వనం బు, 5 రాముఁడు వసించిన పర్ణగృహము, 6 రాముఁడు వసించినచోటు (1) ఇటధాత్వ

ర్థంబైన రక్షించుట, రామునిచే ముఖ్యంబుగా నెఱవేర్పందగ్గది. అయిన నట్టిరామనిష్ఠ మైన రక్షణ భృత్యునిపై నారోపింపంబడినది కావున, భృత్యుని రక్షించిన రాముఁడు, అన్నవాక్యంబున ‘రక్షించిన’ అనునది రామునకుంబలె ‘రాముఁడు రక్షించిన భృత్యుఁడు, అను ప్రకృతవాక్యంబులోఁ గూడ, రక్షించి ‘అనునది భృత్యునికి విశేషణంబయ్యె ను. ఈవాక్యంబున రాముఁడు కర్తయును భృత్యుఁడు కర్మంబునుగాన నియ్యది కర్తృ వ్యాపారంబుపై నారోపించినందులకు నుదాహరణంబు (2) ఈవాక్యంబునందు ‘ఏయు ట, (కొట్టుట) అను ధాత్వర్థంబును నెఱవేర్పఁగా రాముండు ప్రధానుండు. అయినను నట్టిక్రియను నెఱవేర్చుటకుఁ బ్రధానంబుగా బాణమే వివక్షింపంబడినది కావున ‘బా ణముతో వాలినేసిన రాముఁడు, అన్నవాక్యంబున ‘ఏసిన, అను విశేషణంబు రాముని కింబలె ‘రాముఁడు వాలినేసిన బాణము ‘అను, ప్రకృత వాక్యంబునంగూడ ‘ఏసిన, అనువిశేషణంబు బాణంబునకు సంబంధించె. కొట్టుటలో రాముఁడు కర్తయును బా ణంబుకరణంబును నైనందున నియ్యది కర్తృవ్యాపారము కరణంబుపై నారోపింపంబడి నందుకు నుదాహరణము (3) ఇచ్చుట ‘ఇచ్చు క్రియ రామునిచేఁ ప్రధానంబుగా నె ఱవేఱుపఁదగినది. అయినను నట్టిక్రియ విప్రుఁడు నెఱవేర్చినట్టులు వివక్షింపంబడినది కావున ‘విప్రుని కొఱకు గోవునిచ్చిన రాముఁడు, అన్నవాక్యంబున ‘ఇచ్చిన, అనునది రామునికింబలె ‘రాముఁడు గోవునిచ్చిన విప్రుఁడు, అన్న ప్రకృతవాక్యంబు నంగూ డ ‘ఇచ్చిన, అన్న యది విప్రునికి సంబంధించె. ఇచ్చుటయనఁ ద్యాగంబు త్యాగక్రియ కుఁ గర్త రాముఁడును త్యాగంబునకు నుద్దేశభూతుఁడు విప్రుఁడును గాన వాక్యంబు సంప్రదానంబుపైఁ గర్తృధాత్వర్థ మారోపింపఁబడినందులకు నుదాహరణము (4) ఇచ్చో టవెడలుట, (నిర్గయించుట) అను క్రియ చేతనంబుచే నెఱవేర్పఁ దగినది కాన రామున కుఁ బ్రధానంబై సమన్వయించును. అయినప్పటికిఁ బ్రకృతసూత్రంబున నట్టిచేతన వ్యా పారంబు అచేతనంబైన వనముపై మోపఁబడినందున ‘వనమునుండి వెడలిన రాముఁడు, అన్నవాక్యంబున ‘వెడలిన, అను శబ్దంబు రామునకుంబలె ‘రాముఁడు వెడలిన వనంబు, నీప్రకృత వాక్యంబునఁగూడ ‘వెడలిన, అన్నదియచేతంబైన వనంబునకు విశేషణంబు గా సమన్వయించినది ఇచ్చోట రాముఁడు వనంబునుండి విడిపోయినందున ‘వనము, అపాదానకారకంబయ్యె. కర్తృక్రియ యపాదానకారకంబుపై సంక్రమింపఁజేసినందుల

కు నియ్యది యుదాహరణంబు. (5) ఇచ్చోట వసించుటకు ముఖ్యంబుగా రాముఁడు కర్త. అట్టి వాసక్రియ పర్ణగృహంబుపై నారోపింపఁబడినది కాన 'పర్ణగృహమందు వసించిన రాముఁడు,' అన్న వాక్యంబున 'వసించిన' అనునది రామునికింబలె 'రాముఁడు వసించిన పర్ణగృహము,' అన్న ప్రకృతవాక్యంబున పైరీతిని 'వసించిన,' అన్న విశేషణంబు పర్ణగృహంబునకు సమన్వయించినది. ఇచ్చట రామునకుఁ బర్ణగృహమౌపశ్లేషికాధారంబుగావున, గర్తృక్రియ యధికరణకారకంబుపై సంబంధింపఁ జేసినందులకు నియ్యది యుదాహరణము. (6) ఈయుదాహరణంబునఁ గూడఁ బైదానియందుంబలెఁ గర్తృక్రియ యధికరణంబుపై నారోపింపంబడినది. సంస్కృతవ్యాకరణంబునందుంగూడఁ గర్తృవ్యాపారంబు కర్మాదికారకంబుపై నారోపింపఁదగలదు గాని తెనుంగుభాష 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు,' ఇత్యాదివాక్యంబులలో 'రక్షించిన' అనుదానికి రాముఁడును, భృత్యుఁడును, కర్తలైనట్టుల (In construction) సంస్కృతభాషయందు నేక క్రియతోఁ గర్తకును, గర్మాదికారకంబునకును నన్వయంబులేదు. మఱియు సంస్కృతభాషయందుఁ గర్తృవ్యాపారంబు కర్మాదికారకంబులపై సంక్రమింపఁ జేసినప్పుడు కర్మాదికారకపదార్థంబులకు సౌకర్యాధిక్యము భాసిల్లుచున్నట్టులు స్ఫురించుచుండును. తెలుంగుభాషయందుఁ గర్తృక్రియారోపణవలన నట్టిధర్మంబు స్ఫురించుటలేదు. స్పష్టార్థము కొన్ని సంస్కృతభాషయందలి వాక్యంబు లుదాహరింపంబడును. 'ఉ॥ అసిశ్ఛినత్తి' (కత్తి నఱుకుచున్నది) వాస్తవంబున వాక్యంబిట్టులుండవలెను. 'శూరః సాధ్వసినా ఛినత్తి' (శూరుండు లెస్సగాఁ గత్తితో నఱుకుచున్నాఁడు) ఇట్లు నఱుకుటకు దేవదత్తుఁడు కర్తయును, కత్తి కరణంబునైనను మొదటనిచ్చిన యుదాహరణంబునందుఁ గత్తియే నఱుకుటకుఁ గర్తగాఁ జేయంబడినది. అందున శూరునిప్రయాసమవసరంబులేకుండనే కత్తి స్వయంబుగ నఱుకునంతటి సౌకర్యాతిశయంబు గలదని స్ఫురించుచున్నది. 'కాష్ఠాని పచంతి' (ఇంధనంబులు వండుచున్నవి) ఇచ్చట వండుట మనుష్యుని వ్యాపారంబైనను నయ్యదికరణంబులైన యింధనంబులపై సంక్రమింపఁజేయుటవలన వానియందు శుష్కత్వమార్దవాదిసర్వాతిశయంబున్నట్టులు తెలియును. (స్థాలీవండుచున్నది) ఇటవండుట యొకానొక దేవదత్తుని వ్యాపారంబైనను నయ్యది యధికరణకారకంబైన స్థాలిపై నారోపింపఁబడినందున దానియందు (స్థాలియందు) వేగమే వెచ్చనై యన్నంబుడుకునంతటి పలుచనితనము మొదలైన సౌక

వ్యతిరేకంబు కలదని విశదపడుచున్నది. పై వాక్యంబులఁ గర్తృవ్యాపారంబు కర్మాదికారకంబులపై నారోపింపంబడినను 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు' ఇత్యాది వాక్యంబులందుఁ గర్తయైన రాముఁడును, కర్మకారకంబైన భృత్యుఁడును వాక్యాంతర్గతులైనట్టులు 'సాధ్వసిశ్ఛినత్తి' ఇత్యాదివ్యాకరణంబులయందు ఖడ్గాదికార కారకంబులతోఁబాటు శూరాదికర్తలు వాక్యాంతర్గతులు కాలేదు. ఇట్లు భాషాద్వయం బునఁ గొన్ని భేదంబులు కలవు.

ఇదిసమాసపరిచ్ఛేదము.

---

# తద్ధితపరిచ్ఛేదము.

విభక్త్యంతంబులైనశబ్దంబులమీఁది భావార్థమత్వర్థాదులయం దుఁ బ్రయోగించుప్రత్యయంబులు తద్ధితంబులనంబడు. ఇట్టిప్రత్యయం బులను విధించెడుభాగంబు తద్ధితపరిచ్ఛేదంబు.

1 తనవర్ణకంబుత్వార్థంబునందగు.

త్వార్థంబనఁగా భావంబు - ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారం బుభావంబు ॥ రామునితనము - రాముతనము - మనుమనితనము - సీతతనము - గొప్పతనము - కొఱతనము - నల్లఁదనము - పుల్లఁదనము.

వ్యా—'తన' ప్రత్యయంబు త్వార్థంబునందుఁ గలుగు. సంస్కృతంబులో 'రామత్వం, పాత్రిత్వము' ఇత్యాదులయందు 'త్వ' ప్రత్యయంబు తెలియఁజేయునట్టి భావార్థంబునందుఁ దెలుఁగుభాషలో 'తన' వర్ణకంబగు. (మూలము) త్వార్థంబనఁగా భావంబు, ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు. వ్యా—ప్రకృతివలన

బుట్టినయర్థజ్ఞానంబులో విశేషణంబుగాఁదోఁచునది భావంబనంబడు. ప్రత్యయంబు నకు ముందున్న శబ్దంబు ప్రకృతియనంబడును, ఉ. రామునితనము, రాముతనము. తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదిమూఁడవసూత్రంబుచే నిగాగమంబు వైభాషికంబు. రామునియొక్క ధర్మంబని యర్థము. ఇట 'యొక్క' అను షష్ఠీవిభక్తికి ముందు రామ శబ్దంబున్నయది. కావున నది ప్రకృతి. రామశబ్దంబునకు రాముఁడర్థము. రాముఁడనఁగా రామత్వము (రామునితనము) గలపురుషుఁడని విస్పష్టార్థము. రామునియందు రామత్వము (రామునితనము) విశేషణంబుగా భాసించుచున్నది గావున నట్టియర్థంబు భావంబనంబడు. కానిక్రియాపరిచ్ఛేదంబులోని ముప్పదియేడవసూత్రంబునందలి భావ శబ్దార్థంబును, ప్రకృతసూత్రంబునందలి భావశబ్దార్థంబును నొక్కటియేయని భ్రమింప వలదు. 'మనుమనితనము' తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదినాల్గవసూత్రంబుచేఁ దెనుఁ గుడుమంతంబు గావున నిగాగమంబు నిత్యంబు. కావున 'రాముతనము' అన్నయట్లు 'మనుమతనము' అని పక్షంబున ననఁగూడదు. మనుమునియొక్క ధర్మము ఇట 'యొక్క' ప్రత్యయంబునకు ముందు 'మనుమ' శబ్దంబున్నయది. కనుక నయ్యది ప్రకృతి. మనుమఁడనఁగా మనుమనితనంబుగల పురుషుఁడు ఇట్లే 'సీతతనము' (సీతాత్వము) గొప్పతనము (మహత్త్వము) కొంచెతనము (న్యూనత్వము) నల్లఁదనము (నీలత్వము) పుల్లఁదనము (ఆమ్లత్వము) ఇత్యాదులు. నల్ల పుల్ల శబ్దంబులంత గుణవాచకంబులు గావున 'తన' వర్ణకంబు పరంబగునప్పుడు సంధిపరిచ్ఛేదంబులోని ముప్పదియేనవ సూత్రంబున నుగాగమ ప్రాప్తిచే నర్థానుస్వారాది కార్యంబులు గలవయ్యెను.

2 సూ—ఇటవిశేషంబుత్సర్గంబునకు విభాషనుబోధకంబగు.

స్పష్టము.

వ్యా—ఈతద్ధిత ప్రకరణంబునందుఁ గ్రిందవచ్చునట్టి విశేషసూత్రంబులు (అపవాదసూత్రంబులు), తన, వర్ణకవిధాయకంబైన పూర్వోక్తసామాన్య సూత్రంబునకు వికల్పంబుగా బాధకంబులగు. అనఁగాఁ జిన్నాదులు మున్నగువానికి నీక్రింద 'తిక' వర్ణకాదులు విశేషించి విధింపఁబడినను బక్షంబున 'తన' వర్ణకంబు తప్పక కలుగునని భావంబు.

3 సూ—చిన్నాదులకు ఱికవర్ణకంబగు.

చిన్నఱికము-కన్నెఱికము ॥ చిన్న - కన్నె - చుట్టము - దొంగ - పేద - మిండ - లంజె - ఇత్యాదులు చిన్నాదులు.

వ్యా—చిన్నమున్నగు శబ్దంబులకు 'ఱిక' ప్రత్యయంబువచ్చును. ఉ. చిన్నఱికము (చిన్న + ఱికము) కన్నెఱికము; చుట్టము, దొంగ, పేద, మిండ, లంజె, మొద లగునవి చిన్నాదులు గావునఁ జైవానికింబలె ఱిక ప్రత్యయంబూహించునది. పక్షంబునఁ బ్రథమసూత్రంబుచే 'తన' వర్ణకంబగు. ఉ. 'చిన్నతనము, కన్నెతనము' ఇత్యాదులు. 'చుట్టము' శబ్దంబునకు 'తన' వర్ణకంబుపరంబైనపుడు తద్ధితవృత్తి కాన మువర్ణకంబు లోపించెడిని. ఉ. చుట్టతనము సంధిపరిచ్ఛేదంబులోని ముప్పదియేనవసూత్రంబుచే 'సరసపుఁదనము, సరసపుందనము, సరసప్రు(?)దనము' అన్నయట్లు 'చుట్టపుఁదనము, చుట్టపుందనము, చుట్టపుద్దనము అనియొండద్ధితవృత్తి యందు మువర్ణకలోపంబు రానిరూపంబులుతనవర్ణకంబు పరంబగునపు డీశబ్దంబునకుఁబక్షంబుననగు. తద్ధితవృత్తియైనను 'తన' వర్ణకంబుపరంబగుచో దక్కిన ప్రత్యయంబులందుంబలెఁ బ్రథమావిభక్తి మువర్ణకంబునకు లోపంబు సామాన్యంబుగా రాదు ఈయర్థము, సంధిపరిచ్ఛేదంబులోని ముప్పదియేనవ సూత్రంబుచే. 'తన' వర్ణకంబు పరంబగునపుడు పుంపులకు (సంధి—పరి—32 సూ॥ చే మువర్ణకస్థానీయములు) నుగాగమంబు విధించుటంజేసి, యను మేయింపఁబడుచున్నయది. తన వర్ణకంబు సయితము పరంబగుచో మువర్ణకంబునకు లోపంబుగలిగెనేని సంధిపరిచ్ఛేదంబునందలి ముప్పదియేనవ సూత్రంబులో 'తన' వర్ణకంబు పరంబగు నపుడు మువర్ణకస్థానీయంబులైన పుంపులెట్లు లభించును? కాన నిదియే తనవర్ణకంబునకుముందు మువర్ణకలోపాభావంబునకు జ్ఞాపకమగుచున్నదని యెఱుంగవలెను. భావార్థ విహితమైన యీఱికప్రత్యయంబు శకటరేఫఘటితంబని లాక్షణికులమతంబు. అప్పకవి—ద్వితీయాశ్వాసము-అకారసీసమాలిక "ఇద్దఱుపదఱుచుఁ బెద్దఱికంబున గద్దఱియద్దఱి కట్టెదుఱను' శకటరేఫనిర్ణయము. శ్లో॥ ఉ భావియంతస్సర్వే చకియాంతః కతిచాగ్రితః । త్యేవ్వత్యకాన్యాత్యాద్యాశ్చ పూర్వాశ్చకటాఃస్మృతాః' ఇద్దఱు' ఇందఱు, అందఱు, ఎందఱు కొందఱు, ముంగఱు, ఇత్యాదులును, 'పెద్దఱికము, కన్నెఱికము' ఇత్యాది ఱికప్రత్య

యాంతంబులును, శకటరేఫయుక్తంబులని శ్లోకతాత్పర్యము. ద్విరేఫ వర్ణదర్పణము తే॥ గీ॥ సర్వకతి చిద్విశియదియచ్ఛబ్దనాచ్య । ముల టికప్రత్యయంబులఁ బూర్వకథిత । పరశివర్ణ పరంబునగురువెకాని । లఘువు లేవర్ధచంద్ర కలాపవినుత' కనుక 'చిన్నటిక ము, కన్నెటికము, చుట్టటికము, రానటికము మాలటికము, పేనటికము' ఇత్యాదు లందుశకటరేఫంబు బహుకవిసమ్మతంబైనను టికప్రత్యయందు లఘురేఫఘటితంబును గవిప్రయోగంబులఁ గానంబడియెడి. చ॥ అరయఁగఁ దల్లికక్క సెకియండ్రిన దక్కఁగన్గిఁగట్టి చు । ట్టరికముపారి కిన్నెర్గయుడాఁచు రహస్యములీనిజాంతర । స్మరవి కృతి పరివర్తనలమాటలు వీనివినంగ నాపుణ్ణిపరఁగెడు నెచ్చెలుల్ చెలికిఁ బ్రాణము లిచ్చిన నప్పుడీలు నే' పరిభా- ౩ఆ. అలసుకొముదియందు బ॥ సీతా రామాచార్యులవా రు టికప్రత్యయంబు భయరేఫఘటితంబులలోఁ బరిగణించిరి.

4 సూ—ఉత్వంబునకత్వంబుటికము పరంబగునపుడగు.

తొత్తటికము - వెడ్డటికము - వెజ్జటికము.

వ్యా—'టిక' ప్రత్యయంబు పరంబగునపు డుకారాంతశబ్దంబు లకారాంతంబు లగు. ఉ. తొత్తటికము, 'తొత్తు + టికము' ఇచ్చటఁ దొత్తుశబ్దంబునందలి యుకా రంబున కత్వంబుగలిగె. ఇట్లే వెడ్డటికము (వెడ్డుశబ్దము; వంచన) వెజ్జటికము (వెజ్జుశ బ్దము) ఇత్యాదులూహించునది.

5 సూ—పేర్వాదులకిమివర్ణకంబగు.

పేరిమి - కడిమి ॥ పేరు - కడు - మ్రుచ్చు - మేలు - చెలి - పోఁ డి - వాఁడి - వేఁడి - ఇత్యాదులు పేర్వాదులు.

వ్యా—'పేరు' మొదలగుశబ్దంబులకు 'ఇమి' ప్రత్యయంబుగలుగును. ఉ, పేరి మి (పేరు + ఇమి ఇట్లే కడిమి (కడు) ముచ్చిమి (ముచ్చు) మేలిమి (మేలు) చెలిమి (చెలి) పోఁడిమి (పోఁడి) వాఁడిమి (వాఁడి) వేఁడిమి (వేఁడి) 'ఇత్యాదు లూహింపవలెను. చెలి' మొదలైన యికారాంతశబ్దంబులకు 'ఇమి, ప్రత్యయంబురాఁగా సంధిపరిచ్ఛేదం

టలోని పదునొకండవసూత్రంబుచే నపదాదిస్వరంబు పరంబగునప్పుడు సంధి నిత్యంబై 'చెలిమి' (చెలి + ఇమి) పోడిమి (పోడి + ఇమి) ఇత్యాది రూపంబు లయ్యెడి.

6 సూ—నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు.

నల్లన - తెల్లన ॥ నల్ల - తెల్ల - పచ్చ - ఎఱ్ఱ చామ - తియ్య - కమ్మ - పుల్ల - చప్ప - విన్న - తిన్న - అల్ల - ఒయ్య - తిమ్మ- చక్క - వ్రేక - ఇత్యాదులునల్లాదులు.

వ్యా—గుణంబును జెప్పునట్టి 'నల్ల, మొదలగు శబ్దంబులకు 'న' ప్రత్యయంబు వచ్చును. ఉ॥ నల్లన(నల్ల + న) ఇట్లే 'తెల్ల, పచ్చ ఎఱ్ఱ, చామ, తియ్య,కమ్మ, పుల్ల చప్ప, విన్న, తిన్న, అల్ల, ఒయ్య, తిమ్మ, చక్క, వ్రేక' ఇత్యాదులు గ్రహింప లెను. పక్షంబున నీపరిచ్ఛేదంబులోని రెండవసూత్రంబుచే విశేషసూత్రంబు సామాన్యసూత్రంబును వికల్పంబుగా బాధించును గాన బక్షంబున 'తన' వర్ణ కంబగు. సంధిపరిచ్ఛేదంబులోని ముప్పదియైదవసూత్రంబుచే నుగాగమంబు మొ దలగు కార్యంబులు కలిగి 'నల్లదనము, తెల్లదనము' మొదలగురూపంబులు పాక్షికం బులై యుండు.

7 సూ—ఇకవర్ణకంబగ్గలాదులకగు.

అగ్గలిక-ఒమ్మిక॥ అగ్గలము-ఒమ్ము.

వ్యా—'అగ్గలము' మొదలైన శబ్దంబులకు ఇకప్రత్యయంబువచ్చును ఉ. అగ్గ లిక. 'అగ్గలము + ఇక. ఇట్లుండవృత్తి (తద్ధిత) గావ విభక్తిలోపంబురాఁగా సంధి పరిచ్ఛేదంబులోని పదునొకండవసూత్రంబుచే నపదాదిస్వరనిత్యసంధికలిగి 'అగ్గలిక' అనురూపంబయ్యె 'ఒమ్మిక, ఒమ్ము + ఇక' ఇచ్చటి ముపర్ణము నామవాచకంబులో నిది. విభక్తిముపర్ణకంబుగాదు కావున లోపంబురాదు.

8 సూ—మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

మగఁటిమి - మగతనము - పేదఱికము - ఒజ్జనము-కోటరము-కోడంట్రము - కోడంట్రికము - కోడఱికము - కోమలికము - చెలికారము - తెలుపు - ఎఱుపు - పసుపు - నలుపు ॥ ఱికాదులు రానిపక్షమందుఁ దనప్రత్యయంబన్నింటికగు - చిన్నతనము - మ్రుచ్చుఁదనము - నల్లదనము - అగ్గలంపుఁదనము - ఒజ్జతనము.

వ్యా—'మగఁటిమి' మొదలైనశబ్దంబులు ప్రయోగంబులననుసరించి గ్రహింపఁదగ్గవి ఉ. మగఁటిమి ఇచ్చట 'మగ' శబ్దంబుపై 'టిమిక్' ప్రత్యయంబు, తత్సమపరిచ్ఛేదంబులోని పందొమ్మిదవసూత్రంబుచే నీప్రత్యయంబు బిందుపూర్వకంబగు. 'మగతనము' పక్షంబున 'తన' వర్ణకంబు 'పేదఱిమి' భావార్థంబునందు ఱిమిప్రత్యయంబు తే॥ గీ॥ తగునెయర్జున యీపందతనమునీకు । దండివై లెమ్ము మనసు పేదఱిమి విడిచి 'భార-భీష్మ- 1 ఆ. 'ఒజ్జనము' ఒజ్జశబ్దంబుపై 'న' ప్రత్యయంబు 'కోటరము' 'కోడలు' శబ్దంబుపై 'టర' ప్రత్యయంబు రాఁగా వృత్తియందు నాద్యక్షరశేషంబై కోటరమగు. 'కోడంట్రము' 'కోడలు' శబ్దంబుపై బిందుపూర్వకట్ర ప్రత్యయంబు రాఁగా వృత్తియందు నంత్యవర్ణలోపంబు 'కోడంట్రికము' 'కోడలు' శబ్దంబుపై బిందుపూర్వకట్రికప్రత్యయంబు రా వృత్తియందు నంత్యవర్ణలోపంబు 'కోడఱికము' 'కోడలు' శబ్దంబుపై ఱికప్రత్యయంబు రాఁగా వృత్తియందు నంత్యవర్ణలోపంబు. రూపాంతరంబు కోటఱికము. చ॥ 'పలుకు నెలంతియే యునిపజ్జలఁ గోటఱికంబు నేయునే! కలికనుంగుటూడి గపుగత్తియపింకు' రా. మా- 1 ఆ. కోటరము శబ్దంబువోలెనిదియు టకారఘటితంబునుగలదు. 'కోమలికము' (చక్కనతనము) కోమలిశబ్దంబుపై క ప్రత్యయంబు. అపదాదిస్వరసంధి. (చూ-సంధి-11 సూ) 'చెలికారము' చెలిశబ్దంబుపై భావార్థంబునందు 'కార' ప్రత్యయంబు. 'నయగారము' (మృదుత్వము) నుడికారము, (మాటచమత్కృతి) 'సొలగారము' ఇత్యాదులు పైదానివలె గ్రహింపవలె. 'తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు' అనునవి 'తెల్ల, ఎఱ్ఱ, పచ్చ, నల్ల' శబ్దంబులపై నైనరూపంబులు.

ఈశబ్దంబులయందు ద్విత్వలకారాదులకు లోపంబును, పూర్ణంబు పరంబగుచోం బ్రకృతికి నుకారంబును, ఇత్యాదికంబు బుద్ధిసూక్ష్మతచే నూహించునది. (మూలము) తికాదులు రానిపక్షమందుఁ తనప్రత్యయంబన్నింటికగు. వ్యా—తిక,మున్నగుప్రత్యయంబులు రానియప్పుడు తనప్రత్యయంబన్నింటికగు. ఇయ్యది యీపరిచ్ఛేదంబు లోని రెండవసూత్రంబుచే లబ్ధంబైనయది. ఉ. చిన్నతనము, ముచ్చుదనము, నల్లఁదనము, అగ్గలంపుఁదనము, ఒజ్జతనము. అగ్గలంపుఁ దనముఁ ఇచ్చట' అగ్గలిక శబ్దంబునందుఁబలె మువర్ణక లోపంబు తనప్రత్యయంబు పరంబగునపుడు రాదని యెఱుంగునది.

9 సూ—అరమరాదులకు స్వార్థంబునందికవర్ణకంబగు.

అరమరిక - ఆమిక ॥ అరమర - ఆము - అల్లిబిల్లి - గండి - నడవడి - నాడు - నివ్వాళి - పొత్తి - మాన - మెలి - వాలు - ఇత్యాదులరమరాదులు.

వ్యా—అరమర, మొదలైనశబ్దంబులకుఁ బ్రాతిపదికార్థంబునందు ఇక, వర్ణకంబుగలుగును. ఉ. అరమరిక (అరమర + ఇక) ఆమిక (ఆము + ఇక) అల్లిబిల్లిక (అల్లిబిల్లి + ఇక) ఇట్లే గండి, నడవడి, నాడు, నివ్వాళి, పొత్తి, మాన, మెలి, వాలు మున్నగునవి గ్రహించునది. అరమరశబ్దంబునకు అరమర' మనురూపాంతరంబును గలదు. ఉ. తామది నమ్మకున్నది విదర్భనరేంద్ర తనూజనిన్ను గు॥ తాముఁజవంబు నీయర మరంబున బోమనసీమనీకు' నై ష- 8 ఆ.

10 సూ—ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునందగు.

చిఱుతుక - నాతుక ॥ చిఱుత - నాతి - సెలఁత - మొలఁత - పడఁతి - మడఁతి - పొలఁతి - పెలఁది - నిప్పు - ఎమ్ము - ఇత్యాదులు చిఱుతాదులు.

వ్యా—చిఱుత, మొదలైనశబ్దంబులకు ప్రాతిపదికార్థంబున ఉక, ప్రత్యయంబువచ్చును. ఉ. చిఱుతుక (చిఱుత + ఉక) నాతుక (నాతి + ఉక) ఇట్లే నెలంత, మెలంత, పడంతి, మడంతి, పొలంతి, [illegible], నిప్పు, ఎమ్ము, [illegible] లైనవి గ్రహింపవది. ఉ॥కనుం! గోసల నిప్పుకల్ మెఱయఁ గ్రూరత నా[illegible] [illegible] వ్యా-యు-కాం.క॥ కురిసె [illegible] నిప్పుకలు కుప్పలుగ [illegible] [illegible] ము అనిప్పుకల్ చెవరఁ[illegible] గోఅల[illegible] రా. ద్వి॥ [illegible] నిప్పుకలతో [illegible] యారయవిరహులకగ్నియై నిగిడె, రంగ. తక్కుంగల ప్రయోగంబులు సులభము.

11 సూ—కాకత్తియవర్ణకంబు లుపుంస్త్వస్త్రీత్వంబులమతుబర్థంబునందాటాదులకగు.

కాప్రత్యయాంతంబునకు మగాదిగణాగణనంబునంజేసి డుజగు-ఆటకాండు - ఆటకత్తియ ॥ అట - అడపము - ఎమ్మె - ఓయారము-కటారి - కొల్ల - చెలిమి — చేరువ - చోరవ-జట్టి-జాజర-జూదము - తిండి - తేర - దొడ్డ - నీటు - నేస్తము-బేరము-వగ-విలు-వెచ్చము-సొగసు-ఇత్యాదులాటాదులు·

వ్యా—ఆట, మొదలైనశబ్దంబులకు కలవాండు, కలది, అనునర్థంబులందుఁ గ్రమంబుగాఁ బుల్లింగ స్త్రీలింగంబులందు కా, ప్రత్యయంబును, కత్తియ, ప్రత్యయంబునగు. (మూలము) కాప్రత్యయాంతంబునకు మగాదిగణాగణనంబునంజేసి డుజగు. వ్యా—కాప్రత్యయాంతంబు మగాదిగణంబులోఁ జదింపంబడినందున నాచ్ఛికపరిచ్ఛేదంబులోని నాలుగవసూత్రింబుచే డుక్ ప్రత్యయంబగు. ఉ. ఆటకాండు, ఆటకత్తియ, ఇట్లే అడపము, ఎమ్మె, ఓయారము, కటారి, కొల్ల, చెలిమి, చేరువ, చోరవ, జట్టి, జాగర, జూదము, తిండి, తేర, దొడ్డ, నీటు, నేస్తము, బేరము, వగ, విలు, వెచ్చము, సొగసు, ఇత్యాదులు గ్రహింపనది. అడపకాండు అడపకత్తియ. (అడపము + కాండు, కత్తియ) వృత్తియందు మున్నకలోపంబు. ఓయారకాండు

(ఓంకారము + కాఁడు) నేస్తకాఁడు (నేస్తము + కాఁడు) వెచ్చకాఁడు=విటుఁడు (వెచ్చము + కాఁడు), వీనికివృత్తియందు మువర్ణకలోపంబు. గీ॥ సురలయూఁకటికూడు ముద్దులకుఁగీడు। రిక్కలకు తేఁడు వెలుఁగుల యిక్కజోడు। లచ్చిసైదోడు రేపోటి వెచ్చకాఁడు చంద్రుఁడలరారె పక్కపొసంగుఁడపుడు' కవి- ౩ఆ. జూదకాఁడు (జూదము + కాఁడు) వృత్తియందు మువర్ణకలోపంబు. రూపాంతరంబు—జూజ కాఁడు. ఇట్లే జూజకత్తియ. క- కలసెదఁ బతిఁ నతఁడిచ్చట। మెలఁగుట మాతండ్రి విన్న మేలగు నేర్పే। వులలోన సురియద్రిప్పిన ।కలఁపనబింబైనఁ జెలిమికత్తెలునగరె, ఉ. హరి ౯ఆ.

12 సూ—కాకత్తియలకకారంబునకుగకారంబు కొండొకచోఁ గానంబడియెడి.

అందగాఁడు - అందగత్తియ - కొండెగాఁడు - కొండెగత్తియ- బేరగాఁడు- బేరగత్తియ ఇత్యాదులు.

వ్యా—కా-కత్తియప్రత్యయంబులయందలి కకారంబునకుఁ గొన్నిచోట్లుల గకారంబుగానంబడుచున్నయది. ఉ. అందగాఁడు, అందగత్తియ. (అందము + గాఁడు గత్తియ) వృత్తియందు మువర్ణకలోపంబును బ్రకృతిసూత్రంబునఁ బ్రత్యయకకారంబు నకు గకారంబునుగలిగె. ఇట్లే కొండెగాఁడు, కొండెగత్తియ. బేరగాఁడు బేరగత్తియ, మొదలైనవి యూహింపునది.

13 సూ—కాకత్తియలు కొండొకవానికిస్వార్థంబునంజూపట్టెడు.

చెలికాఁడు - చెలికత్తియ -. హెగ్గడికాఁడు - హెగ్గడికత్తియ.

వ్యా—కా-కత్తియ, ప్రత్యయంబులు కొన్నింటికిఁ బ్రాతిపదికార్థంబునందుఁ గనఁబడుచున్నవి. ఉ. చెలికాఁడు (చెలియనియర్థము) హెగ్గడికాఁడు, హెగ్గడిక త్తియ' ఈప్రత్యయంబులు ప్రాతిపదికార్థమందే యగును; కానఁ బహుంబున హెగ్గడి,

(అంతఃపురరక్షకభటుఁడు) శబ్దంబుకంటె స్వార్థంబునందు నీప్రత్యయంబును వక్ష్యమాణంబగు పదునాఱవసూత్రంబుచేఁ గలుగును. ఉ. హెగ్గడీఁడు. తే॥ ఆతఁడు తెచ్చిన రత్నభూషాంబరాదు । లందుకొన హెగ్గడీలతో నానతిమ్మ' సత్య-4 ఆ.

## 14 సూ—కావర్ణకంబుతిర్యక్కులకుంగానంబడియెడి.

ఇబ్బందిగాఁడు - ఒంటిగాఁడు - కొమ్ముకాఁడు - పరికాఁడు - ఇత్యాదులుమృగవిశేషవాచకంబులు.

వ్యా—కాప్రత్యయంబు పశుపక్షివాచకంబులకును గానంబడు. ఉ' ఇబ్బందిగాఁడు (పెద్దపులికిని చిఱుతపులికిని బుట్టినపులి) పండ్రెండవసూత్రంబుచేఁ బ్రత్యయకకారంబునకుగకారంబు. ఒంటిగాఁడు (పంది) ఈశబ్దంబునందుఁ బ్రత్యయకకారంబునకు గత్వంబు కవిప్రయోగంబులఁ గానంబడదు. సీ॥ అనురక్తిఁ జేయు నూతనసారసాటోపమొంటికాండ్రకుఁ బెంపులొసఁగు నెచట, హ. వి-2ఆ. ఇప్పద్యంబునందలి ఒంటికాఁడు శబ్దంబునకు హరిశ్చంద్ర కథాపక్షంబున బందియనియు, నలకథాపక్షంబున నేకాకియనియు నర్థము. కొమ్ముకాఁడు, (వరాహము) సీ॥ నరక హేతుహిరణ్యహరణవృత్తిఁ జరించు కొమ్ముకాని భజింపకొదవఁ జెల్ల. వసు-1ఆ. పరికాఁడు, (తెగకుముఖ్యమైనయేనుఁగు) చ॥ సంతి ముట్టినపరికాఁడు మొత్తము నడింబఱతెంచిన మాడ్కి-నాపగా! తనయుఁడులోన గారథికదంబముబిట్టడరెఁ సముద్ధతిన్, భార-భీష్మ-1ఆ. చ॥ అనిలజవంబునం బఱను నమ్మదనాగ మెదిర్చి క్రమ్మఱిం పెచినపరికాఁడువోలె, భార-ఆది-4ఆ. చ॥ పులియుఁడు బూదిగాఁడు సురపోతుల రాజును మంతిగాఁడు, మను-4ఆ. ఇయ్యవి శునకభేదంబులు. పక్షివాచకంబునకు నుదాహరణము. బట్టికాఁడు, (చిలుక, గోరువంక) సీ॥ గీ॥ చనును శుకసంజ్ఞ బట్టికాఁడనఁగ, ఆంధ్రభా-సింహా-వర్గ. సీ॥ అది శ్యేనసామాన్యమని కొందఱందురు తోనిగాఁడనఁగఁ బుంశ్యేనమొప్ప, ఆంధ్రభా-సింహావర్గ. వ॥ గిజిగాఁడు పూరేడు కేజ్జంబుపాన్నంగి వెన్నడాయి పరిగ బెళవరిస్స!

వెంగపండుగిపిలి నామనపాతుకాఁడును ల. కిక్రొటిగాఁడు, తూకటి కువ్వైపటాక క ఱ్ఱకరదు నీల్లచ్చిగాఁడును జల్లపిట్ట, ఆంధ్రభా. సింహవర్గు

15 సూ.— అటమటాదులకు మతుబర్థంబునం బీవర్ణకంబు పుంస్త్వం బునం దగు.

ఈప్రత్యయాంతంబు మగాదిగణంబు ॥ అటమటీఁడు - కమ్మతీఁడు అటమటము - కమ్మతము - కన్నడము - కొండెము - బొనసము - బూటకము - మందడి - మన్నెము - సుంకము - ఉక్కివంబునకు వలోపంబునగు ॥ ఉక్కీఁడు - ఇత్యాదులు.

వ్యా—'అటమట, మొదలైనశబ్దంబులకుఁ బుంలింగంబునందు 'కలవాఁడు' అనునర్థంబున 'ఈ' ప్రత్యయంబువచ్చును. (మూలము) ఈప్రత్యయాంతంబు మగాది గణంబు. వ్యా—ఈ. ప్రత్యయాంతంబు మగాదిగణంబులోనిది. ఉ. అటమటీఁడు 'అటమటము + ఈ' ఇట్టుండఁగ వృత్తి (తద్ధిత) గావున ముగ్వర్ణకంబునకు లోపంబుగలిగి 'అటమట + ఈ' అనియుండె. సంధిపరిచ్ఛేదంబులోని పదనోకొంతపనూత్రంబున సప దాదేస్వరనిత్యసంధిచే 'అటమటీ' అయ్యె. తద్ధితాంతంబు గావునఁ బ్రాతిపదికసంజ్ఞ గలదయ్యె. ఈప్రత్యయాంతంబు మగాదిగణంబులోనిది గావున నాచ్ఛికపరిచ్ఛేదంబు లోని నాగ్ధనసూత్రంబుచే డుజ్ వర్ణకంబుగలిగి 'అటమటీఁడు (మోసకాఁడు)' అయ్యె ను. 'అటమటము' శబ్దంబునకు 'అటమటి' అనియును రూపంబుగలదు. చ॥ 'అటమటఁ జెందె దేల' రసి-5 ఆ. కమ్మతీఁడు = కృషీవలుఁడు (కమ్మతము + ఈ + ఁడు) ఇట్లే కన్నడము, కొండెము, బొనసము, బూటకము, మందడి, మన్నెము, సుంకము, ఇత్యా దులందుఁ బైనిఁజెప్పిన ప్రక్రియయూహింపనగు. (మూలము) ఉక్కివంబునకు వలో పంబునగు. వ్యా—'ఉక్కివము' అను శబ్దంబునకు వకారలోపంబును అనఁగా నీప్ర త్యయంబుతో సముచ్చయింబుగా వకారలోపంబుగలుగును. ఉ. ఉక్కీఁడు. 'ఉక్కి వము + ఈ' వృత్తి కావున ముగ్వర్ణకలోపంబును, బకృతవాక్యంబుచే వకారలోపం

బును గాఁగాఁ;ఉక్కి + ఈ' అను యపదాదిస్వర నిత్యసంధిచే 'ఉక్కీ' ఆయెను. ఈప్రత్యయాంతంబు మగాదిగణంబుగావున డుజ్ వర్ణకంబుగల్గి 'ఉక్కీఁడు' అయ్యెను. రూపాంతరంబు 'ఉక్కివుఁడు' అనియుఁ గలదు. ప్రత్యయభేదంబులచేఁ ద్విరూపంబులలోఁ గొంచెమర్థభేదంబునుగలదు. ఉక్కివుఁడు = కపటముగలవాఁడు. ఉక్కీఁడు = మూర్ఖుఁడు. ఉ॥ 'ఉక్కీలయి నేర్పులేక తమకించి పయింబడినొమ్ము వారు' నిర్వ-3ఆ. ఉ॥ ఉక్కివుఁడై నీకొడుకు నల్లమునిన్నిటు లాడఁగూడునే 'భార- ఉద్యో-2 ఆ. ఉ॥ ఉక్కివులెందునుం గలరె యెప్పరువోఁ ధృతరాష్ట్రనందనుల్' భార- ఉద్యో-4ఆ.

16 సూ—ఈప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునందగు.

మొక్కలీఁడు - కల్లరీఁడు

వ్యా—'ఈ, ప్రత్యయంబు కొన్నిశబ్దంబులకుఁ బ్రాతిపదికార్థంబునందువచ్చును. ఉ. మొక్కలీఁడు. 'మొక్కలి' అను ప్రాతిపదికార్థంబుకంటె స్వార్థంబునందు 'ఈ, ప్రత్యయంబుగల్గి యపదాదిస్వరనిత్యసంధియు, డుజ్ వర్ణకంబును, గలిగి, 'మొక్కలీఁడు, అయ్యె. 'మొక్కలి (శూరుఁడు), అనియే యర్థము. ఇట్లే కల్లరీఁడు. (అసత్యవచనుఁడు) కల్లరికాఁడనియు రూపంబుగలదు.

17 సూ—అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు.

జాలరి - ఒఱపరి॥ జాల - ఒఱపు - నల్ల - చదువు-జూదము-టక్కు - తెగవు - తీరుపు - తెంపు - తెరువు - నెరుపు - మతకము-వెరపు - వేఁట - సిగ్గు - సుంకము - ఇత్యాదులు.

వ్యా—'అరి, ప్రత్యయంబు 'కలవాఁడు, కలది, అనునర్థంబున 'జాల, మొదలగుశబ్దంబులకుఁ గలుగును. ఉ. జాలరి, వలగలవాఁడని యర్థము. అనఁగాఁ బల్లెవాఁడని భావము. జాలకాఁడనియు రూపంబుగలదు. 'ఒఱపరి (ఒఱవు + అరి) సౌందర్యవం

తుఁడు. ఇట్లే కల్ల, చదువు, జూదము, టక్కు, తగవు, తీరుపు, తెంపు, తెరువు, నేరుపు, మతకము, వెరవు, వేఁట, సిగ్గు, సుంకము ఇత్యాదులందు గ్రహింపవలెను. జూదము, మతకము, సుంకము, ఈశబ్దంబులపై నరిపర్ణకంబు ప్రయోగించినప్పుడు వృత్తి మూలకమైనమువర్ణకలోపంబుగలిగి యపదాదిస్వరనిత్యసంధిచే ఁజూదరి, మతకరి, (మాయావి) సుంకరి (సుంకముతీయునతఁడు), ఇట్లు రూపంబులేర్పడు. అప్పకవి సీ॥ ఇద్దఱు పడఁబుచుఁ బెద్దతికంబున గద్దరి యద్దిఅక్కట్టైదుఁ గును, అని అకారసీసమాలికలో గద్దరి, శబ్దంబు శకటరేఫయుక్తంబనినచించెను. ఁగద్దె (ఉన్నతపీఠము + అరి,) ఇట్లుండ నప దాదిస్వరనిత్యసంధిచే ఁగద్దరి, అయినదనియు, ఉన్నతపీఠము గలాఁడని వాచ్యార్థంబై నను దిట్టతనముగలవాఁడని లాక్షణికార్థంబునందు నియ్యది క్రమంబుగాఁ బ్రయోగింపఁబడుచున్నదనియు, కొందఱలాక్షణికులమతంబు. ఁగద్దరికాఁడు, అనియు రూపంబు గలదు. ఁకా, ప్రత్యయంబు స్వార్థంబునందయ్యెడిని.

18 సూ—ఇవర్ణకంబోయారాదులకు మతుబర్థంబునందగు.

ఓయారి - అక్కసి। ఓయారము - అక్కసము - కడలు - చాగము - జోగము - తమకము - తుటారము - బండారము - బిత్తరము - బిటారము - బేహారము - మచ్చరము - మిటారము - విన్నాణము - వెక్కసము — ఇత్యాదులు.

వ్యా—ఁఓయారము, మొదలైనవానికి ఁకలవాఁడు కలది, అనునర్థంబునందు ఁఇ, ప్రత్యయంబువచ్చును ఉ. ఓయారి. (ఓయారము + ఇ) వృత్తిగావున మువర్ణకలోపంబు. 'అక్కసి (అక్కసము + ఇ)' మువర్ణకలోపంబు. ఇట్లే, ఁకడలు (కడలి) చాగము, జోగము, తమకము, తుటారము, బండారము, బిత్తరము, బిటారము, బేహారము, మచ్చరము, మిటారము, విన్నాణముఁ వెక్కసము, ఇత్యాదులందూహించునది.

19 సూ—తవర్ణకంబు కులవాచకంబునకుస్త్రీవాచ్యం బగు

నపుడు మతుబర్థంబునందగు.

కోంజవత - చాకిత ॥ కోంజవ - చాకి - బోయ - వాని - వ్రేి-సాలె - ఇత్యాదులు కులవాచకంబులు.

వ్యా—'త' ప్రత్యయంబులను విశేషణంబును జేయుశబ్దంబునకు స్త్రీవాచ్యంబగునప్పుడు 'కలది' అనునర్థంబునందు వచ్చును. ఉ. కోంజవత. 'కోంజవ' అనఁగా నొకానొకహీనజాతి. అట్టిజాతిగలది యనునర్థంబునందు 'కోంజవత' (కోంజవది), అగును. 'చాకిత = రజకస్త్రీ (చాకి + త) ఇట్లే 'బోయ, వాని, వ్రే, సాలె, కుమ్మరి, గొల్ల, మాల, ఇత్యాదికులవాచకంబులందు గ్రహింపునది.

20 సూ—తవర్ణకంబుపరంబగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడి.

చెంచెత - మాలెత

వ్యా—'త' ప్రత్యయంబు పరంబగునపుడు కొన్నిచోటులఁ బ్రాతిపదికంబు తుద 'ఎ' కారంబు గానంబడు. ఉ. చెంచెత (చెంచు + ఎ + త) చెంచుజాతిస్త్రీ. ఇట్లే మాలెత. (చండాలస్త్రీ) చెంచితయను రూపంబును గొందఱమతంబునఁగలదు. క॥ చెంచితలం బింఛపత్రచేలాంచితలన్ 'భాగ-స్కం-10-పూ. సీ॥ చెంచునింటికి బోయి చెంచెతకుఁ బ్రియంబు, కాశీ-5 ఆ. క॥ తోరియక విప్రుఁడు మాలెతఁ। గాయజ సుఖకేళిఁ గలిసి కష్టాత్ముఁడగన్ । బ్రాయశ్చిత్తము సేయక । పోయినఁ జండాలజాతిఁ బొందు నిజముగన్ 'విజ్ఞా-ప్రా-కాం.

21 సూ—యువతి విటీరజస్వలలు గుబ్బెతమిండత ముట్టుతలు నాఁబడుచుండు. స్పష్టము

వ్యా— తెలుఁగునందు 'యువతి' శబ్దంబునకు 'గుబ్బెత' (యౌవనవతి), అనియు

'విటి' శబ్దంబునకు 'ఖిండత (విటురాలు)' అనియు, 'రజస్వలా' శబ్దంబునకు 'ముట్టుత (రజస్వలాస్త్రీ)' అనియుఁ బ్రయోగంబులు.

22 సూ—వగాదులకుబహువచనాంతంబులకుస్త్రీవాచ్యంబగున పుమమత్వర్థంబునందాఁడివర్ణకంబగు.

వగలాఁడి ॥ వగ - చిన్నె - కులుకు - వన్నె - దొమ్మి - ఎమ్మె ఇత్యాదులువగాదులు.

వ్యా—బహువచనాంతంబులగు 'వగ' మొదలైనశబ్దంబులకు స్త్రీయర్థమైనపుదు 'కలది' అనునర్థంబున 'ఆఁడి' వర్ణకంబువచ్చును. ఉ. వగలాఁడి (వగలు + ఆఁడి) వగలుగలయాఁడుది యనియర్థము. ఇట్లే చిన్నె, కులుకు, వన్నె, దొమ్మి, ఎమ్మె, ఇత్యాదులం దూహించునది.

23 సూ—వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థంబా కారంబగు.

ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు ॥ వగలాఁడు - చిన్నెలాఁడు.

వ్యా—బహువచనాంతంబులగు 'వగ' మొదలైనశబ్దంబులకుఁ బుంలింగంబునందు 'కలవాఁడు' అను నర్థంబున 'ఆ' కారప్రత్యయంబువచ్చును. (సూ) ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు. వ్యా—'ఆ' ప్రత్యయాంతంబు మగాదిగణంబులోనిది కావున డుజ్వర్ణకంబు. ఉ. వగలాఁడు(వగలు + ఆ + డు)వగలుగలవాఁడని యర్థము. ఇట్లే 'చిన్నెలాఁడు' శబ్దంబూహించునది.

24 సూ—ముక్కులోనగువానికిం దద్భావద్యోతకంబులుగు మతుబర్థంబునందిఁసివర్ణకంబగు.

ముక్కిఁడి-ముక్కు లేనివాఁడని యర్థము।ముక్కు-వాలు-వెరవు-సిగ్గు-ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.

వ్యా—'ముక్కు మొదలైనశబ్దంబులకు ముక్కు మొదలైనవానిలేమిని సూచించునదియయి 'లేమికలవాఁడు, లేమికలది' అనునర్థంబున 'ఇఁడి' ప్రత్యయంబువచ్చును. ఉ. ముక్కిఁడి (ముక్కు + ఇఁడి) ముక్కులేమికలవాఁడనియర్థము. ఇట్లే వాలు, వెరవు, సిగ్గు' ఇత్యాదులు కవిప్రయోగంబులవలన గ్రహింపవలెను.

25 సూ—మానార్థంబున కేకత్వంబునం దేఁడువర్ణకంబగు.

తూమెఁడు - ముంతెఁడు - ఎత్తెఁడు - వీసెఁడు - జేనెఁడు - మూరెఁడు - కుండెఁడు - గంపెఁడు.

వ్యా—పరిమాణార్థకశబ్దంబులకు నేకవచనంబున 'ఎఁడు' ప్రత్యయంబు వచ్చును. ఉ. తూమెఁడు(తూము + ఎఁడు) ఒకతూము పరిమాణంబుగలదని యర్థము. ఇట్లే ముంతెఁడు ఏత్తెఁడు వీసెడు, జేనెఁడు, మూరెఁడు, కుండెఁడు, గంపెఁడు, అడుగెఁడు' ఇత్యాదులందు నేకపదార్థపరిమాణంబు గ్రహించునది. క॥ నీనుడువులకే నడుగెం। డైనను దాఁటనని సత్యమాడెను, రుక్మాం-లఆ.

26 సూ—ఎఁడువర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబులోపించు.

కమికెఁడు - కొడిదెఁడు - దోసెఁడు - పిడికెఁడు - పుడిసెఁడు - సందెఁడు.

వ్యా—'ఎఁడు' ప్రత్యయంబు పరంబగునపుడు 'లి' వర్ణంబులోపించును. ఉ. కమికెఁడు [కమికిలి (వంపఁబడిన వ్రేళ్లుగలపుడిసిలి) + ఎఁడు] ఇచ్చటఁ బ్రకృతసూత్రంబున లివర్ణలోపంబును, అపదాదిస్వరనిత్యసంధియుఁ గలుగ 'కమికెఁడు' అయ్యె. ఇట్లే 'కొడిదెఁడు, (కొడిదిలి + ఎఁడు దోసెఁడు (దోసిలి) పిడికెఁడు (పిడికిలి) పుడి

సీఁడు (పుడిసిలి) సందేఁడు (సందిలి,) ఇత్యాదులూహించునది 'దాలి, శబ్దంబునకు. ఏఁడు, వర్ణకంబుపరంగునపుడు లివర్ణలోపంబులేదు. ఉ. దాలేఁడు. (దాలి + ఏఁడు)

27 సూ.—దఘ్నార్థంబునబంటికోలఁదులగు.

మోఁకాలిబంటి - మోఁకాలికోలఁది ॥ ఆొమ్ముబంటి - ఆొమ్ము కోలఁది,

వ్యా—దఘ్నార్థము=దఘ్నప్రత్యయార్థంబు. సంస్కృతవ్యాకరణంబున 'ప్రమాణేద్వయసచ్ దఘ్నఞ్మాత్రచః' అను సూత్రంబునఁ బ్రమాణార్థంబునందు దఘ్నప్రత్యయము విధింపంబడియె. కనుకఁ బ్రమాణార్థంబునందు 'బంటి, కోలఁది, అనునవియగును. ఉ. మోకాలిబంటి, మోకాలికోలఁది. (మోకాలిచిప్పయొక్క ప్రమాణంబు గలయది) వృత్తియందు నాపవిభక్తికమైన 'ఇ,కారంబుగల్గి 'మోకాలి,అయ్యెను. (జానుదఘ్నము) ఇట్లే 'ఆొమ్ముబంటి, ఆొమ్ముకోలఁది. ఇత్యాదులందూహించునది దఘ్నార్థమందుఁ దత్సమపదంబులమీఁద సైతము 'బంటి, ప్రత్యయంబుగానంబడియె డిని సీ॥ కటిబంటినెత్తురు కాలువల్ వలువలు దడియ నేడ్చుచుఁ జొచ్చి దాఁటిదాఁటి, రామా-8-ఆ. మఱియు మయట్ప్రత్యయంబు తత్సమపదంబులమీఁదఁ గాక తెలుఁగుపదంబులమీఁదను బ్రాచుర్యార్థంబునఁ (అధిక్యంబున) గానంబడుచున్నది. ఆ–గీ॥ సమదవృత్తిఁ గేరిసలిపెఁ జకోరచయంబుచదలు దమముయంబుగాఁగ, నిర్వ-6 ఆ. తే॥ ప్రథనభూమి । మెదడుప్రోవులమయమయ్యె మిక్కటముగ, హరి-ఉ. 10 ఆ.

28 సూ.—అర్థవిశేషంబులవర్ణకాంతరంబులును మహాత్ప్రయోగంబుల నెఱుంగునది.

మంటమారి - తిండిపోతు - తాచ్ఛీల్యంబున మారిపోతువర్ణకంబులు ॥ అడప - తాంబూలకరండవాహి - మతుబర్థంబునందప్రత్యయంబు ॥

పెండ్లము - ఊఢ - పెండ్లికత్తె కు మతుబర్థంబునందము ప్రత్యయంబు ॥ ఇత్యాదులూహ్యంబులు,

వ్యా—అర్థవిశేషంబులయందు (భిన్నార్థంబులయందు) నితరమైన ప్రత్యయంబులును, మహాకవి ప్రయోగంబులయందుఁ జూచికొనునది. ఉ. మంటమారి, కొంతిపోతు (మూ) తాచ్ఛీల్యంబున మారిపోతు వర్ణకంబులు. వ్యా—స్వభావంబున 'మారి, పోతు, ప్రత్యయంబులుగలుగును. సీ॥ మంటమారులుగాని మహనీయబాడబుల ప్రదాతలుగానియట్టి ఘనులు' పట్బ-1 ఆ. తే॥ గీ॥ అనుమునవపంటి పెనుపంట నాడరాని గంటసములాడిమఱియు నమ్మంటమారి, వసు-4ఆ. ఇచ్చట 'మారి, వర్ణకంబు స్వభావంబును దెలుపు చున్నయది. (మూ) 'అడప-తాంబూలకరండవాహి, మతుబర్థంబునంద ప్రత్యయంబు. వ్యా—'అడప (అడపము + అ) తాంబూలపుబరణిగలది అనఁగాఁ దాంబూలపుబరణిని వహించునది. 'అడప, అనుశబ్దంబునకు 'తాంబూలకరండవాహి అనియర్థంబు వ్రాయుట యయుక్తమువియు, 'అడప, శబ్దంబు అడపముందుకొని యుండు పదంతి, యేయర్థంబుగాన 'తాంబులకరండవాహిని, అని సూరిగారు స్త్రీలింగంబుగాఁ బ్రయోగింపవలయును గాని వాహియనుట యుక్తంబు గావనియుఁ గొందఱందురు 'తాంబూలకరండవాహి, అనునది స్త్రీలింగంబునునను. సంస్కృతవ్యాకరణంబులో 'కర్మణ్యణ్, అనుసూత్రంబు చే ద్వితీయాంతం బుపపదంబగుచుండ ధాతువుకంటె 'అణ్, ప్రత్యయంబు విధింపబడి 'కుంభకారః (కుంభంకరోతీతి కుంభకారః), అయినట్టులె 'తాంబూలకరండంవహతీతి తాంబూలకరండవాహః, అని యణ్ ప్రత్యయాంతంబు పుల్లింగరూపంబగును. 'టిడ్ఢాణఞ్, అనుసూత్రంబున ఙీప్ప్రత్యయంబువచ్చి 'కుంభకార శబ్దస్త్రీలింగంబు 'కుంభకారీ, అయినట్టులు, తాంబూలకరండవాహ, శబ్దస్త్రీలింగంబు 'తాంబూలకరండవాహీ, అగును. కాఁబట్టి 'అడప, శబ్దంబు స్త్రీలింగంబనియే యూహింపునది. పుల్లింగము 'అడపకాఁడు, అడపశబ్దంబు పుల్లింగంబులోఁగూడ నున్నటులు ప్రయోగంబు కానిపింపదు. స్త్రీలింగంబుగాను

ఉన్నందులకు లక్ష్యంబుగలదు చ॥ కలికివరాట రాజడప్పకపరవీడెము వెట్టెవంచనన్ | నలునడపంబు వాసిక్కి ఫణాగ్రవల్లి దళాంతరంబునన్ | బగితపుఁ దేలు మైనమునఁబన్ని' నైష - 7 ఆ. (మూ) పెండ్లము - ఊఢ ; పెండ్లిశబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు. ఇత్యాదులూహ్యంబులు. వ్యా — పెండ్లము = ఊఢ (వివాహముచేసి కొన్న భార్య) 'పెండ్లికలది' అనువర్థంబునందు 'పెండ్లి + అ' ఇట్లుండ నపదాదిస్వర నిత్యసంధిగలిగి లోకవ్యవహారంబునఁ గ్లీబత్వమూలక మువర్ణకంబుచే 'పెండ్లము' అయ్యెను. సంస్కృతభాషలో 'కళత్రి' శబ్దంబువలెనే తెలుంగులో నీశబ్దంబు భాషా శైలింజేసి నపుంసకలింగంబయ్యె. గ్రంథకర్త మూలంబునందు 'అము' ప్రత్యయమని మువర్ణకంబుగూడఁ దద్ధితప్రత్యయంబు లోనిదియనుట యవిచారితరమణీయంబు. 'ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి' ప్రౌఢవ్యా. క॥ అనిలజనీకిట్లు-నిప ! ల్కను జనుసే తలఁప తేడికడుపునఁ బులి పుట్టునె యిట్టిదివ్య తేజం | బున వాఁడఘమాన్వయమునఁ బుట్టునె | చెపుమా' భార-ఆది-6 ఆ. (తేజంబున వాఁడు=తేజముగలవాఁడు.)

ఇది తద్ధితపరిచ్ఛేదము.

---

# క్రియాపరిచ్ఛేదము.



క్రియలను జెప్పునట్టిభాగము క్రియాపరిచ్ఛేదంబు.

1 సూ — ధాతువునకు.

ఇదియధికారసూత్రంబు - ఇంక నెయ్యది యుపక్రమింపంబడునయ్యది ధాతువునకగుననియెఱుంగునది.

లైనవి) 3 సంఖ్యయు (ఏకవచనము, బహువచనము) 4 కాలము (వర్తమానము, భూతము, భవిష్యత్తు, తదర్థము) 5 కారకము (కర్తృకారకము మొదలైనవి) స్వకర్మోర వాత్మనే పదనిమిత్తే యనుసూత్రస్థంబగు భాష్యంబునఁ గర్తృకర్మాదులు ధాత్వర్థములని విశదపఱుపఁ బడినవి, ఇయ్యవి ధాతువునకే యర్థంబులు. ఈయర్థంబులను ధాతువులమీఁది లడాదిప్రత్యయంబులు సహాయంబులై ప్రకాశింపఁజేయునని (ద్యోతకములు) వైయాకరణుల సిద్ధాంతము. నేత్రేంద్రియంబునకు గోచరింపనివస్తువులరూపంబు ప్రకటింపఁజేయుటలో 'సూక్ష్మదర్శిని' యనెడి దర్పణవిశేషము (మైక్రాస్కోప్) సాధనమైనయట్లులు పైనిం జెప్పినధాత్వర్థపంచకంబును స్ఫుటీకరించుటలో లడాదిప్రత్యయంబులు సాధనంబులు కానఁ బ్రకృతంబున వర్తమానకాలంబు ధాత్వర్థంబులోనే యంతర్భూతమైనది. దానంజేసియే వర్తమానకాలికపదార్థంబునందలి క్రియను దెలియఁ జేయు ధాతువునకు లడ్ప్రత్యయంబగునని తెలిసికొనవలయును. కాని లడ్ప్రత్యయంబునకు వర్తమానకాలంబు వాచ్యార్థము కాదు. వర్తమానంబనఁగాఁ బ్రారంభింపంబడి పరిసమాప్తి నొందనిదియని యర్థంబు. ఉ. ఘటంబున్నది. ఇచట వాక్యంబుప్రయోగించుకాలంబున ఘటంబుండునట్లు తెలియుచున్నది కావున వర్తమానకాలంబు.

3 సూ—భూతంబునలిట్టగు.

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు ॥ భూతంబునా విద్యమానధ్వంస ప్రతియోగి - ముందుండి యప్పటికి లేకుండునది.

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు. భూతంబునా విద్యమాన ధ్వంసప్రతియోగి.—ముందుండి యప్పటికి లేకుండునది.

వ్యా—భూతకాలంబునందు లిడ్వర్ణకంబుగలుగును, అనఁగా భూతకాలికంబైన వస్తువుయొక్క క్రియను దెలియఁజేయుధాతువునకు 'లిట్' ప్రత్యయంబువచ్చును. భూతకాలంబనఁగా వాక్యంబు ప్రయోగించుకాలంబునకుండిన నాశనంబునకు విరోధియైనది. ఉ. ఘటంబుండెను. ఇచ్చట వాక్యంబు ప్రయోగించుకాలంబునకుఁ బూర్వంబునందు ఘటంబుండినట్లు తెలియుచున్నది. కాన వర్తమానకాలంబునందు

దానిధ్వంసంబు (నాశనము) ఉండుచున్నట్లు తెలియుచున్నది. అట్టిధ్వంసంబునకు విరోధి యీయవధిలో గతించిన ఘటంబగును. అనఁగా ఘటంబుండిన భూతకాలంబులో దాని నాశనంబుండలేదు, కావున నాశనంబునకు ఘటంబు విరోధియయ్యెను. 'రావణుండు గతించెను' అనువాక్యంబులోఁ బ్రకృతకాలంబున రావణుని నాశనము స్ఫురించుచున్నది. రావణుండుండినకాలంబులో వానితోఁ గూడ వానియభావంబుండుట యసంభవంబు కావున వర్తమానకాలంబునందలి వాని యభావంబునకు రావణుండు విరోధియయ్యెను. కాన నిట్టిది భూతకాలంబనంబడును.

4 సూ—భావిని లృట్టగు

భావిక్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకంబగు ॥ భావినా విద్యమానప్రాగ భావప్రతియోగి - అప్పటికిఁ బుట్టకుండునది॥

భావిక్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణకంబగు. భావినావిద్యమానప్రాగ భావప్రతియోగి—అప్పటికిఁ బుట్టకుండునది.

వ్యా—కాఁబోవునట్టి వస్తువుయొక్క క్రియయగుచుండునట్టి(క్రియనుబోధించు) ధాతువునకు లృట్ప్రత్యయంబు గలుగును. వస్తూత్పత్తికిముందుండుచున్న యభావంబు ప్రాగభావమనంబడు. అట్టిప్రాగభావంబునకుఁ బ్రతియోగి (విరోధి)ఁడు. ఘటముకాఁగలదు. ఇచ్చట ముందుజనింపఁగలిగినఘటంబుయొక్క యభావంబిప్పటి వాక్యప్రయోగకాలంబునందుండుచున్నట్లు స్ఫురించుచున్నది. ఘటముపుట్టుటతోడనే ఘటోత్పత్తికి ముందున్న యభావము (ప్రాగభావము) నశించును. ప్రాగభావనాశనంబునకు భావిఘటంబు విరోధి. అట్టి విరోధియే ప్రతియోగియనంబడు.

5 సూ—తద్ధర్మాదులందులాట్టగు.

తద్ధర్మాదిక్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు ॥ తచ్ఛీలసంభావనా సంప్రశ్న సాతత్యవర్తమాన భావ్యాశీరాదు లాదిపదగ్రాహ్యంబులు,

తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు. తచ్ఛీల సంభావనా సంప్రశ్నపాతత్య వర్తమాన భావ్యాశీరాదులాది పదగ్రాహ్యంబులు.

వ్యా—సః ధర్మః యస్యసః తద్ధర్మః=అది (ఒకానొకటి) ధర్మంబైనవస్తువు. ఆయట్టివస్తువు మొదలైనవానియందలి క్రియను దెలియఁజేయునట్టి ధాతువునకు లాట్ప్రత్యయంబగు, ఉ. పుష్పము పరిమళించును. పుష్పంబునకుఁ బరిమళంబు ధర్మంబు. ఇట 'పరిమళించును' అను క్రియ పుష్పమునకు స్వాభావికధర్మంబైనయట్లు దోఁచుచున్నదిగావునఁ దద్ధర్మక్రియయని గ్రహింపఁబడెను తచ్ఛీల (ఒకానొక ధర్మముస్వభావము గాఁ గలిగినవస్తువు) సంభావన (ఊహ) సంప్రశ్నము (పృచ్ఛచేయుట=అడుగుట) పాతత్యము (ఎల్లయప్పుడుండుట) వర్తమానము (వాక్యప్రయోగకాలమందుండునట్టిది) భావి (వాక్యప్రయోగకాలంబునకుఁ దరువాత రాఁబోవునది) ఆశీస్సు (దీవన) మొదలైనవి సూత్రంబులోని 'తద్ధర్మాది' శబ్దంబునందలి 'ఆది' శబ్దంబుచే సంగ్రహింపఁబడినవి.

6 సూ—ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టు.

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

వ్యా—ఆశీరర్థము (దీవన) శాపము (తిట్టు) సంప్రార్థన (వేఁడుట) విధి (ప్రేరణము=భృత్యుఁడు మొదలైనవానిని బ్రవర్తింపఁజేయుట) ఈయర్థంబులయందు లూట్ప్రత్యయంబు గలుగును.

7 సూ—వ్యతిరేకంబున లజియగు.

వ్యతిరేక విశిష్టక్రియావృత్తియగు ధాతువునకు లజివర్ణకంబగు.

వ్యతిరేకవిశిష్టక్రియావృత్తి యగుధాతువునకు లజివర్ణకంబగు.

వ్యా — వ్యతిరేకంబుతోఁ గూడినపదార్థంబులయొక్క క్రియను దెలియఁజేయునట్టి ధాతువునకు 'లడ్' ప్రత్యయంబువచ్చును. ఉ. దేవదత్తుఁడు పఠింపఁడు. ఇచట పఠించుటయన్నవ్యతిరేకము పఠింపమి. దానితోఁ గూడినవాఁడు దేవదత్తుఁడు. వానిక్రియ ప్రకృతవాక్యంబునందుఁ బఠింపమిగదా. దానిని దెలుపుచున్న ధాతువు 'పఠింపఁడు' అనునది. కాన లక్ష్యసమన్వయంబు.

8 సూ — లకారంబునకుడుమ్వురునుముఝ్‌లగు.

లడాదిలకారంబులం దొక్కొక్కటికి డుమాదులాదేశంబులగు ॥ ఇందు ఝకారంబు ప్రత్యాహారార్థంబు.

లడాదిలకారంబులందొక్కొక్కటికి డుమాదులాదేశంబులగు ఇందు ఝకారంబు ప్రత్యాహారార్థంబు.

వ్యా — లకారంబునకు లడ్వర్ణకంబు మొదలుకొని లూడ్వర్ణకంబు వఱకునుండు ప్రత్యయంబులని యర్థము. 'లట్టు, లిట్టు, లృట్టు, లాట్టు, లూట్టు', వీనియన్నింటియందును లకారంబు సామాన్యంబు గాన లకారంబనుటచే లడాదిప్రత్యయంబులన్నియు నర్థంబగును. అట్టిప్రత్యయంబులకు 'డుమ్' మొదలైనవి యాదేశంబులగును. లట్ప్రత్యయము ప్రథమపురుషంబునందు ఏకవచనార్థమునందు 'డుమ్' బహువచనమందు 'రు' అగును. లట్ప్రత్యయంబుయొక్క మధ్యమపురుషంబున నేకవచనార్థంబునందు 'వు' బహువచనమందు 'రు' అగును. లడ్వర్ణకంబుయొక్క యుత్తమపురుషంబున నేకవచనార్థంబునందు 'ను' బహువచనంబునందు 'ము' అగును. 'ముఝ్' అని యుచ్చరించుట ఝకారంబు ప్రత్యాహారార్థంబని గ్రహింపవలెను. ప్రత్యాహారార్థంబనఁగా 'డుమ్' మొదలైనప్రత్యయంబులలో దేనికైన ఝకారంబుతోఁ జేర్చి పలుకగానైన రూపంబు. 'డుమ్' ప్రత్యయంబులోని డువర్ణంబును 'ముఝ్' లోనిఝకారంబుతోఁ జేర్చిపలుకఁగా 'డుఝ్' అగును. దీనికే ప్రత్యాహారంబని పేరు. ఇట్లు చేర్చినందువలన లాభం బేమన డుమ్ మొదలుకొని ముఝ్ వఱకును నుండు ప్రత్యయంబులు, అనఁగా 'డుమ్, రు, వు, రు, ను, ము' అనిన షడ్విధప్రత్యయంబు లన్నియు, సంగ్రహింపంబడును.

9 సూ—అందువరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబులనం బడు.

డుజ్ - రు - ప్రథమము ॥ వు - రు - మధ్యమము ॥ ను - ము - ఉత్తమము.

డుజ్—రు; ప్రథమము. వు రు; మధ్యమము-ను- ము; ఉత్తమము.

వ్యా—స్పష్టము.

10 సూ—వానిలోరుములుబహువచనంబులు పెఱలేకవచనం బులు.

వ్యా—పైయాఱింటిలో 'రు, ము, ప్రత్యయంబులు సర్వదాబహువచనంబులే తక్కుంగల 'డు, వు, ను' ప్రత్యయంబులు సదాయేకవచనంబులు.

11 సూ—నామయుష్మదస్మదర్థములందుంబ్రథమమధ్యమోత్తమంబులగు.

వ్యా—యుష్మదస్మచ్ఛబ్దార్థంబులుగాక తక్కిన నామార్థము కర్తయైనప్పుడు ప్రథమపురుషంబును, యుష్మదర్థంబునందు మధ్యమపురుషంబును, అస్మదర్థంబునందు నుత్తమపురుషంబును నగును.

12 సూ—అమహదర్థంబునందు డుజ్జుబకుదువ్రాగునువ్వానుబంధంబుమీఁదదివియగు.

వ్యా—అమహదర్థంబునందు డుజ్జు 'నకు, దు, వర్ణకంబును 'రు' వర్ణకంబునకు వు' వర్ణకంబునునగు. 'ఉన్న' అనెడి సహాయక్రియపైని 'డుజ్జు' నకును 'రు' వర్ణకంబునకును గ్రమంబుగా 'ది-వి' అనునవి యాదేశంబులగు. దువులకుదాహరణంబులు

అంపపింపుగలదు. అంపపింపులుగలవు. ఉన్నానుబంధంబునకు దాహరణంబు. మేఘము వర్షింపుచున్నది. మేఘములు వర్షింపుచున్నవి.

13 సూ—ఉదంతంబునకు లట్టుపరంబగునపుడున్నానుబంధంబగు.

ఉదంతంబయినధాతువునకు లట్టుపరంబగునపుడు - ఉన్న - అనుశబ్దంబనుప్రయుక్తంబగు.

ఉదంతంబైన ధాతువునకు లట్టుపరంబగునపుడు 'ఉన్న'. అనుశబ్దంబనుప్రయుక్తంబగు.

వ్యా—ఉకారంబంతంబునందుఁ గల ధాతువునకు లట్టుపరంబగునపుడు 'ఉన్న' అనునది. ముఖ్యధాతువు ననుసరించి కూర్పంబడు.

14 సూ—ఉన్నశబ్దంబుపరంబగునపుడు చువర్ణకంబగు.

వ్యా—'ఉన్న' శబ్దంబు పరంబగునపుడు 'చు' ప్రత్యయంబు వచ్చును.

15 సూ—దపీతరంబగుపుష్షు పరంబగునపు డున్నానుబంధంబు నకుదీర్ఘంబగు.

ప్రథమము - వాఁడువండుచున్నాఁడు - వారువండుచున్నారు- అదివండుచున్నది - అవివండుచున్నవి ॥ మధ్యమము - నీవువండుచున్నావు - మీరువండుచున్నారు ॥ ఉత్తమము - నేనువండుచున్నాను- మేమువండుచున్నాము.

వ్యా—ది-వి అను ప్రత్యయంబులుగాక 'డు రు-వు-రు-ను-ము' అనునవిపరంబగునపుడు 'ఉన్న' అను సహాయక్రియకు దీర్ఘంబు గలుగును. ('డుజ్ఞు' అనఁగా డువర్ణకంబును ముజ్ఞు యొక్క ఇకారంబుతోఁ జేర్చి పలుకఁగాఁ వైన రూపంబు. ఇట్టిది

(ప్రత్యాహారమనంబమును) వర్తమానకాలిక క్రియావృత్తియైన ‘వండు’ధాతువునకం టెం ట్ప్రత్యయంబు. దీనికి 'తెనిమిదవసూత్రంబుచేఁ బ్రథమపురుషైకవచనంబు వివక్షింపంబడి నప్పుడు ‘డుజ్బు’ వచ్చును. (వండు + డు) వండుధాతువుదంతంబుగావునఁ బదు మూఁడవసూత్రంబుచే నున్నానుబంధంబగు. (వండు + ఉన్న + డు) పదునాల్గవ సూత్రంబున చువర్ణకంబగు. (వండు + చు + ఉన్న + డు) పదునేనవసూత్రంబుచే ‘ఉన్న’ అనుదానికి దీర్ఘంబగు (వండు + చు + ఉన్నా + డు)డుజ్బుజిత్తుగావున బిందు పూర్వకంబగు. వాఁడు వండుచున్నాఁడు. బహు - వారు వండుచున్నారు. దీనికిఁ బ్ర క్రియ యేకవచనంబున కిచ్చినయుదాహరణంబునందుంబలెనూహించునది. ‘అదివండు చున్నది. అవివండుచున్నవి, ఇచ్చట ‘డి-వి’ వర్ణకంబులుపరంబైనందున నీపదునేనవ సూత్రంబుననున్నానుబంధంబునకు దీర్ఘంబు నిషేధింపంబడినది. ‘నీవువండుచున్నావు మీరువండుచున్నారు’ యుష్మచ్ఛబ్దార్థంబునందు నేకవచనబహువచన సమావేశం బులో మధ్యమపురుషమైనంనుల కుదాహరణంబులు. ‘నేనువండుచున్నాను. మేము వండుచున్నాము’ అస్మచ్ఛబ్దార్థంబునందు నేకవచనబహువచనంబులు కర్తలు గాన నుత్తమపురుషంబు.

16 సూ—లిడ్లాట్టుల డుజ్జున కెను నువర్ణంబులగు.

లిడాదేశంబగు డుజ్జునకు - ఎను - అనునది లడాదేశంబగు డుజ్జునకు - ను - అనునది నాదేశంబులగు.

లిడాదేశంబగు డుజ్జునకు ‘ఎను’ అనునదియు, లాడాదేశంబగు డుజునకు ‘ను’ అనునదియు నాదేశంబలగు

వ్యా—స్పష్టము. భూతంబున ‘ఎను’ వర్ణకంబు నెత్వంబున కత్వంబు కొండొ కచోఁ గానంబడియెడి. శా॥ అయ్యో నీసుతుగ్రిద్దరున్నకొని <u>పోయెన్</u> భీతినాపోఁ గన్’ పంచ - 1ఆ (వేంకటనాథకవి) మ॥ అని శాపావధిఁజెప్పి మున్గులుఁడు <u>పోయెన్</u> బోవ నాలోన’ పంచ- 4 ఆ. శా॥ అయ్యెన్నాలవజాము చొచ్చెఁ <u>దడవాయన్ వచ్చి</u> విచ్చేయు’ పంచ-4 ఆ ఇయ్యవి ప్రామాదికంబులు.

17 సూ—భూతంబునం దిగాగమంబగు.

భూతార్థవృత్తియగు ధాతువున కిగాగమంబగు.

భూతార్థవృత్తియగు ధాతువున కిగాగమంబగు.

వ్యా—భూతార్థంబును దెలియంజేయునట్టి ధాతువునకు, ఇకారంబంతాగమంబగు. వర్తమానాదికాలంబులను ధాతువే బోధించునని యీ రెండవసూత్రంబునం జెప్పంబడియె.

18 సూ—లిట్టువుఙ్ఙుపరం బగునపుడు తివర్ణకంబగు.

ఇకారంబుమీఁది కుచువు క్రియావిభక్తులయను సూత్రముచే రఙ్ఙునకిత్త్వంబగు ॥ ప్ర - వండెను - వండిరి॥ మ - వండితివి - వండితిరి॥ ఉ - వండితిని - వండితిమి.

ఇకారంబుమీఁది కుచువు క్రియావిభక్తులయను సూత్రంబుచే రఙ్ఙునకిత్వంబగు.

వ్యా—భూతార్థంబు వివక్షింపంబడినప్పుడు 'వండు + లిట్' ఇట్లుండును. ఎనిమిదవసూత్రంబున ఢఙ్ఙును, పదునాఱవసూత్రంబున ఢఙ్ఙునకు 'ఎను' వర్ణకంబును నగు. 'వండు + ఎను' ఇట్లుండ అపదాదిస్వరనిత్యసంధిగలిగి 'వండెను' అను ప్రథమపురుషంబయ్యెను. 'వండు + రు' ఇట్లుండ పదునేడవసూత్రంబున ధాతువునకు ఇగాగమంబగు. ఇక్కడ కిత్తుగావున ధాతువునకు నంతాగమంబు కాఁగా 'వండు + ఇ + రు' అని యుండెను అపదాదినిత్యసంధిచే 'వండి + రు' అయ్యెను. 'ఇకారంబుమీఁది కుచువు క్రియావిభక్తుల' అను తత్సమపరిచ్ఛేదంబునందలి యిరువదియాఱవసూత్రంబుచే 'రు' వర్ణకంబు. క్రియావిభక్తిగావున నిత్యంబు రాఁగా 'వండిరి' అను ప్రథమపురుష బహువచనరూపంబయ్యె. మధ్యమము—వండితివి. 'వండు + లిట్' ఇట్లుండ నెనిమిదవసూత్రంబుచే మధ్యమపురుషైకవచనంబున వుఙ్ఙువర్ణకంబు రాఁగా 'వండు + వు' అయ్యె.

పదునేనవసూత్రంబుచే నిగాగమంబును, పదునెన్మిదవసూత్రంబుచే వువర్ణకంబునకు ముందు ౘతి, వర్ణకంబు రాఁగా ౘవందు + ఇ + తి + వు, అనియుండె. ౘఇకారంబు మీఁది, అను తత్సమపరిచ్ఛేదంబులోని యిరువదిరెండవసూత్రంబుచే ౘవు, వర్ణకంబు యొక్క యుత్వంబునకు ఇత్వంబుగలిగి ౘవండితివి (వందు + ఇ + తి + వి) అను విశిష్టరూపంబయ్యె. బహువచనంబునఁ జైప్రక్రియచే ౘవండితిరి, ౘవండితిని, వండితిమి. అను నుత్తమపురుషైకబహువచనరూపంబులకు బైయుదాహరణంబునందలి సూత్రప్రక్రియయే యూహించుకొనునది.

19 సూ—కలజ్యనుబంధంబు ల్రృట్టుపరంబగునపుడగు.

ల్రృట్టుపరంబగునపుడు ధాతువునకు - కలజి - అనునదియను ప్రయుక్తంబగు.

ల్రృట్టుపరంబగునపుడు ధాతువునకు ౘకలజి, అనునది యనుప్రయుక్తంబగు.

వ్యా—భవిష్యదర్థంబునందు ధాతువునకు ౘకలజి, అనునది యనుసరించి మూర్వంబడును.

20 సూ—జీత్తుపరంబగునపు డుత్వంబున కత్వంబగు.

జీత్తుపరంబగునపుడు ధాతువు నుత్వంబున కత్వంబగు.

జీత్తుపరంపగునపుడుడు ధాతువు నుత్వంబున కత్వంబగు.

వ్యా—ౘకలజి, ప్రత్యయంబు జీత్తుగావునఁ బ్రకృతంబైన వందుధాతువు యొక్క ఉకారంబునకు అత్వంబుగలుగును. ఉ. వండఁగలఁడు. వండ + కల + ౘడు, ఇట్లుండ నిరువదియొకండవసూత్రంబున ధాతువునకు నుగాగమంబువచ్చి ౘవన్డను + కల + ౘడు' అగను. సంధిపరిచ్ఛేదంబునందలి పదునాల్గవసూత్రంబుచేఁ గకారంబునకు గకారంబును, పదునేడవసూత్రంబుచే బిందువునుగలిగి ౘవండఁగలఁడు, అయ్యెను. బహువచనము ౘవండఁగలరు,

21 సూ — కలజిపడజులు పరంబులగునపుడు నగాగమంబగు.

ద్రుతకార్యంబు ॥ ప్ర- వండఁగలఁడు - వండఁగలరు - వండఁగలదు - వండఁగలవు ॥ మ - వండఁగలవు - వండగలరు ॥ ఉ-వండఁగలను - వండగలము.

ద్రుతకార్యంబు ప్ర॥ వండఁగలఁడు - వండగలరు. వండఁగలదు-వండఁగలవు మ॥ వండఁగలవు - వండఁగలరు ఉ॥ వండఁగలను - వండఁగలము.

వ్యా— కలడి-పడడి, అనునవి పరంబులగునపుడు ధాతువునకు నగాగమంబు వచ్చును. ద్రుతకార్యంబనఁగా ద్రుతప్రకృతికంబునుబట్టివచ్చు పరుషాదికార్యంబులు మూలంబునందలి యుదాహరణంబులయందుఁ బైసూత్రంబులోని వండఁగలఁడు, అను రూపంబునొద్దఁ గనఁబఱచిన సూత్రప్రక్రియచేఁ దక్కిన పురుషంబులయందును నూహించుకొనునది.

22 సూ — లాట్టుఱ్ఱఙ్ఘు పరంబగునపుడు దుగాగమంబగు.

ప్ర - వండును - వండుదురు॥ మ - వండుదువు వండుదురు ఉ - వండుదును - వండుదుము ॥ లాడర్థంబులయందొలి నుదాహరణంబులు వక్కాణించెద ॥ తద్ధర్మంబు - కులాలుఁడుకుండలువానును ॥ తచ్ఛీలంబు - జ్వలనజ్వాలంబు లుప్పరంబెగయును॥ సంభావన- ఇప్పుడు వాఁడింటనుండును ॥ సంప్రశ్నము - ఉందునాపోదునా ॥ సాతత్యము - సర్వంబునం దీశ్వరుఁడుండును - సర్వంబీశ్వరునియందుండును ॥వర్తమానంబు - మేననిప్పుడుంబులకలు వొడమెడును - వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునందెడు గాద్యాగమంబులగు ॥ భావి- వాఁడుతేపువచ్చును ॥ ఆశీస్సు - శుభంబగును ॥ వచ్యర్థంబులు కొన్ని నొకచో భూతంబున లాట్టు గానంబడియెన్ను.

ప్ర-వండును - వండుదురు మ- వండుదువు - వండుదురు. ఉ—వండుదును- వండుదుము. లాడర్థంబులయందీని నుదాహరణంబులు వక్కాణించెద. తద్ధర్మంబు— కులాలుండు కుండలు వానును. తచ్ఛీలంబు - జ్వాలనజ్వాలంబులుప్పరంబెగయును. సంభావన - ఇప్పుడు వాఁడింటనుండును. సంప్రశ్నము — ఉండునా పోదునా. సాతత్యము- సర్వంబునం దీశ్వరుఁడుండును ; సర్వంబీశ్వరునియందుండును. వర్తమానంబు - నేఁన నిప్పుడుంబులకలవొడమెడును. వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడుగాద్యాగమంబులగు. భావి - వాఁడు రేపువచ్చును. ఆశీస్సు - శుభంబగును, వస్త్వర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టుగానంబడియెను.

వ్యా—ప్రథమపురుషైకవచనదువర్ణకంబుదక్క దక్కినవి (రు, వు, రు, ను, ము,) పరంబగునపుడు ధాతువునకు దుగాగమంబు గలుగును. వండు + లాట్ ఇట్లుండఁ బ్రథమపురుషైకవచనంబుగావున ...నెనిమిదవసూత్రంబుచే డుజ్వర్ణకంబు రాఁగా వండు + ఁడు, అనియుండె పదునాఱవసూత్రంబుచే డుజునకునువర్ణంబాదేశంబై వండును, అయ్యెను. దుగాగమంబు విధించుప్రకృతసూత్రంబునం డుజు పరిహరింపఁబడినందున దుగాగమంబురాలేదు. వండుదురు, ఇట వండు + లాట్ ఇట్లుండఁ బ్రథమపురుషబహువచనంబు గావున రువర్ణకంబు లకారంబునకు నాదేశంబై ప్రకృతసూత్రంబున ధాతువునకు దుగాగమంబు గలిగి పైరూపంబు సిద్ధించె. ఇట్లే మధ్యమోత్తమపురుషంబులయందు సూత్రప్రక్రియయూహించునది. లాట్ప్రత్యయంబున కర్థంబులైన తద్ధర్మతచ్ఛీలాదులకు నుదాహరణంబుల కర్థవివరణంబువరుసగా నీయఁబడును. తద్ధర్మంబు - కులాలునకుఁ గుండలు వానుట కులధర్మంబు. తచ్ఛీలంబు - అగ్ని జ్వాలలూర్ధ్వముఖంబులగుట సహజము. సంభావన - ఊహ. వాఁడు గృహమందుండుట నిశ్చయింప శక్యంబుకానిది. సంప్రశ్నము - అడుగుట. సాతత్యము - సతతంబు నుండుట. ఈశ్వరుండెల్లప్పుడును సర్వజగంబును విడనాడక యుండునని యర్థంబు తోఁచుచున్నది. వర్తమానంబు - ఒడలు గగుర్పాటుచున్నదని యర్థము. క్రిందను జెప్పఁ బోయెడి యిరువదిమూఁడవసూత్రంబుచే ఎడు, గాగమంబును, ఎడిగాగమంబును, తఱచు వర్తమానకాలంబునందగును. భావి- భవిష్యత్కాలము. వచ్చును= రాఁగలఁడని యర్థము ఆశీస్సు - దీవన. ఆశీస్సునందు అయ్యెడును, అగుఁగాక, అనియు నిరువదియాఱవ

సూత్రంబుచే. నుండందగను. సీ॥ తే॥ అపరజనకాద్ధిసీమ రామాభిధాన | హారికహీన గుణపరికహారశరాళి | గిరిమథనయత్నమున దోచు సిరియ శేష ! రాజ్యము లొసంగదె రుమల రాయమణికి' వసు-1 ఆ వ॥ స | ర్వకలాకాంతుఁడు పాత్రము దిగ్మలనహారాయత్నమావల్లభుఁ, వసు -1- ఆ. సీ॥ తే॥ ప్రథనజయమిచ్చుఁ దిరుమలరాయమణికి, వసు 1 ఆ. శా॥ పా| ఖ్యాతిం గాంచె పిలిల్లువేంకటనగాగ్ర్య క్ష్మాంచుర క్షించు గో| బ్బూరి తిమ్మనృపాలసింహు నరసింహోర్వీశ చూడామణిన్, రా మా-1ఆ. వ॥ సా| పెనగొండ పుర్గరాయండు జయోన్నతులిచ్చు నృసింహశౌరికిన్ రా మా-1ఆ. వ॥ ఎలమినిత్యముఁ బోగ్రముఁ గృష్ణవసుధాధీశున్ నృసింహాత్మజున్' కళా-1ఆ. ఈ ధాతువునకు నర్థంబులైన 'అను, పలుకు, వాకుచ్చు, చెప్పు, ఇత్యాదులకు భూతకాలంబున నొకానొకప్పుడు లాట్ప్రత్యయంబు ప్రయోగంబులఁ గానంబడియెడి. తే॥ గీ॥ సర్వతీర్థాభిగమనంబు సర్వవేద | సమధిగమము సత్యంబుతో సమము గావు| ఎఱుఁగ నెల్లధర్మములకు నెందుఁ బెద్ద| యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు' భా- ఆది. 4ఆ. క॥ మౌనమున దృఢజ్ఞానము | దానంబున నభ్యుదయము ధర్మనిరతయౌ| తానిర్వహణంబున నర| కానీకాహరణ సౌఖ్యమగునండ్రు బుధుల్' భార-శాంతి-6, తే॥ సత్యభోగకంబెఁ బ్రశస్తమైన| కృత్యమరయంగ లేదండ్రు నిత్యధర్మ| సమ్యగభిగమార్థి సంయమప్రసిద్ధులాగమతంత్రప్రసిద్ధులార' భార- అశ్వ- 2ఆ. తే॥ వినుము నేకవిధంబుల విస్తరిల్లు | ధర్మములయందు నొకండునుఁదలఁప నిష్ఫలంబు లేదాత్మమోక్షావలంబియైన | ధర్మముత్తమమండ్రు తత్త్వజ్ఞుఁడధిప' భార- శాంతి - 4ఆ. క॥ ఋతుమతియైన పుత్రార్థము | పతిఁగోరిన భార్యయందుఁ బ్రతికూలుండై | ఋతువిఫలత్వము సేసిన| నతనికి మఱి భ్రూణహత్య యగునండ్రు బుధుల్' భార-ఆది-3ఆ. తే॥ గీ॥ పౌరుషంబుమానె ఫలమండ్రు కొందఱు | ట్లనక దైవమిచ్చునండ్రు కాదు| ఫలము' భార. పై నుదాహరింపఁబడిన 'అండ్రు' ఇత్యాదిలాట్ప్రత్యయాంతంబులకు 'అనిరి' అని భూతకాలమర్థము.

23 సూ—లాట్టు ధర్మార్థంబగునప్పుడిద గాగమంబును బ్రథమ మధ్యమంబు పరంబగునప్పుడిదగాగమంబును బహుళంబుగానగు.

ప్ర - వండెదను - వండెడిని - వండెదరు ॥ మ - వండెదవు - వండెదరు ॥ ఉ - వండెదను - వండెదము.

వ్యా—తద్ధర్మార్థంబులయందుఁ బ్రథమపురుషైకవచనంబైన డుఁబు తప్ప 'రు, వు, రు, ను, ము, అనునవి పరంబగునప్పుడు ధాతువునకు ఎదగాగమంబును, ప్రథమపురుషనువర్ణకంబు పరంబగునపుడు ధాతువునకు ఎడిగాగమంబును, ఎదుగాగమంబును దఱచుగఁగలుగును. 'వండు + లాట్, ఇట్లుండ నెనిమిదవసూత్రంబుచే డుఁబును, పదునాఱవసూత్రంబుచే దానికి నువర్ణకంబును రాఁగా 'వండు + ను, అని యుండె. ప్రకృతసూత్రంబుచే నువర్ణకంబునకు ముందు ఎదుగాగమంబును, ఎడిగాగమంబును ధాతువునకుఁ గలుగఁగా వండు + ఎదు + ను—వండు + ఎడి + ను, అని యుండె. ఈ యాగమంబులు కిత్తులుగావున ధాతువునకుఁ తుదనుజేరె. అపదాదిస్వరనిత్యసంధిచే వండెదును—వండెడిని, (ఇచ్చట 'ఇకారంబుమీఁదినను వుక్రియా, అను తత్సమపరిచ్ఛేదంబునందలి యిరువదియాఱవసూత్రంబుచే నువర్ణకంబున కిత్వంబు) అనురూపంబులాయెను. వండెదరు, వండు + లాట్, అనియుండ నెనిమిదవసూత్రంబుచే రువర్ణకంబు గలిగి ప్రకృతసూత్రంబున నెద గాగమంబురా నీరూపంబయ్యె. ఇట్లే మ-వండెదవు, వండెదరు. ఉ- వండెదను, వండెదము, ఇత్యాదిరూపంబులగుటను నూహించునది.

24 సూ.—లిడ్లోట్టు లవకారంబునకు లోపంబు విభాషనగు.

వండితి - వండితివి ॥ వండుదు వండుదువు ॥ వండెదవు - వండెదు.

వ్యా—భూతక్రియయొక్కయు, తద్ధర్మక్రియయొక్కయుఁ బ్రథ్యయవకారంబునకు లోపంబు వైకల్పికంబుగా నగును. భూతంబునకు – వండితి, వండితివి. ఇట్లుండఁ బ్రకృతసూత్రంబునఁ బాక్షికవకారలోపంబురాఁగా వండితి + ఇ' అని యుండె. అపదాదిస్వరనిత్యసంధిచే వండితి, అయ్యె వండుదు, (వండుదువు) వండెదు (వండెదవు), ఇత్యాదులంబుఁ బైదానింబలె నూహించుకొనవలయును సీ॥ ఇభరాజగమన నీవెందుల కరికితత్త్వరుపచాభోగయెందున్న దాన । ఘబల యెవ్వరివేత

మొగ్గి దిగంతరంబులఁ దత్తఱిసదరెక్ మరుత్సుతుఁడు దర్పమెలర్పనహార్య ముద్ధతిం బెఱుకఁగ గోత్రశైలములు పెల్లదరెక్ గలగంబయోఘులుక్, భాస్క—యు-కాం.

26 సూ—లూట్టుమధ్యముకైన తవర్ణంబులు క్రమంతాంతంబులగు.

ఆశీస్సు - మీకుమేలుగలిగెడును - మీకుమేలుగలుగుతను ॥ శాపంబు - నీకురాక్షసత్వంబుగలిగెడును - నీకురాక్షసత్వంబుగలుగుతను ॥ సంప్రార్థనంబు - హరినన్నుఁ గృపఁగాంచెడును - హరినన్నుఁ గృపఁగాంచుతను.

వ్యా—(ఆశీస్సు, శాపము, సంప్రార్థనము, విధి, వీనియందలి డుమ్మునకు నకారంబంతమందుఁ గల (ఎడు, త, వర్ణంబులగును. ఆశీస్సు. మేలనుభవించువానికి నిష్టంబు గావునఁ బైరెండు వాక్యంబులును, ఆశీర్వాదార్థంబునందు (ఎడు, త, వర్ణంబులు వచ్చినందులకుదాహరణంబులు. శాపము-ఇచ్చట రాక్షసత్వం బనుభవించువానికి ననిష్టంబు గావున నారెండు వాక్యంబులును శాపార్థంబునందు (ఎడు, త, వర్ణంబులు గలిగినందులకుదాహరణంబులు. సంప్రార్థనము—ఇచ్చట హరినన్నురక్షింపవలెనని ప్రార్థించుము న్నాఁడు కావున నట్టి యర్థంబునందుఁ బైప్రత్యయంబులని యెఱుంగునది. శాపంబునకు- క॥ పతిహీనలైన భామిను । లతిసనవతులయ్యుఁ గులజలయ్యును ననలంకృతలయ్యెడు మాంగల్యరహితలయ్యెడుఁ గృపణవృత్తి నిదియు మొదలుగాక్, భార ఆది. 4 ఆ. ఆశీస్సునకు—ఉ॥ వారిజపైరిసులేశ నీకుసం । పూర్ణమనోరథంబులును బుణ్యఘనంబులు నిచ్చునుండెడిక్' భారతము.

27 సూ—విధియందు లూట్టునకు మాఱుగానది యనుతచ్ఛబ్దంబును ముందు నుగాగమంబునునగు.

మైత్రుండు నానిర్దిష్ట కార్యంబుచేయునది - వానికి నీవు బాసటయయియుండునది.

వ్యా—విధ్యర్థకంబునందు (తనకు లోనైనభృత్యాదులను గార్యమందుఁ బ్రవర్తింపఁ జేయుటవిధి) లోట్టునకు బదులు 'అది' అను శబ్దంబును, దానికి ముందు ధాతువునకు 'ను' గాగమంబును, గలుగును, ఉ. మైత్రుండు నానిర్దిష్ట కార్యంబుచేయునది. మైత్రుండు నానిరూపించిన కార్యంబు చేయుట విధియని యర్థము. ఇచ్చట మైత్రునిఁ గార్యంబునందుఁ బ్రవర్తింపఁజేయుట స్ఫురించుచున్నది. 'చేయు + లోట్' అనియుండఁ బ్రకృతసూత్రంబునే 'అది' శబ్దంబును, ధాతువునకు నుగాగమంబును నయ్యెను. నుక్కు కిత్తు కావున 'చేయు' ధాతువుచివరను జేరి 'చేయునది' అను రూపంబయ్యెను. వానికి నీవు బానటయయియుండునది. ఇచ్చట నీవు బానటయయి యుండుమని యర్థము. ఇచ్చట 'ఉండునది' అనునది మధ్యమపురుషార్థంబును దెలియఁ జేయుచున్నది. ఇరువదితొమ్మిదవసూత్రంబున బానటవైయుండుమనియుఁ జెప్పనొప్పును.

28 సూ—ఎడుతలద్రుతంబును కచ్చు పరంబగునపుడు మకారంబగు.

నీకుమేలుగలిగెడు మనియెను - నీకుమేలుగలుగు తమనియెను.

వ్యా—'ఎడు, త' అనువానిద్రుతంబునకు నచ్చుపరంబగునపుడు మకారంబు గలుగును. ఉ. నీకు మేలుగలిగెడు మనియెను; నీకు మేలుగలుగుత మనియెను. ఇచ్చట సంధిదశయందు 'ఎడు, త' వర్ణంబులు మకారాంతంబు లయ్యెను విభాగావస్థయందు 'కలిగెడున్ + అనియెను; కలుగుతన్ + అనియెను' అని నకారాంతంబులుగాఁ జెప్పవలెను.

29 సూ—లోణ్మధ్య మపురుషలకు ముడుఁడులగు.

ఆశీస్సు - దీర్ఘాయువగుము - దీర్ఘాయులరగుఁడు ॥ శాపంబు- రాక్షసుండవగుము - రాక్షసులరగుఁడు ॥ సంప్రార్థనంబు - నన్ను రక్షింపుము - నన్ను రక్షింపుఁడు ॥ విధి - నాచెప్పిన పనిచేయుము - నాచెప్పిన పనిచేయుఁడు.

వ్యా—'ఆశీస్సు, శాపము, సంప్రార్థనంబు, విధి' ఈయర్థంబులయందు లోట్టుమధ్యమపురుషంబుయొక్క యేకవచనబహువచనంబులకు (వువర్ణక రువర్ణకంబులకు) క్రమంబుగా మువర్ణకడుజ్వర్ణకంబులగు. ఆశీస్సు-'దీర్ఘాయువగుము' ఇటఁగారకపరిచ్ఛేదంబులోని ముప్పదిమూఁడు ముప్పదినాల్గుసూత్రంబులచే 'దీర్ఘాయువవు' అనుట యాశీర్వ్యక్తంబైనను నిచ్చటిరూపంబు పూర్వోక్తసూత్రంబులోని ప్రాయిక గ్రహణంబుచే రక్షితంబయ్యె. 'అగుము, కమ్ము, అవుము, ఔము' అని యేకవచనంబునందును, 'అగుఁడు, కండు, అవుఁడు, ఔఁడు' అని బహువచనంబునందును రూపాంతరంబులు. తొంబదియాఱవసూత్రంబునొద్దఁ జూచుకొనునది. 'దీర్ఘాయువులరగుఁడు' బహువచనము. దీర్ఘాయువులరుకండని యర్థమ్ము.' శాపసంప్రార్థనవిధులందు నిట్లే గ్రహించుకొనునది. విధ్యర్థంబునందు లోట్టుయొక్క పురుషత్రయంబునగును, ఇరువదియేడవసూత్రంబుచే 'అది' శబ్దంబు విధింపంబడి యుదాహృతమైన 'నీవుబాసటయయియుండునది' ఇత్యాదికమైనమధ్యమపురుషాదివాక్యంబు ప్రకృతసూత్రంబున 'నీవు బాసటయయియుండుము' అని పక్షంబున నిర్వాహంబుగానుండునట్లు లోట్టుయొక్క పురుషత్రయంబునందును విధ్యర్థంబునంగాక తక్కిన యాశీశ్శాపసంప్రార్థంబులయందు 'ఎదు, త' వర్ణంబులు, ఇరువదియాఱవసూత్రంబుచే విధింపంబడఁగా 'నీవు దీర్ఘాయువయ్యెదు, నీవుదీర్ఘాయువగుతత్, ఇత్యాదికమైనరూపంబులును, ప్రకృతసూత్రంబునఁ బర్యాయంబుగా మువర్ణకడుజ్వర్ణకాంతరూపంబులును, ఆశీరాద్యర్థంబులయందు నగునని తెలిసికొనునది. ఈ సూత్రంబు, ఇరువదియాఱు ఇరువదియేడు సూత్రంబులకు బాధకంబుగాదని యెఱుంగునది. కేవలతుమున్నంతంబుచేతను సైతము శాపార్థము తెలుపంబడు. అన్వయక్రమంబుచేఁ గ్రియావాచకంబు వాక్యాంతంబునందే యుండవలసినది. కావున శాపక్రియాబోధకంబైన తుమున్నంతంబుకూడ వాక్యాంతంబునందే ప్రయోగింపవలెను. చ॥ శమనునిదిక్కునంబోడమి సర్పముఖంబులబైలువెళ్లని । త్యమును బలాశిసంగతులు దప్పక త్రిమ్మరునట్టి నాలిభూ। తమ ! పవమాన ! నీకుఁగలదా । మఱిభూతదయార్ద్రబుద్ధి? యుక్తమకదనీకుఁ గొమ్మలనడల్చుట నీవడి ధూళిపాలుగాక్, కవి-2 ఆ. 'పవనుఁడానిను బెద్దపాముగఁబవ, తే॥ గీ. నీరజారాతివిమఁ దననెలవుగూల నేలసృజియించె విధిసృజియించుఁగాక । యేలజైవాతృకునిఁజేసె నేలతప్పుఁ। బుడమిఁ

బాపిచిరాయుఁడన్ జెనఁగనుఁడుఁగు, వసు - 4 ఆ. తే॥ గీ. అలరువిలుకాఁడ ! బలుసిరి గలిగినట్టి। దొరకొమరునంచుఁ బొగడుదుఁ బ్రజ్ఞఁ బదునుఁ। దెంచఁగొలుంగక మునుదలఁ దెరువరులను। బూనియేతువె నీపూన్కి బుగ్గిగాను, నీలా-3 ఆ. క॥ పాదపచ్ఛాయంబునఁ బలువఁటు! విరిఁబోఁడులనెల్ల మిగులవెతవెట్టుదు నీ! దొరతనము ద్రుంగిపోవను! మరుఁడా నీ చేతివిల్లు మంటంగలయన్, నీలా-3 ఆ. చ॥ బలితపుటాముదంబమియుఁ బత్వఁగఁ గైకొని యొజ్జముద్రియన్। గలిసిన దోసకారివని కాదె నినుంగని తమ్మికొమ్మ ని।వ్వలుతల వంచుమందునది చాలనొ కూఁతుడి నీకు నెంతసుం। జలపలకేడి నీసవురుసన్నము గా నిఁక నిందురాకుమీ, నీలా-3 ఆ. క॥ జతలేనిపూవుగట్టులు। కతినలపైఁ బెల్లురేఁగి యలజడి మీఱన్। వెతవెట్టుదురేయిఁక నీ। బ్రతుకు బయల్గాను నా ప్రయత్నకత్తా, నీలా- 3 ఆ. తే॥ గీ. మున్నుకొన్నాళ్లు పలుగాకి మూఁకలోనఁ॥ గలిసిమెలఁగిన తెఁగల్లఁగాని పింపఁ। జేడియలమీఁదఁ గ్రుడ్డెఱ్ఱసేయరాదు। కోయిలాయింక నీయిల్లుగూలిపోను, నీలా-3 ఆ. తే॥ గీ. తలిరుఁబోఁడుల డెందముల్దల్లడిల్లఁ। గూఁకలిడుకొంచు నెంతయుఁగోలఁ తలేక। యాగడంబునఁ బరివిచ్చియాడెదేమి। యక్కటా నెమ్మినీ కూట యడఁగలియ. నీలా -3 ఆ. క॥ నెమ్మిదిఁబలుమాఱు మెఱయుచుఁ। గమ్మనిపూఁదేనెలాని కడుఁగ్రొవ్వియహా। కొమ్మలఁగలఁపఁగఁ జూచెదు। తుమ్మెద నీప్రుఙ్గు పెద్దతుప్పలు పట్టన్, నీలా-3 ఆ.

30 సూ—ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు.

మనము వందుదము.

జీత్తృపరంబగునపు డుత్వంబున కత్వంబగు నను సూత్రముచే ల జిపరంబగు నపుడత్వంబు ॥ ప్ర - వండుఁడు - వండరు - వండదు - వండవు ॥ మ - వండవు - వండరు ॥ ఉ - వండను - వండము.

వ్యా—నీవును నేనును (మనము) గర్తలైనపుడు, ఇరువదిరెండవసూత్రంబుచే ధాతువునకు విధింపంబడిన దుగాగమంబున కత్వంబగును. ఉ. మనము వండుదము.

(వందుదుము, అనునవి బహులముగాఁ బ్రికృతసూత్రంబుచే నత్వంబుగలిగె. ఇంతకు మున్ను వ్యతిరేకార్థకలకారంబుతక్కఁ దక్కిన లకారంబులకు నుదాహరణంబులు క్రమంబుగా నీఁబడియె. ఇప్పుడు వ్యతిరేకంబునకు నుదాహరణంబులు మూలంబున నీయంబడెను. ఈవ్యతికార్థరంబునందు ధాత్వంతిమోకారంబునకు నిరుపదియవసూత్రంబుచే నత్వంబు గలిగి (వందఁడు, మొదలగు పైరూపంబులయ్యె.

31 సూ.—మధ్యమ ముడు జులు ముజ్జునాఁబడు.

వ్యా—మధ్యమపురుషంబునందలి (ము, డుజ్, అనునవి ముజ్జు, అనఁబడును. అనఁగా ముపర్ణకంబుతో డుజు బకారంబుచేర్పఁగా (డుఙ్ఘు రుఙ్ఘు, ఇత్యాదికంబువోలె ముజ్జు, ప్రత్యాహారంబని యెఱుంగునది.

32 సూ.—వ్యతిరేకంబున ముజ్జుపరంబగునపుడు కుజియగు.

నీవు వండకుము - మీరువండకుఁడు.

వ్యా—వ్యతిరేకార్థంబునందు ముపర్ణక డుజ్వర్ణకంబులః పరంబగునపుడు ధాతువునకుఁ గుజివర్ణకంబగు. కుజిప్రత్యయంబు జీత్తుకావున నిరువదియవసూత్రంబుచే ధాతువుయొక్క ఉకారంబునకు, అకారంబయ్యె.

33 సూ.—సంప్రార్థనంబున ముజ్జునకదాదులు విభాషనను ప్రయుక్తంబులగు.

వందుమ - వందుమా - వందుమి - వందుమీ - వండుఁడ - వండుఁడా - వండుఁడి - వండుఁడీ ॥ అ - ఆ - ఇ - ఈ - ఎ - ఏ - ఒ - ఓ - అమ్మ-అయ్య-ఇత్యాదు లదాదులు.

వ్యా—సంప్రార్థనార్థంబునందలి ముమర్ణకదుజ్వర్ణకంబులకుఁ జివరను హ్రస్వాకారంబు మొదలైనవి. విభాషగాఁ జేర్పంబడును. 'వండుమ' 'వండుమ + అ' అనిపదవిభాగము చేయవలయును. 'వండుమా' 'వండుము + ఆ' అని విభజింపవలయును. ఇట్లే 'వండుమి' ఇత్యాదులయందుఁ బదవిభాగమూహించునది. 'వండుమ' ఇత్యాదుల కర్థం జేసనఁగా వండుటను నిన్నుఁ బ్రార్థించుచున్నాఁడనని యర్థంబు.

34 సూ—ఏదాదులను ప్రయుక్తంబులగు నపుడు ముజ్ఞునకు వుజీనుజీయగు.

వినవె - వినవే - వినరె - వినరే - వినకువె - వినకువే - వినకురె - వినకురే - వినవమ్మ - వినరమ్మ - వినవయ్య - వినరయ్య.

వ్యా—'ఎ, ఏ, ఱ, ఓ, అమ్మ, అయ్య, (ఏదాదులు) అనునవి ముమర్ణకదుజ్వర్ణకంబులపై ప్రయోగింపంబడునపుడు ముజ్ఞులకుఁ గ్రమంబుగా వుజీ (ఏకవచనంబున) రుజీ (బహువచనంబున) అగును. 'వినవె' ఇట 'వినుము + ఎ' ఇట్లుండ నెదాదులలోని ఏకారంబు పరమైనందున ముమర్ణకంబునకు వుజీవర్ణకంబుగలిగి 'వినవు + ఎ' ఇట్లయ్యె. వుజీ జిత్తుగావున నిరువదియవసూత్రంబుచే ధాతువుయొక్క ఉకారమకారముకాఁగా 'వినవె' అయ్యె. 'వినవే' ఇత్యాదులయందు నిట్టిప్రక్రియయూహించునది. 'వినకువె' ఇట 'విను + ము + ఎ' ఇట్లుండఁ బ్రకృతసూత్రంబున 'విను + వు + ఎ' అయ్యెను. వ్యతిరేకార్థంబుకావున ముప్పదిరెండవసూత్రంబున ముమర్ణకస్థానీయంబైన వుజీకిఁ బూర్వంబునందు 'కుజీ' వర్ణకంబుగల్గి 'విను + కు + వు + ఎ' అయ్యెను. 'జిత్తుపరంబగు' అను నిరువదియవసూత్రంబుచే 'కుజీ' జిత్తుగావున వినుధాతువుయొక్క యుకారంబున కత్వంబుగలిగి 'వినకువె' అయ్యెను. వుజీవర్ణకంబునకు ముందున్న కుజీయొక్క ఉకారంబు ప్రత్యయసంబంధికాని, ధాతుసంబంధికాదు. కావున నిరువదియవసూత్రంబుచే నత్వంబు రాదయ్యె. ఈపరిచ్ఛేదంబునందుదాహరింపంబడిన 'ధాతువునకు' అను ప్రథమ సూత్రంబు తక్కినసూత్రంబులయందుంబలె 'జిత్తుపరంబగు' అను నిరువదియవసూత్రంబునందుంగూడ ననువర్తించునని స్మరించునది. 'వినవే,

ఇత్యాదులందుఁ బదవిభాగము 'వినుము + ఎ, వినుఁడు + ఎ; వినకుము + ఎ, వినకుఁడు + ఎ, వినుము + అమ్మ, వినుఁడు + అమ్మ, వినుము + అయ్య, వినుఁడు + అయ్య' ఇట్లు సేయవలయును.

'ప్రార్థనంబునందన్ప్రత్యయాంతక్రియలమీఁదఁ గదకదవు పూర్వకంబులన్నా దులనుప్రయుక్తంబులగు. ప్రోవఁగదన్న ప్రోవఁగదవన్న, ప్రోవఁగదయ్య ప్రోవఁగదవయ్య; ప్రోవఁగదమ్మ, ప్రోవగదవమ్మ, ప్రోవఁగదె ప్రోవఁగదే, ప్రోవఁగదవె ప్రోవఁగదవే 'సుకీర్తి మనఁగదన్న' భాగ-10-స్కం-పూ. 'చెప్పఁ గదయ్య, భాస్కరశతకము ఉ॥ తుదిమొప్పును మద్విరహాంబురాశికిం । జెప్పఁగదమ్మ 'భాగ-10, స్కం, పూ; శా॥ తండ్రీనాకు ననుగ్రహింపఁగదె వైద్యంబంమఁ బ్రార్థించినన్, మను-5ఆ. క॥ నీపాదకమల సేవయు । నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం । తాపార భూతదయయును । దాపసమందార నాకుదయ సేయఁగదే' భాగ-10-స్కం-పూ. ఉ॥ పురంబుఁ జేరనిం। కెవ్విధిఁగాంతుఁ దెల్పఁగదవే తెరువేది, మను-2ఆ. 'ప్రౌఢ— క్రియా-ప.

35 సూ—టవర్ణకంబు భావంబునందగు.

భావంబనఁగాధాత్వర్థంబు - వండుట -పండుట- వినుట- కనుట.

వ్యా—ట ప్రత్యయంబు ధాతువుయొక్క యర్థంబునందగు. ఇచ్చట భావశబ్దంబుణిజంతమైన భూధాతువుకంటె 'ఎరచ్, అనుసూత్రంబుచే నచ్ప్రత్యయంబురాఁగా నిష్పన్నంబైనది. భూధాతువునకు 'అగుట. అర్థము. దానిపైని ణిచ్చునకుఁ బ్రేరణంబర్థంబు. కావున 'అగు, ధాతువుయొక్క ప్రేరణరూపంబు 'కావించుట, కాఁబట్టి ప్రేరణార్థకణిజంతంబైన భావశబ్దంబునకు 'కావించుట, అని యర్థంబగును. కావించుట యనఁగా నుత్పత్తి నిజేయుట. 'ఘటమును గావించెను' అను వాక్యంబునకు 'ఘటోత్పత్తి నిజేసెను, అని యర్థంబగు. 'వండెను. అను చోఁగూడ వంటను గావించెనని

యర్థము ఫలము వ్యాపారము (ఫలవ్యాపారయోర్ధాతుః, అను కారికచేత (కారకపరిచ్ఛేదంబునందలి ద్వితీయసూత్రవ్యాఖ్య యొద్దఁ జూచుకొనునది) ధాతువునకు నర్థంబులు కాఁబట్టి వ్యాపారంబే భావంబనాఁబడు. వ్యాపారశబ్దంబునకు గావించుట, చేయుట, అనునవి పర్యాయపదంబులు. ఫలవ్యాపారంబులు ధాతువునకు నర్థంబులు గావున వ్యాపారంబును జెప్పనిధాతువే జగంబున లేదు. అనఁగా గావించుట లేక చేయుట, అన్నయర్థంబియ్యని ధాతువులేదు. ఉ. వండుట అన వంట చేయుట. నడచుట, అనఁగా నుత్తరదేశసంయోగంబును జేయుట. (ముందు చోటితో సంబంధము) పైనుదాహృతంబైన వండు ధాతువునకు వంట ఫలము. చేయుట వ్యాపారము. నడచు ధాతువునకు నుత్తరదేశసంయోగము ఫలము. చేయుట వ్యాపారము. ఫలంబులు భిన్నంబులై యుండుఁగాని వ్యాపారంబుమాత్రము సర్వధాతువులకు సామాన్యార్థంబై యగును. ప్రకృతిసూత్రంబున వ్యాపారార్థంబునందు, అనఁగా గావించుటలేక చేయుట, అనినధాత్వర్థంబునందు ట ప్రత్యయంబువచ్చునని ఫలితార్థము. చేయుట యనునది ధాతువునకే యర్థంబైనను బ్రకృతిసూత్రంబుచే విధింపంబడిన ట ప్రత్యయంబు పూర్వోక్తధాత్వర్థంబునే యనువదించునని భావము వండుట, వంటచేయుట (చేయుటయను ధాత్వర్థంబునందు ట ప్రత్యయంబని యెఱుంగునది.) ఇచ్చటఁ గాయ పరిపాకమును గావించుటయనఁగా ఫలత్వావస్థకు ముందు క్రమంబుగా నెదిగెనందున నెదుగుటయనెడివ్యాపారద్వారంబునఁ బండుటయనుఫలంబును దానే కలిగించుకొన్నదని భావము. చేతనాచేతనంబులగు నెల్లవస్తువులయందును గుణక్రియలుండుననుట యవశ్యంబంగీకర్తవ్యంబు. ఇచ్చట కాలాంతువునందు ఫలత్వావస్థం గారణంబైన క్రియ యంగీకరింపకతీరదు. అట్టిక్రియ యెద్దియనఁ జక్కఁగ నెదుగుటయేయని యూహించుకొనవలయు. లోకంబులోఁ గాయ ముదురునంతవఱకు నెదిగెనంగాని పండదుగదా! కాన నిట నెదుగుట భావంబు (భావ = వ్యాపారము = క్రియ) అట్టివ్యాపారంబునకును, నట్టివానివలనం గలిగినపంటకును గాయే యాశ్రయంబైనది. కాన నిట ఫలవ్యాపారంబులు రెండింటికిని ఫలంబునందు సామానాధికరణ్యంబు కలిగినందున పండు, ధాతువకర్మకంబయ్యె. ఫలవ్యాపారంబులకు వైయధికరణ్యంబు కల్గినచో ధాతువు సకర్మకంబగు

'దేవదత్తుఁడు వంటకమును వండెను' అన్నయుదాహరణంబునందు ఫలము విక్లిత్తి (వంట=మెత్తఁబడుట)వ్యాపారంబెద్దియనఁగానధస్సంతాపన(స్థాలి క్రిందనుమంటగావించుటపూత్కారా (ఊఁదుట) దికము. ఈవ్యాపారము దేవదత్తునియందును,విక్లిత్తియనెడి ఫలము వంటకమందును, నుండి వ్యధికరణంబైనందున (భిన్నాశ్రయకము) నిట వండు ధాతువు సకర్మకంబయ్యెనని యెఱుంగునది. ఇట్లు సకర్మకాక క్రియాస్థలంబుల ఫల వ్యాపారంబులు బుద్ధిసూక్ష్మతచే గ్రహించుకొనవలయును. ప్రకృతసూత్రంబున విధింపంబడిన టప్రత్యయంబు ధాత్వర్థంబైన వ్యాపారంబునే స్పష్టీకరించునుగాని యేలిక మొదలైనశబ్దంబులందు నికవర్ణకాదులువోలెఁ గర్త్రాదికాపూర్వార్థంబును దెలుపదని తాత్పర్యము. ఈమార్గము భూవాదిసూత్రస్థభాష్యనార్వధాతుకేయక్సూత్రస్థశబ్దేందుశేఖరవైయాకరణభూషణాది సంస్కృతవ్యాకరణగ్రంథంబులందు సిద్ధాంతీకరింపంబడెనదియే సూరిగారనుసరించిరని యెఱుంగునది.

36 సూ—కజివర్ణకంబు పురార్థయోగంబునవిభాష ను భావంబునందగు.

వండకమునుపు - వండుటకుమునుపు - చేయకమునుపు - చేయుటకుమునుపు - మునుపు - ముందు - మున్ను - తొల్లి.

వ్యా—'పూర్వము' అనువర్థంబుతో సంబంధించినపుడు భావార్థకంబునందు వైకల్పికంబుగా 'కజి' ప్రత్యయంబువచ్చును. ఉ. 'వండకమునుపు, ఇట 'మునుపు' అనునది పురార్థంబు వండుధాతువాయర్థంబుతో సంబంధించినదికావున 'కజి' ప్రత్యయంబుగలిగెను. (వండు + క + మునుపు). జేత్తునకు ముందున్నయుత్వంబునకు నిరువదియవసూత్రంబుచే నత్వంబుగలిగి 'వండక' (వండ్ + అ + క + మునుపు) అయ్యె. ఇట్లే తక్కుంగల యుదాహరణంబులు గ్రహించునది.

37 సూ—వ్యతిరేకభావంబున మిజియగు.

వ్యతిరేక విశిష్టక్రియాభిధాయి ధాతువునకు మిజియగు వండకు - వండమి.

వ్యా—వ్యతిరేకభావార్థంబునందు 'మి, అనునది యగును. అనఁగా వ్యతిరేక క్రియార్థకధాతువునకు 'మి, వర్ణకంబగు. ఉ. 'వండమి, పండమి' ఇచ్చట 'వండు, ధాతువునకు 'మి, వర్ణకంబు రాఁగా జేత్తుగావున నిరుపదియపసూత్రంబున వండుధాతువు నుత్వంబున కత్వంబు రాఁగా 'వండమి (వండ్ + అ + మి) ఇత్యాదు లయ్యె. వండకుండుట, పండకుండుట యర్థంబులు.

38 సూ—సమానాశ్రయంబులం బూర్వకాలంబునందు వర్ణకం బగు.

ఏకాశ్రయంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలికంబగుం దద్వాచియగు ధాతువున కివర్ణకంబగు - ఇదియె క్త్వార్థంబునాఁబడు॥ వండి - పండి - విని - కని ॥ సమానకర్తృకంబులన కసమానాశ్రయంబు లనుటం జేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడిమడిసె నిత్యాది సిద్ధంబయ్యె.

వ్యా—ఈసూత్రంబునందు సమానశబ్దంబునకు నేకత్వంబర్థంబు. అదియె 'ఏకాశ్రయంబులగు' అనెడి మూలవాక్యంబుచే స్ఫుటపఱుపఁబడినది. ఒకవస్తువు నాశ్రయించు క్రియలలో నేది ముందు జరిగినదో యట్టి ముందు జరిగిన క్రియను జెప్పునట్టి ధాతువునకు 'ఇ, వర్ణకంబు గలుగును. ఇట్టి ధాతువును క్త్వార్థకంబని వాడుదురు. ఉ. వండి, పండి' విని' కని, 'దేవదత్తుఁడు వండిభుజించె, ఈవాక్యంబున వండుటయు, భుజించుటయు రెండుక్రియలుగలవు. వీనిలో 'వండుట, మొదటజరిగినది కావున నేఁదదర్థకంబయిన వండు ధాతువుకంటె 'ఇ, ప్రత్యయంబుగల్గి యుపదాదిస్వరనిత్యసంధిచే 'వండి, (వండు + ఇ) అయ్యెను. ఇట్లే 'పండి, ఇత్యాదులందు నూహించునది. సంస్కృతవ్యాకరణంబులో నేకకర్తయే కలిగిన రెండుక్రియలలో ముందుజరిగిన క్రియపైఁ క్త్వాప్రత్యయంబు వచ్చునని 'సమానకర్తృకయోః పూర్వకాలే. అ 3- పా4. సూ 21, అని చెప్పంబడియె. అట్లు తెనుఁగులోఁ జెప్పినచో మూలంబులోనుదాహరించినవాక్యంబునదోషంబుగలుగునని గ్రంథకర్తచే 'సమానాశ్రయంబులని చెప్పంబడియె. చైత్రునిచేత మైత్రుండుకొట్టం

బడిమడిసె, ఈవాక్యంబునందుఁ గొట్టుటయు మడియుటయు రెండుక్రియలుగలవు. కొట్టినవాఁడు చైత్రుండు. మడిసినవాఁడు మైత్రుండు. గాన రెండుక్రియలకుఁ గర్తలు భిన్నులైరి. దానంజేసి మూలంబులో సమానకర్తృకంబులనినచోఁ బైవాక్యంబు సిద్ధింపకపోవును. సమానాశ్రయంబులనినయెడలఁ గొట్టఁబడినవాడును, మడిసినవాఁడును మైత్రుండేకాన మొదటజరిగిన 'కొట్టఁబడు' అనుదానికంటె 'ఇ'ప్రత్యయంబువచ్చును. అనఁగా కొట్టుక్రియయును, మడియుక్రియయును, మైత్రునిమీఁదనే జరిగినదికాఁబట్టి మైత్రుఁడే యాశ్రయంబాయె. సంస్కృతంబులో నీవాక్యంబు తెలుంగునందుంబలెఁ గ్త్వార్థకంబుతో రచింపవలనుపడదు. 'చైత్రేణహతో మైత్రో మమార, అని కర్మార్థకక్త ప్రత్యయాంతంబుతో రచింపంబడును. భాషాశైలినిజేసి వాక్యంబులుతాత్పర్యంబులో నేకంబైనను రచనంజేసి భిన్నంబులగును.

39 సూ—కజివ్యతిరేక క్త్వార్థంబునందగు.

వండక - పండక - కొట్టక - తిట్టక.

వ్యా—వ్యతిరేకక్త్వార్థంబునందు 'కజి, అనునదియగును, 'వండు + క, ఇట్లుండ 'జీత్తుపరంబగునపు డుత్వంబున కత్వంబగు, అను నిరుపదియవసూత్రంబుచే 'వండక, అయ్యె. ఇట్లే తక్కుంగలవి యూహించునది,

40 సూ—తుమర్థ భావలక్షణంబులందును జియగు.

భావలక్షణంబునా నన్యక్రియకు లక్షణభూతంబగు క్రియ - తుమర్థంబందును భావలక్షణంబు నందును ధాతువునకు నజివర్ణకంబగు ॥ తుమర్థంబు - చైత్రుండు వండను బోయెను ॥ పాకక్రియార్థము పోయెనని యర్థము ॥ భావలక్షణము - చైత్రుండు వండనతిథివచ్చెను । ఇచట వంటలక్షణమువచ్చుట లక్ష్యము.

వ్యా—పూర్వోక్తంబైన ముప్పదిథొమ్మిదవసూత్రంబునందుంబలె నీసూత్రంబు

నందలి భావశబ్దంబును ణిప్రత్యయాంతంబైన భూధాతువుకంటె నచ్ప్రత్యయంబు రాఁగా నైనరూపంబని యెఱుంగునది. భావంబనఁగా భావన. అనఁగా గావించుట (చేయుట) క్రియయని పర్యవసానార్థము. తుమర్థంబునందును, భావమందును అనఁగా బ్రసిద్ధంబుగాఁ దెలియంబడు కాలముగలయొక క్రియయజ్ఞాతకాలముగల (తెలియని కాలముగల) వేఱొక క్రియయందలి కాలంబునకు బోధకంబగు. అట్టియప్పుడు ప్రసిద్ధ క్రియావాచకంబగుకంటె నజేవర్ణకంబగును. ఏక్రియనిమిత్తము వేఱొకక్రియజరుగునో యాక్రియతుమర్థంబనాఁబడు తుమర్థంబునకు — చైత్రుండు వండనుబోయెను, ఇట వండుట యనుక్రియనిమిత్తము పోవుటయనుక్రియ జరిగినదికాన వండుధాతువుకంటెఁ దుమర్థమందు నజేవర్ణకంబురాఁగా వండెను, అయ్యె. వంటనిమిత్తమని యర్థము. భావలక్షణమునకు — చైత్రుండు వండనతిథివచ్చెను. ఈవాక్యంబునందు వండుటయు, వచ్చుటయు రెండుక్రియలు గలవు. వీనిలోవండుక్రియ ప్రసిద్ధకాలంబుగలది. సర్వసామాన్యంబుగా నెంతప్రొద్దెక్కినసిమ్మట వండుట యారంభింతురో యట్టికాలంబు సర్వలోకులకుఁ దెలిసినవిషయంబు. అతిథివచ్చునట్టికాలంబు నిరూపింప శక్యంబుకానిది. వండునట్టికాలంబునందు నతిథివచ్చెనన్నచోఁ బ్రసిద్ధంబైన వంటసమయంబునంజేసి యతిథియొక్కయాగమనసమయంబు తెలియ సులభంబగు. కాన బ్రసిద్ధకాలక్రియను (వండుట) దెలియంజేయునట్టి వండుధాతువుకంటె నజేవర్ణకంబుగలిగి వండెన, ఆయినది ఇచట వండుక్రియజ్ఞాపకము (అతిథివచ్చుకాలము దెల్పుచున్నది) (అతిథి) వచ్చుటలక్ష్యంబు. చైత్రునివండుటచే నతిథివచ్చినకాలంబు తెలుపంబడుచున్నది. ఇట్లే కోళ్లుకూయఁగా మైత్రుండేగెను, ఆవులుపిదుకంబడుచుండ దేవదత్తుండు వచ్చెను. ఇత్యాదులూహించునది.

41 సూ—చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు నవర్ణకంబుద్రుతాంతంబగు.

వానలుగురిసినం బంటలుపండును ॥ వాఁడురమ్మనిననఁబోయితిని.

వ్యా—చేదర్థంబునందున్నట్టి భావలక్షణంబునందు ద్రుతాంతంబైనను ప్రత్యయంబువచ్చును. చేదర్థంబనఁగాఁ గార్యకారణభావాదికము. ప్రథమోదాహరణంబునందుఁ బంటలుపండుట కార్యము. (దానికి) వానకురియుట కారణంబు. కావునఁగారణ క్రియావాచకంబైన కురియు ధాతువునకంటె ద్రుతాంతంబైననవర్ణకంబు గలిగె. ద్వితీయోదాహరణంబునందు 'పోవుట' కార్యంబు. (దానికి) వాఁడు రమ్మనుట కారణంబు కావునఁ గారణక్రియావాచకంబైన 'అను' ధాతువుకంటె ద్రుతాంతమైన నవర్ణకంబు గలిగె.

**42 సూ**—ఆనంతర్యంబు నడువర్ణకంబు ద్రుతాంతంబగు.

జాబిలిదోఁతెంచుడుంగువలయలు వికసిల్లె.

వ్యా—అంతరము = ఎడము. అనంతరము = ఎడములేనిది. ఆనంతర్యంబనఁ (అవ్యవధానంబు, తోఁచుచుండ) గారణక్రియావాచకంబుకంటె నకారాంతంబగు డువర్ణకంబగు. ఉ. జాబిలితోఁ తెంచుడుం గువలయంబులు వికసిల్లె. చంద్రుఁ డుదయించిన తత్క్షణమందే కలువలువికసించినవని యర్థము. ఇటఁ గలువలు 'వికసించుటకు జంద్రుఁడుదయించుట కారణంబుకావునఁ దద్వాచకంబైన 'తోఁతెంచు' ధాతువుకంటె ద్రుతాంతంబగు డువర్ణకంబు గలిగె.

**43 సూ**—చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు.

చూచుచుంబోవుచున్నాఁడు - చూచుచుంబోయెను - చూచుచుంబోవఁగలఁడు.

వ్యా—నకారాంతంబైనచువర్ణకంబు క్రియాంతరసంబంధంబునందు వర్తమానార్థంబందగు. (శత్రర్థము) శతృప్రత్యయంబు సంస్కృతవ్యాకరణంబున లట్టునందు (వర్తమానార్థమందు) విధింపఁబడెను. ఉ. చూచుచుంబోవుచున్నాఁడు; చూచుచుంబోయెను; చూచుచుం బోవఁగలఁడు. పైవాక్యంబులలోని 'పోవు' ధాతువుక్రమంబు

గా వర్తమానభూతభవిష్యత్కాలంబుల కుదాహరణంబు. అట్టిక్రియాసంబంధంబు. 'చూచు, ధాతువుకంటె వర్తమానార్థంబునందు నకారాంతంబైన చువర్ణకంబు గలిగె.

44 సూ—తృవర్ణకార్థంబు నందెడి యెడువర్ణ్యయలగు.

ప్రహరించెడివాఁడు - ప్రహరించెడువాఁడు - ప్రహర్తయనియర్థము.

వ్యా—"ణ్వుల్ తృచౌ, అ 3-పా1-సూ133' అనుసూత్రంబునఁ గర్త్రర్థంబునందు ధాతువుకంటెఁదృచ్ప్రత్యయంబు సంస్కృతవ్యాకరణంబునందు విధింపంబడియె. కావునఁ దృవర్ణ కార్థంబునందు (కర్త్రర్థమందు) 'ఎడి, ఎడు' వర్ణకంబులగును. వర్ణ్య వర్ణకశబ్దభవంబు. ప్రత్యయంబనియర్థము. ఉ. ప్రహరించెడివాఁడు; ప్రహరించెడువాఁడు. ఇటఁ బ్రహరించుధాతువు. ఎడివర్ణకంబును, ఎడువర్ణంబును, కర్తయనునర్థంబునవచ్చెను. బ్రహరించుటకుఁ గర్తయనిభావము. ప్రహర్త, తృచ్ప్రత్యయాంతంబు మూలసూత్రంబున తృవర్ణకార్థంబునందు' అనినుడువులంబట్టి తృవర్ణకాంత రూపము' 'ప్రహర్త' నిదర్శనార్థమీఁ బడియె.

45 సూ—వానికిలోపంబు బహుళంబుగానగు.

ప్రహరించువాఁడు - ప్రహర్తయని యర్థము.

వ్యా—'ఎడి, ఎడు' వర్ణకంబులకు లోపంబు బహుళంబుగాఁ గలుగును. ఉ. 'ప్రహరించువాఁడు, ప్రహరించెడువాఁడనియర్థము. ఎడి' ప్రత్యయంబుపుట్టి లోపించినను లుప్తప్రథమైకవచనంబులైన 'వనిత' ఇత్యాదులందుఁ బ్రథమార్థంబువోలె 'కృతసంస్కారోననశ్యతి' అనున్యాయంబున నిటఁగర్త్రర్థంబు లోపింపదు. 'ప్రహరించెడువాఁడు' ఇత్యాదులందలి తచ్ఛబ్దంబు సమాసపరిచ్ఛేదంబులోని తొమ్మిదవసూత్రంబుచేనను ప్రయుక్తంబయ్యెనని యెఱుంగునది.

46 సూ—ఉన్న కలజిన వర్ణకంబులు భవద్భావిశత్రుక్త్వవదర్థంబులందగు.

ఉన్నవర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబునందగు - కలజివర్ణకంబు భవిష్యదర్థకశత్రర్థంబునందగు - నవర్ణకంబుక్త్వవదర్థంబునందగు- ఇవిసత్త్వాభిధానంబునందగునని యెఱుంగునది - సుబంతవాచ్యంబు సత్త్వంబునాఁబడు - వండుచున్నవాఁడు - వండఁగలవాఁడు - వండినవాఁడు.

వ్యా—ఈసూత్రంబునందుఁ గ్రమాలంకారంబూహింపనది. ఉన్న' వర్ణకంబు భవదర్థంబునందును (భూధాతువుకంటె వర్తమానార్థంబునందు శతృప్రత్యయంబుప్పతిల్లగా భవత్, అనియగును. అందున వర్తమానార్థకశత్రర్థంబునందని మూలంబున వివరింపంబడియె.) కలజివర్ణకము భావిశత్రర్థంబునందగును. (భవిష్యదర్థవిహితశతృ ప్రత్యయార్థమందు) మూలంబునవర్తమానార్థకశత్రర్థంబునకు భవత్ అను వర్తమానార్థకశత్రంతము ప్రయోగించినట్టు లిచ్చటఁగూడ భవిష్యదర్థకశతృప్రత్యయార్థంబాదుంగూడ సూత్రంబున 'భవిష్యత్' అనిప్రయోగించి 'భవద్భవిష్యత్క్త్వవదర్థంబులందగు' అని సూత్రింబురచించినచో నధ్యేతలకు (చదువరులకు) సుబోధంబుగనుండును. 'లృటస్సద్వా' అ 3. పా 3 సూ 14. అను సూత్రంబున భూధాతువుకంటె భవిష్యదర్థంబున శతృప్రత్యయంబురాఁగా 'భవిష్యత్' అను రూపంబాయె. నవర్ణకంబుక్త్వవత్ప్రత్యయార్థంబునందగు. నిష్ఠా' అ 3 – పా-2-సూ-102. అను సూత్రంబునఁ గ్తవత్ప్రత్యయంబు భూతకాలంబునందు విధింపంబడెను. సంస్కృతంబులో భూతకాలంబునందుఁ గ్తవత్ప్రత్యయంబువోలె (గతవాన్ = వెళ్లినవాఁడు) తెలుంగునందు భూతకాలంబున నవర్ణకంబు గలుగుననిభావంబు. పైనిఁజెప్పిన ఉన్న, కలజిన' వర్ణకంబులు సత్త్వాభిధానంబునందుఁ గలుగునని తెలిసికొనునది' సత్త్వంబనఁగా' ద్రవ్యము (పదార్థము) ద్రవ్యంబు వాచ్యంబనప్పుడే వచ్చును. ద్రవ్యము (రాముడు, సిరి, జ్ఞానము' ఇత్యాదికము) సుబంతంబుచేఁ జెప్పంబడునుగాన సుబంతవాచ్యంబు సత్త్వంబునాఁబడు' అనిమూలంబున నుడువంబడినది వండుచున్నవాఁడు, ఇట ఉన్న,

ప్రత్యయంబులలో గణింపఁబడి యేడును జెప్పంబడియె. నలువదియాఱవసూత్రంబుచే 14 ఉన్న ర్ కలజి 6 న, వర్ణకంబులు నలువదియేడవసూత్రంబుచే 17 నిజి, వర్ణకంబు. ఇయ్యవి యేడునుగలశబ్దంబులు ధాతుజని శేషణంబులనంబడును.

48 సూ—లకారాదులు సకర్మకంబునకుంగర్తృ కర్మంబులందును లాంతికింగర్తయందునగు.

సకర్మకంబు నాఁగర్మాకాంక్షో త్థాపకంబు - అకర్మకంబునాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు.

వ్యా—లట్టు, లిట్టు, లృట్టు, లాట్టు, లూట్టు, మొదలైనపూర్వోక్త ప్రత్యయంబులు సకర్మధాతువులకుఁ గర్త్రర్థమందును, గర్మార్థమందును; అకర్మకధాతువులకుఁ గర్త్రర్థమందును, గలుగును, సకర్మకంబనఁగాఁ గర్మకుఁ బ్రశ్నంబును గలిగించునది' అకర్మకంబనఁగాఁ గర్మనిమిత్తంబైనశంకను గలిగింపనిది.

49 సూ—పడుజ్యను బంధంబు కర్మంబు నందగు.

కొట్టఁబడుచున్నాఁడు - కొట్టఁబడుచున్నది ॥ కొట్టఁబడుట - కొట్టఁబడనివాఁడు.

వ్యా—కర్మార్థంబునందు పడుజి అనునది ముఖ్యక్రియననుసరించి ప్రయోగింపంబడును. 'ఉ. కొట్టఁబడుచున్నాఁడు' ఇట సకర్మకమైన 'కొట్టు' ధాతువునకు వర్తమానకర్మార్థంబులు వివక్షింపఁబడినప్పుడు రెండవసూత్రంబుచేతను నలువదియొనిమిదవ సూత్రంబుచేతను లట్టురాఁగా నేకవచనవివక్షయందు నెనిమిదవసూత్రంబుచే డుజ్వర్ణకంబును, ప్రకృతసూత్రంబునఁ గర్మార్థంబున 'పడుజి' యు, ధాతువునకుఁ గలిగె (కొట్టు + పడు + డు) 'పడుజి' జిత్తుగావున నిరువదియవసూత్రంబుచే ధాత్వాత్వంబున కత్వంబును, కలజి, పడుజ్జులు' అనిన యిరువదియొకండవసూత్రంబుచే ధాతువునకు నుగాగమంబును గలుగ కొట్టక్ + పడు + డు, ఇట్లుండె. డుజ్జులడాదేశంబు

గావునఁ బదుమూఁడవసూత్రంబుచే 'ఉన్నా' నుబంధంబును బదునాల్గవసూత్రంబుచే 'ఉన్న' శబ్దంబునకు దీర్ఘంబును, 'కొట్టక్' అనునది ద్విప్రకృతికంబుగావున సంధి పరిచ్ఛేదంబునందలి పదునాఱు పదునేడుసూత్రంబులచే ద్రుతనిమిత్తకకార్యంబును రాఁగా 'కొట్టఁబడుచున్నాఁడు' అనినవిశిష్టరూపంబు సెలయుచుండు. 'కొట్టఁబడుచున్నది' ఇటఁ బదునేనవసూత్రంబులో 'దిపితరంబ'నుటచే 'ఉన్న' కు దీర్ఘంబు రాలేదు. పండ్రెండవసూత్రంబుచే నమహదర్థంబునందు 'ఉన్న' శబ్దంబుకంటె 'ది' వర్ణకంబు గలిగె. 'కొట్టఁబడుట' ఇటఁ గర్మార్థమందుఁ బ్రకృతిసూత్రంబుచే 'పడుజి' అనుబంధంబును, క్రియార్థంబునందు ముప్పదియేడవసూత్రంబుచే 'ట' వర్ణకంబునుగలిగె. 'కొట్టఁబడనివాఁడు' ఇట వ్యతిరేకకర్త్రర్థంబున నలుబదియేడవసూత్రంబుచే 'నిజి' వర్ణకంబు రాఁగా నిరువదియవసూత్రంబుచే 'నిజి' జిత్తుగావున 'పడు' యొక్క యుత్వంబున కత్వంబుగల్గె. 'ఎడి', ప్రత్యయంబు మొదలు 'నిజి' ప్రత్యయంబువఱకు చెప్పినవంతయుంబున, గలవి ధాతుజవిశేషణంబులు గావున సమాసపరిచ్ఛేదంబులోనితొమ్మిదవసూత్రంబుచే (ప్రథమ) విభక్తివివక్షయందు 'వాఁడు' అనిన తచ్ఛబ్దం బనుప్రయుక్తంబయ్యె.

60 సూ.—గురువిరహితంబులయియయాంతంబులయిన యేకస్వరద్విస్వరంబులయించుగ్వక్రంబులకియు డాగమంబువిభాషనగు.

ఏకస్వరధాతుద్వ్యస్వరధాతువులమీఁదియించుగ్వక్రంబులకియు డాగమంబు విభాషనగు - గురుమంతంబగు ధాతువునకును యాంతంబగుధాతువునకునుమీఁది యించుగ్వక్రంబులకియు డాగమంబురాదు ॥ భుజ్ - ఇయ్ - ఇంచు - భుజియించు - పక్షంబున - భుజించు ॥ గుణ - ఇయ్ - ఇంచు - గుణియించు - గుణించు - ఇంచుగ్వ్యవధానంబునం జేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లేవనియెఱుంగునది ॥ యాచ్ - అర్థ - ఇత్యాదులుగురుమంతంబులు ॥ వ్యయ - ఇదియాంతము - యాచించు - అర్థించు - వ్యయించు ॥ జి - ఇంచు - అనుచోనిత్యంబగుటంజేసియయుగాగమంబురాఁగా యాంతంబగుటంజేసి యియుడాగ

మంబు లేదనియెఱుంగునది ॥ కృతాకృతప్రసంగిసత్యంబునాఁబడు ॥ నగు - ఇయ్ - ఇంచు-నగియించు-నగించు ॥ నగు - ఇయ్ - ఎను - నగియెను - నగెను ॥ పడు - ఇయ్ - ఎను - పడియెను - పడెను - ఇత్యాదులెఱుంగునది.

వ్యా—గురువర్ణకంబులు లేనియట్టియు (శ్లో॥ సానుస్వారో విసర్గాంతో దీర్ఘో యుక్తపరశ్చయః । గురుమేతం విజానీయాదన్యే తులఘునస్మృతాః ॥ అన్నరీతిచేదీర్ఘము, పూర్ణబిందువు, విసర్గము, హల్లులకూడికకుఁ బూర్వాక్షరము గురువగు) యకారాంతంబులు కానియట్టియు, ఏకాచ్కు (ఒకయచ్చుగలిగిన) ధాతువులకును, పూర్వోక్తధర్మంబులం గలద్వ్యచ్కు (రెండచ్చులుగలిగిన) ధాతువులకును, అంత్యంబైనయించుకు౯నకును, వక్రంబులకును (ఏ, ఓ) ఇయుడాగమంబు విభాషనగు. గురువర్ణంబులుగల ధాతువులయొక్కయు, యకారాంతధాతువులయొక్కయు, ఇంచుగ్వక్రంబులకునియుడాగమంబుగలుగదు. 'భుజ్' ఇది సంస్కృతధాతువు ఆఱువదిమూఁడవసూత్రంబుచే నించుకు౯గలుగఁగా 'భుజ్ + ఇంచు' ఆయ్యెను. (ఇంచుకు౯కిత్తుగావున ధాత్వంతంబునందుఁ గలిగె) 'భుజ్' అనుధాతువు గురువులేనిదియు, యకారాంతంబుకానిదియునై యొక యచ్చుకలదికావున (ఉకారము) దీనికంటెఁ బరంబైనయించుకు౯నకు నియుడాగమంబుగలిగె. ఇయుట్ టిత్తుగావున నించుకు౯నకు బూర్వమందువచ్చె. భుజ్ + ఇయ్ + ఇంచు = భుజియించు ఇయుట్టు వైభాషికంబుగావునఁ బక్షంబున నించుగాగమంబుమాత్రంబేకలిగి 'భుజించు' అయ్యె. 'గుణ' ఈశబ్దంబు రెండచ్చులుగలది. ఆఱువదిమూఁడవసూత్రంబుచే దీనికి నించుకు౯గలుగంగ 'గుణ + ఇంచు' అనియుండె, ఈధాతువు గురువర్ణంబులేనిదియు, యకారాంతంబుకానిదియుఁగావునదీనియించుకు౯నకు నియుడాగమంబురాఁగా 'గుణ + ఇయ్ + ఇంచు' అనియయ్యె. అపవాదిస్వరనిత్యసంధిచే నియుడాగమంబు పరంబగుచుండ 'గుణియించు' అయ్యెను. పక్షంబున 'గుణించు' సంస్కృతధాతువనకును, ప్రత్యయసంబంధమైన వక్రిమంబునకును,మధ్యనియుడాగమంబెడమాటచేత సంస్కృతధాతువునకు వక్రంబెదురొట్ట సంభవింపదు. 'యాచ్' దీని యందు దీర్ఘంబుండుటంజేసి గురుమంతంబు. 'అర్థ' రేఫథకారసంయోగంబుచేతఁబూర్వం

బునందున్న అకారము 'సంయోగే గురు' అనుసూత్రంబున గురువుకాఁబట్టి 'అర్ఘ' శబ్దంబు గురుమంతంబయ్యె. 'వ్యయి', ఇట్టి గుర్వక్షరంబుతోను, వంత్యకారంబుతోను నున్న ధాతువులను సూత్రంబున నిషేధింపంబడినందున నియుడాగమంబు రాదు. యాచించు, అర్ఘించు, వ్యయించు, 'జి + ఇంచు, జిధాతువునకు నలువదిమూఁడవసూత్రంబుచే నించుక్కు రాఁగా నలువదినాల్గవసూత్రంబుచే ధాతువునకు నయుగాగమంబుకల్గి 'జి + అయ్ + ఇంచు, అయ్యె. అపదాదిస్వరనిత్యసంధిచే 'జయ్ + ఇంచు, అయ్యె. ఇప్పుడు 'జయ్' అనునది యాంతంబుగావున నియుడాగమంబు రాదు కావున నేఁబది యవసూత్రంబుచే నించుక్కునకు నియుడాగమంబు రాదు జయించు.

ఇంచుక్కునకు నియుడాగమంబు చేసినను జేయకున్నను జిధాతువునకు నయుక్కు రావచ్చును. అయుక్కు చేసినపిమ్మట 'జయ్, అనునది యాంతంబు గావున నించుక్కునకు నియుడాగమంబు రాదు. కనుక నియుడాగమంబు నిత్యంబుగాదు. అయుగాగమంబు నిత్యంబు' ఇటువిచారణీయాంశంబించుక కలదు గురువర్ణంబు లేనియట్టియు, యకారాంతంబు గానియట్టియు, ఏకస్వరధాతువుమీఁది యించుక్కునకు నియుడాగమం బేఁబదియవసూత్రంబుచే విధింపంబడియె. అలువదినాల్గవసూత్రంబుచే నికారాంతమైనధాతువునకు నించుక్కు పరంబైనపుడు, అయుగాగమంబు విధింపంబడినది. ప్రకృతంబున నలువదిమూఁడవసూత్రంబుచే జిధాతువునకు నించుక్కు రాఁగా 'జి + ఇంచు, ఇట్లుండె. ఏఁబదియవసూత్రంబుచే విహితంబైన యియుడాగమంబు 'భుజియించు, ఇత్యాదిధాతువులందు నయుగాగమంబు రానిస్థలంబులయందు సావకాశంబైనది. ఏఁబదియవ సూత్రంబులోని యియుడాగమంబు వైభాషికంబుగావున నట్టియాగమంబు రానిచో నిర్బాధంబుగా 'జయించు, అనుచోట నయుగాగమంబును సావకాశంబైనది. ఇయుడాగమంబు వైభాషికంబైనను, అయుగాగమంబు ప్రాప్తించుచోటుల (జి + ఇంచు, ఇత్యాదుల) నియుడాగమంబునకు సమావేశంబు కలుగవచ్చునా లేదా యన్న సంశయంబున మానసంబు డోలాయితంబగుచున్నయది. ఒకలక్ష్యంబున రెండుశాస్త్రంబులకుఁ బ్రాప్తి కలుగుచున్నప్పుడు శాస్త్రద్వయంబులో నేది ప్రవర్తింపవలెనో నిర్ణయించుటకై యీక్రిందిచెప్పనట్టి పరిభాష సంస్కృతవ్యాకరణశాస్త్రీయ పరిభాషేందుశేఖరంబున రాజిల్లుచున్నయది. ఇయ్యది తెలుఁగునకును నవతరింపఁ

చేయవలెను. 'పూర్వపరనిత్యంతరంగాపవాదానా ముత్తరోత్తరఁబలీయః', అర్థంబు. భిన్నస్థలంబులయందు సావకాశంబులైనశాస్త్రంబులకు నొక్కచో సమావేశంబు కలుగునేని పూర్వశాస్త్రంబునకన్నఁ బరశాస్త్రంబును, పరశాస్త్రంబునకన్న నిత్యశాస్త్రంబును, నిత్యశాస్త్రంబునకన్న నంతరంగశాస్త్రంబును, బలీయంబులు. అపవాదశాస్త్రంబన్నింటికంటె బలిష్ఠము. వాస్తవంబున నాలోచించితిమేని ప్రకృతోదాహరణంబునఁ బూర్వపరత్వవిచారణచేతనే సాధీయంబగును. కావున నదివివరింపఁబడుచున్నది. తక్కుంగలవి యీయాంధ్రవ్యాకరణంబున వివరింపనావశ్యకంబులు. 'జి + ఇంచు', అనియుండఁగా భిన్నస్థలంబునందు సావకాశంబులైనయియుడాగమాయుగాగమంబులిచ్చటఁ బ్రాప్తించుచున్నవని చూపఁబడియె. ఇయుడాగమ విధాయకశాస్త్రం బేఁబదియవసూత్రంబనియు, అయుగాగమవిధాయకశాస్త్రం బలువదినాల్గవదియనియు నిదివఱలోనే గణియించిచూపఁబడియె. ప్రస్తుతలక్ష్యంబున నేఁబదియవసూత్రంబుచేఁ బ్రాప్తించుచున్న యియుడాగమంబు నలువదినాల్గవ సూత్రంబుచేఁ బ్రాప్తించుచున్న యయుగాగమంబుపరంబై పూర్వోక్తపరిభాషచే బాధించి ప్రవర్తించును. ఇపుడు 'జయ్ + ఇంచు' అనియుండు, ఇట్టిస్థితియందు 'జయ్' అనునది యాంతంబుగావున నేఁబదియవ సూత్రంబుచే నియుడాగమంబునకుఁ బ్రాప్తియేలేదు. ఒకవేళ ప్రాప్తికి నవకాశంబున్నను బాధింపఁబడిన శాస్త్రంబునకు 'సకృద్గతౌవిప్రతిషేధేనయద్బాధితం తద్బాధితమేవ' అనున్యాయంబుచేఁ దిరిగి పునరుజ్జీవనంబు కలుగదనియే సామాన్యంబుగా శాస్త్రకారుల సిద్ధాంతంబు. ఇట్లుశాస్త్రంబులకుఁ బూర్వత్వపరత్వ విచారణచేతనే యయుగాగమంబు సిద్ధించియిష్టసిద్ధి కలుగుచున్నతఱి శాస్త్రనిత్యత్వపర్యంతానుధావనంబు నిరర్థకంబనియే మామకాశయంబు. ఇంతియకాక నిత్యశాస్త్రంబు పూర్వంబైనప్పుడే 'కృతాకృతప్రసంగినిత్యం' అనునట్టిపరిభాషయొక్కయవతరణంబు న్యాయంబుగాని పరశాస్త్రంబు నిత్యంబైనచో నవసరంబులేదు. అయినను 'ద్విర్బద్ధంసుబద్ధంభవతి' అను న్యాయ్యంబున నయుగాగమశాస్త్రం బియుడాగమశాస్త్రంబుకంటెఁ బరమాటయుకాక నిత్యంబును నయిబలిష్ఠమైనదని సూచించుటకై నిత్యత్వవిచారణ నీయెడ గ్రంథకర్తచేఁ జేయఁబడినది. కృతాకృతప్రసంగియననర్థంబేమనఁగా, (కృతేనఅకృతే చ ప్రసంగి కృతాకృతప్రసంగి) అన్యశాస్త్రంబుచేత లక్ష్యంబు

సంస్కరించినను, సంస్కరింపకున్నను వేఱొకశాస్త్రంబునకుఁ బ్రసక్తిగలిగినచో నట్టి ప్రసక్తిగలశాస్త్రంబు నిత్యంబని వ్యాకరణశాస్త్రంబున వ్యవహరింపంబడు, 'జి + ఇంచు' అనిన యియుడాగమరహితస్థితిలో నలువదినాల్గవసూత్రంబుచే జిధాతువునకు నించుక్కు పరంబైనది కావున నయుగాగమంబు రావచ్చును. ఒకవేళ యేఁబదియవసూత్రంబుచే నియుడాగమంబు చేయఁగా 'జి + ఇయ్ + ఇంచు' అనునప్పుడుకూడ నయుగాగమంబు జిధాతువునకు రావచ్చును. కొందఱు 'జి + ఇయ్ + ఇంచు' అనిన యిట్టిస్థితిలో జిధాతువునకు నియుడాగమంబు పరంబైనదికాని జిధాతువునకు నించుగాగమంబు పరంబుకాలేదనియు, ఇంచుగాగమంబు పరంబైనప్పుడే యలువదినాల్గవసూత్రంబున నయుగాగమంబు విధింపఁబడినందున నియుడాగమపరత్వంబులో నయుగాగమంబు రాదనియు, అందున నిత్యత్వలక్షణంబు సరిపడదనియు నాక్షేపింతురు. అట్లనవలదు. ఇయుడాగమంబు టిత్తుకావున 'అద్యంతౌటకితౌ' అనుసూత్రంబున నించుక్కునకు నాదిమావయవంబై చేరినది. అనయుని యించుగాగమంబును, దానియవయవం బియుడాగమంబును గాఁబట్టి యియుడాగమవిశిష్టంబైన యించుగాగమమందు (ఇయ్ + ఇంచు = ఇయించు) ఇంచుక్త్వధర్మంబు రా సులభంబు. గడువు (కంతి) దేవదత్తునికి మధ్యేకాలంబున నుత్పన్నంబైననుగడువిశిష్టునియందే దేవదత్తత్వవ్యవహారంబునియంబైనట్లు ఇంచుగాగమంబునకు మధ్యకాలంబున నియుడాగమంబుత్పన్నంబైనను, ఇయుడాగమ విశిష్టంబునందే యించుక్కుధర్మంబు 'యదాగమాస్తద్గుణీభూతాస్తద్గ్రహణేనగృహ్యంతే' అనినలోకన్యాయసిద్ధ సంస్కృతవ్యాకరణీయపరిభాషయొక్క యవతరణంబున నప్రతిహతంబై యుండు. కావున 'జి + ఇయ్ + ఇంచు' అనియుండఁగా నలువదినాల్గవసూత్రంబునన యుగాగమంబునకుఁ బ్రాప్తిగలదు. అందున నయుగాగమశాస్త్రంబు నిత్యంబునాబడు. పూర్వోక్తంబైన 'పూర్వపరనిత్య' అనుపరిభాషచే జిధాతువునకు నించుక్కుపరంబగుచుండ ననిత్యంబైన యియుడాగమంబును దొలఁగించి నిత్యంబైన యయుగాగమంబుచేసిన పిమ్మటను 'జయ్' అనునది యకారాంతంబయ్యె. కాననిప్పుడియుడాగమంబురాక 'జయించు' అనురూపంబు సిద్ధించునని గ్రంథకర్తృభావంబు. 'నగు' ధాతువునకు డెబ్బదియవసూత్రంబుచేఁ బ్రేరణంబున నించుక్కురాఁగా 'నగు + ఇంచు' ఇట్లుండె నగు ధాతువు గురుపూర్వంబును, అంత్యయకారపూర్వంబును నైద్వ్యస్వరధాతువు కాఁబట్టి దీని.

కంటెఁ బరంబైనయింముకునకు నియడాగమంబురాఁగా ⸤నగియించు, (నగు + ఇయ్ + ఇంచు) అయ్యెను. ఇయుడాగమంబువైభాషికంబుగావున రూపాంతరంబు నగించు నగుధాతువునకంటె భూతంబునలిట్టురాఁగాఁ బ్రథమపురుషైక వచనవివక్షయందు నెనిమిదవసూత్రంబుచే లకారంబునకు డుజుగలిగి ⸤నగు + డు, ఇట్లుండె. పదునాఱవ సూత్రంబున డుజునకు ⸤ఎను, వర్ణకంబుగలిగి ⸤నగు, + ఎను, అయ్యెను. ఇప్పుడేఁబది యవసూత్రంబుచే ⸤ఎను, వర్ణకంబుయొక్క వక్రంబునకు (ఎకారంబునకు) ఇయుడాగ మంబుకలిగి ⸤నగియెను, అను రూపంబు సిద్ధించెను. ఇయుడాగమంబు పాక్షికంబు గావున రూపాంతరంబు. ⸤నగెను, ఇట్లే ⸤పడెను, పడియెను, ఇత్యాదులంను సూత్రి ప్రక్రియయూహించునది. మూలంబున ద్విస్వరధాతువుల కనుటంజేసి ⸤శయనించు, ఇత్యాదులయందు నియుడాగమంబు రాదని యెఱుంగునది.

51 సూ—పడ్వాదులనవర్ణకంబున కత్వంబునుగడపహల్లునకుద్విత్వంబునువిభాషనగు.

పడ్డ - పడిన - పడ్డను - పడినను ॥ పడు - ఇడు - చెడు - తగు - అను - కను - కొను - తిను - మను - విను - చను - ఇవిపడ్వాదులు.

వ్యా—పడుమొదలైనధాతువుల నవర్ణకంబునకు, అత్వంబును, కడపటి హల్లునకు ద్విత్వంబును వైకల్పికంబుగానగును. ఉ. పడ్డ - పడిన - పడ్డను - పడినను - ⸤పడు, ధాతువు. దీనికంటె నలుపదియవసూత్రింబున భూతార్థంబు నందు నవర్ణకంబును, (పడు + న) పదునేడవసూత్రింబున ధాతువునకిగాగమంబును రాఁగా ⸤పడి + న, అయ్యె. ప్రకృతసూత్రింబున నవర్ణకంబునకత్వంబును, డకారంబు నకు జడ్డయు రాఁగా ⸤పడ్డి + అ, అయ్యె. ఇప్పుడపదాదిస్వరనిత్యసంధిచే ⸤పడ్డ, అను రూపంబేర్పడె' అత్వద్విత్వంబులు వైభాషికంబులుగావున నయ్యవిరానిచో ⸤పడిన, అనురూపంబయ్యె. ⸤పడు, ధాతువునకంటె నలుపదియొకండవసూత్రింబుచే ద్రుతాంతంబైన నవర్ణకంబురాఁగా ⸤పడు + నను, అయ్యెను. పదునేడవసూత్రింబున ధాతువున

కిగాగమంబు రాఁగా ఁపడినను, అనురూపంబయ్యె. ప్రకృతసూత్రంబున నవర్ణకంబునే కత్వంబును, డకారంబునకు జడ్డయు రాఁగా ఁపడ్డిః అను, అయ్యెను. అపదాదిస్వర నిత్యసంధిచే ఁపడ్డను, అయ్యె. ఇట్లే ఁఇడు, చెడు, తగు, అను, కను, కొను, తిను, మను, విను, చను, మున్నగు ధాతువుల యందు రూపంబు లూహింపునది. శా॥ ఇంకొక్కఁడు గలండు నాకుఁ బగతుండీనూతులోకంబులం । గింకం దానొకరుండు గల్చ కడిమిం గీర్తింపఁబడ్డాఁడు, ఉ. హరి. (ఎఱ్ఱాప్రెగ్గడ) ఁకీర్తింపఁబడ్డాఁడు, దీని ప్రథమ రూపంబు. ఁకీర్తింపఁబడినవాఁడు, ప్రకృతసూత్రంబున నవర్ణకంబున కత్వంబును, డకారంబునకు జడ్డయు రాఁగా ఁపడ్డవాఁడు, అయ్యెను. ఈరూపంబున నవర్ణకస్థానీయంబైన అకారంబు నవర్ణకంబువంటిది కావున దీనికంటెఁ బరంబైన తచ్ఛబ్దవకారంబునకు నూటపదునేడవ సూత్రంబుచే లోపంబుగల్గి ఁపడ్డాఁడు, అనురూపంబయ్యె. ఁతగినవాఁడు, అనురూపంబునకు ఁతగ్గవాఁడు, అనురూపాంతరంబుండునుగాని ఁతగ్గాఁడు, అనునది యనభిధానంబున నుండదు.

52 సూ — క్రియాఫలంబు కర్తృగామియగుచోఁ గొనుధాతువను ప్రయుక్తంబగు.

ఇదియె యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు — వండుకొనుచున్నాఁడు.

వ్యా— ఁవండుట, మొదలైన క్రియలయొక్క ఫలంబు కర్తనుబొందిన యెడల ఁకొను, ధాతువు ముఖ్యధాతువు ననుసరించి ప్రయోగింపబడును. ముఖ్యక్రియతో ఁకొను, ధాతువును మేళగింపుటయే యాత్మనేపదార్థంబని వాడుదురు. ఁవండుకొనుచున్నాఁడు, అనుక్రియకు దేవదత్తుఁడు కర్తయని యూహింపవలెను. ఁవండు, క్రియయొక్క ఫలంబైన భోజనాదికంబు దేవదత్తునకే చెందినట్లు సూచింపఁబడుచున్నది. దేవదత్తుఁడు తనభోజనంబునిమిత్తము వండునప్పుడే యిట్లు చెప్పవలెను. ఇచ్చట వండుక్రియయొక్క ఫలము కర్తయైనదేవదత్తుఁడు భుజించుటయుకాని, ఁఫలవ్యాపారయోర్ధాతుః, అనుచోటఁ జెప్పఁబడినవంట (విక్లిత్తి) కాదు (కారకపరిచ్ఛేదంబు

నందలి ద్వితీయసూత్రవ్యాఖ్యయొద్దఁ జూచుకొనునది.) ఈసూత్రంబున నిట్లు పెద్ద లచే సిద్ధాంతీకరింపఁబడినది. (శ్లో॥ యస్యార్థస్యప్రసిద్ధ్యర్థమారభ్యం తేపచాదయః।తత్ప్రధానంఫలం తేషాంనపచాదిప్రయోజనం, అర్థము—ఏఫలంబు (భోజనరూపమైనది) ముఖ్యముగా సిద్ధించుట నిమిత్తము పాకక్రియాములారంభింపఁబడునో యాఫలము (భోజనరూపమైనది.) పాకక్రియాదులకు ముఖ్యంబైన ఫలమగును. పచాది (పచా + ఆది=పాకముమొదలైనది=విక్లిత్తి ప్రయోజనముకాదు.

53 సూ—కొనుధాతువుపరంబగునపు డిగాగమంబుబహుళంబుగానగు.

వండికొనియె - వండుకొనియె ॥ బహుళంబనుటచే యాంతంబునకునిత్యంబు - చేసికొనియె.

వ్యా—కొనుధాతువు పరంబగునపుడు ధాతువున కికారంబుబహుళంబుగాఁ గలుగును. 'వండు' ధాతువున కాత్మనేపదార్థమందు 'కొనుధాతువనుప్రయుక్తంబయ్యె. (వండు + కొను) ప్రకృతసూత్రంబున 'కొను' నకుఁ బూర్వమందున్న వండున కిగాగమంబుగలిగి యపదాదిస్వరనిత్యసంధిచే 'వండికొనియె' అయ్యె. భూతార్థకంబైన 'ఎను' వర్ణకంబుయొక్క వకారంబు (ఎ) పరంబగుమండ నేఁ బడియవసూత్రంబున 'కొను' వకియుడాగమంబు. (ఇగాగమంబునకు—చ॥ గూ॥ డికొనినఁ జూచి యంతయు వడికి జనుడెంచిరి ధర్మసూనుపాం॥ తకు' భార—కర్ణ-1ఆ. బహుళగ్రహణంబుచేత యకారాంతధాతువునకు 'కొను' పరంబగునపుడు నిత్యంబుగ నిగాగమంబగు 'చేసికొనియె, ఇట 'చేయు' ధాతువుయాంతంబు. నిత్యంబుగా నిగాగమంబురాఁగా నేఁబది నాల్గవసూత్రంబుచే యాకుసకారంబు. (చేసికొని, చదువుకొని' ఇత్యాదిక్త్వాంతంబులకు బదులుగా 'చేసుక, చదువుక' ఇత్యాదిక్త్వాప్రత్యయాంత సంగ్రహరూపంబు లనంతామాత్యతిమ్మకవ్యప్పకవ్యాదిలాక్షణికులచేఁ దమగ్రంథంబులయందు వాడఁబడినవి.

రూపంబు మాత్రింబున నిరూపింపంబడలేదు క॥ యరలవలంతస్థలు నా౯ బరఁగును శషసహలం బేలఁబడు నూష్మలనన్ | సారసిత్తు కారము గూడుక! సరి నేఁబదియయ్యె వర్ణ సంఖ్యాకరిత్రిన్.' అనంతునిఛందము, క॥ శమితాఘుకర్మధారయ| సమసనమునఁ దుదినిగొ యుత్త్ర సంధిల్లెనుశో| ద్దనులు వికృతిబొల్లుటకారము పట్టుక సంధిఁ జెందుఁ బ్రాయము తోడన్, అప్ప-5ఆ. క॥ మగువయనిశము సిరులన్| బాదుకొనినృపతితిలకం| బాదుక రాఁబిరుసుమండె నంతగణంకన్' రుక్మి-1ఆ. చ॥ తనకెవడైన బాలునిఁ బొర్చుక మల్లనె గొల్లలిండ్లకుం| జని, రుక్మి-2ఆ. చ॥ కదిసి రయోక్తపాశములు గట్టిగఁ బట్టుక యీఁడెమిఁదికిన్| రుక్మి-3ఆ తే॥ గీ॥ అండజేరుకనిల్చినకొండలనఁగ| నిసుకతిన్నియములు సొంపెసఁగెనటు' రుక్మి-4ఆ. చ॥ వలయుసమూహముల్ పదములన్వెనఁ బట్టుక వచ్చెనిచ్చగన్' రుక్మి-5ఆ. ఆ॥ వె॥ వెలఁదిచేతినిడెయు విభునకునిప్పించి| విభునిచేత విడెమువెలఁది కొనఁగ| జేసికల్లపనులు చెప్పకయుండారుల్ | మాసరింప్ల కొనమాని నట్లు' రుక్మి 5ఆ. తోటకము॥ ఘుంమకబుస్సన మ్రోఁగుచువాఁడిన్| మించినపాముల మేచ్చులుకేకెన్' అచ్చ-యుద్ధ-కాం. క॥ మందోదరిత్రా | మ్ముశిపట్టుక తెచ్చెనాని ముందఱనిలిపెన్' అచ్చ-యుద్ధ-కాం. క॥ కొమ్ములఁగూడుక ద్రొవ్విరి| కొమ్ములపైని. శివ-1ఆ. మ॥ కలకంఠంబులు శారికల్ శుకములుం గాఢంబముల్ భృంగముల్ | బలముల్ గూడుక జెందునంటి' శివ-1ఆ. మ॥ గొరకం బట్టుక క్రొలఁగాఁడలంచి తీర్పొట్టి కందర్పసం| హరుఁ జక్రాయుధుఁ బన్నగాంగదను సువ్యక్తేజు శ్రీరాముని| వ్వనిఁగాఁ జూచెదవు' భాస్క-అర-కాం. చ॥ నలఁబడి చిక్కుటొండె నల్లవన్నక పోవుట యొండెఁగాక' పంచ-సుహ్న. మ॥ శరధుల్ చుట్టుక మామక్షహత్య మునకా జన్మస్థలిన్ బ్రాలుమన్' జైమి-7ఆ. చ॥ నీపయిన్| మిగులఁగనాగ్రహించి బోమిన్నినుగట్టుక పోయి ధర్మశా ! త్ర్యకరువులైన శంఖలిఖితద్విజ వర్యులచేతికిమ్మనెన్, జైమిని- 4 ఆ. సీ॥ 'ఒగి నేఁఉతలపోది యొం పెద్దఁగట్టుక శివుఁను మాతోఁగృషిసేయఁగలడె' పట్టా, 1ఆ. చ॥ తపమణులన్నియు న్మనుముదంబలరార సురల్వారించిరం| చుసబరించి మేరు| గిరి చుట్టును జుట్టుకయాక్రమించెనో' పట్టా-1ఆ. క॥ 'ఖైమిపయిమనను నిల్పినఁ

గాముడుకోపించి యిటకుగదుముకరాఁగా, పట్ట్భ-4ఆ. క॥ 'అరాజుకళయుఁ గనుఁ గొని। వారిజముఖి తనదుమోమువంచుక యున్నక్, పట్ట్భ-నల-4 ఆ. సీ॥ సుత్రాము బట్టి యీడ్చుకవచ్చి యిట వేలఁగట్టింతుమే యొక్క గడియలోన, రాజశే-2ఆ. ఉ॥ 'గుచ్చుకపోఁబనేసెఁ బువ్వుఁగోలఁగుభృత్తిలక్ష్యంబునట్టె, రాజశే-2ఆ. సీ॥ 'అదియును గాక ఘనంతయుఁ గాలిపట్టుకరాఁదొడంగె నీవికృతియేల' రాజశే-3ఆ. సీ॥ 'కొంగ వాల్నఱకులం గళులఁబట్టుక జబ్బలంటఁ గుట్టెడవెజ్జునరయువారు, ఆము-6ఆ. క॥ 'కళ లంటిముద్దుబెట్టుక, హంస5ఆ. తే॥ గీ॥ 'ఆకసముతూటు వొడుచుకయైనఁ జనును హంస-4ఆ. ఉ॥ అహం। కారము మీఱఁగంకణము గట్టుక యుండెను నిష్ఫలజ్ఞునం। డౌగ, సుభ-3ఆ. సీ॥ 'గట్టులయొకిమీఁదుగన్న వాల్గంటిని జెట్టపట్టుక యేలినట్టి గిట్ట, ఆంధ్రభా-స్వర్గవర్గము.

54-సూ.—ఇకారవక్రంబులు క్త్వంబులందలివి పరంబులగు-చో యా-కును సకారంబగు.

చేయు - చేసిరి - చేసి - చేసికొను - చేసెను - చేసెడిని - ఇత్యాదులెఱుంగునది.

వ్యా—పూర్వసూత్రంబులయందు విధింపంబడిన ఇకారవక్రింబులు పరంబగు-నప్పుడు పూర్వంబునందలి యాకుసకారాదేశంబగు. ఉ. చేసిరి. ఇట 'చేయు + లిట్, అనియుండఁగా నెనిమిదవసూత్రంబుచేత బహువచనవివక్షయందు. రువర్ణకంబాదిష్టంబై 'చేయు + రు, అయ్యె. పదునేడవసూత్రంబున ధాతువునకిగాగమంబురాఁగా 'చేయి + రు, అయ్యె. 'ఇకారంబుమీఁది, అను తత్సమపరిచ్ఛేదంబునందలి యిరువదియారవసూ-త్రంబుచేఁ గ్రియావిభక్తి యుత్వంబున కిత్వంబుగల్గి 'చేయి + రి, అయ్యె. ప్రకృతసూ-త్రంబున యాకు సకారాదేశంబు చేసిరి 'చేసి, ఇత్యాద్యుదాహరణంబులయందు యాకు సాదేశంబు తెలిసికొనునది. అనుప్రయుక్తమైన కొనుధాతువునకు భావార్థకరూపంబు

కోలు, అనియగును. ఉ. ఇచ్చకోలు, పుచ్చుకోలు. ఆధునికకృతులం గొండొకచో భావార్థంబునను యీకు సకారంబు గానంబడియెడి. అయ్యది యవిచారమూలకంబు ఉ. శ్రీసతిచన్నుఁ గ్రేవలను జెక్కులనొక్కుటఁ బత్రిభంగముల్ । వ్రాసుటకున్విరించి నిటలంబుల నొక్కుట భావ్యవర్ణముల్ । వ్రాసుటకున్జతుర్భుజవిలాసము పూనినవేల్పు సత్కృపో । ల్లాసమెలర్పఁ బ్రోచుశుభలక్షణుఁ గొప్పులనల్లభూవరుల్. రా జరాజాభిషేకము. 1ఆ.

55 సూ—నువర్ణకంబుపరంబగునపుడన్వాదులకుత్వలోపంబేని నుస్థానంబునబిందువేనివిభాషనగు.

అన్చున్నాఁడు-అంచున్నాఁడు - అనుచున్నాఁడు ॥ అన్చును — అంచును - అనుచును ॥ అను - కను - కొను - తిను - మను - విను ఇవియన్వాదులు.

వ్యా—చువర్ణకంబు పరంబగునపుడు ‹అను› మొదలైనధాతువులయొక్క ఉత్వంబునకు లోపంబుగాని ‹నుఁ› వర్ణస్థానంబున నిందుసున్నగాని వైకల్పికంబుగా నగును. ఉ. అన్చున్నాఁడు. ఉకారలోపంబు. ‹అంచున్నాఁడు› నువర్ణంబునకుఁ బూర్ణబిందువు. ‹అనుచున్నాఁడు› బిందులోపంబులు వైభాషికంబులుగావునఁ బ్రకృతరూపము. ఇట్లు ‹కొను› తిను› ఇత్యాదులయందు గ్రహించునది. 'చను, పూను' ధాతువులకుఁ గూడఁ బ్రకృతసూత్రంబున నుత్వలోపపూర్ణబిందువులు వచ్చునేమోయని శంకించుకొని కొందఱనభిధానంబునఁ బూర్వోక్తధాతువులకు నక్కార్యంబులు రావని నిషేధించిరి. అహోబలపతి 'పూను' ధాతువునకుఁ బ్రేరణార్థక చుక్కుపరంబగునప్పుఁ డక్కార్యంబులు రానొప్పునని చెప్పుచు 'క॥ పూంచెన్కంచెన్మన్చె-న। టంచుఁ బ్రయోగింపఁ జెల్లునమరశ్రేణిక్। మంచిమనోరథనికరము। పూంచెరమాధిపుఁడు భక్తపోషకుఁ

డనఁగ నేఁ, (ముద్దరాజురామభద్రకవి॥ క॥ కాంచనమాలాలంకృత । చంచత్తనులీల మెఱయ జవనాశ్వములం । బూంచినరథమున మణిమయ।పంచాననకేతువెత్తె బంధుర ఫణితిన్, భార-విరా. 4ఆ. అను పద్యంబులు నిదర్శనంబులుగాఁ జూపెను. కాన ఁచను, వను మాత్రిమత్వలోప పూర్ణబిందువులు కవిప్రయోగంబులఁ గానంబడవు. ఁపూను, ధాతువునకు వర్తమానార్థక చువర్ణకము పరంబగునపుడుమాత్రము ఁచను, వనుంబలెఁ బైకార్యంబులు చూపట్టవు. ఁపూనుచు, అనుదానియందలి ఉత్వలోపంబు నకు—క॥ అనిలజవాశ్వంబుల బూ । న్చినరథముల నెక్కి ధారుణీధరుమధు సూ। దనుఁ దోడ్కొనిచను దెండని । పనిచితి తదాగమనకాంక్షఁ బ్రార్థివుఁడుండెన్., భార- సభా- 1ఆ.

56 సూ—ఉన్న శబ్దంబు పరంబగునపుడుండు ధాతువునకులోపం బగు.

ప్ర - ఉన్నాఁడు - ఉన్నారు - ఉన్నది - ఉన్నవి ॥ మ - ఉన్నావు - ఉన్నారు ॥ ఉ - ఉన్నాను - ఉన్నాము ॥ ఉన్నవాఁడు.

వ్యా—ఉన్న శబ్దంబు పరమైనపుడు ఁఉండు, ధాతువునకు లోపంబుకలుగును. పదుమూఁడవసూత్రింబుచే లట్టుపరంబగుచుండ విధింపంబడిన ఉన్నానుబంధంబునుఁ నలువదియావసూత్రింబుచే వర్తమానార్థంబైన ఉన్నవర్ణకంబు పరంబగునపుడును ఁఉండు, ధాతువునకు లోపంబగునని భావము. ఁఉన్నాఁడు, ఉన్నారు, పదునేనవసూత్రింబున ఁఉన్న, కు దీర్ఘంబు. ఁఉన్నది, ఉన్నవి, పదునేనవసూత్రింబున నిషేధింపఁబడినందున దివులు పరంబగుచుండ దీర్ఘంబురాలేదు. తక్కినవిభక్తులయందు దీర్ఘంబు యథాపూర్వంబు.

57 సూ—చేదాద్యర్థనాంతంబయినయుందున కున్నాదేశంబువి భాషనగు.

ఉన్నను - ఉండినను.

వ్యా—చేదాద్యర్థకంబులైన వర్ణకాంతంబులైన ‹ఉండు› ధాతువునకు ‹ఉన్న› అనునది వైకల్పికంబుగానగును. ‹ఉన్నను› ఇచ్చట ‹ఉండు› ధాతువునకు నలుబదియొకండవసూత్రంబుచే ద్రుతాంతంబైన నవర్ణకంబురాఁగా ఉండు + ను, అయ్యెఁ కడపటి ద్రుతంబునువిడిచి నవర్ణకవిశిష్టంబైన ‹ఉండు› నకు నీసూత్రంబుచే నున్నాదేశంబురాఁగాఁ బైరూపంబు సిద్ధించె. ‹ఉండినను› ఉన్నాదేశంబు పాక్షికంబుగావున నియ్యది రూపాంతరంబు. పదునేడవసూత్రంబుచే నుండుధాతువునకు ఇగాగమంబు.

58 సూ—తిదుటలుపరంబులగునపు డన్వాదులనుస్థానంబునను న్నయునుండుడులోపంబునువిభాషనగు.

అందురు - అంట - ఉందురు - ఉంట - పక్షంబున - అనుదురు-అనుట - ఉండుదురు - ఉండుట - ఇత్యాది.

వ్యా—‹తి, దు, ట› అనునవి పరంబగునపుడు ‹అను› మొదలైనవానియొక్క నుకారస్థానంబున నున్నయును, ‹ఉండు› ధాతువునకుఁ బైయక్షరంబులు పరంబగునప్పుడు డువర్ణకంబునకు లోపంబును, వైకల్పికంబుగానగును. ఉ, అందురు. ఇచ్చట ‹అను› ధాతువునకుం బెంఁ దద్ధర్మాదుల వివక్షయందు లాట్ప్రత్యయంబును, ఎనిమిదవసూత్రంబుచే లకారంబునకుఁ ప్రథమపురుష బహువచనవివక్షయందు రువర్ణకంబువచ్చి ‹అను + రు› అయ్యె. ‹లాట్టురుణ్ణు› అను నిరువదిరెండవసూత్రంబుచేధాతువునకు దుగాగమంబుగల్గి ‹అను + దు + రు› అనియుండఁ బ్రకృతసూత్రంబున దువర్ణంబు పరమైనందునను స్థానంబున నిండుసున్నగలిగి పైరూపంబు సిద్ధించె. పక్షంబున ‹అనుదురు› ‹అను› ధాతువుకంటె భావార్థమందు ముప్పదిరేవసూత్రంబున ‹ట› వర్ణకంబురాఁగా ‹అను + ట› అయ్యె. ప్రకృతసూత్రంబునను స్థానంబున నిండుసున్నగలిగి ‹అంట› అయినది. ‹ఉందురు› ‹ఉండు› ధాతువునకు లాట్ప్రత్యయంబుగల్గి ప్రథమపురుష బహు

వచనవివక్షయందు రువర్ణకంబుగల్గి ‘ఉండు + రు’ అయ్యె. ఇరువది రెండవసూత్రంబుచే దుగాగమంబుగలిగి ‘ఉండు + దు + రు’ అయి ప్రకృతసూత్రంబున డులోపంబుగల్గి పైరూపంబాయె. ‘ఉండు’ ధాతువునకు భావార్థకటప్రత్యయంబు రాఁగాఁ బూర్వంబందలి డువర్ణకంబునకు వైభాషికలోపంబుగల్గి ‘ఉంట’ అయ్యె.

59 సూ—ఇటబిందుపుమీఁది తదలకునిత్యవైకల్పికంబులయి టడలగు.

అంటివి - అనితివి - అండురు - అందురు ॥ ఉంటివి - ఉండితివి - ఉండురు - ఉందురు.

వ్యా—సున్నయు డులోపంబునువచ్చిన యన్వాదులరూపంబునందును ఉండు ధాతువందును ‘తి, దు, లు’ పరంబగునపుడు బిందువుతరువాతనున్న తకారంబునకు నిత్యంబుగా ‘ట’ కారంబును. దకారంబునకు వైకల్పికంబుగా డకారంబునుగల్గును.

ఉ. అంటివి. ఇట ‘అను’ ధాతువునకు భూతంబున లిట్టు రాఁగా మధ్యపురుషైకవచనవివక్షయందు సెనిమిదవసూత్రంబున ‘వు’ వర్ణకంబు రాఁగా ‘అను + వు’ అయ్యె పదునేన్మిదవసూత్రంబుచే వువర్ణకంబునకుముందు ‘తి’ వర్ణకంబుగలిగి ‘అను + తి + వు’ అయ్యె. తత్సమపరిచ్ఛేదంబునందలి “ఇకారంబుమీఁదికునువు క్రియావిభక్తుల” అను నిరువదియాఱవసూత్రంబునవువర్ణకోకారంబున కిత్వంబుగల్గి ‘అను + తి + వి’ అయ్యెను. ఏఁబదియెనిమిదవసూత్రంబున ‘తి’ వర్ణకంబునకు ముందున్నను స్థానంబునఁ బూర్ణబిందువుగల్గి ‘అం + తి + వి’ అయ్యెను. ప్రకృతసూత్రంబునఁ దకారంబు బిందువుపై నున్నది కావున ‘ట’ వర్ణకంబుగల్గి పైరూపంబు సిద్ధించెను. ‘అనితివి’ నువర్ణకంబునకుఁ బూర్ణానుస్వారంబు రానిపక్షంబున ‘అను’ ధాతువునకుఁ బదునేడవసూత్రంబున నిగాగమంబు. ‘అండురు’ అనురూపసిద్ధి యేఁబదియెనిమిదవసూత్రంబునొద్దఁ జూపంబడియె. ‘అందురు’ ఇటఁ బ్రకృతసూత్రంబున బిందువుమీఁది దకారంబునకు డకారంబు డవర్ణంబుపాక్షికంబు గావున “అందురు” అనినరూపాంతరంబుండు. “ఉంటివి” ఇట “ఉండు” ధాతువునకు మధ్యమపురుషైకవచనవివక్షయందు సెనిమిదవసూత్రంబున “ఉండు + వు” అయ్యెను. పదునెనిమిదవసూత్రంబునఁ దివర్ణకంబును, తత్సమపరిచ్ఛే

దంబునందలి యిరువదియాఱవసూత్రంబుచే వుదర్ణకోకారంబున కిత్వంబునుగల్గి "ఉండు + తి + వి" అయ్యెను. ఏఁబదియెనిమిదవసూత్రంబుచే వైకల్పికడు లోపంబుగలిగె. "ఉం + తి + వి" ఇట్లుండె పరికృతసూత్రంబున బిందువుమీఁది తకారంబునకు నిత్యటకారంబుగల్గి "ఉంటివి" అనురూపంబయ్యె. "ఉండితివి" డు లోపంబురాని పక్షంబునఁ బదునేడవసూత్రంబుచే "ఉండు" ధాతువున కిగాగమంబు. "ఉండురు" ఉండుధాతువునకుఁ బ్రథమపురుషబహువచనవివక్షయందు నెనిమిదవసూత్రంబుచే రువర్ణకంబును, (ఉండు + రు) ఇరువదిరెండవసూత్రంబుచే దుగాగమంబును, (ఉండు + దు + రు) ఏఁబదియెనిమిదవసూత్రంబుచే వైభాషికడులోపంబును గలుగఁగా, (ఉం + దు + రు) పరికృతసూత్రంబున బిందువుమీఁది దుగాగమ దకారంబునకు వైకల్పికడకారంబుగలిగె (ఉండురు). తే॥ గీ॥ క్షితినినుత్తమపురుషంబు చెప్పుచోట । నందమైయుండకుండు మారొక్కండునవఁగ । నుండుమార్తురనేన మారొక్కండునవఁగ భుజగకేయూర కాశికాపురవిహార" కవి—ప్రథమ-9 ల. క॥ గాండీవధన్వానాహన । పాండిత్యముదలఁప కతనిభండనమున మా । రొక్కండుననియొకఁడు" భార- ఉద్యో- 1ఆ. ఉ॥ ఎండకువానకోర్చి తనయిల్లు ప్రవాసముచోటనాకయా। కొండునలంగుదుర్, భార-విరా- 1 ఆ క॥ పాండవులం బాంచాలురఁ। జండభుజావిభవ మెసఁగ సమయించి కృతా । ర్థుండనయి పెంపుఁగోజము । గండున్నెనొండులేక కార్యముదలఁపన్" భార-సౌప్తి- 1ఆ. సీ॥ గీ॥ తిట్టునట్టికిఁ తెచ్చికొనఁగ । వచ్చునే స్వదేశవర్తులమైమాచి కొండమెల్ల పనులురండువేగ, భార-మూస-1ఆ.

60 సూ—ముజ్ఝుపరంబగునపుడుకోశబ్దంబుకొనునకుబహుళంబుగానగు.

బహుళంబనుటచే దీనికినొకానొకచోనతిచారంబని యెఱుంగునది.

వ్యా—మధ్యమపురుష మువర్ణకడుజ్వర్ణకంబులు పరంబగునపుడు "కొను" నకు "కో" అనుపదంబు బహుళంబుగాఁ గలుగును. అతిచారంబు—సూర్యరమాపస్థగ్రహంబు భీశగ్రహమైనందున శీఘ్రగతికినతిచారంబని జ్యోతిర్వేత్తలుజ్యోతిశ్శాస్త్రంబున

వ్యవహరింతురు. శ్లో॥ వక్రాతిచారయుక్తానాం పూర్వరాశిగతంఫలం। బృహస్పతేస్తుతన్నాస్తియుక్తరాశిగతంఫలం॥ ఇత్యాదివిద్యామాధవీయ గ్రంథములయందు వక్రగ్రహంబును, అతిచారయుక్తగ్రహంబును, వక్రగతియు, నతిచారంబును గలుగక మున్ను నేరాశియందుండునో యారాశిఫలంబే యిచ్చువనియు బృహస్పతిమాత్రము వక్రగతియుక్తుండైనను అతిచారయుక్తుండైనను దక్కినగ్రహంబులవోలెఁ గాక స్థితరాశిఫలంబునే యిచ్చువనియుఁ జెప్పంబడినది, కాఁబట్టి 'అతిచార' శబ్దంబు జ్యోతిశ్శాస్త్రపారిభాషికపదంబు. ఇచట నాశబ్దంబునకు లాక్షణికార్థంబు చెప్పుకొనవలె. సూర్యసమీపస్థంబై భీతంబైనగ్రహంబునకు మితిమీఱినగతి పుట్టునుగాఁబట్టి యిచ్చటను సూత్రంబులోఁ జెప్పఁబడ్డ నియమంబుయొక్క మితిమీఱి వేఱొకచోటను సైతము ప్రవర్తించుటయని యర్థంబు చెప్పుకొనవలయు. సూత్రంబులో జెప్పినమువర్ణకదుబ్వర్ణకంబులయొద్దఁగాక తక్కిన 'మిచి, నుచి' ప్రత్యయాదిసమావేశంబునందును నీయాదేశంబు గానంబడియెడి. దానంజేసి 'చదువుకొనేర్చెను, కైకోలు, ఇచ్చుకోలు, పుచ్చుకోలు' ఇత్యాదిప్రయోగంబులు రక్షితంబులయ్యె. 'సీ॥ గీ॥ అన్న నెవ్వతెకందుకో నలవిగాదు। గాదు రాశతెకాని యకాంచనాలి। నాలితనములు మానవే నాతియేల। యేలవాడుదుచూడుమా యేలలీల' రాజశే- 2ఆ. శా॥ నాజింతున్బహువేదశాస్త్రకలనానైయాత్యసంసిద్ధిన। నవ్యేదవ్యాసులతోడసైన మదిసంవీక్షించి యెవ్వోచనేఁ గాదన్నన్ మఱినిర్వహింపఁగ నశక్యంబేరి కన్యన్వద। శ్రీదాంపత్యము నాకనాకయనుకో సిగ్గయ్యెడున్ భూవరా.' రాజశే- 3ఆ.

61 సూ—ముడుజ్జుపరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకుమూముడియునగు.

కొమ్ము - కొనుము - కొండు - కొనుఁడు.

వ్యా—'ము, డుజ్జు' లు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు ద్విత్వంబునుగలుగును. (ఉ. కొమ్ము- కొండు'. 'కొను' ధాతువునకు నాఁడిసూత్రంబుచే నాశీరాద్యర్థంబులయందు లోట్టురాఁగా నెనిమిదవసూత్రంబుచే మన్యను

పురుషవాచకీయందు మువర్ణ డువర్ణకంబులగ్గి యిరువదితొమ్మిదవసూత్రంబుచే మువర్ణకం బునకును, డువర్ణకంబునకును గ్రమంబుగా ముఙ్డులాదేశంబులయి 'కొను + ము' కొను + డు' ఇట్లుండె. అఱువదియవసూత్రంబుచే 'కొ' శబ్దాదేశంబుగ్గి కొ + ము, కొ + డు అయ్యె. ప్రకృతసూత్రంబుచే ముఙ్డులు పరంబగునపుడు హ్రస్వంబుగలిగి కొ + ము 'కొ + డు' అయ్యె. ప్రథమోదాహరణంబున మువర్ణకంబునకుమాముడియు (ద్విత్వము) ప్రకృతసూత్రంబుచేఁ గలిగెను. ద్వితీయోదాహరణంబున (కొ + డు) డుఙ్డుఙిత్తుగావునఁ బత్సమపరిచ్ఛేదంబునందలి పందొమ్మిదవసూత్రంబుచే డువర్ణకంబునకుముందు పూర్ణ బిందువేకగ్గి 'కొండు' అనిరూపంబు సిద్ధించె. అర్ధబిందువేలరాదనఁగా 'అటు, ఇటు, ఎటు' అనుశబ్దంబులకు, అచ్చిసంధిపరిచ్ఛేదంబునందలి యిరువదిరెండవసూత్రంబుచేఁ బరిగణింపఁబడిన 'అటు' ద శబ్దత్రయంబునందున్న నుడితొలి హ్రస్వంబుమీఁదనె యుంచు ఉండుటవలన కొండు. ఇనవారలందు బిందువులు హ్రస్వంబుమీఁద నున్న యుకాని యందున్న యుండదు.

62 సూ—రువర్ణకంబుపరంబగునపుడు సున్నమీఁది తదడలయుత్వంబునకులోపంబువిభాషనగు.

పోషింత్రు - పోషింతురు - కొంద్రు - కొందురు - కొండ్రు - కొండురు.

వ్యా—రువర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది 'త, ద, డ, ల' యుత్వంబునకు వైకల్పికలోపంబు. 'పోషింత్రు' ఇటు 'పుష్' ధాతువు సాంస్కృతికంబు. అఱువదిమూఁడవసూత్రంబుచే నింముక్కు రాఁగా "పుష్ + ఇంచు" అనియుండె. పదునాలవ సూత్రంబుచే లఘూపధంబైన "పుష్" ధాతువుయొక్క యుకారంబునకు గుణంబు (ఓ) రాఁగా "పోషించు" అయ్యె. దీనికంటెఁ తద్ధర్మాది వివక్షయందు సెనిమిదవసూత్రం బుచే రువర్ణకంబుగలిగి "పోషించు + రు" అనియుండె. ఇరువదిరెండవసూత్రంబుచే దుగా గమంబుగలిగి 'పోషించు + దు + రు' ఇట్లుండె. నూటయేనిమిదవసూత్రంబునఁ జూవిశిష్ట దుకారంబునకు ఉకారాదేశంబయి "పోషింతురు" అయ్యె. ప్రకృతసూత్రంబున సున్న

మీఁది తుశబ్దోకారంబునకు లోపంబుగా 'పోషింతుర్', అనురూపంబయ్యె. ప్రకృతసూత్రవిధి వైభాషికంబుగావున నుత్వలోపాభావంబున "పోషింతురు" అనియుండె. 'కొను, ధాతువునకులాట్టు. ఎనిమిదవసూత్రంబుచేఁ బ్రథమపురుష బహువచనవిభక్తియందు రువర్ణకంబు.(కొను + రు) ఇరువది రెండవసూత్రంబుచే దుగాగమంబు (కొను + దు + రు) ఏఁబదితొమ్మిదవసూత్రంబుచే నుస్థానంబు వైభాషికబిందువు (కొం + దు + రు) ప్రకృతసూత్రంబున నున్న మీఁది దుగాగమోకారంబునకు వైభాషికలోపంబు. (కొంద్రు) ఉత్వలోపంబు వైభాషికంబుగావునఁ బక్షంబున 'కొందురు' అనియుండె. ఏఁబదితొమ్మిదవసూత్రంబుచేత నున్న మీఁది దకారంబునకు వైకల్పికడకారంబును, (కొండురు) ప్రకృతసూత్రంబుచేత డకారంబుమీఁది యుకారంబునకు వైభాషికలోపంబును గాఁగంగ 'కొండ్రు' అయ్యె. ఉత్వలోపంబు పాక్షికంబుగావున రూపాంతరంబు 'కొడురు' తే॥ గీ॥ ఉంగురంగురు కండురుకొండురనఁగ। నుంపురెంపురు తగభుజియింతురనఁగ। దగుఁగ్రియలమీఁది రేఫంబునాపరిదిస। యుక్కారముతోడ శ్లిష్టమై యలరునధవ. సర్వ-సంధి_40 ల. తే॥ మమ్ము రక్షించితని యేలమాటిమాటి। కభినుతింపంగదక్షవాటాధినాథ। తల్లిదండ్రులు రక్షింపఁదలఁపకుండ్రె। ప్రబలభీమేశబహువిధోపద్రవముల, భీమఖండము. సీ॥ నటమండ్రుఁ గొందఱు నట మేనియూఁడఁ బువారి మండలమెల్లఁ బ్రబలవలదె, కవికర్ణరసాయనము. అ. వె॥ నగిలిరుజయుజరయు దైవవశంబున। నయ్యెనేని దానిననుభవింతుర్' భార-ఆదిప. ఆ. వె॥ బలముగలవానిఁ బలుఁపురు బలహీను। లోకృ_ౖటెమూడినిర్జింప నుత్సహింతుర్' భార- అర.

## 63 సూ —సంస్కృతంబునకంగలాదుల కించుక్కగు.

సంస్కృతధాతువులకంగలాదులకించుగాగమంబగు ॥ పచించు - వచించు - త్యజించు - భజించు ॥ అంగలించు॥అంగల-అడక - ఆరగ - ఆవుల - ఉంక - ఉగ్గడ - ఓసర - కార - గాల-జాడ - తిలక - తులక - పంక - పరిక - పలవ - అప్ప - ఒప్ప - ఆల - ఇత్యాద్యమలంగలాదులు,

వ్యా—సంస్కృతధాతువులకును, 'అంగల' మొదలగు తెలుఁగుధాతువులకును, ఇంచుగాగమంబగు. ఉ. 'పచించు' ఇట 'పచ్' ధాతువు. దీనిమీఁద నించుగాగమంబు రాఁగా 'పచించు'. ఇట్లే 'వచించు, త్యజించు, భుజించు' ఇత్యాది సంస్కృతధాతువు లూహ్యంబులు. 'అంగలించు' 'అంగల + ఇంచు' ఇటనపదాదిస్వరనిత్యసంధి. ఇట్లే 'అడర, ఆరగ, ఆవుల, ఉంక, ఉగ్గడ, ఓసర, కార, గాల, జాడ, తిలక, తులక, పంక, పరిక, పలవ, అప్ప, ఒప్ప, ఆల' ఇత్యాది తెలుఁగుధాతువు లూహ్యంబులు. 'అప్ప + ఇంచు' ఈసూత్రంబున నిట్లుండ దెబ్బదితొమ్మిదవసూత్రంబుచే వైభాషిక నుగాగమంబుగలిగి 'అప్పగించు, అప్పించు, ఒప్పగించు, ఒప్పించు' 'ఆలించు' దీనికి 'ఆలకించు' అనురూపాంతరంబుగలదు. ఈధాతువు 'ఆలక్షమ్' అను సంస్కృతశబ్దంబు వలనఁగలిగినది. ఈయించుగాగమయుక్తంబైన 'ఘరించు' ఇత్యాదిధాతువులందు నించుగాగమసంబంధి యికారంబుగాని, యట్టి యికారయుక్తహల్లుగాని యతిగానుండ వచ్చును. ఇంచుగాగమసంబంధి యికారయుక్తహల్లు యతిగానుండుట నిర్వివాదాంశంబగావున నించుగాగ మేకారంబు యతిగానున్నందుకు మహాకవిప్రయోగంబు ప్రదర్శింపఁబడియెడి. ఉ॥ వీరలు దైవశక్తి ప్రభవించినవారను శేముషి సందియం । బీరమణీయకాంతినుపమింపఁగ వేల్పులె కాక' భార-ఆది-. శృం.సీ॥ ఏనుఁడయ్యమున నటించిన హారుఁడైన మరునికన్నుల సన్నఁదిరుగురనిన' నృసింహ-1ఆ (ఎఱ్ఱాప్రెగడ) ఉ॥ నాకవిభుండులేఖతతి యచ్చెరుపాటుననన్నె చూడనే ! నేకమలాప్తనందనువధించెదఁ గార్యమునిర్వహించెదన్' భారతము. చ॥ తెంపరిగ్యై మదియింత చ । లింపక యనిలోనఁ దగియె నెవ్వఁడతఁడు' హరికథాసారము. (అల్లసాని పెద్దన్న)

క॥ ఇంచియనునచ్చుహల్లును । దంచితముగ సంధిగూడునప్పుడభిన్నం । బెంచఁ గబాలుఁడుహరిఁబని । కించెననన్ రెండుఁజెల్లు నెలమింగృతులన్. లక్షణచూడామణి. క॥ కొంచకపోషించె న్నిను । తించె ననఁగ భిన్నవిరతి యిటులు చెలంగున్' లక్షణచూడామణి. క॥ కామస్వరయతియగు నితఁ । డే కదలక జలధిఁ బవ్వళించెననఁగఁ బ్రశ్నాకలితదీర్ఘమున నితఁ । డేకవ్వడిరథముగడిపె నిమ్ములననఁగన్' అనంతునిఛందస్సు. క॥ మించి వాదించినరిపుల హ । రించక సత్కీర్తి యీమహీతలమెల్లన్ । నించక దీనుల దయఁ బో । షించక ప్రఖ్యాతిగలుగునే నరనాథా' దశకుమారచరిత్ర. క॥ పంచ

శిరుం డపుడని చా | లించె మహాప్రధనభూమి నీక్షించినదో | వంచితుఁడై శంఖము పూ | రించెం గలగెరులు దిక్కరివ్రజముదరన్' ప్రద్యుమ్నోపాఖ్యానము. ఉ అంచితమైనమూర్తి నమరాధిపుఁడట్లు సమీరుచేతఁ బుత్తెంచిన రత్నహారము ధృతిన్ ఘనశీలుఁడు రాఘవుండు పా | టించి ధరించి పొందుఘటియించిననుజ్జ్వల తారకాళిచే మించిన యభ్రమండలము మీఱెమనోహరదివ్యమూర్తియై, భాస్కర-యు-కాం, తే|| గీ|| గుడుసుపైఁ గ్రియనడుమను గుడుసువచ్చి | భిన్నయతియగు రానిచోఁ బేఱుయతియగు | వెడనులచ్చిని హరి ధరియించె ననఁగ | రిపులనెల్లను బోరహరించెననఁగ అప్ప- 3అ. అనియప్పకవి యియుడాగమఘటితస్థలంబులో నించుగాగమేకారంబు యతిగానుండవచ్చుననియుఁ గానిచో నింమగికారయుక్తమైనహల్లు యతిగానుండందగుననియు విభజించి దీనికి భిన్నయతియని నామాంతరంబిడుచు ననంతునిఛందంబునందలి పూర్వోక్తంబైన "క|| కాకుస్వరయతియగు నితఁ | డే కదలకజలధిఁ బన్వళించెననఁగఁ బ్ర | శ్నాకలితదీర్ఘమున నితఁ | డే కన్వడిరథము గడిపె నిమ్ములననఁగన్" అనిన యీపద్యంబును నభేదవిరతిప్రకరణంబులో శకారడకారంబులకు సెల్లునన్నందులకు నుదాహరణంబుగాఁ జూపెను. ఇయ్యది యెంతయు వింతగానున్నయది. ఆపద్యంబులో "పన్వళించెన్" అనుదానిలోని యించుగాగమేకారంబునకు "ఇతఁడే" అనుపదంబు తుదియేకారము కాకుస్వర యతిగానుండినందులకు గ్రంథకర్తయే నుడువుచుండఁగా శకారడకారంబులకు భేదయతిచెల్లునని పద్యార్థంబునకు విరుద్ధంబైనయంశంబునకు నిదర్శనంబుగాఁ జూపంబడియె. గ్రంథకర్త కాకుస్వరయతికి నుదాహరణంబని మొఱపెట్టుచుండఁగాఁ బద్యార్థంబునైనను బరికింపక యనంతుని వాక్యంబు శకారడకారంబుల యభేదవిరతికి నుదాహరణంబని దృష్టాంతీకరించుట బధిరశ్రవణంబునొద్దఁ బట్టినశంఖధ్మానంబును స్మరింపఁజేయుచున్నది. కాన నప్పకవి వచనంబొప్పఁదగినది గాదు. ఇంచుగాగమేకారంబు సర్వవిధంబుల లాక్షణికాదృతంబగుటంజేసి నిరతంబును విగతి గానుండందగు.

**64** సూ—ఇడబ్బులకించుక్కుపరంబగు నపుడయుగవుగరుక్కుళగు,

జి - జయించు ॥ నీ - నయించు ॥ ద్రు - ద్రవించు ॥ లూ - లవించు ॥ ధృ - ధరించు ॥ తౄ - తరించు.

వ్యా — ఇ-ఉ-ఋ, వీనికి ఇంచుగాగమంబు పరంబగునపుడు క్రమంబుగా నికారంబునకు నయుక్కును, ఉకారంబునకు నవుక్కును, ఋకారంబునకు నరుక్కును గలుగును. "జయించు" జిధాతువికారాంతంబు. దీనికి ఇంచుక్కు పరంబుకాఁగా నయుగాగమంబు గలిగి "జి + అయ్ + ఇంచు" అని యుండె. ధాతుసంబంధంబైన యికారంబునకు నయుగాగస్వరంబు పరంబుకాఁగా నపదాదిస్వరనిత్యసంధి (సంధిప. 11 సూ) చే "జయించు" అనురూపంబయ్యె. ఇట్లు నయించు (నీ + అయ్ + ఇంచు ద్రవించు (ద్రు + అవ్ + ఇంచు) లవించు) (లూ + అవ్ + ఇంచు) తరించు (తౄ + అర్ + ఇంచు) మున్నగు శబ్దంబులందుఁ గిత్తులైన యయుగాగమాదులు ధాతువునకు నంతావయవములుగా రాఁగాఁ బైనిం జెప్పిన యపదాదిస్వర నిత్యసంధి గల్గును.

65 సూ — నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు.

నిర్జికి నామధాతువులు కయుగాగమంబు గలుగదు ॥ నిర్జించు - స్తుతించు ॥ ఈజ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వవివక్షయందించు గాగమంబగునని యెఱుంగునది॥ శయనించు - పయనించు.

వ్యా — "నిర్జి" అనునుపసర్గయుక్తధాతువునకును, నామధాతువులకును, ఇంచుగాగమంబు పరంబగునపు డయుగాగమంబు గలుగదు. ఉ. నిర్జించు (నిర్జి + ఇంచు) నుతించు (నుతి + ఇంచు) స్తుతించు (స్తుతి + ఇంచు) నుతిస్తుతిశబ్దంబులు నామంబులైనను ధాతుత్వవివక్షచే నించుక్కు గలిగె. (మూ) ఈజ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వవివక్షయందించుగాగమంబగునని యెఱుంగునది. వ్యా — ఈసూత్రంబునందు నామవాచకంబుల కయుగాగమంబు నిషేధింపంబడుచున్నది. "ధాతువునకు" అనుక్రియాపరిచ్ఛేదప్రథమసూత్రింబునందు యిరువదినాల్గవసూత్రంబునం గూడ ననువర్తించుచుగాన ధాతుసంబంధంబైన యికారాదులకే యించుక్కు పరంబగునపు డయుగాగమంబు

వచ్చును. ధాతువులకంటెను నామవాచకంబులకంటె నించుగాగమంబుకాదు. కావున నించుగాగము పరత్వావస్థలో విధింపబడిన యయుగాగమంబును స్వతస్సిద్ధంబుగానే నామంబులకు, ప్రాప్తింపదు. ఇట్లుండఁ బ్రాప్తింపని యయుగాగమంబును నామవాచకంబులకంటె రాదని నిషేధించుటంజేసి నామవాచకంబులకు ధాతుత్వారోపణయందు. నించుగాగమంబువచ్చునని యనుమేయింపంబడుచున్నది యనితాత్పర్యంబు. ఉ. శయనించు. శయనశబ్దంబు. సంస్కృతభాషలోనిది శీఙ్ ధాతువువలననైన యకారాంత నామవాచకంబు. దీనికి ధాతుత్వారోపంబువలన. నలుపదిమూఁడవసూత్రంబుచే నించుక్కు గలిగెనని యెఱుంగునది. రూపాంతరంబు "శయించు" చ॥ అమలనివాతసౌధములయందు మనోజ్ఞమఁగాళతూలత ల్పముల శయించి" భార-ఆర-౪ఆ. "పయనించు" పయనశబ్దంబు ప్రయాణశబ్దవైకృతంబు. దీనికి ధాతుత్వవివక్షయందు నించుక్కుయ్యె.

66 సూ—సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగునపుడు గుణంబగు.

అ-ఏ-ఓ- ఈమూఁడును గుణంబులునాఁబడు - ఋస్థానికంబగు గుణంబు పరంబయియుండు ॥ సంస్కృతధాతూపధలకు - ఇ - ఉ - ఋ - అనువానికి సొరిదిని - ఏ - ఓ - అర్ - అనునవియించుక్కు పరంబగునపు డగునని యెఱుంగునది ॥ ఛిద్ - ఛేదించు - భిద్ - భేదించు ఘుష్ - ఘోషించు - పుష్ - పోషించు - వృష్ - వర్షించు హృష్ - హర్షించు.

వ్యా—హ్రస్వాన్చు, ఉపధ (శబ్దముతుదనుండి రెండవయక్షరము) గాఁగలిగిన సంస్కృతధాతువునకు నించుక్కు పరంబగునపుడు గుణంబు (అర్, ఏ, ఓ, ఇవిగుణసంజ్ఞగలవి) గలుగును. మూలంబునఁజెప్పిన (అ, వర్ణముగుణసంజ్ఞగలది. అనఁగా "అర్" అనునది గుణంబని భావము. ఋకారస్థానంబునందు వచ్చినగుణాక్షరం చెప్పుడును రేఫపరమంబుగ గ్గిన అకారంబే (అర్) యగును. ఉ. వా, ఛిద్, ఛేద్, ఈధా

తువులందుఁ గడపటినుండి రెండవయక్షరం బికారంబుగావున నేకారంబగుటచే గుణాక్షరంబువచ్చి 'ద్వేషించు' అయ్యెను. ఘుష్, పుష్ ఈధాతువులకు నుపధాక్షరం బుకారంబుకావునఁ బైనింజెప్పిన క్రమప్రకారంబున నోకారంబువచ్చి ఘోషించుఁ బోషించు, అయ్యె. వృష్, హృష్, ఈధాతువులకు నుపధాక్షరంబు ఋకారంబుగావున 'అర్', అనుగుణంబుగల్గి వర్షించు, హర్షించు, అయ్యె.

67 సూ—స్పృశికి గుణంబు విభాషనగు.

స్పర్శించు - స్పృశించు.

వ్యా—స్పృశధాతువునకు గుణంబు వైకల్పికంబునగు. ఉ. స్పృశించు, స్పర్శించు ఇచ్చటఁ బక్షంబున ఋకారంబున 'అర్', అనెడిగుణంబు కలిగెను.

68 సూ—లిఖ, భుజ, రుచ, కృశంబులకు గుణంబులేదు.

లిఖించు - భుజించు - రుచించు-కృశించు - కుచధాతువునకు గుణంబులేదని యొకండు వక్కాణించెనది గ్రాహ్యంబుగాదు.

వ్యా—లిఖ, భుజ, రుచ, కృశ, అనుధాతువులకు గుణంబులేదు. ఉ. లిఖించు, ము. "సంకుచించు" అనిగుణరహిత రూపంబుండును. ప్రయోగము సీ. సుందరత్వమునకుఁ జోటిచ్చి తాసంకు | చించెననఁగఁ గడుఁ గృశించెనడుము, కవిక-

1 ఆ. 'సంకోచించు, అనియుగుణయుక్తరూపంబు ఘంటాపథంబుగా వ్యవహరింపంబడుచున్నయది.

69 సూ—సృజికి నిర్మితిని గుణంబులేదు.

చతుర్ముఖుండు ప్రజలను సృజించె ॥ అతండు విషయంబుల విసర్జించె.

వ్యా—సృజ్ ధాతువునకు ౹పుట్టించుట, అనునర్థంబున గుణంబులేదు. ఉ. చతుర్ముఖుండు ప్రజలనుసృజించె. ఇచ్చట నిర్మాణార్థంబు కావున గుణంబులేదయ్యె. అతండు విషయంబులవిసర్జించె, భోగంబులను విడిచెననియర్థంబు. ఇచ్చటనిర్మాణార్థంబు కాదు కావున ధాతుఋకారంబునకు ౹అర్, అను గుణంబుగలిగె.

70 సూ—సర్వంబునకుం బ్రేరణంబునందించుక్కగు.

పచింపించు - వచింపించు - ఆవులింపించు ॥ వండించు - వండించు.

వ్యా—సర్వధాతువులకు (సంస్కృతధాతువులకును, తెలుఁగుధాతువులకును) ప్రేరణంబునందు (చేయుంచుటను నర్థంబునందు) ఇంచుక్కగలుగును. ఉ. పచింపించు (పచించునట్లుచేయుట) వచింపించు (మాట్లాడునట్లుచేయుట) ఆవులింపించు (ఆవులించునట్లుచేయుట) వండించు(వండునట్లుచేయుట) పండించు(పండునట్లుచేయుట) "పచింపించు" ఇచ్చటఁ బచించుధాతువుకంటెఁ బ్రేరణార్థకంబైన యించుక్కురాఁగా ౹పచించు + ఇంచు, అనియుండె. ఎనుబదియేడవసూత్రంబుచే మొదటి ౹ఇంచు, లోని చకారంబునకుఁ బకారంబుగలిగి పైరూపంబేర్పడె. ఇట్లుతక్కుంగల వానియందూహ్యము. ప్రేరణార్థంబునే ణ్యర్థంబనియు, ణిజర్థంబనియుఁ జెప్పుదురు. తెలుంగులోఁ బ్రేరణార్థంబునందు నించుక్కగలుగునట్లు సంస్కృతవ్యాకరణంబునఁ బ్రేరణార్థంబునందు ణిచ్ప్రత్యయంబు గలుగును. కావునఁ బ్రేరణంబునకు ణిజర్థంబనివ్యవహారంబు గలిగె.

71 సూ—రంజాదుల యించుక్చకారంబునకు సబిందుకంబునక ప్రేరణంబున ద్విరుక్తలకారంబగు.

రంజిల్లు - భాసిల్లు - వర్ధిల్లు - విలసిల్లు - రాజిల్లు ॥ ఈర్యాదేశయోగంబునభిదాదు లకర్మకంబులగు - భేదిల్లు - కంపిల్లు - పంధిల్లు,

వ్యా—ప్రేరణార్థంబులేని రంజిధాతువు మొదలైనవానియొక్క యింపుగా గమచకారంబునకు దాపటిసున్నతోఁ సైతంబు లకారద్వత్వంబాదేశంబగును. ఉ. రంజి ల్లు, భాసిల్లు, వర్ధిల్లు విలసిల్లు, రాజిల్లు, 'రంజిల్లు' ప్రయోగంబున 'రంజి' ధాతువునకు నఱువదిమూఁడవసూత్రంబుచే నింపుక్కు గలిగి 'రంజించు' అనియుండ ననుస్వారం బుతోఁ గూడ నింపుక్చకారంబునకు లకారద్వయంబుగలిగి పైరూపంబయ్యె. ఇట్లే భాసిల్లు మున్నగునవి యూహించునది. (సూ) ఈసూ గేశయోగంబున భిదాదు లకర్మ కంబులగు. వ్యా—ఈద్విలకారాదేశంబు గలిగినప్పుడు 'భిదిర్'ధాతువు మొదలైనవి యకర్మకంబులగు. ఉ. భేదిల్లు, కంపిల్లు. సంధిల్లు, సంస్కృతంబున భిదిర్ ధాతువు విదారణార్థంబుగావున సకర్మకంబు. తెలుంగున నింపుగాగమంబునకు లద్వయంబు చేర్చుటం జేసి యకర్మకంబయ్యె. భేదిల్లువ్రయ్యుట, బ్రద్దలగుట. 'కంపిల్లు' కంపధాతువు సంస్కృతంబునందును నకర్మకంబే. దీనియింపుక్కునకు లద్వయంబు చేర్చి నందునఁ బైధాతువునందుంబలె విశేషంబులేదు. 'కంపించు, అనియు నకర్మకార్థకంబుగలదు. 'సంధిల్లు' సంధిశబ్దంబు నామవాచకంబు. దీనికిధాతుత్వవివక్షయందు నఱువదియేనవ సూత్రంబుచే నింపుక్కు రాఁగా 'సంధించు' అయ్యె. ఇచ్చట ననుస్వారంబుతోసయితము చకారంబునకు లద్వయంబు చేర్చినందున నకర్మకంబగు.

72 సూ—ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు లోపంబగు.

లాదేశంబున కపవాదంబు ॥ రంజించు - భేదించు-సంధించు.

వ్యా—అఱువదిమూఁడవ సూత్రంబుచేత 'రంజ్' మొదలగుసంస్కృతధాతువులకు స్వార్థమందించుక్కు రాఁగాఁ బ్రేరణార్థంబునందు రెండవయించుక్కు డెబ్బదియవసూత్రంబుచేతఁ జేసినయపుడు మొదటియించుక్కుయొక్క చకారస్థానమందు డెబ్బదియొకండవసూత్రంబుచేత విధింపంబడిన ద్విత్వలకారంబును బాధించిప్రకృతసూత్రంబుచే సర్వేంచుగ్లోపంబగునని భావము. ఉ. రంజించు, (రంజిల్లఁజేయుట) భేదించు (భేదిల్లఁజేయుట) సంధించు (సంధిల్లఁజేయుట) 'రంజ్ + ఇంచు (స్వార్థమందు) + ఇంచు (ప్రేరణార్థమందు)' ఇట్లుండ ద్విలకారదేశంబును బాధించి మొదటిస్వార్థకేంచు

క్కునకు లోపంబురాఁగాఁ ద్విరూపంబయ్యె. 'సంధిల్లు' అనునది యకర్మకంబు. ఉ. ఉల్లమునందు నక్కటికమూనట మీకులమందుఁ గంటిమం। చల్లనమేలమాడున చలాత్మజమాటకు లేతనవ్వుసం । ధిల్లగిరీటి, మను- 1అ. ఇట్లు 'ఘటిల్లు' అనునది యకర్మకము సకర్మంబుఘటించు. ఉ. వానిపాపము వానినేఘటించును. ఇట్లుసకర్మకాకర్మకభేదంబు జాగ్రత్తతో నూహించునది.

73 సూ—చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగానగు.

పూను - పూనుచు - పూనించు ॥ తేలు - తేలుచు - తేలించు॥ మగుడు - మగుడుచు - మగిడించు ॥ కుదురు - కుదురుచు-కుదిరించు ॥ విను - వినుచు-వక్ష్యమాణంబుపుగాగమంబు - వినిపించు ॥ బాహుళకంబుచేఁ గొన్నింటికి జుగాగమంబులేదు - అను - అనిపించు॥ తిను - తినుపించు ॥ కను - కనిపించు - దీనియత్వంబునకు దీర్ఘంబునగు - కానిపించు.

వ్యా—నకారలకారడకారరేఫలద్విత్వంబు తుదినిలేనియట్టి యచ్చతెనుంగు శబ్దంబునకుఁ బ్రేరణార్థంబునఁ జుగాగమంబు బహుళంబుగానగును. ఉ. పూను - పూనుచు - పూనించు - తేలు - తేలుచు - తేలించు. మగుడు - మగుడుచు. - మగిడించు - కుదురు - కుదురుచు - కుదిరించు. 'పూను' ఇత్యాది ప్రేరణార్థంబు లేని రూపంబు. ఈధాతువు నకారద్విత్వంబు తుదిలేనిదికావునఁ బ్రేరణార్థమందుఁ జుగాగమంబుగగ్గి 'పూనుచు' అయ్యెను. చుక్కు వైకల్పికంబుగావునఁ బ్రేరణంబునఁ బాక్షికంబుగా 'పూనించు' అయ్యె. ఇట్లే తక్కుంగలవియూహ్యంబులు. 'మగిడించు' 'మగుడు + ఇంచు'. ఇట్లుండ నపదాదిస్వరనిత్యసంధియు, నెనుబదియేనవసూత్రంబుచేఁ గకారంబుమీఁది యుత్వంబున కిత్వంబునుగగ్గి ద్విరూపం బేర్పడియె. ఇట్లే 'కుదిరించు-వినిపించు - అనిపించు - కనిపించు' ఇత్యాదులందు నెనుబదియేనవసూత్రంబుచే నిత్యంబూహించునది (మూ) విను - వినుచు వక్ష్యమాణంబు పుగాగమంబు వినిపించు,

వ్యా—వక్ష్యమాణంబనఁ జెప్పంబోవునది. అనఁగా డెబ్బదినాల్గవసూత్రంబుచే విధింపఁబడి పుగాగమంబు. (మూ) బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబులేదు. అను-అనిపించు. తిను-తినిపించు కను-కనిపించు దీనియత్వంబునకు దీర్ఘంబునగు-కానిపించు. వ్యా-బహుళశబ్దంబు (ద్వన్ద్వమనోజ్ఞాదిభ్యశ్చ,(5అ-1పా-133సూ) అనినసూత్రంబందలి మనోజ్ఞాదిగణంబులోఁ బఠితంబైనది కావున భావార్థంబునందు వుఞ్ ప్రత్యయంబు నొంది బాహుళకంబాయె. బహుళత్వంబుచేతనని యర్థంబు. డెబ్బదినాల్గవసూత్రంబుచేఁ బుగాగమంబేకాని ప్రకృతసూత్రంబునఁ జుగాగమంబు, రాదనుట. 'కానిపించు అనుదానియందలి దీర్ఘమున్నప్పము.

74 సూ—అట్లుపుగాగమంబును మాన్వాదులకగు.

మాను - మానుపు-మానుచు॥ మను-మనుపు-మనుచు- బాహుళకంబున దీనికించుక్కు లేదు.

వ్యా—చుగాగమంబువోలెఁ బ్రేరణంబున మాన్వాదులకుఁ బుగాగమంబు బహుళంబుగానగును. మానుపు - మానుచు. (మానఁజేయుట - విడిపించుట) మనుపు - మనుచు (బ్రదికించుట) బహుళమని చెప్పుటచేత మనుధాతువునకుఁ బ్రేరణంబున నించుక్కుగల్గి 'మనించు' అనిగాదు. మానుధాతువునకు ' మానించు ' అగును. [చూ-77సూ)

75 సూ—చుక్పువర్ణంబులు పరంబగునపు డిత్వంబున కుత్వంబగు.

వ్యా—చుగాగమ పుగాగమంబులు పరంబులగునపు డికారంబున కుకారంబగును ఉ. బిగియు - బిగుచు - పడియు - పడుచు - మెలియు - మెలుచు - బిగియు - బిగుపు - తెలియు - తెలుపు - కలియు - కలుపు. (క. పదపడిచేతులు బిగిచిన, వి-పు-6ఆ. పలపలకన్నీరుపడుపకమ్మ, అని- 2ఆ. చ. కేలఁగేల్ | మెలిచినబెళ్కు-బెడిసలమిన్నలచిన్నల వెన్నుఁ దన్నుబల్ | సొలపులమాపు' గస- 3ప.

76 సూ—అట్లు చుక్వుగాగమంబుల డంగ్వాదిమాయ్వాదులక గునగుచో వానికడ వ్రాలు లోపించు.

అడఁగు - అడఁచు - అడఁగించు॥ మాయు - మాపు - మాయించు॥ అడఁగు - కరఁగు - కలఁగు - నలఁగు - ఇత్యాదులడంగ్వాదులు ॥ మాయు - ఉడుగు - కడఁచు - కుడుచు - బిగియు - ఇత్యాదులుమాయ్వాదులు॥ ఆఁగుప్రభృతు లుభయగణంబులు - బాహుళకంబునంజేసి కొన్నింటి కించుక్చుక్వుగాగమంబులు మూఁడును గొన్నింటికందు యథాసంభవముగా రెండును గొన్నింటికొక్కటియు నగునని యెఱుంగునది.॥ ఆఁగు - ఆఁచు॥ ఆఁపు - ఆగించు ॥ రేఁగు రేఁచు - రేఁపు - రేఁగించు ॥ ప్రాయు - ప్రాచు - ప్రాపు ॥ విఱుగు - విఱుచు ॥ చూచు- చూపు॥ నేరుచు- నేరుపు ॥ మేయు- మేపు ॥లేచు లేపు ॥ కలియు - కలుపు ॥ తడియు - తడుపు - తెలియు - తెలుపు॥ ఇత్యాదు లెఱుంగునది.

వ్యా—ప్రేరణంబునందు బాహుళకంబున 'అడఁగు' ప్రభృతులకుఁ జుగాగమబును, మాయుప్రభృతులకుఁ బుగాగమంబునగును. అప్పుడు ధాతువుల తుదియక్కారంబులకులోపంబుగల్గును. ఉ. అడఁగు అడఁచు - అడగించు. ఇచ్చటఁ జుక్కుపరంబగునపుడు గువర్ణంబులోపించె. ఇట్లే 'కరఁగు - కలఁగు- నలఁగు' ఇత్యాదులూహ్యము 'మాయు - మాపు - మాయించు' ఇటఁ బుగాగమంబు పరంబగునపుడుయువర్ణంబులోపించె. ఇట్లే 'ఉడుగు- కడచు- కుడుచు - బిగియు' ఇత్యాదుల నంత్యవర్ణలోపంబు. (మూ) ఆఁగుప్రభృతు లుభయగణంబులు. బాహుళకంబునంజేసి కొన్నింటి కించుక్చుక్వుగాగమంబులు మూఁడును గొన్నింటికందు యథాసంభవముగా రెండును గొన్నింటి కొక్కొక్కటియునగునని యెఱుంగునది.

వ్యా—ఆఁగు మున్నగుధాతువులకుఁ జుగాగమపుగాగమంబులుభయంబు ను వచ్చును. ఈప్రకరణంబులోని సూత్రంబులందు డెబ్బదిమూఁడవసూత్రంబులోని బహుళగ్రహణ మనువర్తించినందునిందు గాగమ పుగాగమంబులలో లక్ష్యానుసారంబుగా (యథాసంభవముగా) నొక్కొకచో మూఁడును, వేఱొకచో రెండును, ఇంకొకచో నొక్కొక్కటియునగు. ఉ. ఆఁగు- ఆఁచు- ఆఁపు- ఆఁగించు- ఆఁగు మొదటి రూపము. 'ఆఁచు' ఇచ్చో జుగాగమంబు. 'ఆఁపు, ఇచ్చటఁ బుగాగమంబు. 'ఆఁగించు, ఇట నిందుగాగమమ్ము. ఆఁగుధాతువు 'ఆఁగించు, శబ్దపర్యాయంబై సకర్మకంబునుంగలదు. 'క. మ్రోఁగుచుఁదూపుంగుతూపుల। నాఁగుచుదుస్తర శరక్షతారుణవారిం। దోఁగుచు, రామా- 8-ఆ. 'రేఁగు - రేఁచు - రేఁపు - రేఁగించు, ఇచ్చట యథాపూర్వంబుగా మూఁడునుగల్గెను. 'పాయు - పాచు - పాపు, ఇచ్చటఁ జుగాగమపుగాగమంబులు రెండేసుటిల్లె. 'విఱుగు - విఱుచు, ఇచోటఁ జుగాగమంబు మాత్రంబయ్యె. 'చూచు - చూపు. నేరుచు - నేరుపు మేయు - మేపు లేచు - లేపు. కలియు - కలుపు. తడియు - తడుపు. తెలియు - తెలుపు, ఇచ్చోఁ బుగాగమం బొక్కటియే యయ్యె.

77 సూ —ఇంచుక్చుక్పు గాగమంబులు పరంబులగునపుడాగమాదేశలోపంబులు పెక్కు తెఱంగులం గానంబడియెడి.

అగు - కావించు ॥ వచ్చు - రావించు - రప్పించు ॥ విన్నపము - విన్నవించు ॥ మోఁకాలు - మోఁకారించు ॥ కేక - కేకరించు॥ పలవ - పలవరించు - పలవించు ॥ ఆలు-అలకించు --ఆలించు ॥ ప్రక్క - ప్రక్కలించు ॥ నొచ్చు - నొంచు - నొప్పించు ॥ ఉండు - ఉనుచు - ఉంచు ॥ డిగు - డించు - డిగించు ॥ పెనుగు - పెనుచు - పెంచు ॥ తునుగు - త్రుంచు॥ మునుఁగు - ముంచు - మునుచు ॥ మొగుడు - మొగుడుచు- మొగుచు - మోడుచు - మొగిడించు ॥ చొచ్చు - చొనుపు - చొప్పించు ॥ చినుఁగు - చించు - చింపు ॥ త్రెగు - త్రెంచు-

తెంపు॥ తిరుగు - త్రిప్పు ॥ చచ్చు - చంపు ॥ నిలుచు - నిలువరించు - నిలుపు ॥ కొను - కొలుపు ॥ పోవు - పుచ్చు - పనుచు - పంచు - పనుపు - పంపు - అనుచు - అంచు - అనుపు - అంపు- అనుప్రయుక్తంబగు పోవునకుంబుచ్చు మాత్రంబగు - మోసపోవు - మోసపుచ్చు ఇత్యాదులెఱుంగునది.

వ్యా—ఇంచుగాగమంబును, చుగాగమపుగాగమంబులును పరంబగునపుడు ధాతువులకుఁ బరిపరివిధంబుల నాగమంబులును, ఆదేశంబులును, వర్ణలోపంబులును లోకంబునఁ గానిపించెడిని. ఉ. (అగు - కావించు, నించుకు పరంబగునపు డగుధాతువునకుఁ గావాదేశంబు (వచ్చు - రావించు - రప్పించు, ఇచట వచ్చునకు రావురప్పులు వైకల్పికంబుగా నాదేశంబులయ్యె. ఇట్లే (విన్నపము - విన్నవించు మోఁకాలు - మోఁకారించు - కేక - కేకరించు, పలవ - పలవరించు - పలవించు, ఆల - ఆలకించు, ఆలించు (వక్క - వ్రక్కలించు. నొచ్చు-నొంచు-నొప్పించు. ఉండు- ఉనుచు ఉంచు డిగు-డించు-డిగించు. పెరుగు-పెనుచు-పెంచు. తునుగు-తుంచు. మునుఁగు-ముంచు-మునుచు- మొగుడు-మొగుడుచు-మొగుచు- మోడుచు - మొగిడించు. చొచ్చు చొనుపు - చొప్పించు. చినుఁగు—చించు—చింపు! త్రెగు—త్రెంచు. త్రెంపు. తిరుగు—త్రిప్పు. చచ్చు—చంపు. నిలుచు—నిలువరించు—నిలుపు, కొను—కొలుపు ఇత్యాదులందు మూలధాతువులను, ప్రేరణార్థకరూపంబులను, బరికించి వానియందలి వర్ణవికారంబుల సూక్ష్మబుద్ధిచే నూహించునది. (సూ) పోవు- పుచ్చు-పనుచు-పంచు - పనుపు. పంపు. అనుచు, అంచు అనుపు-, అంపు అనుప్రయుక్తంబగుపోవునకుంబుచ్చుమాత్రంబగు. ఉ. మోసపోవు—మోసపుచ్చు, ఇత్యాదులెఱుంగునది. వ్యా—(పుచ్చు—పనుపు ఇత్యాదులయందలి చుగాగమపుగాగమవిశిష్టరూపంబులు ప్రేరణార్థంబునందగు వెండియు నీరూపంబుల యాద్యక్షరలోపంబు వైకల్పికంబుగానగు. ఉ. (అనుచు) ఇత్యాదులు, వేఱొకశబ్దంబుతో నేకీభవించిన పోవుధాతువునకు (పుచ్చు, అనురూపంబేయాదేశంబగునుగాని తక్కినపూర్వోక్తపనుచు ప్రభృతులాదేశంబులు గానేరవు. ఉ, మోసపోవు. ప్రేరణార్థకంబు మోసపుచ్చు. (మోసపనుచు-మోసపంచు' ఇత్యాదులసంభవంబులు.

78 సూ—అన్వాదులకించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు మానునకు విభాషనగు.

అనిపించు ॥ అను - కను - తిను - విను ॥ మానిపించు మానించు.

వ్యా—'అను- కను- తిను- విను' మున్నగుధాతువులకు నించుక్కు పరంబగునపుడు పుగాగమంబు నిత్యంబుగను, మానునకు వైభాషికంబుగను గల్గును. ఉ. అనిపించు 'అను + ఇంచు' ఇట్లుండఁ బ్రకృతసూత్రంబునఁ బుగాగమంబును, ఎనుబదియేనవసూత్రంబున నువర్ణకంబుమీఁది యుకారంబునకికారంబును రాఁగాఁ బైరూపంబుసిద్ధించె. ఇట్లే కనిపించు-తినిపించు- వినిపించు' ఇత్యాదులు. 'మానిపించు-మానించు' ఇటఁబుగాగమంబువైభాషికంబుగావున రూపద్వయంబు.

79 సూ—అడ్డాదులకించుక్కు పరంబగునపుడు గుగాగమంబగు నప్పాదులకు విభాషగు.

అడ్డము - అడ్డగించు ॥ అడ్డము - ఓక-చిత్తము - పంతము - పెల్ల - బోర - మట్టము - మేళము - ఇత్యాదులడ్డాదులు ॥ అప్ప-అప్పగించు - అప్పించు ॥ అప్ప - ఒప్ప - పల్లము - కోపము ॥ ఇవి యప్పాదులు.

వ్యా—'అడ్డము- ఓక- చిత్తము- పంతము- పెల్ల- బోర- మట్టము- మేళము' మొదలైనవానికినించుక్కు పరంబగునపుడు గుగాగమంబునిత్యంబుగను, 'అప్ప- ఒప్ప- పల్లము,కోపము' మొదలయినవానికి నించుక్కు పరంబగుతఱి గుగాగమంబువైభాషికంబుగను గలుగును. ఉ. అడ్డగించు—మువిభక్తిపుట్టని యగ్గలశబ్దంబుకంటె నఱువదిమూఁడవసూత్రంబుచే నించుక్కు పుట్టి 'అగ్గలించు,' అయినట్టులిచ్చటఁ గేవలంబైన (మువర్ణకంబులేని) యడ్డశబ్దంబంగలాదిగణపతితంబని యెంచఁబడినందున నఱువదిమూఁడవసూత్రంబుచే నించుక్కు చేయఁగాఁ బ్రకృతసూత్రంబున గుగాగమంబంతాగమంబగుటంజేసి

పైరూపంబయ్యె. ఇట్లేచిత్తగించు- పంతగించు-మట్టగించు- మేళగించు' ఇత్యాదులందు ముఁవర్ణకోత్పత్తికిఁ బూర్వమందే కేవల ప్రాతిపదికంబుకంటెనిఉవదిమూఁడవసూత్రంబుచే నించుగాగమంబుగల్గిన దనిగ్రహింపవలయు. ‹అప్పగించు- అప్పించు' ఇటఁగుగాగమంబు వైభాషికంబువుగానరూపద్వయంబు. ఇట్లే ‹ఒప్ప- మున్నగువానికి గ్రహించునది.

80 సూ—ఆడోడుకూడులడకారంబునకుం జుక్కుపరంబగునపుడు రేఫంబగు.

ఆడు - ఆరుచు - ఆడించు ॥ ఓడు - ఓరుచు - ఓడించు ॥ కూడు-కూరుచు-కూడించు.

వ్యా—‹ఆడు- ఓడు- కూడు' ఈధాతులయందలి డకారంబునకు నించుక్కుపరంబగునపుడు రేఫంబుగల్గు. ఉ. ఆడు= ఆరుచు= ఆడించు= ‹ఆరుచు' ఇచ్చోనాడు ధాతువునకంటె డెబ్బదిమూఁడవసూత్రంబుచేఁ జుగాగమంబురాఁగాఁ బ్రకృతసూత్రంబున ధాతుడకారంబునకు రేఫంబుకలిగె. ‹ఆడించు' డెబ్బదిమూఁడవసూత్రంబుచేఁ జుగాగమంబు బహుళంబుగావునఁ బక్షంబుననించుగాగమంబు. ఇట్లే ఓడు- ఓరుచు- ఓడించు. కూడు= కూరుచు= కూడించు.

81 సూ—చెడునకుం జుక్పుగాగమంబులును డాకలఘు రేఫంబునగు.

చెఱుచు - చెఱుపు.

వ్యా—‹చెడు' ధాతువునకుఁ బ్రేరణంబునఁ జుగాగమపుగాగమంబులు వైకల్పికంబుగనగుటయు కాక ధాతుడకారంబునకు రేఫంబుగలుగు. ఉ. చెఱుచు= చెఱుపు- ఇం గ్రమంబుగాఁ జుగాగమపుగాగమంబులు పరంబగుచో నలఘురేఫంబు గలిగె.

82 సూ—పడునకుంజుక్కును డాకలఘు రేఫంబునగు.

పఱుచు

వ్యా—పడుధాతువునకుఁ జుగాగమంబును, డకారంబునకు శకటరేఫంబును, గల్గు. ఉ. పఱుచు- ఇట 'పడు' ధాతువునకుఁ జుక్కుపరంబగునపుడు శకటరేఫంబు గలిగెను. ఇందలిశకటరేఫం బుకారాంతంబు. క, 'భంగించియితరకాంతఁదొలంగుట తప్పారడంబఱచిపురుషులమరా, కళా= 7ఆ.' అనినకళాపూర్ణోదయ పద్యంబునద్వితీయపాదస్థంబైన 'పఱచి, శబ్దంబుశాస్త్రంబున నుకారాంత ఘటితంబయ్యె నేనియతియ శాస్త్రీయంబగునుగావున నిందలి శకటరేఫంబకారాంతంబుగను నుండవచ్చును.

83 సూ—శబ్దపల్లవంబగు పడునకించుక్కు వి భాషనగునగు చోడాకులఘు రేఫంబగు.

వెలువడు - వెలువరించు - వెలువఱుచు ॥ చొప్పడు - చొప్పరించు - చొప్పఱుచు.

వ్యా—రెండుశబ్దంబులుచేరి యపూర్వార్థబోధకంబై వేఱొక యఖండశబ్దంబగుట శబ్దపల్లవంబు(రెండుశబ్దంబులసంయోగంబునఁ జిగిర్చిననూతనశబ్దంబు) నాఁబడు 'శబ్దపల్లవంబగుపడునకు, అనఁగా 'శబ్దపల్లవంబులో నంతర్భూతంబగు పడునకు, అని యర్థము, అట్టిపడుధాతువునకు నించుక్కువిభాషగానగును. దానికిఁదోడుగా డాకు లఘురేఫంబుగలుగును. ఉ. వెలువడు-వెలువరించు-వెలువఱుచు. 'వెలువడు, (వెలి + పడు) ఇటనించుక్కుపరంబగునపుడు ప్రకృతసూత్రంబున లఘురేఫంబయి 'వెలువరించు' అను రూపంబయ్యె. పక్షంబునఁబూర్వసూత్రంబుచేఁ జుగాగమశకటరేఫంబులు గలిగి 'వెలువఱుచు' అయ్యె. ఇట్లే చొప్పడు- చొప్పరించు- చొప్పఱుచు.

84 సూ—ప్రేరణంబునందించుక్కు మీఁద నించుక్కులేదు.

ఇటనుటంజేసి ప్రేరణార్థంబయిన యితరాగమంబు మీఁదఁబ్రేర

ణార్థేంచు గాగమంబగునని యెఱుంగునది ॥ నొచ్చు - నొంచు - నొంపించు ॥ చచ్చు - చంపు - చంపించు.

వ్యా—ప్రేరణార్థకంబైన యించుగాగమంబు పైనిఁదిరిగి. ప్రేరణార్థకంబగు నించుగాగమంబు రాదు గాని ప్రేరణార్థకంబులైన చుగాగమపుగాగమంబులపైనిదిరిగి ప్రేరణార్థకంబయిన యించుగాగమంబు రావచ్చునని భావము. ఉ. నొచ్చు- నొంచు-నొంపించు. 'నొంచు, డెబ్బదియేడవసూత్రంబుచే నొచ్చునకుఁ జుగాగమంబుగల్గి. 'నొంచు,అయ్యె. దీనిపైనిందిరిగి ప్రేరణార్థకంబైన యించుక్కూరాఁగా నెనుబదియేడవసూత్రంబున నొంచుచకారంబునకుఁ బకారంబుగల్గి 'నొంపించు, అయ్యె. 'చచ్చు, దీనికిడెబ్బదియేడవసూత్రంబునఁ బుగాగమఘటితరూపంబు 'చంపు , అయ్యె దీనిపైనించుక్కూగలిగి 'చంపించు, అయ్యెను.

85 సూ—ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో నన్త్యాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు.

ఉదా. నిగుడు - నిగిడి - నిగిడె ॥ మగుడు - మగిడి - మగిడె ॥ ఉడుగు - ఉడిగి - ఉడిగె - మునుఁగు - మునిఁగి - మునిఁగె.

వ్యా—ధాతువుమొదటలేని యుకారంబున . కికారంబొండె నెకారంబొండె, దర్వాతఁబ్రాప్తించినచో నయ్యుదియికారంబగు. ఉ. నిగుడు నిగిడి- నిగిడె. 'నిగుడు, దీనికి ముప్పదియెన్మిదవసూత్రంబుచే ధాతువుపైనివర్ణకంబుగల్గి యపదాదిస్వరసంధిచే 'నిగుడి, అనికాఁగాఁ బ్రాకృతసూత్రంబున గకారంబుమీఁది యుకారంబున కిత్వంబుగల్గి 'నిగిడి, అయ్యె ,నిగుడె' నిగుడుధాతువుపైని బదునాఱవసూత్రంబుచే భూతార్థక (ఈవక్ష్యమాణగ్రంథము రంగయాఖ్యశిష్యసాహాయ్యశూన్యంబుగా రచింపఁబడినది.) లిడాదేశడుజ్జునకు ఎనువర్ణంబు, ఆదేశముకాఁగా "నిగుడు + ఎను" అయి యపదాదిస్వరసంధిచే "నిగుడెను" అనురూపంబు సంభవించినపిదపఁ బ్రాకృతసూత్రమున 'గ' కారమున కిత్వముగలిగి 'నిగిడెను' అయ్యెను. ఇట్లు 'మగిడి' 'మగిడెను' 'మునిఁగి' 'మునిఁగెను' ఇత్యాదులూహ్యంబులు. ధాతువుతుదియందు నికారముగాని యెకారము

గాని యాదేశముగాఁ జేరినచో మొదటియుకారమునకుఁగాక తక్కినయుకారమునకు నిత్యమువచ్చునని యర్థము చెప్పుటచే 'ఉదరి మునిఁగి ఇత్యాదుల తొలియుకారము నకు నిత్వంబురాలేదు. ఉ. 'సాత్యకి డిభకుపైసాయకదళకంబు నిగిడింప' ఉ. హరిర ౬ ఉ॥ ఉత్పలగంధినన్నుడిగియొడ్లనుబంపుము' భార. విరా. ౨ ఆ.

86 సూ—ముజ్జీత్తులు ముత్తునాఁబడు.

వ్యా— ఆశీ, శ్యాప సంప్రార్థనవిధులయందలిముదుజ్జులును, లజీ, కలజి, నుజీ, రుజీ, వుజీ, ఇత్యాదిజీత్తులును, ఈ తెలుఁగువ్యాకణంబున 'ముత్తు' అనుసంజ్ఞతో వాడఁ బడునని యర్థము.

87 సూ—ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు చకారంబునకగు.

పచించు - పచింపించు ॥ వచించు - వచింపించు ॥ పిలుచు - పిలిపించు - వలచు - వలపించు॥ పత్వంబు హెచ్చునకుం గలుగదు మెచ్చునకు విభాషనగు ॥ హెచ్చించు - మెప్పించు - మెచ్చించు.

వ్యా—ప్రేరణేంచుక్కు అనఁగా, చేయుట యనునర్థమందుఁ గల్గినయించుగాగమంబు. (70 సూత్రంబున) అదిపరంబగునపుడు ధాతుచకారంబుపకారంబగు. ఉదా. పచించు, పచింపించు॥ వచించు వచింపించు॥ పిలుచు పిలిపించు॥ వలచు వలపించు పత్వంబు హెచ్చునకుంగలుగదు- మెచ్చునకు విభాషనగు. హెచ్చించు, మెప్పించు. మెచ్చించు ఇట "పచించు + ఇంచు॥ అనియుండఁగా, ఇంచుగాగమంబునకుఁ పూర్వమందున్న 'పచించు, శబ్దంబుతుదిచకారంబుపకారంబయి ఉకారసంధిగలిగి "పచింపించు" అయ్యె. పచించునట్లుచేయుటయని యర్థము—ఇట్లన్యంబులు నూహ్యంబులు.

88 సూ—ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తుపరంబగునపుడు పవలగు.

ఆగమంబు - పచింపఁడు - పచింపుము ॥ అడఁపఁడు-అడఁపుము ॥ అన్యము - పిలువఁడు - పిలువుము.

వ్యా—ఇంచుగాగమ చుగాగమ చకారంబులకునుభయంబులకును, ద్విత్వంబులేని ధాతుసిద్ధచకారంబునకును, ముడుఁజులును, జేత్తును, బరంబగుచో, పకారవకారంబులగు, ఆగమచకారంబునకు పకారంబును, అన్యచకారంబునకు (సిద్ధచకారంబునకు) వకారంబును వచ్చునని క్రమాన్వయము. సాధ్యసిద్ధచకారంబులకు క్రమంబుగాఁ బకారవకారంబులగు నని ఫలితార్థము ఉదా. ఆగమంబు. పచింపఁడు పచింపుము॥ అడఁపఁడు. అడఁపుము. అన్యము. పిలువఁడు. పిలువుము.

"పచింపఁడు" ఇట పచించులోనిచకారంబు డెబ్బదవసూత్రంబున విధింపఁబడిన యించుగాగమంబుదిగావున నట్టిచకారంబునకు పకారంబుగలిగెను.

"అడఁపఁడు" ఇచట అడఁగుధాతువునకు డెబ్బదియాఱవసూత్రంబువఁ జుక్కారాఁగా నాగమచకారంబైనందునఁ బైరూపంబు సిద్ధించె. ఇట్లు శాస్త్రసాధ్యంబులైన చకారంబులుపకారంబులగుటకు నుదాహరణంబు. పిలువఁడు,—పిలుచు, చకారము సూత్రసాధ్యము కాక సిద్ధంబైనందున వకారంబయ్యె.

89 సూ—ఖండబిందువు మీఁది సిద్ధ చకారంబునకు ముత్తుపరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగనగు.

తలఁపక - త్రేఁపక - తోఁపక ॥ ఏఁచునకు వైభాషికంబు - ఏఁపక - ఏఁచక ॥ నోఁచునకుం గలుగదు - నోఁచక.

వ్యా—ముడుఁజులును, జేత్తులును బరంబగుచో నర్ధానుస్వారముమీఁది సిద్ధచకారంబునకు (88) సూత్రాంశమునవకారమురాక యీసూత్రమునఁ బకారంబే వచ్చునని పూర్వవిధికి నపవాదము. అర్ధానుస్వారము, అనునాసిక్యమునకు గుఱుతు. అనగా నాసికతో నుచ్చరింపవలసియున్నయచ్చునకుఁ దర్వాత నర్ధానుస్వారము చిహ్నముగా నుంపఁబడును. ఉచ్చరించుటలోనిట్టి యచ్చు కేవలము ముఖమునకేకాక "సూ॥ ముఖనాసికా

వచనోఽనునాసికః॥" అను సంస్కృతవ్యాకృతిసంప్రదాయంబున నాసికకునుసయితమర్ధభాగముగాఁ జెందియుండునన్న యర్థంబు సూచింపనర్ధబిందువు వ్రాయఁబడుచున్నది. అర్ధబిందులేఖనంబున నట్టి స్వర మనునాసికమనినబహుశాస్త్రప్రసిద్ధార్థమే ప్రకటింపఁబడుంగాని దానంజేసి క్రొత్తవింతలేమియు లేనందుల దీనినవాద్యవర్ణంబులైనయలఘురేఫాదులగణంబులోఁ బరిగణించుట యవిచారితమూలకంబని గ్రహించునది. విశేషంబుగా నేతద్విషయంబస్మత్ప్రచితంబయినచతురస్యశ్లోకంబులో నిషద్ధశ్శనీవ్యాసంబునఁ జర్చింపఁబడెంగాన నయ్యది చూడందగు. "ప్రతిజ్ఞానునాసిక్యాఃపాణినీయాః" అను సంప్రదాయంబనుసరించి సాంస్కృతికవ్యాకరణవ్యాఖ్యాతలగు భాష్యకారాదులయుపదేశవశంబునఁ దెలిసికొనినట్లులే యీయాంధ్రభాషయందును బొత్తంబులలో గురుపరంపరానుసారంబునఁ బ్రవహించుచున్న యర్ధానుస్వారచిహ్నంబులంజేసి యానునాసిక్యమును గ్రహింతురుగాక!

ఉదా—తలఁపక. త్రేఁపక. తోఁపక॥ ఏఁచునకు నైభాషికంబు. ఏఁపక. ఏఁచక॥ నోఁచునకుంగలుగదు. నోఁచక॥ "తలఁచు" ధాతువుచకారమర్ధానుస్వారముతర్వాతిదయయినందున జిత్తైనకజివర్ణకంబుపరంబగుచో, పకారంబుగన్గి (20) సూత్రంబునఁ బకారోపరియుకారంబున కత్వంబుగన్గి "తలఁపక" అయ్యె. ఇట్లు తలఁపని, తలఁపను తలఁపరే, తలఁపకురే ఇత్యాదులూహ్యంబులు

నోచునకుమాత్రము పకారంబురాక నోఁచ, నోఁచని ఇత్యాదిరీతినిసుండును "ఉ. చొక్కపుఁబ్రాయమున్గి గులసోయగముంగల ప్రాణనాయకుం। డెక్కనవళ్య తక్ దాసుల శేకటఁ దీర్చి సమేలముప్పఁగా। నక్కనగారవించి ప్రియమందగనోఁచని యింతి దైవగా। చక్కదనం బదేమిటికి జవ్వనమేటికి నేర్పులేటికిన్॥ మను. 3 ఆ.

90 సూ—ఆగమ చకారంబునకు నెఱసున్న మీఁది దానికి దుక్కు పరంబగునపుడు పకారంబు విభాషనగు.

ఆకర్ణింపుదురు - దంపుదురు - చింపుదురు ॥ పత్వంబు రానిప క్షంబున వక్ష్యమాణతాదేశంబు ॥ ఆకర్ణింతురు ॥ దంతురు ॥ చింతురు.

వ్యా—నిండుసున్నతర్వాతి సాధ్యచకారంబునకు దుగాగమంబు పరంబగుచోఁ బత్వంబువికల్పంబుగా నగును.

"ఆకర్ణింపుదురు"ఇట, 'ఆకర్ణించు' అనుదానికంటె (5) సూ—నఁ దద్ధర్మార్థంబులందు లాట్టురాఁగా విమ్మటఁ బ్రథమపురుషమందొండె మధ్యమపురుషమందొండె బహుత్వము వివక్షితమయినపుడు (8) సూ—న రువర్ణకంబు గల్గుచో, "ఆకర్ణించురు" ఇట్లుండును. (22) సూ—న దుగాగమంబురాఁగా, "ఆకర్ణించుదు + రు" అనియుండు. దుగాగమంబు పరంబుకాఁగా నిండుసున్నమీఁది చకారంబునకుఁ బ్రకృతసూ—న పకారంబుగల్గి "ఆకర్ణింపుదురు" అయ్యె. పత్వవిధి వైభాషికంబు గావున నియ్యది ప్రాప్తింపనితఱిని "ఆకర్ణించుదురు" శబ్దంబులోని 'చుద్' అనువర్ణంబు లుధయంబులకును తకారహల్మాత్రమొక్కటియే యాదేశంబై 'ఆకర్ణింతురు' అను రూపంబుసిద్ధంబగు. పక్షంబున (62)సూ— న 'ఆకర్ణింతు' అగు ఆకర్ణించెదరు దంచెదరు ఇత్యాదులునుండవచ్చుంగాని ఆకర్ణించుదురు, దంచుదురు, ఇత్యాదిప్రయోగంబులుప్రామాదికములని యెఱుంగునది.

91 సూ—అగు వచ్చు చొచ్చుచూచులకు ముత్తుపరంబగునపుడు కా, రా, చొరు, చూడు, లగు.

అగు - కాఁడు ॥ వచ్చు - రాఁడు - రమ్ము ॥ చొచ్చు- చొరఁడు - చొరుము ॥ చూచు - చూడఁడు - చూడుము.

వ్యా—అగు ప్రభృతులకు ముడుజ్జులును, జేత్తును బరంబగుచో, కాదులు యథాసంఖ్యముగా నాదేశంబులగునని యర్థము. "అన్యంతౌటకితౌ" అను సూత్రంబున భాష్యకారయట శిఖరాదులయందు ద్వంద్వసమాసములోని పదార్థంబులకును, సముచ్చయార్థకశబ్దఘటితంబులైనవాక్యంబులలోని పదార్థంబులకు లోకమర్యాదననుసరించి

యథాసంఖ్యాన్వయము రానేరదని శంకించుకొని "యథాసంఖ్యమనుదేశస్సమానామ్" అనిపాణిని ప్రత్యేకముగా సూత్రమొనరించినందున నీవ్యాకరణశాస్త్రంబున మాత్రము క్రమాన్వయము చెల్లవచ్చునని వ్రాయఁబడినది. ప్రకృతంబున బాలవ్యాకరణంబులో సూరిగారు పాణినివోలె ద్వంద్వాదులయందు సాహిత్యమును నిరసించి ప్రత్యేకముగా నన్వయము చెల్లునన్న యర్థంబును సమర్థించునట్టి పారిభాషికసూత్రమును రచింపకున్నను, యట్, రుక్, ఇత్యాదులయందు, 'ఆద్యంతౌటకితౌ' అనుసూత్రార్థమును స్మరించుకొని కార్యంబులు నిర్వహించుకొన్నట్టులే యిట్టిస్థలంబులయందుఁగూడ శాస్త్రాంతర సిద్ధంబగు యథాసంఖ్యసూత్రమునర్థమ్ము జ్ఞప్తినుంచుకొని యీవ్యాకరణమందును క్రమాన్వయము చేసికొనవలయునని గ్రంథకర్త తాత్పర్యము. లోకమందుమాత్రము శాస్త్రజ్ఞుల మతంబున సాహిత్యార్థమును దిరస్కరించునట్టి ప్రత్యేకాన్వయము సమన్వయింప నేరదని తలంచునది.

ఉదా—అగు - కాఁడు - వచ్చు - రాఁడు. రమ్ము॥ చొచ్చు-చొరఁడు చొరుము॥ చూచు. చూడఁడు - చూడుము.

"రమ్ము" క్రిట, వచ్చునను లోట్మధ్యమపురుషైకవచనము వివక్షితమయినపుడు 'వచ్చు + ము' ఇట్లుండఁ బ్రకృతసూత్రమున రాదేశము రాఁగా, 'రా + ము, అని యయ్యె. తర్వాత (61) సూత్రమున దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు ద్విత్వంబు సంభవించి పూర్వోక్తరూపం బేర్పడె

92 సూ—ఇచ్చునకు సర్వంబున కీయగు.

ఇచ్చు - ఈఁడు ఇమ్ము ॥ ఈయయను నదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి - బలిమినీ యనిభూమివలయ పతుల.

వ్యా—ము, డుఙు నను, జీస్తునను బరంబగునపుడు. ఇచ్చుధాతువునకు "ఈ" అనునది సర్వాదేశంబగు.

ఉదా — ఈఁడు ఇమ్ము॥ ఈయుచును నాదేశంబు నొక్కానొకచోఁ గానంబడియెడి. బల్మిమినీ యనిభూమివలయపతుల.

వ్యా — మఱియు క్వాచిత్కంబుగా నీయుశబ్దంబుతో లియ్యకారంబునకు హ్రస్వంబుగలిగి యుకారంబునకు ద్విత్వంబునుం జూపట్టెడి. ఉ॥ ఇయ్యదంబాపి గుబ్బలను బాహులఁబట్టఁగనిచ్చి మోవిపైఁ! దియ్యని మోవియుస్సనమదీరఁగ గోర్కెలఁదవిల్చి యిచ్చి పుడో! తొయ్యలినీవిముట్టినను ద్రోచవవేమఁగునిచ్చి యంకుశం! బియ్యక కయ్యమాడఁదగునే! నను నీగతి నేచఁబాడియే॥ శశిబిందుచరిత్రము.

93 సూ — తేతేరులు తెచ్చునకగు.

తెచ్చు - తేఁడు - తేరఁడు - తెమ్ము - తేరుము.

వ్యా — ము, డుజ్జులును, జీత్తులును బరంబగుచోఁ 'దెమ్ము' ధాతువునకు తే కాని తేరు కాని సర్వాదేశంబగు. ఉదా - తెచ్చు - తేఁడు. తేరఁడు. తెమ్ము. తేరుము. క॥ ప్రనోకరుండనవచ్చెనఁ! గాని బలము తేను నీవు గఱపినశస్త్రాస్త్రానేకవిభవిలాసము! దానవలయు నేఁడ గాదె తథ్యంబరయన్॥ భార, ఉద్యో. ౨ ఆ.

94 సూ — చావు నోవులు చచ్చు నొచ్చులకగు.

చచ్చు - చావఁడు - చావుము ॥ నొచ్చు - నోవఁడు - నోవుము ॥ వక్ష్యమాణంబు ద్విత్వంబు - నొవ్వఁడు.

వ్యా — ము, డుజ్జులును, జీత్తులును, బరంబగుచో, 'చచ్చు' నకుఁ జావును నొచ్చునకు నోవును నాదేశంబగు.

ఉదా — చచ్చు-చావఁడు చావుము! నొచ్చు-నోవఁడు-నోవుము వక్ష్యమాణద్విత్వంబు. నొవ్వఁడు. (వ్యా) ప్రకీర్ణకపరిచ్ఛేదములోని యాఱవసూత్రమున నోవులకు ద్విత్వంబును సమాసపరిచ్ఛేదములోని 13 సూ — న నావస్వరంబునకు హ్రస్వంబును గలుగునని తాత్పర్యము.

క॥ ఎవ్వరులేనడనోక్కఁడు। నోవ్వంగానడిచివేని నొప్పికోలఁదియుఁక్, జివ్వక తమునరయందగు। నోవ్విన్వాఁడెగ్గులాడునుత్తముసైనన్ విజ్ఞా. పా౧. కా౦. (కేతన)

చ॥ అనఘునిధర్మనందనుని నాసభనమ్మెయిదీవు నోవ్వఁబల్కిన ఫలమందఁజేసెదఁ జలింపక యిందుక నేపు నిల్వుమీ। వినులఘుచిత్తుఁగ్రూరు నవినీతుమదాంధునిఁద్రుంచి నన్నుఁ బెంచినగరువంపుఁ దండ్రులకుఁ జిత్తమెలర్ప ఋణంబుదీర్చెదన్॥ భార. ద్రో. ౫ఆ.

95 జేత్తుపరంబగునపుడు వానివువర్ణంబు విభాషను లోపించు.

చాక - చావక - చాకుము - చావకుము ॥ నోక - నోవక - నోకుము - నోవకుము.

వ్యా—కజే, ఖజే ఇత్యాదులు పరంబగునపుడు చావునోవుల వుకారంబునకు లోపంబు విభాషగానగు. ఉదా-చాక-చావక-చాకుము-చావకుము॥ నోక-నోవక-నోకుము-నోవకుము.

"చాక" ఇట, కజేవర్ణకంబు పరమగుచోఁ "చచ్చు" నకు, జావుశబ్దమాదేశము కాఁగా (94 సూత్రమున) ప్రకృతసూత్రమున వుపర్ణంబులోపించి పూర్వోక్తరూపం బయ్యె. ఇట్లే నోక, నోక్, చాక్ ఇత్యాదులూహ్యంబులు.

స్రగ్ధర—గాండీవజ్యారవంబుత్కటమయి పెలుచంగప్పినన్ భీముబాహా। దండంబందోప్పుఁశుంభద్గద జడియుచు రౌద్రంబుగాదోఁచినన్వే। దండద్వంద్వంబుమాడ్కిన్ దటిమి కవలు మాద్యద్గతిందాఁకినన్ జా।కుండంబోకుండఁ గౌర్వ్యులకు వశమె బిట్టోర్చి మూర్ఛిల్లకుండన్॥ భార. ఉద్యో. ౧ ఆ.

శా॥ చాపాచార్యుఁడు భీష్ముఁడుంగృపుఁడునశ్వత్థామయుంగర్ణుఁడున్।భూపశ్రేష్ఠుఁడుఁదారుమున్నెఱుఁగరే పోకట్లు కయ్యంబులా। శాపాశంబులుచుట్ట లావెఱుఁగమింజావేఁడిమార్కొందురిం। తే పో తమ్ముఁగపిధ్వజ ప్రభలయుంఢీభూతులంజేయవే॥ భార. ఉద్యో. ౧ ఆ.

శా. ఆకేశిధ్వజుఁడంత నానృపునిరాజ్యంబెల్లఁ జేకొన్ ఫలం।
బాకాంక్షింపఁగ గెల్చి మృత్యువు నవిద్యం బట్టుకుండం దుదం।
బాకుండన్వలెనంచు యోగనిరతిన్ జ్ఞానాశ్రయుండై మహా
నీకంబుల్ రచియించుచం దొకటికిన్ దీక్షించి తానున్నచోన్॥ ఆముక్త. ౪ఆ

క. చాకున్న నీదుముక్తులు। శ్రీకాశీక్షేత్రమెవ్వరికి నిదినిక్కం।
బీకుధరమిచ్చుశిఖరా। లోకనమాత్రమున ముక్తులుకురంగాక్షీ॥ కాశీఖండము

క. బలమున నీతోఁ దొరయఁగ। నిల నెవ్వఁడుగలఁడు నీమహితభుజశాఖల్।
తలఁపఁగ బ్రళయాంతకుదం।ష్ట్రిలు వీనిం దగిలి వశమె చాకుండంగన్॥

భార. స్త్రీప. ౧ ఆ.

క. మూఁకలు చుట్టలు కొడుకులుఁ। జాకుండు తెలియుఁగనుము సరగనటంచున్।
డాకొని యెఱుఁగింపుమటుల్। గాకుండిన దురమెనర్పఁ గారమ్మనుమీ॥

అ. తె. రా. యు. కాం.

క. నాలుగుదిశలను దావ। జ్వాలావళిగవిసెనుండి చానోపఁగ నృపా।
లోలావన్నొక్కపరి। తూఁకలముఁ జేరంగనెత్తికొనిపొమ్ము దయన్॥

భార. అరణ్య. ౩ ఆ.

క. నోనేసి సూతుహయసం। తానముఁ జంపుటయు శల్యతనయుఁడు విరథుం।
డై నిరుపమానమగుతన। మానము వాహనముగాఁగ మదమెలరారన్॥

భార. ఉద్యో. ౧ ఆ.

సీ. అర్జునిపైఁ గూర్మి నతనినోనేయఁడు

సచరాచరంబయిన జగములెల్ల తే. నొక్కనిగమై కండంగినఁ జిక్కపఱచు। దివ్య బాణజాలంబుల దీటుకొలిపి। ప్రాణములు డాపఁడీతనిపాటిదొరలఁ। గాననే రాజ్యముల యందుఁ గౌరవేంద్ర॥ భా. ఉద్యోగపర్వ. ౪ ఆ.

గీ. బలములచ్చెరువొందు వచ్చులవు మెరయ। నీసుతుండనిలజుఁ దాకినిశితసాయ।
కములనొప్పించిరథకురంగములనొంచి।నూతునోనేయఁగ్రోధనిష్పూర్తి నతఁడు.

భార. ద్రోణ. ౪ ఆ.

96 సూ—అగున కనుకనులకు ముజ్జీత్తులు పరంబులగునపుడు కా నాకానలు విభాషనగు.

అపదాద్య సూత్రముచే గాకువకారంబు - వక్ష్యమాణంబౌత్వం బు - కమ్ము - అగుము - అవుము ఔము ॥ కండు - అగుఁడు - అవుఁడు - ఔఁడు ॥ నాఁడు - అనఁడు । కానఁడు - కనఁడు.

వ్యా—ముజ్జు (ముడుజ్జులు) పరంబగునపుడు అగునకు "కా" ఆదేశంబును జీత్తుపరంబగునపుడు అనునకు 'నా' యును కనునకు 'కాన' యును నాదేశంబు. లు నూతోక్తక్రమంబునవగు. (మూలము) అపదాద్యసూత్రముచే గాకు వకారంబు వక్ష్యమాణంబౌత్వంబు.

వ్యా—అచ్ఛికపరిచ్ఛేదములోని 27 సూ-మున, అగుధాతుగకారంబునకు వికల్పం బుగా వకారంబును, ప్రకృతిపరిచ్ఛేదములోని 103 సూత్రమున. అవునకు బహుళంబు గా, ఔకారంబును నాదేశంబులగునని భావము.

ఉదా—కమ్ము-అగుము. అవుము ఔము॥ కండు-అగుఁడు-అవుఁడు-ఔఁడు నాఁడు-అనఁడు-కానఁడు-కనఁడు॥

వ్యా—'కమ్ము' ఇటఁబ్రికృతసూత్రంబున మధ్యమపురుషైకవచనము పరంబగు చో నగునకు వికల్పంబుగా, 'కా' కారమువచ్చి 'కా + ము' అనియయ్యె 61 సూత్ర మున హ్రిస్వంబుగఁగి ముత్వంబునకు ద్విత్వంబురాఁగాఁ బైరూపంబేర్పడె. కాదేశము వైభాషికంబగుటంజేసి యభావపక్షంబున 'అగుము' అనురూపంబు. 'అవుము' అచ్ఛి కపరిచ్ఛేదములోని 27 సూత్రమున వత్వంబు, 'ఔము' ప్రకృతపరి-ములోని 103

సూ. స్వరకారోత్వరంబు. 'కండు' (ప్రకృతసూత్రమున డుజ్ఞుపరంబగుచో, కాదేశము రాఁగా కా + డు అనియుండు.

61 సూత్రమున హ్రస్వంబురా 'క + డు' అనియుండు. ఇట డువర్ణకంబు జిత్తు గాన జిత్తు బిందుపూర్వంబగు ననుసూత్రమునఁ బూర్ణబిందువు రాఁగ, 'కండు' అనియుండు సంధిపరిచ్ఛేదములోని 21 సూత్రమునఁ దొలి హ్రస్వంబగుకకారముమీఁద, నరసున్న యుండదని స్మరించునది.

"నాఁడు" అనుధాతునకు వ్యతిరేకంబున లజిరాఁగ నది జీత్తుగాన, ప్రకృత సూత్రంబున నా దేశంబువికల్పంబుగానయ్యె. ఇట్టి 'కానఁడు' అనుచోటఁ గానా దేశంబునయ్యె.

ఉ. కావున లోకసంక్షయము గన్గొని యెల్లెడ నిర్మలుండవై। నీవును శాంతియుక్త సమత్వనిష్ఠయుఁ బూని గుహాప్రవేశనం। భావనాత్మదర్శనవిభాసికమ్మని నందదీయ వి। ద్యావచనంబులం జనకుఁడట్టిఁడయై వెలిఁగెం గృతార్థతన్॥ భార. శాంతి. ౨౮

97 సూ.—నేరుచునకు లిఙ్గాట్టులు ముత్తుం బరంబులగునపుడు రుచులకు లోపంబు బహుళంబుగానగు.

నేచెను - నేరిచెను - నేచును - నేరుచును ॥ నేరఁడు - నేరువఁడు.

వ్యా.—లిఙ్గాట్టులు పరంబగునపుడు నేరుమనకురువర్ణలోపంబును, ముత్తుపరంబగునపుడు (ముడుజ్ఞులును జీత్తులును) చువర్ణలోపంబును బహుళంబుగానగునని క్రమాన్వయము.

ఉదా.—నేచెను నేరిచెను-నేచును-నేరుచును-నేరఁడు-నేరువఁడు.

వ్యా.—నేచెను. లిట్టు (భూతప్రథమపురుషైకవచనంబు) గాన రేఫలోపంబు. నేరిచెను. 85 సూ-న రేఫోపరియుకారంబునకు నికారంబు. నేరఁడు. ఈసూత్రంబున

(వ్యతిరేకార్థకలజిజీత్తుగావున) చువర్ణలోపంబురాఁగా 20 సూ-న, రేఫోపరియుకారంబున కత్వంబు. నేరువఁడు 88 సూ-న, సిద్ధచకారంబు గావున వకారంబు.

కం॥ద్యూతక్రీడకుఁగొండొక। నేతుంగపటమున నొప్పనిజనంబులు నా చేతిధన మెల్లఁగొని పరి। భూతియొనర్చిన విరక్తిపొడమి వెడలితిన్, భార. విరా ౧ ఆ. లొట్టు గావునఁ ప్రకృతసూత్రమున రేఫలోపంబుగలిగి "నేచుదున్" అనియుండ108 సూ-న చుదులకు, దకారంబాదేశంబయి "నేతున్" అయ్యె.

ద్విపద.—నీతలలందంద నేలపైఁగూల్ప। నేతునే వీక్షింపనిర్జరవైరి. రంగనాథుని రామాయణము.

కం. కాచికొనివచ్చితగనా। నేచినయట్లచటనచట నిలిపితిమునినా।
ధానేటునా భంగంబును। నైచిత్తము శోకమునకు నగ్గంబయ్యెన్॥
భార మౌసలప. ౧ ఆ.

"నేచినయట్లు"—ఇటఁ ప్రకృతసూత్రంబులోని నిష్ఠగ్రహణంబు భూతకాలంబునకు నుపలక్షణంబు గావున భూతార్థకంబైనక్త్వదర్థంబున విధింపఁబడిన న ప్రత్యయము పరముగాఁగ రేఫలోపంబయ్యె.

98 సూ—పోవునకు దుజ్ముత్తులు ముజ్జుంబరంబులగునపుడు వు లోపంబుంబోద పదలును విభాషనగు.

పోదురు - పోవుదురు - పోఁడు - పోవఁడు - పోవుము ॥ పొదము - పదము - పొమ్ము.

వ్యా—దుజ్ముత్తులు పరంబగునపుడు పోవునకు వులోపంబును, ముజ్జుపరంబగునపుడు పోదపదలును సూత్రస్థపదక్రమంబున నాదేశంబులగు.

ఉదా—పోదురు-పోవుదురు-పోఁడు పోవఁడు॥ పోవుము పొదము-పదము పొమ్ము.

"పోదురు" ఇటఁబోవుధాతువుమీఁదిలోట్టునకుఁ బ్రథమమధ్యమపురుష బహువచనంబులలో సెద్ధానిలోనంగాని, బహుత్వము వివక్షితముకాఁగా "పోవు + రు" అయ్యె. పిమ్మట (22) సూత్రమున దుగాగమంబును బ్రకృతసూత్రమున వులోపంబును గలిగి పైనినిరూపింపఁబడిన రూపంబయ్యె.

'పోఁడు' పోవునకు వ్యతిరేకార్థమందు (7) సూ-న లజేయుప్పతిల్లి లజేయుత్తు గావునఁ బ్రకృతసూత్రమున వులోపంబుగలిగిన రూపంబు

"పొదము" పోవునకు ముజుపరంబగునపుడు పొదాదేశము. కం॥ యదుకుల విద్వేషణుఁడై। మదమునవర్తించు కంసుమర్దించి భవ|త్సదనంబుఁ జూడవచ్చెదఁ। బొద మీస్యందనముఁ గొనుచు బురమున కనఘా॥ భాగ ౧౦ స్కం. పూర్వభా.

కం॥ ఇదె! మాటికిఁ దెనఁగొనియెదుఁ। గొదమాలినవలపు తేఁటికొదమా! చెలిపై నెదమానినయెరపూనుచుఁ। బొదమా! పరికింత మలరుఁ బోదమాటునకున్॥

అచ్చతె. ర. అరణ్యకాం

సీ॥ అనిబల్కి కేవునవార్చి యొక్కుమ్మడిఁ గదలి యొండొరుమీఁటి పొదఁడు పొదఁడు। బలిమిమై బొదువుఁడు పట్టుఁడుకొట్టుఁడం చేడ్తెఁదొడరియయ్యెలచిదిండ్లు॥

అ. తె. రా. యు. కాం

"పదము"—చం॥ ఉడుపతిబారికి న్వెఱచి యూఱటయూనని పేరుటామనిన్।
ముడివదుకంతుసేనలకు మొయ్యెలగుట్టయినట్టి యిందురా।
నడఁగక తాపవహ్ని ఘనమై హరిణేక్షణముల్లుపుచ్చికా।
తొడఁచినచందమామయోఁ బదమా! యెలదోఁటఁ జరింపకింటికిన్॥

మను. 3. ఆ.

99 సూ—అగుపోవులకడ వ్రాలకిద్వక్రంబులు పరంబు లగునపుడు యకారంబగు.

వక్ష్యమాణంబైత్వంబు - అయి - ఐ - అయిరి - ఐరి ॥ పోయి పోయిరి - పోయెను - పోయెదు.

వ్యా—ఇటఁ జెక్కినసూత్రంబులయందుంబలె సాంస్కృతిక వ్యాకరణంబందలి యథాసంఖ్యసూత్రమ్ము స్మరించి తత్సామర్థ్యంబునఁ గ్రమాన్వయమును జెప్పికొనిన యట్టులుగాక లోకమర్యాద ననుసరించియే ద్వంద్వవిశిష్టార్థముతో ద్వంద్వవిశిష్టార్థ మును సమన్వయింపఁజేసికొనవలయును. దేవదత్త యజ్ఞదత్తులు చరస్థిరాస్తులు భాగించు కొనిరియన్నపుడు క్రమాన్వయము లేక లోకమర్యాద ననుసరించి దేవదత్తయజ్ఞ దత్తులుభయు లనుజరస్థిరాస్తులుభయములనుబంచుకొనిరి యన్నయర్థము చెప్పికొనినయట్టులే యిటఁగూడ నగుపోవు లుభయంబులతోడను నిద్వక్రమంబు లుభయంబులు సంబంధించి యగు పోవుధాతువుల యుభయంబుల తుదివర్ణంబులకును నికారవక్రంబు లుభయంబులు ను పరంబగునపుడు యకారాదేశంబగు. ఇట నికారసాహచర్యంబునఁ దాలుస్థానిక మైన వక్రంబే (ఎ) గ్రహింపంబడును.

(మూలము) వక్ష్యమాణంబైత్వంబు. (వ్యా) 103 సూత్రమున బహుళంబుగా, ఐకారంబు. ఉదా—ఐ-అయి-అయిరి-ఐరి॥పోయి-పోయిరి-పోయె-పోయెడు॥"అయి" (38) సూత్రంబునఁ బూర్వకాలమం దివర్ణకంబురాఁగా 'అగి, అయి ప్రికృతసూత్ర మున నికారము పరమయినందున నంత్యంబగుగకారంబునకు యకారంబు గలిగె. అగు ధాతుగకారంబునకునపదాద్యసూత్రమునవచ్చిన వకారంబును గ్రహింపఁబడియకారంబు గలుగు. 'అయిరి' ఇట అగుధాతువునకు లిట్ప్రథమపురుష బహువచనంబు వివక్షితము గాఁగ 'అగు + రు' అయ్యె. పిదప 17 సూత్రమున నిగాగమంబుగలిగి తత్సమపరిచ్ఛేద ములోని 26 సూత్రమున రువర్ణకంబున కిత్వంబు వచ్చినందున 'అగిరి' అయి ప్రికృత సూత్రమున యత్వంబురాఁగా 'అయిరి' అనినరూపనిష్పత్తిసిద్ధించె. 103 సూత్రమున బహుళంబుగా నైకారంబు ప్రాప్తించి 'ఐరి' అయ్యెను.

ఇట్లే 'పోయిరి' అనురూపంబు. పోయితివి పోయితిరి ఇత్యాదిరూపంబులు, 17 సూత్రంబున నిగాగమంబును, 18 సూత్ర-నఁ దివర్ణకంబును గలిగి ప్రికృతసూత్ర మున యత్వంబురాఁగా నైనరూపంబులు. కొందఱాధునికకవులు 'పోతివి' 'పోతిరి' యిత్యాదిరూపంబులు వర్ణహీనంబుగా తమకబ్బంబులఁ బ్రయోగించెదరు. అయ్యది యతిసాహసంబు.

ఉ. అక్కట మందభాగ్యుఁడనకట్టి తనూభవరత్న మెవ్విధిన్
దక్క విధాతనిర్దయుఁ డొడంబడునే? కడుమేలివస్తువుల్
పెక్కుదినంబులుండ్క యరిబృందముపిల్చినఁ బోటుబంట్వై
యక్కడఁ కేలపోయితి మహాపణభూషణుఁ గోలుపోయితిన్.

భార. ద్రోణప. 2 ఆ

చ. పలుకు నెయిట్లు గొంతి విని బమ్మెరపోయితిమింత దెట్టిదం
బులగునె మాటలయ్యుమయుఁ బుణ్యుఁడు కృష్ణుఁడు కార్యవాదముల్
వలికెడునట్టివారు తెగఁబాఱిరి ధర్మజవాక్రిరాశికిన్
జెలిమిఁకట్టవానె మనచేనగుకర్జముచంద మెట్టిదో॥ భార- ఉద్యో-౪ ఆ.

## 100 సూ— అగునకువక్రంబుగూడుచో దీర్ఘంబగు.

వక్ష్యమాణంబు ద్విత్వంబు - ఆయెను - అయ్యెను - ఆయెడు - అయ్యెడు.

వ్యా—అగుధాతువు తుదియచ్చునకు సంధివశంబున నెత్వంబుగూడఁగా దక్కిన యచ్చునకు, అనఁగా నాదియగునకారమునకు దీర్ఘంబగునని భావము.

(మూలము) వక్ష్యమాణంబుద్విత్వంబు. (వ్యా) ప్రకీర్ణకపరిచ్ఛేదములోని 6 సూత్రమున, సూయేలాదులలోనిది గాన మీదిహల్లునకు ద్విర్వచనంబు.

ఉదా—ఆయెను. అయ్యెను-ఆయెడు-అయ్యెడు. ఆయెను, అపథాసప్రవృత్తుడుబునకు 16 సూత్రమున నెనువర్ణకంబుకలిగి యుత్వసంధిచే అగెను, అయ్యె. ఇపుడు 99 సూ-న యత్వంబును బ్రకృతసూ-న నాద్యచ్చునకు దీర్ఘంబునురాఁగా నిర్దిష్టరూపంబయ్యె: అయ్యెను, ప్రకీర్ణకపరిచ్ఛేదములోని 6 సూత్రమున యద్విత్వంబును సమాసపరిచ్ఛేదములోని 13 సూత్రమున నాద్యచ్చునకు హ్రస్వంబును గాఁగాఁ బూర్వోక్తరూపంబు.

101 పిలుచు మొదలగు ఎ-సకిముత్తు పరంబగునపుడు కడవ్రా యి బహుళంబుగ లోపించు.

పిలఁడు - పిలువఁడు - పిలుము - పిలువుము - లేచునకుముజ్జు పరంబగునపుడు చులోపంబగు - లెమ్ము - లెండు ॥ పిలుచు - నిలుచు తలఁచు - ఇత్యాదులు.

వ్యా—పిలుచుధాతువులోనుగాఁగల ధాతువుల తుదివర్ణము, ముడుజ్ఞులును, జేత్తులును బరంబగునపుడు లోపించు. ఉదా—పిలఁడు. పిలువఁడు॥ పిలుము-పిలువుము (వ్యా) 'పిలఁడు' ఇటఁ బిలుచునకు వ్యతిరేకంబున 7సూ-న లజ్ప్రత్యయము రాఁగాఁ బ్రకృతసూత్రమునఁ జువర్ణంబులోపించి (20) సూ—న లకారోపరియుకారమునకు నత్వంబుగలిగె. (మూ) లేచునకు ముజ్జుపరంబగునపుడు చులోపంబగు. లెమ్ము. లెండు పిలుచు-నిలుచు తలఁగు ఇత్యాదులు. (వ్యా) 'లెమ్ము' ఇటలేచునకు మధ్యమపురుషైకవచనంబు వివక్షితమయినపుడు, వువర్ణకంబునకు (29) సూ-న ముపర్ణకంబాదిష్టంబయి ప్రకృతసూత్రంబునఁ జువర్ణలోపంబుకలిగి (61) సూ—న హ్రస్వంబును ముద్విత్వంబును బ్రాప్తింపగానైనరూపంబు. 'లెండు' లేచునకు (29) సూ—న లూట్టురువర్ణకంబునకు బహుత్వంబున డుజ్జుగలిగి ప్రకృతసూ-నఁ జులోపంబును (61)సూ-న హ్రస్వంబు రాఁగా డుజ్జు జిత్తుగాన 'జిత్తుబిందుపూర్వంబగు' నన్నసూత్రమున డువర్ణకంబునకు ముందుఁ బూర్వబిందు వుప్పతిల్లె. సంధిపరిచ్ఛేదమునందలి (21) సూత్రమున నుడితోఁ హ్రస్వంబు మీఁద ఖండబిందువు నిషేధింపఁబడినందునని టనర్థానుస్వారము 'వండుఁడు' ఇత్యాదులందుంబలె రాదని యెఱుంగునది.

పిలుము. పిలువుము ఇత్యాదులందుంబలెఁ బిలుఁడు- పిలువుఁడు మొదలగువాని యందును జువర్ణలోపంబు బహుళంబుగాఁ బైసూత్రంబున నయ్యెడును.

కం. పిలుఁడీ! కడయకర్ణుని! బలవిక్రమశాలి యతఁడు పదిదివసంబుల్ ।
గలనికి రాఁడు నదీసుతు। పలుకులకుంగనలి సచివబంధుయుతముగాఁ ॥

భార. ద్రో. ౧ ఆ.

కం. నిలుఁడునిలుఁడనుచు వారలఁ। బోలఁ బుగఁ దెనకుఁ బకుమగుడఁ బురికొల్పుచున
త్తులువ తొలివేల్పుఁ బైకొని। బాతపుప్రమానొకటి మీఁదఁ బడవైచుటయున్॥
అ. తె. రా. యు. కాం.

కం. చులుకఁదనంబున విప్రున। కలుకం గాఁదగదు గురుఁడవైయుండుదునం।
చలయక తెలిపితిఁ గాకిటు। నిలుమీ! నీరణము నేఁత నిజమగు నేనిన్॥
భార. ఉద్యో. ౪ ఆ.

చ. నిలునిలు మొఱఁగుఁ బోఁగలవు నీ విటు వాటినఁ జావు దప్పునే।
యలవుఁ జలంబుఁ బోవిడిచి యా సభ నించుకళంకలేక నీ
పలికినయన్నియున్ మఱచి భంగపుఁ జచ్చుట దెచ్చికొంటి పె।
ద్దలు వగఁ బొందవన్నకును దమ్ములకుం దలవంపు గానినీ? భా. ద్రో. ౩ ఆ.

కవిసంశయవిచ్ఛేదము—పరిధ—తరం. కం॥ నిలువుము కొలువుము పిలువుము। గెలువుము విడువుము నఁగాఁదగిన బహుశబ్దం। బులకుం ద్రుతీయువర్ణము। తొలఁగిన దోషంబులేదు తుహినాంశుధరా॥

ఉ. బుద్ధులు చెప్పు టెల్ల నట పోవిడు మెమ్మెయినైన సౌఖ్యసం।
సిద్ధియొనర్ప నాకు వెడచేసినఁ దాపము రూపుమాపు నా।
వృద్ధియు కోరు జేనియ వివేకివు నీవని నన్ను నిట్లసం।
బద్ధములైన వాక్యములు పల్కక వే పిలిపింపు కోమలిన్॥ భార. విరా. ౨ఆ.

వెఱచుననుంగూడ నంత్యవర్ణలోపంబు కవిప్రయోగంబులఁ గానంబడు.

తే. గీ. చెంచునంటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము।
చెప్పినమ్మించి తలమీఁదఁ జేయివెట్టి॥
వెఱకుమని తన్ముఖంబున నెఱుకు తేని।
గాంచి యాతనితోడ సఖ్యంబుఁ జేసి॥ కాశీఖండము.

కవిసంశయవిచ్ఛేదాది గ్రంథకర్తల యభిప్రాయమువం జేసి యీపిలుచుప్రభృతి గణంబులో నన్నిధాతువులను మువర్ణాంతములే గ్రహింపఁదగినట్లు ధ్వనించుచునని కొంద

అందురు. కాని బాలవ్యాకరణపుస్తకంబులు కొన్నిటిలోఁ 'దలఁగు'నుమఱికొన్నిటిలోఁ 'దలఁచు'ను ముద్రింపంబడియె.

'తలఁడుతలండ'నిన కతిపయకవుల గద్యంబులయందలి ప్రయోగంబులుమాత్రమర్థ సందర్భమునుబట్టి తలఁగునకు సాధకంబగునుగాని తలఁచునకు సాధకంబుగాఁ గనఁబడు చుండలేదు కాన సుధీమణులు శోధింతురుగాక!! ఇట్లు సూత్రస్థబహుళగ్రహణంబున "స్థితస్యగతిశ్చింతనీయా" యను న్యాయంబు ననుసరించి సత్కవిప్రయోగంబులు సమర్థించుకొనునది. సంధిపరిచ్ఛేదములోని (౧౩) సూత్రమునొద్ద "మీరు తలఁడు" అను నుదాహరణవ్యాఖ్యచూడందగు.

**102 సూ—లాఁతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి.**

**కావుతను - కాతను ॥ అగుట, కావుట ॥ అగుదును - కావుదును ॥ కానను - కావునను ॥ అనుడును - అనవుడును - నావుడును- ఇత్యాదులెఱుంగునది.**

వ్యా—ముదుజ్ఞులును, జేస్తులును బరంబగునపుడు, అగునకుఁగాదేశంబును, అనునకు నాదేశంబును, (96)సూ-న విధింపంబడియె. అట్లు ముత్తుపరంబగునప్పుడేకాక 'తను' వర్ణకంబును (26సూ) టువర్ణకంబును (౩౮ సూ) భావలక్షణార్థంబందలి నను వర్ణకంబును, (41 సూ) బరంబగునపుడు అగునకుగాదేశంబును, డునువర్ణకంబు పరంబగునపుడు, అనునకు నాదేశంబును బహుళంబుగానగు. వానికి వుగాగమంబు బహుళంబు. ఉదా. కావుతను. కాతను॥ అగుట కావుట॥ అగుదును-కావుదును॥ కానను-కావునను॥ అనుడును-అనవుడును-నావుడును ఇత్యాదులెఱుంగునది.

"కావుతను" అగుధాతువుమీఁదిలాట్టుదుజ్ఞునకు (26) సూత్రమున ద్రుతాంతంబయినతేవర్ణంబు రాఁగాఁ బ్రకృతసూత్రంబునఁగాదేశంబగుచో వుగాగమంబు బాహుళకంబుగాఁగలుగఁ బైనిర్దిష్టరూపంబయ్యె. 'కాతను' వుగాగమాభావమందు రూపంబు,

ఉ. ఉల్లమునందు నక్కటికమూనుట మీకులమందుఁ గంటిమం।
చల్లన మేలమాడునచలాత్మజమాటకు లేతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపతదివ్యశరాఢ్యునిఁ జేయుశాంబరీ।
ధిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్॥

మను. ౧ ఆ.

శా॥ శ్రీతోఁబుట్టి సుధావధూదితముతోఁ జెన్నొందుపుష్పంబుతో।
భూతార్యావెలయంగా ముదముపంపా హేమకూటాశ్రయ।
ఖ్యాతబ్రహ్మము ప్రోచుఁగావుత! విరూపాక్షాహ్వయంబాకవీ।
టీతిమ్మప్రభు వేంకటాద్రిహృదయాటీకంబు లోకంబులన్॥ రాఘు ౧ ఆ.

తే. గీ. ఉపనిషత్తులు చోటులైయోలగింపఁ। బుండరీకాసనమున, గూర్చుండి మదికి। నింపువేడుక వీణవాయించుచెలువ।నలువరాణి మదాత్మలో వెలయుఁగాత॥ మను ౧ ఆ. గీ. "అఖిలభూతములకు వానందమగు గాత"—మార్క౦. ౮ ఆ.

ఇయ్యవి యాశీరర్థమందుఁ దద్ధర్మార్థక్రియలకు నుప్రయుక్తంబగునందుఁ. 'కావుతన్' అనునది ముఖ్యక్రియగాఁగూడఁ బ్రయోగింపఁబడదగు. కావుననే మొదటనుదాహరింపఁబడిన మనుచరిత్రపద్యంబులో "శుభప్రతిపాదిగావుతన్" అని కేవలస్వతంత్రక్రియగానే యాంధ్రకవితాపితామహాదులు ప్రయోగించియున్నారు. క్రియాపరిచ్ఛేదములోని (26) సూత్రమ్ములో 'దుజ్' నిప్రత్యాహారంబు గ్రహించిన సామర్థ్యంబు నందేసి సమస్తపురుషవచనంబులందును నెదుతవర్ణంబులు ఘంటాపథంబుగా నుండనొప్పు కాన (1) అతండు శుభప్రతిపాది గావుతన్ (2) వారు శుభప్రతిపాదులు గావుతన్ (3) నీవు శుభప్రతిపాదివి గావుతన్ (4) మీరలు శుభప్రపాదులరు గావుతన్ (5) నేను శుభప్రతిపాదిని గావుతన్ (6) మేము శుభప్రతిపాదులము గావుతన్॥ అనినపురుషవచనంబులన్నిటికిని భేదంబులేక యప్రతిహతంబుగా, 'కావుతన్' అనుతనంతక్రియసమన్వయించును. ఇట్లే (1) యతఁడేలుతన్ (2) వార లేలుతన్ (3) నీవేలుతన్ (4) మీరేలుతన్ (5) నే నేలుతన్ (6) మే మేలుతన్॥ ఇత్యాదిస్థలంబులందు 'ఏలుతన్' ఇత్యాదితనాద్యంతాదిక్రియలు పూర్వోక్తస్థలంబులందు, 'గావుతన్' అను

తవంత క్రియవోలె సర్వపురుషవచనంబులతో సామానాధికరణ్యంబు సమకూరఁగా విజృంభించుచుండదగు. పురుషవచనంబుల భేదంబును దెలియంజేయునట్టివేర్వేఱుప్రత్యయంబుల నొందక యన్నిటియందును సమానాకారంబైన "ఏలుతక్" ఇత్యాదిశబ్దంబుల యర్థంబునను యుష్మదస్మదాదిశబ్దార్థంబులతోడి సంబంధము లోకవిరుద్ధంబని శంకింతురేని సావధానచిత్తంబునఁ జిత్తగింపుఁడు. సంస్కృతభాషలోఁగూడ సమానప్రత్యయాంతమయిన శబ్దంబులయర్థంబులకు యుష్మదస్మదాది శబ్దార్థంబులతోడి సంబంధము గానంబడుచుండు. అయ్యది నిదర్శనంబుగా నిచ్చటఁ బ్రదర్శింపఁబడును.

| | | | | |
|---|---|---|---|---|
| తేన విద్వతా భూయతామ్ | | | = | సవిద్వాన్ భవతు. |
| త్వయా | ,, | ,, | = | త్వంవిద్వాన్ భవ. |
| మయా | ,, | ,, | = | అహంవిద్వాన్ భవాని. |
| తైర్విద్వద్భిర్భూయతామ్ | | | = | తే విద్వాసో భవంతు. |
| యుష్మాభిః | ,, | ,, | = | యూయంవిద్వాంసోభవత. |
| అస్మాభిః | ,, | ,, | = | వయంవిద్వాంసోభవాము. |

ఇత్యాదుల "భూయతామ్" ఇత్యాద్యనేకశబ్దంబులయర్థంబులకే పైనిం జూపిన విధంబున యుష్మదస్మదాది శబ్దార్థంబులు కర్తలుగా సంబంధించుట కరతలామలకంబై కానంబడుచున్నది. ఇంకను విశేషం బేమనఁగా భాషాపరిపాటిం జేసి సంస్కృతభాషలో నకర్మకధాతువులయందే యిట్టిరూపంబులు కనంబడును. మఱియుఁ దిఙ్ప్రత్యయంబు కర్త్రర్థమందు రాక భావార్థమందు వచ్చినందునఁ దాదృశతిఙంతము, స్వార్థంబును జెప్పునట్టి యవసరంబునఁ బ్రథమాంతపదంబునకు నర్థంబైనకర్తను నాకాంక్షింపనందున భాషాశైలిం జేసి "కర్తృకరణయోస్తృతీయా" అనుసూత్రంబునఁ గర్తతృతీయాంతమై యుండును. ప్రకృతంబుననో, యాంధ్రభాషామర్యాద ననుసరించి సకర్మకంబులును నకర్మకంబులునైనయుభయవిధధాతువులకు నాశీరాద్యర్థంబులు విషయంబగుచోఁ గర్త్రాద్యర్థమందు డుఙ్ఙు విధింపఁబడినందున నట్టిడుఙ్ఙునకాదేశంబైన తనాదివర్ణకంబు ప్రథమాంతపదంబునఁబోధింపఁదగు కర్త్రాదికము నాకాంక్షించుచుంటం జేసి యిట్టిస్థలంబులందుఁ గర్త ప్రథమాంతములోనుండును. ఇట్టులు సంస్కృతాంధ్రభాషలలోఁ గర్తృవాచకంబులైన యుష్మదస్మదాదిశబ్దంబులు భిన్నభిన్నవిభక్తులలోనున్నను దదర్థంబులు మాత్రమేకవిధతిఙంతమ్ములతోఁ

గర్తలుగా నన్వయించుచున్నందున సాదృశ్యము స్పష్టమగుచున్నది. సంస్కృతభాషలో గూడ ఫలితార్థములో యుష్మదాదిపదంబులు ప్రథమాంతములుగానే యన్వయించుచుంట చూపఁబడ్డది కావునఁ బూర్వోక్తదృష్టాంతానుసారంబున, 'జేయునది' మొదలగు విధ్యర్థకక్రియలును దనాద్యంబులై యాశీరాద్యర్థకక్రియలును నాంధ్రభాషామర్యాదం జేసి యఖిలపురుషవచనంబులతోడ నన్వయించుట యబ్బురంబుగాదనియెఱుంగునది లూట్టు డుజ్జున కెడుతవర్ణంబులు విధించిన (26) సూత్రము సామాన్యసూత్రమనియు, లూట్టు మధ్యమపురుషంబునకు ముడుజ్జులు విధించిన (29) సూత్రము విశేషసూత్రమనియు నెంచి మధ్యమపురుషములో మాత్ర మేకత్వబహుత్వములందుఁ గ్రమంబుగా ముడుజ్జులు గలుగును గాని (26) సూత్రమునఁ దనాదివర్ణకములు గలుగనేరవని కొందఱు శంకింతురు. అయ్యది ప్రమాదమూలకంబు. అట్లయ్యేనేని డుజున కెడుతవర్ణంబులని ప్రత్యాహారంబు గ్రహించి తత్సామర్థ్యమును సూచించునట్టి గ్రంథకర్తతాత్పర్యంబునకు విరోధంబు సంభవించు. ఇదియునుంగాక యింకొకవిశేషంబు గలదు. (27) సూత్రము లూట్టునవిధ్యర్థంబు విషయంబగుచో సర్వపురుషవచనంబులయందును నదిశబ్దంబును విధించుచున్నదిగదా!! కాననయ్యది వ్యాపకంబుగాన సామాన్యసూత్రము గావలయును. (29) సూత్రమన్ననో, లూట్టులో నేకదేశంబగు మధ్యమపురుషంబులకు ముడుజులను విధించుచు వ్యాప్యంబయినందున విశేషసూత్రము కాకతీరదు. ఇట్లు పరస్పరంబును సామాన్యవిశేషభావంబు స్పష్టపడఁగా సమీపవర్తియైన (27) సూత్రంబును ననంతరన్యాయంబున (29) సూత్రమున బాధించునుగాని (27) సూత్రమును దాఁటి మాఱవర్తియైన (26) సూత్రార్థము నెట్లుబాధింపఁజాలును?

కాఁబట్టి (26) (29) సూత్రంబులకుఁ బరస్పరంబును బాధ్యబాధకభావకల్పనంబు సమంజసముగాఁ గనఁబడదు. వాస్తవంబును బరిశీలింపఁగా శమీపవర్తియైన (27) సూత్రమును సయితము (29) సూత్రము బాధింపదనియే గ్రంథకర్తతాత్పర్యమయినట్టులు ధ్వనించుచున్నది. ఏలయనఁగా (27) సూత్రమునొద్ద "వానికి నీవు బాసటయయియుండునది" యని మధ్యమపురుషైకవచనస్థలంబున నదిశబ్దంబు సంభవించుననుటకు నుదాహరణమీఁబడినది. పైనింజూపినవిధంబున నిట్టిస్థలంబునందు విశేషవిధియైన (29) సూత్రమున మధ్యమపురుషంబునందు ముపర్ణకంబురాఁగా "నీవు బాసటయయియుండు" మని యుండందగునుగాని యిచ్చట నదిశబ్దంబు విధ్యర్థమందు సంభవించి

పూర్వోక్తంబయిన యుదాహరణవాక్యమెట్లు సాధువుకాఁజాలును? కాన (27) (29) సూత్రములకు నయితము బాధ్యబాధకభావంబు లేకుంట గ్రంథకర్త భావంబయినట్లు స్పష్టపడుచున్నది. ఇట్లు (29) సూత్రంబున (27) సూత్రకార్యంబునకే భంగంబు సంప్రాప్తింపనిస్థితిలో దూరవర్తియైన (26) సూత్రకార్యంబునకు భంగమ్ము సంభవించునన్న పూర్వపక్షోక్తపృష్ఠతాడనంబున దంతభంగంబు సంభవించునన్న లోకోక్తి వంటిదియై మిగుల హాస్యాస్పదంబగును గాని వేఱొంటికాదు. శంకాకారులమతంబునకు స్తమ "నీవు శుభప్రతిపాదివి గావుతక" "మీరు శుభప్రతిపాదులరు గావుతక" అనిన యిట్టి మధ్యమపురుషస్థలంబులందుఁ దనంతమయిన తుగు ధాతువుసాధువనకతీరదు. కాఁబట్టి సర్వపురుషవచనంబులయందును నాశీరాద్యర్థవిషయంబున దుగ్రాంతమయిన యొకుతవర్ణంబులును, విధ్యర్థవిషయంబున నదిశబ్దంబును నిరాంతకముగాఁ బ్రవర్తిల్లచ్చును. ఈయర్థమే చిన్నయసూరివిరచితమైన శబ్దలక్షణసంగ్రహమందలి క్రియాపరిచ్ఛేదములో—

(53) సూ—తవర్ణకం బాశీస్సులందు సర్వవచనంబుల కగు.

(54) ఎదువర్ణకంబొండెనగు.

అనునీసూత్రంబులందు స్పష్టముగా వివరింపఁబడినది. ఒకవేళను శంకాకారులు పూర్వకవిప్రయోగంబులోఁ బ్రథమపురుషక్రియలయందుంబలె మధ్యమపురుషక్రియలయందు నెదుతవర్ణంబులు గానంబడవందురేని యట్టి గట్టిప్రశ్నంబుత్తమపురుషంబునకును సదా సాధారణంబై సంబంధించుచుంగావున నప్పుడు (26) సూత్రమందలిదుబు ప్రత్యాహారగ్రహణంబు మీఁదుమిక్కిలి వ్యర్థంబై మఱింతసామర్థ్యంబుగలదయ్యెడిని. కాన నికవిస్తరంబుతోఁ జాలును. కవిప్రయోగంబులు గనుంగొనఁజాలని స్వదౌర్బల్యదోషంబును శాస్త్రంబునం దారోపించుట యుక్తంబుగాదు గావున నిబ్బహుకాలంబ్రథోక్తిమయప్రపంచంబునఁ బండితపుంగవులు పరమశ్రద్ధాపూర్వకంబుగాఁ గవిప్రయోగంబులు గవేషింతురుగాక!? ఇట్లు పైనిఁజూపిన యీశాస్త్రంబు లప్రతిహతంబైన యీశాస్త్రంబులై పరిఢవిల్లుచుండఁగా నయ్యవి గ్రహించిన యుత్తమపురుషుండు నానార్థదాయకంబై హృద్యంబగుపద్యంబును గేవల మధ్యమపురుషార్థంబునుమాత్రమే యీఁజాలి యాకారాంతబగునట్టి క్రియతో విక్రియనొందింపక, సమస్తపురుషార్థదానంబున బద్ధకంకణంబయి నాంతంబగునట్టి సత్త్రాశయక్రియతో సత్క్రియనొనరింపసాహసింపఁదగునని యెన్నుకొని మద్విరచితంబైన జార్జిముక్తావళియందలి పద్యంబు

'కానన్, కావునన్' అనుపదంబులు భావలక్షణార్థకనపర్ణకాంతమ్ములని యెఱుంగునది. 'ఇయ్యవి ప్రయోగించినప్రదేశంబులందుఁ బూర్వోక్తార్థంబులకుఁ గార్యకారణభావంబు ఫలితార్థంబుగాఁ దోఁచుచుండు. (1) 'అనుడును(2) అనవుడును (3) నావుడును'—అనుధాతువునకు (42) సూ—న డుడువర్ణకంబు. (2)వ రూపమందు బాహుళకంబునంజేసి వుగాగమంబును, ధాతునకారోపరియుకారంబున కత్వంబునయ్యె. (3) వ రూపమందు నాదేశవుగాగమంబులు.

103 సూ—అచ్ఛికంబు లందయియవులకు వ్యక్రతమంబులు బహుళంబుగానగు.

అయిదు - ఐదు ॥ అయిరేని ॥ ఐరేని ॥ అవుడు - ఔడు ॥ గవుసెన - గౌసెను.

వ్యా—అచ్చతెలుఁగుమాటలయందున్న 'అయి' అనుశబ్దస్వరూపమ్మునకు ఐకారంబును 'అవు' అనుదానికి ఔకారంబును బహుళంబుగానాదేశంబులగునని యర్థము.

ఉదా—అయిదు-ఐదు॥ అయిరేని-ఐరేని॥ అవుడు-ఔడు॥ గవుసెన గౌసెన॥ (వ్యా) అవుడు-ఔడు. (పెదవిక్రిందిచోటు) గౌసెన—(వీణె మొదలగువానిమీఁది యొఱ) ఉ॥ కట్టిననీలిదిండ్లు సెలకట్టియవిండ్లును విండ్లగౌసెనల్। చుట్టినొసళ్ళపైనిడిన జంజుఱుపల్లసిగల్ గటీతటిం। బెట్టినమోటకత్తులును మేనులఁగార్కొనుకప్పులేర్చి చేఁ। బట్టినవేఁటకుమ్ములును బాగరువాగురికల్ మహోగ్రనుల్॥ మను. ౪ ఆశ్వా.

104 సూ—కలుగున కసమర్థంబునందు లట్టుపరంబగునపుడు కలయగు.

ప్ర - కలఁడు - కలరు - కలదు - కలవు ॥ మ - కలవు - కలరు ॥ ఉ - కలను - కలము,

వ్యా— అస్త్యర్థంబునందు అనఁగా లంగీకరణార్థంబైన "అసభువి" అనినధాతు పాఠములోని యసధాతువునకు, అగుట, ఉంగుట, అనునవియర్థములగు. లోకములో "అస్తి" అను సంస్కృతశబ్దంబునకు కలదు. (లేక) ఉన్నది అనియు "నాస్తి" అను దానికి "లేదు" అనియు నర్థము లాబాలగోపాలము ప్రసిద్ధములుగదా!! ఈయర్థము లందు కలుఁగుధాతువు సదా యకర్మకంబగును. పైనిం జెప్పిన యకర్మకార్థములందలికలు గు ధాతువునకు వర్తమానార్థకలకారము పరమయ్యెనేని "కల" అనేడియాదేశంబగును ఉదా—'కలఁడు' ఇచ్చట వర్తమానకాలము వివక్షింపఁబడినపుడు మొదట 'కలుగు + ల, ఇట్లుండె. ఏకత్వము భావింపఁబడినపుడు, ౮ సూ—ముచేత "కలుగు + డు" అని కాఁగాఁ బ్రకృతసూత్రమున (అస్త్యర్థమైనందున) కలాదేశముకలిగి "కలఁడు" అనిన రూపంబు సిద్ధించె. ఇట్లు కలరు (ప్ర-బ) కలదు (అమహద-ఏ) కలవు (అమహదంబు); కలవు (మధ్య-ఏ) కలరు (మ-బ) కలను (ఉత్త-ఏ) కలము (ఉత్త-బ) ఇత్యాదులందూహ్యంబు. ఇందులకుఁ గవిప్రయోగంబులు, తే. గీ. మానినాథ! కుటుంబజంబాలపటల! మగ్నమా ద్యద్గృహమేధిమండలంబు! నుద్ధరింపంగనావధ మిందుగలదె! యీమ్మదంఘ్రిరజోలే శముకతీదు కన్య!! మను. ౧ ఆ. (కలదె = ఉన్నదా?) ఉ!! ఓ పరసీరుహాక్షి! వినవోరతిఁ గాగిట నీవుచేర్చుశిం! పాసురభర్తకైనఁ గలదా? వలదంచుఁ దొనంగనేమి సహ్యాద్రిసీన యుక్తిశేత హితహాళ మసనొగ్గదుకేలిపైననా! శ్వాసితదుఃఖితేమనసిశర్వమసహ్యమన స్నెలుంగవే!! మను. ఆ. 3 గీ!! ఇట్టివిక్రమంబు నిట్టిపామర్థ్యంబుఁ గలదే రయురులకిజ్జగం బునందు భార. ఆది. ౬ ఆ. కలుగునకు ఓపుట అనునర్థముగలదు; అది యస్త్యర్థము గాకున్నను కలాదేశంబు గానంబడియెడి. తే. గీ. సింహాకవచంబుదొడిగినఁ దెనఁటికు క్క! గంధగజ గంధమునకును గలదె! నిలువ!! హరి ఉ. ౬ ఆ. (నిలువఁగలదె! నిలువనో వునా?) పొందుట యర్థమిచ్చునపుడు అస్తిశబ్దార్థముకానందునఁ గలుగునకుఁ గలాదేశం బుగాదయ్యె. ఆ గీ. జనులనతిథిజనుల సతతంబుఁబూజింపు మన్న దానమూవధరోమ కేంద్ర! వరులఁదనుపుమఖిలవసుమతీప్రజకెల్ల! గరుణఁ గలుగుమమ్మ కమలనేత్రి! భా ర. అది ౯. ఆ. (పొందు)

105 సూ— త్రర్థంబు నంగలాదేశంబు విభాషనగు.

ఎడియెడులకు లోపంబిటనిత్యంబు - కలవాఁడు - కలుగువాఁడు.

వ్యా—"ణ్వుల్ తృచౌ" [అ 3 పా ౧ సూ ౧33] అనుసూత్రంబునఁ గర్త్రర్థమందుఁ దృచ్ప్రత్యయంబు ధాతువుకంటె సంస్కృతవ్యాకరణంబున విధింపఁబడియె. కాన, (తర్థంబునందుతృచర్థకార్థమందు అనఁగాఁ గర్త్రర్థమందుఁ గలుగుధాతువునకుఁ గలాదేశంబు వికల్పము గానగును. తృవర్ణకార్థకములైన యెడియెడువర్ణకంబులు [౭౭ సూ] లడ్వర్ణకంబుకంటె నన్యంబులైనందునఁ బూర్వసూత్రమునఁ గలాదేశము ప్రాప్తింప కపోఁగా నీసూత్రముచేత వైభాషికంబుగా విధింపఁబడియె. కాన నిది యప్రాప్త విభాషయని రూఢియుంగునది.

ఉదా—కలవాఁడు. ఇటఁగలుగుధాతువుకంటెఁ గర్త్రర్థమందుఁ బ్రకృతసూత్రమునఁ గలాదేశమున్ను, సమాసపరిచ్ఛేదములోనితొమ్మిదవసూత్రమున నన్ప్రయుక్తమైన తచ్ఛబ్దంబును, ౭౫ వ సూత్రమున నెడియెడువర్ణకంబునకు లోపంబు బాహుళకంబుగాన నిట వట్ప్రత్యయంబులకు నిత్యలోపంబును [వాఁడు] రాఁగాఁ బైరూపంబు సిద్ధించె. వైభాషికంబు గావునఁ గలాదేశంబుపక్షంబున రాక 'కలుగువాఁడు' అని రూపాంతరంబు. "కలవాఁడు" ఇత్యాదులందలి కలశబ్దంబు కలజె వర్ణకంబు రానందున దీనిమీఁది తచ్ఛబ్దవకారంబునకు వండఁగలాఁడు, ఇకాఁగలాఁడు, ఇత్యాదులందుంబలె (క్రియాపరి) 117 సూత్రంబున వైభాషికలోపంబు రాదని తెలియునది. మఱియు కలవాఁడు, కలవారు, ఇట్టివారు, ఈశబ్దంబులందు దీర్ఘాంతమైన తచ్ఛబ్దవకారంబునకు సర్వలోపమునకును లుక్కు (సర్వలోపము) కవిప్రయోగంబులఁ గానంబడియెడి.

క॥ అలసుకయేఁడులుగడుఁ జె। క్కులుజీవించుట నరగ లుగుటయుంగడువృద్ధుల లక్షణమేజ్ఞానము । గలఁడేని యూబాలుఁడైనఁ గడువృద్ధుమహీశ॥ అరణ్య. భార 3 ఆ. (కలఁడేని-కలవాఁడేని)

క॥ సమరఘుఁడు బిరుదులక్ష్మణు। కుమారుఁడుంగదిసి మొనలుగోల్తలఁజేయన్। మిమునెల్లనుపంప భుజగ। న్యమునుగయును గలఁడు గొనఁడ రాతులనధిపా॥ భార. ద్రో ౪ ఆ. (కలఁడు-కలవాఁడు) ఆ॥ చను నెనీకునిప్డు సాహసక్రియఁజేయ। నెల్లనారికంటె

ము లోనగు ముజ్ఝశబ్దముచేత డజ్ సాహచర్యమునం జేసి మధ్యమపురుష మువర్ణకమే గ్రహింపఁ బడును. పైయుదాహరణమందలి మువర్ణకముత్తమపురుషసంబంధి గాన ౬౧ సూత్రము ప్రవర్తింపదు. తక్కిన యుదాహరణములు కరతలామలకసులభంబులు గాన లేమిలేవడిశబ్దంబులు మాత్రమే కవిప్రయోగంబులఁ బ్రదర్శింపఁబడును. "క॥ గురులకుభక్తుఁడు గాఁడు। కరుణగలఁడు శౌర్యధైర్యగాంభీర్యధురం। ధరుఁడు మొగమోడునాసుర। వరపౌత్రుని లేమికోర్వవచ్చునె చెపుఁడా" భార. ద్రో. ౨ఆ (లేమి=కలుగమి) వ॥ "తోలంగఁ ద్రోయరానిలేమికి మదినొండుపాయంబు లేమికిం గొంత చింతించి" విక్ర. ౨ఆ (లేమి= దారిద్ర్యము) "సీ॥ నిదురలేవడిఁ గెంపు సెరయుకన్గవతోడఁ బొడిపొడియైన మేపూఁతతోడ" రసి. ౫ఆ. "మ॥ లేవడిం। బడియుండఁదగదంచు సత్వగరిమన్ మధ్యంబుగన్పట్టఁగా" చంద్రా ౧ఆ "లేవడియొంతేని జీవనంబు" వై ౧ ఆ. "ఉ॥ లేవడియైనభుక్తిగొని లేవడి గంబసదాఁకశాంతయున్" పాండు. ౪ఆ.

## 107 సూ—వ్యతిరేకంబునందు వలచునకొల్ల విభాషనగు.

ప్ర-ఒల్లఁడు-ఒల్లరు-ఒల్లదు-ఒల్లవు॥ మ-ఒల్లవు-ఒల్లరు॥ ఉ-ఒల్లను-ఒల్లము॥ ఒల్లమి - ఒల్లక - ఒల్లని॥ పక్షంబున వలవఁడిత్యాది॥ ఒల్లమికొల్లఁ బాటని ప్రయోగంబులం గానంబడియెడి.

వ్యా—వలచుధాతు నకర్మకమైనపుడు పరిమళించుట, సకర్మకమైనపుడు కోరుట కామించుట అని యర్థభేదంబులుగలది. ఈసూత్రమున సకర్మకార్థకమైన "వలచున"కే వ్యతిరేకార్థమందు వికల్పముగా, ఒల్లాదేశము విధింపఁబడియె. పైయుదాహరణములన్నియు 'వలచు' నకు వ్యతిరేకార్థమందు, అనఁగాఁ గోరకుండుట కామింపకుండుట అను నర్థములందు నైనవని తెలిసికొనునది. ఒల్లఁడు (కామింపఁడు) ఈరీతిగా నర్థమూహించునది. పక్షంబున వలవఁడు (కామింపఁడు) ప్ర. బ. వలవరు. అ. మ. ప్ర. వలవదు. అగు ప్ర. బ. వలవవు. ఇత్యాది ఒల్లమి. పక్షంబున వలవమి. మేలిమి + కూడుగూరలు ఇత్యాదులందు "మి" వర్ణమును, సుఖము + పాటు ఇత్యాదులందు మువర్ణమును వృత్తియందు లోపించి "మేలికూడుగూరలు" "సుఖపాటు" ఇత్యాదులైనట్లు

ఒల్లమి + పాటు అనుచోనిలో నంత్యవర్ణము లోపించి "ఒల్లఁబాటు" అగును. ఇట ఉప్తశేషంబునకు నుగాగమంబువచ్చుట విశేషంబు. ఇది తలఁబ్రాల్వాదులలోఁ బఠింపఁబడ్డది. (చూ. సంధిప. సూ౨౮) ఉ॥ ఒల్లరు రాజదేవులును నోడ్డులు రాచినచందనంబుమే! నెల్లఁ జెమర్పఁగా నకట! యేను శ్రమంపడి నిల్చినిల్చి యల్లలనమాద్దనం బొనరునట్లుగ నెట్టులకేనిరాచిమి! తల్లికిభక్తిఁ బెట్టెడువిధంబునఁ బెట్టదు; బ్రిహ్మఁ దిట్టుదుక॥ భీర. విరా. ౨ఆ. ఉ॥ భాగ్యము గాదె నీచరణపద్మము లెప్పుడుఁ జేరికొల్వఁగా। యోగ్యతగల్గినేని ననునొక్కని నొల్లవో కామసౌఖ్యమై! రాగ్యము నీమనంబునఁ జిరంబో నిజంబెఱుగంగఁజెప్ప సౌభాగ్యము గుందునే మగలపై నొకయించుక దృష్టినిల్పవతో విరా. ౨ఆ. ఉ॥ ఒక్కొకవేళఁ బద్మముఖులొల్లమినేయుదురొక్కవేళ దె నక్కున నాదరింతురు క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్ । పక్కన వేసరంజనదుష్ప్రాయములందగు నిచ్చకంబులం। జక్కఁగఁజేసి డాసిసతిచిత్తముపట్టి సుఖింపఁగాఁదగుక॥ మను.ఆ 3 గీ॥ఎవ్వరికిఁగా:గనరశి యు నెల్లసుఖము। గోరెదము వారలందఱుపీరివచ్చి ప్రాణములునర్థములునొల్లఁబాటుచేసి కయ్యమునఁ జావనఱుమటగంటిగా దె వక్ష్య.ఆ. ౧ (ఇట నొల్లమియొక్కయర్థముకంటె విశేషంబుగలదు. ఒల్లమి=అపేక్షలేమి; ఒల్లఁబాటు = అపేక్షింపఁబడనిది అని కర్మార్థము)

108 సూ—చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు.

నిలుతురు - పిలుతురు - అడఁతురు - కడతురు - చింతురు పెంతురు - పచింతురు - వచింతురు॥ చేతురు - కోతురిత్యాదుల సాధువులని యెఱుంగునది.

వ్యా—నిలుచుధాతువుకంటెఁ దద్ధర్మాదికాలప్రథమపురుష బహువచనంబులు వివక్షింపఁబడి లాట్టునకు రువర్ణకంబు గలుగంగ నిలుచు + రు ఇట్లుండె. క్రి. ప. ౨౨. సూత్రింబున ననువర్తమానధాతువునకును నంతోషమువమయి దుక్కారాఁగా నిలుచును + రు అని యుండె. ఇట్టి యవస్థయందు చువర్ణమును దాని పైహల్మాత్రపకారంబును నుభయంబును నపహరించి తకారంబుగ 'గి "నిలుతురు" (నిలుచుచ్ చేరు = నిలుత్)

తురు = నిలుచుతురు) అయ్యె. 'చినుగు' నకు 'చించును'ను 'పెరుగు' నకు 'పెంచు'ను ప్రేరణరూపంబులు; చించుదురు, పెంచుదురు అనువానిలోని చువర్ణహల్మాత్రపు దకారంబునకు (చుద్) తకారము ఱ్ఱిగా 'చింతురు' 'పెంతురు, అయ్యె. క్రి. ప. ౬౨ సూత్రంబునఁ దకారంబుమీఁది యుకారంబునకు వైభాషికలోపంబునం జేసి 'చింత్రు' 'పెంత్రు' అని రూపాంతరములగు. ఇట్లు పచింత్రు, వచింత్రు ఇత్యాదులూహ్యంబులు. చేయునకును, కోయునకును దుప్రత్యయము ఱ్ఱిగా, చేయుదురు. కోయుదురు అనురూపంబులలోఁ జువర్ణంబు లేమింజేసి యీసూత్రమునఁ దకారము రాదు. 'చేతును' ఇత్యాది తకారఘటితరూపంబులు కవిత్రియేతరకృతులందుఁ గొన్నిటం గానిపించెడిం గాని యవి యార్యస్వీకార్యంబులు గానందున నుపాహార్యంబులుగావయ్యె. కవిబ్రహ్మకవితయందు నిదియె కంటంబడినది. మ॥ బలియుం డాసాబగుండు భావిభవదర్పభ్రాంతుఁడై వచ్చి నిశ్చలసర్వాంగతనున్న నన్నరసి నీచందంబుగాఁ పున్న నా కులతం బొందెడునప్డు మంటపము సంక్షోభింపఁగాఁ జేతుఁ గట్టులుకం బెబ్బులిఁ గోల వ్రేసినటులు ప్రాకారమే పాఱఁగా విరా. ౨ ఆ.

109 సూ—పడుజికొను లోకానోకచో స్వార్థంబునందనుప్రయుక్తంబులగు.

చొచ్చు - చొరఁబడు॥ నిలుచు - నిలువఁబడు॥ కూడు - కూడఁబడు॥ పండు - పండుకొను.

వ్యా—కర్మార్థమునఁ చునపుడు ౮౨ సూత్రమునఁ "బడుజి" యుఁ క్రియాఫలము కర్తను జెందినపుడు ౫౨ సూత్రమునఁ "కొను" ధాతువును ముఖ్యధాతువు యొక్క వెనుకను జేర్పంబడు. అట్లైనను గొన్నిధాతువులపైనట్టి యర్థభేదంబు తెలుపకయే యజాగళస్తనసామ్యంబుగాఁ బడుజికొనులు ముఖ్యధాతువుల ననుసరించియుండు. క॥ ఇత్తెలంగున సభ లోపలఁ। దత్తఱమునఁ గూడఁబడిన దర్పితసామం। తోత్తములలోన విపదుఁడు। మత్తద్విపలీలమునసు మండనిటులనుక॥ ఉ. వా. ౫ ఆ.

గీ॥ "జామిపండుకొనియెడి జాడయేగి" విజ. అర్థాంతరమందు శయనించుటర్థము. అపుడుపండుధాతువకర్మకంబుగానఁ గ్రియాపరిచ్ఛేదాంతమునందుఁ జెప్పినచొప్పున

సాత్మనేపదార్థములేనందున స్వార్థమందుఁ గొనుధాతువనుప్రయుక్తంబగుట యు క్తంబు.

110 సూ—తెంచుధాతువగ్వాదుల కనుప్రయుక్తంబగునగుచో నుత్వంబుపయిని దానితకారంబు దకారంబగు.

అగుదెంచు - నెగయుదెంచు - పోవుదెంచు అగు - నెగయు-పోవు-చొచ్చు - పుచ్చు - తోఁచు - నడచు - పఱచు - మొల చు-వీచు - ఇత్యాదులు.

వ్యా—"తెంచు" అనుక్రియ, పైనిజెప్పిన అగు, నెగయు, పోవు, మొదలైన గణపతితధాతువులకు ననుప్రయుక్తంబగు. అగుమొదలైనధాతువులతోఁ దెంచుధాతువు ఘటింపఁజేయంబడు. అపుడుఅగు మొదలైన ధాతువులయుకారంబుమీఁది తెంచుధాతు తకారంబు దకారంబగు. ఈతెంచుధాతువు స్వార్థమందే వచ్చును గాని తన (తెంచు) యర్థమైన ఛేదనంబును తెలియంజేయదు. ౧౦౯ వ సూత్రమునుండి "స్వార్థమున" నను పదంబిట ననువర్తించునని తెలియంగునది. "అగుదెంచు" ఇటగకారముమీఁది యుకార ముకంటెఁ దెంచుధాతుతకారంబు పరమైనది గాన దకారంబయ్యె. ఉ॥ అంత సరోరు హాప్తుఁ డుదయంబగుదెంచె. నిర్వ ౬ ఆ. గీ॥ బంధనంబులెల్లఁ బాయుఁడుభీముఁడు। నీరి లోననుండి నెగయుదెంచె॥ భార. ఆది ౫ ఉ॥ సూరెలనున్న మంత్రులను జుట్టములం గడుఁగూర్చు మిత్రులన్। సారబలుండు నూచి మునిశాపదినంబులుపోవుదెంచెనం। భో రుహమిత్రుఁడస్త గిరిఁబొందెడునం చొగిఁదత్ఫలానరుల్। వారలకెల్లఁ బెట్టియవనన్యుఁ డు దానొకపండుఁజచ్చెరన్॥ భార. ఆది. ౨౫

111 సూ—అభ్యాగతి నరుగ్వాదుల కయ్యాదియనుప్రయుక్తం బగు నగుచో గువర్ణంబు విభాషను లోపించు.

అరుదెంచు - అరుగుదెంచు ॥ ఏతెంచు - ఏగుదెంచు - చనుదెంచు.

వ్యా—ఆగమనార్థమిచ్చుచో నరుగు మొదలైన ధాతువులయంతంబునఁ దెంచు సంధింపఁబడును అపుడు ధాతుగుకారము వికల్పముగా లోపించు.

"అరుగు + తెంచు" ఇట్లుండ గువర్ణంబునకు వికల్పములోపంబుగాఁగ (అరు + తెంచు), ౧౧౦ సూత్రమున నుకారంబుమీఁది తకారంబుదకారంబుకాఁగా "అరుదెంచు" అరుగుదెంచు" ఇత్యాదులయ్యె "ఏతెంచు" ఇట ఏగుధాతుగువర్ణములోపింపఁగా, తెంచుధాతుతకారంబు, ఏకారముకంటెఁ బరమైనది (ఉకారముమీఁది తకారమునకె దకారమువచ్చును) కాన దకారము రాలేదు. క॥ కృష్ణమృగాజినధరునరు। జోష్ణద్యుతి తేజుఁబంకజోద్భవసదృశుం। గృష్ణద్వైపాయనుగతి। తృష్ణామయుఁ గాంచిరరుగుదెంచు మహాత్ముల్॥ భార ఆది ౭ ఆ. వ॥ చంపకాపురంబున కరుదెంచువారు॥ జై. ౪ ఆ. "ఆరుగుదెంచు" అను దానికి స్వార్థమందును బ్రయోగవైరళ్యము కానిపించెడిని. గీ॥ హంసకేతనుపాలికి నరుగుదేర" జై. ౭ ౪ ఆ. (అరుగుదేర - పోవఁగా) "పరాశర నందనుండేగుదెంచె" (వచ్చె) ఏగుధాతువుకంటెం గూడ స్వార్థమునఁదెంచు కానంబడి యెడి చ॥ ఈ। యహితుల వెల్లడించి సవనాశ్వముతోఁ బురికేగుదెంచి యు। మ్మహిప తిఁగాంచి యాతనిక్రమం బపుడేమని విన్నవించెదన్॥ (పోయి) మ॥ అరదం బెక్కి ప్రమోదమేర్పడఁగనయ్యక్రూరుడే తెంచుచున్॥ వి. పు. ౭ ఆ "చనుదెంచు" నకుపోవు అనునర్థంబునఁ బ్రయోగంబుగలదు॥ వ॥ ధర్మజవాసుదేవులచేత ననుజ్ఞాతుండై హస్తిపురంబు నిర్గమించి నిరర్గళప్రయాణంబులసపుత్రపౌత్రుండై చనుదెంచి కతిపయవాసరంబుల, పావనికాంచె॥ జై. ౭ఆ.

112 సూ—అయ్యాదిపరంబగునపుడు చువర్ణంబులోపించు.

చొచ్చు - - చొత్తెంచు॥ పుచ్చు - పుత్తెంచు ॥తోఁచు - తోఁతెంచు.

వ్యా—స్వార్థమును, ఆగమనార్థమును స్ఫురింపఁజేయుచుండ విధింపఁబడి యుభయవిధములుగానున్న పూర్వోక్త తెంచుధాతువు పరమయినపుడు ముఖ్యధాతువుయొక్క తుది చువర్ణంబు లోపించును "చొత్తెంచు" ఇట "చొచ్చు + తెంచు" ఇట్లుండఁ బ్రకృత

సూత్రంబున నుకారాంతచకారద్వయంబునకు లోపము రాఁగా సాద్యక్షరశేషంబైన చోకారంబుమీఁది తకారంబునకు "నెత్తటి" (నెఱ + తటి) ఇత్యాదిశబ్దంబులయందుం బలె ద్విత్వంబై "చొత్తెంచు" అనురూపంబగును. ఇట్లే "పుత్తెంచు" ఊహించునది. సంధి. పరి. 3౯ వ సూత్రముచేతనే "చొత్తెంచు" "పుత్తెంచు" ఇత్యాదులందుఁ దకారద్విత్వంబువోలె సాద్యక్షరశేషంబై చుద్విత్వంబునకు లోపంబగునుం గానఁ బ్రకృతమువర్ణలోపవిధాయకసూత్రంబు క్రియాపరిచ్ఛేదమందు ననవసరమని యెందురేని యట్లనవలదు నడతెంచు (నడచు + తెంచు) పఱతెంచు (పఱచు + తెంచు) ఇత్యాదులందు సాద్యక్షరశేషత్వంబు గాకుండ ముఖ్యధాతువుల తుదివర్ణమే లోపించుటకై సూత్రారంభం బవశ్యకర్తవ్యంబు. ఈసూత్రంబు లేనిచో "చొత్తెంచు" వోలె (నడచు + తెంచు) "నత్తెంచు" ఇత్యాద్యనిష్టరూపంబులు సంధి. పరి. 39 సూత్రమునఁ గావలసి వచ్చును. తద్దోషనివారణార్థమై దీనికిఁ జారితార్థ్యంబు గలదని తెలిసికొనందగు.

### 113 సూ—అద్ధానికి ముత్తుపరంబగునపుడు తే తేరులగు!!

అగుదేఁడు - అగుదేరఁడు - అగుదెమ్ము - అగుదేరుము.

వ్యా—పైనిం జెప్పిన యుభయవిధార్థక తెంచుధాతువునకును, ముజ్జున్ను, జెత్తును, పరంబగునపుడు 'తే' అనునదియు, 'తేరు' అన్నదియు ప్రత్యయంబుగా సర్వాదేశంబు లగును. వ్యతిరేకార్థమునఁ బ్రథమపురుషైకవచనవివక్షయందు లజివర్ణకంబునకు నెనిమిద వసూత్ర [క్రి· సూ-ప౩] మున డుజ్వర్ణకము రాఁగా "అగుదెంచు + డు" అనియుండు జీత్తైనలజివర్ణకముముత్తుశబ్దార్థములో నంతర్భూతము గావున నియ్యది పరమగుచుండఁ గాఁ దెంచునకుఁ దేశబ్దము సర్వాదేశమయి "అగుదేఁడు" అనురూపంబు సిద్ధించు. ఈడు బుజెత్తు కావున బిందుపూర్వకంబగు. "తే" అను దీర్ఘంబుకంటెఁ బరమైనందున నిరసు న్నయేకాని నేఁటిసున్న యుండదు. క్రి. పరి ౭౫ సూత్రములోని ముజ్జుశబ్దముచేతను మధ్యమపురుష బహువచన ముజ్జై గ్రహింపఁబడినందున వ్యతిరేకార్థకలజివర్ణస్థానీయమైన యుత్తమపురుషైకవచన డుజ్జుపరంబగుచోఁ బూర్వోక్తసూత్రముచేతను ప్రాప్తంబు కాదు. నా॥ పదియేనేఁడులబాలునినీ [illegible] సంయుతు నేని। [illegible] యాతేఁబుత్తెంచ్చాలను। [illegible]॥ [illegible]

'అగుదేరఁడు' ఇటఁ బక్షంబునఁ దేర్వాదేశము. 'అగుదెమ్ము' ఇటలూఁణ్మధ్యమపురుషైకవచనము. మువర్ణకంబు పరంబగునపుడు తెంచునకు, తేశబ్దాదేశమయి అగుదే + ము' అనియుండఁగా క్రి. పరి. ౭౧ వ సూత్రమున ధాతువునకు హ్రస్వంబును, మువర్ణకంబునకు ద్విత్వమ్మును గలిగి 'అగుదెమ్ము' అనియయ్యె. పక్షంబునఁ దేర్వాదేశమయి "అగుదేరుము" అగును "అగుదెమ్ము" నకు బహువచనరూపంబు 'అగుదెండు' అనియుండు. మధ్యమడుజ్జుపరమగుచో 'దే' శబ్దంబునకు హ్రస్వము గలిగి డుజ్జుజ్జైతేనందున [అగు] దెండు అని పూర్ణబిందు వేయగును. ఇఁక, అఁట, చుఁడు అనుశబ్దములందక్కనుడి తొలి హ్రస్వముమీఁద నరసున్నయుండదన్న నియమంబుననిట నర్ధబిందువు రాదు. శా॥ అన్నా లక్ష్మణనిన్నుఁ బుణ్యనిధినే నజ్ఞానసైపక్కతి। న్నన్నా పాపమువచ్చి ముట్టుకొనియె న్నాపాలిదైవంబవై। యిన్నీచుం బరిమార్ప వేగఁబఱతేవే నన్ను రక్షింపుమీ। యన్నంఖ్రిమ్మనఁజేరవేయరుగవేయత్యుగ్రశీఘ్రంబునన్॥ భాస్క. రా.

## 114 సూ—భూతంబున లజికి లిడంతరంబగు నగుధాతువవను ప్రయుక్తంబగు.

వాఁడురాఁడయ్యెను - వారురారయిరి - అదిరాదయ్యెను - అవిరావయ్యెను ॥ నీవురావయితివి - మీరురారయితిరి ॥ నేనురానయితిని - మేమురామయితిమి.

వ్యా—లజికిన్ = వ్యతిరేకార్థకప్రత్యయాంతధాతువునకు; భూతంబునన్ = భూతార్థమందు లిడంతంబగునగుధాతువు = భూతార్థకప్రత్యయాంతమయిన యగధాతువు, అనుప్రయుక్తంబగు = [వ్యతిరేకార్థకక్రియను] అనుసరించి ప్రయోగింపఁబడును. ఉ. వాఁడు రాఁడయ్యెను. ఇట "రాఁడు" అన్నది వ్యతిరేకార్థకమైన లజిప్రత్యయాంతరూపము. "అయ్యెను" అనునది భూతార్థకమయిన యగుధాతువు రూపము. భూతకాలసంబంధి వ్యతిరేకార్థమును బోధించుచో భూతార్థకమైన యగుధాతువు సాహాయ్యము లజిప్రత్యయాంతమునకుండవలయునని నిష్కృష్టార్థము రాఁడయ్యెను = రాలేదు

అని యర్థము. ఇట్లే తక్కినవియూహింపవలయును. క॥ మనలోఁ గయ్యంబేటికి। నని ధర్మసుతుండు సెప్పినది మీపలికై। కొనఁడయ్యె రోగి పథ్యా।శనమువలెం జొరనిభంగి సంజయయెట్లన్ భా. క ౧ ఆ. తే. గీ. ప్రియుఁడు రాఁడాయె సత్యభామ యొడఁగాఁగ। నెన్నిమాయలు పన్నెనో యెఱుఁగరాదు। గాయఁగాఁ జొచ్చె శశిమింట నాయనంగుఁ। డేయఁగాఁ జొచ్చె సఖి చక్రియేఁడియనఁగ॥ అప్ప ౨ ఆశ్వా.

శా. రావైరాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్యచిత్తంబునన్। రావై తేఁజవిగాని యిందులకు హోరాహోరిగాఁ బోరియే।లావాలాయముసేయుఁగా బ్రదుకు నీవాచారవంతుండవై। చావోయెక్కుడు నీయెడం గలుగువాంఛన్ భూసురగ్రామణీ॥ మను. ౩ ఆ. శా. రాఁడయ్యెన్ హృదయేశుఁ డీశిరహభారంబెట్లు సైతున్ క్షణం। బేఁడైయున్నది యేటికిందడ సెనో యేవిఘ్నముల్ పుట్టెనో। నేఁడే తేరఁ బ్రయత్నమున్న నకటా నీచేత జెప్పింపఁడే। వాఁడే రీతి నెటింగెనో యపుడనన్యాసక్తిచ్చి యట్లాడఁగన్॥ ప్రభా. ౪ ఆ.

**115 సూ— నుజ్యంతంబగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తంబగు నుజికి విభాషనగు.**

కాను - అనునది నుజ్యంతంబగునగు ధాతువు రూపంబు.

వ్యా— క్రి. పరి. ౮౦ సూత్రముచేతను. ధాతువునకు నుజివర్ణకంబు విధింపఁబడియె. అగుధాతువునకు నుజివర్ణకంబు రాఁగా క్రి. పరి. ౯౧ సూత్రముచేతను కాదేశము గలిగి 'కాను' అనురూపంబగు. ప్రకృతసూత్రమున 'కాను' అన్నది క్రియావిశేషణంబులకు నిత్యంబుగను, నుజ్యంతమైన ధాతువునకు వికల్పముగాను జేర్పఁబడును.

**116 సూ—దానికి హ్రస్వంబు విభాషనగు.**

లెస్సగాను - లెస్సగను - న్యాయ్యముగాను - న్యాయ్యము

గను - ఇట సరళంబునిత్యంబు ॥ చూడఁగాను - చూడఁగను - చూడను - ఇట స్వాత్వంబులేదు.

వ్యా—క్రియావిశేషణంబులకుం గాని నుజీప్రత్యయాంత ధాతువులకుం గాని తుదంజేర్పఁబడిన "కాను" అనుశబ్దముయొక్క దీర్ఘమునకు హ్రస్వము విభాషగానగును. ఉ. "లెస్సగాను జదివె" ఇత్యాదివాక్యంబులందు లెస్సశబ్దము 'చదివె' ఇత్యాదిక్రియలకు విశేషణము గాన 'కాను' అనునదియు నుప్రయుక్తంబగును(అనుసరించిప్రయోగింపఁబడును.) సంస్కృతభాషలో మాత్రము 'తత్ప్రత్యయపూర్వమీపలోమకూలం' (అ ౪ పా ౪ సూ ౨౮) ఇత్యాదిస్థలంబులలో నకర్మకధాతుక్రియావిశేషణంబులు సయితము ద్వితీయాంతములేయగునని భాషాపరిపాటీవిశేషము. ఏవిభక్తియు నిరూపింప శక్యముకానిచో సామాన్యముగాఁ బ్రాతిపదికార్థమందు ప్రథమావిభక్తియే న్యాయ్యంబు గాన 'లెస్స' అను ప్రథమావిభక్త్యంతంబుపై బరంబైన కానుశబ్ద కకారంబునకు సంధి. ప. ౧౩ సూత్రమున నిత్యంబుగా సరళగకారంబై పైరూపము సిద్ధించె. ఆసరళాదేశసూత్రములో బహుళగ్రహణఫలంబేమనఁగా నిట్టిక్రియావిశేషణస్థలంబులలో సరళాదేశనిత్యత్వార్థమని యెఱుంగునది.

"న్యాయ్యముగాను" విశేషణమైనపుడు "ధర్మపథ్యర్థన్యాయాదనపేతే" (అ౪ పా ౪ సూ ౯౨) అనుసూత్రముచేత ద్విత్వయకారముతో నుండవలయు. న్యాయము నుండి తొలఁగనిదియని యర్థము. "న్యాయముగానున్నది" యని యేకయకారముతోఁ బలుకుట యవిచారితరమణీయము. ఇచ్చట నేకయకారముతోనున్న న్యాయశబ్దము విశేష్యమే కాని క్రియావిశేషణము గానేరదు. కనుకనే యప్పకవి ౨వ యాశ్వాసమందు సీ॥ క్షయ్యజయ్యన్యాయ్యసాహాయ్యసాన్నాయ్యధాయ్యపాయ్యములనికోయ్య మునను। గ్రయ్యశబ్దమునను గియ్యలు గలవని తెలిసి ప్రాసములను నిలుపవలయు" అని నిరూపించెను. విశేషణాద్యర్థవిశేషములయందే క్షయ్యాదిశబ్దరంబులుయన్వయవిశిష్టంబులని యప్పకవిగారి తాత్పర్యముగాని యర్థాంతరమునందు క్షయ, జయ, న్యాయ, ఇత్యాదులేకయకారముతో గొన్ని యుండవనికాదు. "చూడఁగాను" ఇట చూచుధాతువునకు ౪౦ వ సూత్రమున నుజీవర్ణకంబును ౯౧ వ సూత్రమున 'చూచు' నకుఁ జూడు

ఆదేశమును గలుగంగ ౧౧౫ సూత్రమున ‘కాను’ అనుపది నుజ్ప్రత్యయాంతము చివరఁ జేర్పఁబడి సంధి. ౧౬-౧౮ సూత్రముల పరశాదేశ్యాదికార్యములు రాఁగాఁ బైరూపంబు సిద్ధించు. “చూడనుగాను” అని ప్రూచెను గలువలు, అన్న చోటునంబలె నుకారంబునకు బ్రకృతభావంబుండదు. “ఇటసత్వములేదు” అనుమూలములోని వాక్యము సంశ్లేషంబునకు నుపలక్షణంబు. ‘చూడన్గాను’ అనియు ప్రయోగంబులు గానరావు. పక్షంబున హ్రస్వంబు. ‘చూడఁగను’ నుజ్యంతంబౌ ధాతువునకు ‘కాను’ అనునను ప్రయోగము వైభాషికంబు గావున [౧౧౫] ‘చూడను’ అనియునుండు. ‘కాను’ అన్నది ధాతువునకే వైభాషికమని చెప్పఁబడ్డదిగాని క్రియావిశేషణస్థలములయందుంగూడనీనిత్తోడు లేకుంట గానవచ్చుచున్నది. గీ॥ గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ। గాసువీసంబువెసలమిగ్రాసమునకు। నాధివెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని। లెస్సయుండునె? గృహకర్త లేని బ్రదుకు॥ మను. ౩ ఆ.

క॥ తలచక్కమునుచుకొనిద్రిం। డలవడబంధించి పోకిక మరనిలువునీ! వలసిన వన్నియునిచ్చెద। వలఘుశిరస్త్రాణకంటకాదులనిపుణుఁ॥ భా. శల్య. ౨ ఆ. గీ. ఉమయునగ్నియుగంగయునుండనన్ను। గారవంబున నధికునిఁగాఁదలంచి। చక్కనాపాలికే తెంచెనొక్కవీఁడు। సంభృతస్నేహభక్తి విస్రంభుఁడగుచు॥ శల్య. ౨ ఆ క॥ కలకలనవ్వుచుఁబిలుచం। పలుకుచుఁ దమకెలకులందుఁ బాంచాలకుమా। రులుపసుదేరఁగఁ బాండుసుతులువచ్చిరి సంతసంబుతో మాధువునకుఁ॥ శల్య. ౨ ఆ.

117 సూ—ఉన్నకలనవర్ణకంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాషనగు.

బాహుళకంబుచే నిట సంధినిత్యంబు ॥ వండుచున్నవాఁడు - వండుచున్నాఁడు - వండుచున్నవారు - వండుచున్నారు - వండుచున్నవాఁడవు - వండుచున్నాఁడవు - వండుచున్నవారరు - వండుచున్నారరు వండుచున్నవాఁడను - వండుచున్నాఁడను - వండుచున్నవారము - వండుచున్నారము - అట్లువండఁగలవాఁడు - వండఁగలాఁడు - వండినవాఁడు - వండినాఁ డిత్యాదులెఱుంగునది.

వ్యా—క్రి. పరి. ౭౬ సూత్రముచేత విధింపఁబడిన ఉన్న, కల, న, వర్ణకంబులకంటెఁ బరమైన తచ్ఛబ్దవకారంబునకు లోపము వికల్పముగా నగును. (ధాతుజవిశేషణంబునకు విభక్తివిధానవివక్షయందు సమా. పరి. ౯ సూత్రముచేతను తచ్ఛబ్దంబను ప్రయుక్తంబగునని స్మరింపఁదగునది) "వండుచున్నవాఁడు" ఇచట వండుధాతువునకుంటె ౭౬ సూ. న, వర్తమానార్థకశత్రర్థమందు ఉన్న, వర్ణకంబును క్రి. పరి. ౧౪ సూ=న ధాతువునకు చువర్ణకమును సమా. పరి. ౯ సూ. న, తచ్ఛబ్దానుప్రయోగంబును గలిగి పైరూపం బేర్పడె. పక్షంబునఁ బ్రకృతసూత్రమున తచ్ఛబ్దవకారమునకు లోపంబు రాఁగా "వండుచున్న + ఆఁడు" అనియుండి, అకారసంధిసూత్రస్థబహుళగ్రహణంబున నిట సంధి నిత్యంబైవచ్చి "వండుచున్నాఁడు" అనియే రూపం బగును. కాని 'వండుచున్నయాఁడు' అని వైకల్పికాకారసంధిచే ననిష్టమైన రూపాంతరము చెప్పఁగూడదు. కొందఱు ప్రకృతసూత్రమునఁ దచ్ఛబ్దవకారంబునకు లోపంబుగలిగి "వండుచున్న + ఆఁడు" అనియుండ నిది యపదాదిస్వరసంధిస్థలంబుగావున, అకారసంధిసూత్రమును బాధించి సంధి. పరి. ౧౧ సూ. న, అపదాదినిత్యసంధి రాఁగా "వండుచున్నాఁడు" అన్న రూపంబు సర్వదినంబులను సులభం బనియు "బాహుళకంబుచే నిటసంధినిత్యంబు" అనిన మూలకారునివచనం బతిపేలవం బనియు శంకింతురు. కాని యట్లనవలదు. "వచ్చుచున్న + వాఁడు" అన్నది పదద్వయఘటితంబు "వచ్చుచున్న" అన్నది యొకపదంబును "వాఁడు" అన్నది వేఱొకపదంబునని తెలిసికొనవలయు. "వచ్చుచున్న" ఇత్యాది ధాతుజవిశేషణంబులకంటె విభక్తి యుత్పత్తిల్లి తచ్ఛబ్దంబుతో సమాసంబైనందున లోపించినది. కనుకనే సమాసపరిచ్ఛేదంబులోని ౯ వ సూత్రమున విభక్తివివక్ష గలిగి యయ్యది లోపించినను "సాధనము" ఇత్యాదులువోలెఁ బదచ్ఛేదకాలమందు నేకపదంబుగానే చెప్పుకొనవలయు. "వచ్చుచున్న + ఆఁడు" అనుచోటు పదద్వయసంధిస్థలంబు గాన నపదాదిస్వరనిత్యసంధి చెప్పఁగూడదు. అట్లు కానిచో "వచ్చిన + అది" అన్న చోటునం గూడ నపదాదిస్వరనిత్యసంధి గలిగి "వచ్చినది అన్న యేకరూపం బేయగు నంగాని "వచ్చినయది" అన్న రూపాంతరము లేకుండవలసివచ్చు. కాన నకారసంధి సూత్రములోని బహుళగ్రహణంబుననే వచ్చుచున్నాఁడు. వండినాడు. వండఁగలాఁడు ఇత్యాదులందు నిత్యాకారసంధి యని యెఱుంగవలయు. "వండుచున్నారు" ఇత్యాదులయందుఁ జక్కన యుదాహరణములయందునుం గూడ పైరీతిగానే సూత్రప్రక్రియ

యించుకొనవలయు. గీ॥ తొంటిచందంగని యిప్పుడు దోంచి పాండు।సుతులు రాజ్యంబు సేయంగం జూచినారు। నాకు నీందీలు నేయింక నాంటిమాలి। లెక్కడివి ద్రోణభీష్మ లీదిక్కుసుమ్ము॥ ఉద్యో. 3 ఆ॥ గీ॥ చను నెయిమ్మాటలాడ సజ్జనులకాండు। పుట్టువులంతోడ నీవునుబుట్టినాండ। నట్లుగాక యహీనవంశాభిజాత। నైపతిన్ని తవకు నన్ను నడుగ దగునె॥ విరా. ౨ ఆ॥ గీ॥ అంకశౌర్యాశ్రయంబైనయట్టిమేటి। వీడునాకాహవస్థలి వాసవీతధాము। కాంతింజూచిపోయెదనని కదలివచ్చి। నాండ నెటిసూవు మదనుగుంక్రమమ్ము॥ రాఘ. ౨ ఆ॥ (రామాయణార్థమందు 'వచ్చినాండను' అని యేకపదము భారతార్థమందు వచ్చి = ఏతెంచి, నాండ = నాండే అని పదద్వయము.

118 సూ—ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిదాయకంబులగు నీయవి శబ్దపల్లంబులు నాంబడు

కూరుచుండు - నిలుచుండు - పరుండు - పన్నుండు - అంకొను ఈకొను - ఈయకొను - ఇయ్యకొను - రక్కొను - త్రొక్కొను - మేకొను - మయికొను - మేలుకొను - మేలుకను - మేలుకాంచు అలవడు - ఏరుపడు - చొప్పడు - వెలవడు - తలపోయు - వాపోయు - ఆపోవు - కొంపోవు - కొనిపోవు - విజయంచేయు - కయివ్రాలు - తూపాడుచు - ఇత్యాదులు - శబ్దపల్లవంబులు.

వ్యా—ధాత్వాదులకు = క్రియలు మొదలైనవానికి (ఆ శబ్దము చేతను నామవాచకములు గ్రహింపంబడును ) ధాతువులు = క్రియలు జతపఱుపంబడినచో శబ్దద్వయమేళనంబునకుం బూర్వమందున్న యర్థముకంటె నితరార్థము బోధించుచున్నవై యయ్యవి వ్యాకరణపరిభాషంజేసి శబ్ద పల్లవములనంబడు. అనంగా ననేకశబ్దంబులనుండి చిగిర్చినవి (అంకురించినవి) యని భావము. ఉదా—(౧) కూరుచుండు (కూరిచి + ఉండు) కేవలకూరుచుధాతువునకుం గ్రిందుపడుట యర్థము. క్రియాంతరమేళనానంతరమందు కూరుచుండు = ఆసీనుండగుటయని యర్థము విలక్షణమయ్యె. "నడమచుం గూరుచుండుచును" కాశీ ౫ ఆ. (౨) నిలుచుండు (నిలిచి + ఉండు) = నిలంబడియుండు.

కేవలనిలుచుధాతువునకు (౧) నిలఁబడు (౨) ప్రతిష్ఠితమగు (౩) ఉండు (౪) శేషించు (౫) అడ్డిపడు ఆసిన యనేకార్థములు గలవు కిరి రూపాంతరము మేళగించినపిమ్మట "నిలుచుండు" శబ్దమునకు నిలఁబడుట యొక్కటియే యర్థమయి తక్కుంగలయర్థములు స్ఫురింపవని తెలియునది. నిలుచుశబ్దార్థమైన నిలఁబడుట "నిలుచుండు" అన్నధాతుమి శంబునకును నర్థమై నిలిచినను తక్కిన "ప్రతిష్ఠితమగు" ఇత్యాద్యర్థము లీశబ్దంబునకు శబ్దపల్లవత్వావస్థయందు స్ఫురింపకుండుటయే విలక్షణార్థాభిధాయకత్వమని తెలియందగినది. ఇట్లే తక్కినధాతువులకును సౌకర్యంబున విలక్షణార్థబోధకత్వమూహింపవలయును. (౩) పరుండు; పన్నుండు (పడి + ఉండు) (౪) ఆఁకొను (ఆకలి + కొను) ఉ॥ ఆఁకొని యేడ్చులేఁజిఱుతలన్నముకై తనకొంగులాగఁ బెల్లాఁకటసోలుచుండెడునిజాంగనదురవస్థఁజూడఁడే వియాచ్ఞాకలనావిభంగభయసంభృతగద్గదశూన్యకంఠుఁడై। వేఁకొనిదేహి యంచడుగఁజేరునె కాలినపొట్టకెప్పుడున్॥ భర్తృహరి వైరా. ౨౧ ప. ఉ॥ ఎండకు వానకోర్చి తనయిల్లుప్రవాసముచోటనాకయున్। కొండునలంగునున్నిదురకుందలి దప్పెను డప్పివుట్టెనో। కుండెడనయొట్లొకోయనక కార్యముముట్టినచోటనేలినా। తండ్రోకచాయఁజూపినను దత్పరతంబని సేయుటొప్పగున్॥ విరా, ౧ ఆ. (ఇట "ఆఁకొందును" అనుదానిలో దకారంబు సున్నపైనున్నందున క్రి. పరి. ౫౯ సూత్రమున డకారంబై "ఆఁకొండు" ననియగు) (౫) ఈయకొను (ఈయ = అపేక్ష + కొను) అంగీకరించుట (౬) ఈకొను (౭) ఇయ్యకొను ధాతువులు రెండును వెనుకటిదాని రూపాంతరములు (౮) రక్కొను = రెక్కొనరూపాంతరము (రేకు + కొను) విఱ్ఱీగుట. ఉ॥ చక్కరవింటి రాజునగచాపునితో నెదిరించి పడ్డనాఁ డెక్కడనుండెనీవు మఘుఁడెక్కడనుండెను మందమారుతం బెక్కడనుండె సిగ్గుపడవేమిపుడాతఁడదృష్టరేఖచే। రక్కొనిక్రమ్మఱం బ్రతికిరాఁజనవర్లయినారుగా! శశి॥ విజ. ౩ ఆ॥ (౯) త్రెక్కొను (త్రెంచు + కొను) చంపు; ఉ॥ అక్కట తండ్రిలేవనుము నమ్మెయిఁబెంచినతాత నిమ్మెయిన్। త్రెక్కొనఁగాదతండు సముదీర్ణభుజాబల శౌర్యశాలియై। యిక్కడిసేనఁ జక్కడిచె నేనియుఁజూతు నకాకగర్హనం। దక్కుటకోర్వఁజాలుదునె ధర్మజాతముల్ క్రూరకర్ములే॥ భీష్మ ౩ ఆ. (౧౦) మేకొను (మే = శరీరము) + కొను = సమ్మతించు; ఉ॥ అక్కట కౌరవాన్వయ మహార్ణవమింకెడునట్లు పుట్టిని। దొక్కరుఁడైనఁ గేశవహితోక్తికి మేకొనఁడ

ర్యోధనుఁ జూడను। డెక్కటిదానవచాలుఁదమునిందఱుఁదీవ్రశౌర్యాగ్నిఁ గాల్పఁ జెం। పెక్కిన పాండు నందనుల యేడ్తెఱ దోర్లీలయుఁ దానెఱుంగఁడే॥ ఉద్యో ౪ ఆ (౧౧) మైకొను (మై + కొను) సమ్మతించు; (౧౨) మేలుకొను (మేలు + కొను) నిద్రఁ దెలియు (౧౩) మేలుకను = నిద్రలేచు; క॥ నానామంజులమాగధ। గానధ్వను లెసఁగ మేలుకని విక్ర. ౪ ఆ. (౧౪) మేలుకాంచు "యోగనిద్రారతినొంది మేలుకాంచి లోకంబులు గావింపఁ దలఁప॥ భార. శాం. ౬ ఆ, (౧౫) అలవడు (అలవు = పరిశ్రమ) అభ్యాసమగు తః; క॥ తలఁపఁగఁబవ్వులకతనం। దలకెక్కె న్నారయనువిధంబున హరివా।రలవడు టనిట్టి పేర్మికి। నలవడితివి ధన్యతముల మైత్రిమి ధరణీశా॥ హరి. ఉ ౭ ఆ [౧౬] ఏర్పడు [ఏర్పు = చక్కఁబఱచు] + పడు)= తేటపడు; అతని నేర్పడ నాకుఁ జెప్పవలయు" భార. ద్రో. ౫ ఆ. [౧౭) చొప్పడు [చొప్పు + పడు] సరిపడు; ఉ॥ ఎక్కడఁ బోనవచ్చు గిరులేనియుఁ గాననభూములేనిఁదా। రెక్కియుఁ జొచ్చియుం। బగతు రెట్టెఱఁగిట్టి చలంబునందల। ల్గొని క్కకతక్కరట్లయిన దుర్గతి వాటిలుఁ బోకనిల్చి పే। రుక్కనఁ బోరివీఁ సుగతియుండె జయంబును నొండెఁ జొప్పడున్॥ శల్య ౧ ఆ। [౧౮] వెలవడు [వెలి + పడు] బయలుగాఁ; క॥ నలుఁడును ధర్మణీరాజ్యము॥ దలఁగఁగ సర్వంబు నపహృతంబైనఁ గడున్। దలరదమయంతిఁ దోడ్కొని। వెలుపడియెన శేవ రాజ్యవిభవచ్యుతుఁడై॥ ఆది ౨ ఆ। [౧౯] తలపోయు [తలఁపు + పోయు] చింతించు; [౨౦] వాపోవు [వాయి + పోవు] ఏడ్చు; క॥ అని యడుగుచుండ బాలిక। కనునులు మూచుఁ బెదవి విడిచి కటకట వాపో। యెను ముగ్ధవాలుచందం। బున నడుమొగ నెత్తికొనుముఁ బోత్తులమీఁదన్ కళా ౬ ఆ॥ [౨౧] ఆపోవు [ఆదట + పోవు] [౨౨] కొంపోవు (కొని + పోవు) తీసికొనిపోవు; క॥ చంపినఁ జంపుము నన్నటు। కొంపోకుండినను జాలు॥ ప్రభా ౩ ఆ॥ (౨౩) కొనిపోవు॥ వెనుకటిదాని మొదటిరూపము; (౨౪) విజయంచేయు (విజయము + చేయు) వచ్చు; పోవు॥ మనకీ తిరి విచిత్రకథా। రసనృత్తిం దడవెఱుంగరాక యనుత్సా। సమయమయ్యె నభోమ। ధ్యసమీపంబునకుఁ దరణియరథము వచ్చెన్॥ విజయంచేయుఁడు నిర్వ. ౭ ఆ. (౨౫) కైవ్రాలు (కై + వ్రాలు ఒరగు "బలుసుఁ బంధులచాయఁ దనర్చి పంచి కైవ్రాలిన రాజనంబులకు" విక్ర. ౪ ఆ. (౨౬) తూపొడుచు [తూ + పొడుచు) ఉమియు; "తూయని పలుమ్మాఱు మపొడిచి"

వికృ. రా ఆ. ఇట్లు శబ్దపల్లవంబులు విలక్షణార్థములం దెలుపునన్న యంశంబు విశదప ఱుపఁ గవిప్రయోగంబు లుదాహరింపంబడియె. సంస్కృతభాషయందు శబ్దపల్లవముల న్న వ్యవహారమే లేదుగాని యేతాదృశశబ్దంబులు గలవు ఉ. నా. బ్రహ్మీభవతి స్వీక రోతి, సత్యాపయతి, పుత్రీయతి, దుఃఖాకరోతి, ఉపవీణయతి, అనుతూలయతి, ఉప శ్లోకయతి, సంసర్గయతి, విరళీకరోతి ఇత్యాదులు భాషాసాదృశ్యంబు కనంపడ లిఖింపఁబడినవి.

119 సూ—చేదర్థయోగంబునఁ ల్రట్టునకు లిట్టగు.

ఆఋషీశ్వరుండువచ్చె నాఫలింపఁ గార్యముల్ ॥ వాఁడు తేపు వచ్చెనేని నీవు కార్యంబుదొరఁకొనుము.

వ్యా—చేదర్థమనఁగా హేతుహేతుమద్భావంబు. అట్టి కార్యకారణసంబంధము దోఁచుచో భవిష్యత్కాలవాచి ధాతునకు భూతకాలరూపంబగు. ప్రథమోదాహరణ మందు మునీశ్వరుఁడువచ్చుట కారణంబు. పనులు నెఱవేఱుట కార్యంబు. కావునఁ గారణమైన మున్యాగమనమును దెలుపునట్టి వచ్చుధాతువునకు భూతకాలరూపంబు గలి గె. వచ్చుధాతువుపైని నాకారంబుచేదర్థప్రతీతిం దెలుపునని యెఱుంగునది. రెండవయు దాహరణయందు (తేపు) వచ్చుటకారణంబు. పని మొదలుపెట్టుట కార్యంబు. వాఁడు వచ్చినంగాని కార్యమారంభింపవలదని భావము. వచ్చుధాతువునకు చేదర్థవాచకంబైన యేనిశబ్దముతో సంబంధమున్నందునఁ గార్యప్రారంభకారణంబైన వచ్చుధాతువునకు భూతరూపంబు గలిగెనని తెలియఁదగినది.

గీ॥ ఎట్టియపరాధమొనరించెనేని తల్లి। కొడుకుశపియింప దబ్బంగిఁ గ్రూరబుద్ధి।
నతి నసత్యంబుఁ జెప్పుమెవ్వతెవు నీవు। నావుడునుశాపభీతి నన్నలినవేత్ర॥
కాశీఖండము.

ఉ. మాయలనింద్రజాలములు మాధవుఁడిందును గొన్నిపన్నినం
గాయపురజ్జులెప్పుడునుసారెను నీవెటులాడితేనియుక్

వేయును నేల పార్థులును విష్ణుఁడు వేఁపదివేలు వచ్చినం
జేయుదు మేము కయ్యమొకచీరికయైనను బంచియిత్తుమే॥ ఉద్యో. ౪ అ.

120 సూ.—ఆత్మార్థంబభిహితంబగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయివచనంబులు ధాతువిశేషణంబులకగు.

రాముఁడు రావణుంబరిమార్చి సీతయుందాను సౌమిత్రిసహితంబుగంబుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె.

వ్యా—"ఆత్మన్" శబ్దముయొక్క యర్థము, తనతోఁ సముచ్చయముగానున్న యన్యపదార్థములతో సమముగా నాఖ్యాతము (క్రియావిభక్తి) చేతఁ జెప్పంబడినచో విశేషణంబును, ధాతువును, తక్కిన కర్తలయొక్క లింగవచనంబుల ననుసరింపక యాత్మన్ శబ్దార్థముయొక్క లింగవచనంబులనే స్వీకరించును అని భావము. పైయుదాహరణమందు సీతాదేవియును శ్రీరాముండును పుష్పకారూఢులై సాహచర్యంబున (సహవాసంబున) నయోధ్యాపురంబున కేతెంచిరని తెలియుచున్నది ఇట నేతెంచుధాతువు మీఁది యాఖ్యాతము రామునితోడం బలె సీతతోడసహితము సమానముగా నన్వయించుచున్నను ఆత్మశబ్దార్థమైన రామునియొక్క లింగవచనంబులనే అనఁగా పుల్లింగము నేకవచనంబునే పొందినది. కాని సీతానిష్ఠసంఖ్యతో నేకీభవింపలేదు. సీతారాముల యుభయులసంఖ్యలను నాఖ్యాతమంగీకరించినచో 'ఏతెంచిరి' అని వాక్యంబులో నుండవలయు. అట్లె విశేషణమయిన పుష్పకారూఢశబ్దము సీతకుం గూడఁ జెందినను ఆత్మశబ్దార్థమయిన రాముని పుల్లింగమును సంఖ్యనే చెప్పినందున బుష్పకారూఢుండయి యని వాక్యంబున నుడువంబడినది. లేనిచోఁ బుష్పకారూఢులై యని ప్రయోగింపవలయు. ("పుమాన్ స్త్రియా" అను వ్యాకరణసూత్రమునఁ బుల్లింగము శేషించి బహువచనంబుగా నుండవలయు.) "ఈసూత్రములో లింగము విశేషణంబునకు మాత్రమే యన్వయించును. అసంభవము గానఁ గ్రియతో సంబంధింపదు అని యనవలదు. రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రిసహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచుచున్నాఁడు" ఇట్లు వాక్యమున్నచో వచనమే కాక యాత్మార్థపుంలింగము గూడఁ గ్రియతో సంబంధించునని యెఱుంగవలయు. ఏతత్సూ

తోదాహరణముగ నీరీతిగా వాక్యమిచ్చినచో సుగమముగా నుండును. క॥ తనయులు దానప్పుడు తజ్జనకుం డరుదెంచి చూచుజనులకు ననుభా। వనిరూఢిమానితానం । తసవోత్సవముగ నొనర్చెం బస్పరిణయముల్॥ రాఘు. ౨ఆ. ధృష్టద్యుమ్నాదిపుత్రులును, ద్రుపదుండు తానును, ఆద్రౌపదీవివాహమొనర్చెనని యన్వయము. ఇటం గ్రియయాత్మార్థముతో సంబంధించి యేకవచనాంతముగా నున్నది గాని తనయుల సముచ్చయమునంజేసి బహువచనాంతముగా నుండలేదు. ఇట్లనేకప్రయోగంబులు భారతాదిగ్రంథములయం దున్నవి గాని గ్రంథవిస్తరంబునకు భీతిల్లెద.

121 సూ—అగతికంబులగు భ్వాదులకిందు యోగంబులేదు.

భూ - సృ - కృ - రేక్క - లోక్క - లోచ - పచి - లప - ఇత్యాదులకు గతివిరహితంబులగు ధాతువులకీభావం బ్రయోగంబు లేదు ॥ ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ వి - ఆఙ్ - ని-అధి - అపి - అతి - సు - ఉద్ - అభి - ప్రతి - పరి - ఉప - ఊరీప్రభృతులును సాక్షాత్ప్రభృతులును గతిసంజ్ఞకంబులు. ప్రాదులిరువదిరెండు నుపసర్గంబులునాఁబడు ॥ ప్రభవించు - ఆవిర్భవించు - ప్రసరించు - సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతిరేకించు - ఆలోకించు - ఆలోచించు - ప్రపంచించు - ప్రలపించు - ఇత్యాదు లార్యప్రయోగంబుల నెఱుంగునది.

వ్యా—పైనింజూపఁబడిన ప్రాదులిరువదిరెండును క్రియాయోగమందు గతిసంజ్ఞయు నుపసర్గసంజ్ఞయు గలిగియుండును. మూలవాక్యంబునందు నూరీప్రభృతులకును, సాక్షాత్ప్రభృతులకును గతిసంజ్ఞయున్నట్లును ప్రాదులకు నుపసర్గసంజ్ఞమాత్రమే యున్నట్లును విభజింపఁబడినరీతిని దోఁచుచున్నది. ఇచ్చటి యుపసర్గశబ్దంబు గతిసంజ్ఞకుం గూడ నుపలక్షణంబు; లేక యావాక్యంబునకు నీరీతిగా నన్వయించుకొనవలయు. "ఉపసర్గంబులు నాఁబడు" అనుమూలవాక్యమందు సముచ్చయనకారంబునకుఁ బ్రశ్లేషము సేయవలయును. "ఉపసర్గంబులును నాఁబడు" అనిపదచ్ఛేదము చెప్పికొనందగు

ఉపసర్గంబులును = ఉపసర్గసంజ్ఞ గలవియును సముచ్చయము చేతను నూరీప్రభృతులకును సాక్షాత్ప్రభృతులకును ముందుగాఁ జెప్పఁబడినగతి సంజ్ఞ యిట ననువర్తించి ప్రాదులకు గత్యుపసర్గసంజ్ఞలు రెండునుగలవియని యర్థమగును. అట్టియర్థమే కానిచో సూత్రంబున గతిసంజ్ఞాశబ్దంబులచేతం బురస్కరింపఁబడని 'భూ' ప్రభృతిధాతువులకీ తెలుంగునందుఁ బ్రయోగంబు లేదన్నందునఁ బ్రాదులకు గతి సంజ్ఞ లేమింజేసి ప్రసరించు ఆలోచించు ఇత్యాదిప్రయోగంబులు తెలుఁగున లేకపోవలసివచ్చును. కాన ధాన్యపలాలన్యాయంబున నిట నుపసర్గసంజ్ఞ వక్కాణింపఁబడ్డది గాని గతిసంజ్ఞయే ముఖ్యంబు "ఆవిర్భవించు" "ఆవిష్" అన్నశబ్దంబునూరీప్రభృతులలోనిది గతిసంజ్ఞగలిగి ప్రయోగార్హంబయ్యె. "భస్మీకరించు" ఇట భస్మశబ్దంబునూరీ ప్రభృత్యాదులలో లేనందున గతిసంజ్ఞ లేకున్నను చ్విప్రత్యయాంతము గావున "ఊర్యాదిచ్విడాచశ్చ" అనుసూత్రంబున గతిసంజ్ఞ గలిగి ప్రయోగ యోగ్యంబయ్యె. ఇట్లు స్వీకరించు, బ్రహ్మీభవించు. ఏకీభవించు, ఇత్యాదులు తెలియందగు. "సాక్షాత్కరించు" ఇట్లు నమశ్శబ్దము సాక్షాత్ప్రభృతులలోనిది గాన గతిసంజ్ఞ గలిగి "నమస్కరించు" అయ్యె. విసర్గస్థలంబున గతిసంజ్ఞ లేనందున "నమఃకరించు" అని కాదు. సాక్షాత్ప్రభృతులాకృతిగణంబగుటంజేసి ధిక్, హుం. ఘీం ఇత్యాదిశబ్దములతో ధిక్కరించు, హుంకరించు, ఘీంకరించు, ఇత్యాదులు గృహీతంబులయ్యె. మనశ్శబ్దంబు నమశ్శబ్దవ్యుత్క్రమంబే కావున నమస్కరించు అన్నట్లు 'మనస్కరించు' అని ప్రమాదంబున లోకులు ప్రయోగింతురు. కొందఱాధునికులు జంకుకళంకులేని కవులు 'శుశ్రూషించు' ఇత్యాదులు ప్రయోగించుచున్నారు. అయ్యవి సకళంకప్రయోగంబులు. "ఆర్యప్రయోగంబుల నెఱుంగునది" యన్నమూలవచనంబునకుఁ దాత్పర్యమేమనఁగా నవధానముతో వినుండు ఈసూత్రస్థమయిన యగతికశబ్దంబునకు నేకశేషము గాని లేక యావృత్తి గాని చేయవలయు; ఇపుడు గతిసంజ్ఞాశబ్ద విరహితములయిన భ్వాదులకు నిందుఁ బ్రయోగంబు లేదన్నదియొక యర్థమే కాక యగతికంబులు అనఁగా నశరణకంబులు = కవిప్రయోగశరణములుకాని భ్వాదులకు నీభాషయందుఁ బ్రయోగంబులేదన్న యర్థాంతరమును నగును కవిప్రయోగములుండెనేని గతిసంజ్ఞాశబ్దరహితంబులైనను సాధువులని ద్వితీయార్థతాత్పర్యము. కను కనేజయించు, ఈక్షించు, భ్రమించు, స్మరించు, హరించు, బోధించు, రక్షించు ఇత్యాదులు రక్షితంబులయ్యె. విజయించు, పరాజయించు, అతీక్షించు, దుర్భ్రమించు, ఇత్యాదులు

సగతికములయినను గతిప్రయోగాభావంబునంజేసి సుగతికములయ్యెనని సూత్రకారుని తాత్పర్యము సత్, అలం, పురః, తిరః, ఇత్యాదిశబ్దంబులకు విశేషసూత్రంబుల సంస్కృతవ్యాకరణంబున గతిసంజ్ఞ విధింపఁబడినందున సత్కరించు, అలంకరించు, పురస్కరించు, తిరస్కరించు, ఇత్యాదులాన్యసమ్మతములైనవి యని తెలియందగు.

122 సూ— వలయ్యాదిక్రియలకుం గర్త్రయగు భావంబునందు నుఁజియగు.

వలయ్యాది క్రియలకుం గర్తృభూత క్రియావృత్తియగు ధాతువునకు నుజినర్ణకంబగు ॥ వాఁడుచూడవలయు - వారలుచూడఁగా వలయు - నీవుచూడవలయు - మీరుచూడవలయు - నేనుజూడవలయు - మేముచూడవయు ॥ మనముచూడవలయు - వలయును - వలదు - కూడును - కూడదు — చెల్లును - చెల్లదు - తగును - తగదు - ఇత్యాదులు వలయ్యాదులు.

వ్యా—వలయు, వలదు మొదలైన యీక్రిందిగణములోని ధాతువులకుఁ గ్రియయేకర్తగానున్నచో నట్టి క్రియావాచకశబ్దంబునకు నుజివర్ణకంబగును. పూర్వమందుఁడుమర్థభావలక్షణార్థములయందు ౪౦ సూత్రమునను జివర్ణకము విధింపఁబడినది ఇపుడో క్రియకుఁ గర్తృత్వార్థమందు నుజివర్ణకము విధింపఁబడ్డది యని భేదము తెలిసికొనవలయు (౧) జాతి (౨) వ్యక్తి (3) సంఖ్యా (౪) కాల (౫) కారకంబులైగును ధాతువునకే యర్థములనియు, దీనిమీఁద ప్రత్యయము తెలిపృశ్యార్థస్వీకరణములో సహాయమగుననియు (ద్యోతకము) క్రి. పరి. ౨ సూత్రము విసరించుతఁజెనిజెప్పంబడియె. కావున ధాతువునకు సహజార్థమైన కర్తృత్వమును నుజివర్ణకంబు స్వీకరించుఁ గని (ద్యోతకమని) తెలియంపగినది.

ఉ—‘వాఁడు చూడవలయు’ అన్నవాక్యంబునకు వాఁడు చూచుట యావశ్యమని యర్థము. “వాఁడు” అన్నశబ్దము చూచుధాతువునకుఁ గర్తగా నన్వయించును

చూడక' అనునది వలయుధాతువునకుఁ గర్తగా సంబంధించునని తెలియఁగునది. ఇట్లు 'వారలు చూడఁగావలయును, ఇత్యాదివాక్యములయందు 'వారలు' అన్న బహువచనాంతము చూచుధాతువుతోడను' చూచుధాతువు కర్తగావలయు ధాతువుతోడను నన్వయించును గావున వలయుధాతువు సదా యేకవచనాంతముగానే యుండునని తెలియందగు— గీ॥ నిన్ను నిత్యసత్యనిరతుఁగా నెఱిఁగి యి। కార్యమునకు వలనుగఁ బుత్తెఱిఁగి పనుపవలసె మాతభావము పేక్షించి। దేవహితము దీని దీర్పవలయు॥ ఆని. ౨౪॥ క॥ అనునది యట్టిగ దైవము। దగనిచ్చినయవ్వరంబుదప్పనెమనకుఁ। విగతభయవాసయోగ్యం। బుగనొక్కెడఁ జెప్పుమిపుడ పోఁగవలయున్॥ విరా ౧ ఆ॥ గీ॥ వలదు కుక్కలవిడువంగ వలవదేయ। నడిచి మొలపిడియు మ్ముకవఁ బోవవచ్చు। బంకమునఁగొరిజదిగఁబడి పఱవ లేవు। మన్నులీవ్వేళ రేగటిమన్నులందు॥ మను ౪ ఆ. వచ్చుధాతువువలయ్యాదులలోనిదని తెలియందగినది. కనుకనే యీపద్యములోని పోవుటవశబ్దము 'వచ్చు' నకుఁ గర్తయైనది ఇట్లు చను. అగుఇత్యాదులు గీ॥ చనునె? యిన్నాటలాడ సజ్జనులకాఁడు॥ పుట్టువులతోడ నీవును బుట్టినాఁడ। నట్లుగాక యహీనవంశాభిజాత। నై ప్రతివ్రతనగు నన్ను నడుగఁ దగునె॥ విరా ౨ ఆ॥ గీ॥ ధర్మదేవత నీసత్కర్మమునకు। మెచ్చి యెంతయుఁ బ్రీతిమై నిచ్చినట్టి। పరముగలుగంగ మన మేమివర్తనమున। నెపటనుండిన నొరులకు నెఱుఁగనగునె? విరా ౧ ఆ॥ (మూలము) సకర్మకంబునకుస్వరూపప్రేరణార్థంబులు రెండును గొనుపద్వానుబంధంబులం దొక్కొక్కటితోడ రెంటితోడం గూడుచోనగునవి యాఱుం గూడ రూపంబు లెనిమిదయ్యె। వాని సోరణి నుదాహరించెద.

(పైసూత్రవృత్తి యందు)

కర్త్రర్థకము.

మెతుకుడు - వంటకమును - వండెను

ఆత్మనేపదకర్త్రర్థకము.

మైతుకుడు - వంటకమును - వండుకొనియెను

కర్మార్థకము.

మైత్రునిచేత - వంటకము - వండఁబడియెను

ఆత్మనేపదకర్మార్థకము.

మైత్రునిచేత - వంటకము - వండుకొనఁబడియెను

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుఁడు - మైత్రునిచేత - వంటకమును - వండించెను

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము.

చైత్రుఁడు - మైత్రునిచేత - వంటకమును - వండించుకొనియెను

ప్రేరణకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రునిచేత - వంటకము - వండింపఁబడియెను

ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రునిచేత - వంటకము-వండించుకొనఁబడియెను"

వ్యా. సకర్మకమైన వండుధాతువునకు స్వరూపార్థమందు నాలుగురూపంబులు నిరూపింపఁబడును.

స్వరూపార్థకరూపము. వండెను (౧)

అనఁగా ప్రేరణార్థములేనిది

ఆత్మనేపదార్థమందుఁ గొన్వనుబంధ మొక్కటియే

చేర్పఁగా........................వండుకొనియె (౨)

కర్మార్థవివక్షయందుఁ బడ్వనుబంధం బొక్కటియే

చేర్పఁగా........................వండఁబడియెను (3

రెండును గూడుచో అనఁగా

ఆత్మనే పదకర్మార్థము లుభయంబును వివక్షింపఁబ

డఁగా..........................వండుకొనఁబడియెను (౪)

ఇట్లు స్వరూపార్థకరూపంబుదక్కఁ గొనుపదుశబ్దంబులలో నేకైకశబ్దసంఘటన చేతను, నుభయశబ్దసంఘటనచేతను మూఁడురూపంబులగు.

ఇంకను సకర్మకమైనవండుధాతువునకే ప్రేరణార్థమందు నాలుగురూపంబులును జూపంబడును.

ప్రేరణార్థకరూపము—వండించెను. (౧)

ఆత్మనేపదార్థమందుఁ గొన్వనుబంధ మొక్కటియే
చేర్పఁగా........................వండించుకొనియెను.

కర్మార్థవివక్షయందుఁ బడ్వనుబంధం బొక్కటియే
చేర్పఁగా........................వండింపఁబడియెను.

ఆత్మనేపదకర్మార్థము లుభయంబును వివక్షింపఁబ
డఁగా........................వండించుకొనఁబడియెను.

ఇట్లు స్వరూపార్థకము (వండెను) ప్రేరణార్థరూపము (వండించెను;) అన్నవి గాక తక్కినవి కొనుపదుశబ్దంబులు పర్యాయముగా ఘటనచేతను యౌగపద్యముగా ఘటనచేతను ౬ రూపంబులగు.

స్వరూపప్రేరణార్థకరూపంబులు రెండును గూడఁగా నన్నియు నెనిమిదిరూపంబులు పైనిం జూపినవిధంబునఁ దెలియందగు.

(౫౦ సూ—చే, కొనుధాతువును ౮౭ సూ—చే, పడుజేయుఁ జేర్పఁబడును)

123 సూ—గతిబుద్ధి ప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్తయగునది ప్రేరణంబునం గర్మంబగు.

పొందు మొదలయినవి గత్యర్థకంబులు ॥ తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు ॥ తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు ॥ విను - చెప్పు - చదువు - మొదలయినవి శబ్దకర్మంబులు ॥ అకర్మకంబులు

ప్రసిద్ధంబులు ॥ మైత్రుండు గ్రామంబుం బొందెను - చైత్రుండు - మైత్రుని గ్రామంబుం బొందించెను ॥ లాంతిచోసహిత మిక్కార్యంబు గానంబడియెడి ॥ మైత్రుండు భూమి నేలెను - చైత్రుండు మైత్రునిం భూమి నేలించెను.

వ్యా—"యే గత్యర్థకాః, తే ప్రాప్త్యర్థకాః" (గమనార్థకధాతువులు పొందుట యన్న యర్థమిచ్చును) అని వైయాకరణుల సమ్మతియున్నందునఁ బొందు మొదలైనవి శేఖరాది గ్రంథకర్తల మతంబున "సుఖం ప్రాప్తః" ఇత్యాదులందుం గాక తక్కినచోట్ల గమనములేక తమయర్థము సంభవింపనందున గత్యర్థకములు॥ ప్రత్యవసానంబు = భక్షణంబు॥ శబ్దము కర్మకారకంబుగాఁ గల ధాతువులు శబ్దకర్మంబులు నాఁబడు॥ మాటను వినెను. పాఠమును జెప్పెను ఇత్యాదివాక్యములందు కర్మార్థక ద్వితీయాంతములైన మాటయు పాఠమును అక్షరరూపమైన ధ్వనులే కాన, విను-చెప్పు ఇత్యాదులు శబ్దకర్మంబులయ్యె. అకర్మకధాతువులు సంస్కృతవ్యాకరణవ్యాఖ్యాతలు శ్లోకంబున సంగ్రహముగాఁ జెప్పియుండిరి. వాని నిందుం బొందుపఱచుచున్నాము॥ శ్లో॥ (౧) వృద్ధి (౨) క్షయ-(౩) భయ (౪) జీవిత (౫) మరణం। (౬) లజ్జా (౭) సత్తా (౮) స్థితి (౯) జాగరణం। (౧౦) శయన (౧౧) క్రీడా (౧౨) రుచి (౧౩) దీప్త్యర్థం। ధాతుగణం తమకర్మకమాహుః॥ వర్ధిల్లుట, క్షీణించుట, భీతిల్లుట, జీవించుట, చచ్చుట, లజ్జించుట, ఉండుట, నిలుచుట, మేల్కొనుట, శయనించుట, క్రీడించుట, రుచించుట, ప్రకాశించుట యీ యర్థములుగలధాతువులకర్మకంబులగునని యర్థము. సూత్రార్థము—గత్యర్థకాది పూర్వోక్త ధాతువుల ప్రయోగంబులోఁ బ్రేరణార్థము లేనియపుడు కర్తయైనది ప్రేరణార్థసమావేశమందుఁ గర్మంబగును. "ఉ. మైత్రుండు గ్రామంబుం బొందెను" ఇటఁ బొందుధాతువునకు స్వరూపార్థము ఈదశయందు మైత్రుండు కర్తయైనట్లు స్పష్టపడుచున్నది. "చైత్రుండు మైత్రునిం గ్రామంబుం బొందించెను" ఇటఁ బొందుధాతువునకు ౭౦వ సూత్రమునఁ బ్రేరణార్థము దెంచినక్కయ్యె. కానఁ బ్రేరణంబులేని పూర్వవాక్యంబులోఁ గర్తయైన మైత్రుండు ప్రేరణంబుగల యీవాక్యంబులోఁ బ్రకృతసూత్రంబునఁ గర్మంబైనందునఁ దద్వాచక మైత్రశబ్దము ద్వితీయాంతమయినది.

ఇట నీసూత్రము లేకుండనే మైత్రాదులుకర్మంబులై ద్వితీయనొందునని యిట్లు శంకింతురు. ఉదా—"చైత్రుండు మైత్రునిం గ్రామంబుం బొందఁగాఁ బ్రేరేచెను" ఈవాక్యంబులోఁ బ్రేరేమధాతువు సకర్మకంబు గాన నీధాత్వర్థంబునకు మైత్రుఁడు కర్మకంబై కార. పరి. 2వ సూత్రమున మైత్రశబ్దము ద్వితీయాంతమగుట కరతలామలకంబుగాఁ గానిపించెడిని. కాన "ప్రేరేచు" నను నీవాక్యంబులో మైత్రుండు గర్మంబైనట్టులే, చైత్రుండు మైత్రునిం గ్రామంబుం బొందించెను॥ అన్న వాక్యములో సహితము ప్రేరేమధాతువునకుఁ బర్యాయశబ్దంబై పొందుధాతువుకంటెఁ బ్రేరణార్థకమైన యిందుణ్యాగమంబున్నందునఁ బూర్వవాక్యంబునందుం బలె నిటను మైత్రుండు కర్మంబగుట న్యాయసిద్ధంబగుచుండఁ బిష్టపేషణంబుగా నీసూత్రారంభమనావశ్యకంబని వక్కాణించుచున్నారు. అదియుక్తంబు; కాని దేవదత్తుఁడు అన్నమును వండుటకై యజ్ఞదత్తునిం బ్రేరేచెను. అన్న వాక్యమందుగూడఁ బూర్వవాక్యమందు మైత్రుండు వోలె నిట యజ్ఞదత్తుండు "ప్రేరేచు" నను గర్మంబైనందునఁ బ్రేరణేంచుగాగమాంతమైన పొందించుధాతువునకు మైత్రుండు గర్మంబై "చైత్రుండు మైత్రునిం గ్రామంబుంబొందించెను" అన్నట్టులే యిటఁ బ్రేరణేంచుగాగమాంతమావండించు ధాతువునకు యజ్ఞదత్తుండు కర్మంబై "దేవదత్తుండు అన్నమును యజ్ఞదత్తునివండించెను (వండఁబ్రేరేచెను") అన్న యనిష్టప్రయోగంబు సంభవించును. కావున నీసూత్రారంభమావశ్యకంబు. పైనింజూపినవిధంబునఁ బ్రకృతసూత్ర మక్కరలేకయే యెల్లెడలను బ్రేరణేంచుగాగమాంతస్థలంబులలోఁ గర్త కర్మంబగుచున్నందున "ప్రాప్తే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి" [ప్రాప్తించుచుండఁగాఁ జేయంబడిన సూత్రము నియమముకై యగును) అన్న న్యాయంబున నిపుడీసూత్రము నియమార్థమగును. "గత్యర్థకాదిధాతువులే ప్రేరణేంచుక్కుగలవియైనపుడు కర్త గర్మంబగును గాని తక్కినధాతువులు ప్రేరణేంచుక్కుగలవియైనను గర్త కర్మంబుగాదు" అనిన నియమంబీ సూత్రమున్నచోఁ జేర్పడును. ఇపుడు వండు మొదలయిన తక్కినధాతువులు ప్రేరణేంచుక్కుగలవియైనను యజ్ఞదత్తుఁడు కర్మంబుగాక కర్తగానే యుండి యాఖ్యాతముచేతఁ జెప్పఁబడనందున [విభక్త్యంతమైన క్రియచేత ప్రథమాంతార్థమై దేవదత్తుండే యాకాంక్షితుండై యజ్ఞదత్తుండట్లు గానందున] కార. పరి. 3 సూత్రంబున ననభిహితుఁడైన

యజ్ఞదత్తునిం దెలుపునట్టి యజ్ఞదత్తశబ్దంబుకంటెఁ దృతీయావిభక్తి గలిగి "దేవదత్తుఁడు యజ్ఞదత్తునిచే వండించెను" అనిన ప్రయోగమగునని యెఱుంగునది. ఈసూత్రము నిత్యమార్గమని సంస్కృతవ్యాకరణ వ్యాఖ్యానములలోను నహోబల పండితీయము లోను వ్రాయంబడినది. సంస్కృతవ్యాకరణంబులో దీనిమాతృకసూత్రమునొద్ద నైదు విధములైన ధాతువులును ప్రేరణార్థకములైనవు నైదుదాహరణంబులును స్పష్టాగమి శ్లోకంబునం జూపంబడినవి. శ్లో॥ శత్రూనగమయత్స్వర్గం। వేదార్థం స్వానవేదయత్। ఆశయచ్చామృతం దేవాన్వేదమధ్యాపయద్విధిం। ఆసయత్సలిలేపృథ్వీం। యస్సమేశ్రీహరిర్గతిః॥ దీనికిఁ బ్రతిబింబంబుగాఁ బద్యంబొనర్చి యుదాహరణపంచకంబు జూపంబడును. క॥ అరులం బొందించెను సుర। పురి; స్వీయుల శ్రుతులయర్థమును నెఱిఁగించెన్;। సురలం ద్రావించెసుధన్;। సరసీజాసనుని శ్రుతులఁ జదివించె; వసుం। దరనీటనుంచె నే శ్రీ। హరి; యాతఁడు నాకు శరణమనలక్ష్యములౌ॥ చ॥ నునుజిగురాకు మేయఁ దఱి నోరికెలంకులఁ దేటికుట్టినన్। నవరుహశాఖలం గువకువన్వనిఁ బాఱుపికాంగనం బికం। బనువయమొప్పమాన్పఁగతి నాత్మముఖంబు ముఖంబుఁ గూర్చిచుం। బనమొనరించెసందుసుడిమాయలుగా మగవారికృత్యముల్॥ వసు. 3ఆ. ఇటఁ గూడుధాతువు పొందుధాతువునకుఁ బర్యాయము. క్రి. పరి. ౧౦ సూత్రమున కూడించు కూర్చుటలు ప్రేరణరూపంబులు. [పురుషపికంబుతన మోమును (భార్య) మోమునఁగూడునట్లు చేసి అనిద్వికర్మకము] నా॥ కపటపునిద్ర వో వుశతిఁ గౌఁగిటనానుచు మోవిమోవిఁ జే। రుపుచును గొన్ని రాత్రులు వరుందనియించె లతాంగియంతఁ ద। త్కపటముగాంచియుం గననికైవడి నట్ల యొనర్చెఁ గొన్ని రే। లపుడతఁడాపలేక నగవల్లన తానును నవ్వె వేడ్కతోన్॥ కళా 8 ఆ॥

(మోవిని మోవిని జేరునట్లు చేయుచును)

మ॥ అవిచారంబని పల్కనోడుదుము ధర్మాభిజ్ఞనీయగ్రసం। భవుఁడత్యున్నత శక్తియుక్తుఁడు మహీభారప్రగల్భుండు భా। గవదౌహిత్రుఁడు పాత్రుఁడీయదుఁడు లోకఖ్యాతుఁడుండంగనీ। భువనేశత్వభరంబుఁ బూన్పదగునే పూరున్ జఘన్యాత్మజున్॥ భార, ఆది. 3ఆ "జడల్ పూనన్" భార, శా. ౨ఆ. ఇత్యాదిస్థలంబులలోఁ బూను

ధాతువునకుఁ బొందుట, ధరించుట, యనునర్థములు సందర్భవశంబున నున్నందుననిచ్చటను 'బూను' నకు పొందుట యర్థము చెప్పవలయు. అందున పొందించుట యర్థమిచ్చునట్టి ప్రకృతపద్యములోని ప్రేరణార్థకబూన్చు ధాతువు సమావేశంబునఁ బూరుండు గర్మంబగును. వహించుటయర్థము చెప్పకొన్నచో "నీవహోర్న" అనువా-చే ప్రేరణార్థకణిజంతవహధాతుసమావేశమందుఁ గర్తకుఁ గర్మత్వనిషేధమున్నందుననిచ్చటనుబూరువు కర్మంబుగాక కర్తయై యనభిహితుఁడైనందున (విభక్త్యంతకిృయచే నాకాంక్షితుఁడు కానందున) కార. పరి. 3 సూత్రిముచేతఁ దృతీయావిభక్తి వచ్చి "పూరుచే" అని ప్రయోగింపవలసివచ్చును. పూనునకాదివర్ణలోపము రాఁగా నూనునకు ధరించు ఇత్యాద్యర్థములు శబ్దరత్నాకరమందు॥ ఈప్రయోగంబు ప్రామాదికంబని చెప్పవలసివచ్చునుకాననిట సందర్భవశంబునఁ బూన్చునకుఁ బొందించుట యర్థంబని యూహించునది "భీష్ముండు ధర్మజునకు ధర్మంబుల వినిపించెన్; జనని పుత్రునకు నన్నము దినిపించెన్" ఇత్యాది ప్రయోగంబులు కార. పరి. ౨౦ సూత్రిమునను, లేక "అన్యస్యాఽక్వచిద్భవేచ్చాన్యా" అన్న నన్నయభట్టీయ సూత్రమునను గర్మార్థమందు ధర్మజ, పుత్రశబ్దములకంటె షష్ఠివచ్చి సాధువులయినవని తెలియందగు. అథవా "కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠినిత్యంబుగానగు॥ అనినసూత్రంబున నిచ్చట విను, తినుల సమావేశంబునందు "ధర్మజ, పుత్రులకు" షష్ఠియయ్యె.

124 సూ—అనభిహితకర్తకొకానొకచో షష్ఠి బహుళంబుగానగు.

రాముఁడు మిథిలంగనియె ॥ రామునకు మిథిలగనంబడియె - రామునిచే మిథిలగనంబడియెను ॥ మైత్రుిందుతత్వంబుం దెలిసెను - చైత్రుిండు మైత్రునకుం దత్వంబు దెలిపెను ॥ కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠినిత్యంబుగానగు - విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను - కృష్ణుండర్జునునకు విశ్వరూపంబుం జూపెను.

అకర్మకంబున కపేరిరణంబునం దాత్మనేపద కర్మానుబంధంబులు లేమిం జేసి రూపభేదంబు లయిదని యెఱుంగునది.

కర్త్రర్థకము.

మైత్రుఁడు - మనియెను

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుఁడు - మైత్రుని మనిచెను

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము

చైత్రుఁడు - మైత్రుని - మనుచుకొనియె

ప్రేరణకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రుఁడు - మనుపఁబడియె

ప్రేరణాత్మనేపదకర్మార్థకము.

చైత్రునిచేత - మైత్రుఁడు - మనుచుకొనఁబడియె

వెండియుం బ్రేరణంబునం దిందుగాగమంబు గలిగినచో సకర్మకంబునకుం బండ్రెండు సకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది.

వ్యా—ఆఖ్యాతముచేత (ప్రథమాంతమైన యెవ్వఁడు, ఏది ఇత్యాదిశబ్దములద్వారమున) నాకాంక్షితము కాని యట్టి కర్తకు కార. పరి. 3 సూత్రముచేత చేతవర్ణకంబు ప్రాప్తించు చుండఁగా నీసూత్రంబు దానికి బాధకంబుగా నారంభింపఁబడియె.

ఉదా—“రామునకు మిథిలగనంబడియె” ఇట సకర్మకమైనకనుధాతువుకంటె క్రి. ప. 52 సూత్రమున కర్మార్థమందుఁ బడుఁజేవర్ణకంబు విధింపఁబడి “రాముఁడు మిథిలంగనియె” అన్నకర్తృప్రయోగవాక్యములోఁ గర్మంబైన మిథిలానగరము కర్మప్రయోగవాక్యములో నాఖ్యాతముచేత నభిహితమైనందున (ఏదికనఁబడెను అని ప్రథమాంతకింశబ్దముచేత నాకాంక్షితమైనందున) కార. ప. 6 సూత్రముచేత నుక్తార్థమునఁ బ్రథమయు కర్తయైన రాముఁడు ఆఖ్యాతముచేత నభిహితుండు కానందున కార. పరి

కి సూత్రముచేత చేతనార్థకంబును ప్రాప్తించుచుండఁగా నీసూత్రంబుచే తద్వర్ణకంబునకు మాత్రము బాధకంబై షష్ఠివచ్చి పైవిధంబుగా వాక్యంబయ్యె. ఇది బహుళంబుగానఁ బక్షంబునఁ దృతీయయు వచ్చి "రామునిచే"— అనియు ప్రయోగింపందగు. "చైత్రుండు మైత్రునకుఁ దత్వంబు దెలిపెను" తెలుపుధాతువు తెలియుధాతువు ప్రేరణంబుగాన [బుద్ధ్యర్థకము] ౧౨కి సూత్రముచేత మైత్రుండు కర్మంబగుట ప్రాప్తించుచుండఁగా నీసూత్రంబున బాధింపఁబడి షష్ఠివచ్చినదని యెఱుంగఁదగ్గది. సూత్రములోని బహుళగ్రహణమున నొకానొకచో ద్వితీయయునగు. ఉ. నా. క॥ కడుఁదడవుని ద్రబోయితి। బడఁతీ! నను దెలుపవలదె బలియుఁడొకరుఁడే। కృష్ణుఁజన్మమునఁబట్టిబలం। బెడలఁగ ననుదిగిచె నాతఁడెవ్వఁడు సెపుమా॥ భా. ఆర. ౭ ఆ. "కర్త్రాద్యభియోగంబునకు" అన్న సూత్రంబునకుఁ దాత్పర్యమేమనఁగా సంస్కృతవ్యాకరణంబున "దృశేశ్చ" అను వార్తికము చేతఁ బ్రేరణార్థకమగుచున్న దృశిధాతువు సమావేశంబునఁ గర్తకుఁగర్మత్వము విధింపఁబడి "దర్శయతిహరింభక్తాన్" (మైత్రుఁడు హరిఁభక్తులను జూపెను; ఇది ప్రతిపదార్థాంధ్రీకరణము) అని యప్రేరణంబునఁ గర్తలైన భక్తులు (భక్తాహరింపశ్యంతి=భక్తులు హరినిఁ జూచుచున్నారు) ఇపుడు ప్రేరణంబునఁ గర్మంబగుట యుదాహరింపఁబడియె. సంస్కృతవ్యాకరణానుసారంబుగా నాంధ్రభాషయందుం చూడ గత్యాద్యర్థకధాతువులకుఁ బ్రేరణంబునన ప్రేరణమందలి గర్త కర్మంబైనట్టులే దృశ్యర్థకధాతువులకుఁ గూడఁ బ్రేరణంబున నప్రేరణంబందలి కర్త కర్మంబగుట ప్రసక్తమగుచుండ నీసూత్రముచేతను సూరిగారు షష్ఠిని విధించుచుండిరని యెఱుంగునది. ఉ. విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను. ఇటనప్రేరణంబునఁ గర్తయైన రామునకు (రాముఁడు మిథిలంగనియె) నీవాక్యంబున షష్ఠి వచ్చెను. కను, విను, తిను ఇత్యాదులు కన్వాదులు కనుధాతువునకుఁ బ్రేరణంబున ౭౦ సూ-చే నించుక్కను ౭౧ సూ-చేత ఁబుగాగమంబును ౭౩ సూత్రముక్రిందివాక్యముచేత నకారంబునకు దీర్ఘత్వమును ౫౪ సూ-చేత, నుకారముమీఁది యుకారమునకు నిత్యంబైను గలుగంగా "కానిపించు" అగును. ఈధాతువునకుఁ బ్రేరణార్థమే కాకుండ "ప్రత్యక్షమగు" అని యకర్మకార్థంబును గలదు. ఆ॥ కానిపించి యేమి కావలయును వరం। బనుగుమనిన నేను నాత్మశక్తి। కొలఁది నతులు నుతులఁ సలిపితుంబురుగాన। కలనవలన గెలువవలయునంటి॥ కళా. ౨. ఆ. ఇట్లై రెండవయుదాహరణమందు ననర్జునశబ్దంబుమీఁద షష్ఠియయ్యె "మా

"పెను" చూచునకు క్రి. ప. ౭౬ సూ-చేఁ బుగాగమంబు గలిగి చువర్ణంబు లోపింపఁ గానైనది.

(మూ) అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్మానుబంధంబులు లేమిం జేసి రూపభేదంబులైదని యెఱుంగునది.

వ్యా— అకర్మకధాతువునకుఁ గర్మసంబంధము లేనందునఁ గర్మార్థమందు ౭౯ సూ-చే విధింపఁబడు "పడుజే" "మను" ఇత్యాద్యకర్మకధాతువులకుఁ జేర్పఁబడదు. ఆంధ్రభాషాశైలిం చేసి యకర్మకంబులగు మనుప్రభృతిధాతువులకుఁ "గొను" అన్న యాత్మనేపదానుబంధంబును జేర్పఁబడదని తెలియవలయు. ఒకానొకచో నకర్మకధాతువునకు సయితము పడుజేకొనులు ౧౦౯ సూత్రమున స్వార్థమందు సూత్రము. లావచ్చును నిలఁబడు పండుకొను ఇత్యాదులు.

## కర్త్రర్థకము,

| | |
|---|---|
| మైత్రుండు మనియెను | ఇది యకర్మకంబు గాన నాత్మనేపదచిహ్నంబగు కొనుశబ్దమును కర్మార్థలాంఛనంబైన పడుజేయు లేనందున నొక్కటియే రూపంబు. |
| ప్రేరణ కర్త్రర్థకము చైత్రుండు మైత్రుని మనిచెను | క్రి. ప. ౭౩ సూ-మున చుక్కను ౭౫ సూ-మున నుకారముమీఁది యుకారమున కికారంబునుగలిగెను. |
| చైత్రుండు మైత్రుని మనుచుకొనియె. | ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము. ప్రేరణంబున సకర్మకమైనందునఁ "గొను" అను నాత్మనేపద చిహ్నము చేర్పవచ్చును |
| చైత్రునిచేత మైత్రుండు మనుపఁబడియె | ప్రేరణకర్మార్థకము. ప్రేరణంబు సకర్మకమైనందున "పడు" అను కర్మార్థచిహ్నంబు చేర్పవచ్చును. |
| చైత్రునిచేత మైత్రుండు మనుచుకొనఁబడియె | ప్రేరణాత్మనేపదకర్మార్థకము సకర్మకము గనుక నుభయంబును కొనుపడుజులు చేర్పంబడియె. |

ఇట్లెల్ల యకర్మక ధాతువులకును, అప్రేరణంబునందు అనఁగా స్వరూపార్థమందు నాత్మనేపదకర్మానుబంధములు లేనందున నేకవిధమైన రూపంబును, ప్రేరణార్థ

మందు ప్రేరణరూపంబును (౧) కొనుపదంబులు వెవ్వేఱుగాఁ జేర్చుటంజేసి (౨) రూపంబులును నుభయంబును జేర్చుటంజేసి (౧) రూపంబును మిళితంబై యైదురూపంబు లేర్పడు. (మూలము) రెండియుం బ్రేరణంబునందు నిచుగాగమంబు గలిగినచో సకర్మకంబునకుం బండ్రెండు నకర్మకంబునకుం దొమ్మిది యు భేదంబులని యూహించునది.

వ్యా—మొదటి ప్రేరణార్థమందుఁ జుగాగమంబును తిరిగి ప్రేరణార్థమందు నించుగాగమంబును గలిగెనేని సకర్మకధాతువునకు ద్వాదశరూపంబులు నకర్మకధాతువునకు రూపనవకంబును నగును. క్రి. పరి. ౭౪ సూత్రమ్మునఁ బ్రేరణేంచుక్కుకంటెఁ దిరిగి ప్రేరణేంచుక్కు సంభవింపనేరదు గానఁ బ్రేరణచుక్కుకంటె ప్రేరణేంచుక్కు రావచ్చునని భావము. ఈవఱలోఁ బ్రేరణచుగాగమరూపంబులతోఁ గూడ నకర్మకమైన మనుధాతువునకు నైదురూపంబులు చూపంబడియె. తిరిగి ప్రేరణంబునఁ జుగాగమాంతరూపంబుకంటె నిచుక్కు చేసి నాల్గురూపంబులును నిరూపింపంబడును.

(౧) యజ్ఞదత్తుండు చైత్రునిచేత మైత్రుని మనిపించెను. పునఃప్రేరణకర్త్రర్థకము ఇట నాఖ్యాతముచేత యజ్ఞదత్తుం డభిహితుండై చైత్రుండనభిహితుం డగుటం జేసి కార. పరి. 3 సూత్రమ్మునఁ జైత్రశబ్దంబుకంటెఁ జేతవర్ణకంబయ్యె.

(౨) యజ్ఞదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని మనిపించుకొనియె (పునఃప్రేరణాత్మనేపదకర్త్రర్థకము)

(3) యజ్ఞదత్తునిచేత చైత్రునిచేత మైత్రుండు మనిపింపఁబడియె. (పునఃప్రేరణకర్మార్థకము) ఇటఁ గర్మార్థకమైన యాఖ్యాతంబుచేతను గర్మంబైన మైత్రుండభిహితుఁడై ప్రయోజకప్రయోజ్యులైన యజ్ఞదత్తచైత్రులిరువురును ననభిహితులైనందున కార. పరి. 3 సూత్రమున యజ్ఞదత్తచైత్రశబ్దములకంటెఁ జేతవర్ణకంబులు గలిగె. మైత్రుం డభిహితుండైనందున సుక్కార్థమందుఁ బ్రథమాసూత్రమ్మునఁ బ్రథమావిభక్తియయ్యె.

(౪) యజ్ఞదత్తునిచేతఁ జైత్రునిచేత మైత్రుండు మనిపించుకొనంబడియె. (పునఃప్రేరణాత్మనేపదకర్మార్థకము) వెనుకటిరీతిగానే తృతీయాప్రథమావిభక్తులు దద్విధాయకసూత్రమ్ములఁ గలుగునని యూహించునది.

సకర్మకధాతువులనుం గూడఁ బ్రేరణార్థములు రెండింటియందు నుపయోగించి పన్నెండురూపంబులను స్పష్టార్థముదాహరించెద.

(౧) మైత్రుండు తత్త్వంబుం దెలిసెను (కర్త్రర్థకము) (౨) మైత్రుండు తత్త్వంబుం దెలిసికొనెను (ఆత్మనేపదకర్త్రర్థకము) (౩) మైత్రునిచేతఁ దత్త్వంబు తెలియంబడెను. (కర్మార్థకము) (౪) మైత్రునిచేతఁ దత్త్వంబు తెలిసికొనంబడియెను. (ఆత్మనేపదకర్మార్థకము) (౫) చైత్రుండు మైత్రునకుం దత్త్వముం దెలిపెను (ప్రేరణకర్త్రర్థకము) ఇట క్రి. పరి. ౧౨౪ సూత్రమునఁ బ్రయోజ్యకర్తయైన మైత్రునిఁ జెప్పునట్టి మైత్రశబ్దమునకు షష్ఠి గలిగినది. (౬) చైత్రుండు మైత్రునకుం దత్త్వంబుం దెలుపుకొనెను (ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము) (౭) చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబు తెలుపంబడియెను (ప్రేరణకర్మార్థకము) (౮) చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబు తెలుపుకొనంబడియెను (ప్రేరణాత్మనేపదకర్మార్థకము) (౯) యజ్ఞదత్తుండు చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబుం దెలిపించెను (పునఃప్రేరణకర్త్రర్థకము) (౧౦) యజ్ఞదత్తుండు చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబుం దెలిపించుకొనియెను(పునఃప్రేరణాత్మనేపదకర్త్రర్థకము) (౧౧) యజ్ఞదత్తునిచేత చైత్రునిచేత మైత్రునకుం దత్త్వంబు తెలిపింపంబడియెను. (పునఃప్రేరణకర్మార్థకము) (౧౨) యజ్ఞదత్తునిచేతఁ జైత్రునిచేత మైత్రునకుఁ దత్త్వంబు తెలిపించుకొనఁబడియెను. ఇట్లు తక్కిన సకర్మకంబులకు నూహ్యంబులు.

ఇది క్రియాపరిచ్ఛేదము.



# కృదంతపరిచ్ఛేదము.

1 సూ—కృత్తులకర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు.

ధాతువునకు విహితంబగుడుఙ్భిన్న ప్రత్యయంబు కృత్తునాఁబడు కృత్తులకువక్ష్యమాణంబులకు భావకర్మకర్త్రాద్యర్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునది. ॥ఆఁక - బంధనము ॥ మొలక - నవోద్భిదము ॥ ఏలిక - పాలకుఁడు ॥ కోరిక - వాంఛయు వాంఛితంబును మూఁక - సంఘము॥ ఆడిక - నింద ॥ ఓడిక - ప్రోతస్సు.

వ్యా—కృత్ప్రత్యయంబులకు భావకర్త్రర్థంబులు పెద్దల వ్యవహారమును ననుసరించి తెలియందగినవి. కాని సూత్రంబులలో నాయాయియర్థములం బేర్కొని, క, ఇక, ఇత్యాదికృత్ప్రత్యయంబులు విధింపఁబడవని భావము.

ఈతాత్పర్యమే "కృత్తులకు' వక్ష్యమాణంబులకు భావకర్మకర్త్రర్థంబులు మహాజనవ్యవహారానుసారిగానెఱుంగునది" అని మూలమందే వివరణము చేయఁబడినది.

(మూలము] ధాతువునకు విహితంబగు డుఙ్భిన్నప్రత్యయంబు కృత్తునాఁబడు

వ్యా—"ధాతువునకు" అనిన క్రియాపరిచ్ఛేదమందలి ప్రథమసూత్రము క్రియాపరిచ్ఛేదమందే కాకుండఁ గృదంతపరిచ్ఛేదంబునందుం గూడ నధికారసూత్రముగా వర్తిల్లునని భావము. కృత్ప్రత్యయంబునకు లక్షణంబేమనఁగా డుక్, రు, వు, యు, నుఁ ముఙ్ అనునవి దక్క ధాత్వధికారమందలి ప్రత్యయంబులు కృత్తులు నాఁబడునని యర్థము. డుక్కులోని డువర్ణంబును ముఙ్లోని ఙకారంబుతోఁ గూర్పఁగా "డుఙ్" అనిన ప్రత్యాహారం బేర్పడినది. [క్రి. ప. ౧ సూ] సూరిగారిచేత "కృదతిఙ్" అనిన

పాణినీయసూత్రమే యాంధ్రీకరించి యిట్లు వ్రాయఁబడినది యని తెలియందగు. భావాద్యర్థంబుల కుదాహరణము. ఆఁక ॥ బంధనము. ఇట అడ్డగించు అర్థముగలయాఁగు ధాతువుకంటె నీపరిచ్ఛేదములో 3 సూత్రముచేతఁ గవర్ణకము రాఁగా "ఆఁగు + క" ఇట్లుండె. కవర్ణము పరమగుచుండ ధాతుగుకారమునకు ౨ సూత్రముచేతను లోపంబై "ఆఁక" యయ్యె. దీనికి నడ్డగించుట యర్థము గాన భావార్థమున కుదాహరణము. ఉ. దా "మొలక" నవోద్భిదము; దీనికిఁ బర్యాయపదంబుగా నిచ్చిన "ఉద్భిత్" అను శబ్దము "ఉద్భినత్తిభువంబీజంచ" [భూమిని బీజమును భేదించి వెలువడునది] యన్న యర్థమందు "సత్సూద్విష.............భిదచ్ఛిదజననీరాజాముపసర్గేపిక్విప్ అ౩ పా ౨ సూ ౬౧] అనుపాణినీయసూత్రంబున ననువర్తమానకర్త్రర్థమందుఁగ్విప్పురాఁగానైన రూపంబుగావున మొలక శబ్దంబును మొలుచుధాతువుకంటెఁగర్త్రర్థమందు గవర్ణము వచ్చినది యని తెలియవలయు. ఉద్భిచ్ఛబ్దము బుత్విగాదులలోనిది గాన నవోద్భిదము అని యయ్యె. ఆఁగు, మొలుచు, ధాతువులకంటె 3 సూత్రమున నొక్కవర్ణకమే విధింపఁబడినను "ఆఁగు" కంటె భావార్థమందును "మొలుచు" కర్త్రర్థమందును నయ్యెది యైనట్లు మహాజనవ్యవహారంబున దెలియందగినదే కాని సూత్రంబున విశేషించి యర్థములు పేర్కొనంబడవు. మొలక మొలచునది. [మొలచుటకుకర్త] ఇట్లె మూఁగుధాతువు కంటెఁ గవర్ణకము కర్త్రర్థమందుఁ గలిగి "మూఁక" = [సంఘము=మూఁగునది] అయ్యెనని యూహింపవలయు. "ఏలిక" పాలకుఁడు ఏలుధాతువుకంటె ౧౨౫ సూత్రమున నిక వర్ణకము కర్త్రర్థమందుఁ గలిగె. [ఏలుటకుఁగర్త యని యర్థము] కోరిక వాంఛయు వాంఛితంబును; కోరుధాతువునకు ౧౨ వ సూ-న భావార్థమందు నిక వర్ణకము రాఁగా వాంఛ యర్థమగును. (కోరుట యర్థము) ఆధాతువుకంటెనే కర్మార్థమందు నిక వర్ణకము కలిగియు "కోరిక" యనియగు. దీనికి వాంఛితము అర్థము (కోరఁబడినది); ఆడు [నిందించుట] ధాతువునకు భావార్థమందిక వర్ణకమురాఁగా "ఆడిక" = (నింద] యగును ఓడిక [=స్రోతస్సు 'ఓడు' నకుఁ గర్త్రర్థమందు నిక వర్ణకము [ప్రవహించునదియని ప్రవహించు క్రియకుఁ గర్తయైనట్లు తోఁచుచున్నది]; ఇట్టులొక ప్రత్యయమే భావకర్మాద్యనేకార్థములయందు వచ్చుట యర్థమునుబట్టి యూహించునది. ఇట్టి ప్రాతిపదికంబులకర్థములును, నిదర్శనముగాఁ గవిప్రయోగంబులును, శబ్దరత్నాదినిఘంటువులలో శాఖోపశాఖలుగాఁ బ్రకటింపఁబడును. కావునట్టివ్యాకరణవిశేషశూన్యశబ్దంబుల

కర్థము నిచ్చట సెత్తి వ్రాయుట యనావశ్యకము. ఏకధాతువునకే భావకర్మాద్యర్థవిశేషములయందు నేకప్రత్యయంబే గల్గినను, నొకధాతువునకే ప్రత్యయభేదంబులఁ బ్రాతిపదికార్థభేదమున్నను, వ్యాకరణమ్మునంజేసి రూపవిశేషంబులున్నను, నట్టిస్థలంబుల నెంచి ప్రయోగంబులు ప్రమాణముగా వ్రాయంబడు ఇచ్చటఁ గోరికశబ్దము భావార్థమందును గర్మార్థమందును నిక వర్ణకంబుగలదైనందున నర్థవిశేషములయందుఁ బ్రయోగనిదర్శనమావశ్యకము. క॥ ఈకథ యెవ్వరుచదివినఁ। గైకొన్నరు విన్నఁగోరికను వ్రాసినవా। రేకాలముశంభునికృప। నాకల్పముగందురైహికాముష్మికములే॥ [ఇచ్ఛయర్థము; భావార్థము] "తగుకోరికలిచ్చెఁ బుళిందకోటికిఁ" ఉ. రా. 2 ఆ॥ [వాంఛితము కర్మార్థమందు ప్రత్య]

2 సూ—ఇటం గృత్కగతపవేములు పరంబులగునపుడు కగచయవలకు లోపంబగు.

కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువునంతంబులగు కగచయవలకు లోపంబగు ॥ మీఁదిలక్ష్యంబులం జూడంబడు.

వ్యా—స్పష్టము.

3 సూ—కవర్ణకంబులు గ్వాదులకగు.

అలుగు - అలుక ॥ ఆఁగు - ఆఁక ॥ ఎఱుఁగు - ఎఱుక - ఇట బిందులోపంబు· ఇట్లు గొన్నింట గ్రహించునది ॥ కడఁగు - కడఁక ॥ కలఁగు - కలఁక ॥ కాఁగు - కాఁక ॥ తునుగు - తునుక ॥ నడచు - నడక॥ నలఁగు - నలఁక ॥ పోవు - పోక॥ మడఁగు - మడఁక ॥ మలఁగు - మలక॥ మునుఁగు - మునుక ॥ మూఁగు - మూఁక॥ మొలచు - మొలక ॥ వచ్చునకు - రా - రాక ॥ వంగు - వంక ॥ వీఁగు-వీఁక ॥ ఇక కవులుపరంబులగునపుడు కనునకు దీర్ఘంబగు- కానుక-కిసియుముది

యుల కుత్వంబునగు - కినియు - - కినుక ॥ ముదియు-ముదుక ॥ ఇత్యాదు లలుగ్వాదులు.

వ్యా—"ఎఱుక" ఎఱుఁగు ధాతువునకీ సూత్రమునఁ గవర్ణకము రాఁగా ౨వ సూత్రమునఁ బ్రత్యయకకారపరత్వమందు ధాతుగుకారమునకు లోపంబు. బిందువునకు నులోపంబిటు విశేషము. ఇదిపరిచయమర్థమిచ్చుచో భావార్థమందుఁగ ప్రత్యయమను దక్కిన జ్ఞానము, సోదె, గుఱుతు, జ్యోతిశ్శాస్త్రమును అర్థములనవును కరణార్థమందుఁ [సాధనార్థమందు] గవర్ణకమనవలెను దీనిచేతను యుక్తాయుక్తము మొదలైనవి తెలియఁబడునని వ్యుత్పత్తి చెప్పందగును. యుక్తాయుక్త వివేచనకు జ్ఞానము సాధనముగదా। పరోక్షమైన సంగతి తెలియుటకు సోదె సాధనము. [కరణము.) వస్తునిశ్చయంబునకు గుఱుతు సాధనము. ఆగతానాగతములు తెలియుటకు జ్యోతిశ్శాస్త్రము సాధనము. సాధనములైన జ్ఞానాదులను తెలుపుచున్నందున నెఱుకశబ్దము కరణార్థకము. ఉ॥ ఎఱుక పెటికెఁడు ధనము॥ (పరిచయము అర్థము: భావార్థము) క॥ చదివినయెఱుకలకుపరియెుదునని యెఱుకల్ లక్ష్మి. ర ఆ (జ్ఞానముకరణార్థకము) గీ॥ భూతి డాఁచిపనుపుఁబూసి త్రిశూలహ। స్తంబుడాఁచి చేత సజ్జయమర। వెలఁది మేనఁగల్గువీరుండు వెలఁదియై। యెఱుకయెఱుక యనుచు నేగుదెంచె॥ నీర. ౨ ఆ॥ (సోదె; పరోక్షార్థజ్ఞాన సాధనము) సీ॥ ఇటు నేలజేజేల కెఱుకైన చెంగావి సుదపంజదగు కొండఁజూచినాఁడ॥ కా ౫ ఆ॥ (గుఱుతు; వస్త్రమందలి నీరుఁ జెంగావి బ్రాహ్మణులని తెలియుటకై సాధనమైనగుఱుతు) గీ॥ రాజునకుఁ గీడుపుట్టెడు రాజ్యమడఁగు। ననుచు నెఱుకచెప్పెడు జ్యోతిషాధములను। గుడుపుకొఱకువిప్రాకృతిఁగొన్న శూద్రుఁ। బ్రాహ్మప్రదండము గొనఁబాడిగలదు॥ విజ్ఞా-ప్రా-కాం॥ (జ్యోతిశ్శాస్త్రము; పరోక్షార్థము దెలియఁగా సాధనము.) "తునుక" ("తునిఁగినది" అన్నయర్థము గావునఁ గర్త్రర్థమందిటఁ గవర్ణకము; గువర్ణలోపమే కాక పూర్వవర్తిబిందువునకు లోపము.) "మడఁక" మడత, మడుఁగు వస్త్రము అర్థము; మడలునది అని వ్యుత్పత్తి వలనఁ గర్త్రర్థమందుఁ గవర్ణకము; "మలఁక" "మలక" ఇట్లు అర్ధబిందుసహితమును బిందురహితమును నయిన రెండుశబ్దములును "మలఁగు" వలననైన రూపములే మొదటిదానికి చిక్కు,

చుట్టు, మొరక ఈయర్థము భావార్థమునై నని; రెండవవానికి దురక, మూకుడు; ఇట ద్రవ్యమర్థమయినందున మఱఁగువాఁడు, మఱఁగునది అనివ్యుత్పత్తిం జేసి కర్త్రర్థక ప్రత్యయాంతములు. "మూఁక" "మొలక" ఇయ్యవి కర్త్రర్థకములని పూర్వమందుఁ జెప్పంబడియె. "కానుక" కర్మార్థమందు రూపము (రాజుచే శ్రద్ధతోఁ గనఁబడునది = చూడఁబడునది) రూపాంతరము "కాన్క"; ౧౨ సూ—న పక్షాంతరమందు నిక వర్ణకము "కానిక" ఇదియుఁ గర్మార్థకరూపము. "కానుపు" అనునది కనుధాతువునకుఁ బ్రసవించుటర్థమున్నందునఁ దదర్థమందు ౧౧ సూత్రముచేత, ఉవర్ణకముగలిగి యీసూత్రమందలి సూరిగారివచనంబున నాదిస్వర్ణదీర్ఘంబగు. "ముసుక" కర్త్రర్థమందుఁ గవర్ణకము [ముదియునట ముదియువాఁడు] "ఎట్టిగాఁ| గడఁగతి మూసుకాళ్ళుముదుక న్వరియింప" జై ౪ ఆ॥ "కినుక" రూపాంతరము "కిన్క" కినియుటకు ౧౧ వ సూత్రమునఁ బువర్ణకంబును నుత్వంబును గానిపించెడిని. గీ॥ అనుచు గ్రేఁగంట నీరసం బంకురింపఁ| గినుపు కిలికించితము నాత్మఁ గీలుకొనఁగ॥ కాశీ ౪ ఆ. [కినుపు=కినుక]

4 సూ—ఇమివర్ణకంబు కలుగ్వాదులకగు.

కలఁగు - కలిమి ॥ ఓరుచు ॥ ఓరిమి॥ కూరుచు - కూరిమి ॥ నేరుచు - నేరిమి॥ వేల్చుచు - వేల్మిమి । బడియు - బడిమి ॥ బ్రిదుకు బ్రిదిమి ॥ ఒడ్డు - ఒడ్డిమి ॥ తాలు - తాలిమి

వ్యా—"కలిమి" ఇటఁగలుగునకు బ్రకృతసూత్రమున నిమివర్ణకంబును "ఇమి' పరంబుగాఁగా రెండవసూత్రమున నంత్యగువర్ణంబునకు లోపంబును అపవాదినిత్యస్వర సంధియుఁ గలిగె. "కలిమి" భావార్థకమైనచోఁ గలియుంయర్థము "ఇట్టిమహిమ కలిమికిఁ గతమెయ్యది'' భార. అ. ౭ఆ॥ [కలుగుట] ఈధాతువునకు నధికరణార్థమందును ఇమివర్ణకము వచ్చును. క॥ కలిమియుమట్టలఁ జేర్చును॥ భార. శాం. ౧ ఆ (కలిమి = సంపద; దీనియందు సుఖముగలుగునని వ్యుత్పత్తి) "కల్మి''రూపాంతరము, "ఓరిమి" ఇత్యాదులందు నీసూత్రమున నిమివర్ణకము రెండవసూత్రముచేత నంత్యవర్ణ

లోపమునని యూహించునది. "కూరిమి" (దీనిచేతఁ బ్రియపడుదురు అని వ్యుత్పత్తి। కర్మ కరణార్థమందుఁ బ్రత్యయము. స్నేహము అర్థము). బడియు-బడిమి=(దృష్టిదోషపరిహారార్థము దిగఁదీయుట) తాలు-తాలిమి॥ "తాళు" అని ధాతువుగానున్నపుడల ఘులకారముతో నుండును. ఈళకారము కృదంతత్వావస్థయందు లఘులకారమయి "తాలిమి" అగు. రూపాంతరము "తాల్మి" క॥ ఈతాల్మిలేదు బ్రాహ్మణ। జాతికి నీవెవ్వడవు నిజంబనవుడు నే। నూతఁజూడుమనియె నెఱుచుము। నాతండాముని పరేణ్యుఁడతికుపితుండై॥ భార. శాం. ౧ ఆ॥ ఉ॥ ఉత్తమభక్తి నేనతగనోపి యొనర్తు బ్రియంబు తాల్మియుఁ॥ మెత్తదనంబు సంతతము మేలుగఁదాల్తుసమస్తభంగులఁ॥ భార। ఆర. ౫ఆ.

5 సూ—తజ్వర్ణకంబు చేయాద్యములకగు.

చేయు - చేత॥ అలయు - అలఁత॥ కూయు - కూఁత॥ కోయు - గోఁత॥ గీయు - గీఁత॥ నేయు - నేఁత॥ పూయు - పూఁత॥ పోయు - పోఁత ॥ మూయు - మూఁత॥ మేయు - మేఁత ॥ మ్రోయు - మ్రోఁత॥ రోయు - రోఁత॥ లాయు - లాఁత॥ వ్రాయు వ్రాఁత॥ వ్రేయు - వ్రేఁత.

కూయుధాతువు మెఱయందు దిప్రత్యయాంతము గీ॥ అకట! యాఁడుకూయి శోకికూయిని లాఁతి। వారికైన నరయవలయుననిన। నన్నుఁగీచకుండు తన్నఁగనెట్టులు। చూడనేర్చె ధర్మసూనుఁడపుడు॥ విరా. ౨ఆ. ఇటు లనుకస్థలంబులందుం గూడఁ బకృతిప్రత్యయ విభాగం బూహింపవలయు।

వ్యా"చేఁత" చేయుట. ఇట భావార్థకము తజ్వర్ణకమ్ము; క॥ వారొకయాగ్రహవృత్తిం। గూరి యధర్మంబు సేఁతకుం జాలరుదు। ర్వారబలులయ్యుఁ బాండుకుమారులు శాంతాత్ములందు ప్రమహి జనులెల్లన్॥ భా. ఉద్యో. ౧ఆ. (అధర్మంబు సేఁతకున్=అధర్మముచేయుటకు) కృత్యము అనుసర్గమంబుఁ గర్మార్థకము (చేయఁబడునది); ఉ॥ పూఁ

తపింపఁజేసినంటి వలపుం బచరించు కులంబునీతికిన్। లేఁతగదమ్మ యిత్తెఱఁగ లేమ సురాంగన లెల్ల నిట్టిని! పేఁతను మెత్తురమ్మ దయసేయక తిన్నని మేనువెన్నెలన్। వేఁతురటమ్మ యింతకును వేదురు సెల్లునటమ్మ యింతికిన్॥ మను. 3 ఆ. "అలఁత" ఈధాతువునకు ౧౧ సూ-చేఁ బువర్ణకంబును, ౧౨ సూ-చే నికవర్ణకంబును గలిగి "అలపు" "అలయిక" అనిరూపంబులగు. "గీఁత" (గీయఁబడునది అనిన కర్మార్థమందుఁ దబ్వర్ణకము; గీటు అర్థము) 'మూఁత' మూయుట అన్నయర్థమందు భావార్థకము; మూకుడు మొదలైన మూయుపదార్థములు అర్థమైనపుడు కర్త్రర్థకము. 'మేఁత' పశువుచే మేయఁబడు తృణాదికమర్థము గానఁ గర్మార్థకము. 'రోఁత' జుగుప్సఅర్థము; రోఁతలు (బహువ) తిట్లు అర్థము. ఇటుఁ గర్మార్థకము. "వ్రేఁత" వేయుటయు, కార్యకారణాభేదోపచారంబుచేత వ్రేయుటవలన (గలిగిన) దెబ్బయు నర్థములు; క॥ ఆసూర్యభానుఁడీ క్రియ వ్రేసిన యప్పరిఘు దనుజవిభుఁ డధికబలో।ల్లాసమునఁ బుచ్చుకొని షాడి। చేసె నసురులార్వ నతని శిరమొక వ్రేఁతన్॥ నిర్వ 8 ఆ॥ (దెబ్బచేత) భావార్థప్రత్యయమైనను నీయర్థమందుఁ గార్యము కారణముతో నభిన్నమన్న బుద్ధిచేత నిటు ప్రయోగింపఁబడియె. ఈగణంబులోని ధాతువుల యుకారమునకుఁ దకారము పరమగుచో రెండవ సూత్రమున లోపంబు గలిగె. తజ్జుడిత్తుగాన బింగుపూర్వకంబగు. హ్రస్వముమీఁది యాబిందువు పూర్ణబిందువగు.

## 6 సూ—కువవర్ణకం బడంగ్వాదులకగు

అడఁగు - అడఁకువ॥ ఎఱుఁగు - ఎఱుకువ ॥ కలఁగు - కలఁకువ॥ నలఁగు - నలఁకువ॥ పెనఁగు - పెనఁకువ॥ పొలయు — పొలకువ॥ మఱచు - మఱకువ॥ మెలఁగు - మెలఁకువ-లోఁగు - లోఁకువ॥ వేగు - వేకువ.

వ్యా—కువప్రత్యయకకార్యము పరమగుచో (౨) సూత్రమువ ధాత్వంత్యవర్ణమునకు లోపమ్మగు,

"ఎలుకున" — ఎలుఁగుధాతువునకుఁ గుణవర్ణకంబు గల్గగా, 'ఎలుక' శబ్దమం దుంబలె బిందువుచోఁ గూడ ధాతువర్ణంబు లోపించు. దీనిచేతఁ దోయబడునన్న వ్యుత్పత్తి గానఁ గరణార్థమంబుఁ బ్రత్యయము. 'నలఁకువ — శ్రమకు సాధనంబుగాన వ్యాధియను నర్థమునఁ గరణార్థమందును; శ్రమ, బాధ ఇత్యాద్యర్థములందు భావార్థ మందును; బ్రత్యయము. 'పెనఁకున' — దీనియందు (యుద్ధమందు) పెనఁగులాడుదు రన్న యర్థమ్మున నధికరణంబునఁ గువప్రత్యయము. తక్కిన మేళనాద్యర్థములయందు భావార్థమునని తెలియవలెను. 'పొలకువ' — దీనియందు సంచరింతురన్న వ్యుత్పత్తి నిమాగణము, ఇత్యాద్యర్థములందు నధికరణార్థకము 'పోఁబడి' అర్థమందు భావార్థకము. 'లోఁకువ' — అణఁగునది ఇత్యాదివిశేషణార్థమునఁ గర్త్రర్థమందుఁ బ్రత్యయము. విశేష్యంబగుచో భావార్థకము. 'వేఁకువ' — ఈకాలమందుఁ దెల్లవాఱుచుండుంగానఁ బ్రభాతార్థమందు నధికరణార్థకము 'వేకువగో' హం స. ౨. ఆ.

7 సూ — టవర్ణకం బాడ్వాదులకగు నగుచో నంతలోపంబగు.

ఆఁడు - ఆఁట॥ ఊరు - ఊట॥ ఊటాడు - ఊటాట॥ ఏఁకరు - ఏఁకట॥ ఓము - ఓట॥ తివురు - తివుట ॥ తేరు - తేఁట॥ త్రిమ్మరు - త్రిమ్మట॥ సందు - సంట॥ పాడు - పాట॥ మండు - మంట॥ వండు - వంట॥ వేసఱు - వేసట॥ అన్యప్రయుక్తంబయిన యాటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబసమంబగు ॥ కోలాటము - పోరాటము - మండ్రాటము॥ ఇత్యాదులు.

వ్యా — "ఆటు" ఆడుధాతువునకుఁ బ్రకృతసూత్రమున భావార్థమందుఁ డప్రత్యయంబును ధాత్వంత్య వర్ణమునకు లోపమునునయ్యె. ఇట్లు తక్కినవి యూహింపవలయు. 'ఊట' — ఊరెడు నీరు॥ (౨) మూలగ॥ — ఇయ్యర్థములందుఁ గర్త్రర్థకము 'ఊటాట' — ఊగడింపు ఇట భావార్థకము. ఉ॥ అంతలు చేసిపోనడచి యక్కట సజ్జనులచేతఁ జెప్పపు! తెంపునె యిట్టియూట మసెంబ్రమనుండె యుధిష్ఠిరుండువా
నుగన మాట సేవ్రకస ... [illegible]

నాతఁడు నెంచునెయన్నదమ్ములన్॥ భార—ఉద్యో 3 ఆ. గీ॥ ఉన్న।యపుడు దొడకింపకయులేని యట్లుగాఁగ। మాటిమాటికిఁ బరికించి మండడీల। కొల్లనూఁటట యగుమ పత్తిల్ల నేర్తు॥ భార—వి—౧ ఆ; సాహాయ్యముగా నుండువాఁ డర్థముగానఁ గర్తృగకము "శేట"—తేరినపదార్థము—ఇత్యాద్యర్థములయందుఁ గర్తృకకము. 'పాట'—పాడఁబడువదియర్థము గానఁ గర్మకర్థము. 'మంట'—జ్వాల యర్థమ యినపోఁ గర్తృగకము—'మంగ్రాటము'—క్లీబసమంబుగాన మువర్ణకముగలిగినది పంతాపార్థమున భావార్థము. శా॥ పంగ్రెండేఁడులు నీగతింజనఁగ జంభద్వేషిము ఖ్యామరుల్। మంగ్రాటం బిదియేల చెప్పదము కామగ్వంసి కీనేమముల్। గుంగ్రాయై నఁ జెమర్చునింతికకటా! గోపాలమూడామణిన్। గంగ్రో కానరో వారుచెప్పఁ దగదా। కైలాస వాచంయముల్॥ ఉ—హ—౨ ఆ. (కంగ్రో—కందురో, 'అంగ్రు' అన్నట్లు 'కంగ్రు' అనురూపంబు, క్రి పరి. ౫౯—౬౨— సూత్రములనగు.)

8 సూ—టువర్ణకంబు పద్వాదులకగు నగుచో నవి యాద్య క్షరశేషంబులయి దీర్ఘంబునొందు.

పడు - పాటు॥ చెడు - చేటు - అడుచు - ఆటు॥ కఱుచు - కాటు॥ పొడుచు - పోటు॥ వయిచు - వాఁటు॥ ఏ యు - ఏఁటు ఓడు - ఓటు - వ్రేయు - వ్రేటు,

వ్యా—పాడు—ఇటఁ బ్రకృతసూత్రింబునఁ బడు యొక్క యాదివర్ణమయిన పకారంబు మిగిలి దీర్ఘంబై టువర్ణకంబుతోఁ బైరీతిగారూపంబు నిలిచె. ఇయ్యది యాప దయర్థమిచ్చుచో దీనియందుఁ బడుగురు (శ్రీమపడుదురు) అని వ్యుత్పత్తిగాన నధికర ణార్థకము. గీ పాండుసుతుల కిన్నిపాటులు పాటిల్లె॥ భీష్మ ౧ఆ.

ఆటు—'అడుచు' వదు నాద్యక్షరంబు మిగిలి దీర్ఘంబుతోఁ డువర్ణకాంతము యిన రూపంబు. కాటు—దంశనార్థమయినపుడే కఱుమనదు నిట్టిరూపంబు. భోజనా

గ్రకమయినచోఁ "గలుపు" అనియగు. మూలములో 'కలుచు' అని యుకారమధ్యము ప్రామాదికము. 'కలుచు' అని యుండవలయు. వా:టు—వయిచునకుఁ దువర్ణకమును, ఆది వకారమునకు దీర్ఘమును. ఈధాతువునకుఁ గ్రియాపరిచ్ఛేదమందలి (౧౦౩) సూత్రమున 'వైచు' అగు. ఏటు—బాణప్రయోగము. వ్రేటు—దీనికిరూపాంతరము వేటు. కొట్టు నటుకు, అర్థము. వేయువలన వేటు అనురూపంబయినదని చెప్పంగూడదు. అప్పుడు విశ్లేషంబర్థమగుం గాని కొట్టుట యర్థము కాకపోవలసి వచ్చును.

9 సూ—పవర్ణకంబు తిరియాద్యులకగు.

తిరియు - తిరిపము॥ కలియునకత్వంబునగు - కలపము ॥ పొలయు - పొలపము॥ మురియు ॥ మురిపము॥ సొలయు-సొలపము॥ వలియు - వలిపము.

వ్యా—తిరిపము తిరియునకు నీసూత్రమునఁ బవర్ణకము రాఁగాఁ దత్పరత్వంబున ధాతుయుకారమునకు ౨ సూత్రమునలోపంబు. కర. పరినెలఁత లెన్నియేనియుఁ. దెరువుల ఘనమునుగడించి తెమ్ముకొనఁగ నో! తరళాక్షి! యొక్క దాసరి తిరిపపు బొ. పనికి వలచితిరుగుట తగునే!॥ పర ౩ఆ. భిక్షయర్థముగాన భావార్థకప్రత్యయము సీ. కడదిరిపంబవై కాంతయునీవును దేశంబులందెల్లఁ దిరిగితిరిగి॥ కవిక ౨ఆ. భిక్షుకుఁడు కర్త్రర్థకము. దీనికి వృత్తియందు 'ము' లోపము. గీ॥తిరిపజోగిఁ దగునె? దేవుఁడనఁగ. వీర ౧ ఆ. కలపము—కలియునకుఁ బువర్ణకంబును ౨ సూత్రమున యులోపంబును నికారమునకత్వంబును గలుగంగఁ బైరూపంబయ్యె. కలయుధాతువును దిరియాద్యిగణములో భావించినందున, కలపము అను రూపంబు సులభంబైనను కలియుధాతువువలనం గూడ నట్టిరూపంబు సిద్ధించుటకై యత్వంబు విధింపంబడియె. "కలుపు, కలఁపుఁగోలు ఇత్యాది సాధారణప్రయోగంబులంబట్టి, ఇట్లు ఇకారమన్యము గాను వ్రాయఁబడియె" నని బ. సీతారామాచార్యులుగారు కలియుధాతువుగూడ సుప్రసిద్ధమయి యున్నట్లు వ్రాయుచున్నారు. శబ్దరత్నాకరమందుఁ గలపము శబ్దము

నకు (౧) కలపుట (అ) పరిమళద్రవ్యములను జేర్చి కలపినచందనము, అని కలయుధాతువు రూపముతోడనే యర్థవివరణము చేయఁబడినది. కాన ధాతుద్వయంబునుండియు నీరూపంబు నిర్వివాదంబు. క. తలయంటె నొకతె యొనికి। గలపంబునఁ జేసితానిగర్వ నూనెక్. య ౮ ఆ. (కలపుట) సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి తనువున నలఁదుదు ననువుగాఁగ. భార. వి ౧ ఆ. (పరిమళవస్తుమిళిత చందనము.)

10 సూ—తవర్ణకం బాపులించు లోనగువానికగు.

ఆపులించు - ఆపులింత॥ ఇగిలించు - ఇగిలింత॥ ఓకిలించు - ఓకిలింత॥ కుళ్ళగించు - కుళ్ళగింత ॥ కుసిలించు - కుసిలింత॥ కొక్కరించు - కొక్కరింత॥ కొప్పరించు - కొప్పరింత॥ గిలిగించు-గిలిగింత॥ ఇత్యాదులెఱుంగునది.

వ్యా—ఆవులింత—ప్రకృతసూత్రమునఁ దవర్ణకంబురాఁగా (అ) సూత్రమునఁ జకారమునకు లోపంబు. ఇట్లు ఇగిలింత, గిలిగింత ఇద్యాదులం దూహింమనది.

గీ॥ ఆవులింత, తుమ్ము, హాసంబు, నిష్ఠీవ। నంబు, గుప్తవర్తనములుఁగాఁగ।
సలుపవలయు నృపతికొలువున్నయెడల బా। హిరములైనఁ గాలని కెగ్గులగుట॥
భార. వి ౧ఆ.

సీ. కటికిచీఁకటి తిండికరముల గిలిగింత। సెవ్వాఁడు దొగకన్నె వవ్వఁజేవకు మను ౧ ఆ. ఈయర్థమందె గిలిగిలింతయనియుఁ బ్రయోగంబుగలదు. సీ. లలిఁగపోలంబులు గిలిగిలింతలు పుచ్చి।నవ్వింపఁ గలకలనవ్వినవ్వి హరి. పూ ౫ ఆ.

11 సూ—పువర్ణకంబు మాయ్యాదుల కగు.

మాయు - మాపు॥ మేయు - మేపు॥ అడుచు - అడుపు॥ ఇంచు - ఇంపు॥ ఏఁచు - ఏఁపు॥ ఏచు - ఏపు॥ కను - కానుపు ॥ కాచు - కాపు॥ చూచు - చూపు-తలఁచు - తలఁపు॥ తోఁచు - తోఁపు॥

త్రేఁచు - త్రేఁపు॥ త్రోఁచు - త్రోఁపు॥ ప్రాఁచు - ప్రాఁపు॥ పేనుచు పేనుపు॥ ప్రోలుచు - ప్రోలుపు॥ ప్రోచు - ప్రోపు॥ మెచ్చు - మెప్పు॥ మోచు - మోపు॥ వలచు - వలపు॥ వాఁచు - వాఁపు॥ ఇత్యాదులు మాయ్యాదులు

వ్యా—మాపు—మాయుధాతువునకు నీసూత్రమునఁ బుసర్గకంబు రాఁగా (అ) సూత్రమున 'యు' లోపము. మాయుట యర్థమయినపుడు భావార్థకము "మసిలె మార్చుటొప్పదు కడుమాపునైన"

మాపు—రాత్రి; ద్వైతప్రపంచము సుషుప్తివశంబున నీకాలమందు నశించును. అనఁగా దైనందినప్రళయము దీనియందు జరుగుచున్నవ్యుత్పత్తిం జేసి యధికరణార్థమందుఁ బ్రత్యయము. (శర్వరిశబ్దఫలితార్థకము) అట్టి రాత్రికిసమీపస్థముగా నలక్షణావశంబునమాపుశబ్దమునకు సాయంకాలమును నర్థమగు. ఉ. మాపటివేళ నీవువనమధ్యమువెల్వడివచ్చిగోప్పద! ప్రాపితధూళిధూసరిత భాసితకుంతలమై సరోరుహా! దీపితమైన నీమొగము ధీరజనోత్తమ! మానవేశ్వరా తోఁ! జూపిమనంబులన్ మరువఁజూపుదుగాదె క్రమక్రమంబునన్. భాగ. ౧౦ స్కం. (మాపటివేళ (రాత్రి) మరుని జూపునుగాదె యుని ప్రధానక్రియతో నన్వయము). సీ. అరుణోదయమున శౌచాదులన్నియుఁ దీర్చి వరుస రేపటిసంధ్య వార్చవలయు! నాదిత్యుఁ డగుగ్రుంకునప్పుడు మాపటి (సాయంకాల) సంధ్యావిధానంబు సలుపవలయు. విజ్ఞా. ఆచా. కాం. ఏఁచు-ఏపు-(బాధ) "కుసుమాయుధు నేఁపుల కింతయోర్వలేక" మార్క. ౮ ఆ. ఏచు-ఏపు-(ఆధిక్యము) ఉ, ఉమా! వల్లభుఁ డావినాయకుఁడు వాసవశంభ్యుఁడు వెండికొండపై! నెల్లగణంబులుం గొలువ నేపునఁ బర్వతరాజపుత్రితో! సల్లలితాత్ముఁడై సకలసంపదలం గొలువుండె—వీర ౧ ఆ. కను కానుపు- ఇక. క. పు లు పరంబగునపుడు కనునకు దీర్ఘంబగు. అనుతృతీయసూత్రాంతర్గణసూత్రము దీర్ఘము.

12 సూ—ఇకవర్ణకంబు జ్వానులకగు

అంజు - అంజిక॥ అమరు - అమరిక॥ ఆనయు - ఆనయిక॥ అలయు - అలయిక॥ ఆడు - ఆడిక॥ ఓడు - ఓడిక॥ ఓపు - ఓపిక కను - కానిక॥ కూడు - కూడిక॥ కోరు - కోరిక॥ పొందు - పొందిక॥ పోలు - పోలిక॥ తూను తూఁగునకగు. తూనిక ఇత్యాదులు అంజ్యాదులు.

వ్యా—అంజిక (వెఱపు) ద్వ, ఇంజ నేయుఁ దళితకాకృతినిలుపు! నంజిక మీ చందమరయవచ్చితిని— రా. కిష్కిం. కాం.

ఆడిక—(నింద). సీ. కువలయంబుజనంబుఁ గూల్చు నాడిక బంధు జీవమూ మోడిగాఁ జేయనిపడి.

కానిక—ఇక. క-పు-లు పరంబులపుడు కనునకుదీర్ఘంబగుఅను తృతీయసూత్రాంతర్గణసూత్రమున దీర్ఘము-"వృషముగాఁ గానికయిచ్చి కరుణజనింపఁబడె కి"కోరిక-కం. ఈకథనెవ్వరు చదివినఁ! గైకొన్నను విన్నఁగోంకకనువ్రాసినవా! రేకాలము శంభునికృప! నాకల్పముగందు రైహికాముష్మికముల్. పనునాలవసూత్రమున రూపాంతరము కోరికి.

13 సూ—అప్పాదులకు నజి యగు.

అప్పు - అప్పన॥ ఉజ్జ - ఉజ్జన॥ ఒప్పు - ఒప్పన॥ గట్టు - గట్టన గడ - గడన॥ దీవ - దీవన॥ పాట - పాటన॥ మన్న - మన్నన॥ వీచు - వీచన॥

వ్యా— అప్పు ఒప్పు, ఉజ్జ, ఇత్యాదులు క్రియాపరిచ్ఛేదములోని ౬౩ సూత్రముందలి యంగిలాదులలోనివి. అకారాంతములయిన యీధాతుఖండములకు నిందు నాగమంబు పరంబగుచుండఁగాఁ గ౨. పరి ౭౬ సూత్రమున నుగాగమంబు వైభాషికంబుగాన అప్పగించు, ఒప్పగించు. అనియు, పక్షంబున సంధి. పరి ౧౦ సూత్రమున నప

దాదిస్వరంబుగాన నకారమునకు నిత్యసంధి గల్గి అప్పింగు, ఒప్పింగు, అగుచుం నగును గదా! అట్టియిందు గాగమాంతములయిన పైధాతువులలో నేకదేశవర్తులయిన, అప్ప ఒప్ప, ఉజ్జ (ఉజ్జగిల్లు) ఇత్యాద్యకారాంతధాతు ఖండములకును, వీచు, ఇత్యాద్యుకారాంత ధాతువులకును నజ్ప్రత్యయంబు గలుగు ధాతుశబ్దంబులపై వచ్చుటం జేసి నజ్ప్రత్యయంబు కృత్ప్రత్యయప్రకరణంబులో గణింపంబడియె. అప్ప + న = అప్పన. అప్పనము (విభాషగాం గ్లీబసమంబు) కం. ఘనములజాలెలు రతినపుం| బనిత మనోకసరుస సొమ్ముంబనిచిన గణనా| ఘన కీనమ్ముం గదా యిది| యని కోమటికోమిరెవాని యప్పన గొనుమట్. శుక ౧ ఆ. (అనుమతి)

అప్పనము—ద్వి. దొరలుసామంబులు దుర్గాధిపతులు| నరియప్పనము లీయరని నిశ్చయించి|| రా. అ. కాం.

(రాజులకర్పించెడి కానుక.)

పాట + న — పాటన — ఉ. పాటనసేయమిం గగులపైం బడిశీర్ణపటీరపంకలా| లాటికమై వరస్మితవిలాసపుం జంద్రికడాంకి వాడుటం | దేటదొలంగి విన్నవగునీముగమో యనమానిచంద్రిం డో| పాటలగంధి! వ్రాలెనిదె భానురుచిం దనకందుమీఱంగన్. (అలంకారము) వసు ౩ ఆ. వీచు + న వీవన ఇట నజ్ప్రత్యయంబు జేర్తు గావంగ్రియాపరిచ్ఛేదములోని ౨౦ సూత్రమున నుత్వమ్మున కత్వంబును, క్రి పరి. ౮౮ సూత్రంబున చకారమునకు నకారము రాంగా వీవనయయ్యె. సీ. ధ్వజమువాహనము వీవనయునాదిగం బెక్కురూపులై గరుడుండు డారూఢిం గొల్వ|| కళా. ౮ ఆ. (విసనకఱ్ఱ)

14 సూ—బడి యేల్వాదులకగు.

ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - చెల్లుబడి - చేరుబడి - తగులుబడి - తీఱుబడి-పెట్టుబడి - పోబడి - మ్రొక్కుబడి - వచ్చుబడి - సాగుబడి.

వ్యా—కట్టుబడి—బంటునకిచ్చెడి మాన్యము. సీ. ఇందుకై జీతపు టెక్కటీలకు

గుజ్జుపఅప్పు మామిడి 'కట్టుబడిగఁజేసి. చంద్రభానుచరి. పోబడి-ఇటఁ బోవుధాతువువర్ణమునకు నిత్యలోపంబనియు నెఱుంగునది. జామయుద్ధము. సీ. పోయెఁబోయినప్రోయాలి పోబడి వెదకిపట్టుటయేల విహితమయ్యె.

15 సూ—గడచేర్వాదులకగు

చేరుగడ- తిరుగడ-తీరుగడ- తేఱుగడ- తేగడ- మనుగడ-విడుగడ - వీడుగడ.

వ్యా—(చేరుగడ)— సమీపము దిక్కు. శరణము సీ. వర్గత్రియము నపవర్గంబు సాధింప, నమరపితృప్రీతు లాచరింప। నైహిక సుఖము లుపార్జింపవలసిన వారికి విప్రుల చేరుగడలు. (సమీపములు, సాంగత్యము లని ఫలితార్థము) భార. ఆను ౫ ఆ. కం. బాలకయేమి మానవ! కౌరవులను మఱియు నీజగంబుల కెల్లన్। జేరుగడనీవ నీపలు। కారయ వేనంబుగాదె యఖిలంబానకున్. భార. ఉద్యో. 3 ఆ. (దిక్కు) కం. ఆదియుమధ్యము నంతము। నా దేవేశునకులేమి నవ్యయుఁడతఁడీ। వేదములకు నావాతిన। వాదములకుఁ జేరుగడ భవత్క్షేపిన్నృపా!॥ భార. శాం. ౪ఆ (శరణము, దిక్కు) తిరుగడ (మఱపెట్టినగొట్టము.) తీఱుగడ (సమాప్తి) "నేఁడుసంగ్రామంబునకుఁ దీఱుగడ యగుఁ గాకని" భార. భీష్మ. ౨ఆ. కం. పనులయెడమేలు గాంచిన। మనుగడ యగ్గలముసేసి మన్నింపుము రా। జనయజ్ఞభృత్యకోటిం। గొనియాడుము నేఁత పేరుసుబ్బిచ్చి కొలువునన్. భార. ఆశ్ర. ౧ఆ. (మనుగడ—జీవనోపాయము) తేడగ—అఱిగిన నాణెము. విడుగడ. విడుదల. "జనకానుమతంబున నాబలారికిన్। విడుగడఁ జేసె॥ నిర్వ ౭ఆ.

16 సూ—ఇకి కోర్వాదుల కగు.

కోరికి - పూనికి - పోలికి - మనికి - వినికి - ఛూను ఛూచు నకు ఛూడికి.

18 సూ—అ వర్ణకంబు గీఱ్ఱాదుల కగు.

గీఱ - ఊఁద - ఎండ - కాయ - చదియ - తునియ - పరియ - పాయ - పిడుచ - మీఁట - మూఁడియ - వదర - వ్రియ్య.

వ్యా—చదియ—వలఁగుడు. ద్వి. కటములు చదియలుగాఁగఁ బడఁగలాత్రియు. నా॥ హరివ. ౧ఆ.

వదర—వదరుఁబోతు. ఆ. వేర్పినోరుమూయఁ బెడతలవాఁపోయె। దిట్టవదరఁగలఁడె యెవఁడునైన॥ లక్ష్మీ. ౪ఆ. కం. పదునాలుగులోకంబులుఁ। బొదలింపంగ నిమ్పవలసి పోషవులు రెండై। తుదఁ దాఁకొక్కటియగుదురు। వదరఁగఁజేయుదు రభేదవాదులనెల్లన్॥ ఉ. హరి ౨ ఆ.

19 సూ—అకవర్ణకంబు మాఱ్ఱాదుల కగు.

మాఱు - మాఱకము - అమ్ము - అమ్మకము. అంపు - అంపకము. పంచు - పంపు - పంపకము. వండుడకారంబు టకారంబగు - వంటకము. తోఁము - తోఁమకము. అద్దు అద్దకము.

వ్యా—తోఁమకము-తోఁముట మూలంబునఁ గ్రావడి ముద్రప్రమాదమూలకంబు. ఉ॥ పిడుకగొఱపఁపుఁ దోమకంబునం బుటపుటనై-ఆము ౪ ఆ.

20 సూ—డువర్ణకం బాఱ్ఱాదుల కగు నగునపుడు పకారంబు చయలకగు.

ఆఱు - ఆఱుడు. అమ్ము-అమ్ముడు. అల్లు - అల్లుఁడు. ఎక్కు - ఎక్కుడు. క్రుమ్ము-క్రుమ్ముడు. చోఁపు-చోఁపుడు. తొక్కు -తొక్కుడు॥ త్రొప్పు - త్రోఁపుడు॥ దంచు - దంపుడు॥ దాఁచు - దాఁపుడు॥

పా॥ డొడలెఱుఁగక పాండుసుతుల। నుడిగివడఁగవలసె నిప్పుడొకసాత్యకిచేత॥ భార. ద్రోణ ౪ ఆ

ఒఱగు—ఒఱగువందు మూలములో నుకారమన్యము ప్రామాదికము. "ఒఱగు మీఁదఁజేరి" కళా ౭ ఆ.

ఒసఁగు—ఈవి, త్యాగము, బహుమానము. గీ॥ చూచిసామాజికులు తమసొమ్ము లెల్ల।నొసగులుఁగనై॥ ప్రభా ౪ ఆ.

22 సూ—వడిభృతులిట్లెఱుంగునది.

వడి; కొలువడి-గెలువడి-నటపడి. వ్యతిరేకంబున లేవడి. వి; తనవి-తెలివి- విరివి. అవు; తగవు - నగవు - ఉఱవు. ఇ: చేయి - వ్రాయి. కలి; కనుకలి - వినుకలి· ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది.

వ్యా—కొలువడి- కొలుచు + వడి; ఇట్లుండ, (౨) సూత్రమున, వకారాదిప్రత్యయపరత్వమ్మునఁ జులోపమని యెఱుంగునది. ఇట్లే, గెలువడి (గెలుచు + వడి) నడవడి (నడచు + వడి); ఇత్యాదులందు వడిప్రత్యయవకారంబు పరంబగుచోఁ జలోపంబు.

లేవడి-కలుగునకీసూత్రమున వడిప్రత్యయంబురాఁగాఁ గ్రి. పరి. ౧౧౬ సూ. న, వడిపరత్వమున "లే" అను నాదేశంబు. లేమియర్థము. సీ. నిదురలేవడిఁ గెంపు నెరయుకన్గనలోడఁ బొడిసాడియైన మేపూతతోడ॥ గసి ౫ ఆ. దారిద్ర్యమునునర్థము. మ॥ లేవడిం। బడియుండందగదంచు సత్వగరిమన్ మన్యంబు గన్పట్టఁగా॥ చంద్రా ౧ ఆ.

తనివి-తనియుధాతువునకు విప్రత్యయము పరమగుచుండఁగా వకారాదిప్రత్యయముగాన (౨) సూత్రమున 'యు' లోపంబు ఇట్లే తక్కినవానికిని నూహింపవలయు.

# ప్రకీర్ణకపరిచ్ఛేదము



1 సూ—పదాద్యంబులు ఋ ఌ వర్ణంబులు రల తుల్యంబులు.

అతఁడు ఋషి - ఇటసంధిలేదు. ఆఋషి- ఇట యడాగమంబు లేదు. వచ్చెఋషి - వచ్చెన్ఋషి - వచ్చెనుఋషి. ఇటద్రుతమునకు లోపసంశ్లేష స్వత్వములు.

(వ్యా) పదంబు మొదటిఋకారమును, ఌకారమును, రేఫముతోడను లకారముతోడను, క్రమంబుగా సమంబులగు. సంధియందు నియ్యవి యచ్చువంటివిగాకహల్లువంటివియగునని భావము.

కం॥ ఆఋషిపుత్త్రుఁడుగట్టిన। చీరలు మృదులములు నవ్యశిష్టములుమనో।హరులు నాతనిపృథుకటి। భారంబున నొక్క కనఁ బట్టముఁ ద్రేలున్॥ భార. ఆరణ్యప౫ ఇట ఋకారంబు స్వరంబువంటిదిగాదు గాన సంధి. పరి॰ (3) సూ-న యడాగమంబు రాలేదు.

కం॥ ఝషకేతుద్వేషునకుఁ గి।బ్బిష పర్వతవృషునకమృతవిషనిధిజామా। త్రిషునకు ఋషిపూ।జితునకు విషమాక్షున కింద్రముఖదివిజపక్షునకున్॥ ఋకారంబు హల్లువంటిదిగాన "ఇషునకుఋషి" అనుచోట షష్ఠీవిభక్తి ద్రుతంబునకు సం. పరి. (౧౭ సూ-న, లోపంబుకలిగె. ఇట్లు స్వత్వసంశ్లేషంబు లూహించునది.

చ॥ రతిపతిసర్మకర్త ఋతురాజబలావళి నెంచియేగుచు। ర్మతులమధించి కైకొని నమానధనంబుల ముద్రవెట్టుచోఁ। బ్రతినవదీపికాశిఖికరంగెను లక్కయుఁబోలె మంజుల।స్థితమయి తేఁటిముగ్గలపుఁ దేనియుద్రాయుటఁ గంటివేచెలీ! వసు. 3ఆ.



449

**2 సూ**—అచ్చికంబులం దుత్తమంబులగు రు లు డు ముందఱి యేత్వంబునకు హ్రస్వంబు విభాషనగు.

నల్లేరు_నల్లెరు-పల్లేరు-పల్లెరు-పెన్నేరు-పెన్నెరు - మానేరు-మానెరు-ఆడేలు-ఆడెలు-కుందేలు-కుందెలు-తోఁడేలు-తోఁడెలు-నాఁగేలు-నాఁగెలు-నేరేడు-నేరెడు-మారేడు-మారెడు - పూరేడు-పూరెడు - తంగేడు - తంగెడు.

(వ్యా)—మూఁడచ్చులుగల యచ్చతెనుఁగు పదంబులందుఁ దృతీయంబులగు రు, లు, డు, లు పరంబులగునపుడు, పూర్వమందలి యేకారంబు విభాషను హ్రస్వంబగునని యర్థము.

నల్లేరు— ఇది మూఁడక్షరములుగల తెలుఁగుపదము.

ఇట రువర్ణంబు తృతీయంబు. అట్టిరువర్ణమునకు ముందుదియైన యేకారము, (లకారద్విత్వముమీఁదిది) వికల్పంబుగా హ్రస్వంబగు. కావున, నల్లేరుశబ్దము హ్రస్వమధ్యంబును నగును. ఉదా. నల్లెరు.

కుందేలు— ఈమాట మూఁడక్షరములుగలది. ఇందు లువర్ణంబు మూఁడవది, అట్టి లువర్ణంబునకు ముందరియేకారము (దకారముమీఁదిది) విభాషను హ్రస్వంబుఁగాఁగా, కుందె'లు' అనియాదిహ్రస్వమధ్యంబగు ఉ. ఇందుల కిమ్మెయినమ్మనుజు లెన్నఁడువత్తురె వచ్చిరేనియా। నందముఁబొందినిర్భయమునన్ శయనింతురెయిట్టివంటయిల్। కుందెలు। సాచ్చివేగఁజని కోమలివారలఁజంపి తెచ్చినా। కుందవనంబిపెట్టుము రసోత్కటమానస మాంసఖండముల్॥ భార, ౭ ఆ.

తోఁడెలు—క॥ పలబోరినవానినిభటు। లలుగులపాలాడిరథిపుకై పట్టికి బె। బ్బులిమహిష వెలుఁగుఁగిటిఁ దోఁ। డెలు మెకలగువానిఁ గొన్నిటిని వేఁటకరుల్॥ మను. ౪ ఆ.

నేరెడు—ఉ॥ ఆరమణీయజంబువునయందనిశంబును భూరిసింధుర। స్ఫారఫలంబులన్నగముపైఁబడి వ్రయ్యఁగఁ దద్రసంబు సాం। పారవహప్రవాహనదియైదనిజాద్రిఁ బ్రదక్షిణించియు। న్నేరెడుమ్రానిమూలమున నెక్కొనియుండు జగత్ప్రశస్తమై॥ మార్క. 3 ఆ. గీ॥ నేరెటేటియసల్ దెచ్చినీరజాప్తు। పావఁబట్టినరాపాడిచల్లి మెదిచి। పదుమసుధనిడిచేసెనో పద్మభవుఁడు। వీనిఁగాకున్నఁగలదె యీమేనికాంతి॥ మను. 3 ఆ.

తంగెడు—సీ॥ కెలకులనున్న తంగేటిజున్ను గృహమేధి యపమాఱుఁడంకసిద్ధాగ్ధపేటి॥ మను; ౧ ఆ. ఇట్లుతక్కినవి యూహించునది.

3 సూ—ఉయ్యాల పయ్యెద తాయెతులంద్రిక్క నామంబులం దుయాకుం దాలవ్యవక్రయోగంబులేదు.

స్పష్టము.

(వ్యా)—ఉ॥ఆక్కటికంబుమాలి ప్రజనాఁడినోంవుదునోంపనైతినా। త్రిక్కరణంగిపోదురు సరిత్తులనూళులు వోవుకైవడిన్॥ (వాసిష్ఠరామా॰ ౪ఆ.) ఇత్యాది ప్రయోగంబులంజేసి త్రిక్కశబ్దము తక్కశబ్దనకుఁ బర్యాయపదంబు.

ఉయ్యాల' పయ్యెద, తాయెతు వీనియందుంగాక తక్కిన నామవాచకములందు యకారమునకు, దాలవ్యవక్రయోగంబు లేదు. తాలవ్యవక్రమనఁగా "ఏదైతోఃకంఠతాలు" అనుటంజేసి, ఎకారయోగంబులేదని యర్థము. ఒకారము, "ఓదౌతోఃకంఠోష్ఠం" అనుటచే నోష్ఠ్యవక్రముగాన, దద్వ్యావర్తకార్థమై తాలవ్యవక్రంబని చెప్పంబడియె. ఉయ్యాల ఇత్యాది శబ్దత్రయంబునంబలెఁ బయ్యెద, తొయ్యలి ఇత్యాదులందును మధ్యాక్షరంబున నెత్వంబుండునని భ్రమగలుగఁగాఁదన్నివారణార్థ మీసూత్రంబు రచియింపఁబడియె. ఈసూత్రార్థము కొంచెము చర్చింపఁదగియున్నది.

ఉయ్యాల, పయ్యెద, తాయెతులందక్క నామంబులందని సూత్రమువంకు సఖర్థకమయిన తక్కశబ్దముతో నామవాచకములనుండి (ప్రాతిపదికంబులనుండి) యయ్యాశ్రయంబును వర్జించుటంజేసి "పంచమీయుక్త మన్యసదృశాధికరణే,తథాన్యార్థావగతిః"

(నఞ్ యుక్తమివయుక్తం చ యత్కించిద్దృశ్యతే, తత్ర తత్సాదృశ్యసిద్ధౌ తత్సదృశే, అధికరణే = (ద్రవ్యే, కార్యం విజ్ఞాయతే॥ హి = యతః, తదా అర్థావగతిః = అర్థప్రతీతిరస్తి) అను పరిభాషాన్యాయంబున నఞ్ యుక్తస్థలంబునందు నివశబ్దయుక్తస్థలంబునందుంబలె భేదసాదృశ్యంబులు తోఁచుచుండుంగాన నామంబులందుంబలె (ప్రాతిపదికంబులందు) నుయ్యాలాదిక్రియలయందు నఖండశబ్దత్వరూపధర్మంబు (ఏకపదత్వము) సాదృశ్యంబున స్ఫురించుచున్నది. ఇయ్యవి యవయవార్థశూన్యములయిన యఖండశబ్దంబులని సూత్రకారుని తాత్పర్యము. ఈసూత్రమునకు పూర్వవ్యాఖ్యాతృగ్రంథకర్తలమతంబునకు నత్యంతవిరుద్ధము. కాన వ్యాఖ్యాది యిచ్చట నుదాహరింపఁబడుచున్నది' అప్పకవీయము ద్వితీయాశ్వాసము, గీ॥ కాణి నుయ్యాల, పయ్యెద, తొయ్యలులను। గలయకారంబులకు వక్రములు నిజంబు. ముద్దరాజు రామనమానియొనరించిన॥ సుకవిలోకసంజీవని జెప్పె నిట్టులిట్లు॥ తే॥ ఊయెల కాకనుత్తుచేత నుయ్యెలయ్యెఁ॥ బయిని నెకసక్కెమాడ్కి కొంగ్రొత్తక్కెఁ బయ్యెదయ్యెఁ॥ దల్లికాపునక్కెల। కట్టఁదగినసరులు। తాలఁబల్కఁగ దాయెతుల్ దేశ్యమునను॥ ఉయ్యాల లోనగుశబ్దంబులు సుకవిలోకసంజీవనియందు ముద్దరాజు రామన్న యేకపదంబులని భ్రమనొంది యాశబ్దంబులలోని మధ్యయకార మెత్త్వంబుగలదనిలక్షణంబు సెప్పెఁగాని యయ్యది యవిచారితరమణీయంబనియు, పేలాశబ్దభవంబైన యేలశబ్దంబునకుఁ బ్రకృతి కారణంబునొందఁగా, ఊఁచు + ఏల "ఉయ్యెల" యనియు, ఎదకుఁబయినుండునది వ్యుత్పత్తినిజేసి "పయ్యెద" యనియు తాయి (తల్లి) + ఎత్తులు (సందెలు) అనుచోఁ దల్లిరక్షకై కట్టినదండలన్న యవయవార్థమునఁ దకారమును దేశ్యపలుకఁగాఁ "దాయెతు" లనియు శబ్దనిరూపణంబు సూపి, ఏల మొదలగువానికిఁ బదద్వయమధ్యంబున సంధిలేమింజేసి యడాగమంబు గలిగెంగాన, కృష్ణునియేలలు, రామునియెద, లక్ష్మియెత్తు, ఇత్యాదులందుంబలెఁ బ్రత్యేకలక్షణసూత్రమనావశ్యకంబన్న తాత్పర్యంబున నప్పకవీంద్రుండిట్లు ఖండించె. శబ్దరత్నాకరమందును "ఊయేల, శబ్దమునొద్ద "ఊఁచు + ఏల అనియవయవార్థము చూపఁబడినది' ఇట్టి వాస్తవార్థంబును బరిశీలింపక సూరిగారు, "తే॥ దాయెతులు నుయ్యెలయు బయ్యెద, యనునదక్కఁ। గలుగదెత్వంబు మధ్యయకారమునకు', ॥ అనిన కవిలోకసంజీవని ననుసరించి యేకపదంబులన్న భ్రమమూలంబున నీసూత్రమురచించెనని తెలుఁగునది. ఈసూత్రంబున నుయ్యెలాదిశబ్దత్రయంబునం గాక తక్కిన నామంబులందు మధ్యయకారమున కెత్వములేదని విధింపబడ్డదిగాని యుయ్యెలాదులందు సర్వదా యెత్వమేయుండునని

వియమింపఁబడలేదు గాన (౮)' (౫) సూత్రములప్రకారమ్మున నెత్వరహితములైన యుయ్యాలాదిపయ్యెదశబ్దంబులును బరస్పరవిరోధంబులేక గ్రంథకర్తమతంబున సంరక్షితంబు లయ్యె. అప్పకవి యెత్వయుక్తములైనయుయ్యాలాదిత్రయంబునకే తనగ్రంథంబునఁ గవి ప్రయోగంబుల చూపెను అంతమాత్రమున నెత్వములేనియుయ్యాలాదు లతనిమతంబున నప్రమాణంబులనియూహింపఁదగదు అతండుస్థాలీపులాకన్యాయంబునసట్లుదాహరించెనని యెఱుంగునది.

ఉయ్యెల — చ॥ కలిదమయింతిఁబాపసమకట్టి సతింబతి వాయనోపఁడా। లలనను దీర్ఘ సౌహృదబలంబున నిట్టులు రెంటఁజేసి యు। న్నలుఁడు విమోహరజ్జులఁ జెనంగి గతాగత కారియైన యు। య్యెలనుబోలె నూఁడకయెంతయుఁ బ్రొద్దువినిశ్చితాత్ముఁడై॥ భార. ఆర. ౨ ఆ.

పయ్యెద — సీ॥ బలఁబడ జక్కొనల్ వలెనున్న జిలుఁగు పయ్యెదలోని గబ్బపాలిండ్లు మెఱయ॥ య. 3 ఆ.

తాయెతు — సీ॥ ఒకయింతియొరగిన సికమీద ముడిపువ్వు లెత్తులు దొరయఁదా యెతులు చుట్టి॥ చం. భా. వరి.

గీ॥ ఇమ్ముగా మేల్పసిండి తాయెతులు మొల్ల। విరిసరుల్ దట్టముగఁజుట్టివేసినట్టి యొరసదిమీఁదఁ బైచెంగులునిచికట్టి। నట్టి బురుసారుమాల్ హాయల్ బిట్టుదవర॥ రసి॥ ౧ ఆ.

4 సూ — ఊయెల యూయాలల చాఁపుల నొండొంటికిం గుఱుచయొండెనగు.

ఉయెల - ఊయెల - ఊయేల - ఉయాల - ఊయల - ఊయాల - వక్ష్యమాణంబు యద్విత్వంబు - ఉయ్యేల - ఉయ్యెల ఉయ్యాల - ఉయ్యాల.

(వ్యా)—ఊయేల, ఊయాల. ఈరెండుపదంబులలోని దీర్ఘంబులకుఁ బర్యాయంబున హ్రస్వంబు విభాషనగునని యర్థము. ఒక్కొక్కటియే హ్రస్వంబు వికల్పంబున వచ్చుంగాని రెండుదీర్ఘంబులు నొక్కమాఱుగా హ్రస్వంబులు గావని ఫలితార్థము.

ఉదా—సీ॥ నిలువుటద్దములు గంటలయుయ్యాలలు హంసతూలికపాన్పులు దోమతెరలు॥ షో. 3 ఆ.

పైనిఁజూపినవిధంబుల సంధిని వర్ణవికారంబులు గల్గెనని యూహింపవలెను. పయ్యెద శబ్దమునొద్ద నిట్లనే బ. సీతారామాచార్యులవారు వ్రాసిరి.

5. సూ—పయ్యెద పయ్యద.

(వ్యా)—"పయ్యద" అని యకారమధ్యముగాను నుండవచ్చునని యర్థము. సంధిని వర్ణవికారమని శబ్దరత్నాకరము.

సీ॥ గాన వేగమునఁ బయ్యద కొంగుసడలిన. .షో ౭ ఆ!

6 సూ—ఉయ్యేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనంబొండె నగు.

ఉయ్యేల - ఊయేల-ఊయెల - ఊయెల - ఊయాల - ఊయల - ఆయె - ఏలిదము - ఓయ - ఓయారము - కోపు (ధనుర్గ్రము) జాజర - తీనియ - తీయము - తేప (ప్లవము) తేమ - తోయలి- దీవియ - నూవు - నోవి - నోవు - పూవు - పేయ - మోక (అంకురము) మోటిక - మోవు - వీయము - ఇత్యాదు లూయేలాదులు.

[వ్యా)—ఊయేల మొదలగుశబ్దంబులయందుఁ బ్రథమస్వరంబుమీఁది హల్లునకు ద్విత్వంబుపక్షంబున నగు. ఉదా. ఉయ్యేల. ఇటఁ బ్రకృతమాత్రమున బ్రథమస్వరంబైన యూకారముకంటెఁ బరంబైన యకారమునకు ద్విత్వంబురాఁగా సమాసపరి. ॥౧౩ సూత్రమున, ఊకారమునకు హ్రస్వంబు. ఇట్లుఊయాల, ఊయల శబ్దంబు లీగణంబులో నివగుటంజేసి ద్వితీయహల్లునకు ద్విత్వంబురాఁగాఁ సమాసపరి. (౧౩) సూత్రమున దీర్ఘం

టునకుహ్రస్వంబుగలిగి, ఉయ్యాల, ఉయ్యల' అనురూపంబులునగు. సీ॥ జౌదలఁజదలేటి లేఁదరఁ గలుబాలుఁడెగుచందమామ నుయ్యాలలూఁప॥ హరి. ఉ. ౬ ఆ. ఉయ్యాల శబ్దము; ఊయేలయొక్క రూపాంతరమని శబ్దరత్నాకరము. ఇట్లు తక్కినశబ్దములు వికారాంతరములని యూహించునది. కం॥పలుమరుతలయంటితగన్। నలుఁగిడిదోయిళ్ళజలమునన్ బోరాడిం చిలిలింజన్నిచ్చుచు; నుయ్యలనూఁపుచుఁ దెనుపఁబాడఁగ నావర శిశువున్॥ కళా. ౬ ఆ. సీ॥ ఉయ్యాలతొట్టిలోనునిచి చేతులుపట్టి యూఁచియాడెడు పాటనుబ్బనేర్చి॥ వి. పు॥ ౭ ఆ ఏలిదము. క॥ బాలుఁడని తలఁచిరివుతో। నేలిదమునఁ గలసియునికి యిదికార్యమె॥ భార. ఆది. ౬ ఆ.

ఎల్లిదము—పూర్వమందుంబలె నిటఁ బ్రక్రియ యూహించినది.

చ॥ అనవిని యింద్రుడిట్లనియె నగ్నికినిమ్మరివోయిచెప్పు మజ్జనపతితోడ నాపలుకు సమ్మతిఁజేయక తక్కెనేని నేఁ। బనిచెదవజ్రమున్ జమునిపాలికి నన్నరనాథు వేగ మే। యనుచుటకింత యెల్లిదమె యాతనికిన్ మనయాజ్ఞ నూరయన్। భార. ఆశ్వ ౧ ఆ.

ఉ॥ఇంతలుకన్నులుండఁ దెరువెవ్వరివేఁడెదు భూసురేంద్రయే। కాంతమునందునున్న జనరాండ్రనెపంబిడ పల్కరించులా। గింతియుకాక నీవెఱుఁగవే మునువచ్చిన శ్రోవచొప్పునీ। కింతభయంబులే. కడుగ నెల్లిదమైతిమె మాటలేటికిన్॥ మను ౨. ఆ.

జజ్జర—జాజరశబ్దము పకృతగణంబులోనిది గాన ద్వితీయాక్షరమునకు ద్విత్వంబురాఁగాఁ దొలివర్ణమునకు సహా-పరి-(౧౩) సూ-న, హ్రస్వము. ద్వి॥ నలదువసిష్ఠు యీవట్టి జజ్జరల। (పంచనలకు) కలఁగునే కౌశికుఁడల్పునిరీతి॥హరిశ్చ ౧భా.

తక్కిన యాగణాంతర్భూతశబ్దంబులును నిట్లే ప్రయోగింపఁదగు.

7 సూ—అకారంబుక్రింది అకారంబునకుం దుదినులుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు.

అట్టు - అటు. గొట్టియ - గొటియ. కన్ను - కను. నన్ను - నను. పల్లు - పలు. విల్లు - విలు.

(వ్యా) గొట్టియ- ఇత్యాదులయందు ఁదునికానిచోటను అకారలోపంబునకై యకారము ద్వంద్వంబునం జేర్పఁబడలేదు.

ఆటు—సీ॥ ఇందుబింబముఁ జూచి చెంగుప్ప గెలుగుసావి (అని) యటులెత్తినాకంగ నాసపడిన॥ కాశీ ౩ ఆ:

గొట్టియ—ఉడుకు నారుగ పంటలు। గొట్టియల వాడియునువలువగున్. భార. శాం. ౪ ఆ.

పలు—సీ॥ పలు రాకమునువచ్చి బాలు వేలువుమన్నఁ బండ్లులేకున్న నభావ్యుఁడనియె॥ భాగ ౯ స్కం:

8 సూ—అక్కటాదులజడ్డకు లోపంబు విభాషనగు.

ఆకట - అక్కట. అక్కట - అట్టిక - అట్టుక - అట్టె - అయ్యో - అయ్యారె - అవ్వారి - ఇట్టిక - ఉప్పవడము - ఉమ్మి - ఎక్కసక్కియము - ఎక్కసెక్కియము - ఎక్కిరింత - ఎడ్డె - ఎన్నిక - ఎమ్ముక - కజ్జాయము - కట్టా - కట్టిక - కప్పురము - కమ్మటము - కమ్మతము - కువ్వాడము - కొట్టిక - కొమ్మ - కొయ్యగూర - గయ్యాళము - గుజ్జరాతి - చిట్టి - చిన్న - చిమ్మట - చెన్నఁటి - చెప్పము - చెప్పఁడు - చెమ్మట - చెల్లియలు - జవ్వాజి - జాబిల్లి - తమ్మటము - తమ్మలము - తల్లి - తుమ్మికి - తువ్వర - తెల్లి - దవ్వు - దివ్వియ - నవ్వు - నిద్దుర - నివ్వరి - నివ్వాళి - నువ్వు - నెట్టిక - నెమ్మలి - పవ్వళించు - పిన్న - పుల్లియ - పువ్వు - పెద్ద - పొట్టి ప్రాకెన్న - ప్రెగ్గడ - బెగ్గడు - బొమ్మ - బొమ్మికము - బొమ్మిడికము - బొమ్మిడీకము - మజ్జ - మత్తాబు - మల్లారము - ముక్క - ముద్దియ - మెట్టిక - మొక్కరము - మొగ్గరము - మొల్లాము - రడ్డి - లొట్టిపిట్ట - వట్టి - వయ్యాళి - సన్నియ - సవ్వడి -

సివ్వంగి - అట్టు - ఇట్టు - ఎట్టు - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - మమ్ము - మిమ్ము - తమ్ము - అమ్మ - అక్క - అవ్వ - అయ్య - అప్ప - అచ్చోటు - ఇచ్చోటు - ఎచ్చోటు - అచ్చటు - ఇచ్చటు - ఎచ్చటు - ఇత్యాదులు కక్కాదులు.

(వ్యా)— అక్కటాది గణమందలి శబ్దములయొక్క సంయుక్తాక్షరములకు లోపంబు విభాషనగు.

అర్థంబుం దెలుపంగా బద్ధకంకణంబులైన నిఘంట్వాదులు పెక్కులున్నందున «లఘ్వర్థంబ్యాఖ్యార్థానాదేశ్యం తే» అనుసమర్థ సూత్రస్థపతంజలివచనప్రకారంబున గ్రంథలాఘవార్థము సంస్కృతవ్యాకరణంబున సర్వశబ్దార్థనిర్దేశము సలుపంబడని యట్టులే ప్రకృతంబునను గ్రంథవిస్తరభీతిం జేసి గణపరిగణితంబులైన శబ్దంబులకెల్లను నర్థప్రదర్శనంబు లేకుండ స్థాలీపులాకన్యాయంబునం గవిప్రయోగంబులతోం గతిపయంబులైన శబ్దంబులకే యర్థంబు లుదాహరింపంబడుచున్నయవి.

అబె—క॥ సహస్రాంశు పనుమవాడబె। విహితానుష్ఠాన పరులువీరబె పోలో। కహితంబబె యిది మనకుం। మహనీయము కాకయెట్లు మానంగవచ్చున్॥ భార. ఉద్యో. ౧ ఆ: (అబె=ఆశ్చర్యము. టవర్ణలోపంబు.)

ఎకిరింత—(నాహనము) సీ॥ రేవెలుంగునుదాల్చుం దేవేరి యుదగ్గ కెకిరింతయై మించు మేఘమునకు॥ రాము. ౨ ఆ: ఇటంగలోపంబు. గిజిగాడు——(పచ్చపిట్ట) ఉ॥ కూరిరవనేభదంతహతకుడ్య, పరచ్యుతవజ్రపంక్తులం జొల్పారు ముకుంగులుం బురువులంచు వెసంగొనిపోయి పొంతశృంగారవనద్రుమాళి గిజిగాడులు గూడులం జేర్చుదీపికల్ । గారవిం గృష్ణరాజుమహీకాంతిని శాత్రవ పత్తనంబులన్॥ మను. ౧ ఆ: (ఇటజలోపంబు) జవాజి-సీ॥ కసటువోబీరెండం గరంగికప్పలనంటిగమగమవలచు చొక్కపుజవాజి॥ వసు. ౨ ఆ: (వకారలోపము) జాబిలి—తరల॥ పలుదెఱంగుల బోవుచందురుఁ బట్టవన్నిటికన్నియై। యలిగి వేవెదువెంట నేగెడునట్టి జాబిలి

(వంచుచుండు) మేపరుల్ | బలెజడల్ గడునీటఁ దేలుమఁ దైపయిం జనుదేరఁగా | నిలు పుశ్శేంతలనచ్చు కొమ్మల నెమ్మిగంబులు పొల్పగున్ || య. 3 అ: (లకారలోపము.

పెరిగడ—కం|| తగనీలో నూహింపుము | దిగవిడువకు ధర్మతనయు దృఢమతి పై పం | పగ చంపము కొడుకులకుం | బ్రెగడలకుం జెప్పితీర్పు పెంపేర్పడఁగన్ || భార ఉద్యో. ౩ ఆ: (పయాళి—విహారము; వాహ్యాళిశబ్దభవము) చ|| అవిరళవేణియుల్లు నలయూంక విసాంవర పన్నగాళికిన్ | జలమరి చల్లగాలికిని జక్కరఖాణపుఁ దేజిదోలు పూ | నిలుతువ యాళికిన్ జిగురు విందులనీలి గయాళికిన్ హలా | హాళి గుళికా భయుర్మన ఘు నాళికి నాళికి లోఁగియాత్మలోన్ || వసు. 3 ఆ: (యలోపము)

9 సూ—జడ్డక్కారంబుతోఁ బదాదిస్వరంబుగూడుచో జడ్డకు లోపంబు లేదు.

ఆట్రత్తె - కన్నదరె - నన్నడిగె - పల్లొత్తె - విల్లంటె.

(వ్యా) సంయుక్తాక్షరంబునకు నజాదిపదంబులతో సంధి గలుగుచో లోపంబు గలుగదని యర్థము.

ఇట్లుమిట్రెక్కు, మున్నేలు ఇత్యాదు లూహింపనగు. శా|| ఏపిా ప్రాగ్భండా నీవు వంశీమగలై యావచ్చు కౌరవ్య సం | గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్ద మిట్రెక్కి మిమ్మెల్ల న్వాలుఁగండి చూచెదముగా కీసారికిం బోయిరా | ధీముం డిట్టు రిత్తమాటలకుఁ గోపింపండు సూ పెంపఁగన్ || (ఇట రేఫఘటరేఫంబునకు లోపంబు రాలేదు.) భార. ఉద్యో. ౨ ఆ.

మిన్నేలు—మ|| అనిలం బప్పురిఁ బౌరచిత్తముల కత్యానంద ముండంగ న ట్రిమిన్నేటి తరంగలన్ బెనఁగుమన్ || భార. ఆది. ఆ:

కన్నాకు—సీ|| ఎగదు కూళలు ముట్టరాము త్తి బట్టాలంటి గముకిఁ గన్నాకయు గాచి యుగ్రాము|| మను. ౪ ఆ. క|| కన్నాకు మనను భిష్మండి | న్నరవయఁగాపవలయు

వెమ్మెయినైనన్ । దన్నుం గాచిన నిశతుఁడు జగన్నుతుఁడీరణమునం బగతునణఁగించున్॥ ఇట వలోపము రాలేదు. భార. భీ ౧ ఆ:

క॥ "నలుఁగిడి దోయిళ్ళజలమునన్ బోర్కాడిం । చిలిచిం జన్నిచ్చుచు" కళా ౬ ఆ: సీ. పంకనిర్ముక్తుఁడై పారదారికవృత్తి వదలకపల్లార్చు వానినడఁచి॥ వసు ౧ : ౭.

10 సూ—హాదులయు నీలుగు లోనగువాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగ నగు.

హడపము - అడపము - హరిదళము - అరిదళము. హాలఁది- అలఁది-నీలుగు - ఈలుగు. నీలుగు - నెగయు - పొంగు - పొనరు పూను-పొదవుల కాదిలోపంబొకండు వచియించె నది యవిచారమూలకంబు.

(వ్యా)—హకారాది శబ్దములయొక్కయు, నీలుగు మొదలగు శబ్దములయొక్కయు మొదటిహల్లునకు లోపంబు బహుళంబుగా నగును.

ఆ॥ పూనె నెగ నెఁబొవవెఁబొనరెఁ బొందెటువన్న । పలుకులందు మొదలఁ గలుగు నట్టి । వ్యంజనంబులడఁగి వానిపై స్వరములు । నిలుచు వలసినపుడు నీరజాక్ష॥ అని యప్పకవి ద్వితీయాశ్వాసమందు వ్రాయుచు "క౦॥ మానవతి యిట్లుమానిన । మానక్రోధములచేత మరలిచిచింతా । దీనగతి నుండమదిలో । నూనినప్రేమముననంబు జోసరుఁ డనియెన్"॥ అను పారిజాతాపహరణములోని పద్యమును బూనుధాతువు నాద్యక్షర లోపంబునకు నుదాహరణముగాఁ జూపి, 'పొదవు' నాదివర్ణలోపంబునకు, "క॥ తదనంతరగం భకరిమ్మ అ । యగువిభుఁడు కృపావిధేయుఁడై వాణీశ ! త్రిదశేశుల కాశ్చర్యం । బొదవ మనిచె నుభయసైన్య యోధులనెల్లన్॥ అను చిత్రభారతాదిపద్యంబుల నుదాహరించెను. ఒనవునకుఁ గలుఁగు, ఉపయోగించు యుక్తము, అను నర్థములు శబ్దరత్నాకరాది నిఘంటువులందు వ్రాయఁబడినవిగాని పొదవు నెత్తుకొని యర్థములుగాని కవిప్రయోగంబులుగాని లభింపఁబడలేదు! కావున శబ్దరత్నాకరాదులయందుగును ప్రాచ్యలోపము ప్రాప్తిన.

నిఘంటువులందును బొదవుయొక్క నామరూపంబులు గగనకుసుమాయమానంబులై కానంబడక యున్నయవి. కాని యప్పకవీయమందు మాత్రము ద్వితీయాశ్వాసమందే పొదవునకు నృసింహపురాణములోని పద్యయములు లోపము రానందులకు నుదాహరణముగాఁ జూపుటలో మూఁడవదిగా నీపద్య ముదాహరింపబడియె.

"క॥ అదియట్లు కాదెనిప్పుడు। జెదలంటునె దేవదేవు శ్రీరమణీశుఁ। మదినుంచు కొన్నవానిని। బొదవునె యాపదలు రవిని బొందునె తమముల్॥" ఈపద్యమే శబ్దరత్నాకరములోనను "మది నునిచిన యుత్తమమునిఁ। బొదవునె యాపదలు సూర్యుఁ బొదువునె తమముల్" అని యుత్తరార్ధమందలి యీపన్నాకత్ర పాఠభేదముతోఁ బొదువు ధాతువునకు సకర్మకార్థమైన క్రియమునకు నుదాహరింపఁబడినది. ఇట్టి యప్పకవీయ శబ్దరత్నాకరంబులందలి పాఠభేదములలో నేది యుక్తియుక్తమో కొంచెము నర్కించి చూతముగాక!! సూర్యునిఁ దీక్ష్ణకిరణుని విసంబున శ్రీహరిని ధ్యానించు నుత్తముని నాపదలు క్రమ్ముకొనసేరనిన పైపద్యార్థము నాలోచింపఁగా నిట సకర్మకార్థకమయిన పొదువు ధాతువుగాని పొదవుగాదు. ఇప్పద్యంబునఁ బొదవు ధాతువే యునిన దో నప్పకవీయలక్ష్యపద్యప్రకారముగ నావర్ణము లోపించి తనరూపాంతర మనఁబడునట్టి యొదవు శబ్దమువోలె నకర్మకమై పైనిఁజూపిన యర్థత్రయమునె తెలుపును గాన నాపద్యమునందు నర్థసమన్వయంబు లేకపోవును. ఆదివర్ణలోపములేని తఱిని బొదవునకు క్రమ్ముటయను నర్థ ముండునన్నచో "ఏకదేశవికృతమనన్యవత్" అను న్యాయంబున జరగునకు జరుగును, నడచునకు నడుచునుంబోలెఁ బొదవునకుం బొదువు ధాతువు రూపాంతరము కావలసివచ్చును. అప్పుడు పొదువునకు నున్నయర్థము లన్నియు వినిగమనావిరహంబునఁ బొదవునకును జెప్పక తీరదు. అట్టియర్థములు పొదవున కున్నట్లు కవిప్రయోగంబులఁగానంబడదు. కావున "అనిరిపాటున నెసనిచ్చి పొదవికొనిన" పొదవి, "యొండొండ దివియును భువియు దెసలుఁ। బొదవికొనియుండు చీఁకటి ప్రోవువలన" అనినట్టి తక్కిన యప్పకవ్యుదాహృతనృసింహపురాణ పద్యములందును "బొదవు" పాఠము ప్రామాదికముగాఁ దోఁచుచుండు. అకర్మకమైనపొదవునకు నాత్మనేపదార్థకమైన కొను ధాత్వను ప్రయోగంబు యుక్తంబైనందునను, సకర్మకార్థమే (క్రమ్ముట) యిట సందర్భోచితమగుచుండుటను [illegible] సమంజసంబు

మఱియు, శబ్దరత్నాకరమందు, ఒదవుధాతువు వైకృతమని యుద్ఘోషింపఁబడుచున్నయది. అపసరశబ్దంబువలన, ఓసరుధాతువైనట్లు లియ్యది యుద్భవశబ్దంబువలన నైనట్లు గ్రంథకర్తల తాత్పర్యముగా స్ఫురించుచున్నది. ఇట్టుల పరాపేక్షలేక గీర్వాణవాణ్యంశంబున స్వయంభువుగా నవతరించిన యొదవుధాతువు పూర్వపక్షులమతంబున దేశ్యంబై నిఘంట్వాదులయందును నామరూపంబులు లేనిపొదవుధాతువునకురూపాంతర మెట్టులు గాఁజాలును కావుననే? "ఒదుపుధాతువు పొదువుయొక్క రూపాంతరమని వ్రాయఁబడినట్లు లీధాతువు పొదవుయొక్క రూపాంతరమని శబ్దరత్నాకరాదులయందు లిఖింపబడనేలేదు. కర్మిమ్మట లోనఁ సవర్ధమిమ్మనట్టి పొదవుధాతువు వైకృతమేయని సాధింతురేని యపుడు పొదువు గూడఁదాన్యశాస్త్రమందు వైకృతమనవలసివచ్చును. నిఘంటువులందు "బొదువు" దేశ్యఁబనియే వ్రాయఁబడినది. కాన వైకృతమని ప్రసిద్ధిజెందిన యొదవు పొదవువలనఁ గానేరదు. ఒదవునొద్దఁగాని వేఱుగాఁగాని పొదవు నిఘంటువులందు నెత్తుకొనఁబడనందున దాని సత్తయు సంశయాస్పదమై యుయ్యెల లూఁగుచున్నయది. కాన. ఆ॥ "పూనె నెగనెఁ బొదినెఁ బొనరెఁ బొందె" ననియే యప్పకవీయ లక్షణపద్యము చదివినచో సలక్షణముగా నుండును. అపుడు, 'ఒదువు' నొద్దఁ బొదువుయొక్క రూపాంతరమని వ్రాసిన శబ్దరత్నాకరమును శాస్త్రానుకూలముగా నుండును. పూను ధాత్వర్థమును వివరించుతలేని నీపద్యము శబ్దరత్నాకరములోఁగూడ నకార మధ్యంబగు పొదవు శబ్దముతోడనే వ్రాయఁబడినది. కాని యది ముద్రాప్రమాదము కావచ్చును. అట్లే కానిచో నొదవునొద్దఁగాని వేఱుగాఁగాని గ్రంథకర్త యీశబ్దము నేల యెత్తుకొని వ్రాయకుండును? బాలవ్యాకరణపుస్తకములందుఁగూడ నీసూత్రము నొద్ద నీశబ్దము నకారమధ్యముగానే దిద్దుట యుక్తంబగుంగాన గ్రంథవిస్తరంబుతోఁ జాలును. ఒకవేళ ప్రోద్భవశబ్దవైకృతమైన పొదవు శబ్దం బొకటి యున్నదనియు నంగునసే దాని రూపాంతరమైన యొదవువైకృతముగా వ్రాయఁబడినదనియు నచ్చటంగాని వేఱుచోటంగాని యీశబ్దము నెత్తుకొని వ్రాయకునికి శబ్దరత్నాకరాది గ్రంథకర్తల ప్రమాదమనియుఁ గొంద ఱందురేని "ధాతోరర్థాంతరే వృత్తేః ధాత్వర్థేనోపసంగ్రహాత్, ప్రసిద్ధే రవివక్షాతః। కర్మణోఽకర్మికా క్రియా" అను వైయాకరణమర్యాదం జేసి సకర్మకధాతువు శ్లోకోక్తకారణంబులచే నకర్మకార్థము నీనచ్చుంగాని యకర్మకధాతు నిష్పన్నంబైన ప్రోద్భవశబ్దంబుయొక్క వైకృతంబగునాకి నుకునకు పొదవునాసవు

పైనుదాహరింపఁబడిన పద్యంబులుసమన్వయింపఁగాఁ 'గ్రమ్మఁట' ఇత్యాదిసకర్మకార్థము నెట్టులీఁజాలునో తెలియకున్నది. కాఁబట్టియయ్యదివిచారింపఁగా విద్వద్బృందంబునకే విడువుచున్నాఁడనుగాన సుధీమణులు శోధింతురుగాక. మఱియు బాలవ్యాకరణమందు బూనుధాతువులకు నాదిలోపంబుచెప్పిన గ్రంథకర్తవచనం బవిచారమూలకంబని సాహసించి వ్రాయఁబడినది. ఆదిలోపంబుగల పూను ధాతువునకును, పొదవురూపాంతరమే యని భావింపఁబడిన యొదవునకును సర్గవిశేషంబులందు ధారాళముగా సుకవిప్రయోగంబులు గానవచ్చుచున్నయవి—

ఉ॥ పూని నృకోపరాజుకానులు భుగ్నులుగాఁ దెడచేతఁ గన్నని
యూనఁగనెత్తికొంచుఁ జని యుగ్రవనంబున దుఃఖమగ్నుఁడై॥ భార-ఉద్యో-3 ఆ:

కం॥ హీనప్రజ్ఞుఁడకార్యము । లైనవిచేసి తుదివగచు నతుల ప్రజ్ఞా। సానుడుదారూఢుఁడువగ । నూనఁడు గురితప్పనజలిని కోపక యుండున్॥ భార-శాం-3 ఆ: (పూనున కాదిలోపంబు)

గీ॥ అతనిముందఱఁ బార్థ్వంబులందు బిఱుఁద । నొక్కయుమ్మడిఁ బెక్కండ్రు గుమ్ముమిగిలి । యుదవడించిన దేవిపై నుగ్రదివిజు । లొదువఁ బేరల్కఁ జెనవు లొం డొందఁ యున॥ మార్క-౬ ఆ: (పొదువు నాదిలోపంబు)

క॥ పార్థునపమా । ర్థకళేబర మెదురఁగని రోదవుశోకమునన్ దై. ౭ ఆ. పొదువున కాదిలోపమున్న వారి మతంబున)

ఇట్టులసామాన్య కవిప్రయోగంబు లుండగాఁ బరిశీలింప కవిబహ్వానాన్న నెదురాడిన చిన్నయసూరి వచనంబు చిన్నయసూరి వచనంబుగాఁ జెల్లందగు.

ఇట్టి యభిప్రాయమే పూను ధాతువునొద్ద శబ్దరత్నాకర గ్రంథకర్తయును వెల్లడించె. ఇట్టు, పొచ్చెము, పంచు, చెనయు, ఇత్యాదులకు సర్గవిశేషములందు నాదిలోపంబు చూపట్టు. పొచ్చెము (న్యూనము) కం॥ ఇన్నటి బంధులు నీవును । నచ్చెరు వడి వినుమనుంచ నయిదూళ్ళను మా । కిచ్చినను జాలునంటిని । బొచ్చెముకా దింతవట్టు భూరమున మిగ్గ! ॥ భార. ఉద్యో 3 ఆ!

ఒచ్చెము—గీ॥ అధ్వరారంభమింతొప్పనయ్య దక్షు । శివునిఁ దోడ్తేని రొక్క యొచ్చెంబుకాని॥ కాశీ. ౭ ఆ: పంచు-అజ్ఞాపించు-ఉ॥ తనశిష్యులైన, పైల వైశంపాయన సుమంత జైమినులం బంచి క్రమంబునఁ జతుర్వేదసూత్రంబులఁ జేయించి వేదవ్యాసుం డై-భార. ఆది ౧ ఆ:

మద్విరచితమయిన జార్జిముక్తావళియందలి యీపద్యంబును రాజభక్తిసూచకంబుగా నీసందర్భంబునఁ జేర్పఁబడు.

చెనయు-పోలు—చ॥ తనపతి జహ్నావిం జెనయు దారయుస్త్రీయు సురద్రుమసంఖ్యనం । వనులు రమాభకన్యయుఁ సుధామయవాక్కును గల్గు జార్జిషా । నవగుణరత్నుఁ జూచి యొరుపన్న సహింపక సాగరుండు ష్టో. భనివిడిఁ గాంచెనమ్మ! పతిభావత్రవర్షప సుంధరామణీ!॥

ఎనయు—చ॥ వినినజనంబు లీతఁ డవివేకియునన్ విలదింతిరజ్జుల । ర్జును బలశౌర్యసంపదలు చూచి యెఱుంగమె? మున్న నిన్న నా। తెఱఁగలనం జగం బెఱుఁగదా యాతఁ డద్భుతవిక్రమోజ్జ్వలుం । డెనయుద నీవు పౌరుషవిహీనుఁడ వద్ది విజేంద్రనందనున్॥ భాగ. కర్ణ. ౨ ఆ:

11 సూ—ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు.

ఆరాటము - ఆరటము. ఆలాటము - కకూళ్ళి - కేళాకూళి - కొమారుఁడు - కొమారిత - గంబూరము - పెంఢారము - బంగారము - బేహారము విటతాటము - సంతోషము.

(వ్యా)—ఆరాటము లోనగు శబ్దంబులందు మొదటి దీర్ఘమునదుంగాక తక్కిన దీర్ఘంబులకు హ్రస్వంబు వికల్పముగా నగు.

ఆరటము-(పరితాపము) క॥ పటునఖర శైత్యమున నారటముశిపిసురారినే లురసెకున్నసింహులన్॥ పాండు. ౫ ఆ:

కక్కుఱితి-(లోభము) చ॥ కెలుపులఁ బెట్టి వీరి నడకించితొలంగెదమన్న వట్టి
కక్కుఱితియకాని దైవ మనుకూలముగాదు॥ జై. ౬ ఆ:

సీ॥ మనసు కక్కుఱితి మెల్లనలేచి చేతులఁ గాంచుని జబ్బుగాఁ గౌఁగిలించు,
మను ౩ ఆ:

12 సూ—ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభా
షనగు.

ఓయారము - ఒయారము - ఓయూరము - కేళాకూళి - కోలె-
గూడారము - గోరువంకపక్షి - జోహారు - నీలుగు - పేఁడ - బేహా
రము - దీర్ఘమధ్యమ్ము - మాఱు - మూలుగు - మోఁజుకు - వీటతా
టము - వీడియము. ఇత్యాదులు.

(వ్యా)—సూత్రార్థము స్పష్టము.

ఒయారము—గీ॥ రతివిధంబున గను నొయారముచఁ బొసఁగి। చంద్ర: ఈయొయ్యా
రాపులం పున్కెంజేసి ఒయ్యారము. సీ॥ హావముల్ మెఱయ నొయ్యారంబులుగ్రుచ్చి
యుంపంప వింతగా నలవరింతు॥ భాగ. వి౦. ౧ ఆ:

గొరువంక—క౦॥ గొరువంక యన్నమాటల। మొరువంకలంపుగన్ని మురువపుఁ
దమలో। నెరువింక నేమిగలవని। యిరువంకల నగలఁబొగిలె వింతయాయెంతటన్॥ విక్ర
౭ ఆ:

మ॥ శరసంధానముతోనె కొన్నియమకుల్ జోజన్వరం బాఱియు। ధ్వరశింగా
ల్గాని ద్రోణముల్ దివియు దోర్దండంబులం జేఁదియే। నిరిబోయుల్ దినువంను
నార్చి పరగం జిట్టాసలం దూయుమక్। గొరువంకల్ మొఱ్ఱవెట్టినట్లు మొనముల్ ఘోషిం
షింపరోషించినదన్॥ మను ౪ ఆ: (ఈశబ్దము వస్తువని శకున్గ్రంథములలోఁ బఠించె
నది చింత్యంబు)

13 సూ—అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు.

అడఁగు - అణఁగు - అడఁచు - కడఁగు - చిల్లాడము - తడగము - నాఁడెము - పోఁడి - మిడుఁగు - నడఁకు - మిడుఁగురు ఇత్యాదులడంగ్వాదులు.

వణఁకు—క॥ గణపాద నిహతి చేతను । వణఁకెఁగిరులు తరులతోడ వసుధంబడి యెన్॥ వీర. ౮ ఆ:

మిణుఁగురులు—(అగ్నికణములు) చ॥ మిణుఁగురు లెల్లెడం జెదరమింటను మంటలు పర్వఘుంటికా । ఘుణఘుణధ్వారి నిస్వననికాయమునన్ హరివంతరాళముల్ । వణఁక మహోగ్రశక్తిఁ గొని వారక దారుణమీఁదనైన దా । రుణగతినింగి నుండినిజరోమములతోఁ బడు మ్రొక్కె పెంపిడెన్॥ భాగ. ౧౦ స్కం. ఉ:

14 సూ—దక్కులోనగువాని దాకు డకారంబు విభాషనగు.

దక్కు - డక్కు - దక్కు - దగ్గఱు - దాఁగు - దాఁకలి - దిగు - దిగ్గియ దూయు - దెందము - దెప్పరము - దెప్పు - దొంగ- దొప్ప - ఇత్యాదులు.

(వ్యా)—ఉ॥ డక్కెను రాజ్యమంచు నకటా! యిటు తమ్ముని భాగమీక నీ పెక్కటి క్రింగఁజూచెదవదియెట్లు గుణమ్ వినుమీను కోలతన్ । గ్రక్కున నాయిమంబు చనిగాదము క్రింగెద చాడ్పునూవె! యిట్లుక్కిపుడైన నీకొమరు నల్లము నునటు లాఁడగూడునే॥ భాగ-ఉద్యో. ౨ ఆ;

డక్కు—ఉ॥ అక్కట మందభాగ్యునకు నట్టితనుంభవరత్న మెవ్విధిన్ । డక్కె నె ధాతనిర్దయుఁడొడంబడనే కను మేలిపస్తువుల్ । పెక్కుదినంబు లుక్కియరిబృంద

ము పిల్చినఁ బోటుబంటనై! యెక్కడఁ జేలపోయితి మహాగుణభూషణుఁ గోలుపోయి తిన్. భార-ద్రో-౨ ఆ:

15 సూ—ఏతాదులకు మువర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు.

ఏతము - ఏతాము - ఏతము కళ్లము - గాలము - గుడ్డము - గోణము - గోతము - జాజము - జుంజము - జోతము - తణగము - బొండ్లము మండము - లాతము - వీణము. ఇత్యాదులు.

వ్యాఖ్యానము-సీ॥ వాలారు గోరుపెన్ గాలాము చేసెనే జేజేహిరణ్యాక్షు శిశుకమునకు॥ పాండు. ౨ఆ: (గాలాము=బడిశము)

జాజాము—(పాలికలయందుఁ బోసిన నవధాన్యములనాఱు) గీ॥ శ్వర్వరీచంద్రపరిణయ సముచితాంకు । రార్పణక్రియలందు వియద్విభాగ । పాలికలదోఁచు క్రొత్త జాజాలమొలక । లనఁగఁదారక లొండొండ యంకురించె॥ కవి ౪ ఆ:

లాతాము—సీ॥ కకపాల కెదార కటకముద్రితపాణిఁ గుఱుచలాతాతోఁము గూర్చిపట్టి॥ పను. ౧ ఆ: [సన్యాసులు చేఁబట్టెడు దండము.]

వీణాము—[సన్నవస్త్రము] క॥ పన్నీట జలకమాడెను । సున్నని వీణాముగట్టెనువిరులు దుఱిమెన్ । సన్నముగ నలఁదెఁ గస్తురిఁ । జన్నుల ముత్యాల బన్నసరములు దాల్చెన్॥ జై. ౩ ఆ:

16 సూ—పదాంతంబులయి యసంయుక్తంబు లయిన నులు రుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు.

ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు॥ మాన్పడె - మినువడె - మిన్వడె - వత్తురువారు - వత్తు

ర్వారు - కారుకొనియె - కార్చుకొనియె - రాములు - రాముల్ - వనములు - వనముల్.

(వ్యా)—పదము తుదనున్న, ము, రు, లు, వర్ణంబులు సంయుక్తములు గాని యప్పుడు, వాని యుకారంబునకు లోపంబు బహుళంబుగానగు. ఇందు మువర్ణ, రువర్ణముల యుకారమునకు లోపంబు హల్లు పరంబగుచోఁ దఱచుగాను, అవసానమందు విరళంబుగాను, నగును.

గ్రమ్మపడు— స్తభించు —ధాతుజవిశేషణంబైన యను శబ్దముయొక్క యుకారమునకు లోపంబు ప్రాయికంబగు. సీ॥ సలుపుము దమనుఁ డన్నన్మునిఁ బత్నియుఁ దాను నుపాసించి తద్వరమున॥ భార. అర. ౨ ఆ:

కం॥ అన విని నిరుత్తరుండయి । మనుజేంద్రుఁడు గొంతసేపు గ్రమ్మపడి తలఁపుల్ పెనఁగొన నిద్రావిహీనుం । దనువలయఁ గవిదురుతోడఁ దానిట్లనియెన్॥ భార. ఉద్యో. ౨ఆ

శా॥ పౌలోమీప్రభృతుల్ కుమారినిటు సంభావింపఁగా మున్నది । క్ష్వాలుర్ రాజు నలంకరించి శుభలగ్నంబుం బ్రతీక్షింపఁగా। నాలోఁ దాను దదగ్ర్యసన్మణివిశేషాన్వేష సన్నద్ధుఁడో । నాలోకాప్తుఁడు చేరరాగ మహిమన్ రత్నాకరప్రాంతముల్॥ వసు. ౬ ఆ:

ఏతత్సూత్రోదాహరణ సందర్భంబున మద్విరచితంబైన జాజీముక్తావళిలోని యిప్పద్యంబులనుగూడ సంధించి యీగ్రంథంబున నిట్టిరీతిచతురపద్యసంఘటనావ్యాపారంబునఁ బరిపాలనా గౌరవముం గుఱిచి త్రికరణశుద్ధిం దెలెపెద.

మ॥ పొగ కార్మబ్బులు మంటచాల్మెఱుపులుం బొగారు కన్నీటిరో। టిగముల్ సప్పిన దాండ్ర గాత్రికుల భాతీవృష్టులేచన్ మహా। యుగమైతోఁచిన దుర్దినాళి బహుదుర్గోగ్రంబు మాయించిబల్ । సుగమంగూర్చెడు వాంగిరేయ విజయశ్లోకత్రిక్ష్మక ప్ప్రగ్రదిశ్

చ॥ ధులియనఁదగ్గచోటను గదుంభ్రిమఫిల్లి యాటంతుఁ; మానులి ! య్యిలజగదీశ్వరుండలధులీశ్వరుఁడై తన పూర్వపృష్ఠమం। దెలిమినహింఁచునట్లు నహియించుఁజేసి ధులీశ్వరాఖ్యతోఁ । బిలిచిరి ధర్మజాదులను బేర్వడు మాగతి జార్జిభూపతీ!

మొదటిపద్యములోఁ గార్త్యబ్బులు, చాల్త్యంపులు, కన్నీటి, గముల్సప్పి, బల్సగము, చంద్రికల్ (అవసానంబున) అనుచోట్లను; రెండవపద్యమందు, 'పేర్వడు' అను చోటను, రు, లు, ను వర్ణంబులను లోపంబని తెలియందగు లువర్ణాంతమైన ధాతుజనిశేషణముయొక్క యుకారమునకును. లోపంబు నిగళంబుగాఁ గానంబడు.

క॥ చిట్టుములు నోకిపింతలు । నట్టంబుగఁ బోడమోజవులు దప్పెం గోర్కుల్।
బిట్టాడవేఁ బిఱుఁగులం జను । కట్టులు నడుబకి నెనపుకు క్రొల్గంటులకున్॥

అప్ప. రా. బాల. కాం.

సీ॥. పగహాగ్ని నీకీతిఁ గగఁనానాహా నసం బనినట్లు పన్న గాచిన ఘృతంబు। పాలఁబోల్ వయసు నీపాలుజేయుట కిదె యూనవాలన్నట్టు లానవాలు॥

తా. రా. శశాం. విజ. 3 ఆ:

17 సూ—అచ్ఛికంబులం బదమధ్యంబుల న ల డ ర లయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.

కినుక - కిన్క॥ కానుక - కాన్క॥ చిలుక - చిల్క॥ కాలువ కాల్వ॥ అడుగు - అడ్గు॥ కడుపు - కడ్పు॥ పెరుగు - పెర్గు కూరుకు - కూర్కు.

(వ్యా)— అచ్ఛతెనుఁగుమాటల నడుమనున్న, న, ల, డ, ర, వర్ణంబులమీఁది యుకారమునకు లోపంబు బహుళంబుగా నగు

కిన్క—(కోపము) పంచచామరము॥ అనంగోజ్జంతలేని కిన్కవక్కడించి జోగు! గ్రన్నవక్కడిం... అప్ప-రా-యు

చ॥ అలికులవేణి కీలెఱిఁగి యాచెలి వెండియు నేకతంబునన్ । బొలతుకరాల యీచిగురుబోడి కుచార్పితహార నాయకో । జ్జ్వల రుచిఁ గంటి రే యనినఁ జంద్రముఖుల్ చిఱునవ్వుఁ బూనిరా । లలనల జూచి, కిన్కయుఁ గలంకయుఁ గొంకును నంకురింపఁగన్॥ వసు. 3 ఆ:

కాన్క—(కానుక) సీ॥ గుములుగాఁ బోలుపుపూగముల జెన్నొందు పూగములఁ గొన్నింటిఁ గై కాన్క చేసి॥ చం.ద:

కాల్వ—తే॥ గీ॥ కదళి కోఁతుల కొకతోట కాల్వయయ్యె॥ అచ్చ. రా. యు.

18 సూ—లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి.

కలికి - కల్కి - ములికి - ముల్కి - బుడిపి - బుడ్పి
పొలఁతి - పొల్తి.

(వ్యా) తెలుఁగుమాటల నడుమనున్న ఇక్కార యచ్చులను క్వచిత్తుగా లోపంబగు.

కల్కి—(1. ఒప్పిదము 2. మనోజ్ఞురాలు) సీ॥ ఈకల్కి మదనునిచేకటారి యొకాకకొను పేరటపిడి గాంచనేల? తా-శ-విజ 3 ఆ: సీ॥ అత్రిసవృత్తి చెన్నలరి నూతనరాగమహిమఁ గుల్కెడు కల్కి మానికములు. వసు. ౬ ఆ:

ముల్కి—(బాణము) వ॥ తనరాజీవశరం బెఱుంగదు నిశాతత్వంబు లేఁగల్వ తూ । పునకుం జాలదు వేగలీలయని యాపూముల్కి లెగ్గించి క్రొ । న్ననపిల్కుఁడు నవాంబుజోత్పల వితానంబీను మీనాక్షిలో । చనము ల్వింట ఘటింపఁ జొల్పెనవి నిస్త్రందాంబకఖ్యాతులన్॥ వసు. ౨ ఆ:

19 సూ—అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు.

అబ్బురము - అబ్రము - అబ్బురము - కప్పురము - అప్పుడు ఇప్పుడు - ఎప్పుడు - చప్పుడు - నెత్తురు. ఇత్యాదులు.

(వ్యా)—అబ్బురములోనగు తెలుఁగుమాటల నడుమనున్న యుకారము వికల్పంబుగ లోపించును.

అబ్రము—ఉ॥ కాయము మేటితప్పు కొడుకాయము నిద్దపుఁ బూతమావి మోకాయముఁ బంజరంబుఁ జిలుకాయని యబ్రపు సోయగంబుఁ బ్రో। కాయముఁ బల్కు నేమి యలుకాయముఁ బంతము దీటునోటుకై। కాయము నేరయిట్లు దుడుకాయముఁ బాయఁగ నోరకాయముల్ అచ్చ. రా. అయో.

కప్రము—(కర్పూరము) ఉ॥ చెన్నగునన్న దీపులినసీమల దాగిలిమూత నాడుచున్ । వెన్నెలరేలఁ గప్పురపు విప్పుట నంటుల నీడనీరుగా। కన్నెలగోయునన్నులకుఁ గన్నులు మూయుఁ సదీయవాసనల్ । మన్ననఁగాంచి కప్రపు దుమారము రేమపనిగాక డింభముల్॥ వసు. ౧ ఆ:

20 సూ—చుక్కరక రువర్ణకంబున కుముందఱిదువర్ణంబు నుత్వంబున కులోపంబు విభాషనగు; నగుచోఁ దత్పూర్వంబు గురువుగాదు.

అదురుచు - అద్రుచు॥ ఎదురుచు - ఎద్రుచు॥ పదురుచు - పద్రుచు.

(వ్యా)—రువర్ణమునకుఁ జుగాగమంబు పరమగుచుండ - రువర్ణముముందఱిదువర్ణముయొక్క యుకారమునకు లోపంబు వికల్పంబుగానగు. అట్లు లోపించుచోఁ దకారరేఫ సంయోగమునఁ బూర్వస్వరము గురువు గాదు. ఇట్టిద రేఫసంయోగంబే యన్యోన్యంబును బ్రాసంబుగాఁ జెల్లుననియు నియ్యది లఘుద్విత్వప్రాసంబని చెప్పఁబడుననియు నప్పకవీయ తృతీయాశ్వాసమందునిట్లు చెప్పంబడియె.

లఘుద్విత్వప్రాసము—తే॥ గీ॥ భువిలఘుద్విత్వ సంజ్ఞికంబులను కొన్ని । యూ

బృహ—ప్రవ్రజ్యాయోగాధ్యాయము శాలినీవృత్తము-శ్లో॥ జన్మేశోన్యైర్యద్యదృష్టో గ్రహేంద్రైః | పశ్యత్యార్కిర్జన్మపం వా బలోనం | దీక్షాం ప్రాప్నోత్యార్కిదేక్కాణసంస్థే | భౌమార్కాంశే శనావ్యర్కదృష్టే వ సందేహః॥—ఈశ్లోకంబునందు | తృతీయపాదంబున ద్వితీయగణంబుగా నుండవలసిన తగణంబునకు పరేఫసంయోగంబున భంగము గలుగుచున్నయది. తేల్చి పలుకవలయునని గ్రంథకర్త తాత్పర్యంబు. ఇట్టిదిజ్యోతిశ్శాస్త్రగ్రంథంబులందే యూహాభావముగాఁ గనంబడు. దీనికి మూలంబు గానరాదు.

21 సూ—జూదాదుల దాకు జకారంబు విభాషనగు.

జూదము - జూజము - అపుదు - జవాద - జాది - జాదు - విరవాద.

(వ్యా)—ప్రకృతిసూత్రంబునఁ గొన్ని తెలుఁగుశబ్దంబుల దకారమునకు జకారము వికల్పంబుగా విధింపంబడియున్నయది. సంస్కృతభాషయందును దకార జకారంబుల సాక్షికోచ్చారణంబునం జేసి 'దంపతీ' అనియు జంపతీ అనియు నీశబ్దమును ద్వివిధంబుగాఁ బలుకవచ్చును. ప్రాకృతభాషయందుఁ గేవల దకారమునకు జకారవిధి లేదు గాని దకారసంయుక్త సాంస్కృతిక దకారమునకు-సూ-త్వథ్వద్వధ్వాం చఛజఝాః॥ అనుసూత్రమున జకారంబు క్వాచిత్కముగా విధింపంబడియె. ఇట్లు భాషాంతరములయందును దకార జకారములకు మైత్రి క్వచిత్తుగానుండు.

22 సూ—నిందయుం దామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకుగి గీ లగు.

కుంభకర్ణుఁడు - గింభకర్ణుఁడు॥ రావణుఁడు - గీవణుఁడు.

(వ్యా)—రెండవపర్యాయంబున నుచ్చరించు మాటయొక్క మొదటిస్వరము హ్రస్వంబయ్యెనేని, గి, వర్ణంబును, దీర్ఘంబయ్యెనేని గీ వర్ణంబును నిందయందుఁ గ్రమంబుగా నగు.

ఉ॥ అంచహులుమాయిజోటు నలదారఁగఁజేసి కడింకోరికల్ | గాంచి వెదంది రక్కసి కొలంబున గెల్లను మేలుబంతియై | మందపుఁగోడు తాలుపరమున్క బిడారపు

మిట్టు నెంతయుం। గొంనక యెత్తి నట్టి నిను గోఁతులుగీఁతులు గెల్వఁజాలునే? అచ్చం.
రా. యు. కాం.

క॥ డింభక సర్వస్థలముల । నంభోరుహనేతుఁ డుండునను మిగులసం। రంభ
మున బలికెదవీ । స్తంభంబునఁ జూపఁగలవె చక్రిం గ్రికి॥ భాగ. ౭ స్క:

ఆ॥ వె॥ ఎసఁగుభస్థలములను గిసలములను నీర । జాతములనుగీరజాతములను
విగ్రహింపనీని విరహంబె తోఁచు గా । వెలఁది వెతలె విపిన వీథులవును॥ వసు. ౩ ఆ

ఇటఁ జక్రి భసల శబ్దముల మొదటి హ్రస్వమునకు, గికారమును, "కోతుఁలు
నీరజాతములను" అను మాటల మొదటిదీర్ఘమునకు సూత్రరీతిని గీకారంబును నయ్యెవని
యెఱుంగునది.

23 సూ —పాదంబునం బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసం
బులునాఁబడు.

(వ్యా)—పద్యపాదముయొక్క మొదటియక్షరంబునకు వళి యనియుఁ రెండవ
యక్షరమునకుఁ బ్రాసమనియు, లక్షణగ్రంథములయందు సంజ్ఞగలదని యర్థము.

24—సూ—యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు రేఫం
బులుపొరయవు.

వ్యా— యకారవకారలకారములు లఘువులును నలఘువులును యతిప్రాసములం
దు నన్యోన్యమైత్రిఁ జెలిమిగల్గియుండు. అట్లు లఘ్వలఘువులైన రేఫంబులుమాత్రము
మైత్రితోనుండనేరవు.

ఉదా—కం॥ అన్నలుఁ దమ్ములుఁగలుగుట । యన్నతుగాఁ జేయు నెంతయు
నున్నపతిందా । నున్నదయునీరెయును సం । పన్నంబులు గాఁగవారిఁ బాటించుట్లుగుణ
భా-శాం ౨ ఆ: (ఇచయతిమైత్రి)).

ఈపద్యమందు "నృపసత్తముని యతిప"—(నృపసత్తముని + అతిప)=రాజశ్రేష్ఠుఁడైన ధృతరాష్ట్రుని భార్య యని భారతార్థమందు లఘువైన యకారమే "నృపసత్తము"= దశరథునియొక్క, "నియతివశతఁ"=అదృష్టసంప్రాప్తిని నని రామాయణార్థమందున లఘుయకారమయ్యె.

గీ॥ అలఘుమానవనీయబల విడిపింపుమా । గావులబలు మేటిగైన తనప । కారిగలమకలుషితాత్ము సుయోధను । న్మదవిమూఢుసురముననువధించి రాఘవ ర అ:

ఇట—"నీయబల"—(నీ + అబల)=నీకాంతయైన సీతనని రామాయణార్థమందు లఘువైన యకారము, "అలఘుమానవనీయబల"—గొప్పదియైనట్టియు, పూజ్యమైనట్టియు, బలముగలవాఁడా యని భారతార్థమందు నలఘువయ్యెను. "మాయావుల" (మా + అవుల)=మాయొక్క, అవులని భారతార్థమున లఘుయకారము. "మాయావుల" + మాయావంతులలోనని రామాయణార్థమున నలఘుయకారము.

గీ॥ అలరుమణి ప్రవిజితహేమాద్రినిమస । నగరమవతంస మఖిలభూనగరములకు । లలితజయసంపదలఁ బొల్చు నిలువయోధ్య । లఘుగభీరాంబు పరిఖాకలాపము గుమ॥ హరిశ్చంద్రనలోపాఖ్యానము ౧ అ:

ఈపద్యమందు "లలితజయ సంపదలఁబొల్చు నిలువయోధ్య"—(నిలువు=అయోధ్య)=జయసంపదలకు నిల్కడయైన యయోధ్యానగరమని హరిశ్చంద్రార్థమందు వకారమలఘువు. జయసంపదలఁబొల్చు నిలు + పయోధ్యలఘు గభీరాంబు పరిఖాకలాపము= జయసంపదలచేనొప్పునట్టి గృహమువంటిదియు, సముద్రమువోలె గొప్పలోతు నీరుగలయగడ్త భూషణముగాఁ గలదియునని నలార్థమందుఁ బ్రథమాంతమైన యిలుశబ్దముకంటెఁ బరమయినపయోధిశబ్ద పకారంబునకుఁ బన్యపాఠసమయంబున సంధివశంబునన్నైన వకారంబుగావ లఘువు.

కం॥ బలువగతురగములమహా । బలచిత్రప్రౌఢిఁదోలి బహుచక్రశ్రీ । వెలయుమహానిభువధుఁడా । బలియుఁడు తనగొడుగునీడఁ బరపు మనఘుల॥ హరిశ్చం- నము౧ అ

ఇట "పలుపగతురగముల"—(పలు + పగతురగముల)=అధికమాపగవారిసమూహములను అని హరిశ్చంద్రార్థమందుఁ బగతుశబ్దము యొక్క పకారాదేశమగు వకారము లఘువు.

పలువగ + తురగముల=అనేకవిధములైన గుఱ్ఱములనని నలార్థమందు నలఘువకారము—లఘ్వలఘువులైన యవలు పద్యంబున వెవ్వేఱుచోటులనుండి యతిప్రాసంబులయందుఁ జెలిమినొందుటయే కాక, పైనిఁజూపిన విధంబున శ్లేషకావ్యంబులయం దయ్యవి యొక్కచోటనే యభేదంబు నొందుచుండు. ల, ళ లు మాత్రము వెవ్వేఱుచోటున నుండుచు యతిప్రాసంబులందుఁ బరస్పరమును జెలిమినొంది నిలుచుండుఁగాని శ్లేషస్థలంబుల నభేదంబు నొంద నేరవు.

## శకటరేఫము.

సంస్కృతవ్యాకరణంబున యకారవకారములు మాత్రము లఘువులు, అలఘువులు, యని రెండువిధములుగానున్నవి. లఘువనఁగా లఘుతరోచ్చారణ గలది యని యర్థము. "యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం స లఘూచ్చారణః" అని వ్యాకరణమునందు వివరింపఁబడినది. లఘూచ్చారణః అనఁగా లఘుతరోచ్చారణమని శబ్దేందుశేఖరమందు స్పష్టపఱుపఁబడియె. నాలుకయొక్క చిట్టచివర, చివర, మధ్యప్రదేశ మూలప్రదేశములందును మిక్కిలి తేల్చిపలుకఁబడువర్ణము లఘువనఁబడును. ఇట్టివి సంస్కృతభాషలో యకారవకారములు మాత్రమే యున్నవి. ఆంధ్రవ్యాకరణకర్తలు యకారవకారములే కాక రేఫముకూడ లఘుత్వాలఘుత్వభేదముతో నున్నట్లుకనుఁగొనిరి. లఘురేఫము జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలములందు లఘుతరముగాఁ బలుకవలయుననియు, శకటరేఫము జిహ్వాగ్రాదులయందు గౌరవముగా నుచ్చరింపవలయుననియు, భేదంబు చెప్పుదురు. కనుక లఘురేఫము కోమలవర్ణముగా, నలఘురేఫంబు పరుషవర్ణంబుగాఁ బెద్దలు గ్రంథంబులందు లెక్కించిరి. శ్లో॥ జవణాఽవర్జితాః స్పర్శాః స్వస్వవర్గాంత్య శేఖరాః। లఘురేఫణకారౌ చ కోమలాః పరికీర్తితాః॥ అని యహోబలపండితీయము ఇట్లు లఘురేఫము కోమలవర్ణమగుటవలన శకటరేఫము పరుషవర్ణమని స్పష్టమగుచున్నది లఘురేఫ [illegible] శ్లో [illegible] జెప్పఁబడి [illegible] హల్వర్ణములతో సంబంధించినప్పుడే పొర్లు

వ్యమును బోధించునుగాని కేవలస్థితిలోఁ గోమలత్వమే సహజగుణముగాఁ గలదని ప్రతాపరుద్రీయరత్నాపణవ్యాఖ్యానము. శ్లో॥ రేఫేణయస్యకస్యాపి। యోగ ఆవృత్తితీయయోః। స్వోత్తరాభ్యాంతుల్యయోర్వా। పరుషాష్టగణశ్శ్రమే॥ అని వర్ణాంతరంబులతో సంబధించినప్పుడుగాని రేఫంబునకుఁ బరుషత్వగుణము రానేరదని చెప్పుచు, శ్లో॥ మాంసకీకసనంకీర్ణాః। ప్రసరద్రుధిరాపగాః। వసాకర్దమితాయుద్ధే। భువోంద్రసుభ్రైకృతాః॥" అను శ్లోకంబునఁబరుషంబయిన బీభత్సరసమునకు రేఫసంయోగ ముదాహరణముగాఁ జూపఁబడినది. శ్లో॥ అత్యుద్భుతరసారౌద్రబీభత్సాపరికీర్తితా॥ అని బీభత్సరసమత్యుద్ధతముగావున నట్టిరసమును దెలియఁజేయుటకు రేఫసంయోగంబు సమంజసంబని గ్రంథకర్తతాత్పర్యము. ఇట్లు సంయుక్తరేఫమును, అలఘురేఫంబును బారుష్యగుణము గలదిగావున రౌద్రబీభత్సరసములకుఁ దగినవియనియు, కేవలరేఫంబు కోమలంబుగావున శృంగారాది సుకుమారరసంబులయం దుపయోగింపఁ దగినదనియుఁ బ్ర్యవసానము తేలుచున్నది. "శ్లో॥ రసాశ్శృంగారబీభత్సౌ తథావీరభయానకౌ। రౌద్రాద్భుతౌ తథాహాస్యకరుణౌ వైరిణౌమిథః" అని శృంగారబీభత్సములకుఁ బరస్పరవిరోధంబు గనుక శృంగారరసంబులో నుపయోగింపఁదగిన లఘురేఫంబునకును బీభత్సరసంబులో నుపయోగింపఁదగినయలఘు రేఫంబునకును నయ్యారసంబులకుంబోలె మైత్రి చెల్లదని గ్రంథకర్తల తాత్పర్యము. కోమలపరుషత్వంబులచే నన్యోన్యవిరోధంబుగల లఘురేఫశకటరేఫంబులకు యతిప్రాసములలో మైత్రి హాస్యాస్పదమని పెద్దలచే నిషేధింపఁబడినది.

హూణభాషలోఁగూడ నొక్కయక్షరమునే లఘురేఫంబువోలెఁ దేలికగాను నలఘురేఫంబువోలెఁ గఠినముగాను నుచ్చరించు సంప్రదాయంబు కలదు. ఇ. జి.
(1) రైట్, రిజిడ్ ఇత్యాదిశబ్దంబులో (ర) గురుత్వముగా నుచ్చరింపఁబడును.
(2) హియర్, నియర్ ఇత్యాదిశబ్దంబులో (ర)వర్ణము తేలికగాఁ బలుకఁబడును. హూణభాషలో నొక్కయక్షరమునే లఘుగురుత్వములతో వాడుచుండఁగా తెలుగునం దవి సౌకర్యమునకై రెండువర్ణంబులుగా నుచ్చారణభేదమును బట్టియే యేర్పఱుపఁ బడినది. ఇట్టిభేదం బితరభాషలలోఁగూడ ననాదిగఁ జూపట్టుచున్నందున మన భాషలో నట్టిభేదంబును నిరాకరించుటకై నిరాకరణంబయిన యలఘుక్రమంబు స్వీకరింపకుందురని విశ్వసించుచున్నాఁడను.

25 సూ—రేఫంబులు లఘ్వలఘువులుం దక్కంగల విశేషంబులు నార్యవ్యవహారంబులం దెలియుట శ్రేయంబు.

వ్యా—లఘువనియు నలఘువనియు రేఫంబు ద్వివిధంబు. ఆభేదము సర్వలక్షణసారసంగ్రహము, అప్పకవీయము మొదలగు నితరగ్రంథముల సాహాయ్యంబునం దెలియందగు. కావున నట్టిభేదవివరణంబు గ్రంథవిస్తరభీతిం జేసి యుపేక్షింపఁబడె.

ఇంకను నార్యులచేత నవలంబింపఁబడిన విశేషంబులం దెలిసికొని వ్యవహరించుట శ్రేయోదాయకము. "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతానిచ శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణ్యాయుష్మత్పురుషాణిచభవంతి తదధ్యేతారశ్చ ప్రవక్తారోభవంతి" యను భాష్యకారవచనంబున మంగళార్థముకూడ గ్రంథాంతమందు శ్రేయశ్శబ్దము ప్రయోగింపఁబడినదని యెఱుంగునది.

మహాభాష్యప్రారంభమున గ్రామ్యభాషానిరసనంబొనర్చు వ్యాకరణప్రయోజనంబను నిరూపించినట్టి యీసూత్రము నొద్ద సందర్భానుకూలంబు గాన నార్యులను నాదరణీయముగాని గ్రామ్యభాషను ఖండించి వ్యాకరణప్రయోజనంబును దృఢపఱుచుటయే కాక యింకను గొన్ని విశేషంబులు చర్చించి యార్యవ్యవహారంబు శ్రేయోదాయకంబని ప్రదర్శింపఁబడును.

## గ్రామ్యభాషాఖండనము.

శ్లో॥ సారశ్లేష విశేషచిత్రపరిణామోదాత్తసద్రూపకై
ర్వ్యాఘాతవ్యతి రేకవద్భిరుపమిత్యన్యోన్యదృష్టాంతకైః।
ప్రత్యర్థకసంకీర్ణనారణిఘటితైస్సర్వాగ్రగో జృంభితై
ర్నిర్దోషైర్వివిధైరలంకృతిగణైరమ్యా గిరాం జగ్తే॥

(సాహిత్యరత్నాకరము).

ఉపమ, ఉత్ప్రేక్ష, సారాలంకారము మొదలగు నలంకారములును, మాధుర్యము మొదలగు గుణములును గల్గి కావ్యలయందు ఘటితమైనందున రసమావిర్భవించి గ్రా

జిల్లుచుండునని పైపద్యముయొక్క ఫలితార్థము రసప్రవృత్తిగలదియే వాక్యమని చెప్పం దగుఁ గాని రసహీనంబగు శబ్దంబు వాఙ్మాత్రంబునకున ర్హంబుగాదని "సాహిత్యరసవృత్తిః" అను నాంధ్రశబ్దచింతామణియందలి ద్వితీయసూత్రము రసప్రాధాన్యము నుద్ఘోషించు చున్నది శ్లో॥ గుణాలంకారశ్రీకులపరికరో భావవిభవః! స్ఫురద్రత్నామ్నాయః కవి మగళితవేద్యాంతరమితిః। సుఖంవా దుఃఖంవా నిదిశతు యమాస్వాదయేత్స్వ మందానందాత్మపరిణమతి పూర్ణోరసభరః॥ — అనియు, శ్లో॥ రసావాక్యార్థస్సన్ విలసతి పదార్థాః పునరమీ విభావాద్యాయస్మిన్ కిల దధతి విశ్రాంతిముచితాం। అతోభావా ఏవక్రమ సముపేతాన్యభ్యుదయవా రసీభావం బిభ్రత్యథచపటతాం తంతవఇవ॥ — అనియు, గుణాలంకారసంపదగల పదార్థసామగ్రియే విశిష్టరసోత్పత్తికిఁ బ్రధానంబని ప్రతాపరుద్రీయ ప్రబంధకర్తయగు విద్యానాథపండితుండును వివరించియుండెను. ఇట్లు తత్త్వప్రసాదితంబులగు పదార్థంబుల ప్రాధాన్యకతో నింపబడిన పద్యములు కేవలంబుఁ గావ్యంబునకు జీవితస్థానీయమగు బ్రహ్మసంప్రతిభంబగు రసము లేనిచో మృతంబునని సర్వాలంకారికులును నైకకంఠ్యంబునఁ దమతమ తాత్పర్యంబులను జాటుచుండుట మీరు లోక వినుచున్నారము.

"శ్లో॥ మహాజనా యేన గతాస్సపంథాః" అను న్యాయంబున మహాజనులు సంచరించునదియే మార్గంబుగాని యన్యంబు మార్గంబుగాదని స్పష్టపడుచుండఁగా వర్తమాన కాలంబున. జనులకు సుసాధ్యంబయి లౌకిక వ్యాపారకుపయోగించుచుఁ పామరులను రంజింపనట్టి గ్రామ్యభాషయే గ్రామ్యభాషయనియు, ప్రబంధభాష ప్రతిబంధభాషయనియుఁ గొన్ని వాక్యంబులు కర్ణగోచరంబులగుచున్నవి. గ్రామ్యభాష పామరులు సర్వదా వ్యవహరించునట్టి భాష గానున్నది, కాబట్టి యిట్టి భాషను పామరులేసర్వాశ్రయింతురు. పండితులు పామరులతోడి సంబంధదోషంబుననో, శాస్త్రీయభాష పామరులకుఁ దెలియదన్న కారణంబుననో గ్రామ్యభాష కొంతయుపయోగించుచున్నను గవితారచనాది క్రియాకాలంబులయందు గ్రామ్యంబును దూరంబుగా నెంచి శాస్త్రీయంబగు భాషను నాదరించువారు గానున్నారు.

మనకాళ్లను వ్రేళ్లను బమును దుమ్ము మొదలగు నపరిశుద్ధపదార్థములు మన గృహములయందుఁ జిరపరిచయంబుతోనున్నను సమయమువచ్చినప్పుడెల్లను వానిని సమ్మా

ఙ్జని వస్తువు (చీపురు) తోఁ దుడిచి దూరముగా విడనాడు చున్నారముగదా! సస్యము తోఁ గలుపు మిక్కిలి బలిసి పెరుఁగుచున్నను దానిని బ్రయత్నపూర్వకముగాఁ బరిహరించుచున్నారము. పంకిలంబగు నుదకంబునఁ గతక రేణు(ఇండుపగింజ)కసం బుపయోగించి పంకంబ నడఁగంటించు నిర్మలోదకంబును గ్రహించునట్లు, లోకవ్యవహారదశ యందునపశబ్దములు సుశబ్దంబులకంటెఁ బ్రజానురాగంబును సంపాదించి తలయెత్తికొని విచ్చలవిడిగాఁ బ్రవర్తిల్లుచున్నను, యుక్తసమయములందు శాస్త్రీయజ్ఞాన ముపయోగించి వానినడఁగంటింప వలయునే కాని యెంతమాత్రము చెచ్చరేఁగునట్లు పురికొల్పఁగూడదు.

లోకమున సర్వజనులు నానందమునకై ప్రయత్నించుచున్న సంగతి తేటతెల్లయేగదా! అట్టి యానందము సంపాదింపవలయునన్నచో గుణాలంకారాదుల పరిపోషణంబుగల కవివాక్యములనే మనము శరణముండవలయును గాని యన్యాశ్రయమువలన నది సాధ్యంబుగానేరదు. గ్రామ్యభాషకును రసంబునకును, (అనగా నానందంబునకును) నరకమునకును నాకలోకంబునకును గల యంతరంబు గలదు. గ్రామ్యభాషయనెడి నామంబుననే రసహీనత స్పష్టపడుచుండఁగా నట్టిభాషయె మూర్ధాభిషిక్తంబైనచో గురుకులశిక్షితులైన పండితులపయినిఁ బామరులే యధికారము జూపుదురనుటకు నించుకైన సందియంబుండదు. పామరులు (పా+అమరులు) పండితులపయినే కాక యమరుల కన్నను దమకుఁ బాకారమెక్కుడు గలదన్న కారణంబునఁ దాము పాకారులయితి మని (దేవేంద్రులమయితిమి) విజృంభించుచుఁ బాకారినైన లెక్కింపక యమరులనయిని సయితము రాజ్యంబుసేయఁ జూతురని తోఁచుచున్నది. దేవానాంప్రియులు దేవతాసురుల నుభయులను సమానముగా నాదరింతురుగదా! వ్యాకరణశాస్త్రప్రయోజనం బుపన్యసించు ప్రకరణంబునఁ బతంజలిభగవాను లిట్లు నొక్కి వక్కాణించుచున్నారు. 'తస్మాద్బ్రాహ్మణేన న మ్లేచ్ఛితవై నాపభాషితవై । మ్లేచ్ఛో హ వా ఏష యదపశబ్దః। మ్లేచ్ఛా మాభూమేత్యధ్యేయం వ్యాకరణం। మ్లేచ్ఛ అవ్యక్తే శబ్దే అని సిద్ధాంతకౌముదిభాష్యములయందు వ్రాయబడియున్నది. 'అస్ఫుటే అపశబ్దే చేత్యర్థః' అనియు నర్థము వ్రాయఁబడినది. 'న మ్లేచ్ఛితవా ఇత్యస్యపర్యాయో నాపభాషితవా ఇతి;' అని కైయటము. తవైప్రత్యయము కృత్యప్రత్యయము గాన నిచ్చటఁ గర్మార్థము జెప్పను

బ్రాహ్మణునిచేత నపశబ్దము పలుకఁబడఁగూడదు. మ్లేచ్ఛునఁగా నపశబ్దము గాన నది యవలంబించినచో బ్రాహ్మణుఁడుగూడ మ్లేచ్ఛుఁడగును. అట్లు మ్లేచ్ఛులము గాకుండుటకై వ్యాకరణాధ్యయనము సేయవలయునని యర్థము. పైనివ్రాసిన భాష్యతాత్పర్యము చూడఁగా గ్రామ్యభాషావలంబనమున బ్రాహ్మణుఁడే మ్లేచ్ఛుఁడగునని స్పష్టపడుచున్నందున వేఱే మ్లేచ్ఛజాతి లేక మనమే మ్లేచ్ఛులమై శ్లో॥ ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోపివా॥ యోషితో బహునక్తేశ్చేద్రసాభాస స్త్రిధామతః॥ అని నిర్ణయించిన యాలంకారికులకుఁగూడ సులభముగాఁ జేఁజిక్కి పైశ్లోకంబునఁ దిర్యగ్జంతువులతో సాహచర్యంబుగాఁ బరిగణింపఁబడి ద్వంద్వంబునఁ దులఁదూగుచున్న మ్లెచ్ఛులకుదాహరణమై రసాభాసమున కాస్పదమగుదుము. మఱియు వ్యాకరణశాస్త్రప్రయోజన ప్రకరణమందే పతంజలిభగవద్వాక్యమిట్లు చాటుచున్నయది. "అథవాభూయా నధర్మః ప్రాప్నోతి। భూయాంసో పశబ్దాః। అల్పీయాంసః శబ్దాః। ఏకైకస్యహిశబ్దస్యబహవో పభ్రంశాః। తద్యథాగౌరిత్యస్య శబ్దస్యగావీగోణీగోతాగోపోతలికే త్యేవమాదయో బహవో పభ్రంశాః! అథయో వాగ్యోగవిత్ అజ్ఞానంతస్యశరణం॥ శ్రు॥ సక్తుమివతితఉనా। పునంతో యత్రధీరా మనసావాచమక్రత। అత్రాసఖాయస్సఖ్యానిజానతే। భద్రైషాంలక్ష్మీర్నిహితాధివాచి॥ లోకములో నొకశబ్దంబునకు దేశము, జాతి, కులము, పురుషుఁడు మొదలగుభేదంబులను బట్టి యనేకవిధంబుగా నపశబ్దంబులు ప్రయోగించుటవలన ధర్మయుక్తంబె నధర్మమే యధికంబగుచుండునని యు, శాస్త్రచోదితమైన యొక 'గో' శబ్దంబునకు, 'గావి, గోణి, గోత, గోపోతలిక,' మొదలగు నపశబ్దంబులు పెక్కులు లోకవ్యవహారమునందుఁ గానవచ్చుచున్నవి యనియు, లోకములో బుద్ధిమంతులు చెంటతో మిళితంబైన పరిశుద్ధపదార్థములను జల్లెడతో జల్లించి విడదీయునట్లు వ్యాకరణవేత్తలు వ్యవహారమునఁ బామరప్రాబల్యంబున నపశబ్దంబులతోఁ గలసిమెలసి యున్న సుశబ్దంబులను వ్యాకరణజ్ఞానమున వేఱుపఱిచి గ్రహించునట్టి బ్రహ్మప్రతిపాదక శబ్దమునందు భేదబుద్ధిలేక సమానజ్ఞానులయి సఖ్యంబుల నొందుచుందురనియు నట్టివారి వాక్కులయందే భద్రంబైలక్ష్మి నివసించుననియుఁ బైవాక్యంబులకు ఫలితార్థము. కాఁబట్టి యనేకగ్రంథప్రమాణంబులఁ బరిశీలించినను యుక్తియుక్తంబులగు వాక్యంబుల విమర్శించినను శాస్త్రమర్యాదకు చెఱుపులేని గ్రామ్యభాష రసాభాసంబునకుఁ బుట్టినియి గర్హణీయంబుగాని గౌరవయోగ్యంబుగాదని స్పష్టపడుచున్నది. నాటకంబులందు

నిరుపాత్రంబుల సవితంబుగాన నీగ్రామ్యంబునకుం గావలసినంత యవకాశమిచ్చి యుత్తమపాత్రంబుల యందుమాత్రము రిత్త సేయవలయును.

ఇంక నుత్తములు ప్రయోగించునట్టి సంభాషణంబుననే గ్రంథరచన చేయవలయునన్న యంశముగూడఁ గొంతచర్చించి చూతము.. 'శ్లో॥ శతేషుజాయతేశూరః॥ సహస్రేషుచపండితః' అను న్యాయంబునఁ బామరసంఖ్యకంటెఁ బండితసంఖ్య మిక్కిలి స్వల్పంబుగదా! పామరులతో సంబంధంబునంగాని, శాస్త్రీయముగా మాటాడినచోఁ బామరులు తెలిసికొనలేక నవ్వుదురన్నసిగ్గునంగాని పండితులును వ్యవహారమునందు నితరు లుపయోగించినంత గ్రామ్యంబు నుపయోగింపకున్నను మొత్తముమీఁద నపశబ్దంబులను సయితము క్రియాభాగంబులో వాడుచుందురు. లోకవ్యవహారమునందు నొకవేళ వ్యాకరణయుక్తంబుగా మాటాడినను నట్టిమాటలు రసవంతంబయిన యొకయుత్తమ గ్రంథంబును రచించుటకు నెంతమాత్రమును జాలియుండవు. వ్యవహారావస్థలో మనకు గలసిన వస్తువులను వాడుకొనుటకు నవసరము దీర్చునట్టిమాటలు వ్యాకరణయుక్తముగ నుపయోగించినంతమాత్రముననే మనము ప్రాఁజదువుల బ్రహ్మలమనిపించుకొనఁగలమే, మన గృహాధిష్ఠానిదేవతలయిన స్త్రీలుసయితము కొంచెము వ్యాకరణాంశము మనకంటెఁ దక్కువగాఁగ నట్టి ద్రవ్యగుణక్రియలపేర్లను బ్రతిదివసంబును బ్రయోగించుచుందురు గాన వారునుగూడఁ జదువులసరస్వతీ దేవతలనియే చెప్పందగియుందురు. ఇట్లు ప్రతి గృహంబును బ్రహ్మణీబ్రహ్మలతో నిండారుచుండును. కావునఁ నిట్టి పేలపిండివంటి పేలవంపుమాటలతో నిండిననీరసగ్రంథంబులను నాకర్ణించినవారు కావ్యరసామృతంబును గర్ణపుటంబులతోఁ జూఱలాడి జొక్కెడువిబుధాగ్రగణ్యులగుదురని యెన్నిటికిని దలంపఁగూడదు. మనముత్తములనుకొన్న జనులు మాటాడుభాషగూడ గ్రామ్యాంశసంకీర్ణమై గ్రాంథికశైలికి ననువుగా నుండనందున గురుకులవాసముచేసి సమార్జించిన సరస్వతీ కరుణాకటాక్షంబు ననుసరించియే గ్రంథంబులు రచియింపవలయునని సిద్ధాంతము గుచున్నది.

మఱియు, పతంజలిభగవానులు శాస్త్రీయములుగాని శబ్దంబులు ప్రయోగింప నర్హంబులుగావని భూవాదిసూత్రభాష్యంబుననిట్లు వ్రాసిచ్చి యుపపాదించిరి.
“ఏతేషామప్యాణపయత్యాది నివృత్త్యర్థఃపాఠః కర్తవ్యః। కేపునరాణపయత్యాదయః।

ఆణవయతి వర్ధయతీతి । శిష్టప్రయోగాదాణవయత్యాదీనాం నివృత్తిర్భాష్యకృతి । సదా వర్త్యం శిష్టప్రయోగ ఉపాస్యః । యేపి పర్యంతే తేషామపి విపర్యాసనివృత్త్యర్థః । లోకేహి కృష్యర్థే కసిం ప్రయుంజతే । దృశ్యర్థే చదిసిమ్ ॥ లౌకికవ్యవహారదశయందుఁ బ్రయోగించినంతమాత్రమున సిద్ధములైన „ఆణవయతి, వర్ధయతి" ఇత్యాదులును, కృషధాత్వర్థమందు „కసి" శబ్దంబును, దృశిర్ ధాత్వర్థమందు „దిసి" శబ్దంబును లోకులు ప్రయోగింపఁగా నట్టిశబ్దంబులను శిష్టసమ్మతములు గానందున శాస్త్రీయములు గావని తొలఁగించుటకై భూధాతువు మున్నుఁగాఁగల ధాతుపాఠోక్తధాతువులెల్లను నానుపూర్వీవిశేషంబుతోఁ బఠింపఁదగినవని పూర్వోక్తభాష్యతాత్పర్యము. ఈభాష్యంబును నాలోచింపఁగా గీర్వాణభాషయంగూడ వ్యావహారికభాషాసాంకర్యంబున వికృతి సంభవించుటచో, శిష్టప్రయోగంబులను వ్యాకరణాదులును బరిశీలింపనొల్లని శబ్దదోషంబులు తొలఁగింపవలయునని తోఁచుచున్నందున నాకీతినే శిష్టులయిన నన్నయభట్టాదిప్రయోగంబులను దత్ప్రణీతవ్యాకరణాదులను దెలిసికొని పామరబృందముచేతఁ బరిగృహీతమయిన రసాభాసభాషను బాలురనోటి సహజభాషానుసారస్యంబునే నరసిను గ్రాహ్యాంశము గాదు!!

---

## అర్ధానుస్వారము.

అర్ధానుస్వారము తనకుముందున్నస్వరము (అచ్చు) ననునాసికమని సూచించుటకు నిర్ణయింపఁబడినచిహ్నమయి యున్నది. సంస్కృతశబ్దంబులయందుఁగూడ „అభ్రి ఆఅవః॥ఊ॥ ఇతి।విద్యాఖ్లి ఖతి॥ సయ్యన్తా ఇత్యాదిశబ్దంబులయందు నర్ధచంద్రాకారచిహ్నంబులు దేవనాగరగ్రంథంబులందు ననునాసికంబులయిన యక్షరంబుల శిరంబులపయి వ్రాయఁబడుచున్నయవి. అనునాసికాక్షరము సూ॥ముఖనాసికావచనోనునాసికః అనుసూత్రప్రకారంబున ముఖనాసికం బుభయముయొక్క మేళనంబుతో నుచ్చరింపఁబడఁ దగినగాన నట్టియక్షరముయొక్క సగము భాగ ముచ్చారణంలో నాసికపుఁ జెందిన ధ్వని పెద్దలు సూక్ష్మదృష్టిని దానిని సూచించుటకై యర్ధచంద్రాకారరేఖలను చిహ్నములు

గా నేర్పఱిచి యుండవచ్చును. నాగరగ్రంథంబులయందు నక్షరంబుల శిరంబులపయి నున్న యా రేఖలే యనునాసికములయిన తెలుంగువర్ణంబులలో వాని పార్శ్వంబునకుఁ గాలక్రమంబున జరిగియుండవచ్చును. అనునాసికాక్షరముయొక్క యుచ్చారణము ముఖంబునకును నాసికకును సమభాగంబుగాఁ జెందునని సూచించుటకే గాక వేఱొక లాభంబు నకై కూడఁ దెలుఁగువర్ణంబుల పార్శ్వంబులయందే యర్ధచంద్రరేఖలు వ్రాసియుందుము. హ్రస్వంబులయిన యనునాసికాక్షరములతరువాత వైకల్పికముగా నిండుసున్నలు వచ్చునుకాన మునుపు నిరూపింపఁబడిన యరసున్నలే నిండుసున్నలగునని చదువరులకు సులభముగా బోధపడుటకై యట్లు గావించియుండవచ్చును. సున్న తెలుఁగుభాషలోఁ బార్శ్వమందును, సంస్కృతంబున వర్ణంబులశిరంబునందును వ్రాయుట సంప్రదాయంబుగా నున్నదిగదా?

తెలుఁగుభాషయందువలెనే సంస్కృతభాషయందు సయితము విరళంబుగాఁ గొన్ని శబ్దంబులందు ననునాసికవర్ణంబులపయిని నిండుసున్నలు వచ్చుట శాస్త్రీయము గావున నర్ధచంద్రరేఖలు పూర్ణానుస్వారములుండునట్టి యక్షరంబులశిరంబులపయినే వ్రాయఁబడుట పరంపరగా వచ్చుచున్నదియని తోఁచుచున్నది. అట్టి శబ్దంబులెవ్వి యనఁగా (1) సమ్స్కర్తా సంస్కర్తా (2) పుమ్స్కోకిలః, పుంస్కోకిలః (3) పుమ్స్పుత్రః, పుంస్పుత్రః, (4) శార్ఙ్గిఞ్ఛింధి శార్ఙ్గింఛింధి (5) చక్రిన్త్రాయస్వ; చక్రింత్రాయస్వ ఇత్యాదులందు। సూ॥ అత్రానునాసికః పూర్వస్యతువా। సూ॥ అనునాసికాత్పరో నుస్వారః॥ అను సూత్రంబులచే ననునాసిక పూర్ణానుస్వారంబులు వికల్పంబు నగుచున్నవి యని పండితలోకంబునకు విశదమయినవిషయము. భాషయొక్క రీతి ననుసరించి తెలుంగులోఁ గొన్ని శబ్దంబులందే హ్రస్వంబు లనునాసికంబులై (అరసున్నగు ఉతులతోఁ గూడినవియై) వికల్పంబుగాఁ బూర్ణానుస్వారయుక్తంబులగుచును, సంస్కృతంబులో, బైనిఁ జూపినరీతిని గొన్ని శబ్దంబులందు మాత్రమే యచ్చులనునాసికంబులై వికల్పంబుగా నిండుసున్నలగుటయు సంప్రదాయంబుగా నున్నయది. కాని సంస్కృతంబున నింకొక విశేషంబు కలదు. శ్లో॥ "అహోనునాసికా నహ్రస్వా। నాదినోహార్ఘుశః స్మృతాః। ఈషన్నాదాయణ్యశ్చైవ। శ్వాసినస్తుఖఫాదయః." అను శిక్షావచనంబు నుదాహరించుచు నానీ [illegible] ఘోషము యోః । వ్యాహృప

లక్షణ మైచస్వర్యస్య ప్లుత ఇ కారస్య చానునాసికస్య దర్శనాదిత్యలం॥' అని శబ్దేందు శేఖరంబున నాగేశపండితుఁడు. అప్రసత్యాహారములోనివియైనందునఁ బ్రాప్తించిన యానునాసిక్యధర్మంబును ప్లుత ఇకారంబునకును రేఫ హకారంబులకును, ఐఔ లకును, నిషేధించుచున్నారు. తెలుఁగుభాషలో నట్లుగాక, పైఁడి, పైఁట, సైఁపు, సైఁదము, జౌఁగాక, కౌఁగలి, కౌఁజు, ఇత్యాదులయందు నైకారమునకును నౌకారమునకును గూడ ననునాసికత్వము కానిపించుచున్నది. అనఁగా నర్ధానుస్వారములుండుచున్నవి. ఇంతియే కాక సంస్కృతంబునవలెనే తెలుఁగులో నయితము కొన్నిశబ్దంబు లర్ధానుస్వారము నొందినప్పుడే (అనఁగా అనునాసికధర్మము కలిగియున్నప్పుడే) యుక్తమయినయర్థంబు నిచ్చుచుండును గాని యట్లుకానిచో విపరీతార్థమగుచుండును. „ఊఁ"॥ అనుశబ్దం బను నాసికమయిన సమయంబుననే ప్రశ్నంబును, కథయొక్క వినికిని, దెలుపుచున్నయది లేనిచో నిదియపార్థకంబగును, „ఆఁ, ఈఁ," అనుశబ్దంబునందు నాకారము అనునాసిక మయినపుడే 'ఆఁగు' మన్న యర్థమునిచ్చును గాని యట్లుకానిచో విపరీతార్థమిచ్చును ఏఁచు, వెలుఁగుఁ పెరుఁగు, పాఁడి, యిత్యాదులలోనఁ బైనిజూపినరీతిగ ననునాసికము లయినపుడే క్రమముగా బాధించుట, కిరణము, వర్ధిల్లుట, క్షీరసంపద. యనునర్థంబుల నిచ్చును గాని యట్లుకానిచో వేఱొకయర్థంబుల నిచ్చును, మఱియు „వచ్చెఁ గమలాక్షుఁడు, మెచ్చెఁ దామరసాక్షుఁడు, ఇత్యాదిశబ్దద్వయసంధి స్థలంబులందును లోపించిన నకారముయొక్క యానునాసిక్యమును సమీపస్థములయిన 'ఎ'కారములు తెలుపుననియే యట్టిచోటను నర్ధానుస్వారములు వాగనుశాసనులుచే వ్యాకరణంబున విధింపఁబడినవి. అర్ధానుస్వారము తెలుఁగునఁ దీసివేయంబడెనేని లోపించిననకారముయొక్క యను నాసికధర్మమును సమీపస్థమయిన „ఎ,కారము తెలుపకపోవలసి యుండును మేమట్టి స్థలంబులయందు నయితము నాసికాసంబంధముతో నుచ్చరింపమని పట్టుదలతోఁ గొంద ఱుందురేని శాస్త్రమందు దయచేతను వారు పలుకవలయునేకాని యట్లుకానిచో నెవ రేమిసేయఁగలరు. „సయ్యన్తా; సవత్సరః; పుల్లింగమ్: వి ల్లిఖతి' ఇత్యాదులందు ననునాసికములకు బదులుగా వచ్చినవిగాన నట్టిస్థలములయందలి యకార వకారలకారంబుల నాసికాసంబంధంబున నుచ్చరింపవలయునని శాస్త్రము బోధించుచున్నను నాయాన రంబులకు నానునాసిక్య ముచ్చారణశక్తిమునుఁ గారణము గాన మేము తీసివేయుద్ధు

మనియుఁ దైవలంబులందు ముక్కుతోఁ గాక కేవలము ముఖంబుతోనే పలుకుదుమనియు నెవ్వరైన బ్రాహ్మణులు వితండవాదంబునకు డీకొందురేని వారిముక్కును బలాత్కారముగాఁ బట్టి పరీక్షించుట యెవ్వరితరమగును ? అనునాసిక్యము లేదనియు, అరసున్న లేదనియు ఎంతో యొగుటువారి ముక్కును బట్టుకొని ప్రతిబంధింపఁ బ్రయత్నించుచున్నారుగదా? శాస్త్రనిశ్వాసము చేతను, లోపించిన యనునాసికాక్షరంబుల గుణంబును భాషాస్థితింజేసి యూదేశవర్ణంబులును సమీపస్థవర్ణంబులును దెలుపుట యుక్తంబగునన్న యుక్తి చేతను, మనస్సాక్షి బోధింపగాఁ బల్కవలసినదేగాని లేనియెడ నెవ్వరట్లుం జేయింప సమర్థులగుదురు? అరసున్న (లేక) యనునాసిక్యము లేదనినవారి క్రిందిస్థలంబులయొద్ద నెట్టిసూత్రంబును బన్నదురో యడుగుచున్నారము. బా. క్రి. సూ. 89 "ఖండబిందువుమీఁది సిద్ధసకారంబునకు ముత్తుపరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగా నగు" ఉదా. తలఁపక; త్రేఁపక, తోఁపక; అరసున్నలు లేనివారి మతంబునందు నెట్టిసకారంబునకుఁ బకారము రావలసియుండునో యెట్టిసకారమునకు|| సూ|| 88. ప్రకారమున వకారము రావలయునో తెలియక బుద్ధి డోలాయమాన మగుచుండును. అరసున్న యున్నయెడల 'ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః' అనున్యాయంబున శిష్యపరంపరాప్రవాహముగా వ్రాయఁబడుచున్న యర్ధబిందువుతరువాతిసకారంబును దెలిసికొని సూత్రమును సులభముగా నుపయోగింతురు.

గీ. ధామకనితుండవై మూగతగుఁదగునగుఁ
దొప్పెసఁగురుచిరయశోమహోదయుతను|
రాఘవపాండవీయము. ద్వితీ. 80 పద్యము.

ఇటు భారతార్థమందు సుగుణ వికచ యశోమహోదయతిన్; ఘనమయిన వికచకీర్తిశయములతోఁ గూడిన వాఁడవువైతి; రామాయణార్థమందు. రుచిర యశోమహోదయతన్, ఒప్పెసఁగుక్ అని వ్రాయఁబడినది. రామాయణార్థములోని యొసఁగు శబ్దములో నగసున్నయున్నందునను, భారతార్థములోని సాంస్కృతికసగురు శబ్దములో నరసున్న లేనందునను, బన్నపాళనయంబునఁ బరస్పరవిరుద్ధంబయినయనునాసికత్వానునాసికత్వసత్యంబు లొక్కమాఱుచ్చరింపఁగా శక్యంబులుగానందునను, నిట్టి శ్లేషార్థమెట్లుచ్చరింపఁగునని యెవ్వరైన శంకింతురేని సావధానచిత్తంబుతో వినుండు. అర

సున్న తనకుఁ బూర్వమందున్నయచ్చు, అనునాసికమయినట్లు గుఱుతని యీవఱలోఁ జెప్పియున్నాఁడను. కాబట్టి యెసఁగుశబ్దములోని 'అ'కారము నిత్యముగా ననునాసికముగాన ననను నాసికము కానేరదు. కాని సంస్కృతమయినసగురుశబ్దములోని 'అ'కారము, అనునాసికముగూడఁ గావచ్చును. ప్రమాణము. 'అ, ఇ, ఉ, ఋ ఏషాం వర్ణానాం ప్రత్యేకమష్టాదశభేదాః' అని *ముఖనాసికావచనోఽనునాసికం, అనుసూత్రము క్రింద వ్రాయబడినది. యత్నపూర్వకముగా సర్వదాయనునాసికము కావలయునని యుచ్చరింపఁబడినయచ్చు, అననునాసికము గానేరదు కాని సామాన్యముగా నుచ్చరింపఁబడినయచ్చునుభయంబును గావచ్చునని సంస్కృతవ్యాకరణశాస్త్రమందుఁ బారిభాషికంబుగా మర్యాద సేయఁ బడినది. కాబట్టి యెసఁగు శబ్దములోని సకారము సానునాసికమయిన నుసగురుశబ్దములోని సకారము నిరనునాసికముగానఁ బన్యపాఠసమయంబున సకారము నిరనునాసికముగ నుచ్చరింపఁబడెనేని సానునాసికంబునకును గ్రహణంబు బుగిలిగి రామాయణభారతార్థంబు లుభయంబును బొసంగును. ఇట్లు కిరణవాచకమైన వెలుఁగుశబ్దములోని లకారముమీఁదనున్న "ఉ" కారము సర్వదా యనునాసికము గాన ననునాసికము కానేరదు గాని, యావరణవాచకమైన వెలుగుశబ్దములోని "ఉ" కారము నిరను నాసికమయినందున శాస్త్రంబున ననునాసికమునుగూడ గ్రహింపవచ్చును. కావుననే వెలుగుమొదలగు శబ్దంబులకు నానార్థంబులు చెప్పిన నిఘంటుకారుల వాక్యంబును సమంజసంబగుచున్నది. సామాన్యముగా నుచ్చరింపఁబడినవర్ణం బనునాసికంబును గావచ్చుటనుఁ బరిభాషేందు శేఖరములోని నూటతొమ్మిదవపరిభాషలో నిట్లు వ్రాయఁబడియున్నది, "అభేదకాగుణాః। అసతియత్నే స్వరూపేణోచ్చారితో గుణో భేదకో నవివక్షిత ఇత్యర్థః"॥ గుణశబ్దముచేతను దాత్తానుదాత్తస్వరితములేకాక యానునాసిక్యముగూడ వర్ణమగుననుటకు "యుణాత్మృతీయాస్థాపంచమా। అనునాసిక్యమేషామధికోగుణః"॥ అను పతంజలి భగవద్వాక్యంబు ప్రమాణంబుగాఁ బరిఢవిల్లుచున్నది. కావున నుపాయాంతరంబులేమింజేసి పైనిఁజూపిన సాంస్కృతికవ్యాకరణ సంకేతిత సంప్రదాయంబుననుసరించియర్థబింబువుంచున్న శ్లేషస్థలంబులయందు నిట్లుసవరణమగునని యుభయభాషానిరంకుశమైనయగాధపాండిత్యముగల సూరకవీంద్రాదుల యభిప్రాయమగునట్లు స్పష్టమగుచున్నది. పైనింజూపెనభాష్యకారులవచనంబున నానునాసిక్యధర్మము గౌణధర్మముగాని ముఖ్యధర్మంబు గానందునఁ బన్యపఠనసక్షు

యంబున నట్టిధర్మంబును వివక్షసేయుచున్నను శేషార్థంబునకుఁ గొఱంత కలుగదనియే నాతాత్పర్యము. ఇట్లు ప్రమాణంబులుచూపనను ననునాసికంబుల (అనఁగా నరసున్నల) నంగీకరింపనివారికి జలభారావస్థలోఁగాక శాస్త్రీయావస్థలో నాసికతోఁ బ్రయోజనం బులేనందున నది యున్నను లేనిదియై "నవిద్యతేఽనాసికాస్థితి. యస్యాస్సా" అనువ్యుత్పత్త్యర్థమునుబట్టి నాసికాశబ్దంబు (లేనిది) మాత్రము తన్మతంబున సాధువయి యవయవంబు నిష్ఫలంబగుంగాః !!

---

## పూర్ణానుస్వారము.

ఉదా:—(1) వంక (2) కంచె (3) పంద (4) వంట (5) కొంత (6) కొంప ఇత్యాదులయందుఁ గచటతపలకు ముందున్న పూర్ణేందు బింబాకారము పూర్ణానుస్వార మనంబడును. ఆబాలగోపాలమును బేరుప్రతిష్ఠలఁనొంది విబుధులయంగూడఁ గడుపునిండాగఁ జేయఁనంతటి యానందంబును గొల్పంజాలుచుఁ గువలయంబునకుఁ గన్నులపండువయ్యెడి యీపూర్ణేందుబింబాకారము తెలుంగుప్రపంచంబున వెలుంగునొందుచుండఁగా నిట్టి యాకారము నామమాత్రావశిష్టమేకాని విధిచోదితంబుగాదని తెలుంగున సున్నకు సున్న పెట్టునట్టి యాధునికవాదం బొకటియడరుచుండెడి. ఆవాదసారాంశ మేమనఁగా:—

(1) అంకః (2) క్రౌంచః (3) ఘంటా (4) దంతః (5) కంపః, ఇత్యాదిస్థలంబులందు నిట్లు ప్రథమావస్థలోఁ బూర్ణబిందువుండఁగా "అనుస్వారస్యయయి పరసవర్ణః" అనుపాణినిసూత్రంబునఁ (బదమధ్యమునందలి) పూర్ణబిందువునకు యయ్ప్రత్యాహారములోని వర్ణముపరమగుచుండఁగా సున్నకుఁ బరసవర్ణముయొక్క వర్గలోని సవర్ణాక్షరము నిత్యముగా నాదేశమగుననుటచేత (1) అఙ్కః (2) క్రౌఞ్చః(3)ఘణ్టా(4) దన్తః (5) కమ్పః, అని క్రమమున సంస్కృతభాషలో ఙ, ఞ, ణ, న, మ, లాదేశములగుచున్నవిగదా? అనఁగాఁ బూర్ణబిందువునకుఁ గంఠ్యములగు (గట్టురల్ ) క, ఖ, గ, ఘ, ఙ, లు పరమగుచో ఙకారమును; తాలవ్యములౌ (పలటల్సు ) చ, ఛ, జ, ఝ, ఞ, లు పరమగుచో, ఞకారమును; మూర్ధన్యములౌ (లింగ్వల్సు ) ట, ఠ, డ, ఢ, ణ, లు పరమగుచో ణకారమును; దంత్యములౌ (డెంటల్సు ) త, థ, ద, ధ, న, లు పరమగుచో నకారము; ఓష్ఠ్యములౌ ( లాబ్యల్సు ) ప, ఫ,

బ, భ, మ, లు పరమగుచో మకారమును, య, వ, ల, లు పరమగుచోఁ గ్రమముగాన నునాసికములగు. య, వ, ల; లును నాదేశములగున (సున్నకు) నియర్థము.

“అంకః”—ఇచట బిందువునకుఁ గకారము పరమగుచుండఁగాఁ బరసవర్ణ మువచ్చుటచేతఁ గంఠ్యంబులై (గట్టరల్స్) కవర్గీయంబులైన యేమవర్ణంబులను
(1) (2)
స్థానాభ్యంతరయత్నవశంబున సవర్ణంబులౌటంజేసిబిందుస్థానంబునఁ బ్రాప్తించుచుండిన ను, “నాసికానుస్వారస్య” అని యానునాసిక్యగుణంబుగల( నేసల్) బిందువునకున నట్టి గుణంబుగల యంతరతమ (సదృశతమ) వర్ణంబే యాదేశమై రాఁదగినది గావున “యథాతృతీయాస్తథాపంచమా అనునాసిక్యవర్జమ్। అనునాసిక్యమేషా మధికోగుణః” అను తుల్యాస్య సూత్రస్థభాష్య ప్రకారంబున ననునాసికంబులగు ఙ మ ఞ ణ న లై దింటిలోఁ బ్రకృతంబునఁ గంఠ్యత్వాదిధర్మంబునఁ గకారమునకు సవర్ణంబును బాహ్యప్రయత్నమైన యానునాసిక్యగుణంబునంజేసి బిందువునకు నంతరతమంబును (సదృశతమంబును) నైన ఙకారమే యిట నాదేశమైన “అఙ్కః” అనురూపం బేర్పడెనని యెఱుంగునది. ప్రకృతంబున నాదేశమైన ఙకారమందుఁ బరవర్ణమైన కకారమందలి
(1) (2)
కంఠ్యత్వంబును స్థానియైన బిందువునందలి యానునాసిక్యంబు నిట్టిధర్మద్వయంబును నమరుచుండుట స్పష్టమగుచున్నది. ఇట్లే “క్రౌఞ్చః”-అనుచోటను బిందువునకుఁ బర
(1) (2)
వర్ణమైన చకారమందలి తాలవ్యత్వంబును స్థానియైనబిందువునందలి యానునాసిక్యంబు నుగలిగిన ఞకార మాదేశమయినది.

[1] [2]
ఘణ్టా—ఇచట మూర్ధన్యత్వానునాసిక్యధర్మద్వయముగల ణకార మాదేశము.

[1] (2)
దన్తః—ఇక్కడ దన్త్యత్వానునాసిక్యధర్మద్వయముగల నకారాదేశము.

[1] [2]

కమ్పః — ఇట బిందువునకు నోష్ఠ్యత్వానునాసిక్యధర్మద్వయయుగల మకారాదేశము.

ఇట్లు గీర్వాణభాషావ్యాకరణకర్తయైనపాణిని మునీంద్రుఁడు తన సంపూర్ణానుభవంబునం జేసి "అనుస్వారస్యయయి పరసవర్ణః" అనుసూత్రంబును రచియించి సంస్కృత పదంబులందలి బిందువునకు ననునాసికంబులగు పంచమవర్ణంబు లాదేశంబులుగా విధిచె. ఆసూత్రము సంస్కృతభాషానిమిత్తమే రచియింపఁబడినను యుక్తియుక్తమైన మన యనుభవంబును బరిశీలింపగాఁ దెలుంగుభాషయందుఁగూడ నల్లసూత్రం బుపయోగింప కతీరదు. తెలుంగువ్యాకరణమున సూత్రము లేదనుకొన్నను దెలుంగుభాషలో సానుస్వారంబులనుకొన్న ప్రదేశంబులందు ననునాసికములతో పంచమవర్ణంబుల పలుకుబడియే బలాత్కరించి యనుభవసిద్ధంబుగాఁ గానంబడెడి. అందున (1) వంక (2) కంచె (3) వంట (4) కొంత (5) కొంప—ఇత్యాదిపదంబులు (1) వఙ్క (2) కఞ్చె [3] వణ్ట [4] కొన్త [5] కొమ్ప—అని ఙ, ఞ, ణ, న, మ, లతో సంయుక్తములు సేసి లిఖింపవలయు. ఇట్లు పరుషసరళంబులకు ముందు సున్నలనుకొన్న ప్రదేశంబులెల్లఁ బంచమవర్ణంబులతో నిండియుండునని గ్రహింపనది. మఱియు, పంచ, సంజ-ఇత్యాదిదంత్య చ, జ స్థలంబులందుఁ దాలవ్యమైన ఞకారము బిందువునకుఁ బరసవర్ణములైన దంత్య చజలకు సవర్ణము గానందున నిచ్చట బిందువునకు ఞ కారము రానేరదు. అట్టి చ, జ, లకు దంత్యమైన నకారమే సవర్ణంబుగాన నట్టి శబ్దంబులు నకారయుక్తంబులు సేసి, పన్చ, సన్జ, ఇత్యాదివిధంబుగా వ్రాయవలయును. వఙ్క ఇత్యాదితెలుంగు శబ్దంబులు సంస్కృత పదంబులువోలె పంచమవర్ణయుక్తంబులు కానసే యీవక్ష్యమాణంబులగు నాంధ్రకవితాపితామహాది ప్రయోగంబులు సంగతము లగుచున్నవి:—

(1) ఉ॥ అఙ్కముఁజేరి శైలతనయాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాఙ్కవిచేష్టఁ దొండమున నవ్వలిచన్గ బళింపఁబోయి యా
వఙ్కఁగుచంబుగాన కహివల్లభహారముఁ గాంచిలే మృణా
ళాఙ్కురశంక నంటెడుగజాస్యునిఁగొల్తు నభీష్టసిద్ధికిన్॥

మను ౧౩

(2) ఉ॥ పాండవ వంశవర్య పటుపాపవినాశని యైనయిక్కథన్
నిండుమనంబుతో వినుట నీవు కృతార్థుఁడ వైతి శాశ్వతా
ఖండసుఖాత్మవిష్ణు నధిక స్థిరభక్తి సమాశ్రయింపు నీ
కొండొకఁడేల యిమ్మెయి మహోన్నతిఁ జేయు జగత్త్రయంబునన్॥ భార-
శాం ౯. ౮

మొదటిపద్యమునందు (1) అఙ్క (2) అఙ్కుర, ఇత్యాదిపదంబులందుఁ బైని నుదాహరించిన సాంస్కృతిక వ్యాకరణసూత్రమననుసరించి ఙకారము తప్పనందునఁ బ్రాసస్థానంబున ఙకార కకారసంయోగంబుండకతీరదు. వఙ్కశబ్దంబు తెలుంగు శబ్దంబైనను సాంస్కృతిక భాషాసంప్రదాయానుసారంబుగాఁ బ్రాసస్థానమందు ఙకార కకారసంయోగంబు గల్గినందుననే సంయుతప్రాసంబునఁ బద్యంబు శాస్త్రీయమై సమంజస మగుచున్నయది. అట్లె రెండవపద్యమునందుఁ బాండవేత్యాదిశబ్దములందుఁ బాణినీయ వ్యాకరణంబున ణకార డకారసంయోగంబు ప్రాసస్థానంబున నుండకతీరదు. నిండు ఒండు, ఈతెలుంగుశబ్దంబులందును సాంస్కృతికవ్యాకరణ సంప్రదాయంబున, ణకార డకార సంయోగంబుండినందుననే నాల్గుపాదములయందును సంయుతప్రాసంబైనందున బద్యంబుశాస్త్రీయంబై రమణీయంబగుచున్నయది. ఇట్లేతక్కిన వర్గాక్షరములయందును నూహించుకొనునది. అని యిట్లు కొందఱు తమవాచోయుక్తులు విజృంభింపఁ జేయుదురు కాని యీమతంబు నన్నయభట్టారక తిక్కనసోమయాజి ప్రభృతి సకలవిద్వద్వరేణ్యులకును సమ్మతంబుగాదు. పంచమవర్ణంబులు రాక తెలుంగుశబ్దంబులందు బిందువులే నిల్చునని ప్రాచీనులతాత్పర్యంబు. పైనింజూపినపద్యంబులయందుఁ బ్రాసంబెట్లుసంగతంబందు లేనివినుండు. పైపద్యంబున, "అఙ్కము" "అఙ్కుర" ఇత్యాదిశబ్దంబులయందు
(1) (2)
ప్రాసస్థలంబున సానునాసిక్య కంఠ్యత్వధర్మద్వయంబుగల ఙకారంబును వెంబడించి కేవల
1)
కంఠ్యత్వధర్మంబుగల కకారంబునివ్వటిల్లుచున్నది. అనఁగాఁ బ్రాసస్థానీయమైన "ఙ్క" అనునట్టి విశిష్టమందు సానునాసిక్యం బొకధర్మంబును గంఠ్యత్వధర్మంబులు రెండును గల్గియుండుట స్పష్టమగుచున్నయది. ఇటఁ బ్రాసస్థానంబున నొకయనునాసిక్యంబును ద్విగుణకంఠ్యత్వంబును దేజరిల్లుచుండు. (హియర్ ఇన్ది ప్లేస్ ఆఫ్ ప్రాస (ఙ్క

డేరిజ్ వన్ నేసల్ సౌండ్ ఎండ్ టు గటరల్ సౌండ్స్) ప్రాచీనుల మతంబున "వంక" అనునట్టి తెలుంగుశబ్దంబున సాంస్కృతికసూత్రము ప్రవర్తిల్లక పంచమవర్ణము రానంగునఁ బ్రాసస్థానమందలి బిందుపూర్వక కకారమందు(ంక) నాను నాసిక్యధర్మమొక్కటియు(బిందువునందు) కంఠ్యత్వధర్మంబొక్కటియు (కకారమందు) వర్తిల్లుచుండు. (హియర్ ఇన్ది ప్లేస్ ఆఫ్ ప్రాస (ంక) వన్ నేసల్ సౌండ్ అండ్ వన్ గట్టరల్ సౌండ్, అనఁగా నేకాన నాసిక్యంబును ద్విగుణకంఠ్యత్వంబును గల 'ఙక' అనుశబ్దముకంటె, నేకాను నాసిక్యమును నేకకంఠ్యత్వమునుగల 'కం' అనుశబ్దంబొకకంఠ్యత్వధర్మంబునఁ దక్కువయగుటస్పష్టపడుచుండుఁగాన నిటనెట్లుప్రాసంబుచెల్లునని యాధునికులకు కొందఱతాత్పర్యము. కాని యిచటఁ గంఠ్యద్విత్వంబులోనొక్కటి తగ్గినంతమాత్రమునఁ బ్రాసభంగంబు రానేరదనియేపూర్వులయభిప్రాయము: ఇటస్థాలీపులాకన్యాయంబున నిక్రిందిభారతప్రయోగంబు ప్రమాణంబుగాఁ జూపెద:—

ఉ॥ క్షత్రియసంజ్ఞలై ధరణిఁ గాఁపగఁ బుట్టినవారుబ్రాహ్మణ । క్షత్త్రియవైశ్యశూద్రులనఁగాఁగల నాలుగుజాతులన్ స్వచా । రిత్రము దప్పకుండఁగఁ బరిక్షితిగాచినయట్లు రామామాం । ధాత్రిరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె? యేయుగంబునన్॥ భా-ఆది ౨ ఆ: ॥శ్లో॥ సక్షత్త్రియస్త్రాణసహస్సతాంయ । స్తత్కార్ముకం కర్మసుయస్యశక్తిః। వహన్ద్వయీంయద్యఫలేర్థజాతే । కరోత్యసంస్కార హతామివోక్తిమ్॥ కిరాతార్జునీయము. ౩ స:—ఈభారవి కవికృతశ్లోకమందలి క్షత్త్రియశబ్దంబునకు "క్షతాత్ త్రాయతేక్షత్త్రిమ్" అనియు, క్షతః (క్విప్ప్రత్యయాంత పంచమ్యంతము) త్రాయతే క్షత్త్రిమ్ (క్షత్త్రియకులం) అనియుద్వివిధంబుగా ఘంటాపథవ్యాఖ్యయందు వ్యుత్పత్తివ్రాసి తజ్జాతియందుఁబుట్టినవాఁడుగాన క్షత్త్రియుఁడని (క్షత్త్రాద్ఘః అ ౪ పా ౧ సూ ౧౩౮) మూలకారుని యభిప్రాయము వెల్లడింపఁబడియె. కావున భారవిప్రముఖసమస్తకవులమతమందును క్షత్త్రియశబ్దమందుఁ దకారద్విత్వంబుతప్పదు. అందునఁ బైపద్యములోఁ బ్రథమద్వితీయపాదములందుఁ బ్రాసస్థానమున "త్త్రి" అనుచోటున, దకారద్విత్వంబు అనఁగా ద్విగుణదంత్యత్వంబుండక (డబుల్ డెంటల్ సౌండ్) తీరదు. (క్షత్ + త్ర). మూడవపాద ప్రాసస్థానమూలోని చారిత్రపదమందలి త్రశబ్దమునందు "అనచిచ" అను పాణినీయసూత్రమునఁ దకారద్విత్వమును జేరఁగాఁజూచినను, నాల్గవ

పాదమందలిమాంధాత్రశబ్దములోని త్రిశబ్దమునందు ద్వితీయతకారము రానేరదు. ఇచట మాంధాతృశబ్దముయొక్క ఋకారమునకు సమాసపరిచ్ఛేదమందలి యిరువదినాల్గవసూత్రమున ద్వంద్వంబున రేఫాదేశమయ్యెంగావునఁ దెలుంగువ్యాకరణంబునకైన రేఫవర్ణంబు పరమగుచో ‚‚అనచిచ'' అను సాంస్కృతిక వ్యాకరణసూత్రమునందకారద్విత్వంబు తేఁజూచుట దుర్ఘటంబు. అందున మాంధాత్రశబ్దమందలి త్రశబ్దమునందు ద్విగుణదంత్యత్వము లేకపోఁగా దంత్యద్విత్వముగల తక్కిన మూఁడుపాదములలోని ప్రాసంబులతో జతుర్థపాదప్రాసం బెట్లుతులతూఁగుటకు నర్హంబయి శాస్త్రీయుంబనందగు? కాఁబట్టి ద్విగుణదంత్యత్వకంఠ్యత్వాదులు(డబుల్ డెంటల్ సౌండ్ ఎస్డుడబుల్ గట్టరల్ సౌంట్ ఎన్డు)

నన్నయభట్టారకాదులమతంబునఁ బ్రాసాదులలో నవివక్షితములన్న

సిద్ధాంతము స్థిరపడుచున్నది అందుఁ దైపద్యములోని చతుర్థపాదమందలి ప్రాసంబు దోషనిరాసంబయినదని యూహింపఁదగును. అట్లే ప్రకృతంబున ‚‚అక్క, అక్కుర్త‚‚ ఇత్యాదులయందుఁ బ్రాసస్థానమున ద్విగుణకంఠ్యత్వాదులున్నను

‚‚వంక'' ఇత్యాదులందు యనేకకంఠ్యత్వమున్నను

అట్టిద్విత్వంబవివక్షితము గాన నయ్యవి ప్రాసాదులలోఁ బరస్పరంబు ప్రతిఘటంబులయి చెల్లవచ్చునని పర్యవసానంబు తేలుచున్నది. కావుననేయీక్రిందిపద్యముల యందు బ్రాసము సంగతమగుచున్నది.

కం॥ మిన్నే యుపాదమునధా।తం నాభినిగ సుమశరు నెపంగాంచిననీ।సాన్నిధ్యము దొరకుటకై। సన్నుతి సేయుదురు నిన్ను సనకాదులజా॥ పైపద్యమునందు రెండవపాదంబునంగాక తక్కినపాదత్రయమ్మునందును (నకారము దంత్యమును నాసిక్యముగావున) నకారద్వయమందు దంత్యతాద్విత్వనాసిక్యతాద్విత్వంబులు.

వెలయుచున్నవి' రెండవపాదమందు ‚‚తంనాభి''

అనుచోటున ద్విగుణనాసిక్యమును నేకదంత్యత్వంబును

వినబడుచున్నవి. ఇట్టి యీపద్యద్వితీయపాదప్రాసస్థానంబున నుండందగిన ద్విగుణదంత్యత్వములో నొక దంత్యత్వధర్మంబునకు లోపంబు వచ్చినను నయ్యది యవివక్షితమైనందుననే యనునాసికప్రాస సంజ్ఞను బ్రాసంబు చెల్లవచ్చునని లక్షణవేత్తలు ‚‚ తే॥ ఛఘఝఢధాము ద్విత్వంబులై తనరునవియుఁ। బూర్ణబిందులు ఙ్ఞాపళ్ళఁ

బోరయునవియుఁ| గలసి యనునాసికప్రాసములనుబేర |న. ను. లనరుఁ గావ్య మల యందుఁ దెనుఁగునందాము" అశాసించుచున్నారు. స్థిరమైననకారమునుకారమును పరమగుచో బూర్వనకారమునకు బిందువుపయితము రాఁదగునన్న మతంబున నిట్లు లక్షణపద్యము రచియింపఁబడియె. (సంధిపరి [19] సూత్రవ్యాఖ్యలోఁ జర్చించినయంశమును జూచునది) కం|| తమ్ములను మల్లికాకుసు| మమ్ములమరువానిపత్త్రిమాలికలను భ| క్తింమురసంహరు పూజలు| సమ్మదమునసలుపఁ గలుగు సకలార్థమ్ముల్. కం|| ఇమ్మహినిమునులచేవెల| సెంమును కావ్యములు "నానృషిఃకురుతే కా! వ్యమ్మనుచనార్థంపుఁ| సమ్మతిఁగలివేళ సకలజనులేనానుల్|| [అప్పకవి] ఇట మొదటిపద్యముయొక్క తృతీయపాదమందలి ప్రాసస్థానంబునను రెండవపద్యములో ద్వితీయపాదప్రాసస్థానంబునను నుండఁదగిన యోష్ఠ్యద్విత్వమ్ములో నొకటిలుప్తమైనను నవివక్షం జేసి యనునాసికప్రాసమును వేరున ప్రాసంబు విధింపంబడియె.

ఇకఁను ప్రాసస్థానములోని "జ్క" అనుశబ్దంబు సంయుక్తంబును, వేఱొక ప్రాసస్థానమందలి "ంక" అనుశబ్దంబసంయుక్తంబును నగుచుండఁగా, సంయుక్తాసంయుక్తంబులకు నిట్లుసంయుతప్రాసంబు చెల్లునని శంకింపు లేని నిమునను. [1] అనుస్వారము [ం] [2] విసర్గము (ః) (3) జిహ్వామూలీయము (ఁక) [4] ఉపధ్మానీయము (ఃప) "అఇఉణ్" సూత్రములో, అకారము తర్వాతను శర్వర్ణముల మధ్యమందును [శ, ష, స] పఠింపవలయునని "హయవరట్" సూత్ర భాష్యమందు నుద్ఘోషింపంబడియె. అట్లుపఠింపుటం జేసి యను స్వారాదులచ్చులనియు హల్లులనియుఁగూడ శాస్త్రంబున వాడంబడును. ఉపధ్మానీయము (ఃప) హల్లుగూడ నైనందులకు ఫలంబిట్లు మహాభాష్యంబున నకాశింపఁబడియె. "ఉః జ" (ఆర్జవే) అనుధాతువునకుపధ్మానీయ ముపధ ( )గాన నట్టి యుపధ్మానీయము నకు "ఝలాంజశ్ఝశి" అనుసూత్రంబున "బ" కారంబురాఁగానైన సుబంతం "ఉబ్జకః" అనియుండు. దీనికి సంబోధనాంతము "ఉబ్జక!" అనియగును. (ఇట మూ (డంకెప్లుతమునను గనుఱుతు.) (ఇచ్చట "గుర్వోనవృతో నంత్యస్యాప్యేకైకస్య ప్రాచామ్" "అ ా పా ౮ ౨ సూ ౮౬) అనుసూత్రమున బకారజకారసంయోగమునకు నుండుంచి గద్దయైన యుబ్జశబ్దమందలి యు [ఉ] కారము గుప్తతంబునద్వ్యనని యుదాహరించి

పిమ్మటను "పూర్వత్రాసిద్ధమ్" అను శాస్త్రము ననుసరించి, పూర్వంబైన ప్లుతంబు చేయు నట్టి సమయంబునఁ బరశాస్త్రాదేశమైన బకారంబసిద్ధంబుగాఁగా బకారస్థానియైన యు పధ్మానీయంబే యుదాహరణమందుఁ గనఁబడుటం జేసి హల్ సంయోగమునకు ముందున్నయు [ఉ] కారము కానందున నియ్యది గురువుగానియు నందునఁ బ్లుతంబు రాదనియుఁ బతంజలిభగవానులు శంకించుకొని శర్వర్ణంబుల (శ, ష, స) మధ్యమంబుఁ బఠింపఁబడి నందున నుపధ్మానీయానుస్వారాదులు హల్లులనియు నిట నుపధ్మానీయ జకార సంయోగంబునకు ముందుండుటం జేసి గురువగుచున్న యుబ్జకశబ్దము మొదటి యు [ఉ కారమునకుఁ బ్లుతంబు నిర్బాధమనియు సమాధానంబు చెప్పిరి. అట్లే ప్రకృతంబునను, న నుస్వారము శర్వర్ణములనడుమను [శ, ష, స] బఠింపఁబడుటం జేసి హల్వర్ణంబు గావున "ంక" ఇత్యాదులయందలి బిందుకారాదుల సంబంధము సంయుక్తంబై యున్నపాద ములయందలి జకారక కారాది సంయుక్తంబునకుఁ బ్రతిబంధకంబగుచుండ సంయుక్తప్రాసం బునకు వైపద్యంబులందు భంగంబు కలుగ నేరదు. అనుస్వారము హల్లుగావుననే బిందు పూర్వకమైన యీ క్రింది ధకారాదిప్రాసంబులు, ఈహకారమకారాది సంయుక్తములు వోలె సంయుక్తంబులైనందున వానికి ముందక్షరమ్ములు [అనఁగాఁ బాదాదివర్ణంబులు) హ్రస్వంబును దీర్ఘంబును గూడఁ గావచ్చును.

ఉదా:—కం॥ ఆంధునకుఁ గొలిచె వెన్నెల। గంధర్వాంగనల పొందుగావని సం సా। రాంధువునఁ గూలెదఁ కట ది। వాంధము నెఱుఁగని గొంది వడఁగెరభంగిన్॥ మను ౨ ఆ:

కం॥ బ్రాహ్మణుఁడింద్రియవశగతి। జిహ్మేతరవైకనపు రచిత్త జనితా। జిహ్మగము లపాలై చెడు। బ్రహ్మానందాధిరాజ్యపదవీస్యుతుఁడై॥ మను ౩ ఆ

ఆ॥ వె॥ క్రిందజడ్డలును బిఱుఁదబిందువులును। నూఁదప్రాసములనునుండ వేని। హ్రస్వమొకటి నిడుదయొక్కటంబొక్కటి। వాని మొదలనిలుప వచ్చునెందు॥ అని లక్షణ గ్రంథంబులయందు బిందువులను విశేషించి పేర్కొనుట యుక్తోద్దేశపక్ష గ్రాహులను స్పష్టార్థమే కాని వేఱే ప్రయోజనంబు లేదని తెలియునది.

ఇచటఁ గొందఱు బుద్ధిమంతు లిట్లు శంకింతురు:—పైనిఁ జూపఁబడిన భారతాది పర్వగతపద్యములయొక్క పాఠంబు "హం। ధాత్రీసుక్షితీసంతుసంబునఁ - గాంచిరె

యేముగంబునక॥" అని యిట్లు మాంధాతృశబ్దపాఠంబు ఋకారముతోనే యుండవల్ల యునుగాని "మాం। ధాత్రరఘుక్షితీశులు" అని త్రాపడితోఁ బఠింపఁగూడదు. కావుననే యప్పకవి "వ॥ మాంధాతృశబ్దము ఋకారాంతము గనుకఁ దకారముక్రింద నున్నది వట్రువసుడిగాని త్రాపడిగాదు" అనియుద్ఘోషించుచు సంయుతాసంయుత ప్రాసంబునొద్ద నీపద్యమును ఋకారాంతమాంధాతృశబ్దపాఠముతో నుదాహరించెంగదా. కాఁబట్టి పద్యములోని "మాంధాత్రరఘుక్షితీశు" లన్న యభూతపూర్వపాఠంబును బురస్కరించుకొని పూర్వోద్దిష్టంబయిన వాచోయుక్తిపాటవప్రకటనంబు వృథాప్రయాసంబేకాని వేఱొకటిగాదని కొందఱవాంతరశంక శంకించెదరు. అటులనవలదు. మేమీవలిలో సమాసపరిచ్ఛేదములోని (24) సూత్రమునొద్ద నీపద్యముదాహరించి ప్రకృతంబున వక్తవ్యాంశము శబ్దసాధుత్వనిర్ణయంబేయని యెంచుకొని ఋకారయుక్తపాఠంబును రేఫయుక్తపాఠంబును నుభయంబును వ్యాకరణప్రకారంబున సాధువులని స్థూలదృష్టిని "తుష్యతు దుర్జనః" అను న్యాయంబున సిద్ధాంతము చేసితిమిగాని పద్యలక్షణంబునకు భంగంబుగలిగింపకుండ నేపాఠము సాధీయముగానున్నదో నిశ్చయించి ప్రదర్శించుట యనవశిష్టంబైనది. ప్రకృతవక్తవ్యాంశంబునకుఁ బెక్కులుదాహరణపద్యంబులున్నను "ఏకక్రియా ద్వ్యర్థకరీబభూవ" అను న్యాయంబున రేఫయుక్తపాఠంబే పద్యలక్షణంబునకు సమన్వయంబుగా గానున్నదని చర్చాపూర్వకంబుగా నిశ్చయించుటకుంగూడ నాపద్యమే యిప్పటి వక్తవ్యాంశంబున నుదాహరించితిమి. కావ సావధానమనంబున నాకర్ణింపవలయు. తే. గీ. రలలు తమక్రిందజడ్డలై త్రాలు వ్రాలు। ప్రాసవర్ణంబులైవాని బాసియైనఁ। గూడియైనను బెంపుడురలను నిలుము। సంయుతాసంయుతప్రాససంజ్ఞఁ దనరి॥ ॥ అప్పకవీయము 3 ఆశ్వాసము॥ అర్థము, త్రాపడితోఁగాని లేక లాగుడితోఁగాని సంయుతములైన హల్లులతోఁ గేవల (అసంయుతములు) హల్లులుగూడఁ బ్రాసంబులుగా నుండఁదగునని ఫలితార్థము.

పైలక్షణపద్యంబునూపి భారతములోని ప్రకృతపద్యంబును ఋకారయుక్తమాంధాతృశబ్దముతో రేఫసంయుతమునకు నిటు లుదాహరణముగానిచ్చె. :—

ఉ. క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియవైశ్యశూద్రులనఁ గాఁదగు నాలుగుజాతులన్ స్వచా

ఋతముఁ దప్పకుండఁగఁ బరీక్షితుకాచినయట్లు రామమాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె? యేయుగంబునన్. భా. ఆది-౨ ఆ.

ఈపద్యమునందు "క్షత్త్రియ, చారిత్ర" అని తక్కిన పాదములందుఁ బ్రాసము రేఫసంయుతంబై నాల్గవపాదమందు "మాంధాతృ" అని రేఫహల్లుతో సంయుక్తముగాక కేవలము ప్రాసతకారము ఋకారాచ్చుతో నున్నను వైలక్షణ్యపద్యము ననుసరించి ప్రాసంబుచెల్లునని యప్పకవి తాత్పర్యము. ఈపద్యమును రేఫశ్లిష్టమునొద్ద నుదాహరించుట కేవలముఁ బ్రమాదాయత్తము. రేఫయుక్తాక్షరమును రేఫహీనాక్షరమును బరస్పరముఁ బ్రాసముగా నుండఁదగియున్నను "క్షత్త్రియ, చారిత్ర" అని హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారముతో "మాం| ధాతృ" అనుచోటున సంయుక్తముగాని తకారము దీర్ఘపూర్వకంబై యెట్టులు ప్రాసంబుగా నుండ జాలును? ఆ. వె. క్రిందజడ్డలును బిఱుంద బిందువులును| నూఁది ప్రాసములకు నుండెనేని| హ్రస్వమొకటి నిడుదయక్షరంబొక్కటి| వాని మొదల నిలుపవచ్చు నెందు|| అను లక్షణపద్యము ననుసరించి సంయుక్తప్రాసంబునకును బిందుపూర్వకప్రాసంబునకును బూర్వమందే హ్రస్వదీర్ఘనియమము లేక యచ్చు నిలిచియుండవచ్చునుగాని సంయుక్తముగాని కేవలప్రాసాక్షరమ్మునకుఁ బూర్వమున నటులుండఁగూడదని లక్షణము చాటుచుండఁగాఁ బ్రకృతంబున "క్షత్త్రియ" ఇత్యాదులయందు హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారప్రాసంబునకు "మాం| ధాతృ" అను నాల్గవపాదమందు సంయుక్తముగాని కేవల తకారప్రాసంబు దీర్ఘపూర్వకంబై ప్రతిఘటంబుగా నెట్టులుండఁజాలును? ఒకవేళ గీ. రలులు తమక్రింద జడ్డలై క్రాలువ్రాలు...|| అనెడివిధి "ఆ. వె. క్రిందజడ్డలును బిఱుందబిందువులును..." అనునట్టివిధిని సయితము బాధించి ప్రవర్తిల్లునుగాన నిట దీర్ఘపూర్వకమైన యసంయుక్తతకారము హ్రస్వపూర్వకమైన సంయుక్తతకారప్రాసంబులు బ్రతిఘటించి ప్రాసంబుగా నుండవచ్చునందు రేని యటులు వచింపఁగూడదు.

శా. నాతో మార్కొనలేరు నిర్జరపురీనాగేంద్ర బృందారకా
రాతుల్మున్నుగ దేవసంఘములు ఘోరద్ధీర సంగ్రామ కుం
డీత్రైలోక్యమునందుఁ గల్గఁడు రణం బేచోట లేకుండఁగాఁ
జేతుల్వేయువృథాభరంబగుచువచ్చెన్ దేవ యీ మేనికిన్. (సోము హరివంశము.

గీ. హాక్షిప్రనేత్రాంగనాశచీశక్తులధిక । పంక్తిమంబునఁ గుంభనికుంభదైత్య [కలిడి.
హాంత్రిఁబూజింపుదురుగ్ర యామంత్రములను । స్తోత్రములుచేసి మంగళారాతి
(దేవీవిజయము.

ఇత్యాదిసోదాహృత పద్యంబులందే దీర్ఘపూర్వకంబులును, సంయుక్తంబులును బిందుపూర్వకంబులునైన ప్రాసస్థలంబులలో సానకాశమైనట్టి "గీ. రలలు తమక్రింద జడ్డలై క్రాలుఁ బ్రాలు॥ అనునట్టివిధి చరితార్థమైనంగున ఆ॥ సె॥ "క్రిందజడ్డలును బిందువులును॥ అనెడివిధి నెట్టులు బాధింపఁజాలును? కాఁబట్టి "మాం॥ ధాత్రగఘుక్షితీశులు ముదంబున గాంచిరే? యేయుగంబునన్" అను రేఫయుక్తమే పద్యలక్షణాను కూలంబుగానట్టిపాఠంబే ప్రశస్తంబు. ఈ "మాంధాత్ర" పద్యంబునఁదక్కినపాదత్రియం బునందలి ప్రాసములు హ్రస్వపూర్వకంబులైనను జతుర్థపాదంబున దీర్ఘపూర్వకంబైనను సర్వత్రసంయుక్తస్థలంబుగానఁ బూర్వోక్తవిధిచేతను నిర్బాధంబని యెఱుంగునది. ఈసమస్తము ప్రశస్తముగా నవలోకనము సేసియేయడిదము సూరకవి "గీ॥ ధరబుకారాంత శబ్దంబు ద్వంద్వమైన। రేఫమగుమఁ బ్రివర్తిల్లు దృఢముగాను। పత్రిసరహాయ వాగ్వధూనేత్ర (వాగ్వధూనేత్రు-వాణీపతి) ముఖసు। రాభివందితపాదాబ్జయన్నయట్లు" కవిసంప్రథమ 28 ల అనుపద్యలక్షణంబునకుఁ బ్రకృతపద్యములోని మాధాంతృశబ్దంబు రేఫాదేశయుక్తంబగుటను యుక్తంబుగానెంచి యుదాహరణముగా నిర్దేశించె. కావున నట్లు ఖండించి నిశ్చయించిన యడిదము సూరకవీంద్రునియడిపంబే బిడెపంబై ప్రబలినం దులకు నెంతయు సంతసింపుచున్నారము.

ఈ ప్రకరణమందే, శా. లోకత్రాణరతింబదాదిరు మహీంలోకప్రవేశోత్క భా। పాక్షిప్తప్రథమద్వితీయపద.....అను రాఘవపాండవీయములోని పద్యమందలి ద్వితీయప్రాసంబును లకారశ్లిష్టమున కుదాహరణముగా నితండు సూపుటయు నేత్రోక ప్రామాదంబు. "బుదుపథాచ్ఛ్వాకపిక్ష్వశ్రే" (అ 3 పా ౧ సూ ౧౧౦) ఇత్యాది సూత్రంబులవలన నయ్యది యప్పుగాని హల్లుగాదు మఱియు నితండు కవికర్ణరసాయనము లోని పద్యంబును బ్రమాణముగా జూపి మాంధాతృశబ్దంబునఁ బ్రాపడినిషేధింపును బుకారాంతమని సాధింపుట ద్వంద్వసమాసమందు బుకారాంతములకు రేఫాదేశము

నన్నయాంశము మఱచినట్లు తోఁచుచున్నది. కాననే యీమాంధాతృశబ్దంబు భారతరచనా సమయంబున ఋకారముతో నున్నదనియుఁ బూర్వోక్త రాఘవపాండవీయపద్యపాద ప్రాసంబు లకారశ్లిష్టమనియుఁ భ్రమియించి యేతత్కవిప్రయోగమూలకంబుగా రేఫలకార సంయుతప్రాసంబులు కేవల హల్లులతోఁగూడ హ్రస్వపూర్వకత్వ దీర్ఘపూర్వకత్వాదిసకల నియమముల నుచ్ఛేదించి యథేచ్ఛముగాఁ బ్రాసములై యుండవచ్చునని యెంచి యీకవి "గీ॥ పాఁడిద్రచ్చఁగనిమ్ము నాతండ్రికన్న! । వేఁడుకొనియెద నందాఁకఁ బండ్లుదినుము" అని తేటగీతిని రచియించి యుదాహరణముతోఁ బ్రకృతాంశమును నిశ్చితంబుగాఁ దేటపఱుచుచుండె. కాఁబట్టి ప్రమాదబాహుళ్య దూష్యంబైన యీప్రకరణంబున నితం డుదాహరించిన ఋకారయుక్తపాఠంబు భ్రమాస్పదంబనియు స్వవాదంబునకు ముఖ్యాధారంబగు రేఫయుక్తమాంధాతృశబ్దపాఠంబే ప్రమాణంబనియుఁ బ్రదర్శించుటకై ప్రసక్తానుప్రసంజన వశంబున నింతవఱకుఁ జర్చింపఁబడియెంగాన నిఁక విస్తరంబులోఁ జాలును.

(2) అథవా, బ్రహ్మం బుపాదానకారణంబుగాఁగల యీప్రపంచంబు తత్త్వవేత్తృదృష్టికిఁ గనంబడక కారణమైన బ్రహ్మంబే భాసిల్లునట్లులు. అనుస్వారం బుపాదానంబుగాఁగల పంచమవర్ణంబాంధ్రతత్త్వవేత్తలదృష్టికిఁ గానిపింపక కారణమైనయనుస్వారంబే యులకరించుచుండెనని యూహించెద. వెండియు వేఱొకకారణంబుంగలదని త

1 2 8

లంచెదను. అవర్ణాతీతమయి, సద్వృత్తరూపరేఖావిలాసంబున నేకజన్మంబెత్తి ముక్తా

4 5 6

త్మలైన యనుస్వారం బడుగిడినచోటునఁ బంచమవర్ణంబులై వికృతరూప రేఖావిలాసంబునఁ బలుపుట్టువులు (ముఖనాసికం బుభయమున జనించినవి) పుట్టి యంతేవాసులైన (మాతంగజాతీయములును, వర్గాంత్యములును) ఙకారాదులం జేసుపుట యుక్తంబుగాదని యాంధ్రవిద్యావిశారదులైన బ్రహ్మణ్యులు సంశయించివానిని బహిష్కరించిరి. పూర్ణంబైన యాలోకంబు (నిండువెలుంగు=బ్రహ్మము) చింతించి యాలోకప్రకారం బగునని యెన్నిన పరిజ్ఞాతలు నిష్కలంకులైన యాలోకంబును సేవగించి వట్టులు గుణవంతులై (బాహ్యప్రయత్నములుగల) (ముక్కు) ముంగరలైన (నాసికయందు నలిగినవని [illegible]) పూర్ణానుస్వారంబుననే స్వకార్యసాఫల్యంబగునని [illegible]

నుండి యాంధ్రభాషారహస్యవేత్తలు సర్వదా లోకులనోళ్లఁబడుచుండెడి (ముఖస్థానాభ్యంతరప్రయత్నవంతములైన) యీయంత్యవర్ణంబులం బాటించిరి గాని యంతటిపరిపూర్ణులు వీని గుట్టుమట్టులు జాడం గట్టఁజాలకపోయిరి యని యనంగూడదు.

చకారాదివర్ణంబు లాదేశంబుకాకుండనే యనుస్వారమాత్రమునఁ దెలుంగునఁ గార్యసాఫల్యమెట్లులగునని వారుతలంచిరో వినుండు.

(1) అఞ్చ్యాః వఞ్చకః — ఇత్యాదులయందు "అనుస్వారస్యయయి పరసవర్ణః" అను పాణినీయసూత్రంబున ననుస్వారాదేశంబయిన ఞకారాదులు, తత్సమభాషాభాగంబున నట్టిశబ్దంబులు తెలుంగులోనికి నే తెంచినతోడనే, తమకుస్థానియైన యనుస్వారస్వరూపంబు నాంధ్రభాషామర్యాదం జేసి యొందుచుండెడి. (1) రోచి, రోచులు (2) వీచి, వీచులు (3) వాజి, వాజులు — ఇత్యాదులయందు నాంధ్రభాషాపరిపాటింబట్టి భాషాంతరీయమైన దంత్య చ, జ, లచేతను సయితము ప్రాతిపదికంబులోని సాంస్కృతిక తాలవ్య చ, జ, లకు వికారంబుగలిగినప్పుడు తత్సమత్వంబు నకు భంగంబు కలుగకయుండఁగా నిప్పుడను నాసికవర్ణంబులు తనుస్థానియైన బిందుస్వరూపంబును నొందినంత మాత్రమున నట్టి తత్సమత్వవ్యవహారంబునకుఁ గొఱంతరా నేరదనియే వారి తాత్పర్యము.

---

(1) అనుస్వార, విసర్గ జిహ్వామూలీయో, పధ్మానీయములు, 'అ ఇ ఉ ణ్' అనెడి సూత్రములోని యకారము తర్వాతఁ బఠింపఁబడెనని భాష్యము స్మరించునది; అనింద్యమైనదనియు నర్థాంతరము.

(2) వర్తులాకారమయినది; మంచిప్రవర్తనయు, మంచిరూపము, విలాసముగలదని యర్థాంతము. (3) ఏకస్యాం=నాసికాయాంజన్మ: (సర్వనామమునకు వృత్తియందు పుంవత్త్వము) నాసికయొక దానియందే పుట్టినది; ఒకజన్మమేయెత్తి అనుటచే జన్మాంతరమునకుఁ దగిన పాపములేక పుణ్యముగలదనియు నర్థాంతరము. (4) ముత్యమువలెనున్నది; జీవన్ముక్తమయినదనియు నర్థాంతరము. (5) వర్గములోనైదవ వర్ణంబులు; అంత్యవర్ణములోనివనియు నర్థాంతరము. (6) వ్రాయుటలో భేదముగలవని ఫలితార్థము; వైద్యరూపుఁ వైద్యశ్రేష్ఠములని యర్థాంతరము.

అజ్క—అనెడి జకారఘటితశబ్దంబున "జ్క" అనునట్టి విశిష్టములోనుండిన జకారమందు నానునాసిక్యకంఠ్యత్వములు, గ్రింది కకారమందుఁ గంఠ్యత్వము నున్నది గాన నట్టిసముదాయమందు నేకానునాసిక్య ద్విగుణకంఠ్యత్వంబులు వెలయుచుండు నని యీపటలిలోఁ జెప్పితిని.

అంక—అనెడి యనుస్వారయుక్తరూపమందున్న "ంక" అనునట్టి సముదాయములోనుండిన బిందువునకు నానునాసిక్యధర్మంబును, తర్వాతికకారమందుఁ గంఠ్యత్వము నున్నవి గావున నట్టిసంఘాతమందు నేకానునాసిక్యకంఠ్యత్వములు పరిల్లుచుండు. కనుక పైరూపద్వయంబులోఁ దారతమ్యము విమర్శించినచో నుభయత్ర యానునాసిక్య కంఠ్యత్వములు సమానముగానే యుండెంగాని రెండవరూపంబునఁ గంఠ్యద్విత్వంబుమాత్రంబుండ లేదు. అఙ్క్ష—ఇత్యాదిశబ్దంబులయందు "అచోరహాభ్యాంద్వే" అనుసూత్రంబునఁ గకారమునకు ద్విత్వంబగుంగాన నొకమతంబున నుచ్చారణలోఁ గంఠ్యద్విత్వంబు స్ఫురించుటయు, "సర్వత్రశాకల్యస్య" అనుశాకల్యునిమతంబున నేకకంఠ్యత్వమే స్ఫూర్తివిషయమగుటయు, నిట్టులుండునో యట్టులే యంకశబ్దాదుల నుచ్చరించుచో గీర్వాణవ్యాకర్తల మతంబున ద్విగుణకంఠ్యత్వంబును నాంధ్రవ్యాకర్తలమతంబున నేకకంఠ్యత్వంబును స్ఫురించుననిన మతభేదంబుగలదు. వర్గీయాక్షరములకు ముందున పంచమ వర్ణంబులే యుచ్చారణంబులో సంభవించుట (అనఁగా ద్విగుణ కంఠ్యత్వాదులు) యనుభవసిద్ధంబుగా నున్నది గాని బిందూచ్చారణ మట్టులేదనియందురేని యాక్షేపింపవలయు. సంస్కృతభాషలో "త్వఙ్ కరోషి; త్వంరోషి" ఇత్యాదిపదాంతస్థలంబున వర్గీయవర్ణంబులకుముందు బిందువుపాక్షికంబుగా నుచ్చారణంబులో ననుభవసిద్ధంబనియే గదా పాణినిచేత „ వాపదాంతస్య „ అను సూత్రమున విధింపఁబడినది. అందు నచ్చటను వర్గ వర్ణంబులకు ముందు బిందువుచ్చారణంబులో లేదని నచింపఁగూడదు. మఱియుఁ, బ్రకృతాంశములో గీర్వాణభాషను దృష్టాంతముగా స్వీకరించుకొన్నవారికిని „ పచ్చెం గమలాక్షుఁడు „ ఇత్యాదిపదాంతస్థలంబునఁ దెలుంగుభాషలోఁగూడ బిందువుపాక్షికంబుగా నచ్చారణలో ననుభవసిద్ధంబే యనకతీరదు. సంస్కృతభాషలోఁ బోలెఁ దెలుంగుభాషలో మేమును నేకపదంబునడుమ బిందు ననుభవసిద్ధంబు గాదం యని నుడువుదురేని యట్టులు సర్వత్ర పదమధ్యంబున బిందువు లేనట్లు గూడ [illegible] కృతప్రాకృతవ్యాకరణంబై

షడ్వాప్పాసంధిప్రక్రియయందు పకారాదిశబ్దంబులకు "రవలామథశ్చ": (అ ౧ పా ౪ సూ ౭౮) అనుసూత్రమున రేఫలోపంబుగలిగి "సోః,, (అ ౨ పా ౨ సూ ౧౩) అనుసూత్రముననైన "వకో,, అను రూపంబునకు "స్వరేభ్యోవక్రాదౌ,, (అ ౧ పా ౧ సూ ౪౮) అనుసూత్రంబునఁ బదమధ్యంబునఁ గల్గినబిందువునకు "వగేఽంత్యః,, (అ ౧ పా ౧ సూ ౪౭) అను సూత్రంబునఁ బాక్షికత్వంబంగీకరింపఁబడినది. మఱియు, "ఙ ఞ ణ న మానాం,, (అ ౧ పా ౧ సూ ౪౧) అను సూత్రంబున (పరాఙ్ముఖః—పరంముహో) [కఞ్చుకః—కంచుఓ) ఇత్యాదిశబ్దంబులయందుఁ బాణినీయవ్యాకరణంబుననైన ఙకార ఞకారాదులకుఁ బ్రాకృతవ్యాకరణంబున వాల్మీకిమహర్షి చేత బిందువు విధింపఁబడియె. వ్యాకరణంబులోఁ బదాంతమునందుంబోలెఁ బ్రాకృతవ్యాకరణములోఁ బదమధ్యంబునను బిందూచ్చారణము పాక్షికంబుగా ననుభవసిద్ధంబైనట్టులు కరతలామలకంబుగా నిట్లు గానిపించుచుండె. సాంస్కృతికశబ్దంబులు శాస్త్రప్రకారంబునఁ బ్రాకృతభాషలో సంస్కరింపఁగొనుచోఁ బదమధ్యంబందలి పంచమవర్ణంబులిట్టులు పాక్షికంబుగా బిందువులగుచుండగాఁ నట్టి పంచమవర్ణపక్షపాతంబుం బాఱంద్రోలి తెలుంగులోనికిం దెచ్చుకొన్న సాంస్కృతికపద [తత్సమపద] మధ్యమందుఁ గువలయానందంబైన బిందువే యెల్లప్పుడు నిందునర్మంబౌ (ఇందుక్=ఈతెగునందు; ధర్మంబు=న్యాయము; నంప్రసన్నతనియు నర్థాంతరము) ననియెంచి యాంధ్రవ్యాకర్తలు నన్నయభట్టారకాది సర్వజ్ఞులు (ఈశ్వరులును) సర్వదా దానిని శిరసావహించిరి.

అందువనే యాంధ్రతత్త్వవేత్తలమతంబున ననుస్వారయతి బిందుయతులు వేఱుగాఁ జేర్కొనంబడినవి. పంచమవర్ణంబులే యిందు నుచితంబైనచో ననునాసికాక్షర, సంయుక్తయతిభేదంబుననే గతార్థమగుంగాదే!! అఙ్క—ఇత్యాదిశబ్దంబులయందలి కణ్వత్వత్వాదుల యుచ్చారణభేదం బప్పిష్టభేదంబని యాంధ్రతత్త్వవేత్తల మతంబున నియ్యదియవివక్షితంబయ్యె. కావునసే "శత్రర్ధేతూతచ్చానోః" ఆం. శ. సంధిపరి. సూ. ౧౨ "తస్యస్యాప్స్) పూర్ణబిందురపి" (సంధి. ప. సూ. ౧౩=బాలవ్యాకరణక్రియాపరి. సూ. (౨౮౪) వర్తమానార్థకమైన చువర్ణకము పరమగుచో 'అను' మొదలగుధాతువులయొక్క ఉత్వంబునకు లోపంబుగాని లేక, నుశబ్దస్థానంబున బిందువున్నగాని యగునని సూత్రద్వయంబునకు ఫలితార్థము.) అని పైనిర్ణయించిన ఓంధువిధ్యా

యేకసూత్రంబు చరితార్థంబగుచున్నది, తెలుంగులో సాధునికులమతప్రకారంబున బిందువు రాక పంచమవర్ణంబే విధియైనందున నిట్టిచకారమెప్పుడును దంత్యంబే యగుం గాన నిష్పత్తి పరమగునప్పుడు (తమమతంబులోఁ బచ్చ, సజ్జ ఇత్యాదులుంబోలె) దంత్యత్వానునాసిక్యధర్మద్వయంబుగల నకారమె నిత్యంబగుచుండఁగా మొదటిసూత్రమునకైన వ్యుత్పత్తిలోపమే సార్థకంబై రెండవసూత్రమునకైన బిందువిధానంబు వ్యర్థంబగును ఇట్టి పాక్షికబిందువిధానంబునఁ బ్రాచీనులమతంబులోఁ దెలుంగున బిందువే కాని పంచమవర్ణంబులు లేవని సిద్ధాంతమగుచున్నయది. కనుకఁ దెలుంగులోనికి ఞకారఙకారములపూర్వముగాఁ దెలుపవలసినయవసరంబులేదు. మఱియు, "పరిచ్చ" ఇత్యాదిశబ్దములయందు నిట్టిలు దంత్యంబౌ చకారాదులకు ముందు దంత్యానునాసికంబైన నకారమే విధాయకంబుగావున సాధునికులమతంబున మీఁదుమిక్కిలి యింకొకయనర్థంబును జొరంబడును.

శా॥ ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లపొంగారఁ బై
యంచుల్ మ్రోవఁగఁ గౌగిలించి యధరంబాసింపవా !! శ్రీహరీ!
యంచున్ బ్రాహ్మణుఁడోరమోమిడి తదీయాంసద్వయంబంటి పొ
మ్మంచుంద్రోచెఁ గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్॥ మను. ౨ ఆ.

ఉ. అంచితవాహనాకలిత యానము దేరఁగఁ బంచినన్నె
క్కించి సహాధిరూఢుఁడయి కేల్ దనకేలనమర్చి సత్కథా
సంచయవర్తనుండగుచుఁ జారుముఖాబ్జవికాసమొప్పన
ర్తించుచుఁ బుణ్యలోకములు ప్రీతియెలర్పఁగ నాకుఁ జూపినన్॥ భార. అను. ౨ఆ.

మొదటిపద్యమున మొదటిపాదములోని "ప్రాంచిత్" అనుశబ్దంబు సాంస్కృతికంబైనందునఁ దాలవ్యమగు చకారమునకు ముందుబిందువు ఞకారమై "ప్రాఞ్చత్" అని ప్రాసస్థానంబున ఞకార చకార సంయోగముండును. తక్కిన మూఁడుపాదములలోని "అంచు" శబ్దంబు తెలుఁగైనందున దంత్యమైన యునంతచకారమునకు ముందున్న బిందువు నవీనులమతంబున నకారమై "అన్చు" అనురీతిని ప్రాసస్థానమున నుండవలసివచ్చును. ఇట్లే అంచిత సంచయశబ్దంబులు ప్రథమతృతీయపాదముల సాంస్కృతికములు గావననునాసికవర్ణఘటితములై "అఞ్చిత" "సఞ్చయ" అని యుండవలయు ద్వితీయపాద

ములోని "ఎక్కించి" శబ్దము తెలుఁగైనను తాలవ్యచకారము గాన ఇకారయుక్తమే "ఎక్కిఞ్చి" అనినవీనులమతమున నిల్చుండును. నాల్గవపాదమందలి "వర్తించు" శబ్దములోని చకారము దంత్యము గాన నిట్టిప్రాసస్థానమున నకారచకారసంయోగ మధునాతనులమతము ననుసరించియుండక తీరదు. ఇట్లు రెండుపద్యంబులయందు నొకపాదమున ఇకార, చకార సంయోగంబును వేఱొకపాదమున నకార, చకారసంయోగంబునునుండి సమానములుగా లేనందున నాంధ్రకవితాపితామహాది పూర్వకవిప్రయోగంబులు లక్షణగ్రంథమ్ముల ననుసరి పడక యవలక్షణంబులగుట తటస్థించును. మఱియు, నపూర్వముగా దోషాపత్తిసయితము సంభవించునని తెలుపుటకై స్పష్టార్థమీక్రింది నవలక్షణబద్ధంబు రచియించి చూపఁబడుచున్నయది. కం॥ వనజాక్షి సత్పతిం గా। న్చనుజన్మాంతరమునందు నోఁచిననోముల్। గనుగొన్నపంటచేన। న్చను బిడ్డలు దెల్పుమందు నుడివమ్మనునే? ఇట నాల్గవపాదములో, ప్రాచీనులకు సమ్మతమైన యతివోలె ద్వితీయపాదములో సయితము (నవీనులమతమున) నకారచకార సంయోగమునంజేసి నకారయతిరూపమైన దోషాపత్తి దువాళించును అందునఁ బ్రాచీనకవికృతప్రయోగంబునకు నష్టంబును, నపూర్వంబైనన కారాపత్తివలన లక్షణభ్రష్టంబును బ్రబలి, కృతనాశాకృతాభ్యాగమదోషంబుల లోకాయతంబయ్యెడిని. ఇంక నతివిస్తరంబుతోఁ జాలుంగావున నిట్టి బ్రహ్మణ్యులైన ప్రాచీనప్రబంధకర్తల దర్శనంబునకు భీతిల్లి పంచమున్నవ్యక్తిసంయోగంబులు పటాపంచలైపోవ, ననాద్యంతంబై పరిపూర్ణంబైన పరబ్రహ్మం బీప్రపంచంబునం బోలె నీపూర్ణానుస్వారంజేపవిత్రంబైన యిబ్బహుళాంధ్రోక్తిమయ ప్రపంచంబునం బ్రబలుండై పరిఢవిల్లుంగాక!!

---

## అజాదిసంధి విషయము



శ్లో॥ సంహితైకపదేనిత్యా । నిత్యాధాతూపసర్గయోః। ని
త్యాసమాసేవాక్యేతు । సావివక్షామపేక్షతే॥

అనువచనంబున సంస్కృతభాషలో నచవకావ్యమందు సంధిసంభవమునియిచ్ఛను బట్టియున్నది. సంహితయున్నప్పుడే సంధికల్గును గాని వేఱొకయప్పుడు గలుగదు. సంహితయనఁగా నుచ్చారణలో వర్ణములకత్యంతసాన్నిధ్యము. సంహితానాం స్వభావసిద్ధాగమాత్రాతిరిక్తకార్యనాయోన సాహిత్యం, అవ్యాకరణశాస్త్రవ్యాఖ్యాతలు

## నుజ్యంతభవత్యర్థవిమర్శనంబు.

---

ఉ॥ మానవతిప్రియుండవు సమస్తవిదుండవు చెప్పుమయ్య యీ
లోకములోనివర్తనములుం దగువాని నెఱుంగు దవ్వనిం
బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ
జేకొనువారమట్టి బుధసేవితుఁ గానఁగ మాకు నందగున్॥ భార. అది ౭ ఆ.

పైపద్యంబున రేఖతో నిరూపింపఁబడిన "కొను" అను శబ్దంబు నుజ్యంతంబగు భూ (అగు) ధాతువు. అగుధాతువునకు నుజి పరమగుచోఁ (క్రి. పరి. (91) సూత్రమునఁ గాదేశము రాఁగా నైన రూపంబు. ఈక్రియాపరిచ్ఛేదములోని (40) సూత్రమునఁదు మర్థమందును, భావలక్షణార్థమందును, నుజివర్ణకంబు విధింపఁబడుచున్నదిగదా!! ప్రకృతప్రయోగమందలి యగుధాతువున కేయర్థమందును నుజివర్ణకంబు సందర్భించునో కొంచెము విచారింతముగాక!! యజ్ఞదత్తుండు పురోహితుండుగాఁ (అగుటకు) దలంచెనన్నవాక్యంబున ముఖ్యక్రియయగు తలంచుటకును, బురోహితుండగుటకును, యజ్ఞదత్తుఁడేకకర్తయైనట్టులు "బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ జేకొనువార" మను వాక్యంబునఁ జేకొను క్రియకును బురోహితుండగుటకును నొకరు కర్తగానందునఁ దుమర్థంబిట సందర్భయుక్తంబుగా నేరదు. ప్రకృతపద్యంబునఁ బ్రకరణసందర్భమునంజేసి యర్జునాదులు చేకొనువారును, బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండగుటయుఁ గాన నగుధాతు చేకొనుధాతువులకుఁ గర్తలు వేర్వేఱుగనుండుట స్పష్టమగుచున్నది. "బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండుగా నర్జునాదులు ద్రౌపదిని జేకొనిరి" యన్నవాక్యంబునఁ జేకొనుధాతువునకుఁ గర్మము ద్రౌపదియై పురోహితుండగుటకుఁ గర్తయైన బ్రాహ్మణముఖ్యుఁడు ప్రథమాంతపదముచే బోధింపఁబడినట్టు లీవాక్యమున నుండలేమిగాన నిట భావలక్షణార్థంబును బొసంగనేరదు. ఈవాక్యంబున రేఖాచిహ్నితములైన రెండు క్రియలలోఁ జేకొను క్రియ లక్ష్యము. "కాఁ" (అగు) అను క్రియ లక్షణము. ఈలక్ష్యలక్షణక్రియలకు రెండింటికిని బ్రథమాంతములచేతఁ జెప్పంబడి యర్జునాదులును, బ్రాహ్మణముఖ్యుఁడును గర్తలుగా నన్వయించుచుండిరి గావున భావలక్షణార్థము సమంజస

జరుగుచుండును. ఇఁకను "బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ జేకొనువార" నన్న పద్యవాక్యంబందునో!! బ్రాహ్మణముఖ్యుఁడు చేకొనుధాతువునకుఁ గర్మంబుగానన్వయిం చుచు ద్వితీయాంతపదంబుచేఁ దెలుపంబడుచుండెంగాని ప్రథమాంతంబునఁ "గాక" అనుక్రియతో నన్వయించుచుండలేదుగాన నియ్యది భావలక్షణార్థంబున కుదాహరణంబుగా నుండనేరదు అందునఁ బైపద్యమందలి యగుధాతువునకుఁ (కాక) దుమర్థభావలక్షణార్థంబులలో నేదియు సందర్భింపకయున్నందునఁ గారకపరిచ్ఛేదములోని (3౨) సూత్రమున బ్రాహ్మణముఖ్యశబ్దంబునకుంబోలె విశేషణమైన పురోహితశబ్దంబునకును బ్రథమావిభక్తి సంగతంబుగాఁ గానిపింపదు. ఒకవేళ బ్రాహ్మణముఖ్యుఁడు చేకొనుధాతువునకుఁ గర్మంబైనందున నీపద్యవాక్యంబులో "గాక" క్రియకుఁ గర్తగాకున్నను బురోహితుండట్టి క్రియతోఁ గర్తగా నన్వయించుచున్నంగున నిట భావలక్షణార్థంబున నుజి ప్రత్యయంబురాఁగాఁ గారకపరి. (3౨) సూత్రంబునఁ బ్రథమావిభక్తియుండవచ్చునందు రేని యట్లనవలదు. అట్టి భావలక్షణార్థమే యీపద్యంబున గ్రహింపబడినచోఁ, "బ్రాహ్మణముఖ్యుఁడు పురోహితుండుగా నజ్ఞానాదులు ద్రౌపదిం జేకొనిరి" యన్న వాక్యంబునఁ గర్మంబైన ద్రౌపది బ్రాహ్మణముఖ్యునికంటె వేఱుపదార్థమైనట్టులు, ఇచ్చటం గూడఁ గర్మంబైన బ్రాహ్మణముఖ్యుఁడు ప్రథమాంతపదబోధ్యుండైన పురోహితుండు గాక వేఱొకండుగా నున్నట్టులు తోఁచిపద్యంబున నపార్థము సిద్ధించును.

అనఁగాఁ బైపద్యమందలి చేకొనుక్రియనులక్ష్య (జ్ఞాప్య) క్రియఁగాను, దానికిఁ "గాక" అనునుజిపర్ణకాంతభవతి (అగు) క్రియను లక్షణ (జ్ఞాపక) క్రియఁగాను భావించి యీలక్షణక్రియకుఁ గర్తగాఁ బురోహితుండన్వయించునని యెంచి కారక.ప. 3౨సూత్రమునఁ బ్రథమవచ్చునని భావలక్షణార్థముచెప్పికొన్నచో నట్టియెడనీవాక్యంబునను, నజ్ఞానాదులు వేఱొక పురోహితుండు దగ్గరనుండఁగాఁ బూర్వోక్తదృష్టాంతవాక్యమందలి (ద్రౌపదినిబోలె) నొకబ్రాహ్మణముఖ్యునిఁజేకొన నుద్దేశించిరియన్న పరిపోస్యార్థమయి పురోహితుండు బ్రాహ్మణముఖ్యునికంటె వేఱుగానున్నట్లు తోఁచును. సిద్ధాంతములో బ్రాహ్మణముఖ్యునే పురోహితుండగుటకు నుద్దేశించినటులతోఁచుచు న్నందున నిట్టిస్థలంబులందుఁ "గాక" అనుక్రియ యుద్దేశ్యవిధేయభావముం దెల్పం గాని భావలక్షణార్థంబును బోధింపదు, ఇటవేఱొకండుగాక బ్రాహ్మణముఖ్యుఁడే పురోహితుండని సామానాధికరణ్యము తోఁచుచున్నందున "సామానాధికరణ్యాద్భిషా్మది

శాకుంతలీయశ్లోకంబునందును, శ్లో॥ "విభుర్విభక్తావయవంపుమానితిక్రమాదముం నారద ఇత్యబోధిసః" అనిన శిశుపాలవధయందలి శ్లోకంబునందును, క్రమంబుగా "యాం" అను ద్వితీయాంతమునకు "సర్వభూతప్రకృతి" శబ్దంబు విధేయవిశేషణంబైనను, ద్వితీయశ్లోకమందు "అముం" అనిన ద్వితీయాంతమునకు "నారద" శబ్దంబు విధేయవిశేషణంబైనను, నిపాతంబైన యితిశబ్దంబునభూతప్రకృతనారదులయందలి కర్మత్వంబు చెప్పంబడినందునఁ గ్రమంబుగాభూతప్రకృతినారదశబ్దంబులకంటెఁ బ్రాతిపదికార్థమందుఁ బ్రథమావిభక్తి "సూ॥ నిపాతేనాప్యభిహితే కర్మణినకర్మవిభక్తిః, పరిగణనస్యప్రాయికత్వాత్" (అధికరణం ౫ ఆ ౨ సూ. ౨౨) అనుసూత్రమున వామనాదిప్రాచీనుల మతంబునందుఁ బ్రవర్తిల్లఁగాఁ బ్రథమాంతములైనభూతప్రకృతినారదశబ్దంబులెట్లుసాధువులుగాఁ దలంపఁబడియెనో యట్లే ప్రకృతంబునఁ "బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగా" ననుపద్యమందు ద్వితీయాంతమయిన బ్రాహ్మణముఖ్యశబ్దంబునకుఁ బురోహితశబ్దంబు విధేయవిశేషణంబైనను "కాను" అనుసుబ్యంతావ్యయం బితిశబ్దార్థకంబని (అని యనియెడి యర్థముగలదని) యంగీకరించి యట్టి యవ్యయంబునఁ బురోహితుని యందలి కర్మత్వము చెప్పంబడినందునఁ బురోహితశబ్దంబుకంటెఁ బ్రాతిపదికార్థమందుఁ బ్రథమావిభక్తి ప్రవర్తిల్లినదని సౌకర్యంబున సవరించుకొనినచో "బ్రాహ్మణముఖ్యునిఁ బురోహితుండని చేకొనువార" మనిన సరసార్థంబున నట్టి ప్రథమాంతపురోహితశబ్దంబు సమంజసంబయ్యెడునని యెఱుంగునది.

ఇట్టులింకను వ్యాకరణసూత్రప్రకారంబున నిర్ణయింపశక్యముగాని సశేషవిషయంబు లార్యులపదప్రయోగవిన్యాసంబు పరిశీలించి నిశ్చయించికొనుచు శాస్త్రమర్యాదం బ్రవర్తిల్లుట పరమశ్రేయంబు.

(మూలము) శ్లో॥ శ్రీస్తనాంచితకస్తూరీ। పంకసంకలితోరసే
పంకజాక్షాయనాథాయ వేంకటేశాయమంగళమ్॥

వ్యా — లక్ష్మీదేవీస్తనములయందుఁ బూజ్యమైయున్న కస్తూరీపంకముతో మిళితంబైన వక్షస్థలంబువాఁడిల్లఁగాఁ బంకజనేత్రుండై పరఁగుచున్న వేంకటేశ్వరస్వామికొఱకు మంగళంబయ్యెడుమని యాశాసించుచు గ్రంథకర్త "కలా వేంకటనాయక" అను నామంబును స్మరింపించుచున్నాఁడు.

శ్లో॥ సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే । సర్వపాపదహో యస్మా ద్వేంకటాచల ఇత్యభూత్ - అనిన బ్రహ్మాండపురాణవచనంబున సర్వపాపదాహకంబగు "వేంకట" బిరుదంబుతోఁ బ్రబలియున్న భగవానుని స్మరించినచో జ్ఞానాజ్ఞానకృతసకల దుర్దోషంబులను దొలంగునన్న దృఢవిశ్వాసంబున భక్తభాగధేయంబగు వేంకటనామధేయంబుననే పైశ్లోకంబును గ్రంథకర్త యనంబడు చిన్నయసూరి సముపార్జించుచున్నతత్త్వంబును దెలియుచున్నది. ఈశ్లోకంబున "శ్రీస్తనాంచిత......తోరసే" అను శబ్దంబు బహువ్రీహిసమాసంబు. ఉరశ్శబ్దాంతమైన బహువ్రీహికి సంస్కృతవ్యాకరణంబున సామాసాంతమైన కప్ప్రత్యయంబు "ఉరఃప్రభృతిభ్యఃకప్" (అ ౫ పా.౪ సూ.౧౫౧) అను సూత్రంబునఁగలిగి "శ్రీస్తనాంచితకస్తూరీ। పంకసంకీర్ణతోరస్కాయ" అని యిట్లుండవలయును. శబ్దసౌష్ఠవంబునకు యత్నంబుచేసినం బద్యలక్షణంబునకు భంగంబు గలుగును. ఒకవేళ "సామాసాంతవిధిరనిత్యః" అనుపరిభాషావశంబునఁ గప్ప్రత్యయం బనిత్యంబని యంగీకరించినచోఁ బూర్వోక్తప్రయోగంబు సాధువనందుకేని యటు లనందగుఁ బ్రాచీనకవికృతమైన యొకమహాగ్రంథములో నెచ్చటనైన నిట్టి నలుసుండె నేని యచ్చట నిట్టి యనిత్యత్వపక్షం బంగీకరించి దోషపరిహారంబు చెప్పినం బాగుండు నుగాని ప్రాకృతంబున రచియించినయొక్కయనుష్టుప్ శ్లోకములోనే యిట్టి యనిత్యత్వపక్షావలంబనం బగతికంబై తోఁచెడిని. "ద్విత్రిభ్యాంపాద్దన్మూర్ధసుబహువ్రీహౌ" (అ.౬ పా.౪ సూ.౧౧౫) అను సూత్రమునసైన యనిత్యత్వజ్ఞాపకత్వమున "శ్లో॥ చతుర్దశసహస్రాణి। రక్షసాంభీమకర్మణాం। త్రయశ్చదూషణఖరత్రిమూర్ధానోరణేహతాః" ఇత్యాద్యుత్తరరామచరితాదిపూర్వకవిప్రయోగంబులు సయితము సాధువులనుట యిష్టములేక వ్యాఖ్యాతలచేత నన్యథా సవరింపఁబడినవి. ఇంతియకాక, ఉరశ్శబ్దాంతమైన బహువ్రీహిలోఁ గప్ప్రత్యయంబునకు ననిత్యత్వపక్షంబంగీకరించుటనివరీతి యే కవిప్రయోగమందును గానరాకున్నయది. శ్లో॥ వ్యూఢోరస్కోవృషస్కంధస్సాలప్రాంశుర్మహాభుజః॥ అను కాళిదాసప్రయోగంబును "వ్యూఢోరస్కేన, మహోరస్కేన" అనిన హయవదట్ సూత్రస్థ భాష్యకారప్రయోగంబులును, నురశ్శబ్దాంత బహువ్రీహివిషయములోఁ గప్ప్రత్యయంబున కనిత్వత్వపక్షం బంగీకరించి యీపూర్వోక్తప్రయోగంబును సాధువుగాఁ జేయుటకు బ్రబలప్రతిబంధకంబులుగా నున్నవి గావున నియ్యదియిట్టి యనన్యసాధారణవ్యాకరణగ్రంథమునకు రచనాకర్తయనిపించుకొనుసూరిగారియెడ నాశ్చర్యజనకంబనక తీరదు.

కర్తృత్వమునకైనకీర్తింజేసి విబుధు లుపజ్ఞాశబ్దంబు నుపయోగించుటతక్క సర్వసామాన్యముగా నిట్టిపదంబును దమంతతాము వాడుకొన్నరీతి కానరాకున్నది. ఇంతియకాక యీచిన్నయసూరిగారుసైతము నీతిచంద్రికయొక్క గ్రంథకర్తృత్వవిషయమై యిట్టిపదుపజ్ఞశబ్దంబు నుపయోగించుకొని వివక్షించుకొనుటలోనింత శ్రద్ధవహించినట్లు కనంబడదు. ఇంతశ్రద్ధతో వక్కాణించుకొనుటయే గాని యాశ్లోకం బేకోశస్థానమందును గోచరింపకయున్నది. శబ్దలక్షణసంగ్రహమను పేరను సప్తపత్రియైన యొకపొత్తంబుమాత్రము తెనుంగున వ్రాయంబడిన సూత్రంబులతో నుదాహరణాదివిరహంబుగా ముద్రితంబై కనంబడు. ఈమూలపద్యంబునొద్దను బ్రసంగవశంబునం జెప్పంగా నవసరంబైన యొకయంశంబుగలదు, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రులుగారును, పరవస్తు చిన్నయ్యసూరిగారును సమకాలికులుగాన నొకప్పుడిద్దఱును దటస్థించి వ్యాకరణశాస్త్రప్రస్తావనం జేయంగా సూరిగారి పాండిత్యంబున కోడి శాస్త్రులుగా రెంతయునోర్వలేక సూరిగారి ప్రసిద్ధిని భంగపఱుపవలెనని యెంచి తత్కృతమైన బాలవ్యాకరణంబు నెట్టెట్టులో సంగ్రహించి, స్వప్రణీతమైన సంస్కృతగ్రంథమున కయ్యది తెలుంగేకాని వేఱొకవిశేషంబు లేదని యనిపించుటకై యిటీవల సోదాహరణవివరణంబుగా హరికారికాగ్రంథంబును రచియించిరి యన్న కింవదంతియొకటి వాటిల్లుచుండు నిది యెంతవఱకు నమ్మందగినదో కొంచెమాలోచింతము.

(1) వేదశాస్త్రాధ్యయంబునకు నిర్ణీతంబైన బ్రాహ్మణవర్ణంబునం బుట్టినది మొదలు గురుకులశిక్షనొంది యనేకసభాస్థలుల శలాకపరీక్షలిచ్చి యాతీతి రాజాస్థానంబులందు యావజ్జీవమును బండితుండుగా నెన్నికగాంచిన కృష్ణమూర్తిశాస్త్రులుగారివంటి పెద్దభారతయోధు తెలుంగుపండితుండైన సూరిగారికోడెనన్న వాక్యంబును విన్నతోడనే. శ్లో॥ బాధితం దృశ్యతామక్షైస్తేన బాధో న దృశ్యతే। జీవన్నాఖుర్నమార్జారం। హంతి హన్యాత్కథం మృతః॥ అపి పాశుపతాస్త్రేణ విద్ధశ్చేన్నమమారయః। నిష్ఫలేషు వినాణం గోన జాతు తీత్యత్ర కా ప్రమా"॥ అనునట్టి వేదాంతపంచదశీతృప్తిదీపాంతభాగమందలి శ్లోకద్వయంబును నీసందర్భమున మాకు జ్ఞప్తికివచ్చి హాసంబువొడముచున్నది.

బ్రాహ్మణేతరుండు తానుజదివినజదువు బ్రాహ్మణుని చదువులో సహస్రతమాంశంబున్నను నంతమట్టేయింతగాంచదోంచి బ్రాహ్మణుండెంతో చదివినంగాని యాశిశాం

పతేనికీర్తిని సులభంబుగా సంపాదించును. కూపోదకంబు తానుప్పనగాక యించుక
రుచిగానున్నచో గంగోదకంబును మీఱియున్నదనినయతిశయోక్తిని సంపాదించును.
శాస్త్రులగారిని సూరిగారు మీఱినారన్నవాడుకకూడ నట్టిదేయని మాతాత్పర్యము.
"ఆ.గీ. శిష్టకులకలశజలనిధి। శీతకరః కృష్ణమూర్తిసంఖ్యావాన్। షడ్దర్శనీస్వాతంత్ర్య। స్త
నోతి హరికారికావళీంవృత్తిమ్" అనితనగ్రంథాదిని షడ్దర్శనములయందునుస్వాతంత్ర్యముం
డని నిర్ణయంబుగాఁ బ్రకటించుకొనిన కృష్ణమూర్తిశాస్త్రులుగారివంటి పెద్దపండితుని
తనకే శాస్త్రమునందుఁ బరిశ్రమగలదో యాసంగతిని గ్రంథాదియందుఁ దెలియంజేయజా
కిన చిన్నసూరిగారు మీఱెనన్నమాట యెట్లుపొసంగును. ఇందుమిందుగా గ్రంథకర్తలు
గురుకులశిక్షగా శాస్త్రాభ్యాసం బొనర్చినచో నట్టితమరొకగ్రంథంబును రచింపవలసి
వచ్చిన సమయంబున రచనకుందగినంత సంభారము తమయొద్దఁ బూర్తిగానున్నది యని
బుధులకుసూచించుటకై యెంతోయుత్సాహముతో స్వకీయమైన శాస్త్రపాటవంబును
బరిరోచనాపూర్వకంబుగాఁ బ్రశంసించుకొనుట తఱుచు సంప్రదాయంబుగా నిటీవల
నున్నయది. శ్లో. "అహంచనాట్యశ్రుతి పారదృశ్వా। సుధామునస్తస్యకవేశ్చవాచః"
అని ప్రతాపరుద్రీయమందు సూత్రధారుఁడు తనపాండిత్యంబును శ్లో. "యేనస్వైరమభా
ణిపాణినిమతం ప్రాణాదికాణాదవాగ్గుంభే." అని సాహిత్యరత్నాకరంబున ధర్మసూరి
యును శ్లో. "పాతంజలేమహాభాష్యే కృతభూరిపరిశ్రమః." అనిశబ్దేందుశేఖరప్రారంభం
బున నాగేశపండితులును, శ్లో. "శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షో రధిగతసకలబ్రహ్మవిద్యాప్ర
పంచః" ఇత్యాదికముగా రసగంగాధరమందు జగన్నాథపండితరాజును శ్లో. "వాణీం
కాణభుజీమజీగణదవాసాసీచ్చ వైయాసికీమ్" అని మల్లినాథసూరియును, నిట్టులనేకులు
బుధులు ప్రకృతకృత్యంబునకుఁ గావలసినసంభారము తమయొద్దమెండుగా నిండియుండె
నని సూచించుటపరిరోచనామూలంబునఁ బ్రసిద్ధమైయున్నది.

కాఁబట్టి సూరిగారు గురుశిక్షతో సంస్కృతవ్యాకరణమే చదివియుండెనేని
యట్టివలసినశాస్త్రపరిశ్రమ సంభారము తనకుఁ బ్రబలంబుగా నున్నది యనిశాస్త్రసం
ప్రదాయాంశంబులతో నిండియుండిన యిట్టిబాలవ్యాకరణంబు రచియించుసమయంబున
నుత్సాహంబుతోఁ గృష్ణమూర్తిశాస్త్రులుగారువోలెఁ జెప్పుకొనియుందురుగానియిట్టులు
తెలిసినను మౌనంబుతోనుందురని యెవ్వరును ననుకొనరు. ఈతెలుంగువ్యాకరణంబు
కేవలమును సంస్కృతవ్యాకరణమును జదివినంతమాత్రమున రచియించుటకు నలవియైనది

గాక శాస్త్రాదులయందు నిష్కృష్టమైన యనుభవపరిపాకంబునం జేయందగిన గ్రంథంబు
న్నసంగతి నిర్వివాదాంశంబు. ఇంతగొప్పగ్రంథమును రచియింపసాధనంబైన శాస్త్ర
జ్ఞాన మీగురునివలనఁ దనకులభ్యమైనదో యాగురుని నమస్కరించుమారంబున గ్రంథాది
యందు బుజువుచేసికొనుభారం బీసూరిగారికి నవశ్యకర్తవ్యంబై యున్నది. నిజంబు
గా నీపాత్రంబు రచియింపఁగలిగినంత శాస్త్రజ్ఞానమే యుపదేశమైనచో బ్రాహ్మణేత
రుఁడైన తనకింత ప్రతిభనుగలిగించిన గురుశేఖరుని నీతనిమనస్సాక్షి బహువిశ్వాసంబు
తో వేనోళ్లను గ్రంథాదియందుఁ బొగడంగాఁ బొడుచుంగాని యటులుగాకపన్నసనగా
విశ్వాసహీనతతో గురునిం దలంపనీక యూరకుండదని నానమ్మకము. ఇట్టి గ్రంథము
చేయుట కృతపాండిత్యంబుగలిగి బుద్ధికుశలతతో "నీతిచంద్రిక" లోనైన వచన రచ
నాదికము సల్పుటవంటిదిగాదు. సూ. "కృచ్ఛగహనయోః కషః" (అ 7 పా 2
సూ 22) అను సూత్రంబునకు "కష్టం శాస్త్రం; దురవగాహమిత్యర్థః" అని వైయా
కరణు లుదాహరించుటంజేసి శాస్త్రంబు సామాన్యంబుగాఁ జొరఁబడశక్యముగానిది
యని చెప్పుదురు. అనఁగా నెంతో చిరకాలము సత్త్వగుణంబుతో గురుకులవాసముచేసి
చదివినంగాని యబ్బునదిగాదని భావము. బ్రాహ్మణునికే యెంతో కష్టమై యుండగాఁ
వేదాంగమైనవ్యాకరణంబు బ్రాహ్మణేతరునికి లభించుట యింక నెంతదుర్ఘటమో
చెప్పవలసినది యేమున్నది? "ఛందోవత్సూత్రాణిభవంతి" అను వృద్ధిరాదైచ్ సూత్ర
స్థభాష్యంబునం జేసియు, వైశేషికాది సూత్రములువోలెఁ గాక వేదాంగమైనందున
వ్యాకృతి సూత్రములే వేదమువంటివియని కైయటాదులు వివరించుటంజేసియు నిప్పట్టి
కాలంబునకంటెను నట్టి పూర్వకాలంబున ఛాందసత్వంబు మెండుకావున బ్రాహ్మణులు
శ్లో॥ "భావం నచాస్యాహమనుప్రదాతు । మలం ద్విజో మంత్రమివాద్విజాయ" అను
సుందరకాండీయ వచనప్రకారంబున శిఖాయజ్ఞోపవీతంబులులేని జాతివారికివ్యాకరణ
సూత్రంబు లుపదేశించుట కాలధర్మప్రాయంబైనందున దుర్ఘటంబు. పవిత్రశీలమం
దేకాక జాతాశౌచాదులయందు మామకగురుచరణారవిందంబులు వ్యాకరణశాస్త్రపా
ఠంబు చెప్పకయుండుట స్వానుభవంబయి యున్నది. ఇట్టిస్థితిలో నెంత కడుపుకక్కు
ర్తికిఁ జొరంబడినవాఁడైనను వ్యాకరణశాస్త్రమునఁ బఠనపాఠనాదులు జరిగింపఁగలిగి
నంత విద్వాంసుఁడైన బ్రాహ్మణుండు "ఛందోవత్సూత్రాణి భవంతి" యను భాష్య
కారవచనంబును భస్మముపాలుసేసి యొడలు గగురుపాటొందక చాలనివారికి నియమపూ

ర్వకంబుగా నిప్పటినవనాగరక కాలంబునసయితము హిందూదేశంబున వ్యాకరణవిద్యా స్వీకారంబు సేయింపఁగా సాహసింపఁడనియే యెల్లరతాత్పర్యమైయుండునని నేఁదలంచెదను. ఒకవేళ నట్టి బహువాత్సల్యంబుగలిగినగురువు పుణ్యావశంబున లభింప వ్యాకరణ శాస్త్రపాటవంబబ్బినచో నట్టిగురుని నమస్కారపూర్వకంబుగాఁ దనశాస్త్రపరిశ్రమంబు బుజువుగాఁగ గ్రంథాదియందేల వెల్లడింపకొనకయుండును? బ్రాహ్మణులుమాత్రమందఱును గురువందనపూర్వకంబుగా నబ్బినవిద్యాపరిశ్రమమును బుజువుగాఁగఁ జేసికొనుచుండిరా? యని యనంగూడదు "బ్రాహ్మణేన నిష్కారణో నధర్మః షండగో వేదోధ్యేయో జ్ఞేయ శ్చేతి" యనెడియాగమప్రామాణ్యంబున బ్రాహ్మణుఁడనిపించుకొన్నవానికి వేదంబును వ్యాకరణాదిషడంగంబులును జదువుకొనుట సహజముగానివింతగానందున బుజువుభారంబవసరంబులేదు. గురునమస్కారరూపంబైనమంగళం బొకప్పుడు విప్రునకు మానసికంబైయుండవచ్చును. బ్రాహ్మణేతరునికింగూడ గురువందనము మానసికమైయుండవచ్చు నందురేని, తనకులంబున కెన్నండును లేనియద్భుతజ్ఞానవైభవంబునుగలిగించినగురునియెడ భక్తివిశ్వాసంబులు మిక్కిలి పెనంగులాడితమ్మును బ్రకటించుకొనకమానవనినా తాత్పర్యము. కాఁబట్టిసహజపాండిత్యమునే "పంకసంకలితోరసే" యనిన యపప్రయోగంబుగూడ స్పష్టపఱుచుచున్నది. కాఁజట్టి యీయనశ్రుతపాండిత్యము గలబుద్ధిశాలియనందగునుగాని గురుకులవాసముచేసి శాస్త్రమభ్యసించినవాఁడని చెప్పుటకుఁ దగినయాధారంబులెన్నివింధిబులను గానరాకున్నవి. ఇట్టి సహజపాండిత్యశాలి గురుకులవాసశిక్షితుండైన శాస్త్రులవారిని నోడించెనన్నమాట దేహంబునబండబలంబుగలపురుషుఁడు గురుకులంబున సామువిద్దెనేర్చి ప్రగల్భుఁడైనయొకమల్లశిరోమణిని మర్దించెనన్నవచనంబువోలె హాసాస్పదమైనపుక్కిటిపురాణంబుగాని వేఱొకటిగాదు.

2. శాస్త్రులవారు చిన్నయసూరినిజూచి యోర్వలేకపోయిరి యన్నమాట యెంత సందర్భముగానుండునో విమర్శింతము. లోకములో నెల్లరకును దమగొప్ప దృష్టికి నాగిన వస్తువునుజూచి నప్పుడె యోర్వలేమి పుట్టునుగాని తక్కువ వస్తువును గాంచిన ద్వేషంబు గలుగనేరదు. శాస్త్రులవారికి బహువిద్యలయందు లోకోత్తరప్రజ్ఞ గలదన్నయీయన యశంబునకు నెదురాడువారు కనంబడరు. ఈయనచాటుధారగాను భయభాషలయందును జెప్పిన చమత్కార పద్యంబులు వచ్చిన పెక్కురువిద్వాంసులు ప్రస్తావనావశంబునఁ జదివి యానందింతురు. ఈయన యుపాసించిన గణపతి దేవత

వరప్రభావంబును లోకాతీత ప్రతిభ గలిగినది యన్నంత యనన్యసామాన్యప్రజ్ఞ యబ్బి నట్లు ప్రసిద్ధిగలదు. బ్రాహ్మణేతరుండైనను, చనిపోయిన చిన్నసూరికిఁగూడ బుద్ధిశాలి యై నందున సంస్కృతాంధ్ర సాహిత్యదృష్టిద్వయంబును మిక్కిలి విశాలంబే యందము. అయినను నింతలో కొత్తరప్రజ్ఞగల యీయనదృష్టికి నచ్చియయ్యవి యసూయపడునం తటివిగానుండనేరవు. "వివాదశ్చ వివాహశ్చ సమయోరేవ శోభతే" యను న్యాయంబున సమానస్కంధులకే యోర్వలేమిని ద్వేషంబు గలుగును. సింహంబు తన ఘనతకుందగిన యేనుంగునుజూనియే ద్వేషించునుగదా! శ్లో. "సంత్యన్యేపి బృహస్పతి ప్రభృతయస్సంభావితాః పంచషాస్తాన్ ప్రత్యేషవిశేషవిక్రమరుచీ రాహుర్న వైరాయతే" యనిన భర్తృహరి సుభాషితంబు ననుసరించి శాస్త్రిలవారికి ననూయస హేతుకంబుగాదు. చాతని జాతి తెలుంగు పండితుఁడుచేసిన యొకతెలుంగు వాక్యరణంబున సంస్కృతపండితుండైన బ్రాహ్మణుఁడు తనయశస్సుపోయినదని యెంచుకొనఁడు. సంస్కృతపండితునిదృష్టి తెలుంగునందు నంత ఘనంబుగాఁ బోవనేరదు కాననే సంస్కృతపండితులు తెలుంగుకవుల సంఖ్యలోఁ దక్కువ యగుటకుఁ గారణంబు. మఱియు నీయుగంబున నొరులకు బ్రహ్మద్వేష మున్నంతగా బ్రాహ్మణుని కితరద్వేష ముండనేరదు. మీఁదు మిక్కిలి బ్రాహ్మణులు సయితము తమ నిష్పక్షపాతద్విజ భావముం బొగడించుకొనుటకై "బోద్ధారో మత్సరగ్రస్తా" యను న్యాయంబున స్వజాతినే వంచింపంజూచి తమ శివాచార ధర్మంబుల వెల్లడింపఁ జూచుకొందురు. ఈనడుమ నీబాల వ్యాకరణంబు స్వోత్పత్తి కీర్తికిందగునటులు తనపూతగంధప్రభావంబునఁ బాదజుండైన మాశిష్యుని మానసమ్మును మహామిమరుచికిం జొనిపి పూతిగంధిం జేయుసమయంబునఁ బరులపంచలపాలై యాయానోటం బడఁజాలక కన్నీరు మున్నీరుగాఁగఁ బలవించు మాపలుకుం బడంతి పశుపాట్లు పాటింపలేక జాలింగీలించిన డెంపంబున శిష్టరక్షణకుల ధూమణుండైన యేలూరి లక్ష్మీనరసింహమూర్తి బి. యే గారట్టిమాచతురాస్యవల్ల్యదేవతనుల్లంబు రంజిల్ల మన్నించి యారడించి మరల బ్రహ్మముఖంబున నర్పించుచుఁ బ్రాచీనకాలంబుననుండియుఁ బ్రసిద్ధిం జెందిన యామేబ్రాహ్మినామధేయ భాగధేయమ్మును విడనాడనీయక పలుతెలుంగుల సార్థకత నెందించిరి గావున స్వస్థుండైన (సర్గస్థుఁడు లేక తన్నుంబొందిన) యాసుహృద్వరేణ్యుని శ్రీమన్నారాయణుం డాదరింపఁగా నిట్లు కృతజ్ఞభావంబుతోఁ బ్రసక్తాను ప్రసంజనఁ వశంబున బ్రస్తావింతుముగాక!!

శా. ఏ. (వీలూరియనియమనర్థము) లక్ష్మీనరసింహమూర్తి చితిశాయిన్ శంకరాచార్యజం
ఘాలుంజేసిన భాతి భీతికతనన్ గాలాడకున్నట్టి దు
ష్కాలంబందుఁ గరావలంబనములన్ సాధూపకారం బతం
డ్రాళుండై యొనరించు; స్వస్థునతనిన్ నారాయణుం డోముతన్.

కావున నంతటి బహువిద్యా పటిష్ఠుండైన కృష్ణమూర్తిశాస్త్రులవారు చిన్నసూరిపాండిత్యముఁ జూచి యీసుం జెందిరి యన్న పలుకు పరిహాసాస్పదం బయ్యెడి.

3 ఇఁకను సూరిగారురచియించిన బాలవ్యాకరణంబు నెట్టెట్టులో సంగ్రహించి శాస్త్రులవారు సంస్కృతము చేసికొనిరి యన్నయంశ మెంతనిజంబో చర్చింతము.

ఒకభాషలో వచనరూపముగానున్న గ్రంథమును వేఱొకభాషలో శ్లోకరూపమున ఛందోబద్ధంబుగాఁ జేయునప్పుడు, ధారాళంబై యుండుట మిక్కిలి కష్టంబు అట్టిస్థితిలోఁ గృష్ణమూర్తిశాస్త్రులవారు రచియించిన హరికారికలు శైలిలోఁ బ్రవాహరూపంబున నున్నయనియనుట మతిమంతులకుఁ దోఁపకమానదు.

అయ్యవి లక్షణబద్ధంబైనను నితరాపేక్షం జేసి యిటుకాట మనుభవింపక స్వయంభువుగా నుప్పతిల్లినరీతితోఁ గనంబడునని నిస్సంశయంబుగాఁ జెప్పందగు శ్లో. పటుత్వం సత్యవాదిత్వం। కథాయోగేన బుధ్యతే। అస్తబ్ధత్వమచాపల్యం ప్రత్యక్షేణైవ గమ్యతే" యనిన వచనప్రకారంబున మాటాడించి కదుపుటచేతను ముఖవర్చస్సు గనుంగొనుటచేతను మనుష్యుని స్వరూపస్వభావాదులు మతిమంతులకు సునాయాసముగాఁ బొడకట్టునట్లు కవితాసరస్వతీ పదపద్మంబులం బరిశీలింపఁగా నట్టి యనుభవశాలులకు ముంజేతి కంకణంబువోలెఁ గనంబడి స్వయంభవనభాషాంతరీకరణగ్రంథంబులు గుప్పన వెల్లడికాకమానవు. శాస్త్రికృతహరికారికా సంస్కృతగ్రంథంబును సూరికృతాంధ్రగ్రంథంబును నొక్కకాలంబున రెండుచేతులందును నుంచుకొని పరిశీలించితిమేని భాషావేషభేదంబుగాక సూత్రక్రమంబునందును సూత్రవృత్తులయందును నడుమనడుమను వివరణవాక్యాదులయందును నాకారంబుఁ గుడియెడమచేతులు వోలెనుండి పౌర్వాపర్యవివరణం బెన్నుటకు సామాన్యంబుగాఁ గష్టంబైతోఁచును. రెండుగ్రంథములలోనివి యుదాహరణంబు లొక్కటియే యయియున్నవి. సంధిపరిచ్ఛేదములోని (18) సూత్రముక్రిందను "ఛందోయి" యని శాస్త్రులవారి గ్రంథములో నుదాహరణముండంగా దానికి

బదులుగా బాలవ్యాకరణంబులో "కందోయి" యని యుదాహరింపఁబడియె. అచ్చటచ్చట "నంతయు రామమయ" మనుదానికి బదులుగా "నంతయుఁ గృష్ణమయము" అనినట్లు బాలవ్యాకరణంబున వేఱుగా వ్రాయఁబడిన యుదాహరణంబులు పదిసంఖ్యకంటె నెక్కువగా నుండవు. ఈగ్రంథములు చూడఁగా శాస్త్రి సూరులిద్దఱిలో నెవ్వరో యొకరు శ్లో. "యస్యాశ్చోర శ్చికురనికరః కర్ణపూరో మయూరః" అనిన ప్రసన్నరాఘవనాటకములోని శ్లోకంబునఁ జెప్పఁబడిన కవులలో నాదికవీంద్రుని పదవిని నధిష్ఠింపఁజాలరదు. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారే సూరిగ్రంథమును హరించినట్లు కనంబడినచో నిపుడు శిష్టశబ్దంబునకు శాసింపఁబడువాఁడని యర్థము చెప్పవలయును. బాల్యవ్యాకరణంబును సూరిగారపహరించినరీతితోఁ జూచినచో నిపుడు, పరవస్తు—పరద్రవ్యమైన; చిత్—జ్ఞానముయొక్క, నయ—తీసికొనిపోవుటయందు, సూరి—పండితుఁడని, అనఁగాఁ బరద్రవ్యమైన జ్ఞానరూపవ్యాకరణగ్రంథమునుహరించినవాఁడుగాన బేరు యానత్తును సార్థకంబుచేసికొనెనని శ్లాఘింపవలయును.

4. శ్లో. ఆర్యా "శ్రీమత్కదంబవర్యః స్థిరలసదైశ్వర్య యుక్చిరంజయతు। ఇనగాలగోత్ర ధర్మస్ఫురిత శ్రీకాళహస్తినగరీశః॥ శ్రీమద్వరదామరకుల। ధామావరమూర్తితస్సోహం। సుమతిర్వృత్తిం నన్ననసూత్రాణాం కృష్ణమూర్తిరిహకుర్వే॥ అని యినగాలగోత్రుఁడైన దామర చినరామన్నయనెడి కమ్మకులుఁడు కాళహస్తి సంస్థానాధిపతి రచియింపుమనఁగా పరికారికాగ్రంథము నతనికిఁ గృతియిచ్చి చేసినట్లు గ్రంథాదియందున్నది. సూరికృతమైన యీబాలవ్యాకరణంబును దొంగిలి (1840—1885) సూరిగారు జీవించియుండఁగానే శాస్త్రులవారు (1790—1870) సూత్రములను సంస్కృతముచేసి యాయుదాహరణంబులతోనే చినరామరాజునకు గృతియిచ్చెనని చెప్పవలయును! అంత పండితేంద్రుఁడు సూరివ్యాకరణంబును దొంగిలించి సంస్థానాధిపతికిఁ గృతియిచ్చెననుట కుబేరుఁడు దారిద్ర్యబాధను గుచేలునియింటికిఁ గన్నముచేసి వెంటనే యాదొంగ సొమ్మును నొకగొప్పరాజకీయాధికారికి నమ్ముటనంటిది. ఇంతియగాక సూరిగారే కం. మునుమదుపజ్ఞంబగుమందనరినవ్యాకృతిని...... ఇత్యాది వాక్యంబులలో దాను మొదట సంస్కృతములోఁ జేసిన వ్యాకరణగ్రంథములు దెనిఁగించితినని తెలుపుచున్నారు. కాన సూరి కృతమైన సంస్కృతగ్రంథంబునకు మరల శాస్త్రులవారు వేఱుమాటలతో సంస్కృతముచేసి గాని లేకదొంగిలించిన సూరికృతగ్రంథము మొదటను దాను రచియించినట్లు సూచించునట్టి పంచమశ్లోకంబులను బూర్తిచేసిగాని సూరిజీవితకాలములో సంస్థానాధిపతికిఁ గృతియిచ్చిరి యని చెప్పవలసియుండును! ఈ

(21) ఁదర్థకామ్రేడితస్యభవేతామాయ్యయీాచవా॥ ౧౧

(22) బహువ్రీహౌ సమాసాంతకార్యమప్యత్రదృశ్యతే।

(23) బహువ్రీహౌస్త్రియామర్థేమేనోర్బ్యోఁ డిస్తులోపరి॥ ౧౨

[24] ద్వంద్వేభవేదృకారస్యాన్యతరస్యాంరవర్ణకః

(25) సమాసస్యవిభక్తేస్స్యా ల్లోపోనస్యాల్లటస్తథా॥ ౧౩

(26) ప్రాధాన్యస్యవివక్షయాం కర్మాదీనాంతుధాతుజాః।

సమస్యంతే భేదకాస్తైః కర్తృవత్కవిసమ్మతేః॥ ౧౪

(కర్త్రాతుల్యం కర్తృవత్ ॥)

ఇతిసమాసప్రకరణం.

---

## తద్ధితప్రక్రియా.

---

శ్లో॥ (1) త్వార్థేతనో (2) త్రతుస్యాద్వి శేషో వోత్సర్గబాధకః।

(3) చిన్నాది భ్యోఽజీకశ్చస్యా (4) దుత్వస్యాత్వంజి కేపరే॥ ౧

(5) నల్లాదిభ్యోగుణేభ్యోనః। (6) పేర్వాదిభ్యఇమిర్భవేత్ ।

[7] ఇకవర్ణోగ్గలాదిభ్య (8) పుగటిమ్యాదయస్తథా॥ ౨

(9) చిఱుతాదేరుకస్స్వార్థే (10) రమరాదేరికస్తథా।

(11) పుంస్త్వేకా కాత్తియ, స్త్రీత్వ ఆటాదేర్మతుబర్థకః॥ ౩

(12) కాకత్తియకకారస్య కుత్రచిద్లోపిదృశ్యతే।

(13) [illegible] [14] [illegible] ౪

(15) ఈ స్యాదటమటాదిభ్యః। పుంస్త్వేతుమతుబర్థకః

(16) స్వార్థేకేషాంచిదేషో (17) రిజ్జాలాదేర్మతుబర్థకః॥ ౫

(18) ఇవర్ణకబయూరాదేర్మతుబర్థే

(19) తవర్ణకః। వాచ్యాయాంతు స్త్రియాంతస్మిన్నిష్యతేకులవాచినః॥ ౬

(20) క్వచిద్దృశ్యతేచైత్వం। పరేతే (21) యువతిర్వ్యటీ।

రజస్వలాగుబ్బెతమిం। డతముట్టుతచ్రకమాత్॥ ౭

(22) బహ్వాంతేభ్యోవగాదిభ్యః। స్త్రియామాండిర్మతౌమతః।

(23) ఆపుం (24) సిండిస్తుముక్త్వాదేరభావద్యోతకస్థితః॥ ౮

(25) మానార్థాదేండు రేకత్వే। [26] లేలోఽపపెండువర్ణకె

(27) దఘ్నార్థేబంటికొలంది। (28) అర్థభేదేషుచాపరే॥ ౯

ఇతితద్ధితప్రక్రియా.

---

అథక్రియాప్రకరణం.

---

శ్లో॥ (1) ధాతో [2] ర్లడ్వర్తమానేస్యా [3] ద్భూతేలిఙ్ [4
లృట్చభావిని।

(5) తద్ధర్మాదిషు లే [6] డాశీశ్శాపసంప్రార్థనేవిధౌ॥ ౧

లోట్స్యా [7] ల్లజ్ వ్యతిరేకేస్యాల్లకారాఅత్రషణ్మతాః।

(8) ప్రత్యేకంలాండు ఙుప్రు రు। ను ముఞ్స్యధ్యార్వహేరితం॥ ౨

(8) ద్వాద్వాకప్రమాచ్చప్రథమ। మధ్యమోత్తమ సంజ్ఞకాః।

(10) రుమూతత్రిబహుత్వోక్తా వితరేత్వేకతోక్తితః॥ 3

(11) ప్రథమాద్యానామయుష్మ। దస్మదర్థేషుతేత్రయః।

(12) ఙుడ్రోర్గుప్తా అమహాతి దిప్ ఉన్నానుబంధతః॥ ౪

(13) సడుదంతాల్లటిపరే। [14] పరేతూన్నే చువర్ణకః॥

(15) దీర్ఘఉన్నానుబంధస్య పరేముశిదివీతరే। ౫

(16) క్రమాద్భవేతాం విఙ్లేటోర్దుఙిత్స్యైనునువర్ణకౌ॥

(17) ఇగాగమస్స్యాద్భూతే (18) లిడ్వ్యజిస్స్యాత్తు, తివర్ణకః ౬

(19) అనుబం ల్యటికల [20] జత్రజిత్యమతోభవేత్

[21] నుక్కాజ్జ్యముజో [22] లేటః। పరేముశిముగాగమః ౭

లేజ్ దృశ్యతే చ భూతార్థే వచ్యర్థానాం క్వచిత్క్వచిత్।

(23) శ్లేముశ్యాదక్రృధమనో ప్రాయుస్స్యేముగెఙిస్తథా। ౮

(24) లిఙ్లేటోర్వస్య లోపస్స్యాద్వా (25) తిర్యగ్జడవాదినోః।

తయోర్బహుత్వేపేకత్వం ప్రథమేనప్యిధూర్వహాః। ౯

(26) లోటోముఙోద్రుతాంతౌతు। స్యాతామెమువర్ణకౌ।

(27) విధావదీతితచ్ఛబ్దస్తతః పూర్వంచనుగ్భవేత్। ౧౦

(28) పరస్యచ్ఛేదెము తయోదుర్ఙితాదశ్రుస్తదాభవేత్।

(29) లోడ్మధ్యపురుషోర్వ్యుముజౌ (30) ముకోత్వముభయార్థనే। ౧౧

(32) ముముజోః పరయోర్మధ్యే వ్యతిరేకముజుచ్యతే।

అదాద్యనుప్రయోగోప్యితయోస్స్యాప్రార్థనే మతః॥ ౧౨

(34) ఎదాద్యనుప్రయోగేతు। భవేతాంవ్రుముజౌతయోః।

(35) భావే టస్స్యా (36) త్త్వరార్థేన యోగేకజ్వర్ణకస్తువా।

(37) వ్యతిరేకవిశిష్టాయాః క్రియాః తద్వాచినస్తుమిజ్। ౧3

(38) ఏకాశ్రయాణాం ప్రాక్కాలే।

భావక్త్వార్థయోః (39) కజ్ క్రియాంతే॥ ౧౪

(40) చేదర్థేనోద్రుతాంతస్తద్వాద్వ్యా త్తేభావలక్షణే।

[41] అనంత ర్యేనాంతడు [42] నుణ్జుమర్థేభావలక్షణే॥ ౧౫

(43) చువర్ణకోదుప్రితాంతస్స్య చ్ఛత్ర ర్థేతుక్రియాన్వయే।

(44) త్రర్థేత్వేడు రెడిఃస్యాతాం। (45) తయోర్లుగ్బహుళంభ వేత్ ౧౬

(46) భవద్భవిష్యచ్ఛత్రర్థ క్త వదర్థేషుసక్రమం।

ఉన్నః కలజస్తు (47 )నిజ్వ్యతి రేకత్రర్థతోభ వేత్ ॥ ౧౭

ఏ తెసత్వాభిధానేషుభవంతి॥ సత్వంనామ సుబంతవాచ్యం

(48) ఏతేలడాదయః కర్తృకర్ణణోః స్యుస్సకర్మకాత్।

పరస్మాత్కర్తరి (49) కుడు జ్ఞనుబంధస్తుకర్మణి॥ ౧౮

(50] అగురూణామయాంతానా మేకాచ్కానాంద్వ్యచామపి।

ఉపరియుడ్భవేదించు గ్వకారినాంతు విభాషయా॥ ౧౯

(51) అత్వంపడ్వాదినస్యస్యాద్విత్వమం త్యహలశ్చవా!

(52] కానోరనుపప్రియోగ స్స్యాత్కర్తృగామి క్రియాఫలే॥ ౨౦

(53) కానావిగ్బహుళం (54) యస్నోవిహితేకారవకప్రియోః।

(55) అన్వాదేరుత్వలోపశ్చా। బిందుస్సానోన్నె ర్విభాషయా॥ ౨౧

(56) వాండోశ్చేదాద్యర్థనాంతస్యోన్న(57)ఉన్నేస్యలుగ్భవేత్।

[58] బిందురన్వాదినుస్థానే లిదులేషూండుడోశ్చలుక్ ౨౨

(అత్రచశబ్దోవార్థః) శ్లో॥ (95) నిత్యవైకల్పికావతప్రి।

బిందూపరితదోష్టడా।

అత్ర=అస్మిన్విషయే; (60) కోశబ్దోమధ్యముఉజోః పరయోర్బబ

హుళంకానోః ౨౩

(61) తయోర్ధిఘ్రస్య హాప్రిస్వస్స్యానోర్దిత్వ మపికథ్యతే

(62) బిందూపరిస్థ తడడోలోపస్స్య ద్రావిభాషయా। ౨౪

ఇంచుకస్సంస్కృతధాతూనా। మంగలాదే స్తథాత్రచ।

(115) అనుప్రయుక్తోగుర్భావభేదకస్య నుజంతకః।
స్యాన్నజోనుప్రయోగీవా [116] హ్రస్వస్తస్యాపివాభవేత్ ౪౮
[117] కలాన్నవర్ణకాదున్నాల్లోపస్తచ్ఛబ్దవస్యవా।
118) ధాత్వాద్యనుప్రయుక్తాస్తుదృశ్యంతే ధాతవోహిరే॥ ౪౯
విలక్షణార్థదా ఏతేశబ్దపల్లవసంజ్ఞకాః।
[119] చేచ్ఛబ్దార్థస్యసంబంధేల్పటో లిడపిసమ్మతః। ౫౦
[120] తల్లిఙ్గసంఖ్యాభిధాయి వచనం ధాతుభేదకమ్।
(121) ఆత్మార్థేభిహితే భ్వాదేరగతే రత్రనోగతిః॥ ౫౧
(122) నలయ్యాదిక్రియా కర్తృభావవృత్తేస్తునుజ్మతః।
(123) గతిబుద్ధ్యదనార్థాయే కర్మకాశ్శబ్దకర్మకాః॥ ౫౨
తేషామపిరణేకర్తా ప్రేరణేకర్మభావభాక్।
(124) క్వచిత్కర్తురనుక్తస్య షష్ఠీచబహుళంభవేత్॥ ౫౩
కన్వాదియోగేప్రయోజ్యకర్తుర్నిత్యం జమిష్యతే॥ ౫౪

ఇతిక్రియాపరిచ్ఛేదః

---

అథకృదంత పరిచ్ఛేదః.

—:◆:—

శ్లో॥ [1] యథావ్యవహృతిజ్ఞేయాః కృతామర్థామనీషిభిః।
దుఙ్ఛిన్నప్రత్యయోధాతోర్విహితః కృదితీష్యతే॥ ౧
వక్ష్యమాణాభావకర్తృకర్మాద్యర్థాః కృతామిహ।
మహాజనస్యవిజ్ఞేయా వ్యవహారానుసారతః॥ ౨

(2) లుక్కృత్కగతపవేమిషుకగచయవానాంపరే

(3) వ్వాలుగ్వాదేః। కస్యాః దికకపుషుకనో। రాదేరాః; కినియుముదియు

నస్త్వరః॥ 3

(5) చేయ్వాదే స్త (4) జ్యాలుగ్వాదే (6) రడంగ్వాదే (7)రిమిః

(8) కుచః॥

టవర్ణకస్యాద్యాద్వాదే ర్భవేదపితతోంత్యలుక్॥ ४

(8) పడ్వాదిభ్య స్తుస్తథాద్యా। శ్చిష్టాదీర్ఘా భవంత్యపి।

(9) తోభవేదావులించ్వాదే (10) స్త్రియ్వాదేః పవర్ణకః॥ ५

(11) పుర్మాయ్వాదే (12) రికోంజ్వాదే (13) ర్నజప్వాదే (14)

స్తతోబదిః।

వేల్వాదే (15) రస్తుగీర్వాదే (16) ర్వన్మన్వాదేస్తథాభవేత్॥

(17) కోర్వాదిభ్యళికిస్తద్వ (18) చ్ఛేర్వాదిభ్యోగడోమతః।

(19) మాత్వాదేస్యాదకో (20) డుస్యాదాత్వాదేస్తత్రిపశ్చరో॥ ६

(21) అడుశ్వాదేరురవుపీ (వి, ఇ) (22) వడికల్యాదయః పరే।

వర్ణకాఅత్రవిజ్ఞేయాస్సుకవివ్యవహారతః॥ ७

తూనుశ్చేకశ్చతూగో స్యాత్ చూచోశ్చాటురకిస్తథా।

క్లిబేనుయుక్తఅటస్స్యాత్। పెంచోర్ద్రా ప్రేపురిత్యపి।

శేషశబ్దాలికే కస్యాత్ ప్రబంధ్యానాం వరియోగతః॥ ८

ఇతిత్రృందశ పరిచ్ఛేదః॥

---

(23) వళిఃపాదాద్యవర్ణస్స్యా త్ప్రాసస్తుతదనంతరః। ౯

(22) ఆమ్రేడితపదాద్యస్యాఋ రస్య హ్రస్వదీర్ఘయోః

హ్రస్వదీర్ఘాగిగీస్యాతాం కుత్రాపియాం కవిసమ్మతౌ॥ ౧౦

సర్వత్ర నద్రుతః క్వాపథ్రేవ యతిరేకేతువాభవేత్।

ఉత్తరస్యకొనోర్ధాతోః కంబుధాః కేచి దూచిరే॥ ౧౧

ఇక్కర్జమొనరించి యేగుము రొక్కమిచ్చి యోర్వకనుండె, ఓర్వకుండె

ఊరడకనడవిలో వేటాడె।ఊరకడివిలో వేటాడె।

"గబ్బిమరుడానఁబెట్టుక గొబ్బన పైబడును"తమ్ములఁదీసికవచ్చితి।

తమ్ములదీఁసికొని పత్తే॥ ఆనఁబెట్టుకొని, ఇత్యాది॥

యవలాలఘువోలఘువః స్నిహ్యంతినరా తథాలరో రేఫః॥

అన్యేవిశేషవిషయాశ్చార్యవ్యవహారసరణితోజ్ఞేయాః॥ ౧౨

---

ఇతిప్రకీర్ణకపరిచ్ఛేదః॥

---

శిష్టాన్వవాయజలనిధిజనితః శ్రీకృష్ణమూర్తికృతిచంద్రః।

వ్రతనోద్విద్వచ్ఛేతః కువలయసమ్మోదకారిణీం జ్యోత్స్నాం॥

శ్రీలలితార్పితాభవతు॥

శ్రీశ్రీశ్రీ॥

శ్రీకృష్ణమూర్తిరచితా। వృత్తిరియంనన్ననార్యసూత్రాణాం।

జ్యోత్స్నాసతతంవసతా దాచంద్రార్కం కవీంద్రరసనాసు॥

శ్రీశ్రీశ్రీ

జ్యోత్స్నాపరనామధేయా హరికారికావళీ సమాప్తా.

# బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాపర
# పార్థమన్య శ్రీమహోత్సవము.

---

(ఇది కల్లూరి వేంకటరామశాస్త్రి కృతము.)

(2-2-1916 దేశమాత పత్రికనుండి)

(ఇయ్యది రాక్షసవత్సర భాద్రపదమాసమందలి సంపుట 4 సంచిక (7) యాంధ్రసాహిత్య పరిషత్పత్రికమోమున నెక్కిపాఱుచున్న వఝ్ఝలచినసీతారామస్వామి శాస్త్రిమణి సమారోపిత గుప్తార్థప్రకాశికా వ్యాఖ్యాదోషములకు సమాధానములు)

శ్లో॥ వఝ్ఝులాన్వయభూరాంధ్రగవ్యం చద్గ్రామ్యధర్మధీః
సీతారామస్వామిశాస్త్రీ।నమ్యత్తే సవ్యపాణినా॥

విబుధవశంవదులారా

విజయనగరేవాస్తులైన శాస్త్రులవారి పాణిని లిఖితమూలకంబుగా గ్రహణంబు సేసికొని యుగ్రతావ్యగ్రతా సమగ్రంబగు సముద్ధతముఖంబున ముక్కులు గఱవంగాఁ ద్రుళ్ళియాడుచుఁ జిందులుత్రొక్కుచు స్ఫటాటోపభయంకరమగుధాటి వాటిల్లుచున్నమాటలు బి ఖీ షి కలతో విజయముచేసి మహోన్నతపదవిని బెచ్చు రేగుచున్న యుపన్యాస సీమాలక్ష్మి పూర్వోక్త పత్రికారత్నంబునఁ బరిఢవిల్లుట కంటి [illegible] జెప్పిన రాక్షసాబ్దశూన్యమాసమున శీర్షోదయ మొందిన దీనిమేన నట్టిదుష్టాల వాసనలు తలముక్కలుగా నంటుకొన్నట్లు కానిపించెడు. దీనికి గుణములయందు శూన్యతాబుద్ధియు, దోషములయందు మాన్యతాబుద్ధియు సహజంబగు చుంటస్పష్టపడుచుండు. ఇయ్యది బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామ శాస్త్రులవారివలన నుద్భవిల్లినగుప్తార్థప్రకాశికా వ్యాఖ్యాలక్ష్మిని బత్రియశిష్యుం డైన సుంకరరంగయ్య గారిదియన్న యా

మిషసంపద నుపయోగించుకొని బలిసిధిక్కరించుచు లేనిపోని దోషం బులుమోపి "విప్రాః పశ్చిమబుద్ధయః" అనున్యాయమ్మును "దోషా గుణా గుణాదోషాః" అనువచనార్థమును సత్యపఱుపఁ జూచుచున్నది. ఏమీ దీనికిసూదిబెజ్జమంత నోరును, నాఁకసమంతయాఁకలియు గానం బడుచుండు. తలకుఁదగని యింతయాశ "దరిద్రాణాం మనోరథాః" అను న్యాయమ్మున నందనిమ్రాఁకులకు నఱ్ఱులసాఁచుటవంటిదియే కాని యొంతమాత్రమును దీని పెదవిపాటునకు నైనను నవకాశముండనేరదు. ఇట్టి కోపాసూయావేశంబులుగల సీమాఁతుమ్మలు కాలమహిమనుముం దు బయల్వెడలి శివాలాడుచు దృశ్యాదృశ్యజ్ఞానంబుగల కోమలాం గుల కనుమూసి గంతలుగట్టి నష్టముగలిగింప వచ్చునన్న దురాలోచ నము సేసియే గ్రంథకర్తగారు తాముపండితులయ్యును "ఆపరితోషాద్వి దుషాం నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానమ్" అను కాళిదాసోక్తిని మన మున నిడుకొని సప్తర్షులనందఱి తమకు గౌరవంబునపేర్మిగల కొం దఱు సజ్జనులకడకు స్వగ్రంథమునంపి వినయసంపదతో వేఁడి తెప్పించిన తదీయాభిప్రాయములు గ్రంథారంభమున వారిగుణగణాతిశయములు శాశ్వతముగా నుల్లసిల్ల ముద్రింపించిరి. కావున నట్టిసప్తర్షికల్పులు బ్రహ్మశ్రీలు—

(1) వావిలికొలను సుబ్బారావుగారి నిబ్బరపుసూక్తి ముక్తాఫలము దానముగాఁగాంచి యుబ్బురపుశుభంబులు చుబ్బచుఁజాఱవెట్టుచు,

(2) చెన్నాప్రగడ భానుమూర్తిగారి మహోదార హృదయాబ్జవితీర్యమాణశుభానుమోదనభారతిం గనుంగొని ప్రచండమార్తాండ ప్రభాచ్ఛటలు ప్రకటించుచు,

(3) జయంతిరామయ్యపంతులుగారి సుమనోమనోభిరామస్వభావ ప్రతిపాదిత ప్రశంసాబహుసుమములను జయ్యంబైన శ్రీరామరక్షనొందుచు,

[4] కస్తూరి శివశంకర శాస్త్రిలగారి సదాచార సంపద్ఘుమఘుమాయమాన మాన సార్పిత బహుమానోక్తిం జేకొని లోకశివంకరత్వము వెల్లడిసేయుచు,

[5] వేదము వేంకటరాయశాస్త్రిగారిసహృదయ హృదయంగమసౌజన్యసముత్సృజ్యమాన సంస్తుతింగైకొని సూరీంద్ర సామరస్యంబు సల్పుచు,

(6) రావు బహదూర్ కందుకూరి వీరేశలింగము పంతులగారి సహజసరససామనస్యపూర్వకశ్లాఘనముం గ్రహించి యపారంబగు బీరంబుల నెఱపుచు,

[7] ఆకుండివ్యాసమూర్తి శాస్త్రిలగారి గభీరాశయ సుభగంభావుకసంభావన సంపాదించి భవ్యాసమానసారస్య సంపదలు బయల్పఱుచుచు,

ఇటులు నిర్భీకపండితాదరణపర్యాప్తిం జెంది దాడి వెడలిన యీగ్రంథ రాజశిరోమణి గుప్తార్థ రాజ్యమ్మును వ్యాప్తుగ నెగురఁ దన్నుకొనిపోవఁగా సామాన్యద్విజశక్తికి శక్యంబగునే మహర్షులచే మన్నింపంబడు మహాభాగధేయరత్నమును భిక్షావందనమ్ములబిగిని బుష్టిపూర్తిం గాంచిన యొకయతిమూర్తి యడ్డమై యతిహీన ముసేసినచో గోఱంత గలుగునే? కులగిరులు శిరసావహించిన యీరత్నగర్భామండలి నొకగులకరాగుట్ట యెదిరిననేమి కొదువగలిగెడు కాఁబట్టి యింతమాత్రన నీగ్రంథరాజమునకు లోపం బెంతమాత్రమును నొదవదు.

అయినను, కలహంబనెడి యోదనంబేకాక యరణ్యంబునఁ బ్రాణి రసహితంబైన యోదనంబునను నుండి "కనుదోయి" లోని కనుపదమును సహితమును, బ్రథమావిభక్తి యని త్రోవఁ గానలేక దిగ్భ్రాంతిం జెంది కనుదోయిం దెఱవలేని యీయాఁడుసీమాలక్ష్మినే

కాకినింజేసి దయార్ద్ర హృదయంబగు పండితమండలి దవ్వున విడుచుట యుక్తంబు గాదుగాన నీవటిలోనుంచి పెద్దలమర్మంబు లేర్పరించి పలువురను బాగుసేసి యాతకేతమైన పిల్లలతల్లియని పించుకొన్నలోకకుటుంబిని యానీపత్రికామ తల్లిక హితోపదేశమునకుం దీనిం జేయివట్టుకొని మెల్లమెల్లఁగాఁ జేర్పఁ జూచెదముగాక! లోకములో నొక శుభకార్యము తలపెట్టుకొన్న సమయమున నాదిని దేవతాస్మరణము శిష్టాచారముగా నున్నందున నిట్టి విద్యారంభ కార్యంబు జరిగించునట్టి యెడననంగూడఁ దీర్ఘ స్వార్థము లుభయమునుగలసి వచ్చుటకై, దేవతావిద్యాశబ్దములయొద్ద వ్రాసిన ప్రతివాదుల మనంబునందలి ప్రధానాక్షేపణమునే మొట్టమొదట నెత్తుకొని బోధ సేయింపఁదలంతుముగాక!

ఈ పీమాలతిమ్మవ్రాఁతలయందు నెంతమాత్రమును మాన్యతలేక కేవలమును గుణశూన్యతయే స్థిరీకరించుచున్నారము గావున "వజ్రం వజ్రేణభిద్యతే" న్యాయమునఁ దిరిగి మేమును శూన్యమాసమునే సుముహూర్త సమయముగా నెంచుకొని యుత్తరించుచున్నారము.

## పూర్వపక్షము.

(4) స్త్రీలింగమ్ముల ప్రథమైకవచనమునకు లోపంబగు" తత్సమ: (57) సూత్రమునకు స్త్రీలింగములనఁగా "స్త్రీవాచకము" లనియర్థము చేయుట కేవలము పొరపాటు. అట్లుకానిదో దేవతావిద్యాదిశబ్దములు స్త్రీవాచకములు కాపుంజేసి "దేవత" "విద్య" అనురూపములు సిద్ధింపనేరవు. వ్యాఖ్యాత యిట్లపార్థము చేయకుండినచో స్త్రీవాచకములు గాకున్ననుఁ నవిస్త్రీలింగములేగాన మూలమునుబట్టి సాధ్యములగు.

## సమాధానము.

చూచితిరా! యీయగాధ సంస్కృతపాండిత్యము! దేవతావిద్యాశబ్దములు స్త్రీవాచకములు గాకున్నను స్త్రీలింగములట! స్త్రీలింగ

మయినది స్త్రీవాచకమేలకాదో! తెలియకున్నది. స్త్రీవాచకముగాకు న్నను, స్త్రీలింగముగు ననుమాట సహోదరుఁడు గ కున్నను, సోదరుఁ డగు; గ్రామ్యము గాకున్నను, లపశబ్దమగును; ఎడమచేయి గాకు న్నను, పుష్టిచేయియగును, అనుటవంటిదై పరిహాసాస్పదమగుచున్నది. మఱియు, లింగమనునది శబ్దమునకు, జెందుంగాని యర్థమునకు సంబం ధింపదని ప్రతిభటుల తాత్పర్యమయినట్టులు తోచుచుండు. అయ్యాది యశాస్త్రీయము, అపార్థము శాస్త్రమార్గమాలోచింపఁగా "దేవత, విద్య" అన్నవి స్త్రీవాచకములు కానిచో, టాప్ప్రత్యయమెట్లు సంఘ టిల్లును స్పష్టార్థ మీక్రింద నీశబ్దముల ప్రక్రియకొంచెము సూచింపఁ బడును. "దేవాత్తల్" అను సూత్రమున (5_4_27) దేవశబ్దముకంటె స్వార్థికమైనతల్ ప్రత్యయమురాఁగా "దేవత" అని హ్రస్వాంతము తద్ధితాంతమగును. విదధాతువు కంటె "సంజ్ఞాయాంసమజ, నిషద నిపత, మన, విద, షుఞ్, శీఙ్, భృఞిణః (3_3_99) అనుసూత్ర మునఁ గరణార్థమందు, క్యప్ప్రత్యయమురాఁగా "విద్య" అనిహ్రస్వాం తము కృదంతమగును. ఇపుడు, తలంత దేవతశబ్దమును, కృదంత విద్య శబ్దమును నగునదంత ప్రాతిపదికములు స్త్రీవాచకములు గావుననే "అజాద్యతష్టాప్ (4_1_4) అనుసూత్రమునఅజాదిప్రాతిపదికములును, అదంతప్రాతిపదికములును స్త్రీవాచకములగుచో స్త్రీత్వమునకు ద్యోతక కమగు టాప్ప్రత్యయ మగును అనిఫలితార్థము! సహజంబులైన దహ నప్రకాశశక్తు లగ్నియందుగూఢములై యుండఁగా నయ్యావిప్రకటింపఁజే యుటలో శుష్కేంధనము సాధనమైనట్లు ప్రాతిపదికంబులకే సహజా ర్థమైన స్త్రీత్వమును, టాబాదులుస్ఫుటీకరించుచు ద్యోతకములనిపించు కొనును ప్రాతిపదికార్థప్రాతిపదికంబులకు వాచ్య వాచకభావము సం బంధము. ప్రత్యయార్థ ప్రత్యయములకు ద్యోత్య ద్యోతకభావము సం బంధము. కాఁబట్టి. "దేవత, విద్య" అనుశబ్దములు స్త్రీత్వవాచకము

లుగాననే యాకారాంతములై స్త్రీలింగములని చెప్పంబడు. "ఆకారాంత స్త్రీలింగో దేవతాశబ్దః" అను శబ్దమంజరీ పాఠమునం జేసి లింగము శబ్దమునకే కాని యర్థమునకుం జెందదని ప్రతిభటుల తాత్పర్యముగాం బోలు!! అయ్యది శబ్దమంజరీపాఠకుల జ్ఞానమే. ఆజ్ఞానము సంస్కృత వ్యాకరణగంధమును మూర్కొన్నదిగాదని స్పష్టమై నిబయల్పడుచున్నది. ఇంకను దేవతాదిశబ్దములర్థములలోం బుంవ్యక్తిని దెలియం జేయునపుడు స్త్రీవాచకము లెట్లగునని శంకింతురేని వినుండు. "స్త్రియామ్॥ [4—1—3] అనుసూత్రమును వివరించుసమయమున మహాభాష్యకారులు "స్తన కేశవతీ స్త్రీస్యాత్। లోమశః పురుషః స్మృతః। ఉభయోరంతరంయచ్చ। తదభావే నపుంసకమ్। లింగాత్ స్త్రీపుంసయోర్జ్ఞానే। భ్రూకుంసేటాప్రసజ్యతే॥ అనున్యాయమున స్తనకేశచిహ్నములంబట్టి స్త్రీలింగమనియు, శ్మశ్రురోమకళాచిహ్నములంబట్టి పుల్లింగమనియు నిర్ణయముసేసితిమేని స్త్రీవేషధారియై వర్తిల్లి పురుషునింజెప్పెడి భ్రూకుంసశబ్దమాకారాంత స్త్రీలింగముగావలసి యతివ్యాప్తి తటస్థించుననియు, ఇష్టస్థలములైన ఖట్వావృక్షాదిశబ్దములయందు స్త్రీపుంసలింగత్వానులు సంభవింపక యవ్యాప్తివచ్చుననియు శంకించికొని వ్యాకరణశాస్త్రమందు శాస్త్రీయలింగము (లేక) పారిభాషికలింగము ముఖ్యముగాని స్తనకేశ శ్మశ్రురోమకళాదిస్వరూపమగు లౌకికలింగము ముఖ్యముగాదని పరిష్కరించిరి. "స్త్రియామ్" అనుసూత్రమును వివరించునట్టిప్రకరణమందే భాష్యకారులు "సంస్త్యాన ప్రసవౌలింగమాస్థేయౌ స్వకృతాంతః [స్వసిద్ధాంతతః] సంస్త్యానే స్త్యాయతేర్డ్రట్ స్త్రీ సూతే సప్రసవే పుమాన్" అని లింగలక్షణమును సిద్ధాంతపఱచిరి స్త్యై ధాతువుకంటె డ్రట్ ప్రత్యయంబుగలిగి స్త్రీశబ్దసిద్ధియగుననియు సూఙ్ ధాతువుకంటె డుమ్సున్ ప్రత్యయమును, ధా

.తుస కారదీర్ఘోకారములకుఁ గ్రమముగా సకార హ్రస్వము లాదేశ ములై, పుంశబ్ద సిద్ధియగుననియు, నీవ్యాకరణ శాస్త్రమున స్త్రీశబ్దము నకు సత్త్వరజస్తమోగుణములయుపచయమును (క్షయము) "పుం" శబ్దమునకు సత్త్వాదిగుణముల యుపచయము (వృద్ధి) నర్థములనియుఁ బుంస్త్రీశబ్దములు భావప్రధానములనియుఁ బైశ్లోకార్థమును స్పష్టపఱి చిరి. ఈశ్లోకములోని పుం స్త్రీశబ్దములచేత నుపచయాపచయములే కాక యుపలక్షణంబుగ సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థయు గ్రహింపఁబడునని వ్యాఖ్యాతలు విశ్వములోని సర్వపదార్థములును సాంఖ్యమతమునందు న్యూనాధిక భావంబునన ంగాంగిత్వము నొందిన సత్త్వ రజస్తమోగుణముల యుపచయమునువక్త ప్రధానముగా నెంచినచోఁ దద్వాచకశబ్దము పుల్లింగమగుననియు, అట్టిగుణముల యుపచయమును వక్తయుద్దేశించినచోఁ దాదృశపదమును స్త్రీలింగమగుననియు, నిట్లేసా మ్యావస్థ ముఖ్యముగా వక్తభావించెనేని నపుంసకలింగమగుననియు, భావము. మనయెదుట నొకవృక్షముం జూచి యావృక్షమువిషయమై "అయంపదార్థః। అని ప్రయోగించితిమేని వృక్షము సత్త్వాదిగుణత్రయపరి ణామమేకాన నపుడు మనము ప్రయోగించిన ప్రకృతవాక్యములోని పదా ర్థశబ్దమందలి పుల్లింగమున వృక్షస్వరూపమయిన సత్త్వాదిగుణ సముదా యమునకుం జెందిన యుపచయమర్థమగును. "ఇయంవ్యక్తిః। అని ప్రయో గించితిమేని స్త్రీలింగమైన వ్యక్తిశబ్దము యొక్క ప్రయోగంబున వృక్ష రూపమయిన సత్త్వాది గుణత్రయమందలి యపచయమర్థమగును." "ఇదంవస్తు" అనివాక్యముప యోగించితిమేని వృక్షాత్మకమయిన సత్త్వా దిగుణత్రయ మందలిసామ్యావస్థ నపుంసకమైనవస్తు శబ్దమునఁ జెప్పం బడును. ఇట్లే విశ్వములోనిసర్వపదార్థములయందును సత్త్వాదిగుణముల యుపచయాపచయ సామ్యావస్థలువివక్షింపఁబడినచోఁ గ్రమముగాఁ

బూర్వోక్తములైన లింగత్రయబోధక వాక్యము లుపయోగింపఁదగు.
మఱియు, లింగమున విశ్వమయమైన సత్త్వాదిగుణముల యుపచయాప
చయ సామ్యావస్థలు బోధింపఁబడుచున్నందున లింగముశబ్దార్థమునకుం
జెందునంగాని శబ్దమునకుం జెందదన్నట్లు భాష్యమందే తాత్పర్యము
స్పష్టపఱుపఁబడినది. ఇట్టి భాష్యతాత్పర్యమే "స్త్రియామ్। అనుసూత్ర
మందలి స్త్రీత్వమును వివరించుసమయమున "అచేతనఖట్వా వృక్షాది
సాధారణం లింగంతు సత్త్వాదీనాంగుణానాం ఉపచయాపచయస్థితిరూ
పం క్రమేణపుంస్త్రీనపుంసకాఖ్యం. పదార్థశబ్దాన్యత్వాద్దృష్టంలింగాన్య
త్వమితి భాష్యోక్తేరర్థనిష్ఠం కేవలాన్వయి. ఇయంవ్యక్తిరిదంవస్త్వయం
ఫదార్థఇతి త్రివిధవ్యవహారస్య పదార్థమాత్రే సత్త్వాత్॥ అనిశబ్దేందు
శేఖరమందు వివరింపఁబడినది. విశ్వమందలి సర్వపదార్థములయందును
నుపచయాపచయసామ్యావస్థ లెట్లుండుననఁగా:—సృష్టికింబూర్వమున
సామ్యావస్థలోనున్న సత్త్వరజస్తమోగుణము లాత్మయొక్క నియామ
కత్వములేకయే, తమంతతాము న్యూనాధికభావమున నంగాగిత్వము
నొంది శబ్దస్పర్శరూపరసగంధాత్మకంబగు జగదాకారముగాఁ బరిణమిం
చెనని గదా సాంఖ్యమతము. (ఇట్టి సాంఖ్యమతనిబంధనలు "ప్రవృత్తే
శ్చ॥ (2-2-2) "అంగిత్వా నుపపత్తేశ్చ (2—2—8) ఇత్యాది సూత్ర
ములయం దుద్ఘాటించి శాంకరబ్రహ్మసూత్రభాష్యమున ఖండింపఁబడి
నవి) అందున స్వయముగానే యుపచయాపచయ సామ్యావస్థలను బొం
దునట్టిశక్తులు సత్త్వరజస్తమోగుణముల యందున్నందునఁ దత్పరిణామ
ములైన జగత్పదార్థములయందును నయ్యవి గూఢములై "కారణగుణాః
కార్యేసంక్రామంతి॥ అనున్యాయమున మృద్దర్శనము ఘటశరావాదుల
యందున్నట్లు లిమిడియుండునని సాంఖ్యమతతాత్పర్యము. ఇట్టి తాత్ప
ర్యమే "శ్లో॥ ప్రవృత్తిరితి సామాన్యం। లక్షణంతస్యకథ్యతే। ఆవిర్భావ

(ఉపచయ) స్తిరోభావ (అపచయ) స్థితిశ్చే (సామ్యావస్థా) త్యథభిద్యతే ప్రవృత్తిమంతస్సర్వేర్థా । స్త్రీసృభిశ్చప్రవృత్తిభిః” అని హరికారికయందు వెల్లడింపఁబడినది. ఇఁకను సాంఖ్యమతమున లోకములోని సర్వపదార్థములును సత్త్వరజస్తమోగుణ పరిణామములే కాన నట్టి యుపచయాపచయసామ్యావస్థలను బర్యాయముగా వక్తృవివక్షించినచో దేవతాది శబ్దములకుం గూడఁ బున్నపుంసకలింగము లేల రాఁగూడదని శంకింతురేని యట్లనవలదు. శిష్టలోకవ్యవహారపరంపరం జేసి “లింగమశిష్యంలోకాశ్రయత్వాల్లింగస్య” అను న్యాయమున నొకానొక శబ్దముచే నుపచయాపచయ సామ్యావస్థలలో నొక్కొకటియే వివక్షింపఁబడి యొక్కొక్కలింగమే తత్పదార్థమునందుఁ దెలుపంబడును. దారశబ్దమున నుపచయమాత్రమె వివక్షింపఁబడి పుల్లింగము తెలుపంబడును. అప్శబ్దజ్ఞాన శబ్దములచేతఁ గ్రమముగా నపచయ సామ్యావస్థలుమాత్రమే భావింపఁబడి స్త్రీలింగ నపుంసక లింగరూపార్థములగును ఒకానొకశబ్దమున ధర్మద్వయమును పర్యాయముగా వివక్షింపఁబడి లింగద్వయమునునగు. నక్షత్రవాచకమైన యుడు శబ్దము నక్షత్రపదార్థగతమైన సామ్యాపచయములను బోధించు నపుంసక స్త్రీలింగములను బర్యాయముగాఁ దెల్పును. నక్షత్రశబ్దము నపుంసకార్థమునే బోధించును. తటశబ్దము పర్యాయముగా మూఁడులింగములను వహించును. ఒకానొకచోఁ బారిభాషికలింగముతోఁ గూడ నైకమత్యమునొంది “లోమశః పురుషస్స్మృతః॥ అనున్యాయమున మేహనాది చిహ్నవిశిష్ట పదార్థమును గూడ నొక ప్రకరణంబున శబ్దము బోధించును. “పశునాయజేత॥ అను-చోటఁ బశుశబ్దము శాస్త్రీయమైన సత్త్వాదిగుణముల యుపచయమునే కేవలమును దెలుపక పుంశ్చిహ్నమైన శేఫస్సుంగూడ (అర్థవిష్టమగునట్లు) బోధించును, కావుననే పుల్లింగమై, మన్యుశ్రీకి శాస్త్రీయమై యుష

యోగించుచుండు. ఇట్టి తాత్పర్యమే "తత్సంభవేతు శాస్త్రీయ విశిష్టే లౌకికే శాస్త్రీయ మపిశబ్దాత్ బుధ్యతే; తథానుభవాత్। అని శబ్దేందు శేఖరమందు నుద్ఘోషింపఁబడినది. "శ్లో॥ అయమైంద్రీముఖం పశ్య రక్తశ్చుంబతిచంద్రమాః॥ ఇత్యాదిస్థలమందు స్త్రీపుంసకలింగములైన యైంద్రీచంద్రమశ్శబ్దములచే శాస్త్రీయముతోఁ గూడ లౌకికలింగము భావన సేయఁబడినందుననే "చంద్రమశ్శబ్దగతపుల్లింగేన, ఐంద్రీశబ్దగత స్త్రీలింగేనఁ తత్ప్రతిపాద్యేంద్రీ సంబంధిత్వేన చోపస్కృతాద ప్రస్తుత పరవనితా సక్తపురుషవృత్తాంతః ప్రతీయతే" అను కువలయానంద గ్రంథప్రకారమ్మున, లోకములోని నాయికా నాయకులు వ్యంగ్యరీతిని బోధింపఁబడి సమాసోక్త్యలంకారము సిద్ధించుచుండు.

మఱియును, లింగమర్థనిష్ఠమై శబ్దసంబంధి కాదుగనుకనే యైంద్రీచంద్రమశ్శబ్దములచే వ్యంగ్యసరణిని నాయికానాయక పదార్థములు బోధింపఁబడి యలంకార సమన్వయంబగును.-లింగము శబ్దసంబంధియే కేవలము నయ్యేనేని నాయికాద్యర్థములను బోధింపనందున నలంకార సమన్వయం బెట్లగును ? కావున దేవతావిద్యాదిశబ్దములచేతఁ బదార్థగతఁ స్త్రీత్వమే బోధింపఁబడును. అనఁగా లౌకికలింగముతో నైకమత్యమును బొందని చోటుగాన శాస్త్రీయలింగమైన సాంఖ్యమతప్రకారసత్త్వాది గుణముల యుపచయరూప స్త్రీత్వమును "శ్లో॥ సంస్త్యాన ప్రసవౌలింగ మాస్థేయాస్వకృతాంతతః(స్వసిద్ధాంతతః) సంస్త్యానే స్త్యాయతేర్డ్రట్ స్త్రీ సూతేఃసప్ప్రసవేపుమాన్॥" అను పూర్వోక్తభాష్యసిద్ధాంతప్రకారమున నట్టి దేవతా విద్యాదిశబ్దము వచించును. ఇట్టి విద్యాదిశబ్దములే యాలంకారికప్రకరణములో వచ్చినయెడ సందర్భానుసారముగా లౌకికలింగము సైతము భావింపఁబడి నాయికగూడ వ్యంగ్యార్థమై "విద్యానాథః" ఇత్యాదిస్థలములందు విద్యలు స్త్రీలువోలె నాతనిని

మోహించి వశమందున్నవి యన్న లౌకిక స్త్రీ లింగార్థముగూడ వ్యాంగ్యంబగును. కాబట్టి తత్సమపరిచ్ఛేద 47 సూత్రమును వివరించుచో బ్రహ్మశ్రీ వేంకటరామశాస్త్రిలుగారు స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకమని యర్థము చెప్పుట బ్ర॥ సీతారామస్వామిశాస్త్రిలుగారు మాత్రముగాక స్త్రీపురుషాదులందరును జయజయశబ్దములతో మెచ్చుకొనందగియున్నది. ఇంకను శబ్దమునకుం జెందక లింగమర్థమునకే చెందెనేని "అకారాంత స్త్రీలింగోవిద్యాశబ్దః" ఇత్యాదిస్థలములందు స్త్రీలింగః॥ అన్నది విద్యాశబ్దమునకెట్లు విశేషణమగుట యుక్తమందురేని "శ్లో॥ రామేతద్వ్యత్యరం నామ। మానభంగః పినాకినః। శౌర్యభంగోరావణస్య మదభంగస్యవాలినః" అన్నచోటునం బలెవాచ్యవాచకములకు నభేదాధ్యవసాయంబున యుక్తంబయ్యెడి. కనుకనే "పుల్లింగశ్శబ్దఇత్యాది వ్యవహారస్తు వాచ్యవాచకయోరభేదాధ్యవసాయాత్" అని చంద్రికాదివ్యాఖ్యానములయందు "స్త్రియామ్" అను సూత్రమందలి శేఖరమునొద్దం జాటబడుచున్నయది. లింగ మర్థమునకే సంబంధించి శబ్దమునకుం జెందదు గనుకనే "అస్త్యాదిషునపుంసకగ్రహణం శబ్దగ్రహణం ద్రష్టవ్యమ్। యుక్తంపునరిదం విచారయితుమ్। నస్వనేనాసందిగ్ధే నార్థగ్రహణేన భవితవ్యమ్। నహినపుంసకం నామశబ్దోస్తి" అని "స్వమోర్నపుంసకాత్" అను సూత్రమందలి మహాభాష్యమందు లింగమర్థనిష్టముగాని శబ్దనిష్ఠముగాదని డిండిమఘోషంబుతో ఘోషింపఁబడియె. ఇట్లుండగా స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకమని వివరించుట గ్రంథకర్తకిష్టమున్నది. అయ్యది యొప్పాలకుప్ప యనంగవలయు. ఉత్తరకుమార ప్రజ్ఞలతో "అపార్థము, అపార్థము" అని పలుమాఱు పలుకంగ నేళ్లు గడచిపోవదుసూ!! అపార్థముగాదు. ఇదిగో ఇపుడు సపార్థము పార్థమన్యు శ్రీమహోత్సవమునకుఁ బార్థుండు లేకుండుటయెట్లు సంఘ

టిల్లు. పెండ్లికిఁ బెండ్లికొడుకు లేకుండు నన్నవారు ప్రమత్తు లనిపించు కొనరా? కావున నట్టులాడువారి మాట ప్రమాదకము, అతిసాహసము, దుస్సాహసము, మఱియు, ఇచ్చట నాడువారిమాట యనుటం జేసియు, అతిసాహసమనుటం జేసియు నీక్రిందిసంగతి స్మరణంబునకు వచ్చుచుండుననియు లోకములోఁ గొందఱు శాస్త్రినామధేయులు పురుషపదార్థలక్షణం బిసుమంతయు లేకుండి వామాచారవర్తనులై ప్రతీపదర్శినీరసజ్ఞత్వమున గుణమ్ములయందు దోషము లారోపించి వ్యర్థముగా శుష్కకలహంబునకుఁ గాల్ద్రవ్వుచు నిష్కళంక స్వభావంబుగల పత్రికారత్నములను సయితము ప్రవదనటనంబులతోఁ గన్నుప్రామిముఖంబులందుఁ దిలకాకృతి నిడుచుండఁగా నట్టి సజ్జనారులయెడ లింగమర్థనిష్ఠమయినచోఁ బుల్లింగమైన శాస్త్రిశబ్ద మెట్లు సమన్వయించుననియు, నెవ్వరయిన శంకింతురేని సావధానముగా నాకర్ణింపుఁడు. అట్టివారియెడ "శాస్త్రమస్యాస్తీతి॥ అని సద్ధితంబైన తద్ధితంబుతో (ప్రత్యయము) వ్యుత్పన్నంబైన శాస్త్రిశబ్దము సమన్వయింపఁగూడదు. ప్రకరణ సందర్భమున నట్టియెడ స్త్రీలింగశాస్త్రిశబ్దము సమన్వయించినచో సర్వశాస్త్రమతంబునకును నవిరోధమై సామరస్యంబు గలుగుచుండు. శాస్త్రిశబ్దము స్త్రీలింగ మెట్లంటిరేని. "గ్రసిత, స్కభిత, స్తభితో, త్తభిత, చత్త, వికస్తా, విశస్తృ, శంస్తృ, శాస్తృ ........(7-2-34) అను సూత్రమున "శాసితృ" రూపముగాక శాస్తృశబ్దము వైదికప్రకరణంబున నిడాగమరహితముగా నిపతింపంబడియె. (1) జగత్ప్రభోరప్రభవిష్ణువైష్ణవమ్ (2) "తంతస్థివాంసం నగరోపకంఠే॥ (3) "త్రియంబకం సంయమినందదర్శ॥ (4) "నిర్మాణమేవహితదాతవలాలనీయం। మాపూతనాత్వ ముపగాశ్శివతాతి రేధి॥ ఇత్యాది వైదికశబ్దములు లోకమునందు బ్రయోగింపఁబడినట్లు ఇడాగమరహితమయిన శాస్తృశబ్దము గూడ

శ్లో॥ అంబేతిగౌరీ మహమాహ్వయామి। పత్నీః పితుర్మాతర్యప్యేవ సర్వాః కథంనులక్ష్మీ మితిచింతయతం। శాస్తారమీడే భవమోచ నాయ॥ శ్లో॥ పాత్రస్ఖలితవృత్తీనాం। (పాత్ర × అస్ఖలిత) శాస్త్రమార్గ ప్రవర్తినామ్। (శాస్త్ర × అమార్గ) అర్ధాంగీకృతదాంపత్యా। మహాంసే వేమహాయమహః॥ ఇత్యాద్యప్పదీక్షితాదుల కాలభైరవస్తుతిశ్లోకప్రయోగం బులంబట్టి లోకమున వ్యవహరింపందగు. అథవా, "ఆగమశాస్త్రమని త్యమ్॥ అను పరిభాషంజేసి "సాగరంతర్తకామన్య॥ అనుచోటంబలె శా స్త్రశబ్దంబును బాహ్మీనులమతంబున లోకప్రయోగార్హమై యామో దింపందగు. ఇట్లు ద్వివిధంబున ఋకారాంతమైన శాస్త్రశబ్దము ప్రయో గార్హముగాన ‹‹ఋన్నేభ్యోజీప్॥ (4-1-5) అప సూత్రమున శ్లో॥ కు త్రాలయోమండనపండితస్య। త్యేతాస్సప్రచ్ఛజలాయగంత్రీః॥ ఇత్యా దిస్థలంబుల గంత్రీప్రభృతి శబ్దములువోలె శాస్త్రీశబ్ద మీ ఋకారాంత స్త్రీ లింగరూపము నిర్వివాదమ్ముగా నుండందగు. పుల్లింగమైన "శాస్త్రీ" అను శబ్దముయొక్క ప్రథమావిభక్త్యేకవచనమును, శాస్త్రశబ్దము యొక్క స్త్రీలింగ ప్రథమైకవచనరూపమును నుభయంబును "శాస్త్రీ॥ అని యిట్లు దీర్ఘాంతముగా సమానాకారముతో నుండును. "నామంబు బుల తుది దీర్ఘంబువకు హ్రస్వంబగు॥ [తత్స; 54] అను సూత్రమున హ్రాస్వముగాంగా నుభయరూపంబులును సమానాకారములై "శాస్త్రి" అనియిట్లు హ్రస్వాంతత్వముతో నుండును. హ్రస్వజ్ఞానంబు గలయెడ నీసూత్రికబునసైన హ్రస్వంబు మఱింతసార్థకంబగు. ఇట్లు తెలుంగువ్యా కరణ మనుగ్రహించుటంజేసి తక్కిన విభక్తివచనంబులయందు నయి తేను స్త్రీశాస్త్రి పుంశాస్త్రిభేదము గానరాకుండు. ఉష్ణకప్పురంబు లొక్కపోలికనున్నను, పరీక్షాసమయము సంభవించునపుడు తారత మ్యము తెలియక మాననట్లు స్త్రీపుంస లక్షణభేదంబు గోచరింపక

మానదు. అట్లైనచో మీపార్థమన్యశ్రీమహోత్సవంబునకు స్త్రీలింగ శాస్త్రిశబ్దార్థము పనికివచ్చునా? యని యెవ్వరైన నడుగుదురేని యా లక్షణభేదము పెద్దలు విచింతురుగాక! అంతవఱకును వారి నమన శ్లోకాదులయందును నుభయవ్యక్తులకును సరిపడునట్టి శబ్దములె ప్రయోగించి కృతార్థుల మగుదుము. అయ్యో! పాపము. శ్లో॥ సురలోకోద్యోదవౌద్వే। స్త్రియాంక్లీబే త్రివిష్టపమ్॥ శ్లో॥ "భిస్సాస్త్రీ భక్తమంధోన్న మోదనో స్త్రీసదీదివిః॥ అనిన యమరనిఘంటువున్నైన నెపుడేని ప్రతివాదులు నోటంబెట్టినచో స్త్రీవాచకమన్నచోట నింతసందేహము వీరిం బాధింపకుండును. "భిస్సాస్త్రీ" "అన్నచోటునంగూడ" భిస్సా-అన్నము, స్త్రీ-ఆఁడుది, "అనియే వీరి తాత్పర్యము చేసికొందురేని యికను బరప్రయత్నము నిష్ఫలము. ఏమీ!" యీవిమర్శన మహాజ్ఞానము. ఈ ప్రేలపిండికి నింత సంతర్పణకోలాహలమా? చాలు! చాలు! ప్రకృతంబునఁ బూర్వోక్తమహాభాష్యశేఖరాది గ్రంథంబుల ప్రామాణ్యమున లింగమర్థనిష్ఠముగాని శబ్దనిష్ఠముగాదు గాన బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులుగారు స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకమని వివరించిన సరణి సర్వవిధములను సర్వోత్కృష్టమై సమరరంగంబున సమ్ముఖీనంబగు పార్థునిప్రహత్కాంబువోలె సార్థకమై పరమ తేజంబునఁ బరిఢవిల్లుంగావుత! మఱియు, నీసమాధానము ప్రతివాదుల మతమునకుఁ దప్పో యొప్పో యీపత్రికాధిపతిగారి పేర నేమన్నిఁ వ్రాయుదురో! యొకటి రెండుపక్షంబుల కాలము పరీక్షించి తక్కిన యంశములకుఁ దిరిగి సమాధానము వ్రాసితీరుదుముగాక! [సశేషము]

## ద్వితీయ ప్రత్యభియోగము.

—:o:—

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిరచిత బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికాపరపార్థమన్యు శ్రీమహోత్సవశేషము.

(చిరకాలమునుండి దానరిపదముగాఁ బాడుచున్న క్లిష్టతమద్వంద్వార్థము విడనాడి తత్సమ ప [39] సూత్రమున గ్రంథకర్త వ్రాసిన కర్మధారయార్థసారాంశము నెఱుంగఁజాలక బ్ర॥శ్రీ॥ వఝ్ఝుల చినసీతారామస్వామి శాస్త్రులుగారు గ్రంథములు సుబంధములు కాక మును పే రాక్షస సం॥ ర భాద్రపదమాసాంధ్రసాహిత్యపరిషత్పత్రికలో దోషోద్ఘాటన సేసి ప్రబంధమగుటయే కాక గతించిన యాంధ్రపరిషత్తుపండితుల యొద్దఁ బల్మాఱీసూత్రార్థము దూషించినట్లు తెలిసినందునను, అందున దృశ్యాదృశ్యజ్ఞానులు నిజముగా గ్రంథకర్త ద్వంద్వార్థము తెలియంజాలకయే పొరపడియుండవచ్చునని శాస్త్రులవారి మనోరథమునకనుకూలముగాఁ సంశయించుచున్నందునను, మామిత్రులు సూత్రమందలి ద్వంద్వార్థక్లేశమును గర్మధారయార్థసౌలభ్యమును విశదపఱుపుమని కోరుచున్నందునను, నయ్యది ప్రకటింపఁబడుచున్నయది.)

శ్లో॥ వఝ్ఝులాన్వయభూశాంధ్రగవ్యం చద్రామ్యధర్మధీః
సీతారామస్వామి శాస్త్రీ నమ్యతే సవ్యపాణినా॥

ఈవఱలో స్త్రీలింగములవిషయమై వ్రాయఁబడిన బాల. వ్యా తత్స: ప.(57) సూత్రముక్రింది స్త్రీవాచకశబ్దముగుఱించి తగుశాస్త్రీయయుక్తులతో సమాధానమీఁబడినది (ఫిబ్రవరి 2 తేది-16సం॥.) దేశమాతలో) కాని నపుంసకలింగములఁగూర్చి రచింపఁబడిన యీసూత్రముయొక్క (తత్స-39) వ్యాఖ్యసారాంశమును లింగసందర్భమునసే

వివరించిబోధించుటయు న్యాయంబైనందున నీయుపన్యాసమందే "స్త్రీవాచకంబు"నకును సమాధానం బంతర్భూతముగాఁగ నట్టికథాక్రమంబు నకును నవతారించుచున్నారము.

ప్రతివాదుల పూర్వపక్షము.

"అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు" నను (తత్సమ39) సూత్రమునకు హ్రస్వాకారమంతమందుగల యమహత్తులైన నపుంసకలింగశబ్దములకు మువర్ణకంబు వచ్చునని యీగుప్తార్థప్రకాశికలో నర్థము వ్రాయఁబడియున్నది. అట్లయినచో స్త్రీలింగమగు వృక్షశబ్దమునకు మూలములో నుదాహరింపఁబడిన "వృక్షమనురూప మెట్లుసిద్ధించును? మఱియు, దైవతము వృషభము, మొదలగు ననేకశబ్దములగతి యేమగునో తెలియకున్నది.

ప్రత్యుత్తరము.

ప్రతివాదులు "వృక్ష"మిత్యాదిరూపము కుదురక దోషమువచ్చునని యుద్ఘాటించుచు ముసుంగులో మెసంగినట్లు చెప్పుదురుగాని "యిదమిత్థ" మ్మని యీసూత్రమునకు నిట్లు వివరింపవలెనని కంఠోక్తిగా ఖండించి స్వాభిప్రాయమును స్పష్టపఱుపరైరని మేమాలోచించుచుండఁగా, నట్టితఱి మ॥ శ్రీ మైనముపాటి హనుమంతరావుగారికిఁ దమసందేహమును నివారించుకొనుటకై ప్రశ్నసేయ బ్ర॥ శ్రీ॥ వ॥ చిన సీతారామస్వామిశాస్త్రులవారికిందివిధంబున నీసూత్రమునకు (తత్స39) నర్థము వ్రాసిరని హనుమంతరావుగారు కాకతాళీయముగా నేతెంచి మాకు దానినందఁజేసిరి. సీతారామస్వామి శాస్త్రిలుగారి సూత్రార్థవివరణము "అదంతములగు నమహత్తులకును నపుంసకలింగశబ్దములకును మువర్ణకమగుననియర్థము. అమహత్వనపుంసకత్వములు సన్నియోగశిష్టములు కానక్కరలేదు" అని ఈవిధముగా వ్రాయఁబశీనద్ది. అన్యఁగా "హ్రస్వా

కారాంతములగు నపుంసకలింగశబ్దములకు ముపర్ణకమగును." అని యిట్లు సముచ్చయార్థమున రెండువాక్యములుగాఁ బైసూత్రమును వివరింపవలసినదని వీరియుఖ్యాభిప్రాయ మైనట్టులు స్పష్టపడుచుండెడి. ది 18—2—16 సం॥రం తేదిని (అనగా రాక్షసస॥ ర మాఘ శుగ౹ర శు॥ న) హనుమంతరావుగారు పృచ్ఛచేసి యుత్తరమువ్రాయఁగా బ్ర॥ శ్రీ॥ వ॥ చినసీతారామశాస్త్రులుగారీయమావాస్యనాఁడు ప్రత్యుత్తరము వ్రాసిరి. కృష్ణపక్షమంతయు నెక్కుడా లోచించి కాలయాపనతో వ్రాసిన వీరివ్రాఁతదృష్టి నాలోచింపఁగాఁ గృష్ణపక్షప్రతిభనే వెల్లడించుచున్నదియని చదువరులే తెలిసికొందురు. పైఁగా "సన్నియోగశిష్టములు కానక్కరలేద"ని సంస్కృతపదము పెద్దబ్రహ్మాండముగా నుప యోగించినారు. ఈపదమిట్టిసందర్భమున సార్థకమో? లేక ప్రయోక్తలకు మీఁదుమిక్కిలి మఱంతయనర్థకమో? యన్నయంశము తర్వాత విచారింతము. కాని ప్రకృతమున నిట్టిసమాసము సంస్కృతవ్యాకరణాధీనముగాన దీనిక్లిష్టాక్లిష్టస్వభావములును దీనియావశ్యకత్వానావశ్యకత్వంబులును గొంచెము పరికించి చూతముగాక! అమహాత్ములకును నపుంసకలింగశబ్దములకును ముపర్ణకమగునని యర్థమువివరించిన శాస్త్రుల వారి వచనశైలిచూడఁగా సముచ్చయార్థమున ద్వంద్వము చెప్పవలసినదని విశదమగుచున్నయది.

(1) ప్రథమపక్షమున. సముచ్చయార్థమున దంద్వసమాసము సాధించుట వైయాకరణమతమునఁ గుందేటిశిరమున శృంగమును మొలిపించుటగాని వేఱొకటిగాదు "గౌణ్యాసంభవాత్ ॥ (అ 2 పా 3 సూ 3). అనుసూత్రమును వివరించుచోటి "నహ్యాకాశస్యోత్పత్తిస్సంభావయితుంశక్యాశ్రీమత్కణభుగభిప్రాయానుసారిషు జీవత్సు॥ అని శంకరభాష్యమునఁ బలికినట్లు, వైయాకరణులు జీవించియుండఁగా సముచ్చయార్థ

మున ద్వంద్వము జతపడుట సామాన్యముగా సులభంబుగాదు. "పరస్పర నిరపేక్షస్యానేకస్య ఏకస్మిన్నన్వయ స్సముచ్చయః॥ అని సిద్ధాంతకౌముది యందు సముచ్చయపదార్థమును వివరించి గ్రంథకర్త సమాసములే దని నిషేధించె. "పరస్పరనిరపేక్షస్యేతి" అనిప్రతీకమందుకొని "తత్త్వం చైకస్యక్రియాన్వయోత్తర మపరస్యాన్వృత్త్యాత దన్వయాత్" శబ్దేందు శేఖరమందుఁ గారణంబు స్పష్టపఱుపఁబడినది. సమాసఘటకంబులైన పదార్థము లన్యోన్యమును సంబంధింపక ప్రత్యేకప్రత్యేకముగాఁ గ్రియ తో స్వతంత్రములై యన్వయించుచుండగాన నట్టి పదార్థములకు సమాస ముగలుగనేరదని కారణంబు పైవ్యాఖ్యానమందు విశదపఱుపఁబడినది. ఇట్టి యర్థమే "యదాపరస్పరనిరపేక్షాః పదార్థాః క్రియాయాం సముచ్చీయంతే తదా సముచ్చయశ్చార్థో యథాగామశ్వం పురుషమిత్యా దౌవాక్యే పరస్పరానపేక్షాగవాదయో నయనక్రియయా సంబంధ్యం తే॥ అని "చార్థేద్వంద్వః" అను సూత్రమున భాష్యమునొద్దఁ గైయటు నిచే వివరింపఁబడి సమాసము నిషేధింపఁబడియె. ముపర్ణకమును బొం దుటలో నమహాదర్థముల యపేక్ష నపుంసకార్థములకును, నపుంసకార్థ ముల యపేక్ష యమహాదర్థములకును నెంతమాత్రమును లేనందున నేకార్థీభావరూప సామర్థ్యమ్ము లేమింజేసి ప్రకృతసూత్రమున ద్వం ద్వంబు దుర్లభంబు పరస్పర సాహిత్యమ్ములేక యమహత్తులును నపుంసకార్థములును దీర్ఘంబునకుఁ దీర్ఘంబును బ్రసాదంబునకుఁ బ్రసా దంబునునై వేర్వేఱుగానునికి లోకానుభవంబై యుండఁగా నట్టిపదార్థ ములకు ద్వంద్వంబెట్లు సంఘటిల్లెడు ఇట్టి శాస్త్రీయాంశమాలోచించియే "షడ్దర్శనీస్వతంత్రః" అని నిర్భయముగాఁ బ్రకటించుకొన్న శిష్టుకృష్ణ మూర్తి శాస్త్రులుగారు మున్ను శ్లో "అదంతానామ హాతాంక్లీబానాంచ ముపర్ణకః" అనిద్వంద్వంబొనరింపక స్వకారిక రచియించుకొనిరి, లోకం

బులోఁ గూడ నెక్కడనైనను నపుంసకలింగములకు ద్వంద్వంబు సంఘటిల్లునా? ఆమహత్తులలో స్త్రీలింగములున్నందున నమహత్తులకును నిరభ్యంతముగా ద్వంద్వము గూర్పగలమని యెవ్వరైనను శాస్త్రులవారు మ్మతాంగంబులు సల్పినను, వారు జంకక యట్టి యమహత్తులతో నపుంసకలింగములకు నెట్లు ద్వంద్వంబు దొరకొల్పసాహసింతురు? పోనిండు. అట్టి లోకాతీతప్రజ్ఞగల స్వాములున్నయెడల నపుంసకలింగములకుం గూడ ద్వంద్వంబు దాకొల్పు సూత్రంబులుపన్ని యిఁకనుముందు మువర్ణకంబు లంటింపనిండు. అట్టివారి పౌరుషంబు లెట్లుసాఁగి సఫలంబగునో చూచెదముగాక! ప్రకృతమ్మునందు సముచ్చయార్థమున సామర్థ్యంబులేమింజేసి ద్వంద్వసమాసము సమకూరదని సిద్ధాంతకౌముదియందే ప్రదర్శింపఁబడియెంగాన నట్టి గ్రంథగంధంబు నాఘ్రాణింపని దోషజ్ఞులకు నయ్యదిస్పష్టార్థమిం దుదాహరించి వివరించెద. ద్వంద్వసమాసప్రకరణము;—"తత్రేశ్వరం గురుంచ భజస్వేతిసముచ్చయే భిక్షామటగాంచానయేత్యన్వాచయేచ నసమాసః; అసామర్థ్యాత్" ఈవాక్యమున "ఈశ్వరంభజస్వ; గురుంభజస్వ" అని ప్రత్యేకప్రత్యేకముగా నీశ్వరుండును; గురుండును భజనక్రియతో సంబంధించుచుండె రెండువాక్యములు ఫలితార్థములై యీశ్వరునకును గురుపదార్థమునకును నెంతమాత్రమును సంబంధములేనందున నిచ్చట సముచ్చయార్థముగాన ద్వంద్వమురాదని నిషేధింపఁబడియె. అనఁగా నీశ్వరునకును గురువునకును నొకరిసంబంధమొకరికి లేకుండ నొక్కొక్కరినే వేర్వేఱుగా భజించుటతోఁచుచుండి యాపదార్థములకు నితరేతరయోగంబు లేనందున సామర్థ్యములేమింజేసి యిచట నితరేతరయోగద్వంద్వమునకు బ్రసక్తిలేదని గ్రంథకర్త తాత్పర్యము. కాఁబట్టి యిచ్చట "ఈశ్వరగురూభజస్వ" అని చెప్పినచో నెట్లుద్వంద్వము శాస్త్రీయమో! యట్లే

ప్రికృతమ్మునను నొకదానియపేక్ష నింకొకదానికి లేకుండ మువర్ణకము బొందఁజాలిన యమహత్తునకును నపుంసకమునకును నితరేతరయోగ ద్వంద్వ మశాస్త్రీయమని స్పష్టమగుచున్నయది.

శ్లో॥ "చాన్వాచయసమాహారే తరేతరసముచ్చయే" అనిన యమరనిఘంటువు చెప్పనచార్థములలో "చార్థేద్వంద్వః" అన్న సూత్రమునఁ బతంజలిచేఁ నితరేతర యోగసంహారములయందే సామర్థ్యము గలదని ద్వంద్వము చెప్పఁబడినది. ఈయమరనిఘంటువును వివరించుతఁ జిని లింగభట్టీయమునందును నితరేతరయోగార్థమునకు నీక్రిందివిధమున నుదాహరణమీయఁబడినది:—"ఇతరేతరయోగమనఁగా పరస్పరసాపేక్షములైనయవయవార్థములకు, ఒకక్రియతో సంబంధముఁగలుగుట; ఎటువలెనంటే:—దేవదత్తయజ్ఞదత్తాభ్యా మిదంకార్యం అని ఇక్కడ దేవదత్తయజ్ఞదత్తులు కూడుకొని కార్యముచేయవలెనుగనుక, అవయవార్థములు సరస్పరసాపేక్షములు"—అనియున్నది. పైయుదాహరణములో దేవదత్తయజ్ఞదత్తులు కార్యనిర్వహణమున మిళితులైనట్టులు స్పష్టపడుచున్నది. అట్లు ప్రికృతమున మువర్ణకప్రాప్తియందు నమహత్తులకును, నపుంసకలింగములకును బరస్పరసాపేక్షత యవసరమ్ములేదు గదా! కావున "ఎవరికివారే యమునాతీరే" అనిన గ్రామ్యలోకోక్తి రీతిని నున్నయమహత్తులకును, నపుంసకములకును నితరేతరయోగం బెట్లు శాస్త్రీయమయ్యెడు? ఇట్టి యితరేతరయోగద్వంద్వము నామమాత్రమున మధురముగాఁ గనఁబడి యంతస్సారము పరికింపఁగా ఘృతకోశాతకిని స్మరింపించుచుండు. ఇట్టి ద్వంద్వంబొక్కటియే నామమాత్రన మధురంబయియుండిన దననేల? ఇంకను నామమాత్రసమాధుర్యులైన ప్రతిద్వంద్వులు తమయాంతరంగిక కటుభావమును బ్రకటించుకొనుచు వృథాద్వంద్వయుద్ధమునకు డీకొని తలమెత్తి మానులను సైతము తల

పడినవ్వారై తుట్టతుదకు నామాని పాదములం దమతలపడినఫలం బందిన వారు లోకములో నెందఱుండలేదు? ఉండనిండు. అనవసరంబైనట్టి యట్టి స్త్రీద్వంద్వాల ద్వంద్వయుద్ధమిప్పుడు పోనిండు. ప్రకృతంబున నవసరంబైనయీ యమహాన్న పుంసకద్వంద్వయుద్ధమెంత పౌరుషముగలదో! చూచుటకురండు. నిజంబుగా నమహాన్నపుంసకసూత్రమున నితరేతరయోగద్వంద్వమే చెప్పకొన్నచో, "ఇతరేతరయోగే ప్లక్షశ్చన్యగ్రోధశ్చేత్యుక్తే గమ్యతే ఏతత్, ప్లక్షోపిన్యగ్రోధసహాయో న్యగ్రోధో పిప్లక్షసహాయ ఇతి" అనిన చార్థేద్వంద్వ (2—1—29) సూత్రస్థభాష్యమువలన "ప్లక్షన్యగ్రోధౌ" ఇత్యాదిలక్ష్యములయందుఁ బ్లక్షన్యగ్రోధములు క్రియాసంబంధములోఁ బరస్పరసహాయములుగా నున్నట్లుతోఁచినరీతిని నమహాన్నపుంసకములును నవినాభావముగా నున్నట్లుతోఁచియుత్తరించినే మువర్ణకమునొందును. అపుడు "(1) పాణిపాదము (2) కుశకాశము (3) కురుకురుక్షేత్రము (4) మధురాపాటలిపుత్రము:—ఇత్యాది స్థలములయందే యమహాన్నపుంసకములు ప్రకరణవశమునఁ బరస్పరసాపేక్షములై యేకక్రియతో సంబంధించుచుండఁ దద్వాచకములకు మువర్ణకముగలిగి సూత్రవ్యర్థత లేకపోవుంగాన (1) పదము (2) కాశము (3) కురుక్షేత్రము (4) పాటలిపుత్రము ఇత్యాది ప్రత్యేకస్థలములయందు మువర్ణకము సిద్ధింపక పోవును. (1) రామలక్ష్మణులు వనమునకేగిరి —ఈద్వంద్వమున రాముండును, లక్ష్మణుండును, నొండొరులవిడనాడక యేవనమునకు నేగినట్లు తోఁచును. (2) పార్వతీపరమేశ్వరులకు నమస్కారము—ఇట నన్యోన్యమును విడనాడకయుండిన పార్వతికిని బరమేశ్వరునకును నమస్కారము చేసినట్లు గోచరించును (3) అగ్నిషోముల కీహోమద్రవ్యమునిచ్చెద—ఇక్కడ నవినాభావముగానున్న యగ్నిని సోముని వైశిష్ట్యమందు దేవతగాభావించి యిద్దఱకును నేకాహుతియే

యిచ్చినట్లు స్ఫురించుఁగాని వేర్వేఱుదేతతలుగా భావించి ప్రత్యేకప్ర త్యేకముగా నాహుతులిచ్చినట్లు గోచరింపదు. ఇట్టి శాస్త్రీయతాత్ప ర్యమే శబ్దేందుశేఖరమందు సవిస్తరమున నుద్ఘోషింపఁబడినది "ద్వంద్వః పరిత్యక్తాంతానామేవ, నపరినిష్ఠితవిభక్త్యంతానామ్. చైత్రేణమైత్రేణచ కృతమితి వాక్యేఽవయవకర్తృత్వస్యైవ ప్రతీతేః। చైత్రమైత్రాభ్యాంకృత మితిసమాసే సముదాయకర్తృత్వస్యైవప్రతీతేః। తస్యవాక్యస్యసమాస సమానార్థకత్వాభావేన తస్యతద్వాక్యత్వాభావాత్, అతఏవ యదగ్న యేచప్రజాపతయే చేత్యాదావస్తే ప్రత్యేకందేవతాత్వప్రతీతః అగ్నీ షోమాభ్యామిత్యాదౌ సముదాయేదేవ తాత్వప్రతీతిరితి వ్యవస్థాసిధ్యతి, తస్యాపితద్వాక్యత్వేతు సమాసఇవతత్రాపిసముదాయే దేవతాత్వప్రతీ తి రేవస్యాత్ ॥—అర్థము—ద్వంద్వముయొక్క యర్థమును దానివిగ్ర హావాక్యముయొక్క యర్థమును సమానములు కానేరవు. "చైత్రమై త్రులచేతఁ గార్యం బొనరింపఁబడియె" నన్న సమాసస్థలమున జైత్రమై త్రులిద్దఱును నేకీభవించి పనిచేసినట్లు దోఁచుచుండును. "చైత్రునిచే మైత్రునిచేతను గార్యమొనరింపఁబడియె" నన్నవాక్యస్థలమున నట్టివిశే షము స్ఫురింపక ప్రత్యేకప్రత్యేకముగాఁ గార్యకర్తృత్వము తలంపఁబ డును. అట్లే అగ్నికొఱకును బ్రజాపతికొఱకును నాహుతి నిచ్చెదనన్న వాక్యమున నగ్నియుఁ బ్రజాపతియు వేర్వేఱుగా దేవతలయి ప్రత్యేకప్ర త్యేకమాహుతులు గొన్నట్లు తోఁచును. అగ్నీషోములకొఱకు నాహు తినిచ్చెదనన్నచో, అగ్నీషోములవై శిష్ట్యమందు దేవతాత్వము ప్రతీతి విషయమై యొక్కటియే యాహుతి యిచ్చినరీతిని గోచరించును. అని పైవాక్యములకు ఫలితార్థము. కావునఁ బ్రకృతసూత్రమున ద్వంద్వము సేసినచో నేకార్థీభావరూపసామర్థ్యవశమున నమహాస్నపుంసకపదా ర్థము లన్యోన్యమును గ్రియాన్వయములో విడనాడనట్లు తోఁచి "హ స్త

పదము" ఇత్యాదులందులనే మువర్ణకముగలుగు. అథవా, "నటునిహ స్తమును బదమును నృత్యమున మనోజ్ఞముగాఁ బ్రవర్తిల్లె ? ఇత్యాది లక్ష్యములయందు నపుంసకములు, ఏకక్రియలోఁ బరస్పరసాహిత్యమునను న్న చోటులందునే మువర్ణకముగలిగి "పదము" ఇత్యాదిప్రత్యేకశబ్దమునందు మువర్ణకము రాకపోవును. ( (1) (2) "ఇతరేతర యోగే ప్లక్షశ్చన్యగ్రోధశ్చేత్యుక్తే" అన్న భాష్యమునఁ జకారద్వయ వమను కారద్వయమున్న నసాహిత్యము తోఁచును.)

(2) రెండవపక్షంబున ద్వంద్వాభిమానులు "యేనవిధిస్తదంతస్య" [1—1—72] అనుసూత్రమందలి "యేనవిధిస్తదంతస్యేతి చేత్ గ్రహణోపాధినాంతదంతో పాధిప్రసంగః"అనినవార్తికమందు విశేషణార్థకమైన యుపాధిశబ్దము భావప్రధానముచేసి విశేషణత్వమర్థముచెప్పినట్లును, "సప్తమ్యధికరణేచ" (2—3—36) అన్నసూత్రమందలి "కారకార్హాణాంచకారకత్వే" అనువార్తికమందుఁ గారకశబ్దము భావప్రధాననిర్దేశమ్మని కారకత్వ మర్థము చెప్పినట్లును. "యస్మాదధికంయస్యచేశ్వరవచనం తత్రసప్తమీ" (2—3—9) అను పాణినిసూత్రమును వివరించుతఱిని "యస్యచైశ్వర్య మీశ్వర్యతా ఈశ్వరభావ స్తస్మాత్కర్మప్రవచనీయ యుక్తాదితి" అని భాష్యమందు నీశ్వరశబ్దము భావప్రధానముసేసి యీశ్వరత్వపరముగా నర్థాంతరముచెప్పినట్లును, "తే॥ గీ॥ పరఁగుఁగఠినాద్రి జడలురజ్జరఠకమఠ...(వసు 1—28) "సీ" ఘనసీధురక్తలోచనయుక్తిఁ గడనుండుమాతంగతతి సంటుమలినమెల్ల" (వసు 1—16) ఈపద్యముల యందుఁ గ్రమమ్ముగా జడశబ్దము భావప్రధానముని జడత్వమర్థాంతరమునందు జెప్పినట్లును, మత్వర్థీయప్రకరణమునినచ్ ప్రత్యయాంతమైన మలినశబ్దమునకు మాలిన్యమర్థము సేసినట్లును ప్రకృతసూత్రమందలి యుమహాన్న పుంసకశబ్దములు భావప్రధాన

ములనియెంచి యామ హత్త్వనపుంసకత్వవాచకములకంటె మువర్ణకము
వచ్చుననియర్థము చెప్పఁదుగు గాన నిపుడుమాయితరేతరద్వంద్వ మేల
కుదురదనిశంకింతురేని వినుండు. [తత్సమ ప: 57 సూత్రములో స్త్రీలిం
గముల ప్రథమైకవచనమునకని జాతివివక్షచే బహువచనముండినరీతి
నీసూత్రమందును భావప్రధానమైనయామహాన్న పుంసకశబ్దమును బ
హువచనముగా నున్నయది శబ్దార్థములకునభేదసంబంధముగాన 57
సూత్రమున నర్థసందర్భమునకై స్త్రీలింగములనఁగా (స్త్రీ)వాచకములని
శబ్దపరముగా నర్థముచెప్పినట్లే, యమహత్త్వనపుంసకత్వవాచకము లని
నయర్థము సెప్పఁబడియెనని యెఱుంగునది] అట్లైనచో ధనము వన
ము ఇత్యాదిలక్ష్యములయందు నమహత్త్వనపుంసకత్వ
ములు పరస్పరమును విడనాడక యున్నందునఁ బ్రకృతకర్మధారయార్థ
మున కభేదమైనద్వంద్వార్థముకుదిరినను. వాదములోఁ బ్రతిపక్షుచారు
లకు నీడనివాసముగలిగించు "వృక్షము" కుదురుట యెట్లు? వారివిద్యా
కృషికి ముఖ్యమై యిహమునకుఁ బనికివచ్చు "వృషభము" కుదురుట
యెట్లు? ఇంతియకాక, "దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవ
తమ్" అనుకీర్తిని దమసజ్జనహేలనామాత్రమున కధీనమయి తెనుంగుజ
గమును మునింగిపోనీక పట్టుకొని పరమునకుఁ బనికివచ్చు "దైవతము"
కుదురుటయెట్లుతటస్థపడును? కాఁబట్టి ప్రతివాదులకుఁ గేవలమును ద్రవ్య
ప్రధానమయినద్వంద్వముకుదురునట్టిసూత్రమక్కఱకువచ్చుఁగాని వట్టిభా
వమేప్రధానమైన ద్వంద్వమాలోచించినచో ఫలంబెంతమాత్రమును లేదు

3 ఇంకను ద్వితీయపక్షంబునఁ బ్రతిభటులు-"న చైకక్రియాయిత్వ
రూపం సాహిత్యమస్తి వాచ్యం క్రియాభేదేపి ధవఖదిరౌపశ్యఛింధీత్యా
దౌ ద్వంద్వదర్శనాత్। సాహిత్యస్యా ననుభవాచ్చ। అతఏవ రాజపు
రోహితౌ స్వారాజ్యకామౌ యజేయాతామిత్యత్రలక్షణాభావాత్ ద్వంద్వ

ఆశ్రీయతే। తస్మాత్సాహిత్యంనార్థః। కింతువాస్తవభేదో యత్రతత్ర ద్వంద్వః" అనియుక్తావళీశబ్దఖండయందు ద్వంద్వఘటక పదార్థములకు వాస్తవభేదమే యుండినంజాలుంగాని క్రియాన్వయములో బరస్పరసాపేక్షత యనవసరమని చెప్పినందునను (1) "శ్లో॥ సంఘైక శేషద్వంద్వే షు। కేచిత్సామర్థ్యలక్షణమ్। ప్రత్యాశ్రయమనస్థానం క్రియాణాం ప్రతి జానతే॥ వృషలైర్న ప్రవేష్టవ్యమిత్యేతస్మిన్య హేయథా। ప్రత్యేకం సంహతానాంచ। ప్రవేశః ప్రతిషిధ్యతే" అని వాక్యపదీయమందు లక్ష్యానుసారమున ద్వంద్వైకశేషాదులయందుఁ బ్రత్యేకవాక్యపరిసమాప్తియు, సముదాయవాక్యపరిసమాప్తియు, ఒక్కచోటనే యుభయమును నంగీకరింపవచ్చునన్న వచనమున "లోకములో శూద్రులులోనికి రాఁ గూడ" దనిననిషేధవాక్యమందు శూద్రుఁ డొక్కొక్కండును, అనేకులునులోనికి రాఁగూడ" దని ప్రత్యేకసముదాయవాక్యపరిసమాప్తు లుభయమును నర్థమగునట్లు "శ్లో॥ వ్యవాయలక్షణార్థత్వా। దట్కు-ప్వాఙాదిభిస్తథా। ప్రత్యేకంవా సమస్తైర్వా। ణత్వంనప్రతిషిధ్యతే। అనియట్కుప్వాఙితిసూత్రమునణత్వముపోలె, "నుమ్వి సర్జన్ నీయ శర్వ్యవాయేఽపి" (8—3—58) అనుసూత్రమున నుమాదులతో నొక్కొక్కటితోడను, అనేకములతోడను గూడ నెడమున్న షత్వము చ్చుచుండఁగా "నుమైవవ్యవాయే। విసర్జనీయేనైవవ్యవాయే। శర్త్వైవ వ్యవాయేఽతి। కింవక్తవ్యమేతత్। నహి। కథమనుచ్యమానంగంస్యతే। ప్రత్యేకంవాక్యపరిసమాప్తిః దృష్టేతి" అనిపైసూత్రమందలి భాష్యమునందు సూత్రస్థద్వంద్వమునఁ బ్రత్యేకవాక్యపరిసమాప్తి యంగీకరించినందునను(2)ప్రకృతసూత్రమున నను క్లేలక్ష్యానుసారమునఁబ్రత్యేకవాక్యపరిసమాప్తి యంగీకరించియమహత్తులకంటె "మునర్ణకమనును;నపుంసకముల కంటెమునుర్ణకమగు"ననియోగవిభాగార్థము (సూత్రద్వయార్థము) చెప్ప

దుమనుచునేని లక్ష్యమునుగుదిరెడిగత్యంతరములేమింజేసి యట్లైయితరేతర యోగార్థము వెడల ప్రోతురుగాక! ఇట్లుద్వంద్వవాదులమతమందులక్ష్యము కుసురనందున నేకార్థీభావరూపసామర్థ్యత్యాగమును (1) నేకవాక్యసాధ్యార్థమును వాక్యద్వయముచేత సాధించుటంజేసి వాక్యద్వయాపత్తిరూపగౌరవమును [2] స్పష్టమగు.

[4] చతుర్థపక్షంబున నట్లొప్పకొనినను, ద్వంద్వవాదులకు "భక్షితేఽపిలశునే" అనున్యాయమున నింకను ద్వంద్వసంఘటన దుర్ఘటంబు. లోకములో సామాన్యశేష వాచకములకు ద్వంద్వమురా నేరదు. [1] ద్రవ్యఘటనములు—ఘటము ద్రవ్యములలోనంతర్భూతముగాన ద్రవ్యశబ్దముసామాన్యవాచకము, ఘటశబ్దము విశేషవాచకము. కాన నిట్టి ద్వంద్వ ముండ నేరదు. (2) వృక్షరసాలములు వృక్షము సామాన్యవాచకము, రసాలమువిశేషవాచకము. ఇటంబైనింజెప్పిన ముక్తావళ్యాది గ్రంథప్రకారమున వాస్తవభేదములేనందున: బైద్వంద్వము రానేరదు. అట్లు యిచ్చటంబ్రసిద్ధముగా, ధనమ్ వనమ్, దారు, ఇత్యాదులే నపుంసకములగుగాన నిట్టి జడములు, అమహత్తులలో నంతర్భూతములైనందున నమహన్న పుంసకశబ్దములు సామాన్యవిశేష వాచకములై ద్వంద్వము గగనకుసుమాయమానమగు. ఒకవేళ "యదిసామాన్యవిశేషవాచినో। ర్ద్వంద్వోనభవతీత్యుచ్యతే। శూద్రాభీరమ్। తృణోలపమితి నసిధ్యతి। నైషదోషః। ఇవతావచ్ఛూద్రాభీరమితి ఆభీరాజాత్యంతరాణి। గోబలీవర్దమితి। గావఃత్కాలితపుంస్కా వాహోయచ,. విక్రయాయచ, స్త్రియుపవాపశిష్యంతే" అను త్యదాదీనిసర్వైర్నిత్యమితి సూత్ర (1—2—72) స్థభాష్యమున "గోబలీవర్ద" మన్నచోట గోత్వజాతిలో బలీవర్దములం [వృషభములు] తర్భూతములైనందున గోశబ్దము సామాన్యవాచకము బలీవర్ధశబ్దమువిశేషవాచకమైనను నిటగోశబ్ద

ము ననాపులే గ్రహింపఁబడి స్త్రీపుంసత్వభేదమున ద్వంద్వమెటులుసమ్మతిం
పఁబడియెనో యట్లైప్రకృతమునను నవహచ్ఛబ్దమునఁ బుంవాచకములగు
వృషభాదిశబ్దములుస్వీకరింపఁబడి పున్నపుంసకభేదమునంగీకరించి ద్వంద్వ
ముచెప్పఁబడుసని ప్రతిభటులందు రేనివినుండు. ప్రతివాదులు గోబలీవర్దా
దులువోలెద్వంద్వముకుదిరినదనుకొనిదూరదృష్టిలేక ప్రాకృతలోకప్రశం
సయెడనో రెత్తి యెఱుంగని మానిపుంగవులకుసైతము శృంగభంగముగా
వింతుమనియుత్సహించుటయే కాని యందలియర్థమాలోచించుకొన్నచో
ననర్థమేసంభవిల్లును. ఈసమాసమున స్త్రీపుంసత్వభేదము నెంచి ద్వం
ద్వముసిద్ధమైనను బలీవర్దములు [వృషభములు, గోజాతిలోనివేమైన
ట్లిచటనపుంసకములుగూడ నమహత్తులలోనివేయగును. అందున నమ
హత్తులై, నపుంసకములైన ధనవనాదిశబ్దములకే మువర్ణకమువచ్చుఁగా
ని తమ "దైవతము" సిద్ధింపకపోవును. కానఁ దమయీయమహన్న
పుంసకద్వంద్వము గోబలీవర్దాదులద్వంద్వము వంటిది యనుకొని యీ
పద్ధతింబడుటయు వెనుకటిపద్ధతింబడుటకంటెనునన్యాయ్యంబగును. మేమిట
నపుంసకశబ్దమునమహన్న పుంసకములు గ్రహింతుమనుటకువీలుపడదు,
నపుంసకశబ్దమునఁ బ్రసిద్ధములైన ధనవనాదిజడములే విషయముగుంగాని
మిక్కిలిక్వాచిత్కములై యప్రసిద్ధములైనమహన్నపుంసకములు ఝడితి
స్ఫూర్తివిషయంబులుగావు. కనుక నే స్థానివత్సూత్రభాష్యస్థమైన "సామా
న్యాతిదేశేవిశేషానతిదేశః" [101] అనుబరిభాషను వివరించుతఱిని బరి
భాషేందుశేఖరమున సామాన్యో, పస్థితికాలే నియమేన విశేషోపస్థితిజ
నకసామగ్ర్యభావోఽస్యాబీజమ్, తేనానద్యతనభూతరూపే విశేషే
విహితయోస్తయో [లఙ్ లిటో] ర్నాఽతిదేశః, అని "ఆశంసాయాం
భూతవచ్చ" [3-3-132] ఇతిసూత్రమునందలి భూతశబ్దమున ననద్య
తనభూతపరోక్షానద్యతనభూత కాలవిశేషములు గ్రహింపఁబడవని

వర్జింపఁబడియె. అట్లు యిట మహాన్న పుంసకములు గ్రహింపఁ బడజాలవు. ఇంతియకాక యమహాన్న పుంసక సూత్రమందలి యమ హాత్తుల సాహచర్యమునఁ జేసి నపుంసకములుగూడ నమహాత్వధర్మ మున సదృశములైనవే గ్రహింపఁబడెడుం గాని సదృశములుగాని య ప్రసిద్ధకాచిత్కమహాన్న పుంసకము లెట్లు గ్రహింపఁబడును కనుక నే "సహచరణంచ సదృశయోరేవేతిసహచరితశబ్దేన సాదృశ్యమేవానుచ్యతే। రామలక్ష్మణావిత్యాదావపి సాదృశ్యమే వనియామకమ్। సదృశయోరే వసహవివక్షా తయోరేవసహప్రయోగ ఇత్యౌత్సర్గాచ్చ అనిసహచరితా సహచరితయోరితిపరిభాష [103]యొద్దఁబరిభాషేందు శేఖరమందును, "ద్విత్రిశ్చతురితికృత్వోర్థే (8—3—43) అనుసూత్రమందలిశబ్దరత్న మందును, "అన్యగోస్సహయోనార్థ ఇతిగారేవాసీయతే న శ్వానగర్దభ ఇతి" అని కర్మప్రవచనీయయుక్తేద్వితీయేతి సూత్రస్థభాష్యమునందును, ద్వంద్వఘటితపదార్థములు సదృశములే లోకప్రసిద్ధములని చాటఁబడి నది. కాన, అమహాన్న పుంసక సూత్రస్థనపుంసక గ్రహణమున నమహా త్తులతో సాదృశ్యములేమింజేసి మహాన్న పుంసకము లర్థముకానేరవు.

(5) అథవా, పంచమపక్షమునఁ బ్రతివాదులిట్లనవచ్చును. ప్ర కృతమందు నపుంసకశబ్దమున మహాన్న పుంసకములు గ్రహింపఁబడక సాదృశ్యవశమున ధనవనాదులైన యమహాత్తులే స్వీకరింపఁబడియె నేని యమహాత్పదముననే కార్యసిద్ధియై నపుంసకగ్రహణమునకు సార్థకతలే నందున నపుంసకగ్రహణమై యర్థాన్యథానుపపత్తిం జేసి యమహద్గ్ర హణంబున ధనవనాదిజపు నపుంసకములును, వృషభాదిసంస్కృతపుం లింగములును, నర్థముచెప్పి యిటన పుంసకపదమునకు మహాన్న పుంసక ములే యర్థము చెప్పదము. ఈయంశమునకు "సప్తమీవిశేషణే బహువ్రీహౌ॥ (2—2—35) అనుసూత్రమందలి యీశేఖరము ద్వ

ష్టాంతము:—"సప్తమ్యంతస్య కర్త్రాద్యన్వయద్వారైవ క్రియాన్వయాత్ విశేషణత్వేనసిద్ధేర్వైయధికరణ్యేపి సమానజ్ఞాపనార్థం సప్తమీగ్రహణమ్। విశేషణగ్రహణంచ బ్రాహ్మణవసిష్ఠన్యాయేన తదతిరిక్తవిశేషణ పరమ్। తదాహ॥ అతఏవేతి॥-దీని తాత్పర్యము. "శ్లో॥ కర్తృకర్మవ్యవహితా౽మసాక్షాద్ధారయత్క్రియామ్॥ ఉపకుర్వత్క్రియాసిద్ధౌ శాస్త్రేఽధికరణంస్మృతమ్" అనిన వాక్యపదీయవచనమున ననుసరించియు, "తయోస్స్వయద్వారా కారకత్వమ్। తస్యతద్ద్వారైవ క్రియాన్వయ ఇతి వ్యుత్పత్తేః।" అనినకారక శేఖరము ననుసరించియు, నధికరణకారకము లైన సప్తమ్యంతార్థములు సంయోగాది సంబంధమునఁ గర్తృకర్మము లతో నన్వయించియే క్రియతో నన్వయించును. కటమ్మునఁ జైత్రుండు శయనించు,—ఈవాక్యములో సప్తమ్యంతార్థమైన కటము చైత్రునితో సంయోగసంబంధమున సంబంధించి చైత్రనిష్ఠశయనక్రియకు నాధార మ్మయ్యెను. ఇచట జైత్రుండు కటసంయుక్తుం డగుటంజేసి చైత్రునిశయన క్రియకుఁ గటమాధారమయ్యెంగానఁ జైత్రునివిశేషణాంశములోఁ గట మ్మంతర్భూతమయి క్రియావిశేష్యకశాబ్దబోధముగలిగెను. కావున నధి కరణసప్తమ్యంతార్థములు క్రియతోనన్వయించునపుడు తప్పక కర్త్రా దులతో సంబంధించిన పిమ్మటచే యన్వయింపవలయు. అనఁగా సప్త మ్యంతార్థములైన కటాదులు సర్వదా విశేషణములుకాకతీరదు. ఇట్లుం డఁగా "సప్తమీవిశేషణే" అనుసూత్రమునందు విశేషణగ్రహణమున నే యిష్టార్థము సిద్ధించుచుండఁగా సప్తమీగ్రహణము వ్యర్థమయి వ్యధికరణబహువ్రీహియుంగూడఁ గలదన్న యంశమునకు జ్ఞాపకమ య్యె. సూత్రమున విశేషణగ్రహణము సప్తమ్యంతార్థవిశేషములకన్నఁ దక్కినవిశేషణములపరము అని వైదానియర్థము. అట్లె పరిష్కృతసూత్ర మందును సాహచర్యమున సాదృశ్యమంగీకరించి యమహత్తులైన ధనవ

నాదులే గ్రహింపఁబడినచో సూత్రస్థమైన యమహద్గ్రహణము నన్నే యభీష్టార్థసిద్ధి యగుచుండఁగా నపుంసకగ్రహణము వ్యర్థమయి మహన్నపుంసకములకున యర్థమనకు జ్ఞాపకమ్మగునని ప్రతివాదులందు రేని యట్లయినచో వారు సర్వస్వథమ్ములను జిరజీవు లగుదురుగాక !

మేమీవమును నమహన్నపుంసకసూత్రమున ద్వంద్వమంగీకరించినచో, (1) లక్ష్యముకుదురని చెప్పిన నేకార్థీభావరూపసామర్థ్యమునకు బాధ.

(2) ఏకవాక్యసాధ్యార్థములో వాక్యద్వయముచే సాధించుటంజేసి వాక్యదయాపత్తిరూపగౌరవము-అని చెప్పితిమి.

(3) ఇపుడు, సాహచర్యపరిభాషకు ననిత్యత్వ మంగీకరించి సాదృశ్యత్యాగము.

(4)నపుంసకగ్రహణవైయర్థ్యమునంజేసి ప్రకృతార్థజ్ఞాపనంబును సంభవించు.

ఇట్లు ప్రతివాదుల దుస్స్వమునఁ గిపక్లిష్టద్వంద్వమేకాక ద్వంద్వద్వయము సంభవిల్లుచున్నయది.

కాఁబట్టి, ద్వంద్వపక్షాంగీకారమున సౌలభ్యము కానరాదు. కాన నయ్యది యపార్థమగు.

ఇఁక గ్రంథకర్త మతమందలి కర్మధారయార్థముయొక్క విమర్శనము

"అమహన్నపుంసకముల కదంతములకు ము వర్ణకంబగు. "(తత్స. మ 39 సూ అను సూత్రమందు "సంభవతిసామానాధికరణ్యే వైయధికరణ్యస్యాన్యాయ్యత్వాత్॥ అనున్యాయమున "మహద్వాచకములు కానివై నపుంసకలింగమై హ్రస్వాకారమంతమందుఁగల వానికి మువర్ణకమువచ్చును." అనినసామానాధికరణ్యాన్వయమే సమీచీనముగానున్న

యదియని మా తాత్పర్యము. లోకములో బ్రాహ్మణకవులు, క్షత్రియ
సార్వభౌములు—ఇత్యాదిస్థలములయందు "సంఖ్యావాన్ పండితః కవిః"
"చక్రవర్తీ సార్వభౌమః"॥ అని యమరుండు క్రమముగా బ్రహ్మవర్గ
మందుఁ గవిపర్యాయములును, క్షత్రియవర్గమందుఁ జక్రవర్తిపర్యాయ
ములును గేవలమును జెప్పుటచేతనే కాక, కవులు బ్రాహ్మణులేయగు
టయుఁ, జక్రవర్తులుక్షత్రియులే యగుటయు, వేదశాస్త్రాదులయందుం
గూడఁ బ్రసిద్ధంబుగాన "బ్రాహ్మణులైనకవులు, క్షత్రియులైనసార్వభౌ
ములు" అని సామానాధికరణ్యమున లోకప్రసిద్ధికి ననుకూలముగా నర్థ
ము సేయుట మంచిదిగాని గతిలేని వైయర్థ్యరూపసామర్థ్యము నెంచుకొని
బ్రాహ్మణేతరులైన భోజరాజాదులు గూడఁ గవులున్నందునను, క్షత్రి
యేతరులైన యగ్బరు లోనగు చక్రవర్తులున్నందునను, "బ్రాహ్మణు
లును, కవులును (భోజరాజాదులు) క్షత్రియులును, సార్వభౌములును
(అగ్బరులోనగుచక్రవర్తులు)" అని ద్వంద్వార్థము వివక్షించుట హాస్యా
స్పదమైనయర్థమపక్షంబగు. అట్లె ప్రకృతమునను, నపుంసకములు మహ
త్తులుద్విత్వాదులున్నను, అమహత్తులునపుంసకములు లెక్కకుమీఱి
యుండుట సుప్రసిద్ధము కాఁబట్టి సుప్రసిద్ధమార్గమెంచి సామానాధికర
ణ్యమున నేకవాక్యములు చేసిచెప్పుట ఘంటాపథంబుగ మనంబుసల్పు
టవంటిదియై పండితశ్లాఘనీయంబగు. అట్లయినచో. మా "వృషభము"-
ను "దైవతము" ను గనుట యెట్లందురేని వినుండు. లోకములో
నొక దేవదత్తుఁడు సత్యభామానామంబున స్త్రీచిహ్నములం దాల్చి
కథాక్రమమున నెప్పుడో నిప్పటిప్రత్యక్షప్రమాణము ననుసరించి "సత్య
భామ శ్రీకృష్ణునితో సరససల్లాపములు సల్పినది, శ్రీకృష్ణుని వియో
గంబున విలపించినది" అని ప్రస్తుతదశలోన స్త్రీలింగమున వ్యవహరింపఁ
బడుఁగాని పూర్వపుంలింగమున వాడుట కల్గుగను, కనుకనే "శ్లో॥ స్త

న కేశవతీ స్త్రీస్యాత్ లోమశః పురుషః స్మృతః। ఉభయోరంతరం యచ్చ। తదభావే నపుంసకమ్। లింగాత్ స్త్రీపుంసయోర్జ్ఞానే। భ్రూకుంసే టాప్ ప్రసజ్యతే॥ అని భాష్యమున స్త్రీవేషధారిపురుషవాచకమునందుఁ డాప్ప్రత్యయాపత్తి యీయఁబడినది. ఒకచైత్రుండు ప్రారబ్ధవశమున మతాంతరమందుఁ గలిసి నామాంతరముం బొందినచోఁ బ్రస్తుతావస్థకుం దగినగౌరవమే చేయఁబడును గదా! ఇట వృషభాదులకును గల్గిన సంస్కృతజన్మములోఁ బుంలింగకీర్తి నొందినను, నపుంసకములైన ధనవనాదులతో సమానముగా నమహన్నామముఁ దెలుంగున ధరించి నపుంసక "ముపర్ణక" చిహ్నమున కుద్దేశింపఁబడుతఱిని బూర్వదశలోని పురుషోత్తమకీర్తి యెట్లు రానేరుచు? స్త్రీలమహత్తులలో సర్వసాధారణముగాఁ గణింపఁబడినను, ప్రత్యేకముగా మహతీసంజ్ఞ యుంచుటం జేసియు, (57) సూత్రమునం జేసియు నపుంసకత్వకార్యము సంభవింపదు. తిర్యక్కులకు "నమహత్తు" అనిన తెలుంగువ్యాక్రియసంజ్ఞ చేతనే జడంబులకుంబోలె నపుంసకత్వము సిద్ధంబయ్యె. మేము సూత్రమున ద్వంద్వము చెప్పి సంస్కృతలింగమునం గొని ముపర్ణక ముంతుమని ప్రతివాదులనంగూడదు. సంస్కృతపాండిత్యమున నాఱితేరిన సర్వోత్కృష్టులమనువారికే లింగములు దెలిసికొనుటలో భంగము గలుగుచుండఁగా నొక్క తెనుంగుననే మునింగినవారికి సంస్కృతలింగప్రభావము మిక్కిలి యయోమయముగాఁ గనంబడునని వేఱచెప్పనేల? బ్రహ్మభూయ బ్రహ్మహత్యాశబ్దములకు నొకటియే ప్రత్యయమైనను లింగంబున భిన్నంబులగుచున్నవిగదా! తెలుంగునఁ దిర్యగ్జడంబులు నపుంసకములగు ననుకొన్నచో సులభంబు. సంస్కృతమునఁ దిర్యక్కులైన వృషభాషలు తెలుంగున నంతలో నపుంసకములెటులగునని వింతపడవలదు. సంస్కృతమునఁ బుంలింగములైన దూతాదులకుఁ దెలుంగున స్త్రీత్వము దొరయుచున్నయది. విశ్వకర్మాదులవంటి వారికి స్త్రీత్వము(75సూ)

స్థిరపడుచున్నయది. సంస్కృతంబునఁ జతుర్ముఖుండయిన యా బ్రహ్మయ్యసహితము (76) విధివశంబున బ్రహ్మక్కయమ్యె వేయేల? వేదజడుండయి శిరశ్ఛేదముపడిన యాబ్రహ్మ మాయొద్ద దలయెత్తు కొని తిరుగునా? యని తలవిరియంబోసికొని తిరిగెడు బ్రహ్మశీలుకూడ నీతెలుంగువ్యాకరణప్రశంశను బ్రహ్మస్త్రీలగుచుండఁగాఁ దిర్యక్కు లయిన వృషభాదు లీ తెలుంగున నపుంసకములగుట యేమివింత? కాఁ బట్టి యమహాత్ములై నపుంసకములైన యదంతములకు మువర్ణకమగు నన్న దేశకవాక్యము నిర్బాధకంబగు. ఇఁకను మా "దైవతము" కుదు రుట యెటులందు రేని యయ్యది మీద్వంద్వమతమందే దుర్లభమ్ము. ని॥ "బృందారకా దైవతానిపుంసివా దేవతా స్త్రీయామ్" అనునమర నిఘం టువ్వసంజేసి యదంతమహద్వాచకపుంలింగము గాన (39సూ) ముబా ధించి (21_2?) సూత్రములచేత, నుత్వటుజ్ఞులు గ్రమంబుగారావ లయు. కావున"దైవతము"అని, యేసంప్రదాయమునసగునో ప్రతివాదు లచేఁ దెలుపందగు. "అదంతములగు నమహన్నపుంసకములకు మువ ర్ణకమని యర్థము చెప్పినచో నిఁక నదంతమహన్నపుంసకములైనమి త్రాదులగతి యేమందు రేని వినుండు. ఇట్టి క్వాచిత్కమహాత్ములయెడం గూడ నదంతనపుంసకత్వరూపసాధారణధర్మబాహుళ్యంబున నీసూత్ర మే యుపలక్షణముగా జెల్లును.

(1) "గోత్రోశిత్" (7_1_90) అనుసూత్రములోని గోశ బ్దము "ఓతోర్ణమేశపోః॥ అనుసూత్రమువివరించుతఱిని, కైయటుండు "ఓత్రోణిదితిఃతివ్యమ్, గోతఇత్యోకారాంతోపలక్షణార్థంవావ్యాఖ్యే యమ్! తత్రనిర్దేశేహితపరత్వాప్రసిద్ధమ్" అని తత్ప్రకరణమ్మునఁ గ

క్త్యేనయోః కారాంతముల కుపలక్షణమని వచియించె. "గోతః" అనుత పరకరణమున గోశబ్దములోని గకారమవివక్షితమని శబ్దరత్నశబ్దేందు శేఖరవిషమీప్రభృతివ్యాఖ్యలు చాటుచుండు.

(2) అథవా, "ద్యోశ్శ్వన్యధిరక్ష్యేత్యేతివార్తికే ద్యోశబ్దస్యైవోపాదానా దన్యాకారాంతాభావ ఇతి వాచ్యమ్। ఉపలక్షణతయా వాక్యానేవాదోషాత్॥ అని శేఖరంబున ద్యోశబ్దమోకారాంత సామాన్యమునకు పలక్షణమని చెప్పఁబడియె.

(3) "ఙ్యాబ్గ్రహణం స్త్రీప్రత్యయమాత్రోపలక్షణమ్। తేన బ్రహ్మబంధూతరాం యువతితరేత్యాదేస్సిద్ధిః। అనిశబ్దేందుశేఖరమున "ఙ్యాప్ప్రాతిపదికాత్" అను సూత్రములోని ఙ్యాబ్గ్రహణమూఙ్ప్రత్యయాది ప్రత్యయముల కుపలక్షణమని తెలుపఁబడె.

(4) "విగ్యత్త్వనసుపా" (1 4-83) అనుసూత్రమున శేఖరమందు "నచేత్రత్రసురితి। కరణమాత్రోపలక్షణం ధనురితి। తేన విధ్యతిఖడ్గేనేత్యాదావపిన।" అని సూత్రస్థధనుశ్శబ్దము ఖడ్గాదికరణమాత్రమున కుపలక్షణమని నక్కాణింపఁబడెను. ఈయర్థమే వాక్యపదీయమందు—

ద్వి—కాం 313:—విభ్యత్త్వనుషేత్యత్ర। విశేషేణ విదర్శితే। సామాన్యమాత్రయుక్తిశ్చ తైః కశ్చిత్ప్రతిపాదకః॥ 314:—శ్లో॥ కాకేభ్యో రక్ష్యతాం సర్పిరితి బాలోఽపి చోదితః। ఉపఘాతపరే వాక్యే న శ్వాదిభ్యో నరక్షతి"— ఈస్మృతముచు గాకుల నుట్టకుండ రక్షింపుమన్నచోఁ గాకులవలనే కాక శునకాదులవలనంగూడ బాలుండు రక్షించునట్లు శాస్త్రమునను లోకదృష్టాంత

మున విశేషపరవాక్యము సందర్భవశమున సామాన్యపరమగునని స్పష్టపఱుపఁబడియె. అట్లె యీసూత్రమందును మాకు నుపలక్షణం బగు. మఱియు "గోతోణిత్" (7-1-90) అనుసూత్రములోని తపరకరణహేతువున గోశబ్దములోని గకార మవివక్షితమని యెంచి యీసూత్రమోకారాంతసామాన్యమున కుపలక్షణమని వ్యాఖ్యాతలన్నట్లు ప్రకృతసూత్రమును మహాన్నపుంసకములయెడ నుపలక్షణమనుటకు మాకు నుదగినంత వాచోయుక్తి వఱలుచున్నయది. ఈసూత్రమున నమహాన్నపుంసకశబ్ద మవివక్షితము. "అదంతములకంటె మువర్ణకమగు (39)సూ. అనియే సూత్రరచనచాలును, మిత్రము వృషభము, ధనము-ఇత్యాది మహదమహన్నపుంసకరూపములు సిద్ధించును. సూత్రమందలి యమహచ్ఛబ్దము త్యజించినచో మహాన్నపుంసకములైన మిత్రము—ఇత్యాదులయందు వారికి మువర్ణకమిష్టమేకాన మహత్పుంసలింగములైన రామశబ్దాదులపై మువర్ణకాపత్తి చెప్పవలయు అట్లైనపుంసగ్రహణము సూత్రమునమానినచో నమహత్పుంలింగములైనవృషభము-ఇత్యాదులయందుఁ బ్రతివాదులకు మువర్ణకమిష్టమేకనుక మహత్పుంలింగములయందే మువర్ణకాపత్తి యనవలయును. మహత్పుంలింగములైన రామశబ్దాదులపైని నెంతమాత్రమును మువర్ణకాపత్తి చెప్పఁగూడదు. "పుంలింగంబై మహద్వాచకంబైన నామంబు తుదియత్వంబున కుత్వంబగు" (21)సూ అనునీసూత్రమున నంతరంగమగు నుత్వంబురాఁగా నదంతత్వంబు లేమింజేసి రామశబ్దమునకు మువర్ణకమురాదు. అనైమిత్తికమును బ్రాతిపదికములోని కార్యమునుగాన నుత్వమంతరంగము. పంచమ్యంతనిమిత్తకమును, బహిర్భూతసంఖ్యాకారకాపేక్షమును ప్రాతిపది

కము తర్వాతికార్యమునుగాన మువర్ణకము బహిరంగము. కావుననే యీబాలవ్యాకరణాదులయందు (21) సూత్రము వ్రాసిన తర్వాతనే (22) వ సూత్రము వ్రాయఁబడినది. (21) సూత్రములోని పుంలింగ మహద్వాచకగ్రహణమే (39) సూత్రములోని యమహన్నపుంసక గ్రహణ మజాగళస్తనాయమానమని బోధించుచున్నయది. కాన నయ్యది యవివక్షితము. అందు నీసూత్రము "గోత్రోణిత్" ఇత్యాదులు వోలె నుపలక్షణమని తెలియఁగునది ప్రతివాదు లీసందర్భమునఁ బ్రతాపరుద్రీయసాహిత్యరత్నాకరాదులయందలి (1] యవివక్షితవాచ్య (2) వివక్షితాన్యపరవాచ్యధ్వనులం జూడం దగు. కాన, ఇట్టి వివక్షలేని యమహన్నకపుంసకద్వంద్వము నెంతో నమ్ముకొని ద్వంద్వయుద్ధంబునకు డీకొని పత్రికలయందుంగూడ "నపార్థమపార్థ" మని బొబ్బరించెడి ప్రతివాదుల మహత్త్వమును, పౌరుషమును నెంతశ్లాఘింపఁదగియున్నవో పండితవర్యులే భావింతురుగాక!! ఇంత యుపలక్షణవివరణము గ్రంథకర్తం పరిష్కృతసూత్రవ్యాఖ్యయం దేల సేయలేదందు రేని, మాకుఁ గైయటాచార్యప్రతిష్ఠ తెప్పించుటకై యట్లు సేయకుండిరని నేనూహించెద. "గోత్రోణిత్" సూత్రమును వివరించుతఱిని బతంజలియును నీసూత్రమోకారాంతముల కుపలక్షణమని స్పష్టీకరింపలేదుగాని "ఔత్రోమ్" సూత్రస్థభాష్యసరణింజేసి కైయటాచార్యుండు స్పష్టపఱిచె. కనుక గ్రంథకర్తలవివరణము కొన్నిచోట్లగంభీరశయ్యను వ్యంగ్యముగా నుండెడిని. అయ్యది యాలోచింపక ప్రాజ్ఞస్వాము లపార్థమనియెదరు. ప్రజ్ఞస్వాములయినచో దీర్ఘనామమును లేనందున వివరించి తమసామర్థ్యమును వెల్లడించుకొందురు. వీరు కైయటాచార్యులయినచో గ్రంథ

కర్తలు మేమును జీవించియుండగానే పతంజలిప్రతిష్ఠకుఁ దగుదురని యా! మీ తాత్పర్యమందురేని వారు పతంజలిప్రతిష్ఠకుఁ గాదుగాని "ఆర్యశ్లో॥ బ్రహ్మశ్రీ కల్లూరి। శ్రీవేంకటరామశాస్త్రినామా సౌ। నైవ పతంజలిమూర్తి। స్సపతాంజలిమూర్తి రార్యపర్యేషు॥ అనిన యార్య వృత్తముంజేసి యార్యవర్యులయందుఁ బడునట్టిదోసిలి గలవారనిన ప్రతిష్ఠకుఁ దగుదురని మా తాత్పర్యము "దాశ్వాన" తి సూత్రస్థమైన "చరిచలిపతీ"తి వార్త్తికంబునఁ బాతికరాబుగఁ బతశబ్దము సిద్ధమైనందున "పత (పెద్దలపై) పడునట్టి, అంజలి=దోసిలిగలవారని యర్థము. అనఁగా యోగ్యులకు నమస్కరింతురని భావము. మేము యోగ్యులము కామ నియా ! మీ తాత్పర్యమని యనవలదు. మీరు యోగ్యులే కాదు ఆగర్భశ్రీమంతులన్నట్టులు గేహారామునుచేతనే వస్త్రములై పుట్టినారు. కాఁబట్టి తమకునమనము తప్పకుండఁ జేయవలయును, కాని యొకవిశేష ముగలదు. స్త్రీవాచకం బవాచకంబనియు, ఉపలక్షణం బవలక్షణంబని యు ఒప్పులకుప్పలు తప్పులకుప్పలనియుఁ దమరీపాండిత్యమునంజేసి మెక్కడనల్లరిసేయుదురో యని భయభక్తులలో మొదటిశబ్దము తమవంటి వారియెడ నుపయోగింతురు. రెండవశబ్దము తక్కినవారియెడ నుపయోగించి నమనము సేయుదురు.

## స్త్రీవాచకము.

విరోధులింకను "స్త్రీవాచక" మన్నపద మాంధ్రవ్యవహారము నుమఱచి యహోబలపండితాదుల మతమునకు వ్యతిరేకముగా గ్రంథకర్త ప్రయోగించినట్లీ మాఘఫాల్గునాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ

దరిగి పోల్లుంతనముగా వ్రాయుచున్నారు. ఆఫాల్గునమాసపత్రికాంశ మునకు ఫాల్గునుండే ["ఫలేర్గుక్చ" సూ-ఉణాది-3పా: ఫల్గునః పార్థః (శ్రీకృష్ణో ఫాల్గునః) సమాధాన మిచ్చుట వ్యాయామంబుగా నట్లు సేయుంబడుచున్నయది మేమీనాలుగలో ఫిబ్రవరి 2 దేశమాతపత్రికలో "తత్సంభవేతు శాస్త్రీయవిశిష్టే లౌకికే శాస్త్రీయమపి శబ్దతో బుధ్యతే తథానుభవాత్" అను శేఖరవాక్యముదాహరించి "గుణనాయశేత" ఇత్యాదులయందు లౌకికలింగముకూడ గ్రహింపబడునని వచించితిమి. అహోబలపండితాదు లిచ్చటి ప్రకరణమున కవసరమైనందున "స్తన కేశవతీ స్త్రీస్యా ల్లోమశః పురుషస్స్మృత" యనువచనంబున 'స్త్రీవాచక, పదముచే లౌకికలింగవిశేషమునుం గ్రహించిరి. అందున సంస్కృత శబ్దములయొక్క శాస్త్రీయలింగము "స్త్రీవాచక,, పదంబుచే నర్థముకానేరదని చెప్పవచ్చునా? ఈవర్ణ్యమానప్రకరణస్థస్త్రీలింగశబ్దమున (57సూ) శాస్త్రీయలింగమే యర్థము చెప్పవలెంగదు గాన దానియర్థవివరణశబ్దమై సన్నిధానవర్తియైన స్త్రీవాచకశబ్దములోని స్త్రీశబ్దమునంగూడ శాస్త్రీయలింగమే యర్థమగుంగాని వేరొకప్రకరణమందలి లౌకికలింగవైశిష్ట్యమును దెలుపంజాలదు. రాజమహేంద్రపురవాసియగు దేవదత్తుండు "శాస్త్రులవారితో మాటాడువలయు" నన్న యేతన్మాత్రవాక్యమే యుపయోగించినచో సన్నిధానవర్తులయిన రాజమహేంద్రపురవాసి శాస్త్రులుగారితోనే మాటాడునన్నయర్థము శ్రోతకుందోంచుంగాని విజయనగరములోని శాస్త్రులవారిదోనని యనుకొనండు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులన్నచో నిచ్చటిబ్రహ్మశబ్దమునకు బ్రాహ్మణుండే యర్థమగును. బ్రహ్మశ్రీలు సీ తా రా మ స్వామి శా స్త్రు లు గా ర ని న చో శా స్త్రు లు గా రు బ్రా హ్మ ణా చా ర సం ప ద గ ల వా రనియునాయన బ్రహ్మయంతవారుగాన,గ్రంథములో లేనిపోనితప్పులు

పట్టి బ్రహ్మలడ్డుగా నడ్డగింతురనియుఁ దోచును. అడవి కేగి మైత్రుండు మైత్రునితో "స్థాణుహూపముచూచితివా? యనియనినచో "మ్రోడనిన యర్థమగును. తీర్థక్షేత్రముల కేగి యీవాక్యమే ప్రయోగించినచో నట్టి నట్టి మొద్దన్న యర్థము చెప్పుకొనవచ్చునా? "శ్లో॥ గౌరీసాత్వారితంమ హాద్యపరితం దూరీకరోతుస్వతశ్చిత్రంస్థాణురశోకతా ముపగతో ఝూలోజ్ఝితోనీరసః" అనిన సాహిత్యరత్నాకరస్థ రసవదాద్యలం కారప్రకరణములోని శ్లోక ముచదివినచో నుభయార్థమును దోచును. "పశువాయజేత" అన్నచోట లౌకికలింగము గూడ నర్థము చెప్పి నందున (పృషతః) అన్నచోటం గూడనట్టి లౌకికలింగ మర్థమగు నని దోషము చెప్పవచ్చునా? సందర్భాదులువిడిచి యర్థముచెప్ప గూడదు గదా! వెండియుఁ బ్రతివాదులు "శ్రీ కంఠము శ్రీ కంఠమే, చాపఖండము చాపఖండమే" యన్న ట్లు స్త్రీలింగమునకు స్త్రీలింగమే యన్నయర్థము వ్రాయఁగూడదా! యని యనవలదు. స్త్రీలింగమనఁగా నర్థమున కేచెందును. అర్థముపైని బ్రత్యయకార్యము జరుగనేరదు గాన నిచ్చట శబ్దార్థములకు నభేదసం బంధమున నట్టిమాట ప్రయోగింపఁబడియెనని తెలుపుటకై స్త్రీవాచక మనిన ప్రతిపదము వ్రాయకతీరదు. సమాసప్రకరణస్థమైన "స్త్రియాః పుంవద్భాషితేతి (6—3—34) సూత్రాదులవృత్తిలోనే స్త్రీవాచక పుంవాచకశబ్దములు సిద్ధాంతకౌముదిలో శబ్దపరముగాఁ ప్రయోగింపఁ బడినవి. అయ్యవి సంస్కృతవ్యాకరణమున సుప్రసిద్ధమైన మాటలు సి ద్ధాంతకౌముదీగ్రంథగంధ మేమాత్రమైనను మూర్కొన్నవారిట్టిచోట ను దప్పుపట్టరు. మఱియు, విరోధులు, దారశబ్దమును బుంవాచకమని యు ననుటకుసాహసింతురని గ్రంథకర్తపైపెద్దగాదోషము మోపి యీమహానుభావులాంధ్రసాహిత్యపరిషత్పత్రికలో న్వ్రాసిరి. దారశబ్దము

పుంవాచకమని సంస్కృతపరిచయమిసుమంతమైనను నున్నవారెల్లరు ను సునాయాసముగా నొప్పుకొందురు. ఈస్వల్పాంశమునకు సాహస మేయవసరము లేదు. ని॥ భార్యాజాయాథపుంభూమ్ని దారాస్స్యాత్తు- కుటుబినీ॥ యనియమరమే ఘోషపెట్టుచున్నయది. పుంవాచకమనఁ గాఁ బుంలింగశబ్దమున; స్త్రీవాచకమనఁగా స్త్రీలింగశబ్దమని యర్థమగు ను. దారశబ్దము పులింగశబ్దముగాదా! అందుఁదప్పేమున్నది? శ్లో॥ దా రాన్ పద్మభువస్త్రీలోక జననీంవందేగిరాం దేవతామ్॥ అని ప్రతాపరు ద్రీయము. ఈస్త్రీవాచకపుంవాచకశబ్దములు విరోధులకు నెంతో య యోమయముగానున్నట్లూహించెద తత్సను. 60 సూ—సురశబ్దము.. స్త్రీతుల్యంబగు. 61 సూ.—దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగన గు. 71 సూ—స్త్రీత్వంబున మతుబాదులు...75 సూ—విశ్వకర్మాదు లకు స్త్రీత్వంబగు, 76—సూ—బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు—ఇ త్యాదిసూత్రములలో స్త్రీశబ్దమునకు నాఁడుదియర్థముగాక "స్త్రీ" అనఁగాసందర్భవశమున స్త్రీలింగమర్థము చెప్పికొన్నట్లు స్త్రీవాచకశబ్ద ములోని స్త్రీశబ్దమునకుంగూడ సందర్భవశమున స్త్రీలింగమర్థమగు. అందు స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకము పర్యాయమగు. 'స్త్రీ శబ్ద పుం' శబ్దములకు స్త్రీలింగపుంలింగము లర్థముకావుననే స్త్రీలింగశబ్దము నకు స్త్రీవాచకమనియుఁ బుంలింగశబ్దమునకుఁ బుంవాచకమనియు సం స్కృతవ్యాకరణంబున ఘంటాపథంబుగా వాడంబడినవి.

మఱియు, నీనిష్కారణద్వేషులు, స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచ కమని వివరించుట యహోబలపండితాదిసకలాంధ్ర వైయాకరణులమ తంబునకుఁబ్రబలవిరోధమని బొబ్బరించెదరు. అయ్యది దుస్సాహసము. 5? సూ. "విక్రుతౌచ స్త్రీలింగా స్త్రీలింగక సర్వనామధేయాస్స్యుః॥ (ఆంధ్ర-శ-చిం-అజం-పరి) వ్యా-విక్రుతౌచయే స్త్రీవాచకాశ్శబ్దాః

తేసర్వే" స్త్రీలింగకవిశేషణవిశేష్యాభిధాయినస్స్యుః॥ (అహోబలయము) ఇట స్త్రీలింగశబ్దమునకు స్త్రీచలేవాకశబ్దము స్పష్టార్థమే పర్యాయపదముగా నుపయోగింపఁబడినది. ప్రతివాదులు, ఈసూత్రవ్యాఖ్యయందు "సీతభక్తవత్సల, పంటచెలిపట్టి లోకైకభద్రచరిత" అని యుదాహరించుటంజేసి "స్తనకేశవతీస్త్రీస్స్యాత్॥ అనున్యాయమున నిచ్చట స్త్రీలింగశబ్దపర్యాయముగా వ్రాయఁబడినను, నీస్త్రీవాచకశబ్దమువలన లౌకికస్త్రీత్వమేగ్రహింతుమని వితండవాదము నేయుచలనుపడదు. 60 సూ. "ఉభయవిధమమహతీనామ్" అనుసూత్రమున వ్యాఖ్యయందు "స్త్రీలింగవిశేణస్యప్రాప్తత్వాత్, అస్త్రీలింగవిశేషణవిధానపవ సూత్రస్య తాత్పర్యమ్" (అహో-తీయము) అర్థము-అప్రాణివాచకములై స్త్రీలింగములయిన యమహతులకు స్త్రీలింగవిశేషణము, (ఈవఅలోనే) ప్రాప్తించుచున్నందు నస్త్రీలింగముగాని విశేషణమును విధించుటయందీసూత్రము చెల్లుననిన తాత్పర్యమును నహోబలపండితులు వివరించిరి (59) సూత్రమున స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకములని వివరించుటంజేసి, యప్రాణివాచకములైన యీస్త్రీలింగామహత్తులు, ప్రతివాదులమతమందు స్త్రీవాచకములు కానందున "వికృతౌచ" అనుపూర్వసూత్రముననిట స్త్రీలింగవిశేషణము వారిమతమునఁ బ్రాప్తింపనేరదుగదా! ప్రతివాదుల మతంబున అక్క, అమ్మ, ఇత్యాదులే స్త్రీవాచకములగుంగాన నట్టి వానికేపూర్వసూత్రమున స్త్రీత్వమువిధింపఁబడఁగాఁ బ్రకృతంబైన యమహతీవిశేషణంబులకు నట్టివిధిచెల్లనందున (60) సూత్రమువ్యాఖ్యానమున స్త్రీలింగవిశేషణ మేసూత్రమునఁ బ్రాప్తించునని వ్యాఖ్యాత యారీతిని వ్రాసెనో చెప్పవలసినభారము ప్రతివాదుల శిరంబుననే యొరగుచున్నయది, మాపక్షంబుననో! [౬౦] సూత్రము

లోని స్త్రీలింగశబ్దమును వివరించు స్త్రీవాచకశబ్దమున నెల్ల స్త్రీలింగప దములును గ్రహింపబడినందున మహతీవిశేషణములువోలె సమహతీ విశేషణములును స్త్రీలింగములౌట ప్రాప్తించుటంజేసి గ్రంథము సమ న్వయించుచున్నయది. ఇంతియకాక, [61 సూ.] "నియతస్త్రీప్రత్యయస్తు సర్వాసామ్। అనుసూత్రపువ్యాఖ్యయందు "సరస్వత్యాత్, 'మిన్నేఱుశి వజటావాసిని, ఇత్యుదాహృతమ్, తత్రన కేవలం స్త్రీసమత్వమ్, కింతు స్త్రీవాచకత్వమవ్యాహతమె నేతితద్రూపముపిసాధ్వేవ - "ధరాపరా గపటలాక్రాంతంబుమిన్నేఱు రూపంతూభయేతిసూత్రేణ సమంజసమితీ జ్ఞేయమ్, అనివ్రాయంబడినది. అనగా, మిన్నేఱుశబ్దము (గంగ) స్త్రీస మమేకాక యవ్యాహతముగా స్త్రీవాచకమునుగాన (59) సూత్ర మునసే శివజటావాసిని, అన్న దీనిని విశేషణంబు స్త్రీలింగమయ్యెన నియు, "ధరాపరాగపటలాక్రాంతంబు, అన్న మిన్నేటివిశేషణము (60) సూత్రముననస్త్రీలింగమయ్యెననియు, దుందుభిధ్వానంబుతో నమహతి యైనగంగపదము స్త్రీవాచకమని యుహోబలపండితులే యుద్ఘోషించు చుండిరి. మఱియు "అమతామితి సామాన్యనిర్దేశేపిన స్త్రీవాచకాద మహాన్నామ్నోయంప్రత్యయః। 'అనుతాం స్త్రీయాంసమానామ్, ఇతిసూత్రేణసోల్లోపేతత్వానిక ముపన్నసంబంధవిశిష్టస్య మోద్దూరాపా స్తత్వాత్తస్య యంతద్వ్యతిరిక్తేభ్య ఏవనామభ్య ఇతినిర్ణయః (అహో పే 279) ఇత్యాదులందు స్త్రీవాచకశబ్దము స్త్రీలింగశబ్దపర్యాయము గాక మహతీవాచకమేయర్థమయ్యెనేని కాంత, ఇత్యాదులందేసులోపము గలిగి గంగ, విద్య, ఇత్యాదులందు సులోపంబురాక ముపన్నకాపత్తి వ చ్చును. ప్రతివాదులు బ్రః శోంఠిభద్రాద్రిరామశాస్త్రులుగారి యహో బలపండితీ యాంధ్రీకరణ మునైనను గ్రహింపలేకపోయిరని తాపిల్లు

చున్నారము. ప్రతివాదులు గ్రంథకర్తయే యీసందేహముతీర్ప వలయుననుచున్నారు. కాని గ్రంథకర్తయేకాదు బ్రహ్మయైనను వీరిసందేహముతీర్ప లేఁడనియెంచి. గ్రంథకర్త భీశల్లిదాగుండ వలసివచ్చెనని మేమెంచెదము. ప్రతివాదులమతంబున మహా- వాచకములైన "అమ్మ" ఇత్యాదులే స్త్రీవాచకములుగాని. యమహాతీవాచకమైన, మిన్నెఱు, స్త్రీవాచకముగాదు గానఁ బూర్వోక్తమైన యహోబలపండితీయమును గుప్తార్థప్రకాశికావ్యాఖ్యానము వోలె నపార్థంబయ్యెడిని. ఒక్కయహోబలపండితీయమే యపార్థమన నేల? వారను గ్రహించియొక్కకంటితోఁ జూచియు జూడనట్లున్నందున నీప్రపంచ మీరీతినియున్నది గానిగట్టిగాఁదలంచుకొని రెండుకన్నులును విప్పిచూచినచో నీప్రపంచమంతయు నపార్థమై యొకయరనిమిషములోఁ దప్పక నిష్ఫచ్చు కావలసినదే!! అహోబలపండితుఁడే యిపుడున్నచో నీప్రతిభటులయెదుట నున్వోత్తుగసూక్ష్మప్రాణంబు (హా) లెగిరిపోయి యబలపండితుఁడు నిస్సంశయముగానగునని మేమెంచెదము. లోకములోఁ బ్రచ్ఛన్నభౌద్ధ్వోపాధి రాములెంతవారైనను నున్నారు గదా! కాని ప్రకృతంబున "రోశబ్దంబొండు సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగనగు" (ప్రౌఢ. శబ్ద-౧౬౫ సూ) "అస్త్రియామిత్యర్థర్వణవచనే స్త్రీవాచకవ్యతిరిక్తానా ముదంతానామితి వ్యాఖ్యానాన్నతన్వాదిభ్యోప్యువర్ణకవికల్పోవిరుద్ధః॥ (అహో-296) ఇత్యాదిస్థలంబులందు స్త్రీవాచకశబ్దంబున వెనుకంబలె నెల్ల స్త్రీలింగంబులును గ్రహింపఁబడినచో, రోశబ్దమున "అక్కరో ఇంతిరో, ఇత్యాదులువోలె 'లతరో, ఇత్యాద్యమహాతీవాచకములుగూడ సాధువులుగావలసివచ్చునని ప్రతివాదులందు రేని వినుండు. "తత్సాధవేతు శాస్త్రీయవిశిష్టేతౌకే

శాస్త్రీయమపిశబ్దతో బుధ్యతే 'తథానుభవాత్" అను స్త్రీయామితి సూత్రస్థపూర్వోక్త శేఖరప్రకారంబున నేమిదివఱలోఁ జెప్పినట్లు పారిభాషికలింగమునకు లౌకికలింగము నొక్కొక్కచో లోకానుభవంబు నంజేసి గ్రహింపవలయుంగాన, వేదశాస్త్రంబులందుఁబలె నీయాంధ్రవ్యాకరణంబునందును బ్రకరణాదసామర్థ్యలోకానుభవంబులంజేసి పారిభాషికస్త్రీత్వమే కాక స్త్రీవాచక, స్త్రీశబ్దములచే నొక్కొక్కచో లౌకికలింగవిశేషమునయితము గ్రహింపవలయునని యహోబలపండితాదివ్యాకరణముల తాత్పర్యమైనట్లు స్పష్టపడుచుండును. అథవా "ఉభయగతిరిహ భవతి" అనినభాష్యేందుశేఖరస్థపరిభాషావశంబున "కర్తృకర్మవ్యతిహారే కణ్వవే ఘభ్యః కరణే, ప్రతిషిద్ధంచానధికరణవాచి" ఇత్యాదుల గ్రియాదిలౌకికార్థః వలె (సంస్కృతవ్యాకరణంబున) తెలుఁగువ్యాకరణమందును నొక్కొక్కచోట స్త్రీవాచకస్త్రీశబ్దములచే లౌకికార్థము గ్రహించుకొనందగునని విస్తరంబుతోఁ జాలును. కాఁబట్టి ప్రతివాదులు సంస్కృతవ్యాకరణసాంప్రదాయాంశభూయిష్ఠంబులైన యహోబలపండితీయాదిగ్రంథంబుల పంక్తుల యర్థమ్మెఱయంజాలక పుస్తరూపము చూచినంతమాత్రమున నిట్టివెట్టిమొట్టియాక్షేపణమునకుఁ దగిన పాండిత్యము కుదిరినను దశమా తా హరీతకీ" ఇనన్యాయమున నవగ్రహముఖంబుల లోకోపకారార్థమవతరించితిమని ఘోషించుకొనుచున్న నిర్దోషులైన గ్రంథకర్తలమార్గముల "నపార్థ" మని యత్యగారిత పెత్తనంబుచేయుట, విధేయము తోఁచనిచో నెక్కిరించుటవంటిది యైతమురసాభాసంబునకే కారణంబయ్యెడిని. ఇట్లు స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకమనియహోబలపండితీయమందే వివరించుటం జేసియీమా ఫల్గునాంధ్రసాహిత్యపరిషత్పత్రికలోని ప్రతివాదుల యుపన్యా

నమును వెనుకటి యారాక్షసనం॥ర భాద్రపదమాసాంధ్రసాహిత్య పరిషత్పత్రికలోని యుప న్యాసమువోలె స్వవచనవ్యాఘాతమై లోకోపయోగను కాకతన యుప పదంబున సంబంధంబోదముగా వ్రుత!!

ఈవివరణమింకను జాలకుండెనేని యింకొకమాటు మరల విశదపఱిచి యీస్త్రీవాచకపదము నీయాంధ్రిమ్మున సైరంధ్రియుగాఁగఁ జొప్పించుటయేకాక "నైవపతంజలిమూర్తిః" అనిన పై యార్యావృత్తపాదము మొదటను బుంవాచకపదమే యున్నట్లు స్థాపింతురుగాక; విరోధులు రాక్షస సం॥రభాద్రపదమాసాంధ్రసాహిత్యపరిషత్పత్రిక ముఖభాగంబుననే బాలవ్యాకరణప్రశంస యెత్తుకొని యందలి శాస్త్రపరిభాషాపదంబులఁ గొన్ని కనం బఱిచి "పైనుదాహరించిన రీతి గసామాన్యదురవగాహవిషయంబు లిందనేకములు గలవు. అయ్యవి సంస్కృతసాహిత్యమును దర్క-వ్యాకరణశాస్త్రజ్ఞానమును గలవారికే బోధపడును. హైస్కూలుబాలురమాటకేమి అధికమగు పట్టుదలతో వాదించుచున్న మనగ్రాంథిక భాషావాదులలో నెందఱకట్టిజ్ఞానముగలదో నేను జెప్పఁజాలను. ఇట్టి టిత్వకిత్త్వాదులఫలములును, (సంధి3-25)సంస్కృతశబ్దముల పుంస్త్రీనపుంసకలింగాదుల (తత్సమ, 21-39-57సూ) రూపములును, హలంతసంస్కృతశబ్దముల ప్రథమైకవచన ద్వితీయైకవచనరూపములును, (తత్స. సూ 67-70) "ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులఁ బ్రథమయగు" నను మొదలగు కారకపరిచ్ఛేదసూత్రములును వానివృత్తులలోని క్రియాసిద్ధిం బకృష్టోపకారకంబు కరణంబను మొదలగులక్షణములును, సంస్కృతతద్వ్యాకరణజ్ఞానముగలవారికి గాని యితరులకు సుబోధములు కానేరవు" అని బాలవ్యాకరణమున వ్యాకరణ

తర్కశాస్త్రపారిభాషికపదము లనేకము లున్నట్లు ప్రకటించి యయ్యవి తెలిసికొనుటకుఁ దగిన పాండిత్యముగలవా రరుదుగానుందురన్న తాత్పర్యము ప్రకటించిరిగాని యట్టి పదము లపార్థము లనఁగా సాహసింపలేదు. అట్టిస్థితిలో గ్రంథకర్త యాహోబలపండితాదులు వాడిన స్త్రీవాచకమనెడి పారిభాషికపదము ప్రయోగింపఁగా నపార్థమని యనుటకు నెట్లుసాహసించిరో తెలియకున్నది. ఏదివచనమ్ములు స్వవచనవ్యాఘాతములుగాఁ గానిపించును "బోద్ధారో మత్సరగ్రస్తాః" అనున్యాయంబునఁ గరణత్రయశుద్ధిలేని నిష్కారణద్వేషులవచనము లీరీతినే యుండుం గదా!! ఈకలికాలంబున బ్రాహ్మణజాతిలోనే బ్రాహ్మవిద్వేష మెక్కుడై యెవ్వరైనశిష్టులు గ్రంథములు రచించినచో నయ్యవి భద్రాకరణమస్త్రంబునందును, హాలాయుధహస్త్రంబునందును స్వశక్తివంచనలేకుండ మోసం బ్రయత్నింతురు స్వజాతిపండితుండు గ్రంథకర్త యనఁగానే తొల్లి యోగనిద్రఁ జెందెడి సముద్రశాయి దామోదరు పెర్లరును ద్రుళ్ళిపడి లేచి విన్యాసమును మిడునానుకొని లోకోద్ధారము సేయుదుమని చాటుచుఁ దమ[illegible]బులు తెలియంజాలక గ్రంథకర్తను రసాభాసముసేయఁ బ్రయత్నింతురు. అట్టి తీరికూర్చుండ లేనట్టి సముద్రశాయులకుఁ గొందఱుభక్తులుకూడ బయలుదేరి క్షీరాబ్ధిపత్రంబులారంభించి పూజానమస్కారంబులకు లోపంబులేకుండ వారిని బత్రితోఁ బూజింతురుగాని యీగ్రంథకర్తయెడ నభేదబుద్ధి స్నేహంబుననుండి న్యాయ్యమార్గంబున సహాయులమైన మాకుఁ గళ్యాణగుణంబులు గలిగి పండితపక్షపాతియైన లక్ష్మీనరసింహమూర్తి యిష్టదైవమై యుండఁగా మాకు లోపమేమివాటిల్లెడు? "లక్ష్మీనృసింహా! మమ దేహి

కరావలంబమ్" అనిన వెంటనే మాకు జంఘాబలసంపదయేల సమకూరదు? కాఁబట్టిప్రతిభటుల ధాటీటీకసంబు పరికింతుముగాక!!

సన్నియోగశిష్టము.

ప్రకృతంబున ప్రతివాదులు మ॥ శ్రీ మైనవఁపాటి హనుమంతరావుగారికి వ్రాసిన యుత్తరములో (తత్సమ 39) సూత్రమున కర్థము తెల్పునపుడు "అమహత్త్వ నపుంసకత్వములు సన్నియోగశిష్టములు కానక్కఱలేదు" అని వ్రాసిరి. ఆసూత్రములోని యమహత్త్వమును నపుంసకత్వమును సన్నియోగశిష్టములని యెవరుపల్కిరి? "సన్నియోగశిష్టానామన్యతరాపాయే, ఉభయోరప్యపాయః" (86) అనుపరిభాష వ్యాఖ్యలయందు "సన్నియోగశిష్టానామ్= సముచ్చయేన విహితానామ్॥ అని స్పష్టపఱుపఁబడినది మఱియు "ప్రత్యయః" (3—1—1) అనుసూత్రమున శేఖరమందు "యత్తువికారాగమాదేశానాం దేశాంశేనిరాకాంక్షత్వా "త్పరశ్చేత్యస్యానుపస్థితౌ, తత్సన్నియోగశిష్టప్రత్యయసంజ్ఞాయా అప్రవృత్తిరితితన్న......... పూర్వాంసీయుటితత్తో లాదేశేప్రత్యయ సంజ్ఞాసన్నియోగేనేటో విధీయమానమాద్యుదాత్తత్వంనేయుట ఏవస్యాత్" 'అని వ్రాయఁబడినది. ఇట్లు వ్యాకరణమున నెక్కడఁ జూచినను సన్నియోగశిష్టశబ్దమునకు "సముచ్చయముగా విధింపఁబడినట్టి" యన్నయర్థము పండిత జగద్విదితమైయున్నయది. ఇట్టి స్థితిలో "అమహత్త్వనపుంసకత్వములు సన్నియోగశిష్టములు కానక్కఱలేదు" అని వజ్ఝలసీతారామ స్వామిశాస్త్రులుగారు సెలవిచ్చిరి ఈసూత్రమందు ముపర్ణక మొక్కటి యేవిధింపఁబడినది

గాని యమమహత్త్వనపుంసకత్వంబులు సముచ్చయముగా విధింపఁబడ నేలేదు. పరిషత్పత్రికలోనింక ననేకములైన వీరిదురవగాహార్థవాక్యం బులున్నవి గాని యిపుడు విస్తరముతోఁజాలును. శాస్త్రాంతరముల లోని పరిభాషాపదంబులీ తెలుంగునఁ బ్రయోగింపఁగూడదనిన శాస్త్రులు గారు సన్నియోగశిష్టపదమునెట్లు ప్రయోగించిరో! ఒకవేళ,ఏ హేతువున నైనను బ్రయోగింతురుగాక! అర్థముమాత్రము శాస్త్రాంతరములోని యర్థ ముగా గానిపింపక వ్యర్థత్వముసంభవిల్లుచున్నది,ఏప్రబలపండితీయగ్రంథ ములోదీనియర్థసంప్రదాయము వివరింపఁబడినదో సెలవీయఁగోరెదము. ఇంకను బ్రాచీనలక్షణంబులు చాలక వీరల్పకాలములో నవలక్షణగ్రంథము రచింపవలెనని పరిషత్తులయందు ఘోషింప సాహసించుచున్నారట. "సాహసే లక్ష్మీః" అన్నారుగాన వీరు సాహసింతురుగాక! అపుడు తక్కిన వారందఱును సభను నాసాదింతురుగాక!! అట్టితఱిని మేమును జూచెదముగాక!!

ప్రకృతంబున సూత్రమందు వివరణలోపంబున్నచో రణలోపంబు సేయక ప్రతిభటులు తిరిగి ద్వంద్వయుద్ధంబునకుఁ దారసిల్లుదురుగావుత!!

శ్లో॥ హేప్రా [హేప్రష్టః) డపార్థపరతంత్ర పదైకదృష్టే।హం సాజ్జవోవివృణవాని స॥పా॥ క్షరార్థమ్। విద్ధిత్వముత్త - రకుమారసనాను మార్య! మా మాహ్వాహేన సమరాంగణ పార్థమూర్తిమ్॥

స॥ పా॥

(సశేషము)



బ్రహ్మశ్రీ కల్లూరి వేంకట రామశాస్త్రి
విబుధవిరచిత బాలవ్యాకరణ
గుప్తార్థప్రకాశిక
1-11-1916 — దేశమాత

— ♦ పరిబోధకరణము ♦ —

— ;o; —

పైనామంబుగల బాలవ్యాకరణవ్యాఖ్య పరిపూర్తింజెంది వెలువడినసంగతి యెల్లరకును విదితమై యున్నదిగదా! ఈవ్యాఖ్యానములో (తత్సమ 57) సూత్రములోని స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచక మని యర్థము వ్రాయుట కేవలము వ్యాఖ్యాకారుని పొరపాటనియు. అయ్యది యపార్థ మనియు బ్ర॥ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారిచేత (రాక్షసనం॥ర పుష్యమాసప్రాంతమున వెల్వడిన) భాద్రపదమా సాంధ్రసాహిత్య పరిషత్పత్రికలో వ్రాయఁబడినది. వారు తప్పులని యెంచుకొన్న యంశములలో నిదియేమిక్కిలి పొరపాటని కాఁబోలు! రాటమహేంద్రవరపురస్థగ్రంథకర్తచేర నిట్టియసందర్భమ్మైట్లు లు వ్రాసితిరనిన యిత్యాదిసముద్ధత వాక్యములతోఁ బ్రత్యేకముగాఁ బనిగట్టుకొని యుత్తరములు సైతము విమర్శకపక్షమునుండి పంపఁబడినవఁట, తమపాండిత్యము నందు నింతదృఢవిశ్వాసము గలిగి గ్రంథకర్త పరిశ్రమ నధిస్పందమ్మునకు నంటఁద్రొక్కి తమదృష్టికి మీాఱినయంశమ్ముల నపార్థమపార్థమని మృదుత్వముచెప్పిన మృగస్వామినాదములతో తమ సామాన్యవిద్యార్థులంబలె కసరి గద్దించుచు "వివాదశ్చవివాహశ్చ సమయో శ్శేవశోభతే" అనెడిలోకోక్తికి వ్యతిరేకముగా సమానస్కంధతను మీాఱినట్టియంతటి సీతారామస్వామి శాస్త్రులవారివంటి యుక్తములతో బహిరంగముగా డీకొని యెదిర్చించుట యసంగతమున్ను, అతి

సాహసమును, లజ్జాకరమును నయ్యెడినని మామానసంబునకుఁ దోఁచుచున్నను వాగుద్ఘాటన చేసిన యంశంబులు లోకులలోఁ గొందఱకు నిజంబుగా నపార్థములేయని వ్యామోహము గలుగునేమో! యనితలంపునం జేసియు. "త్వమేవాహం త్వమేవాహం త్వమేవాహం నసంశయః" అనిన న్యాయంబున గ్రంథకర్తతో మాకునభేదం బయిన మమతాబుద్ధియుంటం జేసియు, నెంతయో బలాత్కృతులమై ది 2- ఫిబ్రవరి 1916 సం॥రము తేదిగల దేశమాతపత్రికారత్నమ్మున సిద్ధాంత కౌముది, శబ్దేందుశేఖరము, మహాభాష్యము, ఇత్యాదిగ్రంథములు ప్రమాణములుగాఁ జూపుచు స్త్రీలింగపదమునకు స్త్రీవాచకమని యర్థము వివరించుట న్యాయ్యంబే కాని యపార్థముగాదని ధ్రువపఱుపఁబడినది. పిమ్మట జూలై నెల ప్రాంతమునఁ బ్రకటింపఁబడిన మాఘ ఫాల్గునాంధ్ర సాహిత్యపరిషత్పత్రికా మణిలో విమర్శకులు, సంస్కృత వ్యాకరణంబున స్త్రీవాచకపదము స్త్రీలింగపదమునకు వివరణం బగుట యథార్థమే కాని యహోబలపండితు లిట్టియర్థమందు స్త్రీవాచకశబ్దమును వాడియుండలేదని దృఢమనమ్ములోఁ గొన్ని యహోబలపండితీయ వాఖ్యానమందలి యంశములెత్తి చూపి యాంధ్రవైయాకరణుల వ్యవహారమునంతను గ్రంథకర్త మఱచి స్త్రీవాచకపదమును స్త్రీలింగపదమనిన యర్థమందుపయోగించుట యయుక్తమని తిరిగి వ్రాసిరి. మరల, మేము తమ గ్రంథము దహోబలపండితులు కూడ (279, 317, 320,) పాఠటలలో స్త్రీవాచకపదమును స్త్రీలింగపద పర్యాయముగా వాడుట ది 2 అగష్టు 1916 సం॥ రము తేదిగల దేశమాతపత్రికావతంసములో వ్రాసి ప్రదర్శించితిమి. బ్రా॥ శ్రీ॥ భద్రాద్రిరామశాస్త్రులుగారు కూడ స్త్రీవాచకపదమును స్త్రీలింగమునకు వివరణముగా, నహోబలపండితీయమునందు దెలిగించుటజేసి వ్రాసియున్నారు.

(2) మఱియు. మాఘ ఫాల్గున మాసాంధ్రసాహిత్యపరిషత్పత్రికారత్నములోనే విమర్శకమానులు "గుప్తార్థప్రకాశికారులు దారశబ్దమును బుంవాచకమ్మని వ్యవహరించుటకును సాహసింతురని తోఁచుచున్నది" యని వ్రాసిరి. దానికి మే మీస్వల్పాంశమునకు సాహసపర్యంతానుధావన మవసరము లేదనియు, సంస్కృతపరంబైన దారశబ్దము పుంలింగబహువచనముగాన సునాయాసముగానే దానిని బుంవాచక మనవచ్చుననియు నా దేశమాతపత్రికలోనే వ్రాసితిమి. అహో బలపండితులును, తేనదారములు, ఇత్యాదికమేవరూపమ్, బహుత్వమేవ దారశబ్దస్య పుంస్త్వమ్' అని 346 పొరటలోఁ బుంలింగమని చెప్పుచుండఁగాఁ బుంవాచక మేల కాఁ గూడదో వింతగా నున్నది.

(3) "అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు" నను (తత్సమ 39) సూత్రములోని యమహన్నపుంసకశబ్దమునకు ద్వంద్వార్థమునువిడనాడి గుప్తార్థప్రకాశికాకారులు కర్మధారయార్థమును లిఖింపఁగానయ్యది గతిలేనిదోషకారి రచన గావున నట్లు వ్రాయగూడదని విమర్శకు లాక్షేపించిరి.

మేము ద్వంద్వసమాసపక్షమందు ననేక క్లిష్టదోషములు గనంబఱిచి ద్వంద్వార్థమే గతిమాలిన యర్థమని మహాభాష్య, కైయట, కౌముదీ, శేఖర, విషమీ, శబ్దరత్న, పరిభాషేందు శేఖరాది గ్రంథములు ప్రమాణములు గాఁగ స్థిరపఱిచి శాఖాచంక్రమణముగా లక్ష్యసమన్వయపూర్వకమయిన కర్మధారయార్థ సౌలభ్యము వివరించి చూపితిమి.

(4) వారు స్వపక్షమయిన ద్వంద్వార్థమును వచించుటలో నమహత్త్వనపుంసకత్వములు నన్నియోగశిష్టములు కానక్కఱలేదని ప్రయోగించిరి.

అట్టి యోగశిష్ట శబ్దమునకు సాంస్కృతికవ్యాకరణజ్ఞులును సహోబలపండితాద్యాంధ్రవై యాకరణులును నీవఱలో సుప్రసిద్ధముగా వాడిన యర్థము సరిపడకయుండి మిక్కిలి యపార్థముగాఁ దెల్ల మగుచున్నందున దాని యర్థ మేమనివిమర్శకుల నడిగితిమి.

(5) 'బృందారకాదైవతాని। పుంసివాదేవతాస్త్రియామ్' అను కోశాదులవలనఁ బుంలింగమును నైన స్వాహత్కో దాహృత్యదైవత శబ్దమునకే స్వమతమందు డుజ్ వర్ణక మేలరాలేదో! యంతిమప్రశ్నముగా నడిగితిము.

ఆగస్టు 2 తేదిని నుదయించిన దేశమాత పత్రికానంతరత్నమ్మున మే మైదంశములు ప్రకటించిన పిదప వెలువడిన యాంధ్రసాహిత్యపరిషత్పత్రికావతంసములు మూఁడిటిలోనను మాలిఖించిన యంశములకు బ్రా॥ వ. సీతారామస్వామిశాస్త్రులుగారు ప్రత్యుత్తరంబు లీయలేదు. వారి తాత్పర్యము సయుక్తికముగా వెల్లడింపఁ గోరుచున్నారము

స॥ పా॥

---

## 21—2—1917. దేశమాత,

## బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక

## విజ్ఞాపన

---

సుధీమణులారా!

"బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక"యను పేరంబరఁగు వ్యాఖ్యానము నాచేరచింపఁబడి ప్రకటితమయ్యె నన్న సంగతి యెల్లరకును విశదమే కదా! ఆవ్యాఖ్యానములో స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకమని పర్యాయపదంబు వ్రాయఁబడఁగా నయ్యది గూడదయు, "అమహన్నపుంసక మూల కదంతములకు మునర్ణక మగు" నన్నసూత్రములోనియమహన్నపుంసకశబ్దము ద్వంద్వసమాసముగా వ్రాయవలసి యుండఁగా నటులు సేయఁబడలేదనియు, సంతగ్రంథము నేసిన గ్రంథకర్తయెడ నెంతమాంత్రమును గౌరవమ్ముంపకయాధ్ధిక్యమున 'నపార్థమపార్థ' మనిపలుమారు విజయనగరనివాసులు బ్ర॥ శ్రీసీతారామస్వామిశాస్త్రిలుగారు బొబ్బరించుచు నాంధ్రసాహిత్య పరిషత్పత్రికయందుఁ బ్రకటించిరి. విద్యావృద్ధవయోవృద్ధుల వదనంబులు కలవచనంబులతో మెలంగుట యుక్తంబుగాని కలహావచనమ్ములతో నలంగుట న్యాయ్యంబు గాదయుని, వ్యవహారములోనికి దిగినపిమ్మట నావేశమ్ము లవధిని మీఱించు ననియు నేనించుక సంకోచించుచుండ నంతట నాతిరస్కారమును సహింపక "త్వమేహాహంత్వమేవాహ" మ్మనున్యాయంబున నాయెడ నభేదబుద్ధిని సంచరించు సమరాంగణపార్థమూర్తిగారు శాస్త్రిలుగారి యభియోగమునకుఁ బ్రత్యభియోగంబు సేసి, ది 2 ఫిబ్రవరి 16 సం॥ రము తేదిగల దేశమాతపత్రికలోను, ది 2 ఆగష్టు 16 సం॥ రము తేదిగల దేశమాత పత్రికలోను స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకశబ్దము పర్యాయపదముగా వ్రాయకలేరదనియు, సూత్రాంతరములోని యమ

న్నపుంసక శబ్దమున నిరుపమోఁగ ద్వంద్వ సాధనము క్లేశహేతువనియు భాష్యకైయట శేఖరాది గ్రంథములు ప్రమాణముగాఁ గఁజూపి ప్రకటించిరి. పిదపనాలుమాసములు గతింపఁగా సెప్టెంబరు నెలలోఁ బ్రకటింపఁబడిన నల సం॥ ర భాద్రపదాశ్వయుజ మాసాంధ్ర సాహిత్యపరిషత్పత్త్రికలో బ్రహ్మశ్రీలు మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రులు గారును వజ్ఝల చిన సీతారామ శాస్త్రులుగారును వరుసగా ద్వంద్వమును గూర్చియు ద్వంద్వ స్త్రీవాచక శబ్దములను గూర్చియుఁ బార్థమూర్తిగారి యాశయమునకు వ్యతిరేకముగా వ్రాసి ప్రకటించిరి యన్నట్లున్నది. బ్రహ్మశ్రీ సుబ్బారాయశాస్త్రులు గారు నన్ను మంచివైయాకరణులని యీవఱకు వినుచున్నట్లు నాపుణ్యవశంబున మెచ్చుకొనుచు నన్నింగాని లేక యితరవైయాకరణులం గాని యడిగి సందేహములు తీర్చుకొనవలయునని వ్యాసాంతమునఁ బార్థమూర్తిగారికి నుపదేశించినట్లును వ్రాయఁబడియున్నది. ఇట్టివ్రాఁతయే నాపశానసగోళకు శేశయంబున నతిశయిల్లెడి యాశయమ్మును దెలుపఁగా బలాత్కరించినఁ. ఉభయవాదులును నేకీభవించి కోరకుండనే తమంత తాము ద్వంద్వవాదులగు సీతారామస్వామి శాస్త్రులుగారికి నుపఘ్నకల్పమూర్తియై యేతెంచిన బ్ర॥ సుబ్బారాయశాస్త్రులుగారు, గ్రంథమునందు ద్వంద్వసమాసమును బరిహరించిన నాయభిప్రాయమును దెలుపఁదోడు నీడగా నరుదెంచిన పార్థమూర్తిగారిని నన్ను నడిగి ద్వంద్వస్థాపన విషయమైన సందేహములున్నచోఁ దీర్చుకొమ్మనుట మిక్కిలి యసందర్భ గర్భవాక్యంబుగదా "యద్యస్తి వీర్యమస్త్యేవ। కర్త్రైవకథయిష్యతి॥ యను మురారికవీంద్రుని వచనప్రకారంబునఁ గృత్యమే తెల్పును వేఱొకటి యేటికి? ఇంతియకాక, పార్థమూర్తిగారు ద్వంద్వసమాస బాధకము

లుగా వ్రాసిన ముఖ్యాంశములు కొన్నిటి నంటనైననంటక విడనాడిన వీరివ్యాసము శాస్త్రమూర్తిగారికి సందేహములున్నట్లు లెట్టులారోపింప గలిగెడి? శాస్త్రదృష్టినిజూడఁ గ్లేశకారియై సూత్రీకరణంబునకును నాగ్రంథసరస్వతికిని గర్భశత్రునగు నీనిష్ప్రయోజన ద్వంద్వంబింకను నీసూత్రంబును బట్టుకొని యిట్టియలుఁగుచో విచ్చలవిడి విహరింప నిచ్చెదనే? ఈవటిలోఁ బండితులకరామరికకు డాఁగి నెంతో ప్రయోజన కారిగాఁగ భ్రమియింపఁజేసిన యీద్వంద్వమను నిపుడు పండిత ప్రపంచమ్మునుండి పటాపంచఁగాఁగ బాఱద్రోలెఁ గాక !! నిరర్థకంబైనయిట్టి యమహాన్నపుంస్త ద్వంద్వమ్మునకు శాస్త్రమార్గంబునం గూడ నిత్యత్వమును నెలకొల్పఁ జూచుచుండెడి ప్రస్తుతప్రకరణంబులో "దుర్యోధనార్జునులు శ్రీకృష్ణసహాయమును గోరివచ్చిరి" యిత్యాదిసార్థక ప్రకరణవిరోధివాక్య భ్రంశంబులతో నిండిన యీవ్యాసమునకు మహామహోపాధ్యాయబిరుదాంకితులగు శాస్త్రులుగారే కర్తలనఁగా సంశయము వొడముచున్నది. లేనివంకలు దేఁ జూచుచోఁ దమలోనివంకలు వెల్వడుంగదా ! ఏది యెట్లున్నను దదీయనామధేయ సువర్ణాంకితమై రూపధేయముగాంచిమిఱుమిట్లు గొల్పుచున్న యీవ్యాసంబుస్వయముగా సమాధానంబు చెప్పి గౌరవింపఁదగినదిగాని యన్యథా సేయందగినదిగాదు. నేనును గాశీపుర నివాసులగు జాగదీశపండేజీవారికిఁ బ్రియశిష్యులును భాష్యాబ్ధిమథన సంగృహీత సుధీభావులును నస్మద్వంశముక్తామణులునునిర్ద్వంద్వులునైన బ్రహ్మశ్రీనరసింహ దీక్షితులవారి శిష్టాచారమార్గగతి విశిష్టచరణారవిందంబులయొద్ద శిక్షితుండనై యించుక శబ్దవిద్యాగంథంబూరుకొన్నవాఁడను గాని యూరకున్నవాఁడనుగాను "శ్లో॥ నిర్ద్వంద్వోహిమహాబాహో। సుఖంబంధాత్ప్రముచ్యతే॥ అను గీతావాక్య ప్రకారమునసట్లు నిర్ద్వంద్వులైన గురులయొద్దఁ బాత్త్రముపట్టిననే నారీతిని నిర్ద్వంద్వుండఁగా నేరకున్నను, నీప్రకృత ద్వంద్వమునుద్రోసి

రాజనియైన నిర్ద్వంద్వుండ నయ్యెద. కావున సముద్ధతులయెడ సమాధానంబుచెప్పందగినసమరాంగణపార్థమూర్తిగారిని సామవచనంబులతో నించుకవడి నవరించి నేను స్వయముగానే సుశాంతిమతులగు శాస్త్రులవారికి నభిముఖుండనై గౌరవపూర్వకముగా సమాధానసంధానము గావించి యీవ్యర్థద్వంద్వంబును దవ్వునకుం దలంగింతుంగాక ఆఱుమాసము లంత కాలయాపనము కానీను. మా రాజకీయకలాశాల యందుం బరీక్షాచర్చ జరుగునట్టి సమయము సమీపించినందున నెలవుదివసములలోం బ్రత్యుత్తరంబు నిచ్చెద. స్త్రీవాచకశబ్దము గతించిన వ్యాసద్వయంబున మిన్ను మన్నంట[illegible]యు గాక మిన్నేఱుసైతమంటి పూతంబైనది గాన దానిం గూర్చి యించుకంతయే చర్చింపంబడును. ప్రకృతంబగు స్త్రీవాచకశబ్దమంటిన మిన్నేఱు నల్లురును నను కొనుచున్న మిన్నేఱుగాదంట. మున్నేరుననర్థమెఱుంగని మిన్నేఅంట. ఏమి! యీవిశ్వామిత్రార్థముల పంట. ఔరా! అద్భుతం బుద్భూతంబయ్యెడి ధర్మంబే వర్ధిల్లుగాత!

ఇట్లు విన్నవించు కల్లూరి వేంకటరామశాస్త్రి
ప్రథమగీర్వాణపండితుఁడు
ఆర్ట్సుకాలేజి
రాజమహేంద్రవరము

18-4-1917 దేశమాత.

(బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక)

బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి కృతము

ద్వం ద్వో ప శ మ న ము.

—*—

శ్లో॥ పండితాఖండలాఖండ। సమ్మోదామృతదోహదమ్
ద్వంద్వోపశమనం కుర్వే। సోహం తత్కర్మధారయః॥

శ్లో॥ మహామహోపాధ్యాయం స।
త్కర్మధారయదూషణమ్
తాతాసుబ్బారాయశాస్త్రి
బ్రహ్మశ్రీభూషణం బ్రువే.

ఓసుధీమణులారా!

1916 సం॥ రము ఆగస్టు నెల 2 తేదీగల దేశమాత పత్రిక యందు "ద్వితీయప్రత్యభియోగి" మను శీర్షికతో (సూ॥ 39. తత్స మ) "అమహాన్నపుంసకములకదంతములకు ము వర్ణకంబగు" నను బాలవ్యాకరణ సూత్రములోని "యమహాన్నపుంసకములకు" అనెడి పదంబునఁ గర్మధారయసమాసవృత్తి యందలి యాంతరంగికార్థమును నుదాహరణ సమన్వయ సహితంబుగా 'జాటించి యచ్చటి ద్వంద్వవృత్తి యందలి దుర్లలిత వృత్తిని నాయెడ నఱమఱలేని వృత్తితో మెలంగు చుండు సమరాంగణ పార్థమూర్తిగారు మహాభాష్యకైయట శేఖరవ్యా కృష్ణధీయుక్తవై యాకరణభూషణసారాదిగ్రంథమ్ములు ప్రత్యక్షసాక్షులుగా గ బహిరంగకము చేసి దానిని బహిష్కరింపఁగా, ద్వంద్వపక్షపాతులగు పెద్దలగు శ్రీరామస్వామిశాస్త్రులవారి వద్దను పాఠము గొనని

భీతిని సంభ్రమించి కేవలమును నట్టి పక్షపాతమ్మే లేకుండఁదలంచి విజయనగరనివాసులు బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రులుగారు 1917 సం॥ రము ఫిబ్రవరినెలలో వెలువడినసల సం॥ర భాద్రపదాశ్వయుజ మాసాంధ్ర సాహిత్యపరిషత్పత్రికలో "ద్వంద్వయుద్ధోపశమన" మను పేరంబరంగు నొకవ్యాసమును ద్వంద్వసాధకంబుగా నటించుచున్న దానిని లిఖించిరి యన్న సంగతి సందర్శించితిరి గదా! (2) కలియంబడి కలహించువార లలో నోడిపోవుచున్న పక్షంబున "ఆపత్కాలే నాస్తి మర్యాదా" అనున్యాయంబు స్మృతినుంచి కనికరంబు గలిగి దయాళురగుసాధువులుతోడుపడుట నైసర్గికమయియున్నయది. అది యొక్కటియే కాక బ్రహ్మశ్రీ తాతాసుబ్బారాయశాస్త్రులుగారికిని బ్ర॥ వజ్ఝలచిన సీతారామస్వామిశాస్త్రులు గారికిని నేకగ్రామే వాసిత్వమును నేకవిద్యాశాలాశాసిత్వమును లోనగు పరస్పర సాహాయ్యకారణంబులు గూడ సమగ్రమ్ముగా నిండియున్నవని వినియున్నాఁడ జగమ్మునందుఁ బెక్కురు వీరివంటి మంచి వైయాకరణులు సముచితమైన సమవృత్తితో వినుచుండి యుదాసీనులైయున్నను పైనిం జెప్పిన కారణంబులు వీరిని బలాత్కరింపఁగాఁ బూర్వోక్త సూత్రమునందు సీతారామస్వామిశాస్త్రులవారి ద్వంద్వసమాసవిగ్రహంబును సాధించుటకు నెన్నెన్నియో క్రిందికి మీఁదికి సూత్రయుక్తులున్న సుబ్బారాయశాస్త్రులుగారు రాటుపటుబోటుల నొగ్గిసామంతరాటుబోటులు గాఁగ సింగారించి నిలఁబెట్ట జూచిరి. కాని యవియన్నియు శాస్త్రీయములు గానందున నెన్నికకు రాక "కూల్యాభ్యస్స్వాహా" యను వేదశ్రుతి కే యానుకూల్యంపడియున్నవి. సుబ్బరాయశాస్త్రులుగారికి నిజముగా నిష్కృష్టమైన పాండిత్యమే కలిగియున్నది యందము. అయినను నోటిపలుకు పలుకుచున్న వృత్తి

కాపాత్రమునందు గట్టితనము తెచ్చిపెట్టంజూచెడి తమ సింహనోటి పలుకులు చిత్తమువచ్చినట్టులు చిత్తజల్లులుగాఁ జల్లినను నయ్యవి చెల్లాచెదరగుంగాని న్యాయ్యసిద్ధాంతసస్యంబునకు నెట్టులు పరిశస్యంబగును? అయ్యది యటుండనిండు. (3) ప్రకృతంబునఁ గర్మధారయార్థమున వివరింపఁబడిన యీసూత్రార్థమునకును, క్రింది యుదాహరణములకును సమన్వయముగాదని ద్వంద్వవాదులు గభీరఘోషణములతో లోకులమనమ్ములు వ్యాకులపెట్టుచుండిరి. గాన నట్టి సూత్రార్థమెట్టు లెన్నివిముఖములుగా సునాయాసమున సరియగునో యీపృథమవ్యాసఘట్టమున విన్నవించి తర్వాతి వ్యాసఘట్టంబులందు ద్వంద్వమతఘట్టనమ్ము గావించెద. రాగద్వేషద్వంద్వాభిమానము మాని సత్కర్మధారయుండనౌ నే నెప్పుడైనను న్యాయంబగు వాచోయుక్తులు మీమాంసమున నాటునట్లు మనవిసేయుదుంగాని నాసత్కర్మార్థమునకు విరుద్ధముగా "ఏవంహి దృశ్యతేలోకే, భిక్షుకోయం ద్వితీయాం భిక్షాం సమాసాద్య పూర్వాం నజహాతి॥ సంచయాయైవ ప్రవర్తతే" యని యజహత్స్వార్థావృత్తి ప్రకరణమందలి సమర్థసూత్రస్థ భాష్యకారవచనరీతిని భిక్షావందనములు సేయుండని స్వాములవారితన మూనిబలాత్కరింపను జుండీ పర్యవసానమున ద్వంద్వవిసంవాదార్థమును గర్మధారయ సంవాదార్థమునుగ్గ్రహించి గుప్తార్థపరికాశికావ్యాఖ్యానంబునం బ్రకటించువాఁడ సుధీమణులు సావధానస్వాంతులై వినంగ వేఁడుచున్నాఁడ.

(చదువరులకు విసువులేకుండ ఘట్టములుగా విభజించి ప్రకటించెద.)

(4) లోకములో—శ్రీరాముఁడు, శివుఁడు—ఇత్యాదిమహాద్వా

చకముల యందలి డువర్ణకంబు పుంలింగచిహ్నంబనియు, వృషభము, ధనము—ఇత్యాద్యమహద్వాచకముల యందలి 'మువర్ణకమ్ము నపుంసకలింగచిహ్నంబనియు నెల్లరును నెఱింగినవిషయమేకదా!! ఇట్లుండనిపుడు ద్వంద్వవాదులు మోపిన పెద్దనేరమేమనఁగా—'ధనము, శబ్దములోని మువర్ణకంబు నపుంసలింగ చిహ్నంబనియు, 'వృషభము, శబ్దములోని మువర్ణకమ్ము పుంలింగచిహ్నమ్మనియు ననవలయునని గ్రంథకర్తను బలాత్కరించి దేశమంతటను నల్లరిసేయుచుండిరి. ఒకరూపుగల వస్తువునే రెండువిధంబులుగాఁ జెప్పవలెనని బలవంతము పెట్టినచో నెవ్వరొడంబడుదురు? ఒక్కరీతియేగల శృంగములు దీసికొనివచ్చి దానిని మహిషీశృంగమనియు (గేదెకొమ్ము) నంతలోనే గోశృంగమనియు (ఆవుకొమ్ము) ననుండని బలాత్కరించినచో బలాత్కర్తలకు శృంగభంగమ్మేకాక చివినిల్లుగట్టుకొని పోరినను లోకులామాట పాటింతురే? అట్లే 'ధనము,చోట నపుంసకలింగ చిహ్నంబని బోధింపఁబడిన మకారపుంగొమ్మును నంతలోనే వృషభముచోటఁ బుంలింగచిహ్నమ్మనుమనినచో నగుబాట్లు రాకుండునే? కావుననే చిన్నపాఠశాలలోసైతము వృషభము-కాకము-ఇత్యాది తిర్యగ్వాచకశబ్దములును శబ్దలక్షణాన్వయము (వ[illegible]) వివరించునెడల "ధనము, వనము" శబ్దములువోలె నపుంసకములు గాఁదలంపఁబడుచున్నవి. ఈవిషయమ్మున నమహత్తులు నపుంసకశబ్దములు కాకతీరవుగాన, నమహత్తులయిన నపుంసకములని కర్మధారయ సమాసము గ్రంథకర్తచేత సూత్రము విసరింపఁబడినది. ఋతుము, బుతుము, దైవము (భాగ్యము—అమ॥ దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతిర్విధిః) సూత్రముక్రింద వ్రాయఁబడిన లక్ష్యము 'దైవము, గాని ప్రతివాదులన్నట్లు 'దైవతము, గాదు. మహద్వాచక 'దైవత, శబ్దమునకు మువర్ణకము, ఏసూత్రమున గలుగునని శంకింతురే? వినుఁడు.

(5) సూ॥ ౬-౪-౧౭౪॥ 'దాండినాయనహాస్తి నాయనేతి' సూత్రస్థభాష్యంబున 'యథానపుంసకంలింగసర్వనామ'యని నపుంసకలింగము లింగములలో సర్వనామమని చెప్పంబడినందునఁ బుంలింగాది విభక్తులగు "షు" వర్ణకాదులు రానిచో లింగసర్వనామంబగు నపుంసకలింగపు 'ము, వర్ణకమే న్యాయంబున వచ్చును. కనుకనే "సామాన్యే నపుంసకమ్" అనువార్త్తికము న్యాయసిద్ధముగాని యపూర్వవిధి గాదని శేఖరాదివ్యాఖ్యలయందు వ్రాయంబడినది. దానంజేసియే (ఏకవర్ణవర్తిత్వాద్వాచః (వర్తినీత్వాత్, అనుటకు మాఱుగా) అనుపరస్మిన్నికర్షేతి సూత్రస్థభాష్యప్రయోగంబును, "సామాన్యే నోఽక్రమాత్ స్త్రీప్రత్యయాభావః" అను తత్రత్యకైయట గ్రంథమును, [2] కారకవిభక్తేర్బలవత్త్వాత్ ద్వితీయా" "బలవతీత్వాత్" అనుటకు బదులుగా) అనుశేఖరప్రయోగము (3) "శరదః కృతార్థతా॥ (కృతార్థాతా, అనవలసియుండఁగా) ఇత్యాది కవిప్రయోగంబులును స్త్రీలింగరూపములకుఁ బ్రతినిధిగా నుంపబడిన నపుంసక రూపములతో సాధువులగుచున్నవి. ఇంతియకాక, (4) 'శాంతోద్వేగస్తిమితనయనం దృష్టభక్తిర్భవాన్యా" అను మేఘసందేశశ్లోకముయొక్క వ్యాఖ్యయందును, (5) 'దృఢభక్తిరితిజ్యేష్ఠే, అను రఘువంశద్వాదశసర్గస్థ శ్లోకముయొక్క వ్యాఖ్యయందునుః "దృష్టం భక్తిః యస్యాసః" దృఢం భక్తిః యస్యసః॥ అను మల్లినాథసూరి ప్రదర్శితవిగ్రహంబులలో స్త్రీలింగభక్తి శబ్దమునకు నమన్వయములైన నపుంసకప్రత్యయాంత దృష్టదృఢశబ్దములు సంగతములగుచున్నవై యాసమాసంబులు సాధువులగు. ఇట్లే మిత్రము—(మహాద్వాచకమగుచో) ఇత్యాదిక్వాచిత్కరూపంబులందుం గూడ సూత్రమక్కఱలేకయే లింగసర్వనామంబగు నపుంసకలింగము, 'ము, విభక్తిన్యాయప్రాప్తంబగు.

(6) ద్వంద్వావాదులు పైసూత్రములో ద్వంద్వము రచియించి "అదంతన పుంసకములకు మువర్ణకమగు" నని విధి సూత్రము రచియించు కొన్నచో మీఁదమిక్కిలి గొప్పదోషములు సంభవించి యవిధిపడ వలసి వచ్చును. అది యెట్టిదియనఁగా నాకర్ణింపుఁడు.

1 తీర్థం శాస్త్రే ధ్వరక్షేత్రోపాయో పాధ్యాయమంత్రిషు— అను నిఘంటువున నుపాధ్యాయాది మహదర్థముల యందును తీర్థ శబ్దము, నపుంసకముగానఁ బ్రతిభటుల మతమందును " తీర్థుఁడ, నుటకు బదులుగాఁ దీర్థమనవలసివచ్చును.

3 మహామాత్రాః ప్రధానాని—అనునిఘంటువున మంత్రివాచకమై మహదర్థకమైన నపుంసకప్రధానశబ్దమున 'ప్రధానుఁడు ప్రధానులు' అని కావలసియుండఁగా 'దైవతము' అను నట్లు 'ప్రధానము' అనవలసి యుండును. ప్రధానశబ్దము మంత్రివాచకమైనపుడు పుంలింగముం గూడఁ గలదందురేని వైకల్పికముగాఁ బ్రధానమన్న రూపము తప్పక యవిధి నొంద వలసివచ్చును.

2 పరంధాముఁడు...ఇత్యాదిరూపంబుల యెడంగూడ నవిధి సంభవించును. ఇంతియకాదు. అవధానంబుతో నవధరింపుఁడు . 1 అధికమాయి పిత్రార్జితమాధనము.—ఈవాక్యంబున విశేష్యమగా ధనమువోలె విశేషణములైన యధిక పిత్రార్జితశబ్దములుఁగూడ నపుంసకములై ము వర్ణకముం బొందినట్లు—2 జగన్నాటక ప్రవర్తకుండైన దైవమే రక్షకుండు—.అన్న వాక్యము నంగూడ దైవవిశేషణములు నపుంసకలింగములు గానజగన్నాటక ప్రవర్తకంబైన దైవమే రక్షకము—ఇత్యాది భ్రష్టప్రయోగంబులు తటస్థించును. 3 నా మిత్రము దయావంతుఁడు— అనుచోట "నామిత్రము దయావంతము" అని యిత్యాదు లసవ్యాప్తి

యోగమ్ములు ప్రవర్తిల్లు. మేముంగూడ నిట్టిప్రయోగములయెడ లోక న్యాయమే యవలంబింతుమని ద్వంద్వవాదు లనంగూడదు. అట్లయి నచో వీరివిధి యవిధియగును. మామతమునందు విధివాక్య మవసర ములేకుండనే "న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి కేవలః ప్రత్య యః; అపదంనప్రయుంజీత, అను శాస్త్రీయవచనంబునం గేవల ప్రకృతి ప్రయోగింపందగదు గాన దైవతాదిక్వా చిత్క-శబ్దములయొద్ద వేఱొక విభక్తికిం బ్రాప్తిలేమింజేసి లింగసర్వనామంబగు నపుంసకలింగపు 'ము" వర్ణకమే సునాయాసముగా న్యాయప్రాప్తంబై యవిధినొందవలసిన య వసరములేదు.

(7) ఇంకను ద్వంద్వవాదులు "అమహత్తులైన నపుంసకము" లనంగా "ధనమ్, వనమ్"— యిత్యాది నపుంసకములే యగుంగాన "వృక్షః, కాకః,— ఇత్యాది పుంలింగములు గూడం దెలుంగున నపుం సకము లేవిధిచేనగునందురో యవధరింపుడు. ఈసూత్రములోని య మహత్పదంబున యావదమహత్తుల నుద్దేశించి "అప్రాప్తేశాస్త్రమర్థ వత్" అను మీమాంసాన్యాయంబునం బ్రాప్తాప్రాప్తపర్యాలోచన జేసినచో నపుంసకత్వ మీవిధియే విధించుచుండు. అందున వృక్షాదు లు తెలుంగున నపుంసకములయ్యె. కనుకనే "సర్వాదీనితదంతానిచో క్తసర్వార్థ వాచకత్వ సమానాధికరణ సర్వనామపదవంతీతిత్వత్రప్రాప్తా ప్రాప్తవివేకన్యాయేన సర్వనామపదవత్త్వాంశేపవవిధిః; సర్వార్థవాచక త్వస్యలోకతః సిద్ధేః" అనునబహుప్రీహివితి సూత్రస్థశేఖరము సంగత మయ్యె. అట్లై ప్రాప్తించిన యమహత్సంజ్ఞగల శబ్దముల ననువదించి నపుంసకత్వ మిచట విధింపంబడియె.

(8) ఒకవేళ సర్వాదీతిసూత్రమ్మున వ్యస్తపదమ్ములకు నుద్దేశ్యా

విధేయభావమ్ము సంగతంబగు. ఇట సమాసస్థలంబుగాన నుద్దేశ్యవిధేయభావంబు పొసంగదందురేని యట్లనవలదు. "లోహితోష్ణీషాబుత్విజః ప్రచరంతి" అను సమాసస్థలంబున మీమాంసా బాలప్రకాశ మీమాంసాన్యాయప్రకాశాది గ్రంథములయందు నుష్ణీషముల ననువదించి లౌహిత్యము విధింపఁబడుచున్నది గాన నిచటం గూడ సమాసంబున నెల్లయమహత్తుల ననువదించి నపుంసకత్వవిధి బోధించుచునే మువర్ణకమును విధించుట నిర్బాధంబు. కావుననే "యత్తువృత్తా వుద్దేశ్యవిధేయభావే నానన్వయాదాశీర్విషయేచ తథాఽన్వయాన్న సమాసఇతితన్న వృత్తావపిప్రాప్తత్వాదిపర్యాలోచనేన లోహితోష్ణీషేత్యాదౌతథాన్వయదర్శనాత్ భాష్యేతథాన్వయే వృత్తేరసాధుతయా అనుక్తేశ్చేతిసమాసవాదేమంజూషాయాంవిస్తరః" అను షష్ఠీకారక శేఖరమును 'లోహితోష్ణీ షాఇత్యాదావితి" సోష్ణీషాబుత్విజః ప్రచరంతీతి వాక్యేనఉష్ణీషస్యప్రాప్తత్వాత్తదనువాదేన లౌహిత్యమాత్రస్య విధానాదితిభావః" అను తత్రత్యచంద్ర కలావ్యాఖ్యానంబును "యముద్దిశ్య ఆగమోవిహితః" అను పరిభాషేందుశేఖరస్థయదాగమపరిభాషయందలి గ్రంథమును "లోహితోష్ణీషాబుత్విజః ప్రచరం తీత్యాదౌప్రాప్తాప్రాప్తపర్యాలోచనాయాముష్ణీషాద్యుద్దేశ్యక లౌహిత్యాదివిధాయక షాశ్చాత్యబోధస్యాఖిలానుభవసిద్ధత్వాదిత్యన్యత్రవిస్తరః॥ అనెడి యత్రత్యవాక్యార్థచంద్రికయును సంగతంబు లగుచున్నయవి. అందున సమాసస్థలంబైనను నిట నమహత్తులకు నపుంసకత్వవిధి నిరాతంకమ్ము. ము వర్ణకము నపుంసకలింగ విభక్తియగుటనిర్వివాదమ్ము. కానద్వైవచనాది క్యాచిత్క సమహన్నపుంసకములందు లింగసర్వనామనపుంసకలింగవిభక్తులు మువర్ణక

ము న్యాయప్రాప్తంబుగాన "నుపలక్షణ" మని సూత్రము నొద్దనేల వ్రాయలేదన్న ద్వంద్వవాదుల శంకకుం గూడ నవకాశమయిన లేక సర్వమును సూత్రిమందలి యథాస్థితిగ్రంథంబురమణీయంబగు. (9) ఇంతియు కాక కర్మధారయము సమాసము సేసి యానదమహత్తులయందు నపుంసకత్వము విధించుచు మువర్ణకము విధించుచున్నందున నమహత్తులకు ము విభక్తి వచ్చునట్లే నపుంసకములకు మువర్ణకము వచ్చునని స్పష్టపడుచున్నది. 1 ఈముఖచంద్రునికి (కర్మ-స) నాహ్లాదకత్వమమరెను" ఈవాక్యమున ముఖమునం జంద్రత్వము విధించుచు నాహ్లాదకత్వము విధించుచున్నందున నాహ్లాదకత్వమున్నది యని యూహించి చంద్రునికి వైసర్గికమైన యాయాహ్లాదకత్వము లేదని యెవ్వరు నూహింపరు. (2) "ఈకన్యకారత్నమునకుం గాంతి పుంజమమరెను"— ఈవాక్యమునం గన్యకయందు రత్నత్వ మతిదేశించి (ఆరోపించి) కాంతిపుంజమును విధింపఁగా గన్యకకుం గాంతిపుంజమున్నదనియు రత్నమునకు లేదనియు నెవ్వరందురు? (3) ఈశాస్త్రినర్యనారదునకుం గలహాశనత్వమెసంగెను"—ఇట్టివాక్యమున శాస్త్రినర్యునియందు నారదత్వము విధింపఁగా శాస్త్రులవారికిఁ గలహాశనత్వ ముండినదని యూహించి నారదునికల హాశనత్వమునకు మొదటికే మోసమువచ్చుననుకొందురే? అనుకొనరు. అట్లే "యమహాన్నపుంసకములకు మువర్ణకమగు" నన్న వాక్యమున నమహత్తులకే మువర్ణకమువచ్చి కేవలనపుంసకములకు రాదని యెట్టికుశాగ్రీయబుద్ధి కోవిదుండును గలలోనైనను దలంపఁడు. కాన, మిత్రము (మహత్తు) దైవతము—ఇత్యాది మహాన్నపుంసకములన్నియు నీసూత్రముచేతనే నిరాతంకముగ సాధువులగు. అథవా, ద్వంద్వవాదులద్భుతపాండిత్యప్రకర్షముతో నీసూత్రమున మహాన్నపుంసకములకు మువర్ణకంబు రాకుంత సుగ్రీవాజ్ఞ నేసినచో నీసూత్ర

మక్క—అనేకమే ద్వైవతము-ఇత్యాదిమహాన్న పుస్తకములకు ముద్రణకము పైనింజూపిన న్యాయములవలన రాకతీరదు. ద్వంద్వము సేసి సాక్షాత్తు విధివాక్యము సేయరాదా? యనవలదు పైనిం జెప్పిన రీతిని (మిత్రము సౌమ్యుండు—అనుటకు బదులుగా (మిత్రము సౌమ్యము, ఇత్యాద్యనన వ్యవహారమోగంబులు సంభవించెడి కాన సూత్రమునకు గర్భధారయార్థము శాస్త్రమార్గమున సుకరమును అత్యావశ్యకమును నయి యున్నది. ద్వంద్వమన్ననో! యశాస్త్రీయమును క్లేశావహమును లక్ష్యప్రతికూలమును నగుచుండును. కాన ద్వంద్వ మపార్థకము. పార్థమూర్తిగారి యుపలక్షణపద్ధతియును శాస్త్రీయమని స్థిరపఱుపఁబోవు చున్నాఁడను.

ఇఁకను మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయశాస్త్రులు గారు నిర్ణయించిన ద్వంద్వసమాసార్థసిద్ధాంతమున "చార్థేద్వంద్వః" గోస్త్రియోరుపసర్జనస్య ఆద్యంతౌటకితౌ" ఇత్యాద్యనేక సూత్రములు భాష్యము పూర్వపక్షీకృతములుగా గాన నయ్యది యశాస్త్రీయమని కరతలామలకముగాఁ దర్పాతివ్యాసఘట్టములందుఁ గనంబడెడుఁగాక!! ఓ సుధీమణులారా! మాకాలేటి యేప్రిలు. ఈయుదవ తేదినిమా యంబడు. గతించిన (21) వ తేదిగల దేశమాతలోఁ బ్రకటించి మనవి చేసినరీతిని మీమనమ్ములు తృప్తినొందిరేని బిదప సానకావుండనై యనంతరగ్రంథము ప్రకటించెద.

ఇది 1 వ్యాసఘట్టము

ఇట్లు సుధీమణివిధేయుఁడు

కల్లూరి వేంకటరామశాస్త్రి

(సశేషము)

## 1917 సం ఏప్రిల్ నెల 18 వ తేదీ

(ఈనెల 4 తేది పత్రికశేషము)

## ద్వితీయవ్యాసఘట్టము.

[ద్వంద్వవిగ్రహనిగ్రహము]

శ్లో॥ పండితాఖండలాఖండ
సమ్మోదామృతదోహదం।
ద్వంద్వోపశమనం కుర్వే।
సోఽహం సత్కర్మధారయః॥ ౧

ఆ. గీ॥ గౌరవధీఃకల్లూర్యన్వయవేంకటరామశాస్త్ర్య
హంతు గదేయమ్। తాతాసుబ్బారాయా।
ఖ్యశాస్త్రివరమభి మహామహోపాధ్యాయమ్॥ ౨

ద్వంద్వాను లుదహరించుకొన్న ప్రకృతసూత్రీయార్థవివరణ వాక్యము ద్వంద్వవిగ్రహముపోలిక నైనను బనికివచ్చునా! రాదా! యనునంశ మీఘట్టంబున విమర్శింపబడును.

ఓ సుధీమణులారా!

"అదంతములగు సమహార్థములకును నపుంసకలింగశబ్దములకును మువర్ణకమగు సనియర్థము"—అనిసీతారామశాస్త్రిలుగారు (తత్స 39) సూత్రార్థమును వివరించిరి. యని ది 2-8-1916 సం॥రము దేశమాత పత్రికలోఁ బార్థమూర్తిగారు వ్రాసి యీవివరణవాక్యము సముచ్చయార్థముఁ దెల్పుచున్నదియనియు "గౌణ్యసంభవాత్॥ (అ౨పా3సూ3) అనుసూత్రమును వివరించుతఱిని "నహ్యాకాశస్యోత్పత్తిస్సంభావయితుం శక్యా శ్రీమత్కణభుగభిప్రాయమనుసారిషు జీవత్సు" అనిశంకరభాష్యము నున్నట్లే వైయాకరణులు జీవించియుండ సముచ్చయార్థమున ద్వంద్వము సాధించుటదుర్లభమ్మనియుఁ బల్కిరి. పార్థమూర్తిగారి యట్టియభిప్రాయము తోడనే నేనును నేకీభవించెద. ఈయభిప్రాయమునకు వ్యతిరేకముగా ద్వంద్వవిగ్రహమందలి యెల్లపదార్థములును చ శబ్దార్థముతో నన్వయించుట విధియాటంజేసి వైయాత్రీయవివరణ వాక్యమందు గీర్వాణభాషలోని చ శబ్దమునకు బ్రతినిధిగానుండి దదర్థముం దెల్పు ను, శబ్దమువఱసగానమహార్థపదముతుదనునున పుంసకలింగశబ్దము తుదనును నున్నందుననిదియే యితరేతరయోగార్థకద్వంద్వవివరణవాక్య

మనుటకు నెంతమాత్రమును బ్రతిబంధము లేదని బ్రా॥సుబ్బారాయశాస్త్రి యుగారు ప్రబలముగాఁ బ్రతిజ్ఞ సేయుచుండిరి. నేనుమాత్రము "చ" శబ్దార్థకమైన పూర్వోక్త వాక్యములోని "ను" శబ్దద్వంద్వము వట్టివిఁగ్రహపుష్టికే పనికి వచ్చుంగాని ద్వంద్వవిగ్రహపుష్టికి నెంతమాత్రమును బనికిరాదని నిశ్చయించెద 'చ' శబ్దార్థకమైన 'ను' శబ్దములున్నంతమాత్రమున నే ద్వంద్వవిగ్రహమైనయెడ తెలుంగుభాషలోని 'ను' శబ్దముల యర్థముం దెల్పు ననేక 'చ' శబ్దములుగలవిగ్రహమ్ములన్నియు ద్వంద్వవిగ్రహములే కాఁదగియుండుంగదా! అట్లు ద్వంద్వవిగ్రహపుష్టికిఁ 'చ' శబ్దపుష్టియే గొప్పయాధారముగాన నీలంచతత్ ఉత్పలంచ — "నీలోత్పలమ్" అనినకర్మధారయ విగ్రహము లోని 'చ,శబ్దమ్ములుచూచి తనకు సముదాయపదార్థము ప్రధానముగానున్నదని ముఖ్యీయుచు నికను ద్వంద్వవృత్తి కర్మధారయవృత్తితో విగ్రహమ్మునకు వెరుదీయక డీకొనియెడిని. కానివిగ్రహమ్మున 'చ' శబ్దనానాత్వమున్నంత నేద్వంద్వమ్మగానేరదు. [2] భాష్యకారులును "చార్థే ద్వంద్వః" అను సూత్రమును నివర్తించుచోటనే "చార్థ" ద్వంద్వము కర్మధారయమ్ముతోఁ గలియంబడు ననియాదికాలముందే యాలోచించి ద్వంద్వమ్మును విమర్శించి "కర్మధారయవృత్తికి నీవెల్లప్పుడును శేషంబవే కాన నట్టితత్పురుషవృత్తికి నడ్డొచ్చి గనడ్డపడకుమని తగవుదీర్చి ద్వంద్వమ్మును దప్పునకుంగొంటిరి. కావుట్టి కర్మధారయమ్మునకుఁ గర్మంద్వహణ శక్తియేమాత్రమైనను నుండినచో ద్వంద్వమ్మును దలంగింప వలయుననియే పతంజలి భగవానులు దీనిని శేషముగాఁ జూచిరిగాని యంతకంటె విశేషముగాఁ జూడరైరి. అటులుండఁ బ్రకృతసూత్రమ్మున (39)ఝుడితిస్ఫురణంబు గలిగి యంతరంగములోనిదైన కర్మధారయమ్మును బహిరంగమౌ ద్వంద్వవృత్తి జంకక యెట్లుదారసిల్లం జాలెడిని ద్వంద్వవాదుల మతమ్మున ననేక 'చ' శబ్దములున్నంత మాత్రమున నే ద్వంద్వవిగ్రహమైనయెడ అమహాంతిచన పుంసకానిచ (అమహాన్న పుంసకాని) అనునట్టి మహాసత్కర్మధారయ విగ్రహమందును ననేక 'చ' శబ్దములున్నయెన నిట్టివృత్తిలో నెంత యేని విరోధంబవలెనో తెలియకున్నది. అనుమవిగ్రహమందలి 'చ'

(3)

శబ్దనానాత్వము నేకాక యర్థసందర్భముంగూడఁ బరిశీలించి విగ్రహాభే
దంబు నెన్నవలయునని స్పష్టపడుచున్నయది. ఒక్కవిశేషముగలదు.
వ్యాకరణశాస్త్రీయ తత్త్వమ్మాలోచింపఁగా ద్వంద్వవిగ్రహవాక్యము
ప్రథమా విభక్త్యంతములలోనే యుండవలయుం గాని యన్యథా యుం
డఁదగదు.(3)ప్రకృతమున ద్వంద్వాదుల విగ్రహవాక్యము "అమహత్తు
లకును నపుంసకలింగ శబ్దములకును" అనిషష్ఠీవిభక్త్యంతములతో నమ
రియున్నది కాన నియ్యది యితరేతర యోగార్థమును బోధింపనేరక
సముచ్చయార్థమునే చాటుచుండెడు కారణమ్ము నాకణిగింపఁగోరెద.
వ్యాకరణశాస్త్రమందు సాంకేతికములైన కర్మ, కరణాదిపదార్థములకుఁ
గారకములని సామాన్య నామముగలదు. కారకమనఁగాఁ గ్రియతో న
న్వయించునది యనియు, లేక "కారకత్వం క్రియాజనకత్వం భాష్యేక
రోతిక్రియాం నిర్వర్తయతీతి వ్యుత్పత్తిదర్శనాత్ అతఏవపష్ఠాంక్రియా
యామేవాన్వయః" అనుశాస్త్రమర్యాదం జేసి, క్రియను నెఱవేర్చునది
యనియు వ్యుత్పత్త్యర్థము. 'లోకములో సర్వవాక్యమ్మును గ్రియతో స
మాప్తింజెందెడుంగదా! కావునఁ గ్రియప్రధానమని యెన్నందగినది.
క్రియలేని వాక్యము నిష్క్రియనొంది వ్యర్థమ్మగు. దానంజేసియే "క్రియలే
నిమాట యేమిప్రయోజనము? ఇత్యాదికముగాలోకోక్తి గలుగుచున్న
ది అట్టి ప్రధానమయిన క్రియచే నాకాంక్షింపంబడి దానితో నన్వయిం
చుంగావునఁ గర్మకరణాదిక కారకంబులకుఁ గ్రియతోడి సంబంధము బ
లిష్ఠమ్మగు "రాముఁడు గురునినుతించె"—ఈవాక్యమున "నుతించె"
అనఁగా నెవ్వరిని నుతించె, ననియాకాంక్షగలిగి 'గురుని, అన్నకర్మప
దార్థమును సమర్పించుటతోడనే యాకాంక్ష (ప్రశ్నము) యస్తమించె,
"రాముండొక్కబాణమ్మున వాలినిగూలించె"—ఈవాక్యమున, కూ
లించె, ననఁగా నెవ్వరిని, దేనితోడ, ననియాకాంక్ష జనియించి "వాలి
నిబాణమున, ననిసమాధానము సంధించుటతోడనే యాకాంక్షసమా
ప్తింజెందె ఇట్లే, సంప్రదానాదికారకము లన్నియుఁ బ్రధానమైన క్రి
యనెఱవేఱునట్లు సాధనమ్ములగుచు దానితో నన్వయించుటంజేసి కా
రకములను నన్వర్థనామమ్మునకు నర్హంబులయ్యె (4) ప్రకృతమ్మున
నిట్టి క్రియాకారకమ్ములకుంగల పరస్పర సంబంధమే సామర్థ్యమనంబడు.

"అమహాత్ములకును నపుంసకలింగ శబ్దములకును మువర్ణకము" నన్న యీద్వంద్వవాదుల ప్రస్తుతవాక్యమందును బూర్వోక్తశాస్త్రమర్యాదం జేసి షష్ఠ్యంతములు రెండింటికిని క్రియయగు 'నగు' ధాతువుతోడి సంబంధము ప్రధానముగాని 'ను' శబ్దార్థముతోడం బ్రధానసంబంధములేదు. అనంగా 'ను' శబ్దార్థము ప్రధానముగా నుండియమహాత్ములనునపుంసకములను మేళగింపనేరదు. గాన ద్వంద్వసమాసము రానేరదు. కనుకనే "అతఏవైతదర్థకచతుర్థ్యాద్యంతేన సుఖహితాదభిన్నసమాసః॥ ఉభయోరపిక్రియాన్వయేన పరస్పరమసామర్థ్యాత్ ।అతఏవ హితేనచతుర్థీసమాసవిధానేతద్యోగే చతుర్థీజ్ఞాపకమిత్యాకరోక్తం సంగచ్ఛతే॥ అను షష్ఠీకారక శేఖరగ్రంథము సంగతమ్మగు. (అనంగా "దేవదత్తస్య సుఖంభూయాత్" ఇత్యాదివాక్యములయందు షష్ఠ్యంత దేవదత్త శబ్దార్థమునకును బ్రథమాంతసుఖ శబ్దార్థమునకును 'భూయాత్, అనుక్రియతోడనే సామర్థ్యసంబంధముండి యన్యోన్య సామర్థ్యము లేనందున దేవదత్తసుఖశబ్దములకు సమాసము రాదనుపూర్వోక్త శేఖరతాత్పర్యము.) ఇంతియకాక "కారకాణాం క్రియాసమర్థత్వాత్। కారకాణాంక్రియయా సామర్థ్యమస్తి।నతేషా మన్యోన్యమ్ తద్యథా, _ నిశ్రయణ్యాద్వాభ్యాం కాష్ఠాభ్యాం సామర్థ్యమ్. నతేషామన్యోన్యమ్" అనుచునిచ్చెనమెట్లకు నుభయపార్శ్వములయందలి కఱ్ఱలతోడనే సాక్షాత్సంబంధముండి తమలోందమకునట్టి సంబంధములేనట్టులు కారకంబులకుం గ్రియతోడనే సామర్థ్యసంబంధముండుగాని యట్టిసంబంధము తమలోం దమకులేదనెడి "యస్యనే" త్యాది సూత్రస్థ భాష్యమ్మును సంగతమ్మగు. (5) అందు నద్వంద్వవాదుల వివరణ వాక్యములోని యమహాన్నపుంసకషష్ఠ్యంతములకు 'నగు' క్రియతోడనే సంబంధము గలిగి పరస్పర సామర్థ్యము లేనందున నిర్యాదనట్టివిగ్రహపుష్టికేంనికి వచ్చుంగాని ద్వంద్వవిగ్రహపుష్టికి నెంతమాత్రమును నుపయోగింపంజాలదు. వేయేల! ఈశ్వరంచ గురుంచభజస్వ—అనునది యితరేతరయోగార్థ బోధకము" అనియితరేతర యోగార్థకముగా నుదాహరింపంబడిన యీశాస్త్రిలవారి వాక్యమును శాస్త్రీయముగానేరదు, పైవాక్యమునందునీశ్వరుండును, గురుండును గర్మకారమ్ములై సందునం దద్వాచకమ్ములు వేర్వేఱుగా ద్వితీయాంత

ములైయున్నయవి కర్మకారకమ్మును రెండింటికిని "కారకాణాం క్రియా సమర్థత్వాత్॥ అనుపూర్వోక్త భాష్యోక్తిం జేసి భజనక్రియతో నన్వయంబు చెప్పక తీరదు. అందు ననుపసర్జన హాస ముచ్చయార్థమునకు విశేష్యభూతములైయీశ్వర పదార్థమును గురుపదార్థమును భజనక్రియతోఁ బ్రత్యేక ప్రత్యేకముగా నన్వయించుట విధియాటంజేసి చార్థమ్మునకుఁ బ్రాధాన్యములేని యీవాక్యమ్మును నితరేతర యోగార్థ బోధకమ్మెంతమాత్రమునుగానేరదు ఇయ్యది యితరేతర యోగార్థ బోధకమ్మైనచో నిత్తఱి "చార్థేద్వంద్వః॥ అనుసూత్రమునఁ బ్రధానమైన చార్థముతోఁ గర్మకారకమ్ములో నీశ్వరగురుపదార్థములు విశేషణముగా నన్వయింపవలయు. అట్లయ్యెనేని సామర్థ్యమ్మయిన సాధ్యసాధన సంబంధమ్ము సమసిపోయి భాష్యవచనమునకు వైరుధ్యంబువాటిల్లు (6) మఱియు ద్వంద్వవాదులయాక్షేపణంబొండు గలదు. "యదగ్నయేచ ప్రజాపతయేచసాయంజుహోతి" యనెడి యీవాక్యములో ననేకచశబ్దములున్నందున నియ్యది సముచ్చయోదాహరణముగాక యితరేతరయోగోదాహరణ వాక్యమ్మని శేఖరకారుని తాత్పర్యమైనట్లులంగీకరింపకతప్పదనియు, "చశబ్ద శ్రవణాత్పరస్పరసాపేక్షస్యైవపదద్వయస్యాఖ్యాతాన్వయాన్న వాక్యభేదః" అను మీమాంసాన్యాయ ప్రకాశగ్రంథమ్మున నగ్నిప్రజాపతి పదార్థముల నేకచశబ్దార్థసమన్వయమ్మునఁ బరస్పరసాపేక్షత గలిగియే వాక్యభేదములేకుండ దిఙంతముతో నన్వయించునని చెప్పఁబడినందున నీవాక్యము సముచ్చయోదాహరణ మనుటకు నెంతమాత్రమును నవకాశములేదయు, నిట్టియితరేతర యోగోదాహరణ వాక్యమునుదాహరించెడి శేఖరకారుని మతమందే యగ్నిషోమాది దేవతలు వోలె సాహిత్యములేకయే యగ్ని ప్రజాపతిదేవతలు ప్రత్యేక ప్రత్యేకముగా హోమద్రవ్యోద్దిష్టలయి నట్లు స్పష్టపడుచున్నందున ద్వంద్వఘటక పదార్థములకు నవినాభావముండకతీరదని వాదించుపార్థమూర్తిగారికీయుదాహరించుకొన్న శేఖర గ్రంథము మిక్కిలి స్వవాదభంజకమనియు, శాస్త్రులవారు సెలవిచ్చుచుండెదరు.

(7) శాస్త్రియద్దృష్టిని నాలోచించినచో "యదగ్నయేచ ప్రజా

పత యేచే”తి శ్రుతివాక్యమ్ము ద్వంద్వ వాదంబునకు మిక్కిలి భంజకము ను బార్థమూర్తిగారి వాదంబునకు మిక్కిలిరంజకమును నయి యుల్లసిల్లెడి అయ్యది యెట్టులనంగా నాకర్ణింపుఁడు.... యదగ్న యేచ ప్రజాపత యేచే”తి పూర్వోక్త శ్రుతివాక్యములో చశబ్దములనేకములుగా నున్నంతమాత్రమున శేఖరకారుని మతమందు నయ్యది యితరేతర యోగ ద్వంద్వోదాహరణవాక్యమ్ము కాకతీరదని సాహసించి చెప్పుటకు నెంతమాత్రమును నవకాశములేదు ద్వంద్వః ప్రథమాంతానామేవ। నపరినిష్ఠిత విభక్త్యంతానామ్ చైత్రేణమైత్రేణచకృతమితివాక్యే ఆవయం కర్తృత్వస్యైవప్రతీతేః చైత్రమైత్రాభ్యాం కృతమితిసమాసే సముదాయకర్తృత్వస్యైవప్రతీతేః తస్యవాక్యస్య సమాన సమానార్థకత్వా భావేనతస్యతద్వాక్యత్వాభావాత్ అనిలిఖించి ప్రథమావిభక్త్యంతములతో ద్వందమ్ము నొనరించినచో సమాసవిగ్రహ వాక్యములు సమానార్థకములు గానేరవనియు నిత్యాదికమైన శేఖరకారతాత్పర్యము పార్థమూర్తిగారు (2-8-16) దేశమాతపత్రికలోఁ బ్రకటించియుండిరి ప్రథమాంతములతోనే ద్వంద్వవిగ్రహము సేయవలయుననుటకుఁ గారణము తరువాత ఘట్టంబునందు వ్రాయఁబడును ఇట్లు ప్రథమాంతములతోడనే ద్వంద్వసమాసమ్మొనరింపవలయునని శేఖరకారుం డుద్ఘోషించుచుండఁగా జతుర్థీవిభక్త్యంతములతో నున్న యదగ్న యేచప్రజాపత యేచేతి శ్రుతివాక్యమ్మతని మతమందు నితరేతరయోగ ద్వంద్వవివరణ వాక్యంబసక డీరదనియెట్లు వాకొనఁదరంబయ్యెడు యదగ్న యేచ ప్రజాపత యేచ సాయంజుహోతియనునట్టి యీవాక్యమందును కారకాణాం క్రియాసమర్థత్వాత్ అను భాష్యోక్తింజేసి క్రియాకారక సబంధ మంతరంగము గావునఁ జతుర్థీకారకములైన యగ్నిప్రజాపతు లిద్దఱును ప్రత్యేక ప్రత్యేకము గా జుహోతి యను క్రియ తో నన్వయింతురుగాని చ శబ్దార్థమును బ్రధానముగాఁ జేసికొని యట్టియర్థముతో నన్వయింపరు.

(8) మీమాంసాన్యాయప్రకాశమునందు బ్రస్తుతమైన“యదగ్న యేచే” తిశ్రుత్యర్థ మిట్టు విమర్శింపబడియె. అవధానముతో నవధరింపుఁడు.

(1) "అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిస్స్వాహా" యను మంత్రవర్ణ
ముచేతనే శ్లో॥ తద్ధితేన చతుర్థ్యా వా మంత్రవర్ణేన వా పునః దేవతా
యావిధిస్తత్ర దుర్బలంతు పరం పరమ్ అను శాస్త్రమ్మున విహితమ్మయిన
యగ్నిదైవతపదార్థమును ననువదించుచు యదగ్నయే చ ప్రజాపత
యేచే తి శ్రుతివాక్యమ్మొక ప్రజాపతి దేవతనే విధిం
చుచున్నది, యని సిద్ధాంతపక్షము. ఈ పక్షమ్మున
ననూదితుండగు నగ్ని యొక్క సముచ్చయము
తోఁ బ్రజాపతియొక్కండే విధింపఁబడుచున్నందున నీవేదశ్రుతియందు
వాక్యభేదము లేకయే యర్థసమన్వయంబయ్యెడి. (2) "యదగ్నయేచ"
తివాక్యమే యగ్నిప్రజాపతుల నుభయులను విధించుంగావున నగ్నియ
నూదితుండు గాఁడని వేఱొకపక్షమ్మున వాటిల్లు. ఈపక్షంబున నగ్ని
ప్రజాపతు లిద్దఱు నీశ్రుతిచేత విధేయులే కావున "శ్లో. అనేకపదసం
బద్ధం। యద్యేకమపి కారకమ్। తథాపి తదనావృత్తైః ప్రత్యయైర్న విధీయ
తే" యనుశాస్త్రంబున "అగ్నయే జుహోతి. ప్రజాపతయే జుహోతి"
యని వాక్యద్వయమ్ము రచింపక తీరదు. ఇట్లు మీమాంసా న్యాయ
ప్రకాశమున నీశ్రుత్యర్థము నిర్ణయింపఁబడినది. ఈరీతిని దేవతాద్వయ
విధానపక్షమ్మున (౧) "అగ్నయే జుహోతి (౨) ప్రజాపతయే జుహోతి"
అని రెండువాక్యమ్ములు రచింపకతీరదు గాన జుహోతిక్రియతోడనే
సామర్థ్యసంబంధము గలిగి తమలోఁ దమకు నిసుమంతైనను నట్టిసంబం
ధము లేక ప్రత్యేక ప్రత్యేకాహుతులు గొనియెడి యగ్నిప్రజాపతిదేవ
తలకు, వాక్యములోని చకారద్వయమ్మును జూచినంతమాత్రముననే
యితరేతరయోగోదాహరణముగాఁగ శేఖరకారమతమంగీకరింపక
తీరదని ద్వంద్వవాదు లెట్లు బలాత్కరించెదరో! మఱిక్కలి వింతగా
నున్నయది. అందున "యదగ్నయేచ ప్రజాపతయేచే"తి వాక్యమితరే
తరయోగోదాహరణముగా నెన్నండును స్మరించుటకునైన వలను
పడదు. కనుకనే "అతశ్చ కారస్సముచ్చయం ప్రాధాన్యేన న బ్రూతే
యేన ప్రధానస్యైకస్య విధానాన్న వాక్యభేదోఽభవేత్। కింతు కారకద్వయోప
సర్జనత్వేనైవ సతం బ్రూతే। సముచ్చితే అగ్నిప్రజాపతీ ఇతి ప్రధానద్వ
యవిధానేచ వాక్యభేదస్స్యాదేవ"—అని మీమాంసా న్యాయప్రి

శాఖమందు 'యదగ్నయే చే'తి వాక్యమందలి చశబ్దములకు సముచ్చయార్థమే వివరింపఁబడినదిగాని యితరేతర యోగార్థ మెన్నఁబడలేదు. వాక్యభేదమును దేవతాద్వయవిధిపక్షమున రచింపక తీరదని నిశ్చయింపఁబడినది. ఇట్టిది వీరికి నిదర్శనంబు.

(౪) ఇట్లు "యదగ్నయే చ ప్రజాపతయే చ" అను వాక్యములోని 'చ, శబ్దములకు సముచ్చయార్థమే కాని యితరేతరయోగార్థముగానందున నితరేతరయోగోదాహరణ వాక్యముగా నివ్వటిల్లుటకు మీమాంసామతమందుఁ గాని శేఖరకారాదివైయాకరణమతమందుఁ గాని యెన్నండును దీనికి వాసిపట్టలేదని సిద్ధాంతమగుచున్నది. "యదగ్నయే" చేతిశ్రుతివాక్యము విరుదాంకితులగు పండితుల నాశ్రయించినను, దనకు నేవిధమైన యుచ్చాటనములేక సముచ్చయార్థమే నిశ్చితమై, తనకు నేవిధమైన యితరేతరయోగార్థము లేక యనితరసాధారణ దుర్యోగార్థమే నిశ్చితమై యేకవాక్యత లేనందున రెండుచెక్కలుగా వ్రక్కలింపఁబడునట్టి శోచనీయావస్థ తటస్థించుచుండఁగా, నట్టివేదీయ శ్రుతిని నిదర్శనంబుగా నెన్నుకొని శరణుచొచ్చినచోఁ దనకు నేమో! గతులు గలుగునని పేరాసపడిన ద్వంద్వవాదుల యీసూత్రీయార్థ వివరణవాక్యగతి యేమికానున్నదో సుధీమణులే శోధింతురుగాక! ద్వంద్వవాదుల పరిష్కృతసూత్రార్థవివరణవాక్యమునకు శాస్త్రమ్మున రెండు వ్రక్కలై రూపుచెడిన యీవేదవిరాజోక్తి శరణంబుగాఁ జాలదుగావున "మహాగజాః పలాయంతే। మశకానాం తు కా గతిః" అనిన యీనిర్వేదకారిలోకోక్తియే శరణంబయ్యెడు గావున! కావునఁబట్టి "అమహత్తులకును నపుంసక లింగశబ్దములకును" అనిన యీద్వంద్వవిగ్రహభ్రష్టవాక్యమ్ము విజయనగరమునుండి విజయమునేసి యెంతో విగ్రహించుచున్నను శాస్త్రంబున వేఱే యుచ్చాటనములేక సముచ్చయార్థమే దీనికిదిట్టవ్రాంతమై తప్పనందున వైయాకరణులు జీవించియుండ సముచ్చయార్థమందు ద్వంద్వంబు దుర్లభంబని ద్వంద్వవిగ్రహమును పరిగ్రహించిన పార్థమూర్తిగారి వాక్యము సార్థకమయ్యెడు మనుచు శ్లాఘించెదంగాక!

ఇది 2వ, వ్యాసఘట్టము. ఇట్లు సుధీమణివిధేయుఁడు,

(స శే ష ము) కల్లూరి వేంకటరామశాస్త్రి.

—• ద్వంద్వోపశమనము. •—

——:०:——

25-4-1917. దేశమాత.

తృతీయవ్యాసఘట్టము.

(ద్వంద్వార్థవివరణము.)

శ్లో॥ పండితాఖండలాఖండ । సమ్మోదామృతదోహదమ్
ద్వంద్వోపశమనంకుర్వే । సోహంసత్కర్మధారయః॥

ఆ॥గీ॥ గౌరవధీః కల్లూర్య ! స్వయ వేంకటరామశాస్త్ర్య
హంతుగదేయమ్ । తాతాసుబ్బారాయా । ఖ్యశాస్త్రి
వరమభి మహామహోపాధ్యాయమ్॥ ౧

(బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక.)

ఇతరేతరయోగ ద్వంద్వమనియు, సమాహారద్వంద్వమనియు నిట్టినామముల యన్వర్థతచేతనే యీసమాసములయందుఁ బదార్థముల కూడిక ప్రధానమయియుండునని తేటతెల్లమగుచుండఁగా బ్ర॥ తాతా సుబ్బారాయశాస్త్రులవారి ద్వంద్వమునకు నట్టిసముదాయార్థములేదనియు ద్వంద్వములోని వస్తువులు వాక్యార్థములో మాత్రమే బుద్ధికిఁ దోఁచుననియు, మిక్కిలి వింతమైన యర్థమ్ము ను సమర్థించి లోకులచిత్తమ్ములు సంశయ డోలాక్రీడాయత్తమ్ములుగ జేయుచున్నందున దీని వాస్తవార్థము సప్రమాణముగా మొదటఁ గొంతచర్చించి చూపంబడు. అ౨. పా౨. సూ. ౨౯. "చార్థేద్వంద్వః॥ అనేకంసుబంతం చార్థేవర్తమానంవా సమస్యతేసద్వంద్వః" అనఁగా ననేకపదమ్ములు చ శబ్దార్థమున నమరుచు వికల్పమ్మున సమసించు

ఆర్యాది ద్వంద్వంబనంబడెడి. ని॥ చాన్వాచయసమాహారేతరేతరసముచ్చయే॥ యనునమర నిఘంటువున నవ్యయమైన చ శబ్దమునకు (1) అన్వాచయము (2) సమాహారము (3) ఇతరేతరయోగము (4) సముచ్చయము— అని నాలుగర్థమ్ములు గలవు.

(1) ఈశ్వరుం డుపాధ్యాయుండును సేవింపఁబడవలయు.— ఈ వాక్యమ్మునఁ జశబ్దపర్యాయ 'ను' శబ్దార్థసంబంధ మొకరికే యుండఁగాఁ దమలోఁ దమరు మిళితులుగాకుండ నీశ్వరుండు, నుపాధ్యాయుండును వేఱువేఱుగా సేవాక్రియతో నన్వయించుచున్నందున నిట్టి సముచ్చయార్థమున ద్వంద్వము రానేరదు.

(2) భిక్షుంగూర్చి తిరుగుము; గోవునుందీసికొనిరమ్ము;— ఇచట భిక్షాటన మవశ్యమును సలుపందగినది గానఁ బ్రధానము; ఆవు గనంబడినయెడఁ దోలుకొనిరమ్ము. లేనియెడఁ బ్రయత్నమునఁ బోవలదని భావము గనుకనిట్టి ప్రధానాప్రధాన క్రియార్థలంబునఁ జెప్పందగిన యన్వాచయార్థమందును ద్వంద్వముగలుగనేరదు. (3) చైత్రమైత్రులు రూప్యసహస్రమ్మీవలయు ఇటఁ జైత్రమైత్రు లొండొరులు గలిసియే (ఇతరేతరయోగమున) సహస్రము రూప్యము లీవలయునని యిద్దఱికును బరస్పరసాపేక్షతతోఁ జెప్పంగాని ప్రత్యేక ప్రత్యేకముగా రూప్యసహస్రమీవలయు ననితోఁపదు. ఈయుదాహరణమున రూప్యసహస్రమ్ము చెల్లించుటలోఁ జైత్రమైత్రుల పరస్పరసంబంధము స్పష్టమగుచున్నందున ద్వంద్వము రాఁదగు. (4) విప్రుని కొఱకు ఛత్రోపానహమ్ము సంగఁబడియె ఈవాక్యమున ఛత్రమును బాదుకలును నీసమాహార (ఈ మొత్తము) మొక్కమాఱుగా నీబడినట్లు స్ఫురించి పరస్పరసంబంధము వెల్లడియగుంగాని యొకమాఱు ఛత్రమును వేఱొకమాఱు పాదుకలును విడివిడిగా నీఁబడినట్లు గోచరింపదు ఈలక్ష్య

మునందుంగూడ దానక్రియలో గొడుగునకును, పాదుకలకును (నీమొత్తమ్మునకు) బరస్పరసాహచర్యము ప్రకటితమగు చున్నందునఁ దద్వాచక పదములకు సమాహారద్వంద్వము రాఁదగియుండు. ఈరీతిని నెచ్చటఁ బదార్థములకుఁ బరస్పరసాపేక్షత యనఁగాఁ గ్రియ నెఱవే ఱుటలో సాంగత్యముండునో యచ్చటనే ద్వంద్వము వచ్చునని ఫలితార్థము. ఇట్టిసాంగత్యము ద్వంద్వవిగ్రహములోని ప్రతిపదార్థమును జార్థముతో నన్వయించుతఱినే యమఱియుండును. ఈతాత్పర్యమే కౌముదియందు "మిళితానామన్వయ ఇతరేతరయోగః॥" అనుచు మిళితమ్ములగు పదార్థములు, ఏకక్రియతో నన్వయించుచో నితరేతరయోగాదికమని నిర్వచించి వెల్లడింపఁబడియె. ఇందులకుఁ బ్రతిభటమ్ముగా 'పరస్పరనిపేక్ష స్యానేకస్యైకస్మిన్నన్వయః॥, అనినిర్వచించి యన్యోన్య సంబంధములేని పదార్థములేక క్రియతో నన్వయించెనేని సముచ్చ మనియుంగూడ నుదాహరింపఁబడినది. సముచ్చయబోధక వాక్యములోని పదార్థములలో సామాన్యముగా నొక్కదానికే చార్థము సంబంధించు. అందున ద్వంద్వవివరణవాక్యమున ననేక శబ్దప్రయోగంబును,సముచ్చయబోధక వాక్యమున సామాన్యముగా నేక చ శబ్ద ప్రయోగంబును నుండకతీరదు కనుకనే చార్థేసూత్రస్థమహాభాష్యమ్మున నిట్లుదాహరింపఁబడియె. "ఇతరేతరయోగే ప్లక్షశ్చన్యగ్రోధశ్చేత్యుక్తేగమ్యతే ఏతత్. ప్లక్షోపిన్యగ్రోధసహాయో న్యగ్రోధోపి ప్లక్షసహాయ ఇతి॥ ప్లక్షశ్చన్యగ్రోధశ్చేత్యుక్తే సమాహారే ప్రక్రియతే ప్లక్షన్యగ్రోధమితి। తత్రాయమప్యర్థః॥ ద్వాద్వైకవద్భావోనపరితవ్యోభవతి॥ సమాహారైకత్వాదేవసిద్ధమ్"—ఇట్లు ఇతరేతరయోగసమాహార ద్వంద్వముల వివరణవాక్యములయందుఁ జ శబ్దమ్ము లనేకమ్ములుండి స్వార్థ [చశబ్దార్థ] మైన పరస్పరసహాయ్యము ప్రధానముగా నున్నట్లు స్ఫురింపఁజేయు

చుండెడి. ఇట్టి సహాయ్యమే సాహిత్యమనియు సమాహారమనియు, సముదాయమనియుఁ బర్యాయపదంబులచేత వ్యవహరింపఁ బడుచున్న యది. కనుక ద్వంద్వమునందు సముదాయము సమాసార్థమై ప్రధాన ముగానుండెను. ఈసమాసంబున సముదాయము ప్రధానార్థమై భాసిల్లు ననిన యీతాత్పర్యమే యీసూత్రమును విమర్శించుతఱిని ననేకస్థలం బులందు "సముదాయాత్సిద్ధం। సముదాయాత్సిద్ధమేతత్।కి మేతత్సము దాయాత్సిద్ధమితి। ద్వివచన బహువచనాప్రసిద్ధిరితి చోదితమ్। తస్యాయం పరిహారః........నైకార్థ్యమ్॥ అని పతంజలి భగవానులచేతనును "సముదాయాదితి। ద్వంద్వేన సముదాయరూపో ర్థోభిధీయత ఇతి ద్వివ చనబహువచనసిద్ధిః॥ నైకార్థమితి॥ ఉద్భూతావయవభేదస్సముదాయో భిధేయోనతుతిరోహితావయవభేద ఇత్యర్థః॥ అని కైయటోపాధ్యాయుల చేతనును స్పష్టపఱుపఁబడినది. లోకములో నొకటికంటె నెక్కుడుపదా ర్థములు మేళగించినపుడేగదా! సముదాయ మేర్పడును. అందున నన్యో న్యమును క్రియలో విడనాడనట్లు తోఁచినపదార్థములం దెల్పుపదముల తో ద్వంద్వసమాసము చేయవలయు. అటులు తోఁపనిపదార్థములం దెల్పుపదములతో ద్వంద్వసమాసము సేయఁగూడదు—"ఈశ్వరుండు పాధ్యాయుండును సేవింపఁబడవలయు, ననిన యీవాక్యమ్మున నీశ్వరు నకు నుపాధ్యాయునకును నేకంబైన సేవాక్రియతో సంబంధముండి శా బ్దబోధలో సాహిత్యము తోఁచుచున్నను వారిద్దఱును సేవింపఁబడు టలో నన్యోన్యసాహిత్య [మేళనము] ముత్తోఁచుచున్నందునఁ ద ద్వాచక పదంబులకు ద్వంద్వమ్ము రానేరదు. ఇట్టియర్థమే శబ్దేందుశేఖ రమందు "అసామర్థ్యాదితి, అనేక సుబంతానాం చార్థేవృత్త్యభావేనై కార్థీభావరూపసామర్థ్యాభావాత్. అని. స్పష్టపఱుపఁబడినది దీనిభావము సముచ్చయార్థబోధకవాక్యఘటకంబులైన పదమ్ములు చార్థమైన సాహి

త్యమంపు, అనఁగాఁ బరస్పరమేళన రూపార్థమందు వర్తిల్లినందున నే కార్థీభావరూపంబగు సామర్థ్యము లేమింజేసి సముచ్చయమ్మున ద్వంద్వ ము రాఁగూడదు. ఇట్లు ద్వంద్వమునందుఁ దద్ఘటక పదార్థ మేళనమే యేకార్థీభావరూపసామర్థ్యమునకు నియామకమని విశదమగుచున్న ది. ఈతాత్పర్యమే చార్థసూత్రస్థమైన శబ్దకౌస్తుభమందును "తత్రసము చ్చయాన్వాచయయోర్న సమాసః। అసామర్థ్యాత్ । ఏకార్థీభా వేహిసతి పుష్పవంతౌపశ్యేత్యాదావివ ఏకపదోపాత్తౌమిలితావేవ అన్వ యాతామ్! నతుప్రత్యేకమ్" అని యుద్ఘోషింపఁబడుచుండు. వైయాకర ణాదిమతమ్మున ద్వంద్వఘటకపదార్థములకు సాహిత్యము విధి ప్రాప్త ముగనక్కనే తన్మతంబునకు వ్యతిరేకముగా నీక్రిందిరీతిని సిద్ధాంతముక్తా వళి యందు నైయాయికమతంబునఁ "ప్రాప్తిపూర్వకోహిని షేధః। అనున్యాయమ్మును బురస్కరించుకొని సాహిత్యము నిషేధింపఁ బడు చున్నయది. "ద్వంద్వేతుధవ ఖదిరౌఛింధీ త్యాదౌ ధవశ్చ ఖదిరశ్చ విభక్త్యర్థద్విత్వప్రకారేణబుధ్యతేఽత్రనలక్షణా। నచసాహిత్యే లక్ష ణేతివాచ్యం। సాహిత్యశూన్యయోరపి ద్వంద్వదర్శనాత్। నచైకక్రియా న్వయిత్వ రూపంసాహిత్యమస్తీతివాచ్యం। క్రియాభేదేపి ధవఖదిరౌపశ్య ఛింధీత్యాదౌ తద్దర్శనాత్। సాహిత్యస్యా ననుభవాచ్చ। అతఏవ రాజ పురోహితౌ స్వారాజ్యకామౌ యజేయాతా మిత్యత్రలక్షణా భావాత్ ద్వంద్వ ఆశ్రీయతే। తస్మాత్సాహిత్యంనార్థః కింతువాస్తవభే దోయత్ర తత్రద్వంద్వః" పైనింజూపిన నైయాయిక మతమందు ద్వం ద్వసమాస మగుటకుఁ బదార్థముల యన్యోన్యసాహిత్యముగాని యేక క్రియతో నన్వయించుటచే నగునట్టి శాబ్దబోధలోని సాహిత్యము, గాని ప్రయోజకము గాదని యుద్ఘోషింపఁబడుచున్నయది. నైయాయిక మతమందు "కర్మకరులగు చైత్రమైత్రులకు రూప్యమిమ్ము—ఈవాక్య ము చైత్రునికి రూప్యమిమ్ము— మైత్రునకు రూప్యమిమ్ము"

అనిన వాక్యము వంటిది యేయయి ప్రత్యేకముగా రూప్య మిమ్మనిన యర్థముతోఁచును. ఒకానొకచోఁ బ్రకరణసందర్భమునం జేసి పనివాండ్రకు చైత్రుని మైత్రినింజేర్చియే యాసముదాయమునకు రూప్యమిమ్మనియుంగూడ నర్థము కావచ్చునుకాని యట్టియర్థనియమ ములేదు. వైయాకరణమతమందుఁ బైవాక్యమునఁ జైత్రుని మైత్రుని జేర్చియే యాసముదాయమునకు రూప్యమిమ్ము—అనిన యీయర్థ మే ముఖ్యార్థమగు. వేఱొకయనుపపత్తి వాక్యమున నున్నచో వేర్వే అనిన యర్థముగౌణమై కావచ్చును." వధూవరులకు వరహాకట్నము చదివించె, ననఁగా నీద్వంద్వమ్మన నుభయుల మొత్తమునకే వరహా కట్నమని యర్థమైనట్లు, అగ్నివరుణులకు నాహుతియిచ్చెనన్న ద్వంద్వ మ్మునం గూడ నగ్నిని వరుణునింజేర్చియే యాసముదాయమునకు నేకాహుతి యిచ్చెనన్నది ముఖ్యార్థమగుంగాని వేర్వేఱుగా నాహుతి యిచ్చెననుట ముఖ్యార్థముగాదు. ద్వంద్వమున సముదాయమే ప్రధా నార్థము. పీతాంబరః ఇత్యాదిబహువ్రీహిసమాసములయందు సమాస ఘటకంబులైన పదములయర్థమ్ములు ప్రధానములుగాక యన్య పదార్థమ్ములగు కృష్ణాదులు ప్రధానమగునట్లు, కుక్కుటమ యూర్యౌ,—ఇత్యాది ద్వంద్వములయందును ద్వంద్వఘటకమ్ములైన కుక్కుట మయూరీత్యాది పదమ్ముల యర్థమ్ములు ప్రధానముగాక యన్యపదార్థమ్మగు సముదాయమే ప్రధానంబయ్యెడి. కుక్కుటము మయూరియునిట విశేషణమ్ములై సముదాయము విశేష్యమ్మగు కనుక నే, "అతిమయూరి" [కుక్కుటకులమ్]—ఇత్యాదిసమాసములయందు నుపసర్జనహాటంజేసి గోస్త్రియో, రితిసూత్రమున మయూరీశబ్దమునకు హ్రస్వము గల్గెమరీతిని, కుక్కుటమయూర్యౌ అను చోటంగూడ ద్వం ద్వసమాసార్థమైన సముదాయము ప్రధానమయి మయూరీపదార్థముప సర్జనముగాన హ్రస్వమువచ్చునని భాష్యముల శంకించుకొని "ద్వంద్వేచ

ప్రతిషేధో వక్తవ్యః” అనువచనమ్మున నివారింపఁబడినది. ఇట్టి భాష్య
తాత్పర్యమే గోస్త్రియోరితి సూత్రస్థశబ్దేందుశేఖరమందును “యద్యపి
కుక్కుటమయూర్యావితి ద్వంద్వేబహువ్రీహావివ ఏకవిభక్తిత్యుపసర్జన
త్వం ద్వంద్వః ప్రథమాంతానామేవేతి చార్థేద్వంద్వ ఇత్యత్రివక్ష్యతే
ఏకవిభక్తిత్యుపసర్జనసంజ్ఞాపి ఉద్భూతావయవ భేదసాహిత్యంప్రతి మ
యూరీపదార్థస్య తత్త్వమస్తి। సర్వత్రద్వంద్వే సాహిత్యమేవ విశేష్యమితి
చార్థసూత్రభాష్యేస్పష్టమ్। తథాపిభాష్యే ద్వంద్వేనేతి వచనారంభా
న్నదోషః॥ అని స్పష్టపఱుపఁబడినది. ద్వంద్వసమాసార్థము సముదాయమై
ప్రధానముగాఁ బరిఢవిల్లునని యీయర్థమే॥ ఉద్భూతావయవభేదస
మూహస్య ద్వంద్వే విశేష్యతయోపసర్జనసంజ్ఞాయా అప్రాప్త్యా దంద్వే
చేత్యపినబహువ్రీహావితివదతితత్త్వమ్ అతఏవగోస్త్రియోరితి సూత్రేకు
క్కుటమయూర్యావిత్యాదౌ ప్రహ్రస్వవారణాయ దంద్వేనేతివచనమా
రబ్ధమితినిక్॥ అని సర్వనామసంజ్ఞానిషేధకమయిన “ద్వంద్వేచే”, తి
సూత్రమందలి శేఖరమందును “నబహువ్రీహావితివదతి। అనువాదకమితి
శేషః। ఇతరేతరయోగద్వంద్వేపిసముదాయస్య విశేష్యతాయాంసాధక
మహ। అతఏవేతి। సముదాయస్య విశేష్యత్వాదేవేత్యర్థః అని యత్రి
త్యచంద్రకలా వ్యాఖ్యానమందును జాటఁబడుచుండె. మఱియు ద్వంద్వ
మ్మున సముదాయార్థము ప్రధానముగనక్కే ఏకవిభక్తితిసూత్రమ్మున నై
సజ్ఞాపకతంజేసియు (1) తత్పురుషేతుల్యార్థేతి సూత్రస్థ భాష్యమందలి
పరమే కారకే, పరమేణ కారకేణేత్యాది ప్రయోగంబులం జేసియు;
(2) పూరణగుణేతి సూత్రమునందు సమానాధికరణ షష్ఠ్యంతముతో
సమాసనిషేధము సేసిన సారస్యమునంజేసియు (3) సమాసాంతవిభక్తి
తోఁగూడ విగ్రహము సేయుట శాస్త్రీయమని విశదపఱచున్నను
ద్వంద్వవిగ్రహము సూత్రము ప్రథమాంతములతోడనే కాని యుక్తార్థా

హాస్థ ప్రథమాంతముల యర్థము విశేషణమై చార్థమ్మగు సాహిత్య ముతో నన్వయించుట సర్వార్థంబు. అందున ద్వంద్వవిగ్రహము సర్వదా ప్రథమాంతములతోడనే రచియింపవలయునని భాష్యతాత్పర్యము అత్తఱిని నియతవిభక్తిత్వ హేతుకమైనయుపసర్జనత్వమును నేకవిభక్తీతి సూత్రమున నుండుననియెంచుకొని "గోస్త్రియో॥రితి" సూత్రమున ప్రస్వంబు భాష్యంబున శంకించుకొనంబడియె. ఇటులు సర్వవిధంబులను ద్వంద్వమ్మున సాహిత్యము ప్రధానముగావున ద్వంద్వవాదు లుదాహరించుకొన్న "అమహన్నపుంసకములకు మువర్ణకముగు" నన్న ద్వంద్వస్థలమున నమహద్వాచకములును నపుంసకవాచకములును నుభయమ్మును మిళితమైనచోటనే మువర్ణకము గలుగుననిన యర్థము ముఖ్యంబని యొప్పికొనక తీరదు గాన పాణిపదము, కురుకురుక్షేత్రము, మధురాపాటలీపుత్రము ఇత్యాదులే సాధువులయి సూత్రసార్థక్యము గలిగినందున, పదము, కురుక్షేత్రము, పాటలీపుత్రము, ఇత్యాదులు మువర్ణకము లేమింజేసి సమరాంగణపార్థమూర్తిగారు చెప్పినరీతిని సాధువులు గాకపోలవచ్చును. ఒకవేళ ద్వంద్వవాదులు ద్వంద్వమ్మునకు నిట్టి సముదాయార్థమంగీకరింప మందు రేని యప్పుడు "సమాసనిర్దేశోయమ్। తత్రనజ్ఞాయతే। కఆదిః కోంత ఇతి। తద్యథా, అజావిధనౌ దేవదత్తయజ్ఞదత్తౌ॥ ఇత్యుక్తే తత్రనజ్ఞాయతే కస్యాజాధనం కస్యావయ ఇతి" అనిన యాద్యంతౌటకితా, వితిసూత్రస్థభాష్యమ్మును, "యద్యపి దేవదత్తస్య యజ్ఞదత్తస్యచాజా అవయశ్చధనమితివాక్యేపి క్రమవ్యవస్థానాస్తి తథాపి సమాసేసుతరాం నాస్తీతి ప్రతిపాదయితుం సమాసనిర్దేశ ఇత్యుక్తమ్" అనిన యత్రత్యకైయటగ్రంథమ్మును, "యత్రనసాహిత్యస్యనియమేన ప్రతీతిః పృథగుపస్థితిశ్చ, తత్రాపిచేన్న క్రమవ్యవస్థాకిముపవక్తవ్యం సాహిత్య ప్రతీతావపృథగుప స్థితిచ్ఛేత్యర్థః" అనిన యుద్యోతమ్మును విరోధించును ఇంతియగాక, "లక్ష్యలక్షణే, వ్యాకరణమ్" అను వార్తికమున

లక్ష్యలక్షణే' యను ద్వంద్వస్థలంబున "లక్ష్యంచలక్షణం చైతత్సము దితం వ్యాకరణంభవతి। కింపునర్లక్ష్యం లక్షణంచ శబ్దోలక్ష్యః సూత్రం లక్షణం ఏవమప్యయందోషః। సముదాయే వ్యాకరణశబ్దః ప్రవృత్తో వయవే నోపపద్యతే। సూత్రాణిచాప్యధీయాన ఇష్యతే వైయాకరణఇతి" అని వ్రాయంబడిన పస్పశాహ్నిక భాష్యమ్మును నిజంబుగా విస్పష్టంబయ్యెడు. వేయేల అన్యపదార్థప్రధానమైన బహువ్రీహివోలెనే ద్వంద్వమ్మును నవ్యయ చశబ్దార్థమే (సముదాయము) ప్రధానముగాఁ గలదని యెంచుకొనుచుఁ జార్థంబులకుంబోలె ద్వంద్వమ్మునందునుజార్థ ప్రాధాన్యంబునంజేసి లింగసంఖ్యలుండఁ గూడదని చార్థేసూత్రమున భాష్యకారులు శంకించుకొని సమాసమ్మున మాత్రము లింగసంఖ్య లుండుట స్వాభావికంబనిసమాధానము చెప్పిరి. ఇటులు ద్వంద్వము నందు నింత ప్రధానశిరోమణిగాఁ బరిఢవిల్లుచున్న సముదాయార్థసంపద శాస్త్రులవారిచేత నామమాత్రావశేషము గాఁగఁ జేయంబడి విడువంబడినది. సుబ్బారాయశాస్త్రులవారి - బ్రహ్మ (శ్రీ) లిపి యే బ్రహ్మలిపి (శ్రీ) యని నమ్మినవారికి నీభాష్యమతమంతయు దూష్యమతము గావలసినదేగాని సందియమ్ములేదు. కాని గుడ్డితనముకంటె మెల్ల కొంతమేలన్నటులు కొంచెము మేలుమాత్రముకలిగినది. శబ్దశాస్త్రమతం బింతటితో నస్తమించిపోవునేమో యని స్వయముగా సకల లోకోపకారార్థ మధికారము చెల్లింపఁగాఁ జనుదెంచిన మహామహోపాధ్యాయ సుబ్బారాయశాస్త్రులవారి పాండిత్యరాజ్య సమయమ్మున ద్వంద్వసమాసమున నుండ కిల్లికలంగిన ప్రధానసాహిత్యార్థను గజోపిమిథ్యా పలాయనమపిమిథ్యా। అనురీతి నవలంబింపకుండ "వ్యావృత్తాయత్పరస్వేభ్యః శ్రుతౌతస్కరతాస్థితా" యను కాళిదాస వచనమ్ము ననుసరించి దిలీపమహారాజు మహారాజ్యసమయంబునఁ బరధనముల నుండి పరాఙ్ముఖమైన తస్కరత్వము శబ్దమును మాత్రమే

పట్టుకొని ప్రేలాడినటుల క్రియాకారిత్వమున నామరూపములేక శాబ్దబోధనైనను బట్టుకొని యూగులాడుచుండుట యెంతోవేలుగాదే శాబ్దబోధలోని సాహిత్యముసైతము వీరిచేత మూలముట్టగ నిర్మూలింపఁబడవలసినదయేకాని దానింగూడ మటుమాయము సేయవీలులేకుండఁ బాసకంబులోని పుడుకవోలె గొప్పగడ్డుగా నొక్కటి యడ్డపడియె. అయ్యది యెద్దియనఁగా ఇతరేతరయోగే ప్లక్షశ్చన్యగ్రోధశ్చేత్యుక్తేగమ్యతే ఏతత్ ప్లక్షోపిన్యగ్రోధసహాయోన్యగ్రోధో పిప్లక్ష సహాయఇతి" యనిపార్థ మూర్తిగారుదాహరించినభాష్యము లోని సహాయశబ్దప్రయోగమే యెక్కుడు చిక్కుగాఁ దగుల్కొని ద్వంద్వమ్మనఁ బ్రధానశిరోమణిగాఁదలఁ దిప్పుగొనుచున్న సాహిత్యార్థమును సాకల్యంబుగ సంహరింపఁగా జేజిక్కనిచ్చినదికాదు శాస్త్రుల వారి కష్టార్జిత పాండిత్య పరిశ్రమయంతయు ద్వంద్వసాహిత్య సంహారార్థమేధారవోయంబడి మూడు పంతులు వ్యాసము నింపఁబడినది. వీరికిసమయస్ఫూర్తిలేకుండెంగాని యయ్యదియు నున్నచో నీశాబ్దబోధసాహిత్యమ్మునకుంగూడ సంహారావస్థ సమకూరును. ఓహాక్ త్యాగే అనుధాతువునకు శాద్వ్యధ్యే తిసూత్రమున ణప్రత్యయముగాని అథవా' భావార్థకఘఙ్ ప్రత్యయము గానిచేయఁగాదాయాఽఽదాయాదిశబ్దమ్ములువోలె హాయశబ్దమయ్యెడు (హాయః త్యాగః) "హాయేన సహితః సహాయః త్యాగీత్యర్థః ప్లక్షసహాయః ప్లక్షత్యాగీత్యర్థః" అనిపైభాష్యమునకు నర్థమైప్లక్షన్యగ్రోధము రెండొరు విడనాడినవియని భావముగాఁ గా; శాబ్దబోధసాహిత్యము సైతము సమసిపోయి వీరికి ద్వంద్వార్థమున బాధబొత్తిగా విఱుగడమై పోవుంగదా పరప్రతారణార్థము పెడయర్థములం జెప్పిస్వపక్షసాధుత్వముంజూపి కొన్నచో నేమిప్రయోజనము? లోవిమూసిననుమాయ వచ్చుంగాని లోకముఖము మూయ నేవారితరమ్మయ్యెడు వైయాకరణ కిరీటిధురంధరులవిహారంబులీధరా వండ

లంబున విరామంబు నొందెనొక్కా ! ఇపుడు పైనిం జూపిన సూత్రసార్థంబు నవలంబించి సమర్థంబాధస్థానంబునం దుందూగుచుండెడి ద్వంద్వగర్భసంభూతసముదాయ సంపదను హరింపంగా నేరికిని జేయూడదు సరియే గదా నోరైననా పదనియే నేఁబ్రతిన వట్టెద. కాఁబట్టి ద్వంద్వముఖ్యార్థము సముదాయము కాకతీగదుగాన. (1) అగ్నీషోములకు నాహుతి యిచ్చె (2) వధూవరులకు వరహాకట్నంబు చదివించె. (3)కర్మకరులౌ చైత్రమైత్రులకు రూప్యమ్మొసంగె—ఇత్యాదులందు వరుసగా (1)నేకాహుతియే యగ్నికిని సోమునకును జెందినరీతిని [2] వధువునకును వరునకును వరహాయొక్కటియే చేరినరీతిని (3)చైత్రునకును మైత్రునకును రూప్యంబొక్కటియే సంబంధించిన రీతిని (4) అమహాన్నపుంసకములకును నొక్కటియే మువర్ణకంబు గలిగి (1) పాణిపదము [2) మధురాపాటలీపుత్రము—ఇత్యాదులే సాధువులయ్యెను. ప్రాథమికబోధనైన ద్వంద్వముఖ్యార్థంబు వీడి గౌణార్థ మవలంబించినను గుణలాభంబు లేదు. (3) వ. వ్యాసఘట్టము.

ఇట్లు సుధీమణివిధేయుడు
కల్లూరి వేంకటరామశాస్త్రి
(సశేషము)



2—5—1917 దేశమాత.

(25 తేదీ పత్రిక శేషము)

(బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక)

ద్వం ద్వో ప శ మ న ము.

---

చతుర్థవ్యాసఘట్టము (సమాసద్వయ సౌలభ్య విచారణము)

శ్లో॥ పండితాఖండలాఖండ। సమ్మోదామృత దోహదమ్।
ద్వంద్వోపశమనంకుర్వే॥ సోహం సత్కర్మధారయః॥ ౧

ఆ.గీ॥ గౌరవధీః కల్లూర్య। న్వయవేంకటరామప్రత్యహంతుగ దేయమ్
తాతాసుబ్బారాయ। ఖ్యశాస్త్రి పరమభి మహామహోపాధ్యా
యమ్॥ ౨

ఓసుధీమణులారా !

పూర్వోక్తంబగు తృతీయఘట్టమ్మునఁ గనంబడెడి చిసరీతిని ద్వంద్వమ్మునఁ ముఖ్యార్థమయిన సాహిత్యమే స్వీకరించినచో సమాహారద్వాచకముతోఁ గూడిన నపుంసక శబ్దమునకే మువర్ణకమువచ్చుఁగాని వేర్వేఱుగా రాకపోవునని దోషము చూపఁబడియె. శాస్త్రీయమైన ముఖ్యార్థమును విడుచుటలోనగు పెక్కు చిక్కులకుంజిక్కికొని లక్ష్యసంస్కారము చేసికొనుట కంటెఁ గర్మధారయవృత్తి నవలంబించినయెడఁ గార్యసిద్ధి సులభంబగు ఒకవేళవృద్ధిరాదైచ్ సూత్రస్థమైన యుద్ద్యోతములోని 'మాతాపిత్రోర్మృతేహని తిథద్వైధేసాహిత్యంనతు క్రియానిష్పత్తౌ'యనినబ్రా॥ సుబ్బారాయశాస్త్రులవారి యుదాహృతగ్రంథమురీతిని శాబ్దబోధలోనే సాహిత్యముగాని, యనఁగాఁ దల్లి మృతినొందిన దినమందును దండ్రి మృతినొందినదిన మందును నని వాక్యార్థములో మాత్రము గలిసియుండియుద్దఱకు మరణంబులు వేర్వేఱుకాలమ్ములందు జరిగినట్లుతోఁ

చినరీతిని నీసూత్రమునం గూడ సమహత్తులకును, నపుంసకములకును ము వర్ణకము వేర్వేఱుగా నేలరాఁగూడ దని శంకింతురేని యనకాశం బుత్తో నవధరింపుఁడు. వృద్ధిరాదైచ్" సూత్రమునను ను వాక్యద్వయ రూపమగు గౌరవమ్ము లేకుండ "ఆదైచ్" పదము ద్వంద్వమ్మని యెంచుకొని యందున సముదాయము ప్రధానముగాన, ఆ, ఐ, ఔవర్ణముల సముదాయమునకే వృద్ధిసంజ్ఞకలుగుంగాని ప్రత్యేకముగా, ఆకారాదివర్ణమ్ములకు వృద్ధిసంజ్ఞ రాదని యూహించి భాష్యమ్మున నీవిధముగ నుగ్గడింపఁబడియె 'వృద్ధిగుణసంజ్ఞయోః ప్రత్యేకం వచనమ్। వృద్ధిగుణసంజ్ఞయోః ప్రత్యేకం గ్రహణం కర్తవ్యమ్। ప్రత్యేకం వృద్ధిగుణసంజ్ఞే భవత ఇతి వక్తవ్యమ్। కిం ప్రయోజనమ్। సముదాయే మా భూతామితి" యనుచు నిట్లు అ, ఏ, ఓ వర్ణసముదాయమునకు గుణసంజ్ఞయును, ఆ, ఐ, ఔ, వర్ణసముదాయమునకు వృద్ధిసంజ్ఞయును నాసూత్రములయందలి ద్వంద్వమ్మునంజేసి కలుగుననియు నట్లుకలుగఁగూడదనుచు [1] 'గర్గాశ్శతందండ్యంతామ్। అనుచోట సముదాయ వాక్యపరిసమాప్తియును (2) 'దేవదత్త, యజ్ఞదత్త, విష్ణుమిత్రాభోజ్యతామ్, అనుచోటఁబ్రత్యేకవాక్య పరిసమాప్తియును నీరీతిని రెండున్యాయంబులున్నవిగాన,నిచట లక్ష్యానుసారమునఁ బ్రత్యేకవాక్య పరిసమాప్తి న్యాయమ్మును (1) "మాలాదీనాంచ" [౬—౨—౮౮] యను సూత్రమున నగు నాద్యుదాత్త విధిరూపజ్ఞాపకమ్మునను (2) నీరెండు హేతువులను బురస్కరించుకొని వేర్వేఱువర్ణములకే వృద్ధిగుణసంజ్ఞలు చెప్పుదుమని యీ ప్రకరణమ్మున నిశ్చయించిరి!

(1) గర్గదండన న్యాయమేమనఁగా గర్గులందఱునుగలిసి శతధనము నీయందగుంగాని వారిలో నొక్కొక్కండే శతధనము నీఁదగదు. కావున మొత్తముచేరి యీఁదగిన శతముంగూర్చి దండనక్రియ గర్గు మొత్తమునీఁదనే సమాప్తిఁజెందునట్లు (1) సమాన (2) సంఘాగాత్రి

సంజ్ఞలు పదసముదాయముల సముదాయాంశములందే విశ్రమించుగాని ప్ర
త్యేకముగాఁ బ్రవర్తింపవనుచు నిట్టిస్థలంబులందు గర్గదండన న్యాయ
ముదాహరణముగా శాస్త్రమునందు లక్ష్యసంస్కారానుసారమున గ్ర
హింపఁబడుననిరి.

(2) దేవదత్తాది భోజన న్యాయమెట్లనఁగా—ఈయుదాహరణ
మ్మున దేవదత్త యజ్ఞదత్తాదులు ద్వంద్వమందలి పదార్థములయినం
దున సముదాయమే ప్రధానముగానున్నను, గీతవాద్యనృత్త్యాదులు గ
లిసి కాఁదగిన నాట్యక్రియవలె సముదాయమందే విశ్రాంతినొందఁ ద
గినది కాక భోజనక్రియ దేవదత్త యజ్ఞదత్తాదులందు వేర్వేఱుగానే
సమన్వయింపఁ దగియుండి తృప్తిరూపఫలమ్మును బ్రత్యేకముగాఁ జేయఁ
దగినదియైనట్లు వృద్ధిగుణసంజ్ఞాదులు ఆకారాది వర్ణములయందు బ్రత్యే
కముగా విశ్రమించుంగాని వర్ణసముదాయమందు విశ్రమింపఁదగినవి కా
వనుచు నిట్టిస్థలమ్ములందు దేవదత్తాది భోజన న్యాయము లక్ష్యానుసా
రమున ద్వంద్వైకశేషాదులయందు దీసికొనంబడుననిరి. ఇట్లు న్యాయ
ద్వయముండఁగా దేవదత్తాది భోజనన్యాయమునే ప్రకృతమున నంగీక
రించి 'దేవదత్తయజ్ఞదత్తే' తిద్వంద్వమున సముదాయార్థమే ప్రధాన
మైయున్నను, భోజనక్రియ నాట్యక్రియవోలె ననేకుల సముదాయము
చేతనే నెఱవేర్పఁదగినది కాక దేవదత్తాదులలో నొక్కొక్కరి తృప్తిని
మిత్తము తప్పక వేర్వేఱుగానే యెట్లు నెఱవేర్పఁదగియున్నదో యట్లే
యీవృద్ధి సూత్రమందును 'ఆదైచ్, అను ద్వంద్వమున సముదాయా
ర్థమే ప్రధానమైఁ ఆ, ఐ, ఔ, వర్ణముల సముదాయమునకు రాఁదగిన
వృద్ధిసంజ్ఞ లక్ష్యానుసారమున వేర్వేఱుగా వర్ణములయందు నిశ్చయిం
పఁ దగినదియని భాష్యమ్మునఁ జెప్పంబడియె. పైనిఁజూపిన ప్రత్యేకపరిస
మాప్తి సముదాయపరిసమాప్తి న్యాయంబులు సమానబలంబులైయుండఁ
నీరెంటిలో నీచోట నిదియే గ్రహింపవలయు ననిన సుగ్రీవాజ్ఞ లేదు

గాన వృద్ధిగుణసంజ్ఞలయెడఁ ప్రత్యేకవాక్యసమాప్తి యే చెప్పుట న్యాయమ్మనుటకును ప్రోద్బలకంబుగా నీకారణమ్మును గ్రంథంబుల వచి యింపఁబడినది. ఆకారణంబు వినుండు, ౬. ౨. ౮౭॥ సూ. "ప్రస్థే వృద్ధమకర్కాద్యదీనామ్" అను సూత్రమున సర్వప్రకరణంబునందు 'ఇంద్రప్రస్థః, ఇత్యాది సమాసస్థంబుల నింద్రశబ్దమునకు నాద్యుదాత్తమును విధించుచుఁ బూర్వశబ్దము వృద్ధపదమ్ము కాఁగూడదని నిషేధింపఁబడియె. ఇట్టి నిషేధమ్మున 'మాలాప్రస్థః, ఇత్యాదులందుబూర్వపదవృద్ధ శబ్దములైన మాలాశబ్దాదులకు నాద్యుదాత్తము రాకపోవుచుండఁగాఁ మాలాదీనాంచ, ౬. ౨. ౮౮॥ అను సూత్రమున నిషేధబాధనార్థ మాద్యుదాత్తవిధి సేయంబడినది. అందున, 'మాలాప్రస్థ, శబ్దములోని మొదటియాకారము వృద్ధిసంజ్ఞ గలదిగాన నాద్యుదాత్తము గలిగిసూత్రము సార్థకమ్మయ్యె. 'వృద్ధిరాదైచ్, సూత్రమున నింకను ద్వంద్వము ఖ్యార్థమే తీసికొన్నచో (ఆ, ఐ, ఔ,) వర్ణముల సముదాయమునకే 'వృద్ధిసంజ్ఞ గలిగి వేర్వేఱువర్ణములకు సంజ్ఞలేనందున 'మాలాప్రస్థ, శబ్దములోని మొదటి కేవలాకారము వృద్ధియనంబడదు. దానంజేసి 'ప్రస్థే, సూత్రమున నిషేధమేతగులక స్వయమ్ముగానే యాద్యుదాత్త స్వరమువచ్చుచుండఁగాఁ "మాలాదీనాంచ" ౬. ౨. ౮౮ అనుసూత్రమ్మున నాద్యుదాత్తవిధి వ్యర్థమ్మగు. కాఁబట్టి యీసూత్రమే వృద్ధిసంజ్ఞ వర్ణసముదాయమునకుఁ గాదనియు, ప్రత్యేకవాక్యపరిసమాప్తి న్యాయమ్మున వేర్వేఱు వర్ణములకే సంజ్ఞయనియు జ్ఞాపకంబయ్యె. ఈకారణమ్మున వృద్ధిసూత్రమునందు 'ఆదైచ్, అనుపదము ద్వంద్వసమాసమైనను, (ఆ, ఐ, ఔ) వర్ణములుమూఁడింటిని దెలుపు మొత్తమునకు వృద్ధిసంజ్ఞరాక, శ్లో॥ "మాతాపిత్రోర్నృపతేహా॥ ఇత్యాది ద్వంద్వసమాసములందుఁ బ్రకరణ సందర్భబలమ్మునఁ దలిదండ్రులొక్కమాఱుగాఁగలిసి (ద్వంద్వసాహిత్యార్థము) మ్రొక్కనొందుట యర్థముగాక నారిద్దఱును

మృశినొందిరియని మృతిక్రియతో మాత్రమే వారన్వయించినరీతిని ఆ,ఐ, ఔవర్ణములు వేర్వేఱుగా వృద్ధి సంజ్ఞగలవియనిమాత్రమే తోఁచివృద్ధిప దంబుతో నన్వయించునని వ్యాఖ్యాతలర్థముచెప్పిరి.

శ్లో॥ లక్ష్యస్యలోకసిద్ధత్వా। చ్ఛాస్త్రేలింగస్యదర్శనాత్।
అర్థిత్వాదైక్యభేదేన వృద్ధిసంజ్ఞాసమాస్యతే॥

యని యీయర్థమే వాక్యపదీయమందు సంగ్రహించి చెప్పంబడియె.

లోకములో 'పదమునకు ముఖ్యార్థమును, గౌణార్థమును గలవు గదా! ప్రకరణాదివశమ్మున ముఖ్యార్థము పొసంగనితఱిని గౌణార్థము చెప్పికొనవలసిన కర్తవ్యతతి పక్షమున కేగవలయు. అగ్నిషోమా, అను ద్వంద్వమ్మున నగ్నిశబ్దమునకు నీకారమున్ను సోమశబ్దాదికిష కారమ్మును దేవతలనిన ముఖ్యార్థమందే మొంటఁగల్గినను, 'అగ్నీషోమౌమాణవకౌ, అనువాక్యమ్మున నిద్దఱుబాలకులును నగ్నీషోమదేవతలే యనిన యర్థముగాకుండి తత్తుల్యులన్న గౌణార్థము చెప్పికొనవలసిన కర్తవ్యతతి నొందక తప్పదు. అయినను నీవఱలో ముఖ్యార్థ వివక్షయందు గల్గిన యీకారషత్వములును ద్వంద్వార్థమైన సాహచర్యంబును నశింపవు. 'గంగాయాంనైర్మల్యమస్తి—ఈవాక్యమున గంగయందు నైర్మల్యముగలదన్న యర్థమై సప్తమికి ముఖ్యాధారమర్థము. 'గంగాయాం ఘోషః,—ఈవాక్యమున గంగయందు గొల్లపల్లె యున్నదన్న యర్థమసందర్భముగాన గంగాతీరమందలి యాధారత సామీప్యసంబంధమున గంగయందు నారోపింపఁ బడినందున గౌణార్థము సప్తమికి నొప్పికొనక తప్పదు. ఇట్లే యన్వయానుపపత్తిగాని తాత్పర్యానుపపత్తిగాని సంభవించినచో లక్ష్యార్థమును స్వీకరింపవలయు. కాఁబట్టి 'మాలాదీనాంచేత్యాది జ్ఞాపక సామర్థ్య సాహాయ్యమ్మునంజేసి ప్రత్యేకవాక్య పరిసమాప్తి యంగీకరించి 'వృద్ధి. తిసూత్రమునందలి 'ఆదైచ్, అను ద్వంద్వమున ముఖ్యసాహిత్యార్థమును వీడి యాకారాదివర్ణములు

వేర్వేఱుగా వృద్ధిసంజ్ఞగలవియైనను, వాక్యార్థములో మాత్రము వృద్ధి పదముతో నన్వయించుటయనెడి శాబ్దబోధగౌణసాహిత్యముగలవయ్యె. ఇట్టియంశమునకే "మాతాపిత్రోర్శ్వశ్రూశ్వశురయోశ్చేతి సూత్రే "మాతాపిత్రోర్శ్మృతేహసీ" తివదోబ్ధేసాహిత్యం నతుక్రియా నిష్పత్తౌ ఇతి భావః" యని యుద్యోత మందుఁ బ్రకరణానందర్భమున నయిన ద్వంద్వమందలి యీశ్లోకములోని గౌణార్థము దృష్టాంతముగానీఁ బడినది. కాననిట్టియర్థమే ముఖ్యార్థమన్న శాస్త్రిలవారివాదము శాస్త్రీయము గాదు. ద్వంద్వమందుఁ దగినంత కారణమున్నచో సమన్వయార్థమయి ముఖ్యార్థమునువీడి యేకక్రియాన్వయిత్వమాత్రరూపాది శాబ్దబోధసాహిత్యము నంగీకరింపవచ్చును. కనుకనే "వాక్యకల్పనేఇతి। ప్రాథమికబోధస్తు సాహిత్యావచ్ఛిన్నే సాహిత్యావచ్ఛిన్నస్యైవ। యథా రాజ పురోహితౌ స్వారాజ్యకామౌ యజేయాతామిత్యత్ర। ఉత్తరకాలికస్తు రాజా స్వర్గకామః యజేత, పురోహితశ్చ రాజ్యార్థకామో యజేత ఇతి ప్రకరణాదివశాద్బోధః, అని యథాసంఖ్యసూత్రస్థశేఖరమందలి చంద్రికలాది వ్యాఖ్యానంబులును "సమూహయోరితి। సాహిత్యస్యోద్దేశ్యతావచ్ఛేదకత్వం విధేయతావచ్ఛేదకత్వంచ ప్రాథమిక బోధే। తతో యథాసంఖ్య సూత్రసహాయేన లక్ష్యసంస్కార సిద్ధ్యర్థం ద్వితీయోపిబోధః కల్ప్యత ఇతిభావః॥ అని యాద్యంతావితిసూత్రస్థశేఖరమందలి చంద్రకలాది వ్యాఖ్యానమ్ములును ద్వంద్వమ్మునకుఁ బ్రధానమయిన సాహిత్యార్థమును బ్రకరణాది కారణ బలవశమ్మున వీడి యత్కించిత్సాహిత్యాదులను సందర్భము కొలంది వివక్షించుకొని సమన్వయించు కొనవలయునని బోధించుచున్నయవి.

(1) ఇట్లుండఁగాఁ బ్రకృతంబున, వృద్ధిసూత్రములోని ద్వంద్వమందలి ప్రధానసాహిత్యార్థమును బోఁ దోలునట్టి ప్రత్యేకవాక్య పరిసమాప్తి న్యాయమ్మనే సూచించెడు 'మాలాదీనాంచే, త్యాదిజ్ఞాపకాది కారణముల వాలెనీ సూత్రము లోని యవహన్నపుంసకములకు, అను

ద్వంద్వమందు ముఖ్యార్థమును వీడించు ప్రత్యేకవాక్యపరిసమాప్తి న్యాయమును జొప్పించెడి తగిన కారణంబులు ద్వంద్వవాదులచేఁ జూపంబడలేదు. అట్టి కారణంబులు చెప్ప నేరక వారు ద్వంద్వము చెప్పకుండినచో "దైవత మెట్లుకుదురును? దైవత మెట్లుకుదురును?" అని మాత్రము సారెసారెకును లక్ష్యముం గూర్చియే శంకింతురు. తమయంతటి మహాజ్ఞానులు లేరని బొమ్ముబాదుకొనుచు నెదుటి సంస్కారుల నిష్కారణవైరంబునఁ దృణీకరించెడి స్వాతిశయపరులకు 'దైవతము, కుదురునే? 'దైవతము'ను, గుదురుట దుర్లభంబు. 'మిత్రము'ను గుదురుట దుర్ఘటంబు. మఱియు, ముఖ్యార్థపదవివీడి గౌణార్థపదవికిఁ బఱచుట గోక్షీరమ్మును గోతండ్రోసి యవాగూరసమ్ము నవలంబించుట వంటిది యని తమ దుర్బంవాదంబు తెలిసికొని పలువురును బరిహసింతురేమో యను భీతిని శాబ్దబోధలోని సాహిత్యమే కాని ద్వంద్వమ్మునఁ బ్రధానమయిన సాహిత్యార్థమే లేదని వారు కనుమూయఁ గడంగుదురు. ద్వంద్వమ్మని నోటఁబలుకుచు దానికి సాహిత్యార్థమే లేదనుట దంపతులని చెప్పుచు వారిద్దఱకును బెండిలి కాలేదనుటవంటిదియై హాసాస్పదంబయ్యెడి. సాహిత్యార్థమే లేనిచో నయ్యది ద్వంద్వనామమ్మునకు నెట్లు తగియుండు? మఱియు, శాస్త్రవిహితమయిన ద్వంద్వమందలి సాహిత్యార్థమును బరిహరించుటకై లక్ష్యము కుదురదనెడి మన వంటి లక్ష్యైకచక్షుష్కులయామాటయొక్కటియే కారణంబుగాఁ జాలదు. కనకనే శ్లో॥ లక్ష్యస్యలోకసిద్ధత్వాచ్ఛాస్త్రేలింగస్య దర్శనాత్॥ అని వృద్ధిసూత్రములోని ద్వంద్వ సాహిత్యార్థమును నిరసపఱచుటకు 'మాలాదీనాంచే,త్యాది జ్ఞాపకంబును గారణాంతరంబుగా నీఁబడియె.

"నహిప్రాణి తూర్యసేనానామేకమంగం సంభవతీతిసామర్థ్యాదేవ ప్రత్యేక పరిసమాప్తి రంగశబ్దస్యసిద్ధా" అనిద్వంద్వశ్చ ప్రాణీతిసూత్రస్థ ప్రదీపంబునఁ బ్రత్యేక పరిసమాప్తికిఁ గారణమ్మునువివరించుచున్నది.

అట్లులక్ష్యమ్ముగాక శాస్త్రీయమైన కారణాంతరము ద్వంద్వవాదులచే జెప్పఁబడలేదు. కారణాంతరము లేనందున, అమహాన్న పుంసకములకు, అనుద్వంద్వమ్మున ముఖ్యార్థమైన సాహిత్యముతోఁ పకమానదు. అందు ననిష్టంబు సంభవించెను. ఒకవేళ ప్రాతిపదికార్థలింగే, త్యాది సూత్రీయద్వంద్వములయందుఁ బతంజలి భగవానులు వోలె మేమును గారణాంతరములు లేకుండనే లక్ష్యానుసారులమయి దేవదత్తాదిభోజనన్యాయంబునఁ బ్రత్యేకవాక్య పరిసమాప్తి యంగీకరించి ముఖ్యసాహిత్యమ్మును వీడి యీసూత్రమును సమన్వయింతు మందు రేని యట్లనవలసుఁ లక్ష్యైకచక్షుష్కులైన మహాత్ములకట్టి యధికారముతగుంగానిలక్షణైక చక్షుష్కులై మహామహులైన మనుష్యమాత్రులకట్టి స్వాతంత్ర్యమెట్లు సంభవించెను? అథవా, "అమహాన్న పుంసకములకు" అనుచోటను ద్వంద్వమునుకొన్నను ద్వంద్వవాదులకు నిష్టసిద్ధి గలుగనేరదు.

(1) గోబలీవర్దౌ (2) పక్ష్యాచః ప్రాచ్యభరతేషు (౪-౨-౧౧౩ సూ) ఇత్యాది స్థలంబులందు బలీవర్దమ్ములు గోజాతిలోనివే యైనట్లును, భరతులు ప్రాచ్యులలోని వారే యయినట్లును నపుంసకముల మహత్తులలోనివే యయి దైవతము, అనుమహాన్న పుంసకములను సిద్ధింపనేరదు. దైవతము, మిత్రము, ఇత్యాదు లొకటిరెండు శబ్దములుగాక నపుంసకములన్నియు నమహత్తులేకాన గోబలీవర్దౌ (2) ప్రాచ్యభరతేషు ఇత్యాది సామాన్యవిశేషస్థలమందుంబలె నిచటంగూడ లింగభేదరూపమైన కించిద్భేదమునంజేసిన ద్వంద్వమని తోఁచి దైవతము కుదురక పోవును. యద్వా, యచ్ఛైనయమ నపుంసకగ్రహణమునకు వ్యర్థతగలుగు ననుకారణంబున నపుంసకశబ్దమునకు నమహాన్న పుంసకములన్న యర్థముచేసికొన్నను ద్వంద్వవాదులకు లాభంబులేదు (1) దైవము జగద్రక్షకుండు (2) మిత్రము సౌమ్యుఁడు—ఇత్యాదులందు (1) జగద్రక్షకము (2) సౌమ్యము—అని విశేష్యంబులగు దైవము, మిత్రము

శబ్దములుబోలె విశేషణంబులగువీనికిని మువర్ణకము రావలసివచ్చును కర్మధారయ మతమందు మహాన్నపుంసకములకుఁ బ్రత్యేకవిధి లేనందున లోకప్రయోగదృష్టమ్మగు విశేషణస్థలమందలి డువర్ణకమ్మును మువర్ణకము బాధింపకయుండు ద్వంద్వవాదుల మతమందు నపుంసకంబులకు మువర్ణకవిధి మహాన్నపుంసకములయెడనే సఫలముగావున లోకదృష్టంబగు విశేషణస్థలీయ డువర్ణకమ్మునుగూడ బాధించి "దృష్టాంతస్యాపితు పురుషారంభోనివర్తకో భవతి" యనుస్థానివత్సూత్రాద్యంతౌటకితావిత్యాది సూత్రస్థ భాష్యకార వచనమ్మున మువర్ణకము విధిగా రావలసియుండు. కావున ద్వంద్వమ్మనేక విధంబుల శాస్త్రదూష్యమును లక్ష్యదూష్యమును నగుచున్నది. అందు నీసూత్రమున ద్వంద్వమ్మపార్థకమ్ము.

### కర్మధారయపక్షము.

"సంభవతిసామానాధికరణ్యే వైయధికరణ్యస్యాన్యాయ్యత్వాత్" అను శాస్త్రీయన్యాయంబున నమహత్తులౌ నపుంసకములకు మువర్ణకమగునని కర్మధారయార్థమే చెప్పందగు. అమహత్తులౌ నపుంసకములకనఁగా ధనము, వనము—ఇత్యాది సంస్కృతనపుంసకములే సిద్ధించుంగాని వృషభము, వృక్షము—ఇత్యాదులు సిద్ధింపవనెడి ద్వంద్వవాదుల యాక్షేపణము పరిహాసాస్పదము. తమకున్న లోకానుభవమ్ముతో దైవతము, అనులక్ష్యమును నిండారఁ గన్నుదెఱచి చూచి దానిసిద్ధికై శాస్త్రక్లిష్టంబును గతిపయలక్ష్యభ్రష్టంబును నగు ద్వంద్వమ్మును సూత్రమున గౌరవించుకొన్న ద్వంద్వవాదులు తమయాయట్టి యనుభవమ్ముతోడనే వృషభము, వృక్షము—ఇత్యాదిలక్ష్యమ్ముల యెడంగూడ ననుగ్రహించి కన్నుదెఱచి చూచుచు నమహత్తులౌ నపుంసకమ్ములనఁగాఁ బాఠశాలలోని బాలురు సైతము చెప్పెడి శబ్దలక్షణాన్వయ రీతిని దెలుసుకొన్న నమహత్తులెల్లను నపుంసకమ్ములనుకొను న్యాయంబుగాని

యమహాత్ములలో నేకదేశమ్ములగు ధనవనాదులు నపుంసకమ్ములనుకొని తృణీకరించి శంకించుట మిక్కిలి శాస్త్రవిరుద్ధమ్మును లోకవిరుద్ధమ్మును నయ్యెడు. ఈసూత్రమ్మున ద్వంద్వవాదులు స్వానుభూతికి విరుద్ధంబుగాఁ జేయుతర్కవాదమునంజేసి "శ్లో॥ స్వానుభూతావవిశ్వాసే। తర్కస్యాప్యనవస్థితేః। కథంవా తార్కికః స్వస్యతత్త్వ నిశ్చయమాప్నుయాత్॥ బుద్ధ్యారోహణతర్కశ్చేదపేక్ష్యేత తథా సతి స్వానుభూత్యనుసారేణ। తర్క్యతాం మా కుతర్క్యతామ్॥ అను వేదాంతపంచదశీచిత్రదీపములోని యీరెండు శ్లోకమ్ములను నీసందర్భమున జ్ఞప్తికివచ్చి హాసమ్ము వొడముచున్నది. లోకములో (1) బ్రాహ్మణకవులు (2) క్షత్రియ సార్వభౌములు (3] వైశ్యవణిగ్రత్నమ్ములు- ఇత్యాదులందు సంఖ్యావాన్ పండితః కవిః" "చక్రవర్తీసార్వభౌమః,, ,,నైగమోవాణిజోవణిక్" అని యమరుండు క్రమముగా బ్రహ్మవర్గునందుఁ గవిపర్యాయములును, క్షత్రియ వర్గునందుఁ జక్రవర్తి పర్యాయములను, వైశ్యవర్గునందు వణిక్పర్యాయములును జెప్పుటచేత నేకాక, కవులు బ్రాహ్మణులేయగుటయు! చక్రవర్తులు క్షత్రియులేయగుటయు వణిక్కులు వైశ్యులేయగుటయు శాస్త్రానుభవంబులఁ బ్రసిద్ధమ్ముగాన, బ్రాహ్మణులైన కవులు క్షత్రియులైన సార్వభౌములు, వైశ్యులైన వణిగ్రత్నంబులు. అని సామానాధికరణ్యమునఁ బ్రసిద్ధికి ననుకూలముగా నర్థము సేయుట మంచిదిగాని బ్రాహ్మణేతరులైన భోజరాజాదులుగూడఁ గవులున్నందునను, క్షత్రియేతరులైన యక్బరులోనగు చక్రవర్తులున్నందునను, వైశ్యేతరులైన చారుదత్తాదిద్విజులు వర్తకులున్నందునను, ,,బ్రాహ్మణులును గవులును (భోజ) క్షత్రియులును సార్వభౌములును [అక్బరు] వైశ్యులును వణిగ్రత్నంబులును చారుదత్త,, అని ద్వంద్వార్థము వివక్షించుట హాసాస్పదమైన యధమపక్షంబుగదా అట్లేప్రకృతమునను, నపుంసకములు మహా

త్తులు దైవతము లోనగు నొకటి రెండున్నవు. అమహత్తులు నపుంసకములు లెక్కకు మిక్కిలియుండుట సుప్రసిద్ధము గాఁబట్టి తదనుకూలముగా సామానాధికరణ్యమ్మున సమన్వయించుకొనుట సరసమ్ముగనుండి సూరీంద్రశ్లాఘనీయంబగు.

యావదమహత్తులయందును నపుంసకత్వవిధియగుననిన యీయంశమును (2—8—16] దేశమాత్రతో సూచించి కర్మధారయపక్షము సమరాంగణపార్థమూర్తిగ దీనిచేఁ బ్రకటింపఁబడినది. ముఖచంద్రునికి నాహ్లాదకత్వమమరు, నిత్యాగములయందు ముఖమునకుఁ జంద్రత్వమును విధించి యాహ్లాదకత్వము చెప్పుచున్నతఱి, ముఖమునందే యాహ్లాదకత్వముగాక చంద్రునికి నైసర్గికమైన యాహ్లాదకత్వము బోధ్యమైనరీతిని నమహత్తులయందు నపుంసకత్వము విధించి మువర్ణకముం జెప్పఁగా నపుంసకములకు మువర్ణకము నైసర్గికముగా వచ్చునని బోధ్యమై 'దైవతము, ఇత్యాది మహన్నపుంసకములును సాధువులగు నన్న యీయంశము ప్రథమవ్యాసఘట్టంబున స్పష్టపఱుపఁబడియె. మఱియు, శాస్త్రంబునం జేసియు వృత్తిఘటకపదార్థప్రధానకంబైన కర్మధారయమ్ము, బహువ్రీహివోలె నన్యపదార్థ [సముదాయ] ప్రధానకంబైనద్వంద్వమ్ముకంటె నంతరంగము కానఁగర్మధారయంబే నిస్సంశయముగాఁ బండితాదరణీయమ్మైనెల కొనందగు. [1] కనుకనే 'వర్ణో వర్ణేనేతి సూత్రస్థభాష్య మీరీతిఁగర్మధారయమ్మునే కొనియాడుచుండెడి. "నైషయుక్తో విప్రతిషేధః। అంతరంగః కర్మధారయః। కాంతరంగతా। స్వపదార్థే కర్మధారయోऽన్యపదార్థే బహువ్రీహిః" అను నీభాష్యమ్మున బహువ్రీహివోలె నన్యపదార్థప్రధానకంబుగాని ద్వంద్వమును నడఁగించెదగు. [2] నిషాదస్థపతి—రిత్యాదుల

ములయందుం దక్కిన సమాసములకంటెం గర్మధారయార్థము శీఘ్రోప స్థితికమ్ముగాన నయ్యదియే యంతరంగమని బోధించుచున్న శ్లో॥ పర్యవస్యచ్ఛాబ్దబోధా॥ విదూరప్రాక్తనస్థితే। శక్తిగ్రహేంతరంగత్వ। బహిరంగత్వచింతనమ్॥ అనిన యీ వైయాకరణభూషణసారీయకారికను వివరించుతఱిని "సమాసఘటక ప్రత్యేకపదశక్త్యుపస్థాపితార్థ మాత్ర విషయక కర్మధారయీయశక్తిగ్రహస్యాంతరంగత్వేనప్రథమోపస్థితార్థ ఏవోపస్థితిలాఘవాన్నిషాదస్థపతి శబ్దస్యతాత్పర్యమనసీయతే; తేన విశేషావగతిః" అనిన దర్పణవ్యాఖ్యయును సమాసఘటకపదార్థ ప్రధానత్వంబున నంతరంగము గావున గర్మధారయమ్మే "నిషాదస్థపతిః" అను చోట నిశ్చయింపందగిన దని చాటుచున్నది, [8] నైయాయికమతమందును "కర్మధారయస్థలేతు నీలోత్పలమిత్యాదావభేద సంబంధేన నీలపదార్థ ఉత్పలపదార్థే ప్రకారస్తత్రచనలక్షణా। అతఏవనిషాదస్థపతిం యాజయేదిత్యత్ర నతత్పురుషో లక్షణాపత్తేః కింతుకర్మధారయో లక్షణా భావాత్। నచనిషాదస్యసంకరజాతి విశేషస్య వేదానధికారాత్ యాజనాసంభవ ఇతివాచ్యమ్। నిషాదస్య విద్యాప్రయుక్తే స్తత్రఏవకల్పనాత్॥ లాఘవేనముఖ్యార్థస్యాన్వయే తదనుపపత్త్యా కల్పనాయాః ఫలముఖ గౌరవతయాఽదోషత్వాదతి" అని న్యాయసిద్ధాంతముక్తావళియును 'లక్షణలేకుండ ముఖ్యార్థము గలదిగాన నిషాదస్థపతి శబ్దమునొద్దఁ గర్మధారయమ్మె శాస్త్రీయమ్మనియు, నిట్టికర్మధారయంబున్నను శూద్రాంతరుండైనను నిషాదుండు యాగోచిత విద్యావంతుండనియే యూహింపవలయుం గాని ముఖ్యార్థకంబైన కర్మధారయమ్మును నిరసించి నిషాదులకు రాజగుస్థపతితత్పురుషార్థము చెప్ప యాగోచితవిద్యావంతుండైయున్నవర్ణస్థుడైన నిషాదులరాజని లాక్షణికార్థము చెప్పఁగూడదనియు, ఖండించి కర్మధారయమ్మునే యాదరించు

చున్నది. (4) ‘‘నిషాదస్థపతిశ్శబ్దేహినిషాదంచతంస్థపతించేతి కర్మధారయః। నతునిషాదానాంస్థపతిమితి షష్ఠీ తత్పురుషః। షష్ఠ్యర్థేలక్షణాపత్తేః। ఏతావాంస్తువిశేషః। నిషాదస్యాధ్యయన విధిజ్ఞానాభావేనైవ తస్యైవవిధేస్తత్కర్తృకాధ్యయనజ్ఞానాపేక్షకత్వమ్ అని మీమాంసాన్యాయప్రకాశగ్రంథమ్మును బైనిం జెప్పిన న్యాయసిద్ధాంత ముక్తావళి గ్రంథముతో నేకీభ భవించి కర్మధారయమ్మునే శిరసావహించుచున్నది. (5) నిపాత ఏకాజనాఙ్ అను సూత్రము వివరించుచో ‘‘ఏకాజితి కర్మధారయో వ్రీహిపదార్థ ప్రధానత్వే నాంతరంగత్వాత్। అని శబ్దేందు శేఖరమ్మును అంతరంగత్వాదితి। యద్యపికర్మధారయ బహువ్రీహ్యోరేకార్థీ భావస్సమానః। తథాప్యజహత్స్వార్థావృత్తి రితిపక్షే అవయవవృత్తి గ్రహసహకారేణైవసముదాయ శక్త్యాబోధాత్కర్మ ధారయజన్యశాబ్దబోధ సామగ్ర్యపేక్షయా బహువ్రీహిజన్యశాబ్ద సామగ్ర్యా అన్యపదార్థోపస్థితిఘటితతయాగురుత్వేన సామగ్ర్యోర్లాఘవ గౌరవమాదాయ కార్యయోరంతరంగ బహిరంగత్వం బోధ్యమ్” అని యత్రత్య చంద్రకలా వ్యాఖ్యానంబును, అన్యపదార్థప్రధానమ్మై బహిరంగమైన బహువ్రీహి కంటెన్స్వ ప్రధార్థపరిధానమ్మ యినకర్మధారయ మంతరంగముగాన, ‘ఏవాచ్’ అను పదమ్మునం గర్మధారయమ్మె శాస్త్రీయ మని శాసించుచున్నది. (6) తత్పురుషోయమితి॥ అంతరంగత్వాద్వతిః పదార్థప్రాధాన్యాచ్చేతిభావః॥ అనియేతత్సూత్రభాష్యకై యటమును జెప్పెడు. పూర్వోక్త శాస్త్ర ప్రమాణమ్ములచేం బ్రకృతమ్మునను ద్వంద్వము బహువ్రీహివోలె నన్యపదార్థ (సముదాయ) ప్రధానమ్మయి బహిరంగముగా నస్వపదార్థ ప్రధానమయి యంతరంగమయిన కర్మధారయమ్మే సర్వశాస్త్రసమీచీనమైనందున ‘‘అహ్నాన్న పుంసకములకు” అను చోటం గూడం బండితపరిగ్రాహ్యంబై పరిఢవిల్లుంగాతఅఖిల గ్రాహ్యమ్మైన యీ

యనుగ మన్ముందలంచుకొని ద్వంద్వవాదులు "నాసూయాకర్తృ వ్యాయత్రానుగమః క్రియతే" యనుపఙ్క్తి-వింశతితిసూత్రస్థ భాష్యవచనమ్ము నాదరించి యసూయను ద్వంద్వముతోఁ గూడ వీడుచు సంతసింతురుగాక ఒకవేళ పాణినీయమందును, బాలవ్యాకరణమ్మునందును ద్వంద్వమ్ములుగల యనేకసూత్రములగతి యేమందురేని వినుండు. అస్థలములంటు ద్వంద్వముగాక వేఱొకగతి లేనందున దేవదత్తాద భోజన న్యాయమ్ముపయోగించి ప్రత్యేకపరిసమాప్తితో ద్వంద్వము చెప్పకొనకతీరదు గతి యున్నచో నగతిక-కమవలంబింపఁగూడదు. కనుకనే "నిపాతఏవాచ్" సూత్రమందును, "నిషాదస్థపతిం యాజయేత్", అను శ్రుతియందును ననేకసమాసమ్ములు ప్రాప్తింపఁగాఁ గర్మధారయమంతరంగమనివిమర్శించి వ్యాఖ్యాతలచే నిరసావహింపఁబడినది. మఱియు, నీసూత్రమునందు గర్మధారయము చెప్పి యమహత్త్వలయందు నపుంసకత్వవినివేషముగాక యుపలక్షణపక్షముంగూడ సమరాంగణ పార్థమూర్తిగారు [2—8—16] దేశమాతలో నుద్ఘాటించిరి. అట్లుపార్థమూర్తిగారు కర్మధారయవృత్తితో నుపలక్షణమని యన్నందులకు బ్రః మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రులుగారును చిః సీతారామశాస్త్రులుగారును సక్యృడ్గ్రహించి (1) తమకర్మధారయార్థము (250 పుట) (2) పార్థమూర్తిగారి కర్మధారయ (3) తమకర్మధారయార్థము (265 పుట) (4) పార్థమూర్తిగారు తమకర్మధారయ (275 పుట) ఇట్టులనేకస్థలములందుఁ బ్రయోగమునేసి చుండిరి. ఉపలక్షణ మనుట యేమిదోషమో! కానరాకున్నది. ప్రాచీనవ్యాఖ్యాతలు తమగ్రంథములయందు నేనవే లుపలక్షణములువ్రాసిరి. చిత్తగింపుఁడు. మిదచోంత్యాదితిసూత్రమును వివరించుచో మనోరమయందు 'తేనత్రపూణీత్యాదౌ'అని వ్రాయఁగాఁ శబ్దరత్నమందు "త్రపూణీత్యుపలక్షణం తాతా

పిండానామితి నలోపసిద్ధేస్తాని తా నీత్యర్థే శేశ్ఛందసీతి శేలోప ఏతదు దాహరణమ్" అని వ్రాయఁబడినది. అనఁగా "తాతాపిండానామ్" అనుచోట 'తానితాని' అనవలసియుండఁ గా "శేశ్ఛందసిబహులమ్" (౬—౧—౭౦) అను సూత్రమున శిలోపమ్మును; నలోపమ్మును గలిగి 'తా తా' రూపమగునదని మెఱుంగునది. "నలోపశ్చ నసిధ్యతి। అగ్నే త్రీత్రేవాజినాత్రీషధస్థా తాతాపిండానామ్" అని మిదచోంత్యాదితిసూత్రభాష్యమున నలోపమున కుదాహరణముగాను నీఁబడినది. ఇయ్యది బ్ర॥ సీతారామస్వామిశాస్త్రులుగారికింగూడ నుపలక్షణ మని తెలిసికొనుట యుక్తమా ?

(2) దూరాద్ధూతేచ॥ (౮—౨—౮౪ సూ) హూతమాహ్వానంతచ్చ సంబోధ నమాత్రోపలక్షణమ్॥ (మనోర) (3) స్థానివదాదేశ.. (౧—౧—౫౬) సిచోలుకితద్వపయే...ఇద ముపలక్షణమ్। అవ్యయస్య...(శ—ర) (4) స్థాన్యవయవప వేతి॥ ఉపలక్షణమేతత్॥ స్థానిరూపో పీతిబోధ్యం (శ—ర) [5] అత్రానునాసికః పూర్వ—[౮-3-౨ సూ] రుప్రకరణఇతి॥—రో॥ పూర్వ నేత్యుపలక్షణం రుప్రకరణవిధేయస్య [శ—శే] ఇట్లు గ్రంథకర్తలచేఁ గంఠోక్తములుగా నివి యుపలక్షణమ్ములుగా గ్రహింపఁబడి కై యటశబ్దరత్నశబ్దేందుశేఖరాది వ్యాఖ్యానయందుఁ గోటానగోటు లున్నవి. ఇయ్యది స్వల్పాంశముగాన గ్రంథవిస్తరభీతిని విరమించెద ఇంకొకమాఱు చర్చించెద (తత్స 21) సూత్రము మహత్సుంలింగ నామమునకే యుత్వము విధించుచున్నది గాన, నదీయాంతరంగమునియు, సందున మొదటనే యుత్వమువచ్చి 'రాము' ఇత్యాదులు కాఁగా, నకారాంతము కామింజేసి (39) సూత్రమున మువర్ణకము రానేరనందున "నదంతములకు మువర్ణకమగు" (39) నని యేసూత్రము చాలుననియు నిటనహామన్న పుంసక గ్రహణము 'గోతో'

ణిత్' (7–1–90) సూత్రాదులయందలి గకారాదులువలెనవివక్షితముగాన నియ్యది మహత్పూర్వలింగేతరముల కుపలక్షణముగాఁ జెప్పికొనవలయుననియు నంతరంగ కర్మధారయవాదులు పార్థమూర్తిగారు వ్రాయఁగా, ద్వంద్వవాదు లుపలక్షణావివక్షిత కారణ మాసూత్రములోనే, యుండవలయుంగాని యన్యత్రయుండఁగూడదని శంకించెదరు. ఇయ్యది మిక్కిలి యద్భుతమ్ము. (i) 'ప్రత్యభివాదే శూద్రే" (౮—౨—౮3) అనుచోట పథీతిభవేత్యస్యాప్యుపలక్షణమ్, అని శేఖరమున వ్రాయంబడిన యుపలక్షణమునకు "ఆయుష్మాన్ భవసౌమ్యేతి వాచ్యోవిప్రో। భివాదనే ఇతిమనూక్తేః" అని మనుస్మృతికారణమని విషమివ్రాయుచున్నది. (2) "అప్వృక్త ఏకాల్ ప్రత్యయః" (౧—౨—౪౧] అను సూత్రమునొద్ద శేఖరము "అప్వృక్త ఇతిపుంస్త్వ మవివక్షితమ్" అని వ్రాయుటకుఁ గారణము" హల్ఙ్యాబ్భ్యో దీర్ఘాదితి (౬—౧—౬౮) సూత్రాంతరములోని "అప్వృక్తంహల్ అను నపుంసకప్రయోగము కారణమని పక్కాణించుచున్నది. [3] "శతుందాయీతి। ఆవశ్యకాధమర్ణ్యయోరితినిః। ఆవశ్యకేణినావశ్యయం నిషేధః సూత్రే ఆధమర్ణ్యపదేనతత్సూత్రోక్తార్థోపలక్షణాత్॥ అతఏవ అంశంహారీతినిర్దేశస్సంగచ్ఛతే" ఇటు గారక శేఖరమందు అకేనో, రితిసూత్రమున నాధమర్ణ్యపదమావశ్యకార్థమునుగూడనుప లక్షణముగా గ్రహించుటకు, అంశంహారీతి సూత్రాంతర ప్రయోగము కారణమని చెప్పఁబడియె. (5) "అనుతాంస్త్రియామిత్యత్ర ఉగ్రహణమోకారస్యాప్యుపలక్షణమ్. సర్వత్రోదోత్తోరితి సూత్రే సహైవపఠనాత్" యని యనుతాం స్త్రియామితి నన్నయ భట్టీయసూత్రములోని యుత్త్వమున నోత్వమునుగూడ నుపలక్షణముగా గ్రహించుట సర్వత్రోదోత్తోరితిసూత్రమందలి యుత్త్వోత్త్వముల సాహచర్యము గారణమని [యహో] [345 పు)మున

వ్రాయఁబడినది. (6) మఱియు, "ఊదంతా ఇద్వ దేవకృత్ప్రహస్వాః ఇత్య న్యసర్వోపలక్షణత్వాత్ । ఊకారాంతరూపాణి ఉకారాంతరూపవద్ జ్ఞేయాని" అని యీ కారమాత్రమునకే కార్య కారియైన యీసూత్రము సర్వదీర్ఘోపలక్షణమని (యహో] (303) మందే ఘోషింపంబడియె. (7] సమాసఇతి। వృత్తిమాత్రోపలక్షణమ్ సమర్థః పదవిధిరిత్యత్రపదముద్దిశ్య యో విధీయతే సమాసాదిః ససమర్థః నిగ్రహవాక్యార్థాభిధానే శక్త స్స్యా సాధు రితిసూత్రార్థస్య భాష్యాల్లాభాత్" అని సమాసేఖలు భిన్నావేతి కారిక యందలి సమాసపదము తద్ధితాది సర్వవృత్తుల నుపలక్షణముగా గ్రహించుటకు భాష్యకారకృతస్థలాంతరస్థ సమర్థసూత్రార్థము కారణమని వైయాకరణభూషణసారమునఁ జెప్పఁబడియె.

(8] ఇట్లుపలక్షితణావివక్షిమ్ములకుఁగారణమ్ములు ప్రదేశాంతరస్థములే పెక్కులు గ్రంథాంతరములయందుండఁగా నేక పరిచ్ఛేదములోని (21) సూత్రమందలి మహత్పుంలింగ గ్రహణమున (39) సూత్రములోని యమహన్నపుంసకగ్రహణ మనావశ్యకము గాన నవివక్షితము మహత్పుంలింగ భిన్నములైన యుదంతములకు య్యాది యుపలక్షణ మనుట గ్రంథకర్త దోషమేమో! తెలియకున్నది. అనేకసమాస ప్రాప్తియున్నచో నంతరంగమ్మని కర్మధారయమే ప్రాచీనులచే శిరసావహింపఁబడినందున నిటనన్యపదార్థ (సముదాయ) ప్రధానమ్మై బహిరంగమైన ద్వంద్వమ్మును దలంగించి సత్కర్మధారయమ్ము నాదరించుచు (1) అమహత్తులయందు నపుంసకత్వపక్షని పక్షమునుగాని (2) లేక యుపలక్షణపక్షమునుగాని గ్రహించుట శాస్త్రీయమనందగు. ఒకవేళ, దేవదత్తాది భోజనన్యాయమున భాష్యకారులు ప్రత్యేకపరిసమాప్తి యనేకసూత్రములయందుఁ జెప్పినందు నమేనును గత్యంతర మున్నపుడు కూడఁ జిరకాలాశ్రితద్వంద్వమును విడనాడక యట్టి భోజనన్యాయమే

యుపయోగింతుమని ద్వంద్వవాదులందు రేని యట్లయినచో స్వేచ్ఛగా భోజనన్యాయ ముపయోగింతురుగాక! బ్రి॥ సుబ్బారాయశాస్త్రులు గారుగాని యాంధ్రసాహిత్య పరిషత్పత్త్రికాధిపతులుగాని స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచక మనఁగూడదని యభిప్రాయము తెల్పలేదు. బ్రి॥ వ. చి. సీ. రామస్వామిశాస్త్రులుగారు మాత్రము "మిన్నేలు...అమహతి యనుట యజ్ఞానవిలసిత" మని యంకను పెనగులాడెదరు. (ఆం. సా. ప 241 పు) అట్లయినచో. "ధరాపరాగపటలాక్రాంతము మిన్నేరు రూపంతూభయేతిసూత్రేణ సమంజసమితిజ్ఞేయమ్" అని యుభయవిధ మహతీనామితిసూత్రంబుననమహతిమిన్నేటివిశేషణమునకు ముప్పన్నక ము పక్షాంతరముననగు ననుచున్న యహోబలపండితునికే యీయజ్ఞానవిలసితమ్ము చెందును. గ్రంథమన్వయించుకొని మాటాడినను బాగుగనుండును. అయినను దీనింగూర్చి పార్థమూర్తిగారే యింకను వ్రాయుంగలరు నా కాప్రశంస యేల? ఈద్వంద్వయుద్ధోపశమన మనువ్యాసము బ్రి॥ మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రులుగారే వ్రాసిరి యనఁగా నాకు మిక్కిలి సంశయమ్ముగానున్నది. దీనియందు ననేకస్థానశాస్త్రీయాంశములేకాకుండ "దుర్యోధనార్జునులుశ్రీకృష్ణసహాయమును గోరి వచ్చిరి" యనునట్టి బహుప్రమాదయుక్తవాక్యమ్ములు గనంబడు. ద్వంద్వాదిని బూజ్యవాచకముండవలయు. వ్యాకరణశాస్త్రమందు యుధిష్ఠిరుండును నర్జునుండును నుండఁగా ద్వంద్వమ్మున నాదిపదమునిల్పింప నర్హు లెవ్వరని విమర్శించి "ఇంద్రపుత్రత్వాద్విష్ణోరం శత్వాన్మాగ త్వాద్వాఅభ్యర్హితత్వమర్జునేప్యస్తీతతః తేననియమస్సిద్ధ్యతీతిభావః అనుచుఁ బూజ్యతలో ధర్మరాజునకు దీసిపోఁడని యెంచి ధర్మరాజు పెద్దవాఁడుగాన భ్రాతుశ్చేతివార్త్తికమున మొదట నుండవగినవాఁడనిభాష్య తాత్పర్యము వ్యాఖ్యాతలు నిశ్చయించి "యుధిష్ఠిరార్జునౌ" అనిరి

పూజ్యుఁడైన ధర్మరాజునెడనే యింతవిచారణ జరుగఁగా శాస్త్రులుగారు ద్వంద్వములో నర్జుని నావలకు ద్రోసి దుర్యోధనుని వాదిపీఠ మెక్కించిరి. ఒకవేళ నర్జునుండు పార్థమూర్తియే కానఁ బకృత వైరముతో నటులుచేసి యాయుపార్థమూర్తినే యాదిని నాదరించిరి కాఁబోలు మఱియు శాస్త్రులుగారికిఁ బూజ్యతాప్రకరణమున ననిత్యత్వ బుద్ధియున్న దేమో! అట్టిదివారికి సహజమైనయెడ దానికి నేనేమియుననఁజాలనుగాని "సర్వ ఏవప్లుత స్సాహస మనిచ్ఛతా విభాషావక్తవ్యః॥ అనినయగ్నిదితిసూత్రస్థ భాష్యమ్మును శాస్త్రత్యాగ స్సాహసంతేన శాస్త్రమత్యజతాభియుక్తస్మరణాత్సర్వ ప్లుతోవిభాషావిధేయఇత్యర్థః అనినకైయటమ్మును దృష్టాంతమై మిక్కిలివిరోధించునేమో గదా!! "శ్రీకృష్ణసాహాయ్య" మనుట యుక్తమ్ము. ఏమేమో తప్పులెన్నినాఁడనని యాగ్రహింపక స్వధర్మాదులందు మధ్యమత్వము వహించినారాయణనామమ్ము ముఖమునఁబీడని నరుండనైనన్ను శాస్త్రులుగారుమన్నింతురుగాక! ఓసుధీమణులారా! పూర్వోక్తలోకవేద శాస్త్రములయందు నన్యపదార్థప్రధానత్వాదులుగల బహువ్రీహ్యాదివృత్తులకును స్వపదార్థ ప్రధానత్వముగల కర్మధారయ వృత్తికిని బ్రాప్తియున్నచోఁ గర్మధారయ మంతరంగమని శిరసావహింపఁ బడినది. నేఁటికి నట్టిపూజ్యవృత్తి నిరసింపఁ బడెనేని యన్యపదార్థప్రధానుల కియ్యది కాలముగాని స్వపదార్థ ప్రధానులకు నేమాత్రమును గాలముగాదని యెంతయు జింతనొందెద! ఇట్టితత్పురుషవృత్తికర్మధారయంబును శాస్త్రంబున నేఁచఁజాలినపౌరుషవృత్తి పండితేంద్రుం డెడనైన నుండునేమో చూడంగోరెద.

(4. వ వ్యాసఘట్టమ్ము.)

(సశేషము.)

(కొంతకాలము నిరీక్షించి ద్వంద్వవాదుల వ్యాసములఁ లోని ప్రమాద ములుతిరిగిప్రకటింపఁబడు.)

ఇట్లుసుధీమణివిధేయుఁడు
కల్లూరి వేంకటరామశాస్త్రి

17-7-1917

---

పేరికాశీనాథశాస్త్రిులుగారి యభిప్రాయము.

బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక

(ఈ 11-7-1917 సం॥రముఁ ఏప్రిలు4-18-25 తేదులందును మెయి 2 తేది యందును వ్యాసఘట్ట రత్నాకర చతుష్టయంబుతో వెల్వడి, బ్రహ్మశ్రీమహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రి ప్రముఖ విరచిత ద్వంద్వయుద్ధోపశమనవ్యాసంబును దలముస్క లొందించి యడుగంటించు బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి ప్రణీతముద్రిత ద్వంద్వోపశమనవ్యాసంబును బరికించిన కూలంకషపాండితీధురంధర బ్రహ్మశ్రీ పేరికాశీనాథశాస్త్రిులవారిచే నొసంగబడిన యభిప్రాయము

ద్వంద్వోపశమనమందలి శాస్త్రీయవృత్తి

శ్లాఘన

విబుధేంద్రులారా

“అమహన్నపుంసకములకు నదంతములకు మువర్ణకంబగు” నను బాలవ్యాకరణ సూత్రములోని యమహన్నపుంసకశబ్దము ద్వంద్వముగాఁ జెప్పందగినదియా? లేక కర్మధారయముగా నంగీకరింపదగినదియా? యని యాలోచింపవలసియున్నది. ఇచ్చటఁ గర్మధారయమే శాస్త్రజ్ఞులచేత శిరసావహింపఁదగియుండు. కర్మధారయమే లక్ష్యసంస్కారసిద్ధి నిర్వాహకమై వెలయుచుండెను. ద్వంద్వసమాస ము బహిరంగము యి శాస్త్రమార్గమునకు దూరవర్తి యగుచున్నందున దూష్యమైనది.

జగద్రక్షకుండు దైవము సౌమ్యుఁడు మిత్రము, తీర్థుఁడు [గురువు] ప్రధానుఁడు (మంత్రి) శూద్రాంతరుఁడు—ఇత్యాదిప్రయోగంబులు ద్వంద్వసమాసమున సిద్ధింపనేరవు. కానఁబండి తాదరణీయము కాదు. కర్మధారయవృత్తి పూర్వోక్తప్రయోగములయెడ సాధకంబుగానఁ బండిత పరిగ్రాహ్యమయినది. అందున బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రులగారిచేత రచియింపఁబడిన గుప్తార్థప్రకాశిక యందు నిర్వచనచేయఁబడు కర్మధారయార్థము సర్వవిధంబుల సరసంబగు.

ఇదమేవసర్వరమణీయం నిర్దుష్టమితి ప్రతిశృణోతి పేర్యాసనామక కాశీనాథవిద్వత్కవీంద్రః॥ 26-6-1927

---

కోవిదవర్యులారా! వ్యాకరణాది శాస్త్రములందలి పాండితీచండిమంబున విద్వత్పదంబునకును నుభయభాషాసర్వంకషసాహితీ కవితా కౌశల్యంబులం జేసి కవీంద్రశబ్దంబునకును నర్హులైన కాశీనాథశాస్త్రులవారి యీయభిప్రాయమును జూచితిరిగదా!! ఇట్టి ప్రతిభావంతులగు పండితరత్నంబులకు వాదతారతమ్యంబు తెలియనగుంగాని యొరులకుఁ బరమార్థంబెట్లు తెలియంగలదు ఒకనేళ నట్టి తారతమ్యపరిశీలనాపాటవము పండితులలోఁ గొందఱకున్నను జాఱుమాదికిఁ బరశ్రేయస్సాధనగుణమ్ము గగనకుసుమాయమానంబగుచున్నయది. తత్సముపరిచ్ఛేదంబున విశ్వకర్మాదులకు స్త్రీత్వంబునుఁ గంధరాదులకు క్లీబత్వంబును నతిదేశింపఁబడలేదే? అల్లేప్రకృతసూత్రమున గీర్వాణభాషలోఁ బుంలింగములగు వృషభః వృకః ఇత్యాదులని మిశ్రమమ్ములు యావదమహత్తులకును నంపుంసకత్వమునతిదేశించి మువర్ణకము విధింపఁబడుచున్నయది. "ముఖచంద్రునకు నాహ్లాదకత్వ" మగునన్న వాక్యమున ముఖమునఁ జంద్రత్వమతిదేశించి యాహ్లాదకత్వ

మును విధించుచోఁ జంద్రునకు నాహ్లాదకత్వము లోకసిద్ధంబనియు, నట్టి గుణంబు ముఖమందు నారోపింపఁబడు చున్నదనియుఁదోఁచుచున్నట్లు ప్రకృతకర్మధారయ సమాసమందుంగూడ నపుంసకములకు మువర్ణకములోక న్యాయసిద్ధంబుగాన వేఱువిధి సూత్రమక్కఱలేదనియు నట్టి మువర్ణకము సంస్కృతభాషలోఁ బుంలింగములగు వృత్ర వృషభాదిశబ్దములకు నీభాషను నతిదేశమూలకమగుచున్నదనియు స్పష్టపడుచుండె. ఈసూత్రమున నపుంసకములకు మువర్ణకము గమ్యమానమయి వేఱె సాక్షాత్తుగా విధిసూత్రము లేనందున "అన్యశ్శూద్రః శూద్రాంతరమ్ మయూరవ్యంసకాదిత్వాత్సమాసః" యైనుదాహరింపఁబడిన నపుంసక శూద్రాంతరాది శబ్దములకుఁ దెలుంగున మువర్ణకము రాకలోకప్రయోగానుసారమున డుజ్వర్ణంబుగలిగెడుం బ్రత్యేకముగా ద్వంద్వాదుల మతమందు నపుంసకములకు మువర్ణకము విధింపఁబడుచున్న యెడ "దృష్టాంతస్యాపితు పురుషారంభో నివర్తకో భవతి యను స్థానివత్సూత్రాద్యంతోటకితావిత్యాది సూత్రస్థభాష్యంబున [1] శూద్రాంతరము [శూద్రాంతరుఁడు](2) తీర్థము (తీర్థుఁడు) [3] సౌమ్యము (సౌమ్యుఁడు,) మిత్రము (4) అధికరమా (అధికరుఁడో) పండితరత్నము—ఇత్యాదికముగా డువర్ణకాంతములగు ననేకలోకదృష్టప్రయోగంబులు మువర్ణకంబులో భ్రష్టప్రయోగములు గావలసివచ్చును. కానఁగర్మధారయమే బహిర్భూతసముదాయ ప్రధానమయిన ద్వంద్వముకంటె నంతరంగమయినందున శాస్త్రీయము ను సకలలక్ష్యనిర్వాహకము ను నగుచున్నయది.

[2] స్త్రీలింగపదమన్న యర్థమందు స్త్రీవాచకశబ్దము వర్తిల్లునన్నందులకు భాష్యకైయట శేఖరాదిగ్రంథములే కాకుండ. 279 ,317, 320, పారటులయందు నహోబిలపండితీయంబును బ్రమాణములుగా సమరాంగణ పార్థమూర్తిగారిచేత ది 2 ఫిబ్రవరి 1916, ది 1 ఆగష్టు 1916

సం॥రపు దేశమాతపత్రికలయందుఁ జూపంబడినవి. "సరస్వత్యాతుమిన్నే ఋశివజటావాసిని ఇత్యుదాహృతం తత్రన కేవలం స్త్రీసమత్వం కింతు స్త్రీవాచకత్వమవ్యాహతమే వేతితద్రూపమపిసాధ్వేవ" యని 320పొరటలహా) స్త్రీలింగమన్న యర్థమందు స్త్రీవాచకము వర్తించుననుటకు నుదాహరింపబడఁగా ద్వంద్వవాదులు, మిన్నే ఋకూడమహాతియని యే యహోబలపండితుని తాత్పర్యమనియు. అమహాతియనుట యజ్ఞానవిలసితమనియుఁ భాద్రపదమాసాశ్వయుజమాసాంధ్ర సాహిత్యపరిషత్పత్రిక యందు (241పు) శాస్త్రమర్యాదలు మీఱి విచ్చలవిడిగా ననర్థమైన యర్థములు వ్రాయందొడంగిరి. ‹‹ఆపత్కాలేనాస్తి మర్యాదా" అను లోకోక్తిగలదుగదా!! మిన్నే అమహాతియనుట యజ్ఞానవిలసితమే యయి నచో ధరావరాగపటలాక్రాంతంబు మిన్నేఋ రూపంతూభయేతి సూత్రేణ సమంజసమితిజ్ఞేయమ్, అనియహోబలపండితుండే యమహాతియైన మిన్నేటివిశేషణము ‹‹ఉభయవిధ మమహాతీనామ్,, అను సూత్రమున మువవర్ణకాంతముగా వికల్పమున నగునని యుద్ఘోషించుచుంటచేత, నట్టిపూజ్యునకే యీయజ్ఞాన విలసితంబు చెందుచుండుగఁదా! ఆహా ఏమీ! యీయజ్ఞానవిలసితప్రభావము!! కోవిదవర్యులారా! స్త్రీవాచకద్వంద్వార్థ నిర్వాహకుల పత్రికలయందు నాత్మస్తుతి పరనిందల యుక్తులుదక్క బ్రహ్మశ్రీ తాతాసుబ్బారాయశాస్త్రి ప్రణీత ద్వంద్వ యుద్ధోషణనంబునకు ఖండనంబుగాఁ బైఁగనంబఱిచిన దేశమాతపత్రిక తేదులందు వెల్వడిన బ్రహ్మశ్రీ కల్లూరివేంకటరామశాస్త్రి కృతద్వంద్వోపశ మనవ్యాసంబునకు సమాధానయుక్తు లెవ్వియుఁగానరావు! కావున సదుత్తరం బీఁబడునేమో! కొంతకాలము నిరీక్షించి సమరాంగణపార్థమూర్తి నామముసార్థకంబగునటులు, రచింపఁబడిన సమరాంగణ పార్థమూర్తియమ్మను (1) ద్వంద్వోపశమనంబును (2) పుస్తకరూపంబున ముద్రింపించి గుప్తార్థప్రకాశికకుంజేర్చి పండితప్రపంచమునఁ

బ్రికటింపఁబడును. అవసరమని మాకుఁదోఁచునపుడెల్లను మాకుఁ బంపఁబడు పండితాభిప్రాయంబులు సత్యార్థప్రదర్శనంబునకై పత్రికల యందుఁ బ్రికటించెదము. కాశీనాథశాస్త్రులవారు పరిపంథిపండితగజపంచాస్యమూర్తులేకాకుండ నామంబున సైతము పంచాస్యమూర్తులుగాన వారియభిప్రాయంబు మొదటఁబ్రిచురము సేయంబడియె.

ప్రకృతపరికరణంబు నకుందగిన శార్దూలవిక్రీడితవృత్తము ॥ జేజీయాదమహాన్న పుంసకపదంద్వద్వేనదుర్ఘోషిణా। త్యక్తంనిర్మిత కర్మధారయసమాసార్థేనసత్సమ్మతమ్। స్త్రీలింగార్థవిశేషణాధిసరణౌ స్త్రీవాచకాఖ్యంపదం। శాస్త్రజ్ఞైస్సకలైః సమాహితతయా శ్లాఘాపదంప్రాప్నుతాత్॥

ఇట్లు బుధేంద్రవిధేయుఁడు
ప్రతివాదిభయంకరము రాఘవాచార్యులు.

---

బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక
6—2—1928

—:♦:—

కర్మధారయ జయ శ్రీభేరీభాంకరణము.

గీతిః॥ సత్కర్మధారయజయ।
శ్రీభేరీభూరిభాం కృతిర్జయతాత్।
అమహాన్న పుంసకపదా।
ద్భట్పాసాద్వంద్వవృత్తిరస్తమగాత్॥

విబుధేంద్రులారా!!

బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రిల వారు 1917 సం॥రము ఫిబ్రవరి నలలో వెలువడిన నెలసం॥ర భాద్రప

దాశ్వయుజమాసాంధ్ర సాహిత్యపరిషత్పత్రికలో ద్వాంద్వయుద్ధోపశ మనమను పేరంబరగు నొక వ్యాసమ్మును ద్వాంద్వ సాధకమ్ముగా గాను టించుచున్నదానిని లిఖింపఁగాఁ బిమ్మట నేను దేశమాతపత్రికలో నాలుగు వ్యాసఘట్టములుగా విభజించి సమాధానము లిచ్చుచు మేయి 2 తేది చతుర్థవ్యాస ఘట్టాంతమునఁ బ్రతిభటులు నావ్రాసినగ్రంథముపై నేమి లిఖింతురోకొంత కాలము నిరీక్షించెదనని సశేషముగా నూరకుంటిని. అట్లు మేయినెల 2 తేది నుపరమించిన నావ్యాసంబునకు నిప్పటికి (26—1—18) జరుగుచున్న నవమ మాసమ్మున ననఁగా నీజనవరి నెలలో వెలువడిన పింగళ సం॥ర భాద్రపదాశ్వయుజమాసాంధ్ర సాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రతి ప్రసనముగా బ్రహ్మశ్రీ సుబ్బారాయ శాస్త్రిలవారి వ్యాసము శీర్షోదయమయి భూపతనంబు నొందినది. ఇంత యతిదీర్ఘ కాలము తడవయినను దగిన సమాధాన హేతువులుతోఁ బక, యొట్టెట్టో దీర్ఘాలోచనతో లేనిపోని సూత్రమ్ము పన్ని నిడుదగాఁగ నొనర్పఁబడిన యీవట్టిదుర్బల స్థూలకాయ వ్యాసంపు గుట్టును నిట్టికాలాతి క్రమణ దోషమునం జేసి బుద్ధిమంతు లూహింతురేమోయని యులికిపడి మనంబున సంకోచించుచు సుబ్బారాయశాస్త్రిలుగారు తాదృశ దోషమ్మును గ్రమ్మకొనుటకై "నావ్యాసమును వారివ్యాసమును సావధానముగఁ జిత్తగించిన యెడల వారియాక్షేపణములు నావ్యాసమున కంటగుల లేదనియుఁ, దగిలినట్లు తోఁచనవానికి నావ్యాసమునందే సమాధానములున్నవనియు, విమర్శకులగు పండితులకు స్ఫురించును. కావున నేను వేఱుగ సమాధానము వ్రాయనక్కఱ లేదనునది మొదటి కారణమ్ము, ఇత్యాద్యధికముగా మూఁడు హేత్వాభాసలు ప్రకటించిరి. గతి రైటీన జూలై 11 తేదిని నుభయభాషాపాండిత్య చండిమోద్దండులగు వేదము వేంకటరాయ శాస్త్రిగారు నానాదంబునకు నామోదంబుగా నిచ్చిన యభిప్రాయంబునకు ప్రతిచూర్ణము చేసిన ప్రతివాది భయంకర శాస్త్రులవారు

ర్యవర్యుల వాక్యశైలియే తిరిగియీవ్యాసమును వ్రాయఁగాఁ దమ్మును బ్రోత్సహింపఁ జేసెననియు శాస్త్రిలుగారు నిక్కము దాఁపనేలయని వక్కాణించుచున్నారు. అట్టి ప్రోత్సాహోత్పత్తి కాలంబున నిప్పటికిఁ జిరకాలంబయినదిగదా!! ఎంతో చిరకాల మాలోచించి యాలోచించి శాస్త్రిలవారు నీరసంబైన యీవ్యాసమ్మును సారసంబుగాఁ జూపుటకై తమ యావచ్ఛక్తియు ధారవోసిరిగాని తుట్టతుదకు నియ్యది దన మేడికాయవాటమును జెప్పక చెప్పచుండెడు. హేమదుగ్ధకంబను నామ మాత్రంబునమధురమ్మగు మేడికాయ యేటికి మేటికాయ యయ్యెడు? కాన నది యుక్తంబ. ఈవాదముతో ద్వంద్వముగాఁగ నుండిన శ్రీవాచక వివాదంబు తన నామమ్మునకుఁ దగునట్లు శుద్ధాంత రంగము నొందినది ఇఁక ద్వంద్వవాదములో నిష్కారణముగా నేతెంచివంచింపఁ జూచిన బ్రహ్మశ్రీ సుబ్బారాయ శాస్త్రిలవారు బాల్యాదిగాఁ దమకబ్బెడు విద్యయంతయు నుపయోగించి వంకలంగనంబఱుచుచు రణరంగంబున మహాశూరులువోలె నెత్తినపడగ పడిపోకుండ నిలఁబెట్టుదమని యెంచిరిగాని యయ్యది యన్యథాయయ్యె. ద్వంద్వమవలంబించినచో మీఁదు మిక్కిలి దోషములు సైతము దొరకొనుచున్నవి. అందున నిదియే కడసారి యని మఖ్లు మొగంబువెట్టుచుఁ గొంచెము "స్ఫటాటోపోభయంకరః" అను వచనమ్మును మాత్రము సార్థక పఱుచుచున్నారు. సుబ్బారాయ శాస్త్రిలవారు తమపేరు ప్రతిష్ఠలకుఁ దగునట్టా మాత్రము స్ఫటాటోపము చేయుటయు సహజముగాని యది వింతగాదు. సుధీమణులారా! పూర్వాపరవ్యాసంబులందుఁ బ్రతిభటుల స్వవచన వ్యాఘాతంబులును బునరుక్తిదోషమ్ములును దెలియుటకై వారి వివాద సారాంశములతో నుండిన సమరాంగణ పార్థమూర్తియ ద్వంద్వోపశమన వ్యాసంబులు ముద్రింపఁబడుచున్నవి. కానఁ బునరుక్త్యాది దోషంబులతో నిండిన శాస్త్రిలవారి యీవ్యాసమ్మును నిపుడు స్థాలీపులా క

న్యాయంబునసేయుచుండక యెత్తికొని దీని పసబయల్పఱచెదరుగాక! అవసరమనితోఁచు నెల్లయెడలను విపులంబైన వివరణము స్వల్పకాలములో వెల్వడు పైవ్యాసముల ప్రకటనకాలంబున నచ్చొత్తించి ప్రకటించెద. కాన నవధరింపుఁడు.

(1) ప్రతిభటుల శంక:—"ఈప్రథమ వ్యాసఘట్టమున నాకొక సందేహము పొడముచున్నది. బాలవ్యాకరణమందలి డుమ్వర్ణక విధాయక సూత్రములోని పులింగ నపుంసక లింగశబ్దములు శాస్త్రీయలింగ తాత్పర్యమున వాడఁబడినవని వీరు తలఁచెదరా? లేక లౌకికలింగ తాత్పర్యమున వాడఁబడినవని తలఁచెదరా?" యని సుబ్బారాయశాస్త్రులవారు బాలవ్యాకరణకర్త యభిప్రాయము పైసూత్రములలో లౌకిక లింగమనియా? లేక శాస్త్రీయలింగమనియా? యని రెండు పక్షములుగా నెత్తుకొని శంకించుచున్నారు ఇట్టిశంకచేత వీరు డుజ్విధిసూత్రమును మువర్ణకవిధిసూత్రమును బాగుగాఁ బరిశీలించిరో లేదోయని నాకు సంశయ ముప్పతిల్లుచున్నది. అందమైన యీశంకచందమెట్టిదో తెలియఁగా నీసూత్రముల యర్థమును నించుక చర్చించి చూపెద.

బాల. తత్సమ. సూ. 22 పులింగమగు మహద్వాచకమునకు డుజ్జగు. ఇట మిత్రము, దైవతము—ఇత్యాది మహన్నపుంసకములను దప్పించుటకై పులింగశబ్దంబును; వృషభము (వృషభః) మేషము (మేషః)—ఇత్యాద్యమహత్పులింగములను (తిర్యగ్జంతువులను) దప్పించుటకై మహత్పదంబును గ్రహింపఁబడినవి. ఇట్లు డుజ్విధాయకసూత్రములోఁ బులింగశబ్దముచే శాస్త్రీయపుంస్త్వంబును మహత్పదంబుచేఁదిర్యక్సంబంధిభిన్నసురాసురాదినిష్ఠపుంస్త్వంబు నుభయంబును నుభయపదంబులచేతఁ జెప్పంబడినవి డుజ్విధాయకసూత్రములోని పులింగమహత్పదంబు లుభయంబుచేతను శాస్త్రీయలౌకికపుంస్త్వంబు లుభయంబును గ్రమంబుగా గ్రహించు నావ్యాకరణ స్పష్టపడుచుండ, శాస్త్రులవారికీసూత్రములోని

పుంలింగశబ్దమున కర్థము శాస్త్రీయలింగమో! లేక లౌకికలింగమో! తెలియక సందేహముగా నున్నదియఁట. గోవును వృషభంబును గొని రమ్ము—అని చైత్రుండు మైత్రునితోఁ జెప్పిన వాక్యములో గోశబ్దంబునకు స్త్రీగవియుఁ బుంగవంబు నర్థముండినను, పుంగవంబును బోధించువృషభశబ్దమీవాక్యంబున నుండుటంజేసి గోశబ్దమ్మునకిట స్త్రీగవియే యర్థమగుంగాని యిది యేమా? లేక యదియా? యనిన యేశంకయుఁ బొడమదుగదా! అట్లే ప్రకృతసూత్రమునందును లౌకికపుంలింగవిశేషమును బోధించుమహచ్ఛబ్దముండుటంజేసి పుంలింగశబ్దమునకర్థము శాస్త్రీయలింగమే యర్థమగుంగానఁ బుంలింగశబ్దార్థము శాస్త్రీయలింగమా? లేక లౌకికలింగమా? యన్న పరాశంక యెన్నఁడును జేయఁగూడదు. కాన శాస్త్రులవారి మొట్టమొదటిశంకయే మిక్కిలి యసందర్భముగా నున్నయది. అంత పండితులగు మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రులవారిప్రశ్న యసందర్భమనంగలమా? కాదు. మనకే యీప్రారబ్ధశంకసహితము బ్రహ్మాండముగా నడ్డపడ్డదనుకొంట యుక్తము. "గోబలీవర్దమితి। గావఉత్కాలితపుంస్కాః (నిష్కాసితపుంస్కాః) వాహాయచవిక్రియాయచ స్త్రియ ఏవావశిష్యంతే॥ యనినత్యాదా దీనిసర్త్యే రితి సూత్రస్థభాష్యంబును "స్త్రియఏవేతి॥ తతశ్చాత్రగోశబ్దః స్త్రీగవీణామేవవాచకః॥ అనిన యుత్రిత్వకై యట గ్రంథమును జదివిన శాస్త్రులవా రసంగతమైన ప్రశ్న వ్రాయుదురా? ఆరీతిగ పలవడదు. మనకేయర్థముకాలేదు. గగనకుసుమగంధాయమానమైన యీశంకాగంధము శాస్త్రులవారి మానసమధుపంబు నీపాత్త్రమం దిన్నిదళములవలను నాకర్షించి భ్రమింపఁజేసినందులకు నెంతయు వింతనొందుచున్నాఁడ. ఇఁకను మున్నుగవిధాయకసూత్రార్థమును గొంచెము చర్చింతము.

బ. వ్యా. తత్స. 39 సూ. అమహాన్నపుంసకముల కదంతము లకు ముపర్ణకంబగు.—ఈసూత్రమందలి నపుంసకశబ్దమున శాస్త్రీయలింగము తలంపఁబడునా? లేక, లౌకికలింగము తలంపఁబడునా? యనిన శాస్త్రులవారి ప్రశ్నము సరియో కాదో యాలోచింతము. ఈసూత్రములోని నపుంసకశబ్దమునఁ గొన్నిచోట్ల శాస్త్రీయలింగంబును గొన్నిచోట్ల శాస్త్రీయలౌకికలింగంబు లుభయంబును గ్రహింపనగుంగాన నీశబ్దంబునను నేపక్షమని శంకించుట సమంజసముగానేరదు అమహాత్తులయందు నపుంసకత్వమతిదేశించు నీసూత్రములోని నపుంసకశబ్దమ్మున దైవతాదిపదార్థములయందు శాస్త్రీయలింగము తలంపఁబడు. మఱియుఁ బ్రకరణాదివశంబున నుభయంబును జేకొనంబడు. అది యెట్లంటి రేని వినుండు కువలయానందము. విషమాలంకారము॥

శ్లో॥ నపుంసకమితిజ్ఞాత్వా। తాంప్రతిప్రేషితం మనః।
తత్తుతత్రైవరమతే। హతాః పాణినావయమ్॥

"నపుంసకమ్మని యెఱింగి ప్రియురాలింగూర్చి మనము (మనః) పంపఁబడఁగా, నయ్యది యక్కడనే రమించెడి." ఇత్యాదికముగా నీశ్లోకము నాంధ్రీకరించుచో 'మనము, అనుచోట "తత్సంభవేతు శాస్త్రీయవిశిష్టే లౌకికే శాస్త్రీయమపిశబ్దతో బుధ్యతేతథానుభవామ్॥ అనుస్త్రీయామితిసూత్రస్థ శేఖరగ్రంథవచనంబు శాస్త్రీయలౌకికంబు లుభయంబును నవశ్యము గ్రహింపఁదగియుండు. ఇట్లు యథాసంభవముగ సూత్రస్థనపుంసకశబ్దమున శాస్త్రీయలౌకికలింగము లుభయంబును స్వీకరింపఁదగియుండఁగా, ముపర్ణకవిధాయకసూత్రములోని నపుంసకశబ్దమున శాస్త్రీయలింగమగునా? లేక, లౌకికలింగమగునా? యన్న శాస్త్రులవారి యన్యతరపక్షశంక యెట్లు సంగతంబగు? కావునఁ బైసూత్రద్వయమందును నసందర్భశంకలమూలమ్మున నగాధపాండిత్యశైలితో వ్రాసిన శాస్త్రులవారి గ్రంథ మయోమయంబై కొనుకఁబడ శక్యముగాక

యున్నది. ఆహా ! శంకయే పెక్కుశంకలను బుట్టించుకొనుచుఁ బ్రబలు చున్నది.

(2) "శంకావాక్యము:—శాస్త్రీయలింగతాత్పర్యముల వాడఁబడెననుపక్షమున దైవతశబ్దము సహజముగా నంపుంసకలింగమైయుండ దాని నపుంసకత్వసిద్ధికై యగతికగతిభూతమయిన "సామాన్యే నపుంసకమ్" అనుప్రవాద మంగీకరింపనేల? ఈపక్షమున వృషభాదిశబ్దములు నపుంసకములుగఁ దలంపఁబడుచున్నవను వీరివాక్య మెట్లు సంగతం బగును?"

ఉత్తరము:—తత్సమ. 39 సూత్రమునకుఁ బ్రతిభటులు సామాన్యదృష్టితో నర్థము చేసికొనుచు "నమహాన్నపుంసకములగు ఋతుశబ్దాదిశబ్దములకే మువర్ణకము గలుగుఁగాని నమహాన్నపుంసకమయిన దైవతశబ్దమునకును నమహాత్పులింగములగువృషభ వృతుశబ్దాదిశబ్దములకును మువర్ణక మెట్లుసిద్ధించునని శంకించిరి. పిమ్మట సమరాంగణసార్థమూర్తిగారి మతమవలంబించి నేను "సామాన్యే నపుంసకమ్" అనున్యాయంబున దైవతశబ్దమునకు నపుంసకలింగచిహ్నంబగు మువర్ణకంబును సాధించితి గాని శాస్త్రులవారన్నట్లు నాప్రథమవ్యాసఘట్టమ్మున నపుంసకత్వమును సాధింపలేదు. అట్లే అమహాత్పులింగములగు వృషభవృతుశబ్దాదిశబ్దములకు (24) సూత్రమున మహాత్పులింగవిహిత డుజ్వర్ణకము రానేరదు. గాన నీన్యాయవశమ్మున నపుంసకలింగవిభక్తియగు మువర్ణకమ్మునకే పాత్రంబులై తెలుంగున నయ్యవి నపుంసకలింగములగునని సమాధానము చెప్పితి. విశేషవిధానములేనిచో లింగసర్వనామంబగు నపుంసకలింగమ్మయితద్విభక్తి నిరాతంకముగా సిద్ధించుఁగదా! "న కేవలా ప్రకృతిః" ఇత్యాదిన్యాయవచనంబునఁ గేవలప్రకృతియెట్లు ప్రయోగింపనగు? కావుననే "గుణేశుక్లాదయః పుంసి" యను నమరనిఘంటుశ్లోకమును వివరిం

చఁతఱిని "సంజ్ఞఇతి యద్యపిశుక్లం రూపమ్ ఇత్యాదావి శేష్యసిఘ్నత్తైవే ష్యతే; తథాపివిశేష్యానుపాదానే ప్రాప్తస్య సామాన్యే నపుంసకమిత్యస్యాపవాదోయమ్" అని విశేషవిధానాభావంబున నపుంసకలింగమయి తద్విభక్తివచ్చునని భట్టోజీదీక్షితపుత్రభానోజీ దీక్షితకృత రామాశ్రమి యను నమరవ్యాఖ్యయం దుదాహరింపఁబడియె.

(స శేషము)

---

బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక

13—2—1918

(పూర్వపత్రికా వ్యాసానుసంధానము)

కర్మధారయజయ శ్రీభేరీభాంకరణము.

గీ॥ సత్కర్మధారయజయ। శ్రీభేరీభూరిభాంకృతి జయతాత్
అమహన్నపుంసకపదా। ద్భిత్త్వాసౌద్వంద్వవృత్తి రస్తమగాత్।

ఆ॥ గీ॥ గౌరవధీః కల్లూర్య। న్వయ వేంకటరామశాస్త్ర్య హంతుగదేయమ్
తాతాసుబ్బారాయా। ఖ్యశాస్త్రివరమభి మహామహోపాధ్యాయమ్।

(3) మఱియుఁ బ్రథమవ్యాసఘట్టమునందు "ముఖచంద్రునకు నాహ్లాదకత్వమమరెను"నిత్యాది వాక్యములనుదాహరించి యిట ముఖమందుఁ జంద్రత్వాతిదేశముతో నాహ్లాదకత్వము విధింపఁబడురీతిని, నీ సూత్రమునందును నుద్దిష్టములగు నమహత్తులయందు నపుంసకత్వాతిదేశముతో ముదర్ణకము విధింపఁబడుననియు, బహిర్భూతసముదాయ ప్రధానమగు ద్వంద్వము బహువ్రీహివోలె బహిరంగముగాన స్వపదార్థప్రధానమయి యంతరంగమయిన కర్మధారయమే యీసూత్రమున

శాస్త్రీయమనియు, ద్వంద్వమశాస్త్రీయ మొక్కటియే కాక, మీా దుమిక్కి-
లి లక్ష్యదోషమ్ములు సైతము సమకూరుననియుఁ జెప్పి కొన్ని లక్ష్యము
లుదాహరించిరి. శాస్త్రిలవారు కర్మధారయముకంటె ద్వంద్వమే యిట
శాస్త్రీయమని సాధించి స్వపక్షసర్వహాణమ్ము కావించుకొనలేదు. వీరు
బహుగ్రంథవిసరప్రదర్శనంబుకై యమహన్న పుంసకసూత్రమునఁ బ్రకృ
తాంశమునకు దూరవర్తియగు నుద్దేశ్యవిధేయభావ విచారణమును
సల్పి చిట్టచిరకుఁ గొంచెము ప్రకృతమార్గమునకు దయచేసి యిట్లనిరి.
"మఱియు, నపుంసకములకు ముపర్ణముపచ్చుననియు నమహత్తులు
నపుంసకములగు ననియుఁగదా శాస్త్రిలవారి వాదమునందలి ఫలితార్థ
ము. అట్టిసిలో నమహత్తులకు నపుంసకత్వాతిదేశద్వారమున ముపర్ణక
మును విధించుటకంటె నమహత్తులకు సాక్షాత్తుగా ముపర్ణకమును
విధించుటయే యుచితమయియుండదా?"

ఉత్తరము:—అమహత్తులకు సాక్షాత్తుగా ముపర్ణకమును విధిం
చుచో నపుంసకములకుంగూడ సాక్షాత్తుగాముఁవర్ణకవిధి తప్పదు. ద్వం
ద్వముచెప్పి సాక్షాత్తుగా ముపర్ణకము నపుంకములకెల్ల విధించితిమేని
ధనము, వనము ఇత్యాదిలక్ష్యంబులందుంబలె దీనికి బాధక సూత్రము
లేనందున "దృష్టాంత స్యాపితుపురుషారంభోని వర్తకోభవతి" యను
న్యాయత్యాత్రాద్యంతౌటకితా విత్యాదిసూత్రస్థభాష్య వచనంబుచే నీ
సూత్ర మీాక్రింది లోకప్రసిద్ధప్రయోగంబులందును బ్రవర్తిల్లెడు. ఉదా-
తీర్థుఁడు (గురువు) పదేశించుచున్నాఁడు— అనుటకు బదులుగా, తీర్థ
యుపదేశించుచున్నాఁడు—అనియగు. తీర్థులు పూజ్యులు—అనుటకు
మాఱుగా, తీర్థములు (గురువులు) పూజ్యములు—అనవలసియుండును
మనుష్యఏవ=మనుష్యమాత్రమ్! అన్యశ్శూద్రః= శూద్రాంతరమ్; అన్యో
రాజా=రాజాంతరమ్-ఇత్యాదులు మయూరవ్యంసకాదయశ్చ"(2-1-72
అను పాణిని సూత్రమున నిష్పన్నములయి సంస్కృతభాషలో నపుం

సకములయ్యె ఈమువర్ణకవిధిసూత్రమున ద్వంద్వవృత్తి చెప్పినచో— మనుష్యమాత్రుఁడు వివేకముగలవాఁడు—అనుచో, మనుష్యమాత్రము వివేకముగలవాఁడు—అని చెప్పవలసియుండును. శూద్రాంతరుఁడు కృషిచేసినాఁడు—అని పలుకకతీరదు. రాజాంతరుఁడు పాలించినాఁడు—అనుచోట్ల, రాజాంతరము పాలించినాఁడుఅని యనవలసియుండును. కోవిదులారా! ద్వంద్వము సూత్రమున రచించుకొన్నయెడల నెంతపరిహాసాస్పదమగు ప్రయోగంబులునోటఁబెట్టవలసియుండునో! చూచిరిగదా! మఱియు, మిత్రము దయగలవాఁడు—అన్నట్టులే, మిత్రము దయావంతుఁడు—అని దుష్వర్ణకముతో ననవలసియుండఁగా, మిత్రము దయావంతము—అనుప్రయోగంబగు దైవమురక్షించువాఁడు—అన్నట్టులే, దైవమురక్షకుఁడు—అనిదుష్వర్ణకముతో నుండుటవిధియైయుండఁగా, దైవమురక్షకము. అని భ్రష్టముగా ద్వంద్వపక్షమునఁ బ్రయోగింపనగు ఇట్లు ద్వంద్వమ్మున ననేకదోషమ్ములు సంభవించెడి. నేనిట్టిదోషమ్మును నాపూర్వవ్యాసమ్ములలోఁ జూపఁగా శాస్త్రివారు వానిని మెల్లమెల్ల నిగజాఱవిడుచుచు "ఇతరశబ్దముల విషయమున నెట్లువ్రాసినను, బ్రధానశబ్దవిషయమునందును నట్లువ్రాయుట యత్యద్భుతముగానున్నది" యని తక్కిన శబ్దములయెడ నర్ధాంగీకారమును సూచించుచు నొక్కప్రధానశబ్దమునెడనే మిక్కిలి వింతపడుచున్నారు. శాస్త్రిలవారును ప్రధానశబ్దము నొద్ద నావ్రాసినగ్రంథముం జూచి యచ్చెరువందినట్టులే, నేనును బ్రధానశబ్దమునొద్దనే శాస్త్రిలవారు లిఖించిన వాక్యసరణిని సందర్శించి కడుపంతయు నచ్చెఱువగునట్టులు నవ్వుచు నచ్చెరువందుచున్నాఁడను వీరు మిశ్రశరణప్రధాన పాత్రాదులు మిత్రాదులుగాన మిత్రాదులలోఁ బరిగణింపఁబడిన ప్రధానశబ్దము మంత్రివాచకమయినపుడు సహితము (18)సూత్రము మిత్రశరణాదులువలె వికల్పముగాఁ బుంలింగత్వాతిదేశము నొందుననియు,

మిత్రము, మిత్రుఁడు—అగునటులే, ప్రధానము, ప్రధానుఁడు-అను రూపద్వయంబును గాకతీరదనియు, సాహసించి యుద్ఘోషించుచున్నారు ఏశబ్దము, ఏయర్థమందు గీర్వాణభాషలోఁ బుంలింగము కాకుండి సర్వదానపుంసకమై యుండునో: యట్టిశబ్దమేకదా ప్రయోగానుసారమున బరిశీలించి మిత్రాదులలోఁబఠించుకొనఁదగియుండు మిత్రశబ్దము సఖిఁవాచకమైనపుడు గీర్వాణభాషలో సదా నపుంసకముగాన నయ్యదియే, తెలుంగున మిత్రాదులలో వైకల్పికపుంలింగత్వముకై పఠియింపఁదగియుండుంగాని సూర్యవాచకమైన మిత్రశబ్దము సంస్కృతభాషలో స్వతస్సిద్ధముగాఁ బులింగమైయుండ నట్టిమిత్రశబ్ద మీగణంబులో నేల గ్రహింపఁబడు?, అట్లే ప్రకృతంబునను, ప్రధానశబ్దము సదాగీర్వాణభాషలో నపుంసకలింగమైనదియే వైకల్పికపుల్లింగత్వమునకై తెలుంగు వ్యాకరణంబున మిత్రాదులలో గ్రహింపఁ దగియుండుగాని మంత్రివా వాచకమైన ప్రధానశబ్దము సంస్కృతభాషలోనే పుంనపుంసకమై యుండఁగా నట్టిది పాక్షికపుంస్త్వంబునకై యీగణమ్ములో నెట్లుకెక్కొనందగియుండెడి? అమరనిఘంటువులోనే క్షత్రియవర్గమ్మున "శ్లో॥ మహామాత్రాః ప్రధానాని॥ అను శ్లోకమునొద్ద గురుబాలప్రబోధికాఖ్య వ్యాఖ్యలో "శ్లో॥ మహామాత్రః ప్రధానస్స్యాత్॥ అని పుంస్కాండమందువాపాలింతుఁడు చెప్పినందున మంత్రిప్రముఖులగు నధికారులర్థమగునప్పుడు ప్రధానశబ్దము పుంలింగముంగూడ నున్నది యని స్పష్టపఱుపఁబడియున్నది. అందున గీర్వాణభాషలోనే వైకల్పిక పుంలింగమునైన మంత్రివాచక ప్రధానశబ్దము తెలుంగువ్యాకరణమునఁ బాక్షికపుంలింగత్వమునకై మిత్రాదులలో నెట్లుపరిగణింపఁదగియుండు ఇటులుండ, మంత్రివాచక ప్రధానశబ్దము మిత్రాదులలోనిదిగాన, ప్రధానము, ప్రధానుఁడు—అను పుంనపుంసకరూపద్వయముండకతీరదనికన శాస్త్రిల

వారి భాషితంబు దూషితంబుకాక యెట్లుభూషితంబయ్యెడి? మంత్రి వాచకప్రధానశబ్దము సంస్కృతభాషలోనే పుంలింగమును నైయున్నందునఁ దెలుంగువ్యాకరణములోని మిత్రాదిగణంబులో గణియింపఁ దగినది కాదని యాలోచించియే నేను ప్రథమవ్యాసఘట్టమున "ప్రధానశబ్దము మంత్రివాచకమైనపుడు పుంలింగముంగూడఁ గలదందు రేని వైకల్పికముగాఁ బ్రధానమన్న రూపము తప్పక యవిధినొందవలసివచ్చును"— ఇత్యాదికముగా సిద్ధాంతార్థము ప్రకటించితిని. ఇట్లుచాటుచున్న నా వాక్యముకు బరిశీలింపక శాస్త్రులవారు పెడచెవిని బెట్టి పరిహాసపరిపాటి ప్రకటన పటిష్ఠకటూక్తులు సల్పుటసరియే కదా! నిశ్చితార్థమ్మును నివ్వటిల్ల జేయు నిఘంటుకారుల వాక్యములనైన నావాహానములోనికిఁ దెచ్చి కటాక్షించినట్లు కానిపింపరైరి "కాఁబట్టి మంత్రి యాలోచించినాఁడను" వాక్యమునకుఁ బర్యాయముగాఁ "బ్రధానుఁ డాలోచించినాఁడని" యనందగునే కాని "ప్రధానమాలోచించినాఁ" డని యెన్నఁడును ననందగదు. ఇటులు న్యాయమైన ఘంటాపథసరణి జగజ్జేగీయమానమై తేజరిల్లుచుండినను, శాస్త్రులవారు కంటకంబు, త్రోవంద్రొక్కుచు మంత్రియుసహితము 'ప్రధాన' మని వైల్పికముగా నపుంసకరూపయుతో నుండకతీరదని సాహసించిచెప్పుట యెంతయు వింతగానున్నది. ప్రధానుఁడు నపుంసకరూపముతో వికల్పకముగానుంట యొకవింతయే కాదు. శాస్త్రులవారు స్వప్రజ్ఞాపౌరుషప్రకర్షణంబున గట్టిగాఁ దలంచుకొన్నచో నతండునిత్యముగానే నపుంసకరూపముతో నుండితీరును. ప్రధానుని పాట్లే యట్టిస్థితికి మారినప్పుడు తక్కిన యప్రధానుని పాట్లువేఱే చెప్పనేల? ఇప్పటుకఁబట్టరాని సాహసికులగు శాస్త్రులవారి యకుంఠితకంఠారభటిని దలంపగా "శక్త్యగ్రహేణతద్బోధాభావాత్"—ఇత్యాదికమైన అజ ఉణ్ సూత్రస్థ శేఖరగ్రంథము నెత్తికొని "తథాచ, త్వద్దూషణమపరాద్ధే బోధాపుష్కలస్యకంఠాడంబరమనుకరోతి" యనినవిషయవ్యాఖ్యానసరణి

స్మృతిపథమునొందుచున్నది. ఇంకనిట్టియర్థముగల ప్రధానశబ్దము మిత్రా దిగణములోఁ బఠింపఁదగునని శంకింతురేని వినుండు. శ్లో॥ "క్లీబే ప్రధానం ప్రముఖః ప్రవేకానుత్తమోత్తమాః। ముఖ్యవర్యవరేణ్యాశ్చ ప్రబర్హోఽనవరార్ధ్యవత్" (౫౭) అని యమరసింహుని తృతీయకాండమున ముఖ్యశబ్దపర్యాయమైన ప్రధానశబ్దము నిత్యనపుంసకమని చెప్పబడినది. మఱియుఁ "కథంతర్హి - గోః కాణానుకేతుమాణస్యాశ్వపురుషాభ్యాం సహసమాసో భవతి। ప్రధానమత్రాశ్వదాగౌర్భవతి। భవతిచ ప్రధానస్యాపేక్షస్యాసమాసః" అనిన సమర్థసూత్రస్థపౌనఃపునిక భాష్యప్రయోగంబును నేతాదృశార్థక ప్రధానశబ్దనిత్యనపుంసకత్వంబునే యుద్ఘోషించుచున్నది. ఇట్టి ప్రధానశబ్దమే నిత్యనపుంసకమిత్రాదిశబ్దసాహచర్యంబున "సహచరితాసహచరితయోస్సహచరితస్యైవ గ్రహణ"మ్మను పరిభాషం జేసి గణంబులో గణియింపఁ దగియుండు విద్వాంసులలో వైయాకరణుండు ప్రధానము, లేక, ప్రధానుఁడు గుణవంతులలో వినయవంతుఁడు ప్రధానము లేక, ప్రధానుఁడు—అని యుదాహరణము కాన సంస్కృతభాషలోనే పున్నపుంసకమైన మంత్రివాచక ప్రధానశబ్దము మిత్రాదులలో నుండనేరదు. కాఁబట్టి శాస్త్రులవారి ప్రధానశబ్దవిషయప్రకటితగ్రంథము ప్రధానమయినదికాదు. ఇయ్యదియవిచారితరమణీయమనంబడు. ఇట్లు ద్వంద్వమాసపక్షమునఁ దీర్ఘ, ప్రధాన మనుష్యమాత్ర, శూద్రాంతరాదిబహుశబ్దములు మువర్ణకముతోఁ బరిహాసాస్పదమయిన భ్రష్టప్రయోగములు గావలసివచ్చును. కావున ద్వంద్వము దర్పణకు నీశ్వందగు తండ్రితాతలకాలము మొదలుకొని చిరకాలానుభవమున నీద్వంద్వమాసూత్రమును బట్టుకొని వేళ్లాడుచున్నదియని విచారింతురేని శ్లో॥ తాతస్యకూపో యమితి బ్రువాణాః క్షారంజలం కాపురుషాః పిబంతి" యను న్యాయమునఁ దండ్రిగారు త్రవ్వించిన కూపమ్మని యుప్పునీటిం ద్రావఁగా నెవ్వరొప్పుకొందురు? మఱియుఁ

దీర్ఘుఁడు (గురువు) దైవము జగద్రక్షకుఁడు శూద్రాంతరుఁడు, మనుష్యమాత్రుఁడు—ఇత్యాదులు మువర్ణకాంతములు కాక సర్వదా డుజ్వర్ణకాంతములే కావలయునన్నందులకు శాస్త్రులవారికిఁ దగినప్రయోగములు చూపవలెనఁట జగత్ప్రసిద్ధములై మనుష్యమాత్రు డెఱింగినయట్టిరూపములకు ప్రయోగాన్వేషణ మనవసరమనియే యెల్లర తాత్పర్యమయియుండునని నేఁడెఱంచెద శ్లో॥ "నామేవతేవరద వాంఛితదాతృభావం। వ్యాఖ్యాత్యతో న వహసే వరదానముద్రామ్। విశ్వప్రసిద్ధతరవిప్రవలప్రసూతే। రజ్జోపసీతవహనం హినఖల్వపేక్ష్యమ్॥" అను కువలయానందస్థ లోకోక్తి ప్రకారంబున జగమెఱింగిన బ్రాహ్మణునికై జన్నిదంబన్వేషింపనేటికి? కర్మధారయవృత్తి పూర్వోక్తమహాభాష్యాది ప్రమాణంబుల ద్వంద్వముకంటె నంతరంగమై శాస్త్రీయమగుటయే కాక డుజ్వర్ణకాంతములగు నేతాదృశలక్ష్యములయెడ మిక్కిలి సాధకమగుచున్నయది. "ముఖచంద్రునకు నాహ్లాదకతయమరెడు" ననువాక్యమున ముఖమునకుఁ జంద్రత్వారోపణద్వారమున నాహ్లాదకత విధించుచోఁ జంద్రునికి నాహ్లాదకత సిద్ధమని స్ఫురియించునటులు ప్రకృతమునను, నమహాత్ములకు నపుంసకత్వాతిదేశ ద్వారమున మువర్ణకమును విధించినందున నపుంసకములకు మువర్ణకము గల్గుట గమ్యమానమై వానియెడ మువర్ణకము సిద్ధమ్మగు ఇట్లు కర్మధారయ సమాసార్థమున దైవతము—ఇత్యాదినిత్య మువర్ణకాంత రూపములు సిద్ధించుటయే కాకుండ, ప్రధానుఁడు (మంత్రి), తీర్థుఁడు (గురువు), మనుష్యమాత్రుఁడు శూద్రాంతరుఁడు—ఇత్యాదనిత్య డుజ్వర్ణకాంత రూపమ్ములును సురక్షితంబులయ్యె. సూత్రమున ద్వంద్వసమాస మంగీకరింపఁబడియెనేని నపుంసకములకుంగూడ మువర్ణకము ప్రత్యేకముగా విధ్యుక్తమయ్యెడుంగాన "దృష్టాంతస్యాపితుపురుషారంభోనివర్తకోభవతి" యను స్థానివత్సూత్రాదులయందలి భాష్యకారవచనమ్ముసఁ

బూరోక్త లోకప్రసిద్ధప్రయోగంబులు భ్రష్టప్రయోగములు కాకతీర దు. కావున గ్రంథవిస్తరముతోఁ జాలును. మైత్రివాచకప్రధానశబ్దము గూడ మిత్ర్యాదిగణంబులో గ్రహింపఁబడి వైభాషికముగా డుమ్ము వర్ణకములతో ద్వైరూప్యమునొందఁదగిన సుబ్బారాయశాస్త్రివారి వాక్యంబు శోభిల్లనేరదని యెఱుంగునది. దైవము జగద్రక్షకుఁడు—అను ప్రసిద్ధవాక్యము నేనుజూపఁగా, దైవశబ్దవిశేషణములుమువర్ణకాంతములే యయి యుండవలెనన్నందులకుఁ దగిన గ్రంథోదాహరణములు శాస్త్రులవారిచేఁ జూపఁబడలేదు. ఇట్లు ప్రథమవ్యాసఘట్టార్థము మండనాహానంబయ్యె.

(సశేషము)

---

బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక

—:*:—

20—2—1918

(పూర్వపత్రికావ్యాసానుసంధానము)

కర్మధారయజయశ్రీభేరీభాంకరణము,

గీతిః॥ సత్కర్మధారయజయ। శ్రీభేరీభూరిభాంకృతీర్జయతాత్
అమహన్నపుంసకపదా। భ్రష్టాత్సాద్వంద్వ వృత్తిరస్తమగాత్॥

ఆ॥ గీ॥ గౌరపధీకల్లూర్య। న్వయవేంకటరామశాస్త్ర్యహంతుగదేయమ్
తాతాసుబ్బారాయా। ఖ్యశాస్త్రివరమభి మహామహోపాధ్యా
యమ్॥

(4 ఈద్వితీయఘట్టమునఁ బ్రతివాదులు ప్రయోగించిన మువర్ణక విధాయక సూత్రమందలి వివరణవాక్యము ద్వంద్వవిగ్రహ వాక్యము కానేరదని సమర్థింపఁబడియె. "అదంతములగు నమహాత్తులకును నపుం

సకలలింగశబ్దములకును మువర్ణకమగునని యర్థము” అని బ్రి॥సీతారామస్వామి శాస్త్రులవారు ప్రయోగించిరి. వైయాకరణమతమందు ద్వంద్వవిగ్రహవాక్యము ప్రథమాంతపదములతోడను, నానాచశబ్దములతోడ నుండవలయునని నేననేక ప్రమాణములు చూపుచుఁ బ్రకృతవాక్యము చశబ్దార్థకను శబ్దనానాత్వముతో నుండినను బ్రథమాంతములతోఁ గాక షష్ఠ్యంతములతో నుండినందున ద్వంద్వ విగ్రహము కానేరదని వక్కాణించితి. అంతట బ్రహ్మశ్రీ తాతాసుబ్బారాయశాస్త్రులవారు, సముచ్చయార్థము వివక్షితమగునపుడు సముచ్చీయమానార్థబోధక పదములు రెండింటిలోఁ దుదిపదమునకు మాత్రమే శబ్దసమభివ్యాహార ముండుంగాన “ఈశ్వరంగురుంచభజస్వ” అనునది సముచ్చయార్థ బోధకవాక్యమనియు, నితరేతర యోగార్థము వివక్షిత మగునపుడు సముచ్చీయమానార్థబోధకపదములు రెండిండికిని చశబ్ద సమభివ్యాహారముండుంగాన “ఈశ్వరంచ గురుంచ భజస్వ” అనునది యితరేతర యోగార్థబోధకవాక్యమనియు ప్రథమావిభక్తి నియమ మక్కఱలేదనియు దృష్టాంతముగా స్పష్టార్థము పైవాక్యద్వయమును జూపుచుఁ బ్రకృతంబున సీతారామస్వామి శాస్త్రులుగారు వివరించిన మువర్ణక విధాయక సూత్రమందలి వాక్యము చశబ్దార్థకనుశబ్దద్వయముతో నుండినందున నితరేతర యోగద్వంద్వ విగ్రహవాక్యము కాకతీరదని తొల్లిటి తమ వ్యాసమున సిద్ధాంతీకరించిరి. బ్ర॥ సుబ్బారాయశాస్త్రిలవారి మతము ద్వంద్వవిగ్రహము ప్రథమాంతములతోనే యుండవలెనన్న యంశములో నామతమునకు భిన్నమైనను విగ్రహములోని ప్రతిపదమును చశబ్దాంతము కావలెనన్న విషయములో మాత్రము నిస్సంశయముగాన భేదము నొందుచున్నయది అట్టి స్థితిలోఁ బ్రకృతవ్యాసమున శాస్త్రిలుగారిట్లు లిఖించుచుండిరి. “సిద్దేశబ్దార్థసంబంధే” అను వార్తికమును వివరించుచుంటిని “అథకంపునః పదార్థం మత్వాపవిగ్రహః క్రియతే సిద్ధే

శబ్దే అర్థేసంబంధే చేతి, ఆకృతి మిత్యాహ। అథద్రవ్యేపదార్థే కథంవిగ్రహః కర్తవ్యః సిద్ధేశబ్దే అర్థసంబంధేచేతి” అని యిట్లు మహాభాష్యమున (పస్పశాహ్నికము) “శబ్దార్థసంబంధే” అను ద్వంద్వమున విగ్రహము ప్రథమేతర విభక్త్యంతములతోడనే పైనిం జూపఁబడినదిగాన సమహాన్నపుంసక సూత్రమందలి సీతారామస్వామిశాస్త్రులవారి షష్ఠ్యంత ద్వంద్వవిగ్రహము సాధువేలకాదని గొప్ప శంక శాస్త్రులవారు చేయుచుండిరి. ఇట్లు మహాభాష్యాది గ్రంథములనుండి పెక్కు—వివరణ వాక్యములనును శాస్త్రులవారు నాయందుంచిన దయతో మహాభాష్యాది గ్రంథములతోఁ బాటిగా నాగుప్తార్థప్రకాశికా గ్రంథమునుండి కొన్ని యిట్టి వాక్యములను నెత్తిచూపిరి పూర్వోక్తములగు భాష్యాదులయందలి వివరణవాక్యములు ద్వంద్వవృత్తి ఫలితార్థమును స్పష్టపఱచునట్టి ప్రౌఢఫక్కి వాక్యములుగాని నిజమైన ద్వంద్వవిగ్రహ వాక్యములు కానేరవు అట్లే కాకుండెనేని, చార్థేసూత్రస్థ భాష్యాదులన్నిటికి నివిరోధము వాటిల్లు. కనుకనే “శబ్దార్థసంబంధానా, మన్నకై యటుషష్ఠ్యంతోక్తి నేత్తుకొని యుద్ద్యోతమునందు “శబ్దాశ్చ అర్థాశ్చసంబంధాశ్చే తిద్వంద్వః” అని చాంతప్రథమాంతములతోనే విగ్రహము వివరింపఁబడియె. ఇంతియకాక “శబ్దెఅర్దేసంబంధేచ” అనునదియే నిజమైన ద్వంద్వ విగ్రహమందు రేపి యప్పుడు మూఁడుసప్తమ్యంతములును మేళగింపఁగా మూలమైన వార్తికము ‘సిద్ధేషుశబ్దార్థ సంబంధేషు, అని బహువచనాంతములతో నుండకతీరదు. అందున మొదట, సమాహార ద్వంద్వము చేసికొని పిమ్మట సప్తమిలోనికి మార్చుకొనవలయును. మఱియు నిదియే నిక్కమైన ద్వంద్వవిగ్రహమన్నచో ద్వంద్వవిగ్రహములోని ప్రతిపదము తుదను చశబ్దముండవలయునని తీర్పుతీర్చిన శాస్త్రులవారి మతమునఁ బ్రకృతములగు తమవిగ్రహములన్నిటికిని నొక్కొక్క చశబ్దప్రయోగమే యుండుచున్నందున స్వవచన భంగమును

బాటిల్లెను. కాన వారును నియ్యవిఫలితార్థ వివరణవాకములే యన నలయుంగాని యన్యథా యనంగవలను పడదు. సీతారామస్వామి శాస్త్రులవారి ద్వంద్వవిగ్రహ వాక్యముగూడ నైవాక్యమున నోలెఫలితార్థవాక్యమేల కాఁగూడ దందురేని వినుండు "కాకవద్దేవదత్తగృహంపశ్య" అనునటులు చశబ్దద్వయార్థకనుశబ్దద్వంద్వమును గొప్పమానవాలుగాఁ జూపుచు ద్వంద్వవిగ్రహమని యుద్ధరింపఁగాఁ గనచను పన్నుకొని వేంచేసిన బ్ర॥శ్రీ సుబ్బారాయశాస్త్రులు వారు సీతారామస్వామిశాస్త్రులవారి వాక్యము ఫలితార్థకవాక్యముగాని యథాశాస్త్రీయమైన విగ్రహవాక్యము గాదని యిపుడొప్పుకొందురా? ఒప్పుకొనరు. కాఁబట్టి దుర్బలములైన యీదృష్టాంతవాక్యములు సీతారామస్వామి శాస్త్రులవారి పరిష్కృతవాక్యము ద్వంద్వవిగ్రహవాక్యమని సమర్థింపఁ జాలవు. అందున ననర్థకవాక్యమువలయునేకాని యియ్యది ద్వంద్వవిగ్రహ మగుటకు శ్రీసుబ్బారాయశాస్త్రులవారికిని నిపుడు వీలు పడదు. ఎదుటివారిని నెచ్చుగ శంకించుచుంటిమని మొగుబుజంబుల నుప్పొంగు నందడిలో శ్రీశాస్త్రులవారు తమచెప్పిన చశబ్దములనియమము కూడ స్వీయదృష్టాంతవాక్యములలో లేదన్న యంశము మఱచిరి కాఁబోలు!

(5) మూఁడవవ్యాసఘట్టమందు ద్వంద్వసమాసమున సాహిత్యము లేక, సముదాయముముఖ్యార్థమని సమర్థింపఁబడియె. అందులకు భాష్యకైయట శేఖరచంద్రికలాద్యనేకగ్రంథములలోని వాక్యజాలములెత్తి నేను నిదర్శనంబుగాఁ జూపఁగా నట్టిగ్రంథముల నెత్తికొని సమాధానము వ్రాయక శాస్త్రులగారు ప్రత్యేకవాక్యపరిసమాప్తి సముదాయవాక్యపరిసమాప్తి న్యాయములతో ద్విత్రపత్త్రిసముదాయపరిసమాప్తి నొందించిరి. మఱియు నేనుజతుర్థవ్యాసఘట్టమున బ్రత్యేకవాక్యపరిసమాప్తి సముదాయవాక్యపరిసమాప్తి న్యాయములంగూర్చి శాఖా

చంక్రమణంబుగా నుపన్యసించుచు ద్వంద్వ సమాసవిధానసమయమున జార్థమగు సముదాయార్థ మంగీకరింపక తీరదనియుఁ బ్రకరణాదిబలవశమున భోజనన్యాయాదుల సాహాయ్యముచేత యత్కించిత్సాహిత్యము నంగీకరించి సమన్వయించుకొనవలయుననియు వివరించి వీరికి ద్వంద్వమున ద్వితీయబోధనైన గౌణార్థము తప్పదని చెప్పితిని. కాన నిపుడు పునరుక్తులకును స్వవచనవ్యాఘాతములకును మాత్రము నేనుసాహసింపఁజాల. శాస్త్రులుగారు తమ వెనుకటివ్యాసములో "ఇతరేతర యోగాద్యాకారములనుదెల్పు భాష్యగ్రంథమునుజూడ శాబ్దబోధమునందు మాత్రమే సాహిత్యము భాసిల్లవలసి యున్నట్లు విశదమగుచున్నది. 'ఇతరేతర యోగేప్లక్షశ్చన్యగ్రోధశ్చేత్యుక్తే గమ్యతేఏతత్ ప్లక్షోపిన్యగ్రోధసహాయోన్యగ్రోధోపిప్లక్షసహాయఇతి, అను భాష్యగ్రంథమున 'గమ్యతే' అని చెప్పబడియున్నందున సాహిత్యము బోధలో భాసిల్లునదియే యర్థము తేలుచున్నది. ఇచ్చట జ్ఞానార్థకమగు 'గమ్' ధాతువు శాబ్దజ్ఞానమునే బోధించును" అని శాబ్దబోధమునందు మాత్రమేద్వంద్వమున సాహిత్యమొప్పుకొని యవధారణార్థముతోఁ గ్రియానిష్పత్తిలో లేదనుచుఁ జార్థేసూత్రభాష్యమునకు వ్యాఖ్యానము సల్పిరి. ఆశాస్త్రులవారే తమ ప్రకృతవ్యాసములో "కొన్ని వాక్యములందు ద్వంద్వసమాసఘటితవాక్య బోధితములగు క్రియల నిష్పతిలోఁగూడ సాహిత్యముండిన నుండవచ్చును" అని క్రియానిష్పత్తిలోఁగూడ సాహిత్యముండవచ్చునని కొంచె మనుగ్రహించుచున్నారు. ఇట్లు శాస్త్రులవారి పూర్వోత్తరగ్రంథ సందర్భవాక్యముల గాంభీర్యము గ్రహింప నలవిగాకున్నది.

(6) ఇఁకను నొరులవిప్రమాదములనుకొని దిద్దఁగాదయ చేసిన శాస్త్రులవారు తమ ప్రమాద ప్రయోగముల నెట్లు సవరించుకొనిరో కొంచె మాలోచింతము. "దుర్యోధనాద్యనులు శ్రీకృష్ణసహాయుము

గోరివచ్చిరి" యను శాస్త్రిలవారి ప్రయుక్తవాక్యములో సహాయపద స్థానమున 'సాహాయ్య' మనుట శాస్త్రీయమని నేననఁగా, నిట్లు వారు సెలవిచ్చుచున్నారు. "నేను వ్రాసినది తెనుఁగుభాష తెనుఁగుభాషలో సహాయశబ్దమును నేను పయోగించినట్లు ప్రయోగించుట సుప్రసిద్ధము" అని శాస్త్రీయమగుట కష్టమనియెంచి యీక్రింది తిక్కనసోమయాజి ప్రయోగముల నుదాహరించెదరు.

ఉ॥ వారలఁజూచి కేశవుఁడు వచ్చినకార్యము సెప్పుఁడన్న న

క్కౌరవనాథుఁ డిట్లనియెఁ గయ్యము సేయువగన్ సహాయముంగోరి

భార ఉద్యో. 1 ఆ

క॥ అనుటయు నాతఁడు వారికి ట్లను నేనురణంబునకు సహాయంబొల్లన్

భార. ఉద్యో 1 ఆ ఇత్యాదికములు

పైప్రయోగములు సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధము గానివి తిక్కయజ్వ మీఁదఁగూడ మోపుటకంటెఁ బైపద్యములో "సహాయతంగోరి" "సహాయతనొల్లక" అని లక్షణానుసారమున నున్నవియనుకొనుటయే యుక్తమ్మగు. ఒకవేళ ‹‹గజసహాయాభ్యాంచేతి వార్తికంబున సమూహార్థమునఁ దల్ ప్రత్యయము వచ్చునందురేని యయ్యది విభిన్నవిషయకమగు భావార్థకతల్ ప్రత్యయము నెట్లుభాధింపఁజాలు! "యువతీనాం సమూహః" అనునర్థమున నణ్ ప్రత్యయపుం వద్భావాదులుగలిగి యౌవన రూపసిద్ధియగునట్లే యువతేర్భావః అను నర్థభేదమునఁ "ప్రాతిపదికగ్రహణే ఇతి పరిభాషంజేసి యువాఖల తీతిసూత్రమునంబలె "హాయనాంత యువాదిభ్యోణ్" అనుసూత్రమునందును యువతిశబ్దము గ్రహింపఁబడి ‹యౌవనమ్, అనురూపము సిద్ధింపదా! కానశాస్త్రిలవారిచ్చిన ప్రయోగములు స్వపక్షసాధకములు కానేరవు.

**తమప్రమాదమునకు దోడుఁగా దిక్కన్న సోమయాజిగూడ నున్నాఁడనుట గ్రాహ్యంబుగాదు.**

మఱియు; "దుర్యోధనార్జునులు" అనిన శాస్త్రులవారి ద్వంద్వ ప్రయోగ ముండఁగూడదనియు అల్పాచ్తరమ్ అజాద్యదంతమ్ అభ్య ర్హితంచ—ఇత్యాద్యనేకశాస్త్రములచేత "అర్జునదుర్యోధనులు" అని యుండవలెననియు నేననంగా శాస్త్రులవారు రెండుసమాధానము లు గ్గడింపనెంచి మొదటిదానియందుఁ దమకేరుచింపక రెండవ యుత్తర మిట్లు చెప్పిరి. "లక్షణహేత్వోఃక్రియాయాః" "సముద్రాభ్రాద్ఘః" అను పాణిని నిర్దేశమువలన బూర్వనిపాతప్రకరణమున కనిత్యత్వము గానన నిత్యతావశమున ద్వంద్వములో మొదటదుర్యోధనశబ్దము ప్రయోగింపఁ బడియెనఁట శాస్త్రులవారి యిట్టిసమాధాన వాక్యము మిక్కిలిశోచనీ యమ్మగు లోకములో నెక్కడనైనను గవులు ఛందోభంగమునకు వె ఱచి యగతికగతిపక్షమునఁ దమరచించుమహాప్రబంధముల యందుఁ గ్వాచిత్కముగా శాస్త్రమును మీఱుటచూచు చున్నారముగాని మనముమాలెమాటాడు రెండుమాటలలోనే తీరికూర్చుండి యథేచ్ఛ ముగాశాస్త్రాతిక్రమణము చేసినరీతి కానిపింపదు. అట్లయినచో శాస్త్ర ప్రయోజనమేమి కనుకనే రఘు- 19 సర్గ 23 క్లృప్తపుష్పశయనాల్ల తాగృహః। నేత్యదూతికృతమార్గదర్శనః। అన్వభూత్పరిజనాంగ నా రతం। సోవరోధ భయవేపథూత్తరమ్

ఈశ్లోకములోని రెండవపాదమున దూతీశబ్దమును శాస్త్రముస దీర్ఘాంతముగాఁ బ్రయోగింపవలసి యుండఁగా ఛందోనిర్బంధమునం జేసి కాళిదాసుహ్రస్వాంతముగాఁ బ్రయోగించియుండ మల్లినాథసూరి యిట్లు వ్యాఖ్యలిఖియించెను. "అత్రజీబంతస్యాపిదూతీశబ్దస్య ఛందోభంగ భ యాత్ హ్రస్వత్వంకృతం" అపిమాషంమషంకుర్యాచ్ఛందోభంగంత్య జేద్గిరామిత్యుపదేశాత్"—ఇట్లు పూర్వకవులు విధిలేక ఛందోనిర్బంధ మునకులోనై యెక్కడనో శాస్త్రాతిక్రమణమునకుఁ గడ్డుఆశిపడిన ట్లున్నదిగాని విచ్చలవిడి వ్యవహరించినట్లులేదు. మఱియుఁ బూర్వపాని

త్ప్రకరణ మనిత్యమై పూజ్యులంజెప్పెడు పదములు శాస్త్రిలవారు చెప్పిన చొప్పున విచ్చలవిడిగాఁ బ్రయోగింపఁదగియుండెనేని, మరుదాదిదేవతలకంటె నింద్రుఁడు పూజ్యత్వాదులుగలవాఁడు గాన హాలంత్యములయిన మరుచ్ఛబ్దాదులకంటెఁ బరంబుగ నింద్రశబ్ద ముండనందున "నేంద్రస్యపదస్యేతి" (7—3—22) శాస్త్రమునకు నట్టి స్థలములందు నవకాశము లేదనియు, శివశిరోభూషణత్వాదిధర్మములచే నింద్రునికంటె సోముఁడు పూజ్యుఁడైనందునఁ దద్వాచకమైన సోమశబ్దము ద్వంద్వములో మొదటనుండి యనంతరమున నింద్రశబ్దము సంభవించినను, వృద్ధికంటె నంతరంగమైన యేకాదేశము ప్రథమమునఁ బ్రవర్తిల్లుటంజేసి యాద్యచ్చుదొరకుట సంభవింపదనియు, దానంజేసి వ్యర్థమైన నేంద్రస్యేతి నిషేధము "పూర్వోత్తర పదనిమిత్తకకార్యాత్పూర్వ మంతరంగోప్యేకాదేశో నేతిపరిభాషకు జ్ఞాపకంబగునని యుద్ఘోషించుచున్న యంతావత్పూత్ర విప్రతిషేధ సూత్రస్థ భాష్యకారవచనము ప్రలాపప్రాయంబు గాదే!! శాస్త్రిలవారు చెప్పినచొప్పున యథేచ్ఛముగ్గా మరుచ్ఛబ్దముకంటెఁ బరమున నింద్రశబ్దము ప్రయోగింపఁ దగుంగాన నేంద్రస్యేతి నిషేధశాస్త్రము సార్థకమగుచుండఁగా శాస్త్రవైయర్థ్యమూలకపరిభాషాజ్ఞాపకత యెట్లుసంభవించెఁ? పరిభాషేందు శేఖరగ్రంథము చూడఁ బ్రార్థించెద. కాఁబట్టి శాస్త్రిలవారి మాటలు సమన్వయించుచుండలేదు. అందునఁ బూజ్యార్థమూర్తి వాచకంబైన యర్జునపదమే ద్వంద్వమున మొదటఁ బ్రయోగింపఁదగి యపార్థమూర్తి వాచకమైన దుర్యోధనపదము చరమంబుగాఁ జేయందగినది. చేసినచో శాస్త్రిలవారు చదివినపూర్వోక్త భాష్యాదులన్నియు సార్థకంబయ్యెడి కైయటోపాధ్యాయుఁడన్న ప్రయోగము ద్వంద్వోపశమనవ్యాసమున నల సం॥ర భాద్రపదాశ్వయు జమాసాంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక (258) పొరట (20) బంతిలో శ్రీశాస్త్రిలవారే యుపయోగించినారు. గొప్పవారి ప్ర

యోగము ప్రమాదమై యుండదని యెంచి యితరులు నుపయోగింపఁ గానే యయ్యది గొప్ప తప్పయ్యెంగదా! అత్త చేసిన పనులకు నాఁడ్లు లేవు కాఁబోలు! శాస్త్రులవారు తమ కర్మధారయార్థమని పల్కాకు ప్ర యోగించినట్లే నేను నుపలక్షణ సందర్భములో బాగుండునను నభిప్రా యముతో "ఛత్రపూర్వీత్యుపలక్షణం, అలాపిడానా" మనునద మిద చోంత్యాదతి సూత్రస్థ శబ్దరత్నమునుండఁగా నుపయోగించితి. అయ్యే ది శాస్త్రులవారికి వేఱువిధముగాఁ దోఁచినచో శాస్త్రులుగారువోలె నేనును తమార్పణమును బరిగ్రహింపఁగా వేఁడుచున్నాడను ఉపన్యాస స్థాపను విమర్శించుట యావశ్యకము కాదని శాస్త్రులవారట్లులనవల దు. విమర్శకుల యర్హత లోకమునకుం దెలియుటకై యయ్యది మిక్కిలి ముఖ్యము. శాస్త్రివారన్నటు లిటువిమ్మట తామూరకుండిరేని వారి యుపన్యాసము లన్నియు నీమహ్య మాత్రో నోడఁబాటులేని శాస్త్రుల వారి మహామానసమందే యుండుఁగాత! మామానసంబును నూరకుం డుంగాత! వారియందలిగౌరవబుద్ధితోఁ జేరకొనిసేనువ్రాసితిగాని మహా ప్రచ్ఛన్నవృత్తితో నెక్కడను నధరస్పందము లే కుండఁగాలక్షేపము చేయుదమనుంట యే నాయభీష్టంబయ్యెడు. ఇఁకను బ్రతి వాది భయంకర రాఘవాచార్య వర్యోదాహృత శార్దూలవిక్రీడితము ప్రకటించి యూరకుండెద.

శ్లో॥ జేజీయాదమహాన్న పుంసక పదంద్వంద్వేన దుర్ఘోషిణా।
త్యక్త్వంసర్మితకర్మధారయ సమాసార్థేన సత్సమ్మతమ్।
స్త్రీలింగార్థవిశేషరూఢి సరణౌ స్త్రీవాచకాఖ్యపదం
శాస్త్రజ్ఞేస్సకలైస్సమాహిత తయాశ్లాఘాపదం ప్రాప్నుతాత్॥

ఇట్లువిన్నవించు విబుధేంద్ర విధేయుఁడు,

కల్లూరి వేంకటరామశాస్త్రి.

గోదావరీపత్రిక.

15—4—1919

(బాల వ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్వ్యమర్శన విదారణి.

(సమరాంగణ పార్థమూర్తీయము,)

---

ఆ. గీ॥ విబుధాదృతగుప్తార్థ। ప్రకాశికాదుర్వ్యమర్శన విదారణ్యా।
వాణీతూణ్యాఽగ్రణ్యా॥ సమరాంగణపార్థమూర్తి రిహాజాగర్తి.

శ్లో॥ వజ్ఝలాన్వయభూ గాంధ్ర। గవ్యంచద్గా్రి మ్యధర్మధీః।
సీతారామస్వామిశాస్త్రీ। నమ్యతే సవ్యపాణినా.

సుధీమణులారా:—

శ్రీ బాలవ్యాకరణ తత్సమపరి (39) సూత్రములోని యమహన్నపుంసక మనెడిపదము ద్వంద్వము గాని కర్మధారయము గాదనియు, నీ॰ పరి (57) సూత్రములోని స్త్రీలింగమను మాటకు స్త్రీవాచకమని వ్యాఖ్యానము సేయుట గూడదనియు, బ్ర॥ శ్రీ॥ వజ్ఝల సీతారామస్వామిశాస్త్రిల వారిచేత నాక్షేపింపఁబడి రాక్షస సం॥ భాద్రపద మాస మందలి (సంపుట4 సంచిక 7.) యాంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడెను మఱియు, బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిలవారికిని గ్రంథకర్తలకును (2) వత్సరంబులు పత్రికాముఖంబునఁ బ్రశ్నోత్తరంబులుజరుగఁగా ద్వంద్వముకంటెఁ గర్మధారయము భాష్యకారకైయటాదిగ్రంథకర్తల మతానుసారంబున మిక్కిలి శాస్త్రీయమగుటయేకాక మీఁదుమిక్కిలి లక్ష్యసంస్కారసిద్ధికిం గూడ సరసంబుగానుంటంజేసి శ్రీసుబ్బారాయశాస్త్రిలుగారు పింగళ సం॥ర భాద్రపదాశ్వయుజమాసాంధ్రసాహిత్య పరిషత్పత్రికలోని తమ

యుపన్యాసములో "మఱియు, నపుంసకములకు ముువర్ణకము వచ్చునని యు, నమహత్తులు నపుంసకములగు ననియుఁ గదా! శాస్త్రిలవారి పాదమునందలి ఫలితార్థము. అట్టి స్థితిలో నమహత్తులకు నపుంసకత్వాతిదేశద్వారమున ముువర్ణకమును విధించుకంటె నమహత్తులకు సాక్షాత్తుగా ముువర్ణకమును విధించుటయే యుచితమైయుండదా? (303,పుట)" యనిచల్లచల్లఁగాగా నంగీకారమును దెలుపుచు నూరకుండిరి. బ్ర॥ వ॥ సీ॥ రా॥ శాస్త్రిలుగారును భాష్యాదిగ్రంథములం దేకాక-తమకోరినరీతిని నహోబల పండితీ యాదిగ్రంథములందును స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకమనివివరించుట సమరాంగణ పార్థమూర్తి నౌనేనుజూపఁగా నట్టిచోటను రహస్యార్థములు తీయుటకు నెంతోయష్టకష్టములు ననుభవించిరి గాని తుట్టతుదకు స్వవచనవ్యాఘాతార్థములు సంభవించినందున మున్నిరతమే పూని యీమధ్య కాలమున ముక్కుమూసికొనవలసిన వారైరి కాఁబట్టి చాలకాలమునుండి వీరిసందడిలేక విశ్వంబు విన్నఁబోవుచుండెడి. ఇప్పుడు తిరిగి వీరు ముక్కున్నుందెఱచి విజృంభించుచు విశ్వోపకారార్థము గుప్తార్థప్రకాశికావిమర్శనముతోఁ గాళయుక్తి సం॥ర మార్గశీర్ష-పౌష మాసములయందలి యాంధ్రసాహిత్యపరిషత్పత్రిక నలంకరించుచున్నారుగాన వీరి వాచామృతధోరణి యెంతసరసంబుగానున్నదో యించుక యాలోచించుటకు మిమ్మును బ్రార్థించుచున్నాఁడను. ప్రకృత విమర్శనయత్నము కర్ణాకర్ణిగా నీవఱలోనే విష్ణుభక్తులవలన విన్నందున విమర్శనసమాప్తియంపు సమర్పింతమని భూతపూర్వమహాద్వంద్వోపశమనమ్మును నాసమరాంగణపార్థమూర్తియనును దనుకు బంపవలెదని విన్నవించుచున్నాఁడను.

సంజ్ఞాపరిచ్ఛేదము 3వ సూత్రము.

ఆర్యా॥ ఆద్యాయాః పంచాశద్వర్ణాః ప్రకృతేస్తు తేదశోనాస్స్యుః

సప్తత్రింశదిహాన్యే చానుప్రవిశంతి శబ్దయోగవశాత్॥ (ఆం. శ. చిం)
అప్పకవి. ద్వి. ఆశ్వాసము.

అనిన యప్పకవీయపాఠరీతిని లఘురేఫముతో యతిప్రాసములందు సర్వథా చెలిమిలేక గర్భశత్రువుగానున్న శకటరేఫము వర్ణసమామ్నాయమునందు వేఱుగా లెక్కించి యచ్చతెనుంగున (37) వర్ణము లను టయేనాశ్యయ్యంబని యీమూఁడవసూత్రమునొద్ద గుప్తార్థప్రకాశికలోఁ జర్చింపఁబడినది. ఈమతము చింతామణివ్యాఖ్యాతయగు యహోబల పండితునకుంగూడ సమ్మతము. ఇట్లుండ, వ॥ సీ॥ రా॥ శాస్త్రిలు గారు చిన్నయసూరిమతము గుప్తార్థప్రకాశికాకారులకుఁ దెలియలేద నియు లఘుయకారవకారములువోలె వర్ణసమామ్నాయమున నీయల ఘురేఫంబును వేఱుగా గణింపఁబడఁగూడ దని సూరిగారితాత్పర్య మనుచు వివరించుచున్నారు. కాని వీరివాక్యంబు సమంజసముగాఁ గనంబడదు. అలఘుయవలతో యతిప్రాసశ్లేషాదులందు నభేదబుద్ధి మె లంగుచున్న లఘుయ, వలకు వర్ణసమామ్నాయమునందలియ, వ, లలో నతత్త్వాదము చెప్పనలవియగుంగాని సర్వాంశములయందును రాక్షస కృత్యముతో లఘురేఫముపైఁ బగసాధించి పెచ్చురేఁగుచున్న యలఘు రేఫమునకు రేఫములో నంతర్భావంబు నొందువగా నెట్లు పొసఁగెడు?

స॥ పా॥ (సశేషము.)

22—ఏప్రియల్—1919
(బాలవ్యాకరణ)
గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విదారణి.
(సమరాంగణ పార్థమూర్తియము.)

---

(పూర్వపత్రికావ్యాసానుసంధానము)
నిజముగా నలఘురేఫమునకు లఘురేఫమునందు నంతర్భావ

మొప్పి గ్రహించుట శాస్త్రసమ్మతమయినచో, నీక్రింది శబ్దమ్ములందును గ్రహణంబు గలిగి దోషాపత్తి తటస్థించెడి.

(1) వరదవచ్చె—ఇట వరములనిచ్చునట్టి (దేవి) యనియర్థంబు గలవరదశబ్దములోని వర్ణసమామ్నాయ స్థలఘురేఫమున నలఘురేఫంబును గ్రహింపఁబడును గాన వరద=ప్రవాహము; అనిన శ్లేషార్థమును, ప్రకరణవశమునఁ జెప్పుట శాస్త్రీయమనవలసివచ్చును. (2) కరగుణము—ఇచట హస్తమర్థమిచ్చునట్టి కరశబ్దమునఁ గఱశబ్దమును స్ఫురియించి నలుపుగుణమనిన శ్లేషార్థముఁగూడ సమ్మతింపవలసి యుండును. (3) గిరిదాలెను—ఇక్కడఁ బర్వతార్థకమైన గిరిశబ్దమున గీచినగుండ్రరేఖ యర్థముగలగిఱిశబ్దమును దోఁచి యిట్టిశ్లేషమును శాస్త్రీయమనఁదగియుండు (4) రంకుచేష్టయులవడియెక—ఇట—“రంకుశంబరరౌహిషాః” అనెడియమరనిఘంటువున మృగవిశేషచేష్ట యని యర్థము చెప్పనెడల జారత్వార్థకమైనఱంకుశబ్దమును విషయమై దుర్బలప్రవర్తనయనినయర్థము తప్పక చెప్పకతీరకయుండెడి. కాఁబట్టి వర్ణసమామ్నాయలోని య, వ, లనంతర్భావము గలలఘు య, వ. లకుం బలెనే వర్ణసమామ్నాయస్థరేఫమున నంతర్భావము గలశకట రేఫమునకును యతిప్రాసశ్లేషలయందుఁ జెల్లుబడి యంగీకరింపవలసి యుండును. అందున రేఫశకట రేఫములకుఁ బ్రబలద్వేష మంగీకరించిన యాంధ్రవ్యాకరణకర్తల మతసిద్ధాంతము భంగాకులమయ్యెను. కాన “సప్తత్రింశ దిహాన్యే” యనినయప్పకవీయపాఠమే సర్వవిధంబులను సరసమ్ముగా నున్నయది “నైవహిలోకే నాన్యస్మిన్వేదేఽర్థప కారోఽర్థకారో వాఽస్తి” అనెడి యేఓఙ్సూత్రస్థభాష్య ప్రామాణ్యమున వేదశాస్త్రాదులయందుఁ బ్రయోగములేని ఎ, ఒ, వర్ణములకు హ్రస్వములకుంబలె వేదశాస్త్రములకు వెలుపలనున్న యీశకట రేఫమునకును వనాద్యవర్ణములలోఁ బృథక్కుగాఁ బరిగణనమే న్యాయ్యంబు. ఇంతియకాక, (1) కాఱియ

వేదశాస్త్రములయందుఁ బ్రవేశాధికారములేక వెలివేయంబడి యుండి తలక్షణమైన తలకట్టులేమి ననుభవించుచు నీయన్యకాలమున గేవల మును నాంధ్రపరిషత్తువలన మాత్రమే కొంచెముశుద్ధపత్రిక లభించినంత మాత్రమున విఱ్ఱవీగినదరయున నట్టి సర్వవ్యాప కరవర్ణమూర్తి తోవిరోధించి యాంధ్రములోని యీమిడిమిడిప్రవేశమునకే యెంతో యెగిరియెగిరిపడుచున్న శకటరేఫమే యధమమ్మని చెప్పనగుఁ గాని వేఱొకరీతి యెట్లుయుక్తమ్మయ్యెడి. హరిశబ్దమునకు నారాయణమూర్తి యుఁ గోతియు నర్థములున్నను నౌచిత్యమును విడిచి విష్ణునియెడ గోతియర్థమును గోతియెడ నారాయణార్థమును జెప్పఁదరముగునే? శివాశబ్ద మునకుసర్వమంగళా జంబుకములర్థములున్నను బార్వతీసందర్భమునజంబు కార్థమును జంబుకప్రకరణమ్మున బార్వత్యర్థమును జెప్పనొప్పునే? అ ట్లేరవర్ణమనినయర్థమిచ్చునట్టి యిఘప్రత్యయాంత రేఫశబ్దమే లఘ్వక్ష రమునెడ స్ఫురించెడు ఈశకటాకారవర్ణమునెడ రేఫశబ్దమునకు నీచ త్వార్థము సైతము గనిలక్షణముంబట్టి యొప్పుకొనకతీరదు కావున నిట్టి కలహాయమానప్రకృతికిఁ గలయిక కలలోనివార్త గాక యెన్నడేని యైకకంఠ్యమ్మమరునే నారాయణ నామమ్మనస్ఫూర్తింజెంది శ్రీకృష్ణు నిం బోలిన యాసురుచి రాక్షరమూర్తితో సురుచిర + అక్షరమూర్తి అనియు తే! జాతివైరమ్ము నొంది ప్రాసంబులందు విశ్రమములందుఁ దమలోనవేఱుగలిగి దేవదానవుల ట్లన దెనుగులందు మించి రేఫరకార ముల్ మెలఁగుఁగృష్ణ" అని యప్పకవి చెప్పినచొప్పున నీయరుచిశకటా ధమరాక్షస కళేబరమునకు నెట్టిలెక్కమ్ము సంఘటిల్లెడు దానంజేసి వేఁగురుసూరులు వచ్చి యీశకటరేఫంబును నలపాక భీమపాకంబుల నెంతో పుటపాకశోధితంబుచేసినను వాఙ్మయమున నేవిషయ మందును నైకమత్యమును నొందనిదీనిని వర్ణసమామ్నాయములోమాత్ర మెట్టు లెక్కింబు నొందింపఁగలరో తెలియ శక్యంబుగాకున్నయది. కాన విమ

ర్శకులయుక్తి సయుక్తికమ్ము గాదని యెఱుంగునది ఇటులలఘు య, వ, లతోడ నభేద బుద్ధింగాంచిన లఘు య, వ, లతో సర్వాంశములందును లఘురేఫముపై మచ్చరించెడి శకటరేఫమునకుం బోలికిచెప్పుట లజ్జాకరంబనందగు.

స।పా। (సశేషము

---

గోదావరీ పత్రిక.

29-4-1919

(బాలవ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విదారణి.

(సమరాంగణ పార్థమూర్తీయము.)

(పూర్వపత్రికానుబంధము)

---

ఇకను శకటరేఫమునకు నలఘులకారము (ళ) తోడ నిదర్శన మును జూపుచున్న యీవిమర్శకుల క్రింది వ్రాంత చర్చించెదముగాక

(విమర్శకుల వ్రాంత)

(1) "అలఘు (ళకారము) లకారమును బరిగణింపనపుడచ్చాంధ్రవర్ణసమామ్నాయమున నలఘు రేఫమును మాత్రము పరిగణింప నేలయని సూరిగారు తలంచి యుందురు ఇట్టియభిప్రాయము సూరిగారి కుంకుటచేతనే వారాచ్ఛికవర్ణ సమామ్నాయమునం జేర్పకునిన ళకారము వర్ణాంతరమనియు నలఘులకారముకాదనియు (చూ. బాల. సంజ్ఞ 18 సూము.) స్పష్టముగాం జెప్పియున్నారు.

(2) అచ్చాంధ్ర వర్ణసమామ్నాయములోని ళకార మలఘువు కాదను నభిప్రాయము చింతామణికున్నట్లు వ్యాఖ్యానము చేసియుండే

నందునఁ ద్వాద్వావరణకర్తలగు నప్పకవ్యహోబలపండితాదు లలఘుల
కారమువలె నలఘురేఫము నేల వర్ణసమామ్నాయములోఁ జేర్పరా
దనియు——తలంచి కావలయుఁ నలఘురేఫమును వర్ణాంతరముగాఁ
జేర్చుట యుచితమని వ్రాసిరి.

(ప్రత్యుత్తరము)

పైనింజూపిన (1) ప్రథమాంశము విమర్శకులొనర్చిన చిన్నసూరి మతానర్ణనము, (2) రెండవయంశము విమర్శకుల యప్పకవ్యహోబలపండితాద మతానర్ణనమును నైయున్నది. విమర్శకులు వ్రాసిన యీ పైయంశములు రెండును రెండువేలవరహాలు విలువచేయునని మమ్మాటికి జెప్పనొప్పును. ఈవ్రాతవలన వీరియసన్య సాధారణపాండిత్యకీర్తి యవనీమండలమ్మున నతివ్యాప్తింజెందుంగావుత. చిన్నసూరి మతోద్ధారమునలుపుచున్న వీరివ్రాఁత మొదటియంశమునకు భావమేమనఁగా:—వర్ణసమామ్నాయములోని ళకారము వర్ణాంతరముగాన యాలఘుళకారముగాదని చిన్నసూరియే స్పష్టముగాఁ జాటుచున్నందున, ఏళులు, పాళులు, తాళిళులు, ఇత్యాదులందలి యలఘులకారము వర్ణాంతరళకారమున గ్రహింపఁబడదుగాన వర్ణావళిలోని లఘు (ల) లకారమునసే, ఏళులు ఇత్యాదులందలి యలఘులకారము గ్రహియింపఁబడినట్లులు, ప్రకృతమునను వర్ణావళిలోని లఘురేఫమున శకటరేఫము గ్రహింపఁబడునని తలంచి యలఘురేఫమును (అ) ప్రత్యేకముగాఁ బరిగణింపక తెనుంగున (36) వర్ణములనియని సూరిగారి మతమును విమర్శకులు వివరించుచున్నారు. లఘులకారమున నలఘులకారము (ఏళులు) గ్రహింపఁబడినట్లు సూరిమతమున లఘురేఫముననే యలఘురేఫము గ్రహింపఁబడునని విమర్శకులు దృష్టాంతముఁ జూపుచున్నందున నిపుడు లఘ్వలఘులకార వర్ణాంతరళకారములభేదము కొంచెము విచారింపనవసరమయ్యెడి. కాన వినండొకరెద సూరిమతమున నెల

బలపండితుఁడంత వాఁడుంగూడ వర్ణాంతరళకారము లఘువుగాదని తెలి యంజాలక తనకవి శిరోభూషణమున "బెళుకుంజూపులు, తళుకుం జెక్కులు" అని యలఘుళకారమునకు నుదాహరణముగాఁ జూపియుబలపండితుఁడయ్యెంగదా! అక్కటా! అప్పకవియును సైతము "శతాంధాః కూపం ప్రవిశంతి" యనున్యాయంబునఁ బెరటిత్రోవంబడి యిట్లు(3) ఆశ్వాసమున వ్రాసుచ్చుచుండెడి

తే॥ పెద్దళాకును దనకున భేదమగుట। లళలకును భేదమట్లును గలుగుకతన। క్షితినిమూఁడవసరళంబు యతులఁ బ్రాస। ములనులఘ్వలఘులకారములకునిలుచు-లక్షణము.

ఉద్యో. పర్వ॥ క॥ కౌముకులుదా ననుగుబ్జపు। దళములు కరిఘటలు భటరథవ్రాతములుం। బుడమిచలింపఁగ ద్రుపదుఁడు। గడు వేడుకతోడుచూపెఁ గౌంతేయులకున్ —ఉదాహరణ పద్యము.

ఇట్లప్పకవి డకారములఘ్వలఘువులగులళలతో యతిప్రాసములందు నిలుచునని చెప్పి "దళము" లోనివర్ణాంతరళకార ములఘువుకాదని యెఱుంగకడకారములకుఁ బ్రాసముగా నుదాహరించె కావున నప్పకవియుంగూడఁ బప్పులోనే యడుగువేసెంగదా! అహోబలాప్పకవ్యాది గ్రంథకర్తలు చిన్నసూరి మతోద్ధారకులగు శాస్త్రీగారవతరించువఱకు జీవించినచో మేలుగానుండును యట్లుగాక దురదృష్ట వశమున వారు సందేహవిముక్తిం జేసికొనకుండనే దేహవిముక్తికిం బాలయిరి వెండియు విమర్శకుల విచారానుసారంబున నింకొక విశేషోక్తిగలదు (2) అప్పకవ్యహోబల పండితాదిమతమ్మున నచ్చాంధ్రవర్ణ సమామ్నాయములోని ళకారములఘువుగాని వర్ణాంతర ళకారముగాదఁట కావున నాగ్రంథకర్తలు లఘ్వలఘులకారములు వోలె వర్ణసమామ్నాయమున లఘ్వలఘు రేఫలును రెండు నునుండందగునవనియెంచి యచ్చతెలుంగున ముప్పదియేడు వర్ణములని లెక్కించిరఁట ఇట్లు వీరు "సాహసే లక్ష్మీః" అనుసా

మెత్తురలంకించుకొని లోననిముడ్చుకొనంజాలక ప్రాచీనమతోద్ఘాటన మ్మునులు నోరికివచ్చినట్లెల్లఁ గ్రక్కందొడంగిరి. అప్పకవ్యహోబలపండి తాదులమతమున విమర్శకులు చెప్పినచొప్పున వర్ణసమామ్నాయము లోని దివర్ణాంతరళకారముగాక యలఘువేయైనచో "ఏళులు, పాళు లు"—ఇత్యాదులందు, అచ్చిపరి 13 సూత్రాదులచే సాధింపఁబడిన యలఘులకారమే భాషాప్రపంచమున నివ్వటిల్లుంగాన, "బెళుకు, తళు కు"—ఇత్యాది శబ్దములందు నలఘువుగాని యీళకారము బ్రతుకుట కు గతిలేక మొదటికే మోసము వచ్చుంగాదే! "అహో మూలచ్ఛేదీత వపాండిత్య ప్రకర్షః." అనెడి మల్లినాధ సూరి వచనమల్లికయుల్లమ్మున నుల్లసిల్లెడిని. ఒకవేళ, అప్పకవ్యహోబలపండితులు సీతారామస్వాముల వారిదర్శనముచేసినయెడల నలఘువుగాని యీవర్ణాంతర ళకార మును దయాధర్మభిక్షముగా నొసంగుదురని యేరేనియందుమో! యిట వినుండు.

స॥ పా॥ (శేషము)

---

## 6-5-1919 గోదావరిపత్రిక

(బాలవ్యాకరణ)

### గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విదారణి.

(సమరాంగణ పార్థమూర్తీయము)

—— :o: ——

### పూర్వపత్రికాను బంధము.

స్వాములవారి బొజ్జలో మత్సర పదార్థసంపత్తి ప్రాజ్యంబుగాను నతిరసదార్థసంపత్తి పూజ్యంబుగాను నలరుచుండెడి. ఇంతియ కాక, **ఇంకొకసంపత్తి** మితిమీఱియున్నది. అదియెద్ది? అలఘువ్రులుగాని యీ

వర్ణాంతరళ కారాక్షరముల సంపత్తియే కాని అయ్యది యున్నను భ్రమ మూలకమైన యీసంపత్తిము లోకముల ముప్పునకు మూలంబగుం గాని యొప్పునకుం గారణముగాదని చూపి దీని నాబణీభూతనాణీభూతితో నీస్వాములవారి విమర్శనపుంగుట్ల బొంతనుండి డుల్లనేసి యంతము నొందించుచుంటిమిగాన నట్టియునర్థవర్ణసంపత్తి లోకోపకారులగు నప్పకవ్యాదులకుఁ జెప్పఁదగదు.

అథవా అప్పకవ్యహోబల పండితాదుల మతమునసిద్ధ (బెళుకు) సాధ్య ఏళులు ళకారము లుభయములును నలఘువులేయని విమర్శకులందు లేని యట్లయినచోఁ జిన్నసూరి తానును నటుసమ్మతింపక యలఘువుగాని వర్ణాంతరళకార మింకొకటిగలదనుటకుఁ గారణమేమి? లఘులకారజాతికిని నలఘులకారజాతికిని నుభయమునకుంగాక రెండింటికిం జెడి శ్లో॥ త్రిశంకోరుపభోగాయ నద్యారపిన భూరపి॥ యనునట్లు త్రిశంకుగతిగల వర్ణాంతరళకారమొకటి వర్తిల్లుచున్నదా ఏళులు॥ ఇత్యాదులందలి ళకారము నేరీతిని నేముఖమున నలఘూచ్చారణతోఁ బలుకుచుంటిమో బెళుకు ఇత్యాదులందలి ళకారంబును నలఘూచ్చారణతో బలుకుటకు నారీతియు నాముఖమును గాక ... వేఱొకటియుండు నేమో? విమర్శకులు సెలవిత్తురుగాక! (అచ్చి. ప. 13సూ.) ఇత్యాదిసూత్రములందు నలఘుశబ్దముచ్చరించి సాధింపఁబడిన (పాళులు) ళకారమే యలఘులకారమనియుఁ దక్కినచోట్ల (బెళుకు) నున్నసిద్ధళకార మలఘువుగాని వర్ణాంతరళకారమనియుఁ జిన్నసూరిభావమని విమర్శకులందు రేని, యయ్యది యవిమర్శనచనం బయ్యెడి, ఏలుకొలు, చెఱుచు, ఇత్యాదులందుఁ గ్రమముగా అచ్చి. ప. 7సూ. క్రి. ప. 81 సూత్రముల నలఘుశబ్దముచ్చరించి యలఘురేఫము సాధింపబడినదిగానఁ జిన్నసూరి మతమునన లఘులకారంబునకుం బోలె నలఘురేఫమునకును నట్టి సాధ్యశకటరేఫము లేన్యాయంబైన యుదాహరణములైయుండి, విఱుగు, మెఱుగు—ఇత్యాదులందలి శకటాకారరేఫమలఘువుగాని వర్ణాంతర

మనందగియుండు ఇట్లుండఁగా సూరిగారు స్వవచనవిరుద్ధముగా సంజ్ఞా. ప. 18 సూత్రమునొద్ద విఱుగు మెఱుఁగు శబ్దముల లఘురేఫమునకు నుదాహరణములుగా నేలయిచ్చిరో! విమర్శకులు ప్రత్యుత్తరమీయఁదగియున్నది. మఱియు విమర్శకుల మతానుసారమున లఘుళకారముచేత నలఘుళకారము గ్రహింపఁబడినను వర్ణాంతరళకారము (బెళుకు) వర్ణసమామ్నాయములో స్వీకరింపఁబడినట్లే స్వమతమున లఘురేఫముచే నలఘురేఫము (చెఱుచు) గ్రహింపఁ బడినను వర్ణాంతర శకటరేఫము (విఱుగు మెఱుఁగు) వర్ణసమామ్నాయమున దాతాచార్యముద్ర సామెతరీతిని గ్రహించుట తప్పక బలాత్కారమయి యుండెడి. అందున విమర్శకుల మతమున లఘుళకారమును లఘురేఫమును నలఘుళకారమును (సాళువు) నలఘురేఫమును (విలుకాఁడు చెఱుచు) వర్ణాంతర ళకారమును (బెళుకు. తళుకు) వర్ణాంతర రేఫమును (విఱుగు, మెఱుఁగు) దాతాచార్యముద్రరీతిని దప్పకధరింపవలసి యుండును. ఇట్లు పైనిఁజూపిన రీతిని సూరిమతమందుం గూడ వర్ణాంతరళకారమువోలె "భక్షితే౽పి లశునే నరోగశాంతిః" అను న్యాయమున వర్ణసమామ్నాయమున వర్ణాంతర శకటరేఫము సైతము (ఱ) గ్రహింపకతప్పదు గావున సూరిగారు 37 వర్ణములని యేలయనలేదో? వివరించుభారము విమర్శకుల తలపైదొఱగవలదయ్యె, ఆహా! సాక్షరా విపరీతాశ్చేద్రాక్షసా ఏవ కేవలమ్మను వచనరీతిని విమర్శకుల యమోఘమయవిపరీత జ్ఞానప్రభావమ్మున వర్ణసమామ్నాయమంతయు నలఘుభిన్నవర్ణాంతర ళకారమయమ్మును దాన్యశరేఫమయమ్మును గావలసివచ్చెంగదా!!

సుధీమణులారా! ఆంధ్రభాషను సాంఖ్యభాషఁజేయు విమర్శకులవితండావాదమతంబు పోనిండు. పరిష్కృతమ్మగు వ్యాకరణసిద్ధాంత **మత వ్యాపింపుఁడు.**

వర్ణసమామ్నాయమందలి ళకారమెల్ల వైయాకరణులు మతమందును నలఘుళకారంబని యంగీకరింపకతీరదు. అలఘువుగాని వర్ణాంతరకాలంబనుట యవిద్యావిలసితవచనంబు ఏళులు, పాళులు, తాళులు—ఇత్యాదులయందలి సాధ్యళకారమువోలె, అహోబలపండితుని చేత నుదాహరణములుగా నిడబడిన "బెళుకుం జూపులు, తళుకుం జెక్కులు"—ఇత్యాది శబ్దములందలి సిద్ధళకారమ్మును నలఘుళకారంబే కాని యందున విశేషంబేమియు లేదు. అథవా ఏళులు, పాళులు, తాళులని బహుత్వమందు డడలకాదేశమయిన ళకార మలఘువని సంజ్ఞాప 18 సూత్రమునొద్దఁ జెప్పటంజేసి, అచ్చి. ప. 13సూ. ఇత్యాదిసూత్రముల నలఘుశబ్దముచ్చరించి విధింపఁబడిన ళకారమే యలఘువుగాని యన్యమ్ముగా నేరదని వివదపడుచున్నవందురేని వినుండు. ఈసందర్భమున వృద్ధిరాదైచ్ సూత్రస్థమైన యీక్రిందిభాష్యము దృష్టాంతముగా నవసరంబుగావున నయ్యది నుదాహరించెద.

"కింపు నరిదంతద్భావితగ్రహణమ్। వృద్ధిరిత్యేవం యేఆకారైకారా ఔకారా భావ్యంతే తేషాంగ్రహణమ్। ఆహోస్విదాదైజ్ మాత్రస్య। కించాతః। యదితద్భావితగ్రహణమ్। శాలీయో మాలీయ ఇతివృద్ధిలక్షణశ్ఛోనప్రాప్నోతి॥—సూత్రమ్మున వృద్ధిశబ్దము నుచ్చరించి సాధింపఁబడిన యాకారాదులే వృద్ధిసంజ్ఞగలవియా? లేక సిద్ధసాధ్యములైన యుభయవిధాకారాదులును వృద్ధిసంజ్ఞికములా? యని శంకించుకొని, పాణినీయాది శబ్దములందును శాలీయ, మాలీయాదిశబ్దములందును వృద్ధాదితి సూత్రోక్తమైన ఛప్రత్యయము శాస్త్రీయముగావున సామాన్యముగా నాదైజ్ మాత్రమునకు వృద్ధిసంజ్ఞ చెప్పందగునని పైభాష్యమ్ము తెలుపుచున్నది. అందున గీర్వాణవ్యాకరణమున సిద్ధసాధ్యములైన యుభయవిధాకారాదులకును సామాన్యముగా వృద్ధిసంజ్ఞ గల్గినరీతిని నాంధ్రవ్యాకరణమందును సిద్ధసాధ్యళకారము లుభయములకును నన్వర్థ

మైనయీలఘుసంజ్ఞ శాస్త్రీయమైయుండు. కనుక నేయప్పకవ్యహోబలపండితాదులు దళము, బెళుకుంజూపులు — ఇత్యాదులయందలి సిద్ధళకారమలఘువుగానున్నందుల కుదాహరణము నిచ్చిరి. విఱుఁగు, మెఱుఁగు- ఇత్యాదులందలి సిద్ధశకటరేఫం బలఘువని బాలవ్యాకరణమందును (సంజ్ఞా ప. 13సూ) నుదాహరింపఁబడియె. అట్లు కానిచో, ఏళులు — ఇత్యాదులందలి సాధ్యళకారము వోలె (ఆచ్ఛి. ప. 13సూ) చెఱుచు — ఇత్యాదులందలి సాధ్యశకటరేఫమే (క్రి. ప. 81సూ) యుదాహరింపఁదగి యుండుంగదా విఱుఁగు, మెఱుఁగు ఇత్యాదులయందలి సిద్ధశకటరేఫం బలఘువని (సం. ప. 18సూ) యుదాహరించిన మాత్రమున, విఱుకాఱు (ఆచ్ఛి. ప. 7. సూ) చెఱుచు, పఱుచు, (క్రి. ప. 81. 82 సూ) ఇత్యాదులయందలి సాధ్యశకటరేఫం బెట్టులలఘువు కాకపోదో! యట్లే, ఏళులు, పాళులు, తాళులు — ఇత్యాదులయందలి సాధ్యళకారమలఘువని (సం. ప. 13 సూ) యుదాహరించిన మాత్రమున, బెళుకు, తళుకు, తళతళ, వళావళి — ఇత్యాదులయందలి సిద్ధళకారమలఘువు కాకపోదని ధీమంతులకుఁ గరతలామలకముగాఁ గనంబడుచుండు. సిద్ధశకటరేఫమువోలె (విఱుగు) సిద్ధళకారమ్మును (బెళుకు) సాధ్యళకారము వోలె (తాళులు) సాధ్యశకటరేఫమ్మును (చెఱుచు), నలఘువులని యన్యోన్యదృష్టాంతమునఁ దెలియుటకై యట్లు గ్రంథకర్త చే నుదాహరింపఁబడెను. మఱియు, నిట వినుండు. ఆచ్ఛి. ప. 13. సూత్రాదులు ఏళులు, పాళులు. ఇత్యాదులందు నలఘుళకారము (ళ) విధింపఁబడుచుండెంగదా!

(సశేషము)

స॥ పా॥

13—5—19 గోదావరీపత్రిక

(బాలవ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విచారణి.

(సమరాంగణ సార్థమూర్తియము)

పూర్వపత్రికానుబంధము.

—:o:—

వర్ణసమామ్నాయములోని వర్ణాంతళకార మలఘువు కాకున్న చో గ్రంథకర్తకుఁ బూర్వోక్తోదాహరణములందు విధింపఁడుటకై యలఘుళకార (ళ) మెక్కడనుండివచ్చినది? ఈవిధింపఁబడుళకారము (అలఘులకారము) కాశినుండి వచ్చినదా? గయనుండి వచ్చినదా? లేక యరబ్బీభాషనుండి యరుదెంచినదా? అథవా వర్ణసమామ్నాయములోని లఘులకారమనునే (ల) యాయలఘులకారము (ళ) గ్రహింపఁబడునని విమర్శకుల భావమందులేని యయ్యది రసాభాసభావంబు. ఆచ్ఛి. స. 13. సూత్రమున ర, డ, లతోఁ బాటిగా లకారమునకు నలఘులకారము (ళ) విధింపఁబడుచుండెడి. [illegible] కారమున స్వాయముగా నలఘులకారమునకు గ్రహణము న్యాయ్యంబయ్యెనేని, యీసూత్రమున బహుళముగాఁ బునర్విధానమేల యవసరంబగు? "శ్లో। విధిరత్యంతమప్రాప్తౌ నియమః పాక్షికే సతి" యనువచనమునఁ బ్రాప్తింపనిళత్వవిధించుట యావశ్యకముగాని స్వాయముగానే లకారముచే ళకారమునకు గ్రహణముసంభవించుచో విధాన మేల యవసరంబు? అందున, వర్ణసమామ్నాయములోని ర డ, లచె లఘులకారము (ళ) గ్రహింపఁబడుచున్నచో నట్టిమాట నుట్టిహాసాస్పదమో! యట్లే లఘులకారమున నలఘులకారము గ్రహింపఁబడు [illegible] వాక్యాది కాక, ర, డ, లకు ళకార [illegible] యురలను, గీర్వాణభాషయందుండబలేగాక, యీ

యాంధ్రమున లకారమునకు ళకారము వర్ణాంతరంబని స్పష్టపడుచున్నది. ఇందులకుఁ బ్రోద్బలకంబుగా నీయహోబలపండితీయ వాక్యంబు (పుట. 133 నీక్రిందనుదాహరించెద.

"నచైవంళకారస్యాప్యవర్ణాంతరత్వం తత్రిమహేశ్వరసూత్రానుక్తత్వా పిలడయోర్లళయో శ్చైకత్వమితి శాబ్దికశిఖావతంసై రుక్తత్వా, ల్లోళ ఇతివాల్మీకి భిరుక్తత్వా, ల్లరయోరుచ్చారణస్యలోకవేదయో ర్భిన్నత్వేన ప్రతీయమానత్వాచ్చ, నళస్యావర్ణాంతరత్వంవక్తుం శక్యతే" (1) లణ్ సూత్రమందలి లకారముగాక మాహేశ్వరసూత్రములందు ళకారము చెప్పఁబడకున్నను, ల, డ, లకుంబోలె, ల, ళ, లకు నభేదమని వైయాకరణశిఖామణులుచెప్పుటం జేసియు, (2) ప్రాకృతవ్యాకరణమున వాల్మీకిమహర్షి లకారమునకు ళకారము విధించుటంజేసియు, (3) లౌకికభాషయందును, వేదమందును ల, ళ, లకు నుచ్చారణము భిన్నముగా గోచరించుటం జేసియు, లకారముకంటె ళకారము వర్ణాంతరముకాదని చెప్పుట శక్యంబుకాదని పైయహోబల పండితీయ వాక్యమునకు భావము. ఇట్లు పైఁ బ్రాకృతవ్యాకరణమున వాల్మీకిముని లకారమునకు ళకారము విధించుటచేత లకారముకంటె ళకారము మఱియొకవర్ణమని (వర్ణాంతరము) యహోబలపండితుఁడు రెండవ కారణముగా నెత్తుకొనియె. "లోళః పైశాచ్యామ్" అనుసూత్రము నెత్తుకొని యీవిధిసేయుప్పుడవియు (2అశ్వా) కనంబడుచుచుండెడి. కాఁబట్టి ప్రాకృతభాషయందుబలె నాంధ్రమందును, ఆచ్ఛి. ప. 13. సూత్రమున లవర్ణస్థానమున ళవర్ణమును విధించుటంజేసి లకారముకంటె ళకారము మఱియొకవర్ణముగాని గీర్వాణభాషయందుంబలె వర్ణాంతరము కాక పోదనిస్పష్టపడుచున్నయది. దానంజేసి గీర్వాణమునఁ గళా, గళః—ఇత్యాదులు కలా, కలః—ఇత్యాదికముగా నైనటులు తెలుంగున, బెళుకు, కళుకు—ఇత్యాదులు బెలుకు, కలుకు—ఇత్యాదికమై

గాఁ గానేరవు. ఈరీతి తెలుంగున ల, ళ, లు పరస్పరమును భిన్నములని స్పష్టపడుచుండఁగా, వర్ణసమామ్నాయములోని లకారమున నలఘులకారమున (ళ) గ్రహింపఁబడుచున్నందున నదియే, అచ్చి. ప. 13—వ సూత్రమున నాదేశమై పాళులు, త్రాళులు—ఇత్యాదిరూపములు సిద్ధించుననియు "నాచ్ఛికవర్ణసమామ్నాయమునఁ జేర్పఁబడినళకారము వర్ణాంతర మనియు, నలఘులకారముగాదని (చూ. బాల. సం, 18 సూ) స్పష్టముగా సూరిగారు చెప్పుచున్నా" రను విమర్శకుల వచనంబ విద్యావిలాసమూలకమైన యవిమర్శన వచనముగాని వేఱొకటిగాదు. రఁ డ, లనుం బలె, (అచ్చి. పరి. 13సూ) లకారమునకును భిన్నమైన యలఘులకారము (పాళులు త్రాళులు) వర్ణసమామ్నాయములోని లఘులకారమున గ్రహించుట కుందేటికొమ్మును సాధించుటను వంధ్యాపుత్రునిం బరిగ్రహించుటను బోలుచుండి యొప్పుచుండెడి ఇట్టు లఘులకారమున గ్రహింపఁబడు నలఘులకారము వంధ్యాపుత్రీయ మానముగావున దానిదృష్టాంతము ననుసరించి వర్ణసమామ్నాయములోని లఘురేఫమున గ్రహింపఁబడు నలఘులరేఫమును గగనకుసుమాయమానమై వికాసమున విస్తరిల్లుంగాత! పైనిఁజూపిన చర్చచేత వర్ణసమామ్నాయములోని లఘులకారమున నలఘులకారమును (ళ) గ్రహించుట దుర్ఘటమనియు, ఏళులు పాళులు—ఇత్యాదులందు (అచ్చి. పరి. 13 సూ) విధింపఁబడిన ళకారము వర్ణసమామ్నాయములోని ళకారమనియు, నది యలఘువే యనియు స్పష్టపడుచుండెడి.

కాన లఘులకారమును (ల) నలఘులకారమును (ళ) బకిరించిన రీతినే, వర్ణసమామ్నాయమున లఘురేఫమునే కాక యలఘురేఫమును (ఱ) బరియుంపఁదగినదియని విశద మయ్యెడి. అటులు సూరి నేయకునికి యవిచారమూలకంబనందగు. ఇఁకను, వర్ణవేదములోని ళకారమలఘువే యైననో, "వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరముగాని

యలఘులకారము గాదని యెఱుంగునది" యనిన యీబాలవ్యాకరణ, ములోని బంతివలన వర్ణావళియందలి ళకారము వర్ణాంతర మనియుం నలఘులకారగాదనిముయునని స్పష్టపడుచుండ గా నీవాక్యమునకుగతియే మని యెవరైన నడుగుదురేని యవధానముతో నాలింపుఁడు. ఇటనతి దూరదర్శులయిన వ॥ సీ॥ రా॥ శాస్త్రులుగారు "దశరామశరాః" అనిన వాక్యమును "దశరా। మశరా" అని ఛేదముచేసినట్లే, ప్రకృతమున "వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరము, గాని, అలఘులకా రముగాదు' అని ఛేదముసేసి యాంధ్రభారతియొక్క పుట్టు ముంచిరిగాని వేఱొకటిగాదు పైనిం జూపినబంతియేకవాక్యమే యగుంగాని పెక్కు వా క్యములు గానేరదు. అవధరింపుఁడు. వర్ణసమామ్నాయములోని ళకార ము వర్ణాంతరముగాని యలఘులకారముగాదు— ఈవాక్యమున, కాని, కాదు—అను రెండుశబ్దములచేత రెండునిషేధములు చెప్పఁబడియె. 'కాని' శబ్దమలఘులకారమునకు విశేషణంబు. రెండునర్థములును గూడి భావస్వరూపమునే బోధించెడి. గావున, వర్ణవేదములోని ళకార ము వర్ణాంతరముగాని యలఘులకారము (ళ) గాదు. అనఁగా, వర్ణా తరమైన యలఘులకారమే యని యర్థమగును. విద్యాశాలలోని యీ యుపాధ్యాయుఁడు సుబోధకుఁడు గానిశాస్త్రిగాఁడు—అనఁగా సుబో ధకుఁడైన శాస్త్రియే యని నిషేధద్వయము సుబోధకశాస్త్రియగుట నిస్సంశయమని బోధించును. ఈయనవిద్వాంసుఁడుగాని బ్రాహ్మణుఁడు గాఁడు—అనఁగా, విద్వాంసుఁడైన బ్రాహ్మణుఁడే యను నిశ్చయమును దెల్పును. గ్రంథకర్తలు, ప్రస్తుతాంశము సర్వవిధంబులను నిషేధింపశక్య ముగానిది యనిబోధించుటకై నిషేధద్వయమును బ్రయోగించుట గల దు. ఉదా "శ్లో॥ స్ఫుటతా న పదైరపాకృతా న చ నస్వీకృతమర్థగౌరవమ్॥ —భారవి 2 సర్గ— అర్థగౌరవం ననస్వీకృతం, స్వీకృతమే వేత్యర్థః వై శద్య ప్రసక్తార్థగౌరవా భావనివర్తనార్థం నఞ్ ద్వయమ్ సంభావ్య

నిషేధనివర్తనే ద్వౌప్రతిషేధా వితివామనః॥ అనుఘంటాపథవ్యాఖ్యానము చూడుఁడు. మఱియు, "నామూలం లిఖ్యతేకించి న్నానపేక్షితముచ్యతే॥ నావిస్తీర్ణం నవిస్తీర్ణం మధ్యానా మసిబోధకృత్॥ ఇత్యాదినిషేధద్వయ ప్రయోగములు పెక్కులు గానంబడుచున్నవి. అట్లె "వర్ణసమామ్నాయమందలిళకార మువర్ణాంతరముగాని యలఘులకారము గాదు" అను ప్రకృతవాక్యమందును రెండునిషేధములున్నందున, నభావాऽభావము భావస్వరూపము గాఁబట్టి వర్ణాంతరమైన యలఘులకారమే యనిన యర్థమగును. తెలుఁగు వ్యాకరణమునకు వ్యతిరేకముగా గీర్వాణవ్యాకరణమున మాహేశ్వరసూత్రములలోని "లణ్॥ సూత్రమందుల కార మొక్కటియే గ్రహింపఁబడియె. స॥ పా॥

సశేషము.

గోదావరిపత్రిక

20—5—19

(బాలవ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విదారణి.

(సమరాంగణపార్థమూర్తియను)

పూర్వపత్రికానుబంధము.



లకారముకంటె ళకారము మఱియొకవర్ణము (వర్ణాంతరము) కాదనెడికారణమున ళవర్ణము మహేశ్వర సూత్రములలో గ్రహింపఁబడదయ్యె సంస్కృతమున లకారముకంటె ళకారము మఱియొక వర్ణముగాదు. గన్కనే "అఫాలీత్ అనురూపంబువోలె "అగాళీత్ అదాళీత్" అనుళకార ఘటితగళ దళ, ధాతురూపంబులును "అతోలాంతస్య" యనెడి పాణినీయసూత్రమందలి లకారగ్రహణమున వృద్ధి (ఆకారము) గలిగి సిద్ధించుచున్నవి. లకారముకంటె ళకారము వేఱు

వర్ణము గాదు గావుననే గీర్వాణభాషలో ళకారముతో నుచ్చరించు శబ్దములు, లకారముతో నుచ్చరించినను శాస్త్రబాధ లేదని పర్యవసానము తేలుచుండెడి. అట్లు గీర్వాణభాషలో ళకారము లకారముకంటె నన్యవర్ణము (వర్ణాంతరము) కాకుండుట సుప్రసిద్ధమై యుండఁగా, నా రీతిని ళకారము లకారముకంటె మఱియొక వర్ణము కాకుండుట యాంధ్రభాషను వలనుపడదని వర్ణాంతరత్వ నిషేధము నిషేధింపఁబడుచున్నది. అందున బెళుకు వళావళి—ఇత్యాదులు బెలుకు, వలావలి,—ఇత్యాది రీతిని బల్కంగూడదు. మఱియు నహోబలపండితీయము మాకు నవసరమైవిద్యాప్రియుంబని ప్రగల్భభాషణంబులఁ బ్రకటించుకొనెడి విమర్శకులు లకారముకంటె ళకారము వర్ణాంతరమా లేక, యవర్ణాంతరమా యని విచారణవల్సు ప్రకరణమున నున్న "ళస్యాఽవర్ణాంతరత్వం వక్తుంశక్యతే" 133 (పుట) యనిన వాక్యంబునైనను గందోయితోఁ గానరాకుండుట యెంతయు వింతగానున్నయది. పైసంస్కృత వాక్యముగూడ ళకారము (అలఘులకారము) వర్ణాంతరముకాకుండుట (లకారముకంటె) చెప్పశక్యముగాదని కేవలమర్థముతోడనే, వర్ణసమామ్నాయములోని ళకారము (అలఘులకారము) లఘులకారము కంటె వర్ణాంతరమే యనిన యవధారణార్థముతోఁ గూడి [illegible] యర్థ [illegible] చున్నయది. ఇట్లు వర్ణసమామ్నాయములోని ళకారము గీర్వాణ [illegible] యుండుంబట్టేఁ గాక లకారముకంటె వర్ణాంతరమనియు నలఘువనియు, నర్థము విశదమగుచుండఁగా విమర్శకులట్టి యేకవాక్యమును దమయుత్కుళిశాయమాండిత పాండిత్యోద్దండ కఠోర కుఠారంబుతో ఖండఖండంబులుగాఁ జేయుచుండెదరి "వర్ణసమామ్నాయపాఠేఁ జెర్యో-ని ళకారము వర్ణాంతరమనియు లఘులకారముగాద యునవి వెఱ్ఱిముఱ్ఱి గూర్ములు నేయుట [illegible] విరుద్ధ [illegible] పైసంస్కృత [illegible]
[illegible]

తళతళ నఖావళి,—ఇత్యాదులందలి ళకారమును యరలవాళాలఘువః అలఘువశ్చేతి ద్వేధా విదంతి జానంతి, వర్ణానాంగురుత్వం లఘుత్వంచోచ్చారణ గౌరవేణ తల్లాఘవేన చ భవతి. (147 పుట) యనిన యహోబలపండితీయవాక్యరీతిని నలఘూచ్చారణతో నుచ్చరించుచుఁ దమపిండితార్థము లుపయోగించి యట్టి ళకారము చిన్నసూరిమతమున నలఘువుగాదని యు గుప్తార్థప్రకాశికాకారులు సూరిమతభేదమును దెలియలేక యలత్యాముల ను లక్ష్యమును జేసిరనియు. హారాహారిగా నసూయాభూతావేశంబునఁ బోరుచుండి చిట్టచివరకు సిగపట్లగోత్రమునకు నాత్రపడియెదరు వీరిదుర్వ్యామర్శనదృష్టియందు సందర్భపాటు లక్షణమే కాని పించెమంగాని సందర్భపాటులక్షణ మేకోశంబునను గానరాకున్నది. సందర్భపాటేయున్నచో ళకారంబని పలుకుచు నలఘువుకాదందురే ళకారంబని గురూచ్చారణము సేయుచు నలఘువుగాదనుట "శ్లో॥ జిహ్వామేస్తినవేత్యుక్తి ర్లజ్జాయై కేవలం యథా నబుధ్యతేమ యాబోధో బోద్ధవ్యఇతితాదృశీ॥" అనెడి వేదాంత పంచదశీ పంచకోశవివేకమందలి వచనంబురీతిని మాటాడుచునోట నాలుకలేదనుట వంటిదై కేవలమును లజ్జాబ్ధిమజ్జనంబునకు మూలంబైయుండెడిది కొనఁ గాశీపురమందలి బ్రాహ్మణుఁడు విద్వాంసుడుగాని విప్రుండుగాఁడు—అనువాక్యమునకుఁ గాశీవాసి బ్రాహ్మణుఁడు విద్వాంసుఁడనియు విప్రుండుగాఁడనియు నర్థము చెప్పినచో బ్రాహ్మణుండని యొప్పుకొనుచు విప్రుండుగాఁడని నిషేధించుట యెంతయసందర్భము గానుండునో యట్లె వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరమె గాని యలఘులకారముకాదు—అనువాక్యమునకు వర్ణాళిలోని ళకారము వర్ణాంతరమనియు నలఘులకారము గాదనియు నర్థము చెప్పినచో ళకార (అలఘులకారము) మనియొప్పుకొనుచు నలఘువుగా దనుట యెంత యసందర్భముగానుండును. దానం జేసి, ప్రకరణసందర్భమున నుపమానవాక్యమున నిషేధ

ద్వయమని యెంచుకొని, కాశీవాసి బ్రాహ్మణుఁడు విద్వాంసుఁడు గానివిప్రుఁడుగాఁడనఁగా విద్వాంసుఁడైన విప్రుఁడేయని సందర్భార్థము చెప్పుకొన్నట్లు ప్రకృతవాక్యమందును ళకారము వర్ణాంతరము గాని యలఘులకారము గాదనఁగా వర్ణాంతరమైన యలఘులకారమే యన్ని ప్రకరణసందర్భార్థము తప్పక చెప్పుకొనవలయు, ఇట్లు వర్ణసమామ్నాయములోని ళకారము, గీర్వాణవాణియందుంబలెఁగాక లకారముకంటె వర్ణాంతరమనియు, నలఘువనియు స్పష్టపడుచున్నది ఈవర్ణసమామ్నాయమందలి యలఘులకారమే (ళ) ఆచ్ఛి: పరి 13 వ సూత్రమున, ఏళులు, పాళులు,—ఇత్యాదులందు విధింపఁబడినది. ఆ యలఘులకారము వర్ణసమామ్నాయములోనిదే కానిచోఁ బైయుదాహరణములయందు విధింపఁబడిన యలఘులకారము హిందీభాషనుండివచ్చునా? లేక, యరబ్బీభాషనుండివచ్చునా? కాన, బాల. ప్రకీ 24 సూత్రమునొద్ద గుప్తార్థప్రకాశికాకారు లలఘులకారమునకుదాహరణములు గానిచ్చిన తళతళ, వళావళిశబ్దములు, అహోబలపండితాదుల యుదాహరణములగు బెళుకు శబ్దాదులువోలె (148 పు) జగజ్జేగీయమానములగుచున్నవి. వర్ణసమామ్నాయములో లఘులకారముతోఁ బాటిగా నలఘులకారమువోలె (ళ) లఘురేఫముతోఁ బాటిగా నలఘురేఫంబును (ఱ) బఠితవ్యంబుగా నప్పకవి చెప్పిన చొప్పున (37) వర్ణములనందగు. అయ్యో! విమర్శకులు కొండంతయాశతో వర్ణింపనెంచుకొనిన సూరిమతము తెనుంగుబాసకు సౌరి (శనిగ్రహ) మతంబనందగి యింతలోనే యంత మొందెంగదా! వ॥ సీ॥ రా॥ శాస్త్రులుగారు సూరిమతమును వర్ణించుటవిని యీసూరియనుమాయూరియొక యలరుబోఁడి సూరి, హెచ్చరిల్లి తనమత మునుగూడ బాలవ్యాకరణంబున వర్ణించుటకై తన్ను సిఫారసుచేయుమని బలత్కారించుచున్నది. గ్రంథాది నిషే

గోదావరి పత్రిక

**27, మే 1919.**

(బాలవ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విదారణి.

(సమరాంగణసార్థమూర్తియము)

పూర్వపత్రికానుబంధము

:o:

బాల. సంజ్ఞ 4 సూ. వ్యాఖ్య

పైనుదాహరించిన సూత్రవ్యాఖ్యా విమర్శనమునందు ఇట్టి సిద్ధాంతము ననుసరించియే కావలయునను సూరిగారు బాలవ్యాకరణలోని సంజ్ఞాపరిచ్ఛేదము నందలి నాల్గవసూత్రమున కంకము పండము ననువాని నద్దుము ననుస్వారమునే నిల్పియు, జకారోదాహరణముగా 'పఞ్జి' శబ్దమునుదాహరించిరి జకారమునకు 'శార్ఙ్గము', మొదలగు నిర్వివాదములగు నుదాహరణములుండఁగానీ, 'పఞ్జి', శబ్దమునుదాహరించుట యనుస్వార పరసవర్ణము లైచ్ఛికములై యుండవలయునను స్వాభిప్రాయమును వెల్లడించుటకే యని తోచుచున్నది" యని యీవిధముగా విమర్శకులు వ్రాయుచున్నారు విమర్శకుల పైవాక్యమునకు భావమేమనఁగా:— "అనుస్వారస్యయయి పరసవర్ణః" అనుపాణిని సూత్రము తెలుంగున వక్తయిచ్ఛ ననుసరించి ప్రవర్తిల్లుననియు నందుననే పరసవర్ణ ప్రసక్తి లేక నిర్వివాదముగా నున్న శార్ఙ్గాదిశబ్దములు గాక పరసవర్ణమైన జకారముతోఁ గూడిన పఞ్జిశబ్దంబును బరసవర్ణమైన ణకారమును వీడి పూర్ణానుస్వారముతోడనే యుండిన కంఠపండశబ్దములును బాలవ్యాకరణమున నుదాహరింపఁబడియె ననియు, సూరిగారి తాత్పర్యము వివరింపఁ బడుచున్నయది. విమర్శకులు బిందుపరసవర్ణములు లేనంతన శార్ఙ్గశబ్దము నిర్వివాదస్థలమని నిశ్చయించిరిగాని యీస్థలమే గొ

ప్రవివాదమునకు నాస్పదమై ఘట్టస్థలంబుగాఁ గానిపించెడి. శాస్త్రదృష్టి నాలోచింపఁగా శార్ఙ్గశబ్దమందును ననుస్వార పరసవర్ణము లవశ్యకర్తవ్యములగుచున్నవి.

"శౄహింసాయామ్" అనెడి శౄధాతువుకంటె "శృణాతేర్హ్రస్వశ్చ" యనిన యుణాదిప్రథమపాదస్థ సూత్రమునఁ గన్ ప్రత్యయమును, దానికి నుడాగమమును జేయఁగా నకారస్థానమున ననుస్వారమును బరసవర్ణమున గలిగి శృఙ్గశబ్దమగును అట్టి శృఙ్గశబ్దముననే సాధ్యమగునన్న పక్షమందును శార్ఙ్గశబ్దమున ననుస్వారపరసవర్ణము లావశ్యకములై యుండు అథవా "గన్ శకునౌ" అనిన యుణాదిసూత్రమున శౄధాతువుకంటె గన్ ప్రత్యయమును నుడాగమమును రాఁగా శార్ఙ్గశబ్దమగునన్న యీరెండవపక్షమందును నుడాగమన కారమునకు ననుస్వారమును బిమ్మటఁ బరగకార సవర్ణమౌ ఙకారమును విధిగా రాకతీరవు. ఇట్లు శార్ఙ్గశబ్దమున ననుస్వారమునకును బరసవర్ణమునకును నిమిత్తమగు గకారము గణియింపదగి యుండఁగా నట్టి గకారము విమర్శకులనోటికి బట్టరాని యంతకారము గాఁగఁ జుర్రుమనియెంగాఁబోలు! నయ్యదివిడువంబడినది. "శ్లో॥ చాపశ్శార్ఙ్గంమురారేస్తు శ్రీవత్సోలాంఛనం మతమ్॥ అను నమరనిఘంటువును జదువుకొని మెదు బాలుర నోరికిసైతము శార్ఙ్గశబ్దములోనిగకారము కారముగా గనంబడక పట్టఁపగియుండగా వీరి నోరామాత్రపుఁగారమును నోర్వలేదే వీరినోరొక్కటే కారమోర్వలేదననేల? వీరియొక్కకన్నను విద్వాంసుల సం"స్కారము"లోఁగార, మిమిడియున్నందున గిల్లిజగడంబున (గొప్పగర్వమున) జగడంబును జెచ్చుచు నట్టికారము నేమాత్రమును నోర్వఁజాలదు. కాని వీరినోరు పరవంచనావాక్కుల కారమును (కటుత్వము) నపశబ్దంబుల కారమును నెంతేని సహించును వీరితత్త్వంబున కయ్యదిపడ్డది. తత్త్వమునకే పడదు

న్నచో వర్ణభ్రష్టమై దుష్టమైన శార్జ్గ శబ్దముచ్చరించి యయ్యాది యను స్వారపరసవర్ణాములు రాని నిర్వివాదస్థలమని వీరెట్లునిశ్చయించిరి. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రమాదపడి యాంధ్రపత్రికలో (30—3—19) దిద్దఁబడు తప్పులలో నీశబ్దము కానంబడదు. ఇట్టియంశము వీరి సీతారామనామమునకు వన్నెదెచ్చుచున్నది. తొల్లి సీతారామస్వామి యీశ్వరకోదండమును గారవమున నెన్నకయనఁగా, లక్ష్యము సేయక నష్టము సేసిరి. ఇప్పుడో! యాసీతారామస్వామి యవతారముగు శాస్త్రులుగారు విష్ణునిధనువౌశార్జ్గమును గారవమున (గ + అరవము=గకారధ్వని) గణింపక భ్రష్టము సేసిరి. ప్రచ్ఛన్నలౌనవతారమూర్తు లిట్లు వరకపాటు గాఁబడియుందురు. గిల్లి తెచ్చుకొనిన కలహములందుఁ దమయోగ్యతం బ్రకటించుకొందురు ఒకవేళ, "విష్ణోరర్ధం మహాభాహుం కౌసల్యాజనయత్సుత" మ్మనురామాయణరీతిని విష్ణ్వంశమా సీతారామస్వామి పూర్వావస్థలో స్వధనువౌ శార్జ్గమునే యిపుడు భ్రష్టము సేసికొన్నచోఁ జాలుమూలలేక తనపట్టుకొమ్మనే కొట్టుకొన్నవారగుదురని యేతైన సందురేని, తన్నామక శాస్త్రులుగారు ప్రకృతమున నట్టివారేయని దృఢముగాఁ జెప్పందగుదురు. వినుండు. వీరు "అక్కందళితేత్యత్ర అను స్వారన్యయయి పరసవర్ణ ఇతి సాధుత్వమూహ్యా" మ్మని యిట్లహోబలపతి వ్రాసినట్లు స్వవాదవిరోధియా. బిందువుతో వ్రాసెదరు. అహోబలపండితీయములో (218 పు) బిందుం ప్రవదంతి తంక్వచిత్కేచి" త్తను సూత్రము వివరించుతఁజని "అక్కందళిత" యని ముద్రింపవలసియుండఁగా, ముద్రాదోషమునఁ గకారద్విత్వము వీడి, "న" దకారముల సంయోగముతో ముద్రింపఁబడియె. కానిబిందువుతో నుండ లేదు. ఈప్రయోగము "ప్రస" తల ష్టిల్లుత్సాహ మొందం ధనయుజ నపతి భ్రాణమర్ధించి యక్కంగ। దళితాపత్యాను రక్తిస్వహా భువనుగ

తిక" అను రాఘ. పాం 2 ఆ 12 పద్యములోనిది. భారతార్థమున, దళితాపత్యానురక్తిక=పోగొట్టఁబడిన పుత్రవాత్సల్యముగల, అక్కన్ అక్కఁయగాకుంతిని (మాన్ని మాద్రి తానే సహగమనము సేసెననియర్థము) రామాయణార్థమున, అక్కన్దళితాప...కిక=ఆచిగిర్చిన పుత్రవాత్సల్యముగల, మహీపున్=దశరథుని (అనుసరింప నీకవిశ్వామిత్రుఁడు రామలక్ష్మణులందోడ్కొని చనియెనని భావము) భారతార్థమున "అక్కక" అను ద్వితీయాంత ద్రుతమునకు దళితశబ్దదకారసరళము పరముకాఁగఁ గొందఱమతమున బిందువురాక నకారపుఁ బొల్లేయుండునని వివరించుచు నహోబలపతి రామాయణార్థమునంగూడ "కన్దళిత" యను సంస్కృతపదమున "అనుస్వారస్యేతి" సూత్రమున నకారమువచ్చుఁగాన రెండర్థములయందును నకారపుఁబొల్లేకాని బిందువుకాదనియె ఇట్లుండనీకలహాశనులు ప్రతిపక్షనిర్వాహకమును స్వపక్షనిర్వాహకమును నగు బిందువుతో "అక్కందళిత" యనివ్రాసిరి. బిందువేయున్నచో భుక్త్వపం తమితిన్యాయమున నింకశంకయే లేదు. ఇది జుట్టు చేతికిచ్చున్యాయమున కుదాహరణముగానుండె. కాని "శార్ఙ్గమును" గారవమున(గ+ఆరవము=గకారధ్వని) నెన్నక భంగపఱచిన యీసీతారామస్వాములు శృంగభంగమొందుటయేకాక యిటబిందువుపెట్టితనపట్టు కొమ్మకొట్టుకొన్నఫలమను భవింపరే స్వపక్షబాధకమెఱుంగవియీవిమర్శనవిదగ్ధత యిట్లుజ్వలించెడి. ఇట వ్యర్థమానీసున్నవిమర్శన జ్ఞానమునేక సార్థకమగుంగాత॥ సత్యమెన్నఁగాఁ బరసవర్ణమాంధ్రమునఁ జెప్పవలదు. అనన్యసాధ్యఫలములేదు. మీఁదుమిక్కిలి ద్వ్యర్థికావ్యముల బాధకమగు. కంఠశోషయేకాని దాని యభావమునఁ బ్రయోగబాధ చూపఁబడదయ్యె. అహోబలపండితుఁడును "అక్కందళిత" అనుచోట సవర్ణాదిటీకా ప్రమాణమున బిందువంగీకరించె. అందువలనే రాఘవపాండవీయ వ్యాఖ్యాతయుట బిందువేసాధించె. [illegible] దకారద్రుతాగమునకు గతి

యేమనఁగా వినుఁడు. బిందుపూర్ణములు నడుమనున్నను హల్లులకుముం దున్నను, వర్గాక్షరము సామాన్యులచేఁ దెలియఁబడకుండు నంత పరస వర్ణాక్షరమే వినఁబడును. దీనికిఁ బ్రకృతమున గకారముపిడిశార్ఙ్గశబ్ద ములవలె న శాస్త్రులుగారే ప్రమాణము. అందునఁ బజ్జీ-శబ్దము బాల వ్యాకరణమున నెట్లు వ్రాయఁబడెను. ఐనను ఒకటి రెండుదాహరణ ములు "నైకముదాహరణ" మితిభాషోక్తిని విధిహేతుగావు. స్త్రీత్వాబ హుతే" ఇతిసూత్రీయవ్యాఖ్యానోదాహరణపంక్తియును చూడుఁడు. పజ్జీ-శబ్దమాప్టి నిఘంట్వాదులలో బిందువుతో నున్నది. శాస్త్రములందు నైచ్ఛిక విధియథా ర్థప్రసిద్ధము. దొంగశంకశబ్దములలోని క, గలుకంఠ్యములైన నేకజాతీ యములు గావుగానఁ బ్రాసములు లక్షణరీతిని గానేరక "దొంగ, శంక" లట్లేయుండును. విమర్శకులు పరసవర్ణాభావమునఁ గవిప్రయోగబాధ చూపునట్లేని యట్టి దానిగిఖండించి యనాద్యంతమై బ్రహ్మస్వరూప మగు బిందువునే యుంచుటచే పరసవర్ణమును బ్రాణద్రోహ మెదంగాక! విమ ర్శకులెల్ల స్వయంకృతలక్ష్యదోషములకు వ్యాకరణకర్తలక్ష్యమార్పణ వేఁడి ఉద్ధరించు ముచ్చటతీరుదాఁక నెదిరింతురుగాక!

ఇది ద్వితీయాంశము. స॥ పా॥ సశేషము.

గోదావరి పత్రిక

3—6—19

(బాలవ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విదారణి.

(సమరాంగణ పార్థమూర్తీయము.)

పూర్వపత్రికానుబంధము.

బాల. సంజ్ఞ. 10 సూ. వ్యాఖ్య.

---

ఆ॥ ఎందునేటఁగారె యితరు లేమనసుతో
దారసంగసుఖము తప్పఁద్రోచి
తకటపాండురాజ చనశమోన్న వైశాతి
కూర్మి కదశరథేశ కుమారోయ.

రాఘు. పాం' 1 ఆ. 28 ప.

ఈపద్యములో భారతార్థమున "పాండురాజ" యని తత్సమ మహాసంబుద్ధ్యంత పదము. ఈయర్థమున బాలవ్యాకరణాదులం జేసియుఁ, బండితపామర సాధారణ్యానుభూతమా నుచ్చారణ ప్రసిద్ధిం జేసియు, రాజ శబ్ద జకారము దంత్యమనక తీరదు. రామాయణార్థమున "అజయాశ" మనిపదచ్ఛేదమున నజమహారాజకీర్తి యన్నయర్థముకాన దాలవ్యమని యవశ్యమును సమ్మతింపక తప్పదు. ఉభయవిధోచ్చారణములో జకారములను బద్యపాఠసమయమున నేకీభవింపఁ జేయుట దుర్ఘటము. నివర్తనార్థమిట్లు క్రిందనిట్లు వ్రాయఁబడు చుండెను. "విభాషాఛందసీ" తిస్వరసూత్ర శేఖరమున నుదాత్తాది స్వరములు వేదమందుంబలె లౌకిక భాషయందును గూడ నున్నట్లింతని నిర్ణయించి "శ్వేతోధావతి" యిత్యాది వాక్యము గను నర్థభేద మగు కేసి స్వరోచ్చారణభేదముల్నందు న శ్లేషార్థసంపదనుఘటిల్లదని శంకించుకొనియెను.

అనఁగానిట, "శ్వా=శునకము, ఇతః=నిచటనుండి" యనునర్థమునఁ బడద్వయము. "శ్వేతః=తెల్లని" యను నర్థాంతరము నేకపదము.

1. అర్థమునందు శ్వన్నుక్షన్నితి సూత్రమునఁ గనిన్ ప్రత్యయాంతమై యేకాచ్కంబౌశ్వశ్శబ్దము నిదంతముగాన నుదాత్తము. ఊడిదమితిసూత్రమున "ఇతః" అను పదమంతోదాత్తము. "శ్వా + ఇతః= శ్వేతః=కునకము దీనినుండి" యనునర్థమిచ్చునట్టి "శ్వేత" యనెడి విశిష్టశబ్దము "ఏకాదేశేనేతి" సూత్రము ప్రవర్తిల్లఁ బాక్షికసర్వోదాత్తము.

2 అర్థమునందు శుక్లార్థకమౌ శ్వేతశబ్దము ఘృతాదిగణస్థముగాన నంతోదాత్తమై యాద్యనుదాత్తమగుచుండె. ఇట, ఎట్టిదియేది పరుగెత్తుచుండు? నన్నుప్రశ్నలు రెండింటికిని "శ్వేతోధావతి" అనువాక్యములోని "శ్వేత" ఇతిశబ్దమొక్కటియే ప్రత్యుత్తరము కాఁజాలెదు. ఎట్టిదియను ప్రశ్నమునకు "శ్వేతః=తెల్లనిది" యనియు, ఏదియనుప్రశ్నమునకు "శ్వేతః=శ్వా, శునకము, ఇతః, ఇక్కడనుండి" యనియుఁ బ్రత్యుత్తరములని భావము. ఇట్లుండఁగా, శుక్లార్థమందునంతోదాత్తోచ్చారణమున భిన్నమగు శ్వేతశబ్దమునకును, శునకాద్యర్థమున సర్వోదాత్తోచ్చారణమున నన్యమగు 'శ్వేత' ఇతి శబ్దమునకును యౌగపద్యముగా నుచ్చారణము శక్యముగానందున నర్థద్వయమును బొందుపడదని శంకించుకొని "ఏకశ్రుతిస్స్వర సర్వనామ" యను దాండినాయనేతి సూత్రస్థభాష్యమున నట్టిశ్లేషార్థకశబ్దముల నేకశ్రుతితో నుచ్చరించినచో, సర్వోన్యాభిన్నములౌ సర్వస్వరములు నట్టిమేక శ్రుతిలో నిమిడియుండుఁగాన స్వరోచ్చారణ భేదమునసైన శ్లేషార్థబాధ లేదని నిశ్చయించి, యందుననే కథంపున రేకేనయత్నేనో భయంలభ్యమిత్యాహ "కథం? ద్విగతాలపి హేతవోభవంతి. తద్యథా:—ఆమ్రాశ్చసిక్తాః పితరశ్చప్రీణితా ఇతి। తథావాక్యానిద్విష్ఠానిభవంతి। శ్వేతోధావతి, అలం

బుసానాంయూతేతి" యని పస్పశాహ్నికాంతభాష్యము సంగతమగుచు
న్నది యని వక్కాణింపఁబడియె. ఇట్టి యేకశ్రుతింగనియే॥ ఆ॥ గీ॥ కే
దారపోషణరతాః। కాశీతలవాహినీగంగా। కంసంజఘానకృష్ణః। కంబల
వంతంనబాధతేశీతమ్॥ ఇత్యాదులయందలి శ్లేషార్థము సమంజసముగుచు
న్నది. తెలుంగునందును గాకుస్వరాది శ్లేషస్థలములు
నేకశ్రుతిన్యాయంబని వ్యాఖ్యాతలభావము, ఇట్లు
'శ్వేత' అను శబ్దములో వర్ణములదంతాదిస్థానభే
దమున్నైన యుచ్చారణ భేదమొకమాత్రమును లేకున్నను, స్వరోచ్చా
రణభేదమున నే యింతచర్చించి యిట్టి శ్లేషస్థలములలో భిన్నములగు
స్వరముల యుచ్చారణమాని యేకశ్రుతితో నుభయార్థములను బో
నంగునని భాష్యతాత్పర్యము వర్ణింపఁబడినది. స్వరోచ్చారణమా
త్రభేదమున నే శ్లేషసరిపడదని యింతచర్చ జరిగినపుడు దంతతాలవ్యాద్యు
త్పత్తిస్థానములు వేఱైన వర్ణముల యుచ్చారణభేదమే యున్నపుడింక
వేఱ చెప్పనేల! దంతములకును దాలువునకును సన్నిహితమున స్వల్పభేద
మున్నట్లే యాస్థానములనుబుట్టిన వర్ణములకును భేదముండినందున
నేకీభావము తటస్థింపనేరదు. కావున [illegible] ద్వయమందలి పాండురాజయశ"
మన్నచోట భారతార్థమున పాండురాజ యనినసంబుద్ధిపదములోని దం
త్య జకారమునకును రామాయణపక్షమున పాండురా తెల్లని, అజయశ
ము అజమహారాజుకీర్తి" యనిన యర్థమందలి తాలవ్యజకారమునకును
నుచ్చారణ వికారభేదమున్నందున నిట్టి శ్లేషము విశ్లేషమొందఁగా శ్లేషా
కగతిలేక ప్రౌఢవ్యాకరణ[illegible] నొకచో జకారముభేదముండు
నగునని సూత్రింపఁబడియె. అప్పకవియు నింతో యొప్పనేర[illegible]చె.
జిహ్మీకృతిమ్మయాట కష్టంబుగదా! శ్వేత ఇత్యాదులందు దన్త్యతాలవ్య భిన్న
స్వరముల సంగ్రహించెడి యేకశ్రుత్యుచ్చారణమువలెనె నిట్టి శుద్ధదం
త్యతాల వ్యజకారముల నొక్కటిమాటగా గ్రహింప సాధనమా యుచ్చా

రోసారితరము లేఖింపజేసి ( )సూత్రముసు ద్రష్టింజెందక ప్రౌఢవ్యాకరణ కర్త "రాజు వైకృతంబని కొందఱందు" రని షష్ఠసూత్రము రచించుకొ నిరు భటనిట్లు పూర్వవైయాకరణులకు నోరాడక యెంతో యుక్కిరి బిక్కిరి యగుచుండఁగా వ్యాకరణసముద్రము సర్వమును మోఁకాలి బంటిగా విహరించెడి మన వ॥ ॥రా॥ శాస్త్రులుగారు శ్లేషలో నఖండా ఖండమై త్రిప్రభృతులనలెనే దంత్యతాలవ్యచజలకు మైత్రి యుండనో పునని తలంచిరి. (బాల. సంజ్ఞ. 7 సూ.) కాన పయి రాఘవ పాండవీయప్రయోగము నిర్బాధమయ్యె నని తుండమును దుపాకియు నెరుగునట్లు సింహనాదముతో సిద్ధాంతీకరించిరి ఇట్లు విమర్శకుల మతమున దంత్యతాలవ్యచజలు శ్లేషార్థముఁ జెల్లుటయందు గొప్పసంతర్పణ భోజనోత్సవమొందుంబలె నజమర లేనివైనందున నేఁడు మొద లీరీతి నర్థము చెప్పవచ్చు (1) పంచదార (శర్కర) వర్తకుఁడు ఐదుగురుభార్యలతో నున్న వాఁడనియు నర్థమగు. (2) పంచాది (పంచపాక) ఐదు మొదలనియు నర్థమగు. (3) చాటు (రహస్య) భాషణము ప్రియభాషణమనియుఁ నర్థమగు (4). సజ్జను (బుట్టను) దర్శించి సుజనుననియు, నర్థమగు. (5) జర (కత్తిపరుఁజు) ముదిమియు నర్థమగు. (6) జగతి (తిన్నె) లోకము నర్థమగు. (7) (జడదారి జటాధారిముని) అజ్ఞానులఁ జంపువాఁడనియు నర్థమగు ఇట్లు వాఙ్మయమెల్ల విమర్శకుల మతమున సార్థకమగు. దంత్యతాలవ్య చజలకు యతిపాసమైత్రియే యున్నదని "అద్దంత్యస్తాలవ్యా" ఇనసూత్రస్థాపకబలపండితీయమున విసరించబడఁగా నట్టి వ్యాఖ్యాతలనెల్ల "యుడదాత్తేకర్తవ్యే నుదాత్తంకరోతి ఖండికోపాధ్యాయస్తస్యచపేటాం దదాతి అన్యత్వం కరోషీతి" యను వృద్ధిసూత్రస్థభాష్యోక్తిరీతిని జపేటాహతిజయించి జన్మమొందినవ. సీ. రా. శాస్త్రుల వారి పాండిత్య పాకము నేఁడు "పచామ్యన్నం చతుర్విధం" మ్మనునట్లు ప్రాచీనశిష్టుల పాకయల వేనిని ననుసరింపనందున రుచింపక హేయమై

పైనింజూపిన లక్ష్యములందు నతివ్యాప్తినిగలిగించుచున్నయది. కావున నట్టి వర్ణనాతీత (అక్షరములు దాఁటనట్టి) పాండిత్యము నకు బరాఙ్ముఖులమైయిపుడు శాస్త్రీయ శిష్టగోష్ఠికి నభిముఖుల మాదుముగాక ప్రకృతపద్యములోని "పాండురాజయశ" మనునొక్కముదాహరణ నిమిత్తమేశాస్త్రముమీఁటి దంత్యతాల వ్యజకారముల కభేదమొక్కటి యుక్తముగాదు గానవిట్లు సమన్వయించుకొనుట సాధువనందగు లోకములో "ఈ రోగియందు మేహము రాజైయున్నది." యనిన వాడుకకలదు. అందున, పాండుః పాండురోగః రాజా ప్రధానమితియావత్ యస్మిన్నసః" అని బహువ్రీహిచెప్పినచో దాని తత్సమరూపము "పాండురాజుఁడ" నిడుజ్వర్ణకాంతమైయుండకతీరదు. (చూ. తత్సమ. 70 సూ.) ఇట్లుండ దీనితో సమానార్థ ఫలములు గలిగి శాస్త్రీయమైన యధికరణార్థక ఘఞంతమున నిట్టిరూపమేల యుండను. నాఁతరాఁజుడు పరశురాముఁ"డని బాలవ్యాకరణమందును "సమన్మని రాజుఁడు రాముఁ" డని "డు స్సాన్యత్సదారాజ్ఞ" యను సూత్రమందలి యహోబల పండితీయ మందును రాజుఁడు శబ్దము లుండలేదా? ఇన్ని "రాజుఁడు" లురాజిల్లుచుండఁగానీ పాండురాజుఁడున కేతమమసమున నసూయాగ్ని రాఁజుచుండనేల కాన "నాసూయాకర్తవ్యాయత్రానుగమః క్రియతే" యనుపంక్తివింశతితిసూత్రభాష్యోక్తిని నీరాజుఁడు శబ్దము తమ యసూయాగ్నినింక రాఁజుచుండనీక పైపద్యమున నుభయార్థములందును దాలవ్యజకారముతోఁ బండితమండలీ మనంబులందు రాజిల్లుంగాతః!! బహువ్రీహితోఁ బాటిగా బహూకరింపఁబడిన యధికరణార్థక ఘఞంతపాండు రాజశబ్దమింకను నధికరణంబు సేసి యన్వర్థమై పండిత మానులం బరాభవించుంగాత!!

ఇదత్రితీయాంశము.

స॥ పా॥ స శేషము.

10—6—1919

(బాలవ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విదారణిః

(సమరాంగణ పార్థమూర్తీయము.)

పూర్వపత్రికానుబంధముః

బాల. సంజ్ఞ. 11 సూ. వ్యాఖ్య.

—:o:—

"ప్రౌఢ వ్యాకరణ సిద్ధాంతమును స్వసిద్ధాంతముగాను దాహరించియు "కన్ను" శబ్దములోని నకారము ద్రుతమని భ్రమించి వ్రాయుటయెంతయు వింతగానున్నది. కన్ను శబ్దములోని నకారము ప్రత్యయాగమావ్యయములలో నేదియు,గాదుగదా! అట్టిస్థితిలో" కన్ను + దోయి" ఇట్లుండఁ బ్రకీర్ణక పరిచ్ఛేదములోని యేడవసూత్రమున ద్విత్వనకారలోపంబు గలిగి కనుదోయి అగును. ప్రకీర్ణకపరిచ్ఛేదములోని పదునాఱవసూత్రమున కను శబ్దముయొక్క ఉకారమునకు లోపము రాఁగా కఁ దోయి, అగును. ఇప్పుడీసంధి పరిచ్ఛేదములోని పదునేడవసూత్రమున నీద్రుతంబునకు...(బా. గు. సం. 43 పుటఁ అని యిట్లు ప్రక్రియచూపి కన్ను శబ్దపుసంక్షేప రూపమగు 'కఁ' అనుదానిలోని ప్రకృతిసిద్ధమగు నకారమును ద్రుతమని వ్రాయుటకు గుప్తార్థప్రకాశికాకారు లెట్లు సాహసించిరో తెలియరాకున్నది" యని యిట్లు విమర్శకులు వ్రాసెదరు ఉత్తరము—కళగానిది ద్రుతప్రకృతికమును దాని తుదినకారము ద్రుతమును గాన నిపుడు కన్దోయి లోని 'కఁ' శబ్దము ద్రుతప్రకృతికమని నిశ్చయించుటకై తిఙ్మధ్య శేష షష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తిః" అను వాగనుశాసనీయ కళాసంజ్ఞాసూత్రమునఁ బ్రస్తుతమునకు నవసరమగు నంశమువివరించెద. వినుండు. తిఙ్మధ్యనామకాస్స్యాత్మనేపదపురుషాశ్చ యేరమాంతాశ్చ" యను క్రియాపరిచ్ఛేద

ములోని యీసంజ్ఞాసూత్రమును సహోబలపతి వివరించినరీతిని నిటఁ దిజ్మధ్యశబ్దమునకు రంజించితివి—ఇత్యాది మధ్యమపురుషక్రియలును, పోయిరి. ఘటించితిమి—ఇత్యాది రేఫమాంత క్రియలును నర్థమగు. (1) ఇట్లు పైకళాసంజ్ఞా సూత్రములోని తిజ్మధ్యశబ్దమునకు నర్థములో రేఫాంతమాంతక్రియాదుల సాహచర్యమునను, (2) కొందఱు దర్థనముల సాహచర్యమువలనను, (3) విభక్తులకుఁ బ్రత్యేకముగాఁ బ్రయోగములే నందునను, (4) అనుక్త సంఖ్యతో గ్రాహ్యమ్మను న్యాయమున యుక్తమా ప్రత్యయగ్రహణే యస్మాదితిపరిభాషయుపస్థితివలనను, పైసూత్రమందు శేషషష్ఠీ సుప్కర్మప్రవచనీయజ విభక్తేః" అనుస్థలమున, రాముని యొక్క, రాఁముడు—ఇత్యాదిసప్తమ్యంత ప్రథమాంతాదిపదములే గ్రహింపఁబడి, చేసిరి, వచ్చితిమి ఇత్యాది రేఫమాంతక్రియాపదములువలె గళాసంజ్ఞ నొందునుగాని, యొక్క, డు, ము—ఇత్యాదిప్రత్యేక విభక్తులు కళాసంజ్ఞగలవి గానేరవు. కనుకనే, బాల వ్యాకరణమున, రాఁముడు రామునికై, నాయొక్క— ఇత్యాద విభక్త్యంతములే కళలని చెప్పఁబడినవి (బాల, సంజ్ఞ. 13 సూ.) కాని ప్రౌఢవ్యాకరణమున 12వసూత్రములోఁ బ్రథమాదివిభక్తులే కళలని ద్రుతప్రకృతికములనుండి విభజింపఁబడియె. ఇట్లు శాస్త్రచర్చచేఁ బ్రథమాంతాది పదములే కళలుగాక "అన్యేద్రుతప్రకృతయో। యేష్వర్వ్యాను జీవితద్రుతానిత్య" మ్మనుపై సూత్రమునందు "అన్యే" అనుపదమునఁ బ్రథమాంతాదిపదములుగాక తక్కినద్వితీయాంతాది పదములే గ్రహింపఁబడి ద్రుతప్రకృతికసంజ్ఞగలవి యనియు, ద్రుతాంతములనియు నర్థమగు. కానిద్వితీయాదివిభక్తులు ద్రుతప్రకృతికములనియు, ద్రుతాంతములనియు నర్థమురాదు. కావుననే, బాలవ్యాకరణమున, నన్నుఁ, నాచేతఁ—ఇత్యాద ద్వితీయాంతాది పదములే ద్రుతప్రకృతికములని చూపఁబడినవి (బాల, సంజ్ఞ. 12. సూ, ఇట్లు శాస్త్రదృష్టిని ద్వితీయాంతాదిపదములే ద్రుతప్రకృతికములును,

ద్రుతాంతములును గాని ప్రకృతములగు "గన్ దోయి" లోని "గన్" శబ్దము ద్రుతప్రకృతికమును, ద్రుతాంతమునుగాక తీరదు. అయ్యది యెట్లనగా వినుండు. "కన్ను (లయొక్క) + దోయి" యనిషష్ఠీతత్పురుషవిగ్రహము సిద్ధించఁగా షష్ఠీభవేద్ద్వితీయా తుల్యార్థతత్పురుషసంస్థితాచాన్యా" యను (బాలం. పరి.) సూత్రమున షష్ఠీవిభక్తికి ద్వితీయావిభక్తి వచ్చినదగుటచేఁ "గన్ను (లన్) + దోయి" యనియై "లోపశ్చవిభక్త్యాదే" రితి (బాలం. పరి.) సూత్రమున ద్వితీయకు లోపమువచ్చి "కన్ను + దోయి" యనికాఁగాఁ బైనిం జూపినరీతిని తత్సమంబునకు లోపముగాఁ "గన్ + దోయి" యయ్యె. ఇపుడు "(హే) రాజన్" అనుశబ్దము సంబుద్ధ్యంతమైనట్లులే "ప్రత్యయలోపే ప్రత్యయమే" తిసూత్రమున నంతర్వర్తిద్వితీయావిభక్తికిఁ బ్రత్యయలక్షణము నల్పఁగా స్వాశ్రయనాంతత్వముగల యీశబ్దము ద్వితీయాంతమయ్యె. (సశేషము)

స॥ పా॥

---

గోదావరిపత్రిక

17—6—1919

(బాలవ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్వ్యాఖ్యాన విదారణి.

(సమరాంగణపార్థమూర్తియును.)

పూర్వపత్రికానుబంధము.

బాల. సంజ్ఞ. 19 సూ. వ్యాఖ్య.

—:o:—

అందుఁజ నిత్యాది కళయనంజనదు. ఇటులిచ్చటి "కన్" శబ్దము ద్వితీయాంతముకాఁగ, దానితుదిన కారము ద్రుతనామమున కేంగఁగదు? ద్రుతముగనక్కన తొల్లిఁ ప్రాయ్యమునందిది ద్రుతమునకు లోపము లేదనుచో

నికిఁ "గన్దోయి" లక్ష్యము గాఁనీయబడినది (చూ. బాల. సంధి 12సూ) ఇట్టి నకారము ద్రుతమనిన గుప్తార్థప్రకాశికాకర్త తప్పేమున్నది? ఇఁకను ప్రత్యయాగమాద్యన్యతమమై యుత్వవిశిష్టమైన నకారము ద్రుతసంజ్ఞికంబనిన గుప్తార్థప్రకాశికాకర్త్రవలంబిత ప్రౌఢవ్యాకరణరీతి నీనకారము ప్రత్యయాద్యాత్మకము గాదందురేని యవధరింపుఁడు. యద్యపిభ సంజ్ఞాభాష్యే (6—4—155 సూ) నదృశ్యతే తథాప్యుదాహరణమే తన్న పరిగణన మితిభాష్యాశ్రిత్యా అప్రిగ్రహణమిత్యప్రాతిపదికాద్ధాత్వ శేణితి" వార్త్తికస్థశేఖర గ్రంథరీతిని ప్రౌఢవ్యాకరణకర్త యథోద్దేశపక్షపాతులై యథాశ్రుతగ్రాహులకుపకారార్థము తఁజుచుతాదృగ్ నకారము ద్రుతమగునని యుదాహరణమాత్రముగాఁ జూపె. కాని యంత మాత్రమున వ్యాఖ్యాతృన్యాయ్యాది పరిగణనంబని భ్రమింపరు. అటులేకాకుండెనేని యుత్వవిశిష్టమైన నకారమే ద్రుతమని వ్రాసిన ప్రౌఢవ్యాకరకర్త "పఙ్" అనుచో నిమ్మును లోపింపఁగా నకారపుఁబొల్లునసే దుద్రుతాంతమగునని స్వవచనవ్యాఘాతముగాఁగ నేట్టుల భిప్రాయపడియె. (చూ పని. శబ్ద. ర). కాన ప్రత్యయాద్యాత్మకమనునది యుదాహరణమాత్రముగాని పరిగణనంబుగాదు. మఱియు, "విభాషే త్యేవసిద్ధే ఇదము పాదానత్వేనబోధనార్థమ్॥ తత్రిహి గుణేఽస్త్రియామితి ప్రాయిక" మ్మను జనికర్తురితికారక సూత్రస్థశేఖర గ్రంథసామ్యమునఁ బ్రత్యయాదులను కారము ద్రుతమగుట ప్రాయికమని ప్రౌఢవ్యాకరణకర్త భావము. అందుననే "కం" తానన్నమాట...నెంతేఁ। బూనిన "మ" యతియెంతేఁద నయార్త్రి... (రా. పాం. ౧ ఆ) "శా" ఎందేఁడందముకందళింప...(మను౨ ఆ)—ఇత్యాది ప్రయోగములందు నుత్వవిశిష్టముకాని "పని" నకారము ద్రుతమై సరళాదేశముఁ గలిగించెడి. కానఁబైనిఁజూపినరీతిని "కన్దోయి" లోని స్త్రీయామిత్యక్ష శబ్దనకారము ద్రుతసంజ్ఞికమై బిందుపునొంది "కందోయి" యయ్యె "మిన్వడె" ననుచోటమిఙ్

శబ్దము ప్రథమాంతము గాన దానినకారము ద్రుతము కానేరదు. షష్ఠీ తత్పురుషలో నిషష్ఠి ద్వితీయాతుల్యయగునని యెఱుంగని విమర్శకులజ్ఞానము నెడవిచారమొందుచునే నేశంకించుకొని యతివ్యాప్తిని వారించెద "ఉ" తదంఘ్రియుంతఁజ! న్కట్టుపయిన్ ఘటించుచును గన్నులు చేరుచుకొంచుఁ జెక్కిటన్" (కళా. 4 ఆ) ఇత్యాద్యగులందు షష్ఠీతత్పురుష 'చనుకట్టు' శబ్దరూపాంతరమగు "చన్కట్టు" లోనిద్వితీయాంత 'చన్' శబ్ద నకారము "కన్‌దోయి" లోని కన్ శబ్ద నకారమువోలె ద్రుతము గాన నిటఁ గకారము సరల మేల్ల కాలేదని ధీమంతులైరైన శంకింతురేని వినుండు. (1) గసడదవాస్స్యుః ప్రథమామ్రేడితాదితి సూత్రమున (ఆంధ్ర. చిం. సంధి) వాఁడుగొట్టె ఇత్యాదులందుఁ బ్రథమాంతము కంటెఁ బరమగు పురుషములకుఁ గసడదవలు విధింపఁ బడియె. మరల "పురుషాణాం గసడదవాస్స్యుః పదాద్ద్వంద్వే" యను సూత్రాంతరమున, (ఆంధ్ర. చిం. సంధి) కూరగాయలు—ఇత్యాదిద్వంద్వములయందు గసడదవలు విధింపఁబడియె. కూరగాయలన్ ఇత్యాదిద్వితీయాంతములయందు సైతము "ద్వంద్వః ప్రథమాంతానామేవ, నపరిసష్ఠితవిభక్త్యాంతానామితి. చార్థేద్వంద్వసూత్రస్థభాష్య సమ్మత శేఖరవచనమున బ్రథమాంతములకే ద్వంద్వముగాన నిటఁ బ్రత్యయలక్షణమునఁ బ్రథమాంతమగు కూరశబ్దముకంటెఁ బరమగు గాయశబ్దము గకారమునకు (1) గసడదవాస్స్యు"రితి మొదటిసూత్రముననే గసడదవలు వచ్చుచుండ, ద్వంద్వమున, బునర్విధానము వ్యర్థమై, ప్రత్యయలక్షణప్రాప్తపదత్వకార్యము ప్రత్యాఖ్యాతింజేసి పదసంబంధియే కావలెఁగాని పరపదాది కార్యము కాఁగూడదని జ్ఞాపకమగుచుండెడి. ఇటఁ "గూరగాయలు" అనుద్వంద్వమున గకారరూపకార్యము పరపద సంబంధిగాన స్వాంశమునఁ జారితార్థ్యము గలదు. "చన్కట్టు" అనుచోటఁ బరపదస్థమగు సరళకార్యము పూర్వోక్తజ్ఞాపకమున రానేరదు.

"కందోయి" యనుచోటనో ప్రత్యయలక్షణమున ద్వితీయాంతమా కన్, పదము యొక్క బిందుకార్యము ప్రత్యాసత్తింజేసి యాదేశాన రాజనను కాన నతివ్యాప్తి నివారితమయ్యె. అందున రామచంద్రుని నగుమోమును దామరసిరుల్ గనుపండువుగా" (రా. పాం ౨ ౮)—ఇ త్యాదిప్రయోగములు శంకకు వార్తయే లేనందున సమంజసము లగు చుండె. "మిన్నర్క" అనుచోట విమర్శకులు కళాభావహీన ద్రుతాం తత్వశంక విమర్శన కళాహీనతించెలుపుచుండు "మిన్" శబ్దము ప్రథ మాంతముగాను గళయగుగదా! ఇంకనుపీరి "కందోయి" ప్రక్రియా లక్షణము సంగ్రహముగ ఖండించెద. "కన్నుందోయి" నుండి కందోయి కాదు. ఇట సంయుక్తనువర్ణో కారమునకు హల్పరత్వమున లోపమగు నను సూత్రమున (ప్రకీ, 16 సూ) బిందువునడుమ నడ్డుగానదకారపంత్వ ము లేక ఉకారలోపము రాదు ఇంతియకాకపక్షమునను "గనుందోయి" కావలసివచ్చు. ఉక రన కారలోపములువచ్చినను, విమర్శకమతనమును గళ శబ్దనకారము ద్రుతముగానందునను, బాల. సంధి 22 సూత్రము నను, "కందోయి" యిట్లవలక్షణరూపముగలదియగుకాన శాస్త్రిగారి వచనము శాస్త్రీయము కాదు ఇదిచర్థాంశము.

బాల. సంజ్ఞ 12 సూ. వ్యాఖ్య,

"ద్వయ నద్వచనద్వయోస్య యో రత్వా,, యనుసూత్రమునను, "న్ను మ్వామ్రహ స్వశ్చ దేరమి,, యనుసూత్రమునను, (హలం. పరి) తా,నా, నీ, ప్రకృతులమీంది ద్వితీయైకవచనమైన అమ్ విభక్తికి "న్ను,, అను నది యాదేశమై ప్రకృతికి హ్రస్వమువచ్చి "తన్ను" నన్ను, నిన్ను" శబ్దములు ద్వితీయాంతములయ్యె "పరమోమహాతా,, మను సూత్రమున నైన (అజం పరి) "రాముని" శబ్దములోని "ని, వర్ణమువోలె, తా,నా, నీ, శబ్దముల అమ్ విభక్తిస్థానిక "న్ను,, వర్ణకమును ద్వితీయావిభక్తి యు నకతీరదు. మఱియు, అన్యాకారలుప్యయుక్తస్య,, యనుసూత్రమున (అం.

హాలం. స) పాఠికసలోపముపచ్చి, తను, నను, నిను, శబ్దములగు. ఇట్లుండ విమర్శకులు పైతన్న ప్రభృతులు నకారపుంబొల్లు దిగఁదీసి ప్రకృతులేయని పలుకఁ దొడగుచున్నారు. అక్కటా ప్రకృతిచే 'తన్నే' యొయ్యదనిర్ధమన్మణి 'నిన్ను' ను 'నన్ను' ను నెఱుంగునా ఇపుడైన సత్తే ప్రాకృతజ్ఞానము పోఁద్రోలి ప్రకృతియని భ్రమయక పైశబ్దములలోని 'న్ను' వర్ణము ద్వితీయావిభక్తిగాన విమర్శకులు స్వకీయ ప్రకృతిపోలా నద్యూలాది ద్రుతప్రకృతియని తెలిసికొని తే॥ గీ॥ తన్నునిన్నను పద్యములోని (అప్ప. 5. ఆ) కళాభ్రమ నివారణయత్నము కవిరభసహేతుకమని మెఱుంగుదురుగాక ఇది పంచమాంశము.

బాల సంజ్ఞ. 15 సూ. వ్యాఖ్య.

"దీర్ఘాంతములగు తనర్వాదినపు నిండుసున్న శబ్దముయొక్క పుట్టుకలోనేయుండవలయును గాని వ్యాకరణముచే నిండుసున్న రానేరదు. అరసున్న శాస్త్రముచేత రావచ్చును. ఉదా. "తాఁజెప్పె" వాఁడు.....అని యిట్లు గుప్తార్థప్రకాశికలో వ్రాయఁబడి యున్నది. "తేంట్లు, గోంట్లు, వేఁటకాండ్రు" మొదలగు శబ్దములలోని నిండుసున్నలు వ్యాకరణము చేతనే వచ్చినవగియు నాశబ్దములయొక్క పుట్టుకలో లేనే లేవబ్బయు వేఱ చెప్పనక్కఱ లేదుగదా! ...ఇట్టివిషయములను జ్ఞప్తికిఁ దెచ్చుకొనక "వ్యాకరణముచేత నిండుసున్న రానేరదు" అని గుప్తార్థప్రకాశికాకారులు వ్రాయుట యెంతయు వింతగానున్నది"—ఇత్యాదికముగా విమర్శకులు వ్రాయుచున్నారు.—ప్రత్యుత్తరము:—అక్కటా యీవిమర్శకుల మద్దారుతో కొక్కెపులుకలం బరిశీలింపఁగా నప్పకవీయాపహోబలపండితీయములు వీరిపాలిటిమాత్రమే యంటినట్లు తోఁచెడిఁ గాని వీరివాలిసే సూత్రమును నంటినట్లు కనఁబడదు కారణంబు విన్నవించెద. పరికింపుఁడు తే॥ నిజముగను నక్కటకమువిపై నిలిచినట్టి యద్దబింబములన్నియు స

రసిచూడ। ధరణిసిద్ధంబులైన సాధ్యంబులైన। ఖండములెకొని పూర్ణ
ముల్ గా వుసుమ్ము" (అప్ప. 2 ఆశ్వా)

"దీర్ఘాత్పరశ్చేత్ ఖండ ఏవనతుపూర్ణః" అనియహోబలపండితీ
యము "దీర్ఘాచ్ఛేత్ఖండ ఏవసజ్ఞేయః" అనుసూత్రవాఖ్య) ఇట్లు పైగ్రంథ
కర్తలు దీర్ఘముమీఁది సిద్ధసాధ్య ఖండబిందువులలో నేదయైనను ఖండ
ముగా నేయుండుఁ గాని పూర్ణముగాదని చాటుచుండిరి. విమర్శకులమత
మున నప్పకవ్యాదులుగూడ, "తేఁటి, గోఁటు" లలోని యఱసున్న నె
ఱసున్నయై "తేంట్లు, గోంట్లు" అగునన్న సంగతిజ్ఞప్తియందుంచుకొనక
యేకదా! యిట్టి వ్రాతలు వ్రాసిరి. అట్టివారికే జ్ఞప్తిలేనపుడు గుప్తార్థ
ప్రకాశికాకర్తకుజ్ఞప్తి లేకుంట వింతయేకాదు విమర్శనకు లిట్టులోరులని
రాకరించుమందమ మెచ్చుజ్ఞానమున సర్వదాతనరు చుందురుగాక! శా
స్త్రిలవారు వైవ్యాఖ్యాతల వాక్యములకు నర్థము తెలిసికొన్నచో, గు
ప్తార్థప్రకాశికా కర్తంగూర్చి యిట్టిశంకయే చేయకపోదురు. ఇది బాలుర
కుసైతిము శంకింపవలసిన చోటుగాదు. "దీర్ఘాక్షరము తరువాత నిండుసు
న్న శబ్దముయొక్క పుట్టుకలోనే యుండవలయుఁగాని వాక్యకరణముచే
త నిండుసున్న రానేరదు" అనునీచోటఁ బ్రకరణసందర్భమున వ్యాకర
ణముచేత వైకల్పికముగ రానేరదని స్ఫురించును "హ్రస్వముమీఁది
ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగనగును" అనునది దీని
పూర్వసూత్రముగాన నియ్యది వైకల్పిక ప్రకరణమని యెఱుఁగునది.
"తేంట్లు, గోంట్లు, వేఁటకాండ్రు— ఇత్యాదులు పూర్ణబిందువునకు ని
త్యస్థలములుగాని వైకల్పికస్థలములుగావు ఇట్టిసులభప్రకరణస్థలమేశంకనీ
యమయ్యోనేని వర్ణనాతీతపాండిత్యవంతులకుఁ బైయప్పకవ్యహోబలపం
డితవాక్యము లింతకంటెను మిగుల శంకింపఁదగి యుండును. మఱియు.
బా. సంజ్ఞ. 14. సూత్రమున హ్రస్వముమీఁది యరసున్న నిండుసు
విధింపఁబడినందున దీర్ఘముమీఁది యరసున్నకు నిండుసున్న కున్న

న్న ప్రాప్తియే లేదు. అందున నప్రాప్తపూర్ణబిందునిషేధ మయుక్తము గాన లోకానుభవ సిద్ధార్థానువాదకమగుదగిన 15 వ. సూత్రము పూర్వవిధిసూత్రముల (15. 7, అచ్చి. తేంట్లు) నెట్లు బాధింపఁజాలును? కాఁబట్టియిది యర్థమెఱుంగని యావనాళకాండ ప్రశ్నము గాని వేఱొకటిగాదు. (షష్ఠాంశము)

స॥ పా॥ (సశేషము)

---

గోదావరిపత్రిక

24—6—1919

(బాలవ్యాకరణ)

గుప్తార్థప్రకాశికా దుర్విమర్శన విదారణి.

(సమరాంగణ పార్థమూర్తీయము)

పూర్వపత్రికానుబంధము.

బాల. సంజ్ఞ. 23 సూ. వ్యాఖ్య.

---

అటు తద్భవములని చెప్పుటచే కఱకంఠుఁడు, ప్రాణగొడ్డము అనువానికి సామాసికగ్రామ్యత పోయినది. "ప్రాణగొడ్డము అనుపదమందు మఱేవిధమయిన గ్రామ్యతయు లేనందున నదిః యగ్రామ్యమనిరి. "కఱకంఠుఁడు" అనుశబ్దమునందున్ననో తద్భవకల్పనచే. సామాసికగ్రామ్యత వారించినను, సందనాంధ్రవర్ణమగు ఱకారముండుటచే నద్దానికి గ్రామ్యత వారింపలేము...శబ్దరత్నాకర కోశమునందు జీవగఱ్ఱ, కఱకంఠుఁడు" అనుశబ్దములయొద్ద 'అనింద్య' గ్రామ్యములనుటకు గాని) అని వ్రాసియున్నాఁడు.........."కఱకంఠుఁడు" మున్నగువానికితద్భవకల్పనచే గ్రామ్యత వారించినట్లు,..గుప్తార్థప్రకాశికాకారు లభిప్రాయపడి,....

ఇట్లువిమర్శకులేదేదో చాటుభారతము చదువుచుండిరి ప్రత్యుత్తరము కలికంఠశబ్దము గ్రామ్యమా? లేక, శాస్త్రీయమా? యనువిషయమిటఁ జర్చింపఁ బడును "ద్విగుకర్మధారయౌ" ఇతిసూత్ర వివరణమునఁ (ఆం. చిం. హాలం.) "గలకంఠశబ్దో మిశ్ర బహువ్రీహిః" అనియు, "తజ్ఞ సమాచదేశ్యా" అను సూత్రవ్యాఖ్యను (ఆం. చిం. సజ్ఞ.) గ్రామ్యాంత స్తద్విధాసాధు కలికంఠముఖాహితాః" అను నథర్వణ కారికరీతిని గలికంఠాదిశబ్దము లనింద్య గ్రామ్యములనియు సహోబలపండితీయమునఁ జెప్పఁబడియె. కలి=నలుపైన, కంఠుఁడు=కంఠముగలవాఁడని యన్యపదార్థ ప్రధానంబగు నీబహువ్రీహిపదము నీలకంఠశబ్దపర్యాయ (శివుఁడు) మని యథర్వణాదుల తాత్పర్యము. నీలార్థకమగు తెలుఁగు బాసలోని కలిశబ్దమునకును, గీర్వాణభాషలోని కంఠశబ్దమునకును, నన్యపదార్థ ప్రాధాన్యమున సాంస్కృతిక నీలకంఠశబ్దమునకుంబలె బహువ్రీహికలుగుట దుర్లభముగాన నియ్యది. గ్రామ్యమయ్యె. ఈయర్థమే (౨౭ సూ. ఉ) దీని సహోబలపండితుఁడు మిశ్ర బహువ్రీహియనెఁగాని యదియట్లగుట దుర్ఘటమని, ప్రౌఢవ్యాకరణమున స్పష్టపఱుపఁబడియె (చూ. సమా. ప) ఇట్లుమిశ్రబహువ్రీహిదుర్ఘటముగాన సాంస్కృతికములైన గరశబ్దకంఠశబ్దములకే బహువ్రీహియని యూహించి గరకంఠశబ్దభవముగ గలకంఠుఁడని ప్రౌఢవ్యాకరణకర్తచేత గ్రామ్యత నివారింపఁబడినది. (చూ. సంజ్ఞ 9 సూ) గరశబ్దము "గడ్వాదిభ్యః పరాసప్తమీ" యనువార్తికస్థగడ్వాదులలోఁ బఠింపఁబడినదో "గరకంఠః" అనుబహువ్రీహి గీర్వాణవ్యాకరణమున సాధ్యమగునని తద్భావము. కలికంఠశబ్దము గ్రామ్యమైనను నింద్యమని యథర్వణాచార్యాదులు చెప్పఁగా, నాంధ్రగీర్వాణపదంబులతో మిశ్రబహువ్రీహియైనందున గ్రామ్యమైనదని తద్భావమును వివరించిన యహోబలపండితునే గొప్పదోషినిగా నెంచుచుఁ గలికంఠశబ్దము గరకంఠశబ్దభవంబుగాన నియ్యది యశాస్త్రీయమైన మిశ్రబహువ్రీహి

చేసిన సీతారామాచార్యులవారి మేలిపూన్కి యంతయు బూదింబోసిన చేలిమి యున్కిం జెందవలసియుండు. అందున, గరకంఠభవమా కఱకంఠశబ్దము శాస్త్రీయమనవలయుంగాని గ్రామ్యంబనఁగూడదు. శాస్త్రీయమైన సాంస్కృతికకంఠశబ్దములోనిఠ కార మనాంధ్రవర్ణముగాన శబ్దమంతయు గ్రామ్యంబయ్యెననుట గీర్వాణపాండిత్య మిళితమౌ తెలుఁగుభాష, తెగులుబారినదై గంగలోఁ గలిసెననుట వంటిదియై హాస్యాస్పదమయ్యెడి. అంచయాన, అంచపదము—లోనైన శబ్దములు సాంస్కృతికములౌయాన, శబ్దములతో నుండినంత మాత్రమున గ్రామ్యంబులయ్యెనే? అర్థసంసర్గాదులంజేసి తమ సాంస్కృతికత్వమునెల్లఁ దెల్లమిచేసి కొనుచున్న యూయాన పదశబ్దము లాంధ్రవర్ణయుక్తము లైనంత మాత్రమునఁ దద్భవములౌ తెలుంగులనుటకు నోచునే? అట్లేయైనచో వనితాది సాంస్కృతికములు తెలుంగులన వలసియుండును ఇంకను, సాంస్కృతిక యానాదిశబ్దములతో మిళితములౌ నంచయానాదిపదములు వైకృతములని నిఘంటువుల నెట్లు వ్రాయఁబడియెనందురేని యాలింపుఁడు లోకములో, వనములోని యేకదేశము పుష్పించెనేని వనము పుష్పించెననియు గ్రామములోని యేకదేశమౌ గృహము దగ్ధమగుచున్నచో గ్రామము దగ్ధమగుచున్నది యనియుఁ, గుంటికాలైనచోఁ గుంటిమనుష్యుఁడనియుఁ గ్రుడ్డికన్నైనచో గ్రుడ్డిమనుష్యుఁడనియు, నేకదేశపరిత్రధర్మమును విశిష్టమునఁ వ్యవహరించుట గాంచుచున్నామ కనే, "ఏకదేశలోపఇతి" అనుమన క్రియాసముదాయే పిన్యాపదశ్యతే॥ యథాపటో దగ్ధఇతి॥ అవయవేహి పటాఖ్యో వయవీసమవేతఇతి తస్యాప్యసౌదాహః" అను ప్రత్యయస్యలు గితిసూత్రభాష్యస్థకైయటము సంగతమగుచున్నది కావున, అంచయాన, అంచపదము, కఱకంఠుఁడు లోనగుపదముల యవయవములే తద్భవములైనను, నవయవిభూయుతములౌ విశిష్టపదములు పూర్వోక్తలౌకిక శాస్త్రీయప్రమాణముల వైకృతములని వ్రా

యంబడిరెు. విమర్శకులు సీతారామాచార్యకృతశబ్ద రత్నాకరమున నే
కఱకంఠశబ్దమునొద్ద గ్రామ్యతాచిహ్నమా "గ్రా" వర్ణమేలలిఖింపఁబడి
నదని శంకింతురేని, యయ్యది స్వమతమునకు వ్యతిరిక్తమైనను ప్రాచీను
లౌ నథర్వణాదుల మతరీతినట్లు సేయఁబడియెనని యొప్పకతీరదు. గీర్వా
ణవ్యాకరణ గ్రంథములయందును నవీనులు స్వమతవ్యతిరిక్తమా ప్రాచీ
నమతమును దమగ్రంథములయం దామోదించినట్లు విలాసమున వ్రాసి
న వ్రాఁతలుగలవు. పరిభాషేందు శేఖరమునందు "నానుబంధకృతమనే
కాల్త్వ" మనుపరిభాష వ్యాఖ్యలో "ఙాణల్విషయేతు సర్వాదేశత్వం
వినా అనుబంధత్వస్యైవాభావేన అనుపూర్వ్యాత్సిద్ధ" మనియు, ఏకదే
శవికృతమనన్యవ" దితిపరిభాష యారంభమున "నను మావిత్యాదౌ
వృద్ధౌ కృతాయాం కార్యకాలపక్షేకథంపదత్వం! ఉభయతఆశ్రయ ఆశ్ర
యణె అంతాదివద్భావాభావాత్తనియు, ప్రాచీనమతమున వ్రాయఁబడి
యె. ఇత్యాదులు పెక్కులుగలవు. అప్లే శబ్ద. ర. లోనికఱ
కంఠశబ్దమునొద్ద "గ్రా" వర్ణము ప్రాచీనమతమున వ్రాయఁబడినది.
అథవా, అయ్యది ముద్రాప్రమాదాది హేతుకమని యెంచవలెను. ఈ
నిఘంటువులో నట్టివి యచ్చటచ్చటఁగలవు మూఁడు. దే. వి. ప్రతి. ఆ॥
అమరసైన్యములను దమయంతవర్తింపఁ నేరకునికి నాఁడు మూఁడుమొగ
ము గానోనర్పనలసెగాదె భార. ఉ. ౫. ఆ. ఇది మూఁడు శబ్దమున
కుదాహరణముగాఁదగదు శరము సం. వి. వ. అ.న. బాణము...ఇత్యా
దులు ప్రమాదములో కానోక చోఁగలవు కాన, బకృతమునగా వర్ణము
ప్రామాదికము. మఱియు "నకర్మధారయాన్మత్వర్థీయు"" ఇతినిషేధ
మనిత్యముగాన సాంస్కృతికమైన చతుర్దంతి శబ్దమునుండి "చాదంతి"
యనువైకృతిశబ్దమయ్యెననియు చతుశ్శబ్దభవమా చాశబ్దముగాకత్రిక్కి
నదంతిశబ్దము సాంస్కృతికపదమే యనియు "ద్విగుకర్మధారయా" వితి
సూత్రమందలి (హాలం) యహోబలపండితీయమున స్పష్టముచేయఁబడినది

అట్టి చౌగంటిశబ్దము వైకృతమని శబ్ద.ర. మున వ్రాయఁబడినది. అట్లేసాం
స్కృతిక కంఠశబ్దయుతమూ ? రకంఠభవ అకంఠశబ్ద మహోబల పండి
తాదివ్యాఖ్యాతల మతమున వైకృతంబుగానఁ బ్రౌఢవ్యాకరణకర్త మ
తమునఁ గూడ నయ్యది వైకృతమనక తీరదు. కాఁబట్టి గుప్తార్థప్రకాశికా
కారుల యగ్రామ్యతావాదము జగజ్జేగీయమానంబగుంగాత సుధీమణు
లారా! ఈజగంబున నేరైనఁగొంచెము విద్యాసదిశ్రమచేసి యెట్టులో
నలుగురు యోగమనుకొనినని యొనర్చేని కొందఱు బహులబ్ధవర్ణ
లుబుసుపోకయీసున నిష్కారణ కలహంబునకుఁ గాల్ద్రివ్వం బ్ర
యత్నింతురు. అట్లువ్యర్థాపేలపడినందునఁ దమతలపడుఫలం బనుభవిం
పకపోరు. (1) ప్రథమాంశమున శకారము వర్ణాంతరమనియు నలఘుల
కారముగాదనియు నర్థము సేసి యనర్థంబు తెచ్చుకొనిరి. (2) ద్వితీయాం
శమున శార్ఙ్గశబ్దములోని వర్ణంబులనే మెఱుంగరైరి. (3) తృతీయాం
శమున దంత్యతాలవ్యచజలకు శ్లేషమైత్రియొప్పునని హేయంబైన తమ
పండితార్థమును బ్రకటించుకొనిరి. (4) చతుర్థాంశమున నోరులను వం
చింతమన్నతమద్రి ప్రకృతిందక్క వేఱద్రుతప్రకృతికము లెట్టివో యెఱుం
గరైరి(5) పంచమాంశమునఁ దన్ను, నిన్ను,నన్ను శబ్దములు ద్వితీయాం
తములన్న విభక్తిజ్ఞానములేక కళలని కలహింపఁగడంగిరి. (6) షష్ఠాంశ
మున వైకల్పిక ప్రకరణసందర్భము తెలియంజాలక "తేఁటి, గోఁటు" ల
యొద్దనున్నసూపి తమతెలివితేట గోటులు తెల్లము సేసికొనిరి. (7)
సప్తమాంశమున నేమి గ్రహచారమో కాని శబ్దరత్నాకరములోని
"గ్రా" చారముచూచి వైష్ణవాచార్యులగారి మతమునఁ "గఱకంఠుఁ
డు" గ్రామ్యతపాలెయగునని కంఠశోషమారంభించిరి. ఇట్లు వీరివిమర్శ
నాంశములేకల శైలీభావంబున సప్తసంఖ్యకుఁ దగియున్నవి. విమర్శకు
లకు గ్రంథకర్త నుమించిన పాండిత్యముండవలె. ప్రకృతమున వీరుపాటు
ననుండి ప్రాగ్గులువెట్టఁ జాలరుగాని గుప్తార్థప్రకాశిక యర్థము సేసి

## వజ్రాయుధము—ఏప్రిల్ 1925—4సంచిక

## దృష్టిసరిగాని వ్రాఁతసంతుష్టియగునె?

శ్రీకాకుళంబునందుఁ గవికి మూఢత్వదోషంబు సంక్రమించి పోవుచున్నదిగాన నిప్పుడు భూగోళంబునందును గవింమన్యులకు మూఢత్వదోషము పోవుటకై యీక్రింది యుపన్యాసము వ్రాయఁబడుచున్నది. నసామివచనే ౨-౪-౨ సామిపర్యాయే ఉపపదే క్తాన్తాన్నకన్ సామికృతమ్—అర్థకృతమ్ అసత్యన్తగతేరిహ ప్రకృత్యైవాభిధానాత్ప్రాప్త్యేణ కన్నప్రాప్తఃఇదమేవ నిషేధసూత్ర మత్యన్తస్వార్థిక మపికనం జ్ఞాపయతి" ఈసూత్రముచేత నసత్యన్తగతియందలికన్ ప్రత్యయమునకు నిషేధము చెప్పుటకు వలనుపడదు. సామికృతం ఇత్యాదులకంటె నసమాసమందు సామిపదముచేతనే యసత్యంతగతి తెలియఁబడుచున్నది. సమాసము క్తాన్తముగా నందున కన్ ప్రత్యయముగాదు, "కృద్గ్రహణే గతికారకపూర్వస్యాపి గ్రహణమ్" అను పరిభాషచేత సామిపదముక్తాన్తము అనుటకు వలనుపడదు. సామిశబ్దముగయుఁ గారకమును గానేరదు. కనుకనే. యీసూత్రముచేత స్వార్థికమైనకన్ ప్రత్యయము నిషేధింపఁబడుచున్నది. ఈనిషేధసూత్రమే స్వార్థికమైనకన్ ప్రత్యయము కలదని జ్ఞాపకమగుచున్నది. భాష్యమ్ నసామివచనే సామివచనే ప్రతిషేధానర్థక్యం ప్రకృత్యభిహితత్వాత్ ।సామివచనే ప్రతిషేధోనర్థకః।కింకారణమ్। ప్రకృత్యభిహితత్వాత్ ప్రకృత్యాభిహితః సోర్థ ఇతికృత్వాకన్నభవిష్యతి॥ అర్థము? సా మి ప ద ము చేఁ గా ని దా ని ప ర్యా య ప ద ము చేఁగాని నిషేధముకూడదు. ఆయర్థము ప్రకృతిచేతనేఁ సామిఅర్థము చెప్పఁబడినందున కన్ ప్రత్యయముగానేరదు.

కైయటః (ప్రదీపః) నసామివచన ఇతి ప్రతిషేధేన స్వార్థికః కన్నస్తీతిజ్ఞాప్యతే। నహి సామికృతాదిభ్యః సత్యన్తగతౌ క్తాదిత్యస్యానత్యన్తగతే ర్ద్యోతనాత్॥ సమాసేభ్యస్తు క్తాన్తత్వాభావాచ్చ కృద్గ్రహణే

గతికారక పూర్వస్యాపి గ్రహణ మితి వచనాత్ స్వామిశబ్దస్య గతికారకత్వా భావాత్। తస్మాత్ స్వార్థికస్యైవాసాకనో నిషేధః స్వార్థికం కనం జ్ఞాపయతి॥' నస్వామివచనే, యనునిషేధముచేత స్వార్థికం బగుకన్ ప్రత్యయము గలదని జ్ఞాపితమగుచున్నది. స్వామికృతాదిశబ్దములకంటె నసమాసమందున ననత్యన్తగతియందు కప్ప్రత్యయమునకు ప్రాప్తి లేదు. ఆ సమాసమందు స్వామివచనముచేతనే అన్యతన్తగతి తెలియఁబడుచున్నది. కానన సమాసమందు కప్ప్రత్యయమునకు ప్రాప్తి లేను స్వామిశబ్దముగతి కారకములలో, నేదియుఁ గానందున, కృద్గ్రహణేగతికారకపూర్వస్యాపి గ్రహణమ్, అనుపరిభాషచేత సమాసమందు ప్రాప్తి లేదు. (కాన్తము కానందున) అందునస్వార్థకమైనకప్ ప్రత్యయమునకే నిషేధమనియువ స్వార్థికమైనకన్ ప్రత్యయము గలదనియు జ్ఞాపిత మగుచున్నది. (కైయట చనార్థము) కైయటోపాధ్యాయులవారు వివరించినట్లు స్వార్థికమైనకప్ ప్రత్యయము కలదు గనుకనే కం కావున . నియతాత్మజగత్పావనుధర స్వరూపుబ్రాహ్మణుఁబడయంగా వలయు వాఁడు సంతతి గావించు విచిత్రవీర్యకక్షేత్రములక॥—భార-ఆది-౪ ఆశ్వా ౧౦౫ పద్యము.

ఇచ్చట స్వార్థమందుఁ గప్ప్రత్యయముగాన విచిత్రవీర్యశబ్దమున కెంతయర్థమో విచిత్రవీర్యకశబ్దంబునకును నంతే యర్థము స్వార్థమందు కప్ప్రత్యయము లేనియెడ విచిత్రవీర్యకశబ్దము యుక్తము గా చేరదు. సీ॥ విశ్వకర్మునికూఁతు విశదలావణ్యసముజ్జ్వలఁ జేకొని మూఁరిఁబోయి-హరివంశ—ఉ-౪ఆశ్వా—అనులక్ష్యంబును జూపి, విశ్వకర్ముఁడు అనురూపంబుగలదని తద్గ్రంథకర్తగారు నుడివిరి. అదిమూలసూత్రవిరుద్ధంబగుటచే నఙ్గీకరింపఁబడదు. కాని విశ్వకర్మకుకూఁతు, అని సవరించిన చో గణభంగంబు గలుగక, స్వార్థికకప్ప్రత్యయంబుచే విచిత్రవీర్యకశబ్దంబు వోలె సలక్షణంబుగనే యుండునని యెఱుంగునది. స॥పా॥

——

# వ్యాకరణ విశేషాంశములు

మహారాజశ్రీ శశిలేఖాపత్రికాధిపతిగారి సమ్ముఖంబునకు

1 పత్రికాదిశబ్దద్వైతాద్వైతవిచారః 5-1-1900

అయ్యా?

ఇంతకుఁ గొంతకాలమునకుమున్ను "పత్రికా" శబ్దము దామ్నీశసయు యుజస్తుతుదసిసిచమిహపతదశనహః కరణే యనుపాణినీయ సూత్రంబునను "సర్వధాతుభ్యః ష్ట్రన్" యనిన యుణాది సూత్రంబునను ధాతుప్రత్యయ తకారమేళన వశంబున తానుద్వాన కరకంబనియు దానిం దెలియ నేరక కొందఱు ప్రాచీనులు తద్వైత సిద్ధికి భంగంబు గలిగించుచున్నారనియు, ఏకతకారంబుతోఁ దనకు సిద్ధించిన పరుష భావంబు చాలక ద్విగుణీకృత పరుషత్వంబునకై పోరాడెనట. దీనిం జూచి "పడిపోవునది" యనియర్థమిచ్చునట్టి "పత్త్రము" వంటిదగు పదార్థము ప్రతిమయే, లేచి తన ద్వైతసిద్ధాంతమునకై డీకొనుచుండఁగాఁ బున్నామనరకంబువలనఁ గాపాడునన్న పుత్త్రార్థమిచ్చునట్టి పుత్త్రి శబ్దము మొదలైనవి గూడఁ దమతక్కువ యేమియని కాఁబోలు తకారంబుల దొంతరకై యెంతో కంఠశోషమారంభించెనటఁ. ఈవృత్తాంతము చిరం॥ మాసోదరుండగు కల్లూరి రామమూర్తివలనను మాప్రియ శిష్యుండగు సుంకరిరంగయ్యవలనను, ప్రస్తావనావశంబున నాకర్ణించితిమి ఇట్టిశబ్దంబులు ఏకతకారంబులనియే శాస్త్రసమ్మతి సహితంబుగాఁ మా యభిప్రాయము ప్రకటింతుము గాని ద్వైతవాదులు (రెండుతకారములు తలదియని వాదించువారు) ఈవక్ష్యమాణసద్గ్రంథంబులలో నెట్లు గ్రంథసమన్వయంబు గావించుకొని తమసిద్ధాంతమును స్థిరపఱచుకొందురో వినఁగోరెదము

## మాఘకావ్యచతుర్థసర్గము షష్ఠశ్లోకము.

శ్లో॥ ఛాయామనిజస్త్రీచటులాలసానాం మదేనకించిచ్చటులాలసానాం కుర్వాణముత్పింజలజాతపత్త్రైః విహంగమానాం జలజాతపత్త్రైః. ఈశ్లోకమున 3వ పాదంబులో "ఉత్పింజలజాతపత్త్రైః" అన్నచో, ఉత్పింజలజాతే=మిక్కిలి యెత్తువివైన, పత్త్రైః=దళములుగలవి, యనియర్థము. 4వ పాదములో "జలజాతపత్త్రైః" అన్నచో, జలజ=పద్మములనెడు ఆతపత్త్రైః=గొడుగులచే ననియర్థము. ఈశ్లోకములో యమకాలంకారము మల్లినాథసూరిచే వ్యాఖ్యానంబున లిఖింపఁబడెను. మూడవ పాదములో ద్వైతవాదుల మతానుసారంబున, జాత + పత్త్రైః" అని, దళార్థకంబగు పత్త్రశబ్దములో, తకారద్వయముకలదు. నాల్గవ పాదములో, "జలజ + ఆతప + త్ర" అనుచో, ఆతపాత్ + త్రాయతే=ఆతపత్రం (ఎండవలన రక్షించునది) అనివ్యుత్పన్నమైన యీశబ్దములో "త్ర" అనునది, త్రైఙ్ పాలనే అనుధాతువువలన నైనదిగాన, ఆతపత్రశబ్దంబున నంతర్భూతంబగు "త్ర" అనుదానిలో, ఏకతకారంబుగలదు. ఇట్లు మూడవ పాదములో "పత్త్ర" శబ్దము రెండుతవర్ణంబులతో నీపరికారముగానుండును చతుర్థపాదాంతమున "పత్ర" అనుశబ్ద స్వరూపము, ఈ ప్రకారము, ఏకతకారముతో వర్తిల్లును. యమకాలంకార లక్షణమన్నమో "శ్లో॥ ఆవర్తతేఽర్థభేదేన। సస్వరావ్యంజనావళిః। యదా తదా స్యాద్యమకం। బహుధాద్యంతమధ్యగమ్।" అని యొకగ్రంథమందును, శ్లో॥ యమకంపౌనరుక్త్యంతు। స్వరవ్యంజనయుగ్మయోః। అని యింకొక యలంకార గ్రంథమందును వ్రాయఁబడెను మొదటవచ్చిన యచ్చులున్నూ హల్లులును అర్థభేదముతోఁ దిరిగి వచ్చుటయే యమకంబనియు, అచ్చులున్నూహల్లులును మొదట నుచ్చరించిన వర్ణములనే, యింకొకమాఱుచ్చరించుట యమకాలంకారమనియు, రెండు శ్లోకంబులకుం గ్రమంబుగాఁ ఫలితార్థము. ఇట్టి లక్షణంబునంబట్టి ద్వైతవాదులమతంబున,

మూడవపాదంబున "పత్త్రి" శబ్దంబులో రెండుతకారంబులు సంభవించి నాల్గవ పాదంబున "పత్ర" అనుదానిలో రెండుతవర్ణంబులును పునరుక్తిగా సంభవిల్లినందున యమకాలంకారంబు తమకెట్టులుసిద్ధించె? మఱియు నిచ్చట వ్రాయవలసిన విశేషముండెనేని,శంకించుకొని శ్లో॥ "నామూలంలిఖ్యతేకించి న్నానపేక్షితముచ్యతే" అనిన స్వకృతనియమము ననుసరించి ప్రమాణము కనుక అది వ్యాఖ్యానముసేయక మల్లినాథ సూరి వర్యుండేల యురకుండె? "నానపేక్షితముచ్యతే". అన్నట్లు స్వల్ప విషయమని వ్రాయలేదందురేని, పత్రికలలో ముష్టియుద్ధంబుల పర్యంతము పురికొల్పిన యీద్వైతాభిమానము (రెండుతకారముల సంబంధమైన యభిమానము) స్వల్పమెట్టు లయ్యె. ఒకపక్షంబున నిట్టి భవిష్యత్ ముష్టి యుద్ధంబులు, పుష్టియుద్ధంబులు గావనియే యాసూరిగారూరకుండిరేమో! పెద్దలాలోచింతురుగాక!! యనిదిక్ప్రదర్శనముసేసి యిప్పటికింతటితో విరమించుచున్నారము.

క॥ వేంటరామశాస్త్రి

మహారాజశ్రీ శశిలేఖాపత్రికాధిపతిగారి సమ్ముఖకంబునకు—

(2) సుమనోల్లాసశబ్దసంజీవని 23—1—1900

అయ్యా?

సుమనోల్లాసశబ్దంబు, అసాధువనియు, సుమన ఉల్లాసమనియే యుండవలయుననియు, ఆస్థానపండితులగు చెట్లూరి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిులుగారు మొదలగు వారిని, తాదృశ శబ్ద పక్షావలంబన రూపదోషంబున నుల్లంఘన పూర్వకంబుగాఁదపింపఁజేయుచు 1899 సం॥ డిశెంబరు 24 తేదీని చెన్నపట్టణంబున నుదయించిన సూర్యాలోకము నాదుకనుంగవకుఁ దనతేజంబుమీఁఱ మిఱుమిట్లు

గొలుపుచున్నది. అంతటి గొప్పయాస్థానపండితులకే గెడలకందక పాండిత్యసరసులచే నగాధంబగు చెన్నపట్టణంబుతోఁ జిన్నపట్టణంబగు రాజనరేంద్రపురంబెట్టులు పోరాడఁజాలెడుగాని యయినను, మహారాజశ్రీనిడమర్తిజలదుర్గాప్రసాదరాయ మంత్రిపురుషోత్తమసాధిక్రియమాణ హూణవిద్యాపాఠశాల గీర్వాణభాషాధ్యాపకత్వంబు వహించిన బ్రహ్మనయినందున సుమనోల్లాస శబ్దంబునకుఁ బ్రాణంబువోసి సుమనస్కోల్లాసంబాసర్వగాఁ నుద్యమించుచున్న నాయీయుపన్యాసంబును నిగ్గుదేలుటకై భవదీయ నిష్కళంక శశిలేఖాముఖంబున వన్నెపెట్టఁగాఁ గోరుచున్నాడను.

సుమనసాముల్లాస ఇతివృత్తౌ ఉల్లాస శబ్దపూర్వవర్తి సుమనశ్శబ్దసకారస్య రుత్వేయత్వే హాశి కేలోపే సుమన ఉల్లాసప వేతిస్యాన్నతు సుమనోల్లాస యితి యథోక్తవాదినాం వివాదః యత్తు సుమనోల్లాస శబ్ద సాధూకరణార్థం చెట్లూరి వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రిభిర్భావార్థకఘఞర్థేక విధానమితి శాస్త్రబలాత్ మనధాతోః కప్రత్యయే మనశబ్దో నిష్పన్న ఇత్యేకః పక్షశ్చ మనధాతోరు పరిక్విప్ ప్రత్యయే మః ఇతి ప్రాప్తా అర్శఆదిభ్యోచ్ ఇత్యచ్ ప్రత్యయే మనశబ్దో నిష్పన్న ఇత్యన్యఃపక్షశ్చద్వావుక్తావిత్యుపోద్ఘాత్యదండి గుంట సూర్యనారాయణ శబ్దశాసితారః ఘఞర్థేకవిధానమితీనాత్ర ప్రవర్తతే। తస్యానుఞ్ శాస్త్రాపవాదత్వాత్। మనధాతోర్ఘఞ్ ప్రవృత్తేః గర్వోభిమానోహంకారో మానశ్చిత్తసమున్నతిః ఇత్యాదికోశదర్శనాత్ ప్రస్తః విఘ్నః ఇత్యాది స్థలేషుయప్రఘఞ్ నవిధీయతే తత్రైవతస్య ప్రవృత్తేశ్చేతి ప్రథమఃపక్షఖండనంచ పక్షాంతరేపి మనశబ్దఏవన నిష్పద్యతే మనధాతోరు పరిక్విప్ ప్రత్యయేక్విపః కిత్త్వాదను నాసికలోపే తుగాగమేమత్ ఇత్యేవస్యాత్ సతుమః ఇతిపస్మాన్మత్వర్థీయే ప్రత్యయేమత ఇత్యేవస్యాత్ మనశబ్దస

స్వరూపమేవన ఘఞేతేతిద్వితీయ పక్షఖండనంచోపన్యాసిరే తదపిచింత్య ప్రాయమేవ॥

తథాహి ఘఞర్థకవిధానమిత్యత్ర ఘఞర్థేకః ఋహావాఘఞర్థా స్సంతి పదరుజేతిస్సృష్టిరే ఇత్యాదిషు కర్తరిఘఞ్ భావేఇతి సూత్రేణ భావార్థేఘఞ్ హాలశ్చేతి సూత్రేణహాలం తసామాన్యత యావిహిత స్యఘఞః కరణాధికరణ యోరిత్యధికారేణ కరణాదికరణార్థ యోరయం ఘఞ్ కిమేతేసర్వేపి స్వీక్రియంతే ఉతఅన్యతమ ఇతిచేత్ అత్రవార్తికే అధికరణార్థక కప్రత్యయాంత ప్రస్థవిఘ్నోదాహరణ ప్రదర్శనపర భాష్యప్రామాణ్యాత్. హాలశ్చేతి సూత్రీయఘఞర్థాకరణాధికరణే ఏవగృహ్యేతే। ఉక్తంచైతద్వార్తికస్థ శబ్దేందుశేఖరే "ప్రస్థవిఘ్నయోరధికరణేకః। ప్రతిష్ఠంతేఽస్మిన్ ధాన్యానీతి ప్రస్థః విఘ్నంతితస్మిన్ మనాంసీతి విఘ్నఇతి భాష్యోక్తేరితి"॥ నచభాష్యోదాహరణవశాత్ అధికరణార్థే ఏవకః నకరణార్థే ఇతివాచ్యం॥ హాలశ్చేతి సూత్రీయఘఞర్థయోర్ద్వయోర్మధ్యే "సన్నియోగశిష్టానాం సహవాప్రవృత్తిః సహవానివృత్తిః" ఇతి పరిభాషయాఽన్యతరస్య కరణార్థస్యాపివృత్త్యసంభవాత్. కరణాధికరణార్థకకప్రత్యయస్యాప్రాప్తిరేవ. "విఘాత" ఇతిభావార్థకఘఞంతసిద్ధిః। భవద్రీత్యా "యత్రఘఞ్ నవిధీయతే తత్రైవతస్య ప్రవృత్తి" రితినియమేతు విఘాతఇత్యత్రఘఞః ప్రవృత్త్యా విఘ్నఇతి కాంతరూపం నసిధ్యేత్ ఇతి మూలోచ్ఛేద ఏవస్యాత్. అర్థభేదాంగీకారేతు బాధ్యబాధకభావాభావేన రూపద్వయంసిధ్యతి. తథాచ యథాధికరణార్థేప్య ప్రస్పష్టార్థంతేః విఘ్నఇతికః। భావార్థేవిఘాతఇతి ఘఞ్చ। భిన్నార్థవిషయత్వాత్పర [illegible] లోకేదృశ్యతే। తథా "ఆత్మామనసా సంయుజ్యతే మన ఇంద్రియేణ ఇంద్రియమర్థే నేతి" న్యాయాత్ మనసోఽంతరింద్రియతయా పదార్థనివేదనోపకరణత్వేన సుఖాద్యుపలబ్ధి సాధనత్వేనచ "మన్యతేనేనేతిమనః" ఇతి లింగా

భట్టోజీయటీకాయాం దర్శనేనచ కణార్థే "మన" ఇతి కప్రత్యయాంతస్య। ఖ్యాపనార్థే "మానశ్చిత్ సముద్రతీరితి ఘఞంతస్య చప్రయోగే బాధో నాస్త్యేవ। విఘ్నవిఘాతశబ్దవత్ భిన్నార్థవిషయత్వాత్॥ తస్మాత్ మానశ్చిత్ సముద్రతీరితి" కోశే ఘఞంత మానశబ్దదర్శనేన "మన ఇతిక ప్రత్యయాంతస్య బాధ ఇతి యో హేతుః స హేత్వాభాస ఏవ. సన సద్ధేతురితి ప్రథమపక్షఖండనానుపపత్తిః॥

2. మన్యతేర్మనుతేర్వా ఉపధికిత్వాదను నాసికలోపే తుకి అర్క ఆద్యాచిమత ఇత్యేవస్యాదితి ద్వితీయపక్ష ఖండనమప్య సంగతమేవ। నలోపవిధాయకస్యాభావాత్। నహిఅనిదితామితిలోపః। తస్యోపధాన కారవిషయత్వాత్॥ నచానుదాత్తోపదేశేతి। తస్యఝలాదికిత్ జిద్విషయత్వాత్। నచధాతోః క్విపి కృదంతత్వాత్ ప్రాతిపదికత్వేసాహాల్ ఙ్యాదిలోపే "నలోపః ప్రాతిపదికే"తి లోపేతుగితివాచ్యం। తుకికరణేనలోపస్య ఝల్ స్వ కేతినలోపస్యాసిద్ధత్వాత్। అన్యథావృత్రహభ్యామిత్యాద్యావపితుగాదతిః। అతఏవకృతితు గ్రహణాచరితార్థం। వృత్రహభ్యామిత్యాదా పదత్వనిమిత్తకత్వేపి నలోపస్య బహిరంగత్వాభావాత్। భ్యామః పదసంజ్ఞానిమిత్తత్వేపి నలోపస్య తన్నిమిత్తకత్వాభావాదత్వాదిషుగిభాష్యేందుశేఖరగ్రంథశ్చాంతరంగ పరిభాషాస్థ స్సాగచ్ఛతే। తస్మాన్మన్నిత్యేవస్యాదితిరూప ప్రదర్శనమప్య నిదర్శనమేవ।

3. వయం త్వేవం విప్రవదామహే మన్యతేర్మనుతేర్వాక ప్రత్యయోన భవత్యేవ। ఘఞర్థఇతి వార్తికే "స్థాస్నాపావ్యధిహనియుద్ధ్యర్థ"మితి భాష్యేపరిగణితత్వాత్। నిరూపితం చాత్రవార్తికే శబ్దేందుశేఖరే।తథాచ స్థాస్నాపావ్యధి పరిగణితధాతుష్వభావాత్ మనధాతోర్ఘఞర్థే కవిధానమేవనసంభవతీతి ప్రథమపక్షఖండనం॥ యత్తు మనధాతోః క్విపి అర్క ఆద్యాచి మన్నితి రూపమితి। ద్వితీయః పక్షోప్యపలాపఏవ। క్వోపరతః "అనునాసికస్య క్విఝలోరితిసూత్రేణ ఉపధాదీర్ఘే అచి "మాన" ఇతి

రూపసిద్ధేః। అతఏవ "నశ్ఛవ్యప్రశాఽ" నితిశామ్యతేః క్విపిదీర్ఘే మోనో ధాతోరితినకారే "ప్రశాఽ" నితిచ। నామధాతుప్రక్రియాయామాచార క్విపిదీర్ఘేరాజేవాచరతి రాజానతీతి దీక్షితోదాహరణంచ సంగచ్ఛతే। కించధాతోః క్విబంతసుబంతత్వానంతరం అర్శఆద్యాకృతి గణపాఠోప్య గతికగతికః అతఏవ వ్యాకరణశాస్త్రమభినివిశమానో మురారిః కవిరాజః శ్లో॥కుర్యుశ్శస్త్రకథామమీయది మనోర్వాంశేమనుష్యాంకురాః స్యాచ్చేత్ బ్రహ్మగణోయమాకృతి గణస్తత్రేష్యతే చేద్భవాన్।"ఇతి ఆకృతి గణత్వేపి నిందనద్వారాపరశురామకర్తృకోపమే యభూతశతానందనిందనం సాధయతీతి ద్వితీయపక్షఖండనం।

4 నను బ్రహ్మన్, "సుమనోల్లాసశబ్దసంజీవనీ"తి నామమధురాం భవదీయోపన్యాసకీర్తికాం దృష్ట్వాచిరాన్మనోరథారోహణం కుర్మహే ఇత్యుత్సాహసమ్ముఖేనా నామస్మాకం పూర్వస్మాదపిఫలవిఘాతో దృఢతరమభూదహో కథం భవానుపన్యాసేన "సుమనోల్లాసం" సంజీవయతీతి చేత్ సావహితం శృణుత। యథాసుత మాత్మనఇచ్ఛతీత్యర్థే, శుష్క మాత్మన ఇచ్ఛతీత్యర్థేచ కర్మవాచకసుత శుష్కశబ్దాభ్యాంక్యచి సుతీయతేః శుష్కీయతేశ్చకర్తరిక్విప్। తథాసుమనా ఇవాచరతీత్యర్థే కర్తృవాచకసుమనశబ్దాత్ "కర్తుః క్యఙ్ సలోపశ్చే"తి "ఓజసోప్సరసోనిత్యమితరేషాం విభాషయే"తి చాభ్యాంక్యజిపాక్షికేచ సలోపేకృతేసిద్ధన్నాత్ సుమనాయతేః కర్తరిక్విప్ క్యజంతస్థలే అల్లోపయలోపానంతరం "సుతీః, శుష్కీరి"తి యథా ఈకారాంతౌ ఏవంసుమనాయతేః క్విపి అతోలోపే "వేరపృక్తస్యలోపాద్వలిలోపః పూర్వవిప్రతిషేధేనే"తి యలోపే విజంతక్విబంతాన్యతరవిశ్వపాశబ్దవత్ ఆకారాంతస్సుమనాశబ్దోభవతి। క్యజిసకారస్యలుప్తత్వాత్। నహియలోపేకర్తవ్యే అల్లోపస్యస్థానివత్త్వమితివాచ్యం। యలోపేస్థానివత్వప్రతిషేధాత్। ఏవంచసుమనాముల్లాసః సుమనోల్లాసఇతి షష్ఠీతత్పురుషేరూపం నిర్బాధం। పండితాయమానా

నాంసంతోపజనకఇత్యర్థః। నను ఈదృశప్రయోగోదాహరణస్య కౌము ద్యామప్రదర్శితత్వాదప్రమాణమేవాస్తు। అస్మాకంతుక్యజంతప్రకృతిక క్విబంతంసుతీ, శుష్కీ-త్యాదేః ప్రియుక్తత్వాత్ విశ్వసనీయమితిచేన్న। సకలప్రక్రియాసామ్యేన క్యజంతోదాహరణస్యైవ క్యజంతస్యాప్యుపలక్షణత్వేన నిరపేక్షత్వాత్। సర్వప్రయోగాకరత్వేన కౌముద్యాశ్శరణీకరణాసంభవాచ్చ। యతో "హ్రస్వనద్యాపోనుడితి" సూత్రభాష్యరీత్యా హాల్యంతేభ్య ఆచారక్విపోఽనభిధానే పినిష్ప్రిమాణా రాజానతి, ఇదామతీత్యాదయః ప్రయోగాః ప్రదర్శితానామ ధాతు ప్రక్రియాయాం। అథోచ్యతే భవదీయక్య జంతసాధితశబ్దః ప్రబంధ ప్రసిద్ధోనేతి త్వర్హి యుష్మాకంక్య జంతేపిసమానమేతత్ యదకవేరీదృశగూఢ సౌశబ్ద్యవివక్షాయాముత్సాహోజంజన్య తేకోనిరాకరం నిరాకుర్యాత్ యథాపురీమవస్కందేతి క్రియాసముచ్చయేలోడర్థ భ్రిమదాయినోలిడర్థక గూఢప్రియోగానుదాజహారమాఘః గమికర్మీకృతనైకనీవృతేతి కావ్యకల్పనాయాం శబ్దబోధక్రమమను ససార శ్రీహర్షః నను క్యజ్ ప్రత్యయే బాధమియానభినివేశః కుతస్తవేతిచేత్ చరమావయవావినా సరూపయోః క్యజ్ క్య చోరుభయోర్మధ్యే కాదివర్ణపరిపాటి మనుసృత్య ప్రథమోపస్థిత జకారమూర్ధాభిషిక్తక్యజ్ ప్రత్యయేప్రథమాతిక్రమణం కృత్వాజ వర్ణాపేక్షయా అంతేవాసీయశ్చకారః తాదృశాంత్యవర్ణఘటితక్యచ్ప్రత్యయే భవతామపికోయం మహామోహః అథోచ్యతే అస్మాకంక్యచ్ ప్రత్యయచ వర్ణేన తిరస్కర్తవ్యః యఏవప్రకృతిసంబంధదశాయాం "చిత" ఇతిశాస్త్రవిధినాపరార్థం వినియుజ్యమానః ప్రత్యయమేవోదాత్తమహిమానంకరోతీతి ఏవంతర్హి ఆస్మాకీనః క్యజ్ ప్రత్యయః స్వయమేవప్రకృతేర పేక్షాంపినా పరబ్రహ్మనత్ పూర్వాంపరమపి ప్రత్యయస్వరేణ సతిశిష్టస్వరేణచజిదుపదేశ శక్త్యవశాత్ పర మప్యనుదాత్తీకృత్యస్వీయోదాత్తవిభవేన నిత్యోన్నత్యం కదాపిన జహాతీత్యహోమ

హాత్త్వారసమ్యముభయోరిత్యుల్ల స్వప్రస్తుత ప్రశంసయా యద్వా కావ్య
ప్రసిద్ధపద్ధతి మనలంబ్యైవసుమనోల్లాస శబ్దేనాంతత్త్వేన సుమనః పదం
ఛంద్యః సుమనసాం=విదుషాం "అల్లా=అంబా" అస్తి=నివసతి యత్ర
గ్రంథేనసుమనోల్లాస ఇతిగ్రంథసంజ్ఞా పరత్వేన రామశబ్దవత్ అధికర
ణార్థేహలశ్చేతిఘఞ్ కరణాధి కరణయోరితి బాధకమపిల్యుటం నివర్త్య
బహులకాందధి కరణార్థే హలశ్చేతిఘఞ్ విదుషాంజ రోరిత్యుత్వేగుణే
పూర్వరూపే మనోభిరామ శబ్దవత్ సుమనశ్శబ్దా ల్లాశయోః సంధిః
అంబార్థ వా చ క శ్చ అ ల్లా శ బ్దః అ జం త స్త్రీ లిం గ ప్ర క ర ణే
అంబార్థ నద్యోర్హ్రస్వ ఇతిసూత్రోదాహరణ నిరూపణావసరే దీక్షి
తైరేపకారముద్యాంన్య రూప్యతేతి ద్రష్టవ్యం విద్వజ్జననీని వాసస్థానమి
త్యర్థః విద్వజ్జననీచ సరస్వతీతి యావత్ ననుసులభతయాసరస్వతీనివాస
ఇత్యేవ నామధేయకర్తవ్యే విద్వజ్జననీనివాస ఇత్యర్థక సుమనోల్లాస
శబ్దః కుతో గ్రంథ పరతయా నిర్దిష్ట ఇతిచేత్ విద్వన్మాతురస్మిన్ గ్రంథే
స్వ్యుషితత్వేన సర్వైః పండితైరాదర్తవ్యోయం గ్రంథఇతిధ్వననార్థం
వాచ్యార్థ ప్రధానాత్ ధ్వన్యర్థ ప్రధానశబ్దఏవోత్తమ ఇత్యాలంకారిక
సమయత్వాదనాయాసేన సర్వాంరమణీయమిత్యా నందితవ్యాం ఏవంచ
సమర్థితేన సుమనోల్లాస గ్రంథనామ్నా సాకం శ్రీకుమారాభ్యాసయ
వ్యాఖ్యాతా వా॥ శ్రీ। వేంకట సుబ్బయార్యో విరాజ్ఞే పమూచంద్రా
ర్కాం విద్వల్లోకముపతిష్ఠతాం యద్యస్మిన్ యః విషయే కశ్చిత్ప్రతివాదీ
పుస్ఫురిషతి సోఽస్యస్మభ్యంతిష్ఠ తామిత్యుపసంహరామః ఇమావత్ర
పక్షద్వయేఽపి సంగ్రహశ్లోకా। శ్లో॥ కర్తుఃకస్యజితిసూత్రతోఽద్య సుమనశ్శ
బ్దాత్ క్యజం మన్మహే తస్మాత్కర్తరికుర్మహేక్విపమత్రో లోపోయలోపః
క్రమాత్ ఉప్తత్వాత్ క్యజి పూర్వ వ న స్య సు మ నో ల్లా
సోఽనరీకృత్య తే సమ్యక్సప్తవిభక్తిభిర్ విజయతేసా విశ్వపాశబ్దవత్॥
శ్లో॥ యద్వాయత్రసంస్థితి సుమనసామల్లాస్తు ఇత్యూహాత్

విద్యాద్వాగ్విన్ధికసంజ్ఞయాఽధికరణే ఘఞ్ప్రత్యయం న్యస్యతాం। ఆసేదూర్ధ్వమితి ప్రసాధితమిదం రూపం ద్విధా హే బుధాః। సాంప్రత్వం నసమేతు సాంతసుమనశ్శబ్దేఽస్తి చేదాగ్రహః॥

రాజమహేంద్ర పురాంతర్భూమి కోటిలింగక్షేత్రనివాసి

దిది 5—1—1900 } కల్లూరి వెంకటరామశాస్త్రి.
రాజమహేంద్రవరం }

'సుమనోల్లాసశబ్ద మసాధువే'యనుట యసాధువే.

9—3—1900

---

1900 ఫిబ్రవరి 25 తేదీని ముద్రితమైన సూర్యాలోకములో సన్మార్గబోధినీవ్యాసము, ఈవలిలో సుమనశ్శబ్దోల్లాస శబ్దంబుల సంధి సూత్రములనుగూర్చి కొన్ని పత్రికలు పాడినపాటయే పాడుచున్నవి. ఇందువింత యేదియు లేదు గాన విస్తరించి వ్రాయవలసిన యవసరంబు కనుపడదు. మఱియు వేంకటగిరి సంస్థానపండితులగు సుబ్రహ్మణ్యశాస్త్రుల వారిచే సుమనోల్లాస శబ్దసాధుత్వ విషయమై యుపన్యసింపఁబడిన శ్లోకం పద్యంబులలో, క్విప్ప్రత్యయాంతంబగు మనధాతువుపై అర్శఆద్యచ్ ప్రత్యయము చేయగా 'మన అగునన్న రెండవ పద్యంబు సన్మార్గబోధిని ఖండించి చూపి అర్శాదిగణము ఆకృతిగణ మయ్యును వానియందు ఈ ధాతువును చేర్చుటకు ప్రమాణము వలయునుగదా! అని యసందర్భము వక్కాణించుచున్నది. అర్శఆద్యాకృతి గణంబులో నీధాతువుచేర్పఁబడ లేదన్నమాట యెంతవింత? ఆగణంబులో ధాతువులు చేర్పఁబడునా. అర్శఆదులలోఁ బఠింపఁబడిన 'అర్శస్' 'ఉరస్' తుంద ఇత్యాది శబ్దంబులన్నియు సన్మార్గబోధినీమతంబున ధాతువులే కాఁబోలు. ఇవి ధాతువులేనైన హోఁగుమ్మరివాఁఖ

లో దొరకిన వన్నియు నిత్తడి చెంబులే యగును. నాల్గవ యధ్యాయంబులో మొదటి సూత్రంబగు 'జ్యాప్ప్రాతిపదికాత్' అనిన సూత్రంబు పంచమాధ్యాయాంతము, అధికారమని కాముని శబ్దాధికారమందుం జెప్పంబడినది. 'అర్శ ఆదిభ్యోచ్' అనుసూత్రంబో' అయిదవ యధ్యాయములో రెండవపాదములోనిది. కానసీ సూత్రంబులోనికి, ప్రాతిపదిక శబ్దంబు అధికారంబుగాని ధాత్వధికారంబు లేదు. అందువలన నీగణంబులో నీధాతువు చేర్పంబడ లేదన్నమాట యసందర్భ ప్రలాపప్రాయంబు 'ఈ యచ్ప్రత్యయమును బాధించి జౌణాదికమగు 'అస్ ప్రత్యయము వచ్చును' అని యూసన్మార్గబోధినిలో సుబ్రహ్మణ్యశాస్త్రులవారి వాదమునందు రెండవ యసందర్భము చూపినది, ఇదియు మిక్కిలి లోకవిరుద్ధమే. మనధాతువుకంటె కృత్ప్రత్యయంబగు, క్విప్పు రాగా దీనిపైన నచ్ప్రత్యయమును రానీక బాధించి, తిరిగి కృత్ప్రత్యయంబగు, అస్ ప్రత్యయమే వచ్చునా? కాచు, చూచు, మొదలగు ధాతువులపై, కృత్తు రాంగా కాపు చూపు, అయిన పిమ్మట నీశబ్దంబులకుం గాని యిట్టి యేశబ్దంబులకైనం గాని కృదంతములపై నింకొక కృత్తు వచ్చుట గలదా? కృదంతము మీఁద తద్ధితవర్ణకంబు పుట్టి కాపరి, చూపరి, ఇత్యాదిరూపంబు లేర్పడునుగాని యొక ధాతువుపై 'రుబ్బురోలు కాకి యెత్తుకొనిపోయె' నన్నట్టులు రెండు కృత్తులు పుట్టుట కనియు వినియునుండలేదు. అపుడు మొదటి కృత్తు ఏయర్థమందు వచ్చును? రెండవ కృత్తుకేమి యర్థము? మొదటిది చెప్పిన యర్థమే రెండవదియుం జెప్పునా పునరుక్తి దోషంబు సంభవించును. భిన్నార్థమును జెప్పునా. "అన్యోన్య విరుద్ధార్థంబులచే నర్థశూన్యంబగును, కావున, కృదంతముపై కృత్తే పుట్టిన మొడలం జెవులపిల్లికేగాక యాపిల్లి చెవులపైం గూడం గొమ్ములు మొలచును. మఱియు నిచ్చట 'అసుక్' ప్రత్యయ మనవలెను గాని 'అక్' అనంగూడదు. ఇంతియకాక యీ పత్రికామతంబున మనధాతువుకం

కై, క్విప్పుపుట్టి ఔణాదికంబగు అసున్ వచ్చినమీఁద అనునాసికస్యక్వి ఝలోః క్ఙితి అని దీర్ఘంబు రాఁగా మానః, మానసీ, మానాంసి అనిన విరుద్ధరూపంబు లేర్పడి మనశ్శబ్ద మనవలసిన చోట మానశ్శబ్దమనుట విధిమై 'గండస్యోపరిపిటకా స్సంవృత్తా' అన్నట్లు రెండవయనర్థంబు సంభవిల్లును మఱియు సుమన ఉల్లాసమనియే భాష్యకారులు ప్రయోగించిరిగాన సుమనోల్లాసమనఁ గూడదని యాక్షేపించు నీపత్రిక, 'అర్శఆది గణ' మనుటకు మాఱుగా, అర్శాది గణమనిపలుమాఱు సంధిఁజేసిపలుకుచున్నది అట్టితప్పును దిద్దుకొనక పిచండిల పాండిత్యప్రచండంబగు సూర్యాలోక పత్రికగూడ ముద్రించుకొన్నది. అర్శశ్శబ్దముకూడ సుమనశ్శబ్దమువలెనే సకారాంతముగాన సంధియెట్టులు గూడును? అర్శాది గణమని భాష్యకారులు సవర్ణలోపంబుగా భాష్యంబులోఁ బలికిరో? అర్శశ్శబ్దము కడనేల యీపక్షపాతము. హా! తెలిసినది. అర్శశ్శబ్దముంగాంచఁగానే అరిసెలపిండివంటజ్ఞప్తికివచ్చి నోరూరితీపికిలోభించిభాష్యకారులీ శబ్దముగూర్చి సంధిచేసికొనిరి. సుమనోల్లాసశబ్దంబు వచ్చినెలగ కాయవలె గొంతుకంబడి కంఠము బిగియంబట్టఁగా సుమన ఉల్లాసమని బహుకష్టంబుగానుచ్చరించి దురహంకారముతో నీరెండు శబ్దంబులను గలియకుండ శిక్షగా నెడఁబాపిరి. భాష్యకారుల యంతటివారికేయంత దురహంకారమున్నప్పుడు పత్రికాధిపతులకు వేఱేచెప్పనేల. వారేసూత్రభాష్యంబులో ననిరని శంకింతురో? ఈ పాణినీయ సూత్రంబుల భాష్యంబులోఁగాదు. సుమనోల్లాసశబ్దంబు గుదిరిపోయెనుగదాయని యేమియుందోచక క్రిందికిం మీఁదికింబన్ను కొన్న సూత్రంబుల భాష్యంబులోఁ బలికిరి. ఓపండితేంద్రులారా. సకలవిధంబుల నయుక్తంబయి తెలుఁగు భాషలోనే యంటింపఁబడిన యీ కుట్లబొంత వ్యాసంబును గగనంబు దొరకినట్లు భావించి ముద్రించుకొన్న సూర్యాలోకమును జూచితిరిగదా! ఇఁకవిస్తరంబేల? కొన్ని దివసంబుల క్రిందట నొకా

నొక పండితునిచే సాధింపఁబడి, యాచార్థక క్యజ్ ప్రత్యయాంతం బగు సుమనశ్శబ్దంబుపై, క్యజంతంబైన యీకారాంత సుతీ శుష్కీ-శబ్దంబులకుంబలె, క్విప్పుచేయఁగా సిద్ధంబగు నాకారాంత సుమనశ్శబ్దమును, ఉల్లాసశబ్దంబుతో సంధించి, పండితులవలె నాచరించువారి కుల్లాసకరమని యొకపక్షంబును, 'సుమనః + అల్లా + అసః—అని సంధివిభజించి అల్లా శబ్దమంబార్థకంబుగాక, పండితుల తల్లికి నివాసంబైనదని యింకొక పక్షంబును 1900 సం జనవరి. 23 తేదీని పొడిచిన శశిలేఖోదయంబు ననుభవించి యభినందింతురుగాక లేకచేతనైనచో నిందింతురుగాక;

మఱియు 1900 సం ఫిబ్రవరి 18 దివసంబున నచ్చుపడిన సూర్యాలోకంబు, కాళహస్తిమాహాత్మ్య శోధనసమయంబున పత్ర, ఛత్ర, క్షుత్ర మొదలగు శబ్దంబులకుఁ దకారద్విత్వంబు లుంచుచు 'సర్వత్ర శాకల్యస్య' అనుసూత్రంబు నీద్విత్వలోపంబునకుగతియని కొందఱువాదించుచున్నారనియు, దేశమెల్లను నిరక్షరమయినప్పుడా వాదము తగుననియు, నిరక్షరమై మునిఁగి పోవుచున్న జగంబును సాక్షరంబు జేయుచున్నది ఆ సూత్రంబున ద్విత్వలోపంబును చెప్పుచున్న వాదంబును, ద్విత్వముండవలెనన్న వాదంబును హాస్యాస్పదంబుగా బింబప్రతిబింబభావంబునకు యోగ్యంబు లేకాని, ఈవఱలో సుమనోల్లాసశబ్దంబునకుఁ బ్రాణంబువోయి బ్రహ్మలవతరించినట్లు, అజాగళ స్తనాయమానంబైన యీతకారప్రపంచంబును శాస్త్రశుచిదృష్టిచే లయింపఁ జేయు నగ్రగులను నావిర్భవింపఁ గలారాదరుగాక!

ఇట్లు విన్నవించు
ధటా సూర్యప్రదర్శి.

—):o:(—

23—9—1912

# 4సూక్తిబ్రహ్మణ్యసారసాక్షి.

ఏకశబ్దంబు మొదలు నవాంతసంఖ్యాపదంబులకు సమాస

సాధుత్వసమర్థనము.

కల్లూరి వేంకటరామశాస్త్రి సమర్పిత స్వాభిప్రాయము

శ్రీవేదమూర్తులయినబ్రహ్మశ్రీ జంధ్యాల గౌరీనాథశాస్త్రులవారి

సమ్ముఖమునకు.

గీ॥ త్రిపథగయాస్త్రపతంజలి! కైయట నాగేశపండితోక్తిరసైః।
వాచాశ్లేషివ్యాస। సూక్తిబ్రహ్మణ్యసారసాక్ష్యాఖ్యః॥

శ్లో॥ శ్రుతవిశ్రుత జంధ్యాల। శ్రీగౌరీనాథశాస్త్రి వర్యకృతం।
ఏకాదినవాంతాంక। ద్వంద్వాదినిషేధఖండనం జీయాత్ ॥

పావనపురుషాగ్రణీ!! పండితగేయచూడామణీ? పారితోషికంబు గాఁదమపంపిన యేకాదినవాంతాంకద్వంద్వాది నిషేధనిర్ణయంబనెడి పుస్తకంబును సవిస్తరంబుగా సావధానమనస్కుండనై చదువంగాంచితిని. ఈకోశంబున సిద్ధాంతపక్షంబున నిరూపింపఁబడినసదుక్తులు పండితమండలికి మూర్ధాభిషిక్తయుక్తులుగా స్ఫురింపక మానవు. పూర్వపక్షులెవ్వరో విశేషించి పేర్కొనఁబడమింజేసి వారినామధేయ రూపధేయంబులు నా మానసంబునకు గోచరంబులు గాకున్నయవి. పూర్వపక్షులు దురుద్ధర పూర్వపక్షంబులనుకొన్న నారాయణాస్త్రంబులు వారిమెడలఁ బారాయణమాత్రఫలకంబులే కావున పారాయణాస్త్రంబులని చెప్పనొప్పును గానినారాయణాస్త్రంబు లెంతమాత్రమును గానేరవు. అదియట్లుండఁగా నాయభిప్రాయంబును వినఁగోరుచున్నాఁడను.

1ఏకద్విత్రిచతుష్పంచక్రమేణ గణనా మేషామివా నన్తంయాతామ్

ఇత్యాద్యనర్ఘరాఘవ ప్రముఖగ్రంథంబులందు "ఏకద్వి" ఇత్యాదిస్థలంబులసూ॥ త్యదాదీని సర్వైర్నిత్యం॥ అనుసూత్రంబున నేకశేషంబెందుకు రాలేదని 37పుటలో పూర్వపక్షులు శంకించుటం గాంచితి.

వారి తాత్పర్యంబిట్లని తోఁచెడిని.

పూర్వోక్తములయిన ప్రయోగంబులలోని త్రిశబ్దాదులు త్యదాదిభిన్నంబులు గాన నయ్యవి త్యదాద్యంతర్గతములై ద్విశబ్దాదులతోఁ జార్థంబున మిళితంబులైనపుడు, సచ, దేవదత్తశ్చతౌ॥ ఇత్యాదులందుఁ ద్యదాద్యంతర్గతంబైన తచ్ఛబ్దంబుమాత్రము శేషించి యాశబ్దంబుమీఁద నున్నద్వివచనంబుచేత దేవదత్తశబ్దార్థంబును సహితము దెలిపినట్లు ప్రకృతంబునంగూడఁ బైప్రయోగములలోని 'ఏక' శబ్దముగాని 'ద్వి'శబ్దముగాని శేషించి తమమీఁదను బహువచనప్రత్యయంబును బొంది లోపింపఁ దగియున్న త్రిశబ్దాదులయర్థంబును నేల నుడువఁజాలవనిన ప్రశ్నార్థంబు కరతలామలకంబుగా స్పష్టపడుచున్నయది. మఱియు "ఏకద్వి" శబ్దంబులు చార్థంబున మిళితంబులైనచో, సూ॥ త్యదాదీనాం మిథస్సహోక్తౌయత్పరం తచ్ఛిష్యతే॥ అనుశాస్త్రంబున ద్విశబ్దంబుమాత్రము శేషించి లోపింపవలసియుండిన యేకశబ్దార్థంబు నేలబోధింప నేరదనియు రెండవప్రశ్నార్థంబు ప్రకాశించుచున్నయది. ఈ రెండుపూర్వపక్షంబులకును నీవక్ష్యమాణంబైన త్యదాదిసూత్రశ్రీధ శేఖరంబే సమాధానంబు సమంజసంబుగాఁ దెలుపుచున్నయది॥ త్యదాద్యంతర్గతయోరపి, ఏకద్వ్యోర్నైకశేషో నభిధానాత్ ధ్వనితంచేదం సరూపసూత్రభాష్యే, ద్వంద్వోప్యేతయోర్న। ఏకాదిశవాంతానాంద్వంద్వా భావస్యచార్థేఇతిసూత్రశేషే భాష్యేధ్వనితత్వాత్ ఏవంచ ఏకద్వికరణే హేతూ మహాపాతకపంచకేత్వాణావన్మన్యతేకోప। కాహూయః పంచకారయత్" ఇతి నైషధపద్యే ఏకద్వికరణే ఇత్యసాధ్వేవ॥ పైనిం జెప్పిన సూత్రశేఖరంబున నాగేశపండితులు సరూపసూత్రభాష్యధ్వనివలనను, చార్థేసూత్రభాష్యధ్వనివలనను, ఏక

ద్విప్రభృతు లయినయంకంబులకుఁ గ్రమంబుగా నేకశేషంబును ద్వంద్వ సమాసంబును "పరియుక్తానామనన్వాఖ్యానాత్" అను భాష్యతాత్పర్యము వలన లోకప్రయోగ ప్రసిద్ధంబులుగావని స్థిరపఱచుచున్నారు. 1 సరూపసూత్రభాష్యధ్వని స్పష్టపడఁగా నీక్రిందను స్థాలీపులాకన్యాయంబుగాఁ గొంచెము వ్రాసి కనఁబఱుపఁబడును. ఏకద్వ్యాదిశబ్దంబులకు నేకశేషం బెందుకు రాదని శంకించుకొని "సంఖ్యాయా అసంప్రత్యయాదన్యపదార్థత్వాచ్చానేకశేషః। సంఖ్యాయా అర్థాసంప్రత్యయాదేకశేషోనభవిష్యతి, నహ్యేకావిత్యనేనార్థోగమ్యతే। అన్యపదార్థత్వాచ్చసంఖ్యాయా ఏకశేషోనభవిష్యతి" అని భాష్యము "ఏకశ్చ, ఏకః" అని యేకశేషంబుచేసినచో నట్టి ద్వివచనాంతమయిన యేకశబ్దంబు, లోకప్రయోగప్రసిద్ధింజేసి యసహాయుల నెడియప్రకృతార్థంబిచ్చునుగాని యిద్దఱనిన సంఖ్యార్థమొంత మాత్రంబును బోధింపఁజాలదనియు, ఇద్దఱనినయర్థంబు నిస్సందేహంబుగా బోధించుటకు ద్విశబ్దంబె కంకణంబుగట్టుకొని జాగరూకంబగుచున్నదియనియుం బూర్వోక్తభాష్యతాత్పర్యము. అనఁగాఁ బ్రకృతియైన యేకశబ్దం బేకత్వసంఖ్యను దెలుపుచుండఁగా నట్టిప్రకృత్యర్థంబునకు ననువాదకంబయిన యేకవచనంబె యేకశబ్దంబుపయి వచ్చుట న్యాయంబుగానఁ బదార్థద్వయంబును బోధించుచుఁ బ్రకృత్యర్థవిరుద్ధంబయిన ద్వివచన ప్రత్యయంబు రాదని భాష్యతాత్పర్యము. ఇట్లె నాలుగనినయర్థమును ధారాళముగాఁ దెలుపునట్టి చతుర్శబ్దంబు చాకచక్యంబుతో నిర్వర్తిల్లఁగా, చతుర్శబ్దార్థమునందు "ద్వౌచ, ద్వౌచ" యని యేకశేషంబు గలిగించి ప్రకృత్యర్థంబైన ద్విత్వంబునకు విరుద్ధంబయిన బహువచనప్రత్యయమ్మొంచిన చోనట్టి ద్విశబ్దంబు, ఏకశేషంబెందుకు రాదని యడిగినవారలకు, సార్థకత్వంబును గలిగింపక యనర్థప్రదమగునని యు, భాష్యమం దుద్ఘోషింపఁ బడినది. పైనిం జెప్పినకారణంబులవలన శదశాంతశబ్దంబులవఱకు నున్నయంకంబులకు నేకశేషంబుగలుగ నేరదు.

కాని యిట్టి దుర్భరంబైన పక్షంబులం గైకొని యెంతో గగనంబుగా నెం
చుకొనుచు సంచరించువారికి వేఱొకరు పరిజ్ఞాతలు సాహాయ్య
పడనందున నేకాకితనంబు సంఘటిల్లి, యేకశేషత్వంబు రాకపోదని
నమ్ముచున్నాఁడను.

2. చార్థేసూత్రభాష్యధ్వనియుఁగూడ నెట్టులున్నదో కాంచెము
విన్నవించుచున్నాఁడను చార్థంబులలో నొకయర్థంబైన సమాహారంబు
నందు ద్వంద్వప్రకరణమ్మున భాష్యంబులో నిట్లు శంకాసమాధానంబులు
వ్రాయఁబడియున్నవి. "ఏకాదశద్వాదశేతికోయం సమాసః॥ ఏకా
దీనాందశాదిభిర్ద్వంద్వః। ఏకాదీనాందశాదిభిర్ద్వంద్వఇతిచేత్ వింశత్యా
దిషువచనంప్రాప్నోతి। ఏకవింశతిః ద్వావింశతిః" అని చెప్పుచు "తస్యైకవద్వ
చనం తదానపుంసక లింగంప్రాప్నోతి। లింగమశిష్యం లోకాశ్రయత్వాల్లిం
గస్య" అనియుపసంహరింపఁబడినది. పూర్వోక్తభాష్యంబున సమాహార
ప్రకరణంబులో నేకాదశద్వాదశ శబ్దంబులెట్లు సాధువులనిశంకించుకొను
టంబట్టి దశశబ్దంబుకంటెఁ గ్రిందనున్న యేకాదినవాంతసంఖ్యలకునఖండస
ంఖ్యార్థమందు సమాహారద్వంద్వంబునిషిద్ధంబని ధ్వనించుచున్నది। న
వాంతసంఖ్యలలోనే యట్టిసమాహారద్వంద్వంబుండెనేని "ప్రథమాతిక్ర
మణే కారణాభావాత్" అనున్యాయంబునకు వ్యతిరేకముగా నేకద్వ్యాదు
లనుమీఱి యేకాదశద్వాదశాది సంఖ్యాశబ్దపర్యంతానుధావనంబేల భా
ష్యకారులు చేసిరి? గావున నవాంతసంఖ్యలలో నొండొంటికి నఖండసం
ఖ్యార్థమందు సమాహారద్వంద్వంబు లేదన్న భాష్యతాత్పర్యంబు నిశ్చితమ
గుచున్నది. అందులకుఁ గారణంబేమనఁగా "సంఖ్యాయా అర్థాసంప్రత్య
యాదన్యపదార్థత్వాచ్చానేకశేషః అని యేకద్వ్యాదిశబ్దంబులకు నేక
శేషవృత్తిని నిషేధించుటలోఁ జెప్పిన సమాహారప్రభాష్యస్థయుక్తులే
యీసమాహారద్వంద్వనిషేధంబునందును హేతువులగుచున్నవియని నా
బుద్ధికిఁదోఁచెడిని. ఏకాదిశబ్దంబులకు నేకశేషవృత్తి చెప్పి యాశబ్దంబులపైఁ

ప్రకృత్యర్థవిరుద్ధంబగు ద్వివచనాదులుంచినను ద్విశబ్దాదులవలన నట్టి ద్విత్వాద్యర్థసంఖ్యలు ఝడితి స్ఫురించినట్లు స్ఫురింపక "ఏకా, ఇత్యాదులవలన, ససహాయులన్న యప్రకృతార్థం బెట్టులు తోచునో; యట్లే ప్రకృతంబునందు నేకద్వ్యాదులకు సమాహారద్వంద్వంబు రచించినను, త్రిత్వాద్యఖండసంఖ్యలను స్పష్టంబుగాఁ జెప్పుటకుఁ బ్రసిద్ధంబులైన త్రిశబ్దాదులు జాగరూకంబులగుచుండ, నేకద్వ్యాదులకు నొనరించిన సమాహారద్వంద్వంబుల వలనఁ ద్రిత్వాద్యఖండార్థసంప్రత్యయంబు కలుగనేరక తాదృశసమాహారద్వంద్వఘటకములైనను, నేకద్వ్యాదిశబ్దంబులు వేర్వేఱుగాఁ దమతమ యర్థంబులమాత్రమును బోధించుటలో వినియోగించినందున సాభిధాశక్తి విగమింపఁగా, నన్యోన్యసాహిత్య విశిష్టసంఖ్యాబోధను (సంకలితార్థప్రతీతిని) స్ఫురింపఁజేయఁజాలవని భాష్యతాత్పర్యము. త్రిత్వాదిసంఖ్యార్థబోధమునందు ననన్యసాధారణంబైన స్వాతంత్ర్యము వహించి గూఢంబులై నిర్భయంబుగాఁ ద్రిశబ్దాదులు జగత్ప్రసిద్ధసామాన్యశక్తులతోఁ బరిఢవిల్లుచుండఁగా, నట్టివాని ముంగట నెంతో [illegible] కొన్ని సమాహారాదిద్వంద్వంబుల నొందివచ్చినను నేకద్వ్యాది శబ్దంబులు తమలోఁ బ్రత్యేకముగా నొకదానికిని లేనట్టి పరకీయశక్తిని నన్యోన్యసాహాయ్యంబునఁ దమకుఁ దెచ్చిపెట్టుకొని లోకంబులో వ్యవహరించుటకు జంకి సిగ్గుపడుంగాని, యట్టి సమాసంబులలో నున్న యయ్యవే, వేర్వేఱుగా జన్మప్రభృతిఁ దమకు జగద్విదితంబైన స్వశక్తిని విడనాడక స్వార్థంబులు భిన్నభిన్నంబుగా వెల్లడించుకొనుటలో నేమి ప్రతిబంధము గలదు? కాఁబట్టి యేకాదశాదిశబ్దంబులకు నక్కఁ దక్కిన నవాంతసంఖ్యలకు సమాహారంబు చెప్పినను, నఖండ సంఖ్యార్థబోధము (నిరవయవసంఖ్యాప్రతీతి) శబ్దశక్తి స్వభావంబునం జేసి కలుగనేరదని భాష్యతాత్పర్యమునియమంబు సజాతీయవిషయంబున పేర్కొంచునుగాన ఏసమాహారాదిద్వంద్వంబులలో

నేకాదిసంఖ్యలు దశాదిసంఖ్యలతో సమసించినపుడు సంకలితసంఖ్యార్థబో

థంబు నిచ్చునో, ఆసమాహారాదిద్వంద్వంబులలోనే యేకాదినవాంత సంఖ్యలు సమసించినపుడు సంకలితార్థంబు నీయఁజాలవని సంకలిత సంఖ్యార్థంబుతత్రత్యభాష్యప్రకరణంబున బట్టినిరూపింపఁబడుచున్నది. కాని ద్వంద్వంబు నియమింపఁబడదు. సమాహారద్వంద్వంబులో ద్రవ్యంబులు విశేషణంబులును, సాహిత్యము ప్రధానమునియు, ఇతరేతరద్వంద్వంబులో సాహిత్యము విశేషణముగ ద్రవ్యంబులు ప్రధానములుననియు, శాస్త్రమర్యాదననుసరించి యేకాద్యాదిశబ్దంబులకు సమాహారద్వంద్వంబు చెప్పినచో సాహిత్యప్రాధాన్యమునంజేసి సంకలితసంఖ్యా ప్రతీతి తప్పక స్ఫురించుననియుఁ. గాన నట్టి స్థలంబులందు నితరేతరద్వంద్వంబే రచింపవలయుననియు నట్టి సంకలిత సంఖ్యాప్రతీతికొఱకే "ఏకాదశ, ఏకవింశతి" ఇత్యాదులందు సమాహారద్వంద్వంబు చెప్పిన భాష్యసారస్యము ధ్వనించుచున్నదియనియుఁ జెప్పుటకు నవసరంబు కానిపింపదు. ఏకాదశాదిశబ్దంబులతో నితరేతరద్వంద్వంబుసేయఁగా నిత్యబహువచనాంత దశశబ్దాంతసమాసంబులలో బాధలేకున్నను "ఏకవింశతిః" "ద్వావింశతిః" ఇత్యాదులందు నితరేతర ద్వంద్వంబువలన సమాసంబులో ఏకవింశతీ అని ద్వివచనాపత్తి కలుగుసను కారణంబుననే సమాహారద్వంద్వంబు రచింపఁబడినదికాని సంకలనార్థప్రతీతికై కాదు. కావుననే చార్థేసూత్రభాష్యంబున నిట్లు వ్రాయఁబడినది "ఏకాదీనాందశాదిభిర్ద్వంద్వ ఇతిచేద్వింశత్యాదిషు వచనప్రసంగఇతి; నైషదోషః. సర్వోహిద్వంద్వో విభాషైకవద్భవతి, తదాతస్యైకవచనం తథానపుంకలింగంప్రాప్నోతి, లింగమశిష్యం లోకాశ్రయత్వాల్లింగస్య" అని యుపసంహరింపఁబడినది. పైనిఁజూపఁబడిన చార్థేసూత్రభాష్యములో నేకవింశత్యాదులందు ద్వివచనాదులువచ్చి రూపమందు దోషంబు గలుగుననియు, కావున సమాహారద్వంద్వంబు రచింపఁబడెనేని లింగము లోకాశ్రయమయినందున నపుంసకలింగముగాక స్త్రీలింగమె యుండవచ్చుననియుఁ. భాష్యంబు

నఁ జెప్పఁబడినదిగాని సంకలితార్థప్రతీతి కలుగనేరదనియాపత్తి యీయఁబడలేదు. సమాహారద్వంద్వరచనవలన ముఖ్యంబుగా సంకలితసంఖ్యాబోధమే తోఁచుననెడి నట్టిదోషోద్ఘాటనంబు సేయక యట్టి సమాసంబుల నితరేతరద్వంద్వంబు నొప్పుకొనుచు వచనంబునం జేసి దోషము వచ్చునని యెట్లు రూపనిష్పత్తిదోషంబు మాత్రమే చూపఁబడినది? కాన, ఏకాదశశబ్దము మొదలుకొని అష్టాదశశబ్దంబులవఱకు రూపనిష్పత్తి దోషంబు లేనందున సమాహారేతరేతరద్వంద్వంబులలో నేదియైనను జేయవచ్చుననియు, సంకలితార్థబోధంబు "ప్రయుక్తానామన్వాఖ్యానాత్" అనున్యాయంబున శబ్దశక్తి స్వభావంబుననే కలుగుననియు. భాష్యకైయటముల తాత్పర్యంబు చార్థేసూత్రమునొద్దఁ గరతలామలకంబుగాఁ గానవచ్చుచున్నది. అందుననే ద్వ్యష్టనసూత్రశేఖరమున "ద్వావింశతిరితి, సమాహారద్వంద్వేస్త్రీత్వాల్లోకాత్, ఇతరేతరయోగస్తున. తత్సూత్రభాష్యే ఏవధ్వనితానభిధానాత్" అని యేకవింశతిద్వావింశత్యాదులయందు నితరేతరయోగంబునకు ననభిధానమని చెప్పుచు నిట్టి శబ్దంబులకు సంకలితార్థబోధంబు శబ్దశక్తి స్వభావంబునఁ గలుగునని యభిప్రాయపడి "వస్తుతః సంఖ్యాంతరాణి నిరస్తానయువాన్యేకవింశత్యాదీని" అనితుట్టతుదను లిఖింపఁబడినది. కాఁబట్టి యేకద్వ్యాది శబ్దంబులకు సంకలితసంఖ్యార్థమందు సమాహారేతరేతరద్వంద్వంబులకు ననభిధానంబుగాని భిన్నార్థప్రతీతియుం దట్టిసమాసంబులు ఘంటాపథంబుగా నొప్పుచుండుననని తోఁచుచున్నది. కాన సమాహారస్థలంబున సంకలితార్థకల్పనంబు సరసంబుగాఁ గానిపించదు. మఱియు సిద్ధాంతకౌముదిలోనే ద్వ్యష్టనసూత్రమునొద్ద "ద్వౌచ, దశచ" అని సంకలితసంఖ్యార్థమందు నితరేతరద్వంద్వవిగ్రహంబు రచించి చూపఁబడినను, శేఖరకారులెత్తుకొని సంకలితార్థమం దితరేతరయోగంబుగూడదని యాక్షేపింపలేదు. సమాహారద్వంద్వస్థలంబున సంకలితార్థంబు తోఁచుచున్నచో "ఛత్రోపాన

హా హరతి, శమీాద్రుపదం ప్రాప్నోతి" ఇత్యాదిసమాసఘటక పదార్థంబులకు సంకలనంబు గలిగి విరుద్ధార్థంబగును. ఈయర్థంబునె, సూ "ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే" అను సూత్రకారప్రయోగంబును "సరూపాణాంశేష ఏకవిభక్తావితీయత్యుచ్యమానేద్విబహ్వోరపి శేషః ప్రసజ్యేత" అను సరూపసూత్రస్థభాష్యప్రయోగాదులును ద్యోతకములగుచున్నవి. భిన్నార్థస్థలంబున సంఖ్యావాచకపదంబులకు ద్వంద్వంబు నిర్వివాదంబుగా నుండవచ్చునందులకు "శ్లో॥ ఏకద్వికరణే హేతూ। మహాపాతకపంచకే। తృణవన్మన్యతే కోపః। కామాయః పంచకారయః॥ అను నైషధకావ్యమునందలి పద్యంబులోఁ గోపము ఏకకరణమందు హేతువనియు, కామము ద్వికరణమందు హేతువనియు, అనఁగా, ఒక బ్రహ్మహత్యనే చేయుటకుఁ గోపము కారణమనియు, సువర్ణస్తేయ గురుతల్పగమనములను రెండు మహాపాతకములను జేయుటకే కామము కారణమయు, లోభమైదుమహాపాతకములను జేయుటకుఁ గారణము గానఁ గోపకామములను తృణతుల్యముగా లోభము చూచుననన్న పద్యార్థంబులో "కోపకామౌ" అను ద్వంద్వములో మొదటనున్న కోపము "ఏకద్వి" అను ద్వంద్వములో మొదటనున్న ఏకశబ్దముతోను, తర్వాతనున్న కామము తర్వాతనున్న ద్విశబ్దంబుతోను యథాసంఖ్యముగా భిన్నభిన్నపదార్థంబులతో నన్వయించునందున నిచ్చట సంకలితసంఖ్యాప్రతీతిలేదు కాఁబట్టి వేలనాగేశపండితులీకవిప్రయోగంబును నసాధువని యాక్షేపించినో యుత్తరంబు చెప్పనగుననసి శంకింతురేని సావధానచిత్తంబునఁ జిత్తగింపవలయును.

## సమాధానము

"ఏకద్వి" అను ద్వంద్వంబులోనున్న "ఒకటి" "రెండు" అను సంఖ్యలతో "కోపకామౌ" అను ద్వంద్వంబులోనున్న రెండుపదార్థము గా కోపకామములకు క్రమ [illegible]

సూత్రస్థభాష్యకైయటవివరణముల తాత్పర్యమై యున్నది. కనుక న య్యవి యేకదేశంబుగా స్థాలీపులాకన్యాయంబున నుదాహరించుచున్నాఁడను. "ఆద్యంతౌటకితౌ" సమాననిర్దేశోయం తత్ర న జ్ఞాయతే క ఆదిః కోన్త ఇతి తద్యథా—"అజావిధనౌ దేవదత్త యజ్ఞదత్తౌ" ఇత్యుక్తే తత్ర న జ్ఞాయతే—కస్యాజాధనం, కస్యావయ ఇతి భాష్యం॥ యద్యపి దేవదత్తస్య యజ్ఞదత్తస్య చాజా అవయశ్చధనమితివాక్యేపి క్రమవ్యవస్థా నాస్తి తథాపి సమాసే సుతరాం నాస్తీతి ప్రతిపాదయితుం సమాస ఇత్యుక్తం, కైయటః॥ సుతరామితి, యత్ర న సాహిత్యస్య నియమేన ప్రతీతిః, పృథగుపస్థితిశ్చ, తత్రాపి చేన్న క్రమవ్యవస్థా కిముత వక్తవ్యం సాహిత్యప్రతీతా వపృథగుపస్థితౌ చేత్యర్థః వివరణం॥ "దేవదత్తయజ్ఞదత్తులు అజావిధధనులు" అన్న సమాసస్థలంబులో దేవదత్తయజ్ఞదత్తులిద్దఱిలో నెవరివి మేకలో యెవరివి గొఱ్ఱెలో తెలియఁబడవని భాష్యము. దేవదత్తునకు యజ్ఞదత్తునకును మేఁకలును గొఱ్ఱెలును ధనమనునట్టి వాక్యమునందును యథాసంఖ్యము చెల్లదు కాన సమాసమందు నుతరాం క్రమాన్వయము లేదని కైయటను. ఈయభిప్రాయమునే వివరణకారులు నాగేశపండితులును సమ్మతించుచున్నారు. దేవదత్తయజ్ఞదత్తులు చరస్థిరాస్తులను బంచుకొనిరి యన్నచోట సాహిత్యమువలన సమాసనిర్దిష్టార్థముతో సమాసనిర్దిష్టార్థము సంబంధించునుగాని క్రమాన్వయము లోకమర్యాదననుసరించి కలుగదని గ్రంథకర్తల తాత్పర్యము. కనుక క్రమాన్వయము లేక దేవదత్తయజ్ఞదత్తు లుభయులును జరస్థిరాస్తులుభయములను భాగించుకొనిరియన్న యర్థంబుతోఁచును. అట్లే సీతారాములను భరతశత్రుఘ్నులు పూజించిరియన్న వాక్యంబునందుఁ గూడ సీతారాము లుభయులను భరతశత్రుఘ్ను లుభయులు పూజించిరియన్న యర్థంబగుఁగాని సీతను భరతుఁడును రాముని శత్రుఘ్నుఁడు బూజించిరియను క్రమంబు చెల్ల నేరదు. ఈయర్థమే "ఆద్యంతౌటకితౌ" అను సూత్రమునొద్ద శేఖరమందు వ్రా

యఁబడినది. "యద్యప్యత్ర మిళితస్య నైకత్రాన్వయ ఇతిద్వంద్వోన
ప్రాప్నోతి॥ తథాపిసమూహయో రన్వయబోధో త్తరం యథాసంఖ్యమితి
సూత్రారంభ సామర్థ్యాత్పునః ప్రత్యేకమన్వయః లోకేత్వేవం రీత్యా
ప్రయోగో సాధురేవేతిభాష్యేస్పష్టం" కావునఁ బ్రకృతమందును "కోప
కామౌ ఏకద్విత్రికరణే హేతూ" అనినచోటను "కోపకామౌ" అనిన ద్వం
ద్వముయొక్క విశిష్టార్థము "ఏకద్వి" అనినద్వంద్వముయొక్క విశిష్టార్థ
ముతో నన్వయించును, "ఏకద్వి"అనుదాని విశిష్టార్థము ప్రకరణసందర్భ
వశంబున మూఁడు(మహాపాతకములు) గాన సంకలనంబుచేయఁగాఁ గో
పకామము లుభయములు గలిసి మూఁడు మహాపాతకములను జేయ
హేతువులగుననిన యర్థంబగునుగాని కోపమొకదానిని (మహాపాతక
మును) కామంబు రెండింటిని (మహాపాతకములను) జేయ హేతువులౌనని
నక్రమాన్వయంబు రానేరదని శేఖరకార తాత్పర్యము. దేవదత్తుఁడునూ
ఱురూప్యంబులును యజ్ఞదత్తుఁడు రెండునూఱులరూప్యంబులును నీయవల
సియున్నపుడు దేవదత్తయజ్ఞదత్తు లుభయులును గలిసి "గర్గాశ్శతందం
డ్యంతాం" అనుచోటునందువలె నేసముదాయవాక్యపరిసమాప్తిన్యాయం
బున మూఁడువందలరూప్యంబులు నీయవలసియుండిరియనిన లోకవ్యవహా
రముకలుగును. అచ్చటి ప్రకరణసందర్భవశంబున ఘనభాగంబుల న్యూన
తాధిక్యంబులు, తెలియును. అట్లే ప్రకృతంబునందును గోపకామంబులు
మూఁడుమహాపాతకములు సేయుటకు హేతువులనినచోఁ గూడ ఉచితత్వ
మునుబట్టి కోపము బ్రహ్మవధంబునకును, కామము సువర్ణస్తేయ గురు
తల్పగమనంబులకును గారణములనిన యర్థంబుతోఁ జను కాని కోపము
ప్రత్యేకముగా మూఁడింటికి, కామము ప్రత్యేకముగా మూఁడింటికిని గా
ణములుగాలేవు. "శ్లో॥ కామఏష క్రోధఏష రజోగుణసముద్భవః" అను
గీతావాక్యమునఁ గామము కోపమనెడి కార్యరూపంబునఁ బరిణమించుట
జేసి "తదనన్యత్వ" న్యాయంబునఁ గోపము రూపాంతరముం బొందినకా

మమేకానఁ గామంబు మూఁడుమహాపాతకంబులకును గారణంబైనను గోపంబారితినిగా నేరదు. కనుకఁ గోపకామముల కార్యౌచిత్యమునను సరించి తాత్పర్యసమన్వయంబు చేసికొనవలయునని తోఁచుచున్నది. పూర్వో క్తకారణంబులచేత "ఏకద్వికరణే హేతూ" అనుచోటను సంకలనార్థంబు తప్పనందున "త్రయాణాంకరణే హేతూ" అనవలసియుండునని శేఖరకార తాత్పర్యమైనట్లు స్పష్టపడుచున్నది. ఇట్లుశాస్త్రార్థంబు నాలోచింపఁగా నవాంతసంఖ్యలకు సంకలనార్థంబులేని స్థలంబులందు శంకనొందక నిరం కుశంబుగా ద్వంద్వంబు నివ్వటిల్లుననిస్పష్టపడుచున్నది. సాహిత్యరత్నా కరము దోషతరంగము. శ్లో "పాథో వాహాపద స్త్రిస ప్తదశదోర్గల్లత్స్వవై?" అను శ్లోకమునొద్ద "త్రిస ప్తదశదోర్గల్ల ఇత్యత్ర వింశతిదోరితివ క్తవ్యే త్రిస ప్తదశదో రిత్యపుష్టార్థం ప్రకృతానుపయుక్తార్థ॥ మపుష్టార్థంతదు చ్యతే ఇతిలతణాత్" అనియున్నది. "త్రిస ప్తదశదోర్గల్లః" ఈస్థలమందు "ఇరువది" అన్నయర్థమును, మూఁడు, ఏడు, పది, అను మూఁడు సంఖ్యల సంకలనంబుచేసి చూపుచు నపుష్టార్థదోషంబునకే యుదాహ రణముగా నీఁబడినది. చ్యుతసంస్కారంబునకు నుదాహరింపఁబడలేదు. ఇట, మూఁడు, ఏడు, సంఖ్యలు నవాంతసంఖ్యలలోనివి గావున సంకల నంబులో సమానంబెట్లు గుదురునో సంశయింపవలసియున్నది, అట్టినిషే ధము కేవలమును నవాంతసంఖ్యలకే ద్వంద్వము చేయునపుడుచెల్లును గాని యతీతసంఖ్యా సమభివ్యాహారస్థలంబున నిషేధంబు ప్రవర్తిల్ల నేరదని తోఁచుచున్నది. ప్రకృతంబున నవాంతసంఖ్యాతీతమయిన దశ సంఖ్యకూడ నున్నందున నట్టినిషేధము చెల్లదని ధర్మాంతర్యాణి తా త్పర్యమయినట్లు ధ్వనించును. కాన సంకలనార్థస్థలంబు కానిచోట్లను న వాంతసంఖ్యలకు ద్వంద్వంబుండవచ్చును.

1 ఏకద్విత్రిచతుష్పంచ॥ గుణావ్యోమాదిషుక్రమాత్. వేదాంతపంచదశీ. పం. భూ.

౨ ఏకద్విత్రిచతుష్పఞ్చసంయుతై ర్దన్త్యైః క్రమాదాతఙ్కవే }
౩ యాతస్యాస్తుకరగ్రహో యది చతుస్త్రిద్వ్యంఘ్రిభిష్షోడశతిథౌ తా }

కాలామృతము. ౧ బిం ౩ బిం

4 ఖంభూకృతాః కువసనో ద్రిభవాః ఖవిష్ణో స్త్రీంద్రదివోసనవపక్షి తయో (౧౯౯) ర్యపదస్యాః— శబ్దశాస్త్రమునంకుశ ప్రజ్ఞాధుర్యుండయిన గణేశపండితుని గ్రహలాఘవ గ్రంథము. స్పష్టికరణాధికారము

5 బింబార వేద్విద్వ్యశరతుంగ (౬౭౨౨) సంఖ్యా— సిద్ధాంతశిరోమణి చంద్రగ్రహణాధికారము భాస్కరాచార్యప్రయోగము ఇతండు శబ్దశాస్త్రము రానివాండు శాస్త్రాంతరరచనంబునకుం దగండని వ్యాకరణమును స్తుతించెను.

6 ఏకదశ్యాదిభేదాస్స్యు రిదంసాధారణాస్మృతం— భాస్కరాచార్యకృతలీలావతి మిశ్రవ్యవహారము

7 ఏకద్విత్ర్యాది మూషావహానమితిరహో బ్రూహి మే భూమి భుజః లీలావతి: మిశ్రవ్యవహారము

8 ద్విత్ర్యాంతరత్వాక్షత్యాణాం దర్శనే స్యాయామాంతరః — వేదాంత చిత్రదీపము

లీలావత్యాదులలోం గేవలసంఖ్యావాచకంబు లగును ద్వంద్వంబున్నది.

1 అయే బాలే లీలావతి మతిమతి బ్రూహి సహితాన్ ద్విపంచ ద్వాత్రింశత్త్రినవతిశతాష్టాదశదశ; లీలా. పరి

2 చతురశ్రే ద్విషట్త్రిశ్రకాణా। భుజాస్త్రిశ్రేద్వ్యసణ్ణవ— క్షేత్రవ్యవహారము. లీలావతి

3 ద్వ్యష్టిషా ౧౮ త్రిగాంసద్విస్రాః— సూర్యసిద్ధాంతము స్పష్టాధికారము ఉత్క్రమజ్యాప్రకరణము

ఇట్లు దిగంతవిశ్రాంత ప్రచండ పాండిత్య ప్రాభావులై పండితలోకబాంధవులగు మహాసూరులు ప్రయోగించినసుకరంబగు సప్రయో

గంబులింకను బ్రవర్తిల్లుచున్నయవి. 47 వ పుటయందుయుక్తిప్రమాణాదులం బండితులు చెప్పవచ్చునని యున్నందున రూపసాధనవిషయములోఁ బ్రమాణపురస్సరముగాఁ గొన్నియుక్తియుక్తములైన యుక్తులనువచించి యీవ్యాసమును వ్రాసినాఁడను. ఈనాయుపన్యాసమ్మున న్యాయాభాసముతోఁ చెనేని "తంసంతశ్శ్రోతు మర్హంతి। సదసద్వ్యక్తి హేతవః" అను కాళిదాసవచన న్యాయంబునఁ బండితులుప రామర్శించి పరమార్థప్రదర్శనమందు నాకుమార్గదర్శకులగుదురుగాక!

ఇట్లువిన్నవించు విబుధవిధేయబంధువు.

కల్లూరి వేంకటరామశాస్త్రి

23—9—12 ఆర్ట్సుకాలేజి.

ఉభయభాషాధ్యాపకపండితుఁడు.

రాజమహేంద్రవరము.

(ఇయ్యదిబాదరుపురీవాసులు సర్వదా పండితగోష్ఠీపరాయణ బ్రహ్మశ్రీజంధ్యాల గౌరీనాథశాస్త్రులవారి కిశోరకోశంబుపై నీఁబడిన యభిప్రాయము. ఆపొత్తము తెలుఁగుభాషలో నున్నందున నాంధ్రభాషలోనే యిదియు వ్రాయఁబడినది.)





శుభమస్తు.

# 5 ప్రమాదిసంవత్సర నిర్ణయపత్రిక.

—○:○:○—

ప్రమాదిసంవత్సర శబ్దంబునఁ బ్రమాదు లయిన యుద్దండ పండితులకు దండంబు 1913.

—:○:—

ఈసంవత్సర నామధేయంబు విషయమయి మహానామధేయులు కొందఱు విద్యాపరిపూర్ణులను నిష్కారణంబుగా నవమానించుచుండ నయ్యది యాలకింపఁజాలక యీయుపన్యాసము నుపన్యసించుచున్నారము. ఈసంవత్సరపంచాంగములలోఁ బ్రమాదిసంవత్సర మని పెక్కురు దైవజ్ఞులు లిఖించియున్న యంశంబును, నట్టులు వ్రాసినంతమాత్రముననే కొందఱ అపూర్వవివేకులు తమపడగలపై నాసుకొని యున్న జగాబుడ్లు మునింగిపోవునట్టి పట్టిదుష్కాలంబు సంభవించినది యని యులికిపడి లేచి కోపప్రకోపంబున బుసకొట్టుచు విద్యాపరిపూర్ణులపైని సైతము పలుకఱపుల (అనేకబోధనంబులనుగూడ) నుపయోగించిన విషయంబును, విద్వల్లోకంబునకు విదితంబే కదా! వడ్లగింజలోని బియ్యపుగింజవంటి యీయంశంబునకు నింతయట్టహాసంబు లేమికారణముననో తెలియకయున్నవి. "శ్లో॥ మహావివేకోమనుతే తృణం జగత్." అనుశ్లోకార్థకారణంబుననే యని స్పష్టపడుచుండగా నేమికారణంబుననని వేఱేయడుగనేల? కేవలమును ఘటాటోపకర్తలు గాక యనుభవవేత్తలయిన వైయాకరణులు కుశాగ్రీయ బుద్ధిని బరిశీలించినచో 'బ్రమాదిశబ్దములో నిమిడియున్నందునఁ బ్రమాదిశబ్దంబు వరిగింజవంటిదియు, ప్రమాదిశబ్దంబు వరిగింజలోని బియ్యపుగింజ వంటిదయునని నిశ్చయించి చెప్పుటకుఁ నెం

తన్మాత్రమును సందియంబు గానంబడదు. కాన సావధానచిత్తంబున నాలకింపఁగావిద్వాంసులు ప్రార్థింపఁబడుచున్నారు. సిద్ధాంత కౌముదియందే స్వరప్రకరణ ప్రారంభమున "చౌ" అనుసూత్రము క్రిందను వ్రాయఁబడిన "అతద్ధితఇతి వాచ్యం" అనెడి వార్త్తికంబు తరువాతను నిర్దిష్టంబులయిన "దాధీచః, మాధూచః" అనురూపంబుల నించుమించుగా నర్వప్రక్రియాంశంబందును నీప్రమాదీచశబ్దంబు పోలియున్నది. సుబంతంబైన దధిశబ్దంబుగాని మధుశబ్దంబుగాని యుపపదంబైనచో "ఋత్విగ్దధృక్" అనెడి సూత్రంబు, అంచ్ ధాతువుపైని క్విన్ ప్రత్యయంబురాఁగా నలోపనుమాగమ సంయోగాంతలోపాదులు గలిగి "దధ్యఙ్, మధ్వఙ్" అను శబ్దంబులు ప్రథమావిభక్తియందు "ప్రత్యఙ్" అను శబ్దంబునుబోలె నుండునుగదా! పిదప సంబంధార్థంబునందు, అణ్ ప్రత్యయంబురాఁగా (1) దధి + అచ్ + అ (2) మధు + అచ్ + అ. అని యుండు. ఇట్లు, అంతర్వర్త్తియైన క్విన్ ప్రత్యయమునుబట్టి నకారలోపంబు రాఁగా భసంజ్ఞయున్నందున, అకారలోపంబును నంత్యాచ్చులకు దీర్ఘంబును "అచః। చౌ॥" అను సూత్రద్వయంబునఁ గ్రమంబుగ వచ్చుచో నాదివృద్ధిగలిగి "దాధీచః। మాధూచః। అను రూపంబులు సిద్ధాంతంకంబుగా నుండవచ్చును.

అట్లె ప్రకృతంబునను, "నిగాదో నిగదే! మాదోమద ఉద్వేగ ఉద్భ్రమే." అను నమరకోశంబున నయినమాదమదశబ్దంబులలో దేనిపైనైనను మత్వర్థీయము చేసినచో "మాదీ, మదీ" అను రూపంబులు క్రమంబుగానగును. సహజంబుగా మదీ ధాతువునకే ప్రమాదార్థమున్నను, అగ్నియందలి దహనప్రకాశశక్తులను నింధనంబు ప్రజ్వలింపఁజేసినట్టులు ద్యోతకంబగు ప్రశబ్దంబు ధాత్వర్థంబగు ప్రమాదంబును స్ఫుటీకరించుటమాత్రమేగావున మాదాదిశబ్దంబులకే ప్రమాదార్థంబుకలిగి మాదీత్యాది శబ్దంబులకు ప్రమాదవంతుఁ డర్థంబగును.

బొంబాయిరీడర్లోఁగూడమాద్ = అని యర్థంబులు చూపఁబడినవి. “మా దినమంచతి” అను నర్థంబున మాద్యక్ ఇత్యాదిరూపంబులగు మాద్య జ్‌శబ్దంబునకు ప్రమాదవంతునిఁ బొందునదియనిన యర్థంబుగాన ప్ర త్యాసత్తివశంబునఁ బ్రమాదవంతుని బొందునది తిరిగి ప్రమాదమే యర్థమై మాద్యజ్‌శబ్దము మాదశబ్దంబునకు పర్యాయశబ్దంబగును. ఇట్లు స్వాపతేయశబ్ద స్వశబ్దాదులు సంస్కృతభాషలో పునరావృత్తినర్థము చెప్పుచోఁ బర్యాయపదంబులగుచున్నవి. స్వ=ధనము. స్వపతి=ధనపతి స్వాపతేయము=ధనము. ఇట “పథ్యతిథి” అను సూత్రమున ధనపతి యందు సాధువైనదియన్న వ్యుత్పత్తిని బ్రత్యాసత్తివశంబునఁ దిరిగి ధన మే యర్థమయ్యెను. ఇట్లే మాద్యజ్‌శబ్దంబునకు ప్రమాదమర్థంబు గాన “మాదీచిప్రాయేణభవతి” ఇత్యాద్యర్థంబులయందు, అనఁగా నీ సంవత్సరంబు ప్రమాదమందుఁ దఱుచుగా నుండునన్న యర్థమందు ‘ప్రాయభవః” అను సూత్రంబున, అణ్ ప్రత్యయంబున భ సంజ్ఞగలిగి, అకారలోప చాదీర్ఘాదివృద్ధులచే మాదీచపదంబగు. పిదప, అర్థస్ఫుట త్వముకొఱకుఁ బ్రశబ్దంబుఁ జేర్పఁగాఁ బ్రమాదీనశబ్దంబు సిద్ధంబగును. ప్రశబ్దంబును దరువాత చేర్చినందున, అణ్ణిమిత్తకంబైన యాదివృద్ధి ప్రశ బ్దంబునకురాలేదు.

అథవా, „శమిత్యష్టాభ్యోఘినుణ్” అను సూత్రంబున తాచ్ఛీ ల్యాద్యర్థకఘినుణ్ ప్రత్యయాంతమయిన ప్రమాదిశబ్దంబు నకారాం తంబై యుండు. ప్రమాదినమంచతి యనెడు నర్థమందు, ఋత్విక్సూ త్రంబున కిన్ ప్రత్యయంబు వచ్చి నుమాగమాది కార్యంబులుగలుగఁగా ప్రత్యజ్ శబ్దంబువోలె ప్రమాద్యజ్‌శబ్దంబు సిద్ధించును. (ప్రమాదశీలునిఁ బొందునది యని యర్థము.) పైనిఁజూపిన స్వాపతేయ శబ్దంబునంబలెఁ బ్రత్యాసత్తి న్యాయంబునఁ బ్రమాదశీలునిఁ బొందునది. ప్రమాదశీల మేయర్థమగును. ప్రమాద్యక్ అస్యాస్తి” అనునర్థమందు „అర్శఆది

భ్యోచ్" అను సూత్రంబున అచ్ ప్రత్యయంబు చేయఁగా క్విప్ ప్రత్యయనిమిత్తకంబైన నకారలోపంబును భ సంజ్ఞంబట్టి యకారలోపమును చౌదీర్ఘమును సిద్ధింపఁగా ప్రమాదీచ శబ్దంబు ఘంటాఘోషంబుగా విజృంభించుచుండు.

కాననే ప్రమాదశీలమనిన యిట్టి శాస్త్రీయార్థమును శ్లో॥ నిత్యం ప్రమాదశీలత్వాత్ ప్రమాదీచస్తుగీయతే। నిత్యం ప్రమాదశీలశ్చ అనాచారరత స్తథా" ఇత్యాదివృద్ధపారాశర్యాది వచనంబులు ధ్రువపఱచుచున్నవి. ఇట్లు ప్రమాదీచ శబ్దంబు తనగర్భంబులో నిమిడియున్న ప్రమాదిశబ్దంబునకుఁ శర్యాయపదంబుగానుండి, ఏకార్థమునే బోధించుట కరతలామలకంబుగాఁ గానిపించుచున్నది. ఇట్టి శబ్దప్రయోగంబులింక నెవ్వియైనఁ గలవాయని శంకింతురేనివిన్నుండు. ఇట్టియుద్ధతుల ప్రకరణమునందు రథోద్ధతావృత్త మేరమ్యంబనిమెచ్చి, అట్టిదేయుదాహరణముగాఁ జూపుచున్నారము.

శ్లో॥ కీదృశాప్యతిధనార్జనేన యః! స్వాపతేయపతిభావమేత్యసా।
పూరుషోత్తమరిపూరుషోత్తమో దృగ్గిరీశ్వర సదృగ్గిరీశ్వరః॥

అర్థము॥ కీదృశాపి=ఎట్టిదైనను, అతిధనార్జనేన=ఎక్కుడు ధన సంపాదనమును, యః=ఎవండు, స్వాపతేయపతిభావం=ధనపతిత్వమును, ఏతి=పొందుచుండునో, అసౌ=ఇతఁడు, పూరుషోత్తమరిపుః=విష్ణుస్పర్థియును, రుషా=కోపమున, ఉత్తమోదృక్=గొప్పతామసదృష్టిగల, గిరీశ్వరసదృక్=శివునితో తుల్యుఁడును, గిరి=సరస్వతియందు, ఈశ్వరః=పతియును, అగును॥ "స్వామీశ్వర" అనుసూత్రమున గీర్ శబ్దమునకు సప్తమి॥ ఏవిధముననైన ధనమార్జించి ధనపతియయ్యోనేని యతఁడే హరిహరబ్రహ్మలతో ధనగౌరవంబునంజేసి తులఁదూఁగువాఁడని భావము.

ఈశ్లోకంబున స్వాపతిశబ్దంబమీఁదనే స్వాపతేయశబ్దంబు పుట్టుచుఁడగ

ర్భభూత మైనస్వాపతిశబ్దంబుయొక్క యర్థమునే స్వాపతేయపతిశబ్దంబు
తిరుగుడుగాఁ జెప్పినదిగాని యందునఁ గ్రొత్త వింతలేమియు లేవుగదా!
అట్లే ప్రమాదిశబ్దంబును తనలో నిముడ్చుకొని ప్రమాదీచశబ్దంబు ప్ర
మాదశీల మనిన యాయర్థమే చెప్పినందున రెండుపదంబులును స్వాపతి
స్వాపతేయపతిశబ్దంబులువోలె పర్యాయపదంబులుగా నుండందగు. కను
కనే "పరీధావి ప్రమాదినా" అని ప్రమాదశబ్దంబు గ్రంథంబులయందు
వాడఁబడినది. ఈరెండింటిలో నొక్క భేదము మాత్రము గలదు. ఈచై
త్రమాసము మొదలు ప్రమాదీచశబ్దంబు తనప్రకృతిజ్ఞానాదులను దెలి
యనీక యాఱితేఱిన పండితులను సహితము పొల్లుతో గలుగలు మైనవ
రిగింజవలె మహాఽకృత్రిమత్వంబున గొంతుకం బడి చిక్కులు పెట్టుచు
న్నది. ప్రమాదిశబ్దం బన్ననో, దంచి పొల్లుతీసి చేతికందించిన బియ్యపు
గింజవలె స్వార్థదానంబున ధారాళంబై యానందము గలిగించుచున్న
ది. మహాజనులారా! స్వచ్ఛమయిన బియ్యపుగింజ వాడఁదగినదో గలు
గలు వరిగింజ వాడఁదగినదో! యాలోచింపుఁడీ!! ఇపుడు బియ్యపుగింజ
వలె స్ఫుటార్థంబైన ప్రమాదిశబ్దంబు పంచాంగంబు లందిచ్చినందులకుఁ
గదా యింత బహు నిందకు విద్యాపూర్ణు లాస్పదమైరి. ఏమిరా! కలికా
లకాలుష్యము!! పోనిండు. కొందఱు పురుషపుంగవులను గలుగలు వరి
గింజలనే నమలనిండు, మ్రింగనిండు, అఱిగించుకొననిండు. ఎవరి జీర్ణశక్తు
లెంతటివో యెవరికిఁ దెలియును? వారి వారి పూర్వపుణ్యవశంబున రా
లు తిని జఠరంబున భస్మీపటలంబు గావించుకొనువారు లేరా? కాని
పిలువని పేరంటంబునకు వచ్చి బియ్యము వాడుకొంట మంచిదిగాదు
సుఁడీ! వడ్లే వాడుకొనుఁడీ! వడ్లే వాడుకొనుఁడీ! యని చాటించుట
యెందుకు? విద్యాపూర్ణులయందు నింకను ప్రకృతంబున కనవసరమైన
లోపంబు లేవేవో మోపఁబడినవిగాని యయ్యవి శ్లో॥ శ్రుతిశ్చభిన్నా
స్మృతయశ్చభిన్నాః। మహామునీనాం మతయశ్చభిన్నాః॥ అను న్యాయం

బునఁ బరమార్థంబు బహువిధంబులం భాసిల్లుచుండుంగాన నిష్పట్టున సమాధానంబున కవసరయోగ్యంబులు కావు. 'విరోధికృత్' సంవత్సరంబునకు "రోధకృత్" అని గ్రంథంబులయం దున్నను నారీతిని వాడితిమా? ప్రమోదూత మొదలగుసంవత్సరములకు పరిమోదాది శబ్దంబులు గ్రంథంబులయందుండఁగా నట్లు వాడుచుంటిమా? కానఁ బ్రమాది యనఁగూడ దని కొంద అందురేని వినుండు. 'రోధకృత్' అను శబ్దంబునకు ద్యోతకం బయినవిశబ్దంబు లేనందునను ప్రమోదాది శబ్దంబులయందు వర్ణలోపాది వికారంబు లుండినందునను ముఖ్యార్థముయొక్క స్ఫుటత్వము కాలేదు. కాన వాడఁగూడదు. ప్రమాదిశబ్దంబున కట్టి లోపంబు ప్రకృతమున రాలేదు. 'ప్ర' శబ్దంబును విడనాడి 'మాది' సంవత్సర మని గాని యన్నచో నప్పుడు పోలిక చెప్పం దగు. ఒకవేళ ప్రమాది శబ్దంబుకంటె ప్రమాదీచ శబ్దం బాబాలగోపాలము ప్రసిద్ధంబుగాన నదియే స్వీకార్యం బందురేని, మంగళవార మనియు, శుక్రవార మనియు సర్వవర్ణప్రసిద్ధంబులు గావా? అంత మాత్రమున సంధ్యావందనాదిక్రియాకలాపములో 'మంగళవారే' శుక్రవారేయని చెప్పుచుంటిమా? అక్షయసంవత్సర మని వాడుకలో నున్నను శ్లో॥ అబ్దేషు క్షయవత్సరో న శుభకృత్వ క్షో బ్దసంధౌ త థా॥ అని గ్రంథంబులలో నున్నట్లు వైదికక్రియలలో క్షయసంవత్సరమనియే వాడుచుండ లేదా? కానఁ బ్రమాదీచ సంవత్సరపదములోని ప్రమాది శబ్దవిచారణము వరిగింజలోని బియ్యపుగింజ విచారణవలె హాస్యాస్పదమైనది గాన నీనిని గొండంతగాఁ జేసికొని వైదికవిద్య లంతరించుచున్న యిక్కాలములోఁ బరకపాటున నింకను గొందఱు సంస్కారు లుండఁగా సంతోషింపక తెలిసీ తెలియని ధోరణులచే వారి నవమానించుట తగదనియు, ఇంత మాత్రమున వైదికాచారంబునకు లోపంబు రాలే దనియు నెఱుంగునది. మ॥ రా॥ శ్రీ॥ లు నిడమర్తి జలదుర్గా

ప్రసాదరావుగారు, రావుబహదూర్ చిత్రపు వేంకటచలం పంతులు గారు, వేలూరి వెంకట్రామయ్యగారు, కనపర్తి శ్రీరాములుగారును మొదలగు గొప్పగృహస్థులు పీఠస్థ శ్రీ శంకరాచార్య స్వాములవారి చేత నైనగురు వైదికసంస్కారులను పంచాయతిగా నీపురమందు నేర్పాటించి వైదికవిషయమైన ధర్మసందేహములు గలిగినప్పుడా వైదిక సంస్కారుల సాహాయ్యంబున, చక్కదిద్దించుటకు యత్నించుచుండంగా నట్టిసమయంబున నీపురమందలి కొందఱు సంస్కారులు తము పూర్వార్జితాధికారము నైదిగురిపాలు చేయుచున్నట్లు భావించి యట్టియేర్పాటులు సాగనీక యొక మిట్టమధ్యాహ్నంబున కొవ్వూరునకు రేవుదాటించి శ్రీస్వాములవారి నంతర్ధానము నొందించిరట. కట్టిపెత్తనంబుమీదనా వైదికాచారంబులు వర్థిల్లుట? ఈ రాజమహేంద్రవర ప్రారబ్ధమేమోకాని మొదటి నుండియు కంబళిలో భుజించుచు “సూది బెజ్జమంత నోరును, ఆకసమంత యాకలియు” నన్నట్లు లేకచ్ఛత్రాధిపత్యము చేసి శ్లో॥ భేజే సామ్రాజ్య దీక్షితం అన్నట్లు సరస్వతీ సామ్రాజ్య దీక్షితులని భజింపఁదగి యమాయికులైన గొప్పసంస్కారులం గూడ వంచించి ప్రాయశ్చిత్తంబు చేయింప యత్నించుచుండు. అట్టి పెత్తనంబుననే వైదికవిషయంబులో నీపురంబున కింత ప్రాయశ్చిత్తగతి పట్టినది. ఇట్టిసద్గతులం బట్టియే యీపురంబున సకల వైదికధర్మంబులు సర్వమంగళం బగుచుండఁగాఁ బ్రమాది సంవత్సర మన్నసుశబ్ద ప్రయోగమాత్రంబుననే యట్టి యాచార భాగ్యంబునకు భగంబు కలుగునా? ఎంత మాత్రమును భంగంబు గలుగనేరదు. సదాచార సంపన్నులారా! తిరుగుడర్థంబును జెప్పి క్లిష్టంబైన ప్రమాదీచ శబ్దంబుకంటె “ప్రథమాతిక్రమణే కారణాభావాత్” అను న్యాయంబున ప్రమాది శబ్దంబె ప్రథమసోపాన స్థానీయంబై పండితాదరణీయ మైన దని యిట్లు కరతలామలకంబుగాఁ

గనఁబఱచినను నందియుం బుండి యెవ్వరేని సభను గోరుకురేని యట్లు సభకు సాగివత్తుమన్న వారి కింకను చెప్పఁగలము. సాగిరామన్న వారికిని యిదియే చాలు నని యాదండంబుతో విన్నవించు చున్నారము.

ఇట్లువిన్నవించు విధేయుఁడు
కల్యాణవాణీమణీమండితదశదిశాశాస్త్రి,
కన్నెపల్లి వేంకటసీతాపతిశాస్త్రి

## 6 కాళీయశబ్ద నిర్వచనము

31—12—1916

—:o:—

బ్రహ్మశ్రీ కల్లూరి వేంటరామశాస్త్రి కృతకాళీయశబ్ద నిర్వచనంబు

(కాళీయుఁడు భుజంగమూర్తి యగాటుంజేసి భుజంగప్రయాత వృత్తం బునసే యాతని నిరుచ్యమాన నామమ్ము ముందు పొందుపఱుచుట న్యాయ్యంబని యెంచి తద్భయనివారకుండైన శ్రీకృష్ణుని నామంబు మంగళార్థము పూర్వము గాఁగ నట్టులొనర్పఁబడుచున్నయది).

(కాలీయశబ్దమందు ద్వితీయవర్ణదీర్ఘము శాస్త్రీయమా? అశాస్త్రీయమా? అని విచారింపఁబడు)

భుజంగ ప్రయాతవృత్తము—శ్లో॥ సకృష్ణోరసం దూషితం యాముసంయో। ద్భుజంగప్రయాతేర సజ్ఞానపీస్యాత్। అధీనూషితంతస్య కాళీయునామ। ప్రనేకూా భుజంగ ప్రయాతేమనామ॥

అర్థము:—శ్రీకృష్ణమూర్తి తనమూలమున, నేసర్పము యొక్క ప్రయాణముగలుగంగ, దూషితమైన యమునానదీ జలామృతమ్ము ను రసజ్ఞులకు ద్రాగంగ జేసెనో! యజ్ఞానంబున దూషితమైనట్టి యాసర్ప గ్రామణి కాళీయనామమ్ము నీభుజంగ ప్రయాతవృత్తమునఁ బొందుపఱు ప నభ్యసింతుముగాక!!

ఆనందగోష్ఠీ సుధీమణులారా!!

యమునానదినుండి భగవంతునిచే బహిష్కరింపఁబడిన కాలసర్ప ముయొక్క సంజ్ఞాపదంబు కాళియశబ్దముగాని దీర్ఘమధ్యమగు కాళీయ శబ్దము గాదనియు, అందుననే యాప్టెనిఘంటువునందు హ్రస్వమధ్యము గా వ్రాయఁబడిన దనియుఁ గొందఱు ధీమంతులు ఘోషించుచుండెదరు. ఆధునికమైన పూర్వోక్తనిఘంటువునందుఁ బైశబ్దములోని ద్వితీయవ ర్ణము హ్రస్వముగా వ్రాసినంతమాత్రమున దీర్ఘయుక్తము గూడద నుట యాలోచింపఁగా నంత తృప్తికరమైన యుక్తిగాఁ గానిపింపదు. ఆ నిఘంటువునందును గొన్నిశబ్దములందు 'గొంత వ్యుత్పత్తిపక్షముసూచిం పఁబడియు, నేశబ్దము నొద్దమాత్రమవ్యుత్పత్తిపక్షమే యంగీకరింపఁబడి నిశ్శబ్దమవలంబింపఁబడినది హ్రస్వమధ్యమగు కాళియశబ్దమే శిష్టప్ర యోగమని వాదించువారలు సైతము శ్లో॥ "సంజ్ఞాసుధాతురూపాణి ప్రత్యయాశ్చతతఃపరే। కార్యాద్విద్యాదనూబంధమే తచ్ఛాస్త్రముణా దిషు" అను వచనముకం జేసియు "సంజ్ఞాసుధాతు రూపాణీతితు, అనాది శిష్టప్రయోగసాధనే ఉపాయమాత్రమ్, నత్వాధుని క్రియమాణ సం జ్ఞాను గ్రాహకమితిభావః॥ అనెడి ఋ౹౪క్ సూత్రస్థమైన భాష్యప్రదీ పో ద్యోతముసం జేసియు, నాశబ్దమును నించుకంతైనను వ్యుత్పత్తి పక్షంబు నకు వశవర్తిఁ జేసి కాళీయశబ్దము శాస్త్రవాసనా దూరవర్తియని ఋజువుచేసినచో నపుడు "సమానేచార్థే శాస్త్రాన్వితోఽ శాస్త్రాన్విత స్య నివర్తకోభవతి। తద్యథా, దేవదత్తశబ్దో దేవదిణ్ణశబ్దం నివర్త

యతి॥ యనెడి పూర్వోక్త సూత్రమందలి పతంజలి భగవద్వాక్య ప్రకారమ్మునఁ గాళీయశబ్దమును గీర్వాణవాఙ్మయమునుండి వెలిసేసి శిక్షింపవలయునేకాని కేవలమును నవ్యుత్పత్తి పక్షమవలంబించి యొక్కని ఘంటువుమాత్రమే శరణముగాఁగఁ జొచ్చి నిరసింపఁగూడదుగదా!! కావునఁ గాళీయశబ్దము యొక్కవ్యుత్పత్తి ప్రస్తుతంబునఁ జర్చింపఁదగి యున్నందున నట్టి సత్క్రియకు సమ్ముఖీనులమగుచున్నారము.

సూక్ష్మదృష్టిని నాలోచించినచోఁ గాళియశబ్దమునకుఁ గాళీయశబ్దము మాత్రస్థానీయముగాఁ బూజింపఁదగియున్నది. అందున నగ్రగణ్యము కాళీయశబ్దమును, ననంతరగణ్యము కాళియశబ్దమును ననందగు అయ్యది యెట్లంటిరేని వినుండు: —శ్రీమద్భాగవతము దశమస్కంధము. షోడశాధ్యాయమునఁ బ్రథమ శ్లోకము—శ్లో॥ విలోక్యదూషితాం కృష్ణాం। కృష్ణః కృష్ణాహి నావిభుః। తస్యావిశుద్ధి మన్విచ్ఛన్ సర్పంతము దవాసయత్ ॥౧॥ కృష్ణసర్పమున దూషితమయిన కృష్ణనుజూచి అనఁగాఁ యమునానదిని జూచి శ్రీకృష్ణమూర్తి యానదిశుద్ధిని గోరుచుండి కృష్ణసర్పమును వెడలంజేసెను అని యర్థము యమునానది నీలవర్ణముగలదిగాన, శ్లో॥ "కృష్ణే నీలాసితశ్యామ। కాల శ్యామలమేచకాః॥ అను నమరనిఘంటు ప్రకారంమున యమునానదీపరముగాఁ గృష్ణాశబ్దము పయోగింపఁబడినది. ఇచట యమునానదికిఁ గృష్ణాశబ్దము వోలెఁ గాళీయశబ్దములోని కృష్ణాశబ్దపర్యాయ కాళీయశబ్దమునకు యమునానదియర్థమగునని ప్రాచీనగ్రంథకర్తల తాత్పర్యమైనట్టువిశదపడుచున్నది కృష్ణశబ్దము స్త్రీలింగ మందాకారాంతమైనట్లు వర్ణవిశిష్టార్థబోధకమైన కాలశబ్దము స్త్రీలింగమున నాకారాంతముగాక యీకారాంతమగు. ప్రమాణము —సూత్రము ౪-౧-౪౨ జానపదకుండగోణస్థల భాజనాగకాల నీలకుశకాముక కబరాద్వృత్త్యమత్రావపనాకృత్రిమాశ్రాణా స్థౌల్యవ

ర్ణానాచ్ఛాదనా యోవికార — అను సూత్రమునఁ గాలశబ్దముకంటె స్త్రీ లింగవర్ణవిశిష్టార్థమందు ఙీష్ప్రత్యయము గలిగి 'కాలీ' శబ్దమగును. కాలీవర్ణశ్చేత్ అని కౌముదియం దుదాహరించుటంజేసి నీలవర్ణార్థమందే కాలీశబ్దము వర్తించుంగాని నీలవర్ణము గలది యన్న యర్థమందీ శబ్దము వర్తిల్లఁజాలదని శంకింపఁబలదు. "వర్ణశ్చేదితి" అన్నప్రతీకమందు కాని శబ్దేందుశేఖరమందు తద్విశిష్ట శ్చేదిత్యర్థః అన్యథాగుణేశుక్లాదయః పుంసీత్యుక్త్యా అసంగతంస్యాదితి బోధ్యమ్ సూత్రేవర్ణశబ్దః అర్శఆద్యజంతః" అని నాగేశపండితులు వివరించినందున నీలవర్ణముగలది యన్న యర్థమందే 'కాలీ' అనురూపంబగును గాని నీలవర్ణమన్న యర్థమందు నెపుడు స్త్రీలింగమును నీకారాంతమును గానేరదు. ఇట్లు నీలవర్ణముగలది యన్నయర్థమిచ్చునట్టి కాలీశబ్దము పూర్వోక్త భాగవత శ్లోకములోని కృష్ణాశబ్దమువోలె స్త్రీలింగమై యమునానదీ పరార్థకంబుగాని వాటిల్లుట నిర్వివాదాంశంబు. పిమ్మట, "కాలీంయాతి ప్రాప్నోతీతి" అనఁగా యమునానదిని బొందినవాఁడన్న యర్థమందు సూ॥ 3—౨—3॥ "ఆతోనుపసర్గేకః" అనుసూత్రమునఁగ ప్రత్యయముగలిగి ధాత్వాకారాదులకు లోపాదులురాఁగా 'కాలీ' శబ్దము నిష్పన్నమగు యమునానదీగతుండని యోగరూఢార్థకంబుగా నెఱుంగునది. ఇట్లుండ, సూ॥ 3—౬—3॥ జ్యాపోస్సంజ్ఞాఛందసోర్బహుళమ్ అనుసూత్రమున సమానచరమావ యవార్థకమయిన యుత్తరపదము యొక్క అధికారపాటంజేసి కాలీశబ్దమునకు సంజ్ఞార్థమందు హ్రస్వము బాహుళకమునఁ గలిగి కాళిదాసాదిశబ్దములువోలె, కాళియ, శబ్దము పర్యాంతరమున వ్యవహరింపఁబడుచుండు. కాళిదాసశబ్దమునకుఁ గాళీదాసశబ్దమును, కాళియ శబ్దమునకుఁ గాళీయశబ్దమును సూత్రస్థానీయములైనను హ్రస్వాన్వితీయములైన శబ్దములే యుచ్చారణమ్మున సుగమమగుటంజేసి తెలుగు వ్యవహృతంబులయ్యెడి. కాని యంతమాత్రమ్మున నయ్యవి మాత్ర

స్థానీయమ్ములైన కాళీయకాళీదాసశబ్దమ్ముల నీభాషాప్రపంచమునుండి త్రోసిరాజ్ఞులనంజాలవు. అన్యథాగా వాదించుట మాతృదేవతల్లు లేకయే సంతానసమృద్ధి గలుగఁ నన్నట్లు వంటిదియై పరిహాసాస్పదమ్మయ్యెడి. అంతర్వేదియావల నూళ్ళు లేవన్నంతమాత్రాననల్లు లేకుండునా? మఱియు గురుజనంబులనం దగినవారివలన నధికముగాక హ్రస్వజ్ఞానమును సంపాదించినను ఛాత్రుండనందగినవాఁ డట్టివారిని ధిక్కరించినచో, నయ్యావచనమ్ములు కలకూజితంబులగునా? కాదు పిచ్చికలకూజితంబులగును. అట్టి యుద్ధతలక్షణంబులు కవిలక్షణంబులగునా? కాదు, కాకవిలక్షణంబులగును. కావున గురుజనంబువలన హ్రస్వజ్ఞానము నైనను సంపాదించిన సద్వర్ణస్థుండు వారి తిరస్కారము నెట్లు సేయంజాలఁడో! యట్లే శాస్త్రీయముగా సద్వర్ణమ్ములైన కాళీయకాళీదాసశబ్దమ్ములు హ్రస్వజ్ఞానమ్ము సంపాదించినంతమాత్రాన మెందు దీర్ఘజ్ఞానముగలిగి యధికగురుత్వమున నతిశయిల్లెడి కాళీయకాళీదాసశబ్దంబులను ధిక్కరించి మఱపింపఁజాలవు. కావునఁ గాళియశబ్దమునకు మాతృస్థాన మగుటయే స్వవర్ణదర్శనంబుననే యధికగురుత్వసత్త గలదిగాఁ గానిపించుచున్న గాళీయశబ్దము శాస్త్రజ్ఞులచే మిక్కుటముగా నామోదింపఁ దగియున్నది.

ద్వితీయపక్షము.

(ప్రకృత వాదమ్మునకు సాధకమ్ముగా నీక్రిందిగ్రంథ దృష్టాంతార్థము. వ్రాయఁబడుచున్నది.

దృ ష్టాం త ము.

(2) బట్టికావ్యము-ప్రథమసర్గము-౧౪ శ్లోకము.

శ్లో॥ కౌశల్యయాసావిసుఖేన రామః ప్రాక్కేకయీతో భరతస్త
తోఽభూత్। ప్రాసోష్ట శత్రుఘ్నముదారచేష్ట। మేకాసుమిత్రాసహలక్ష్మ
ణేన — ఈశ్లోకము లో 'కేకయీ', అనుచోటను 'జనపదశబ్దాత్ క్షత్రియాదఞ్', అనుసూత్రమునఁ గేకయశబ్దముకంటె నపత్యార్థమందు

‘అఞ్, ప్రత్యయము రాఁగా, ‘కేకయమిత్రయు, అను సూత్రాదులచే నియాదేశాదులు గలిగి ‘కైకేయీ, అని కవిచేఁ బ్రయోగింపఁదగినది. అట్లుండినను, ‘కేకయీ, అని కవిచేఁ బ్రయోగింపఁ బడినది ఈ రూపమునకు సాధకముగా సిద్ధాంతకౌముది యందే యపత్యాధికారాంతమునఁ “కేకయీత్యత్రతుజన్యజనక భావలక్షణే పుంయోగే ఙీష్” అని పితృసంబంధరూప పుంయోగము కుమారికిఁగలదు. గానఁ బితృవాచకపద ముపయోగింపనచ్చునను నూహచే ఙీష్ప్రత్యయము చేసి యీకారాంత కేకయీశబ్దము సాధింపఁబడినది. ఇంతియకాక “పుంయోగాదాఖ్యాయామ్” అను సూత్రమందలి తత్త్వబోధినియందు “యోగస్సంబంధః సచేహ దంపతిభావ ఏవేతినాగ్రహః కింతుజన్యజనకభావోఽపి గృహ్యతే సంకోచే మానాభావాత్ తేనకౌసల్యయాసావిసుఖేనదామః ప్రాక్కేకయీతో భరతస్తతోఽభూత్ ఇతిభట్టిప్రయోగస్సంగచ్ఛతే కేకయస్యదుహితా కేకయీ, అని దంపతిభావరూప పుంయోగమే కావలయునని మాకు నాగ్రహంబు లేనందునఁ బ్రకృతమందుఁ బితృపుత్రీభావరూప సంబంధము తెలియంజేయుచు ఙీష్ప్రత్యయము పుంయోగాది సూత్రమునఁ గలిగినదని స్థిరపఱుపఁబడినది.

తృతీయపక్షమున దృష్టాంతము

(3.) పూర్వోక్తభట్టికావ్యశ్లోకమును వివరించుతఱిని జయమంగళవ్యాఖ్యానమందు మాత్రము కేకయీశబ్దనిష్పత్తిసిద్ధాంతకౌముదీ గ్రంథకర్త్రాదుల యభిప్రాయమునకు వ్యతిరేకముగా నిట్లు లిఖింపఁబడినది. “కేకయానాచష్ట ఇతిణిచ్ సాహి ఈదృశాస్తాదృశాః కేకయా ఇతికథయతి తదంతాడచ ఇరితి ఇకారప్రత్యయ ఔణాదికః ణిలోపః కృతికారాదక్తినఇతిఙీష్” అనఁగాఁ కేకయమహారాజపుత్రికయగు కైకేయీ దేవి “కేకయ దేశము లిటువంటికీర్తిగలవి. అటువంటికీర్తిగలవి”. అని చెప్పుచుండునదియన్న యర్థమందు తత్కరోతి తదాచష్టే” యనువా

ర్తృకమ్మున ఙీచ్ ప్రత్యయము రాఁగా నౌణాదికమైన యిప్రత్యయము
గలిగి కృదికారాదతి వైకల్పిక ఙీష్ప్రత్యయమునఁ గేకయీ రూపము సిద్ధిం
చునని భిన్నప్రకారమున వ్రాయంబడియె.

ద్వితీయపక్షమున దార్ష్టాంతికము

ప్రాచీనగ్రంథకర్తలు కేవలమును దంపతిభావరూప పుంయోగ
మే వలయునని యాగ్రహంబు చెందక “సంకోచేయూనాభావాత్” అని
పితృసంబంధరూప పుంయోగ మంగీకరించినందున ఙీష్ప్రత్యయము
గలిగి కేకయస్యదుహితా కేకయీ అగునట్లే ప్రకృతమందును “యము
నయానసహయమళత్వేన జాతత్వాద్యమహా అని లింగభట్టీయాద్యమర
వ్యాఖ్యలయందు వ్రాసిన వ్యుత్పత్తిం జేసి కాలుండు యము
నతోఁ గవగాఁ బుట్టిన సోదరుండగుటచే యమునకు భ్రాతృభూతయమ
సంబంధరూప పుంయోగము గలదు గానఁ “కాలస్యసోదరీ కాలీ” అని
పుంయోగాదతి సూత్రము నీ కారాంత కాలీ శబ్దము నిష్ప
న్నంబయ్యెడి. పతిసంబంధమును బితృసంబంధమునునే ప్రాచీనులచే
గ్రహింపఁబడియెంగాని భ్రాతృసంబంధరూప పుంయోగమెచ్చటను బ్రా
చీనులచే గణియింపఁబడినట్లు కానంబడదందురేని యమళభావంబున నేక
నాళావలంబిఫలద్వయము వోలెః బిండోత్పత్తి మొదల్కొని యేకకాల
మ్ముననే గర్భమ్మునం జుకొని యుద్భవించిన సహజాతశిశువుల యనన్య
సామాన్య సంబంధము విడఁదీసి సమసిపోఁ జేయంగ నీలోకంబున నెవ్వాం
డు సాహసించి యొడిగట్టుకొనఁగలండు.? కాఁబట్టి గర్భంబు మొద
ల్కొని యమునానదికిని యమదేవతకును సన్వర్థంబులగు తమనామధే
యముల వర్ణములచేతను సయిత మెంతక్రిక్కిఱిసిన సంబంధము జగ
ద్విదితమై యున్నయదియో ! యంతక్రిక్కిఱిసిన సంబంధము కేకయ
రాజపదంబుతోఁ గైకేయికినున్న సంబంధమునకుఁ దీసిపోకయమవాచ
క కాలపదంబుతో గౌణవృత్తిని గాలీయసమాసవృత్తియందలి యమున

నానదికిని సుండునను టనిర్వివాదాంశంబుగా నొప్పకొనందగియుండుకానఁ గాలసోదరియైన యమునానది కాళి, యనిపిలువందగియున్నది. మఱియు, పుంయోగా దితిసూత్రస్థభాష్యమందు నొకపదార్థము వేఱొకపదార్థముయొక్క ధర్మంబుతో నెట్లు వ్యవహరింపఁబడునని శంకించుకొని యీక్రిందిచతుర్విధకారణముల చేతను బదార్థాంతర ధర్మంబారోపింపఁ బడునని వక్కాణింపఁబడియె. చతుర్భిః ప్రకారైరతస్మిన్ స ఇత్యేతద్భవతి తత్స్థాత్ తాద్ధర్మ్యాత్। తత్సామీప్యాత్। తత్సాహచర్యాత్॥ఇతి తాత్స్థ్యాత్తావత్ మంచాహసంతి గిరిర్దహ్యతే। తాద్ధర్మ్యాత్। జటినం యాంతం బ్రహ్మదత్త ఇత్యాహ। బ్రహ్మదత్తే యానికార్యాణి జటిన్యపి తాని క్రియంత ఇతి। అతో జటీ బ్రహ్మదత్త ఇత్యుచ్యతే। తత్సామీప్యాత్ గంగాయాం ఘోషః కూపే గర్గకులమ్ తత్సాహచర్యాత్ కుంతాన్ప్రవేశయ। యష్టీః ప్రవేశయేతి— ఈభాష్యమ్మునఁ బతంజలిభగవానులు జటియందు బ్రహ్మదత్తుని ధర్మయుల సంబంధముండుటం జేసి జటి బ్రహ్మదత్తుఁడేయని వ్యవహరింపఁ బడుననియు కుంతములతో సాహచర్యసంబంధమున్నందునఁ గుంతధారులు కుంతశబ్దముతో వ్యవహరింపఁ బడుదురనియు నుదాహరించి ప్రకృతమందు సాహచర్య సంబంధమున కుదాహరణముగాఁ బ్రష్ఠస్త్రీయందుఁ బ్రష్ఠత్వమారోపితమైనందునఁ బ్రష్ఠశబ్దముపయోగింపఁబడి ప్రష్ఠీయను రూపంబగునని ప్రదర్శించిరి అట్లేప్రస్తుతమందును యమునయుఁ యముండును గవలయైనందున యమున, యానవాలు పట్టలేనంత యమునిని నీలవర్ణాది ధర్మములు గలదియై యుండుటయేకాక పిండోత్పత్తి మొదలగు కాలుని సాహచర్యము గలదియునగుటం జేసి యమున యందుఁ గాలుని ధర్మమారోపించి కాళీ యనురూపము సాధించుట సార్థకంబు తండ్రియైన సూర్యునకును యమునానదికిని నున్న జన్యజనక భావసంబంధ మెంత ప్రసిద్ధమో! భ్రాత

యైన యమునికిని యమునానదికినిమున్న సహజాతసంబంధమంత ప్రసిద్ధ మయినదన్న యంశమును శ్లో॥ కాళిందీ సూర్యతనయా యమునా శమనస్వసా ఇత్యాద్య మరకోశాదులేదుం దుభిధానంబులతో నుద్ఘో షించు చున్నవి. యముండు యమునానదికి నామరూపంబులులేని యగ స్త్యభ్రాతయే యైనచోనిట్లు గ్రంథమ్ములు గంభీరకంఠములతో యమ దేవతాసంబంధము వెల్లడిగాఁగ గర్జిలుచుండునా! కాఁబట్టి యమునా యములకున్న సహజాత సంబంధము జన్యజనక భావసంబంధమునకు వెనుదీయకబిఱ్ఱబిగిసి యున్నందునఁ దండ్రియందలి కేకయత్వమారోపిం చి కైకెయి యందుఁ గేకయీ యని ప్రయోగించునట్టులే యీామె యందును భ్రాతయందలి కాలత్వమారోపించి కాలీ యని నిస్సందేహ ముగాఁ బిలువందగియున్నది. ఇయ్యది యేప్రాచీన గ్రథకర్తల తాత్ప ర్యమైనట్లు కాలియ శబ్దమే ముల్లోకములు ముట్టంగ మ్రోయుచున్నది కాలీశబ్దమునకు యమున యర్థము గావున నే యీసర్వవిశేషము య మునను బొందినది. యన్న యర్థమందు, గాలీయ శబ్దము శాస్త్రీయము గాను, ననుభవానుకూలమై నందున సరసముగాను నుండి సతాంహి నం దేహపదేషు వస్తుషు ప్రమాణమంతః కరణప్రవృత్తయః అను న్యా యమ్మును స్మరింపించుచున్నది.

తృతీయపక్షమున దార్ష్టాంతికము

పైభట్టిశ్లోకమందలి కేక యీాశబ్దమును జయమంగళ వ్యాఖ్యా నము సాధించిన రీతిని కాలంయమమాచష్టె కాలునిఁ బిల్చుచున్నది. యన్న యర్థమందుణిచ్ ప్రత్యయమ్మును నౌణాదికమైనయి ప్రత్యయం బును కృదికారాదతిజ్ షునుజేసినచో యమునార్థమందుఁ గాలీ యను రూపసంపత్తి సంభవించెడి

చతుర్థపక్షము

ఒకవేళను గొందఱు కోవిదగ్రామణు లిట్టు లనంగవచ్చును

పుంయోగోత్ర దాంపత్యరూప ఏవేతి భాష్యస్వరసః యోగ్యయాభర్త్రా పాపకృతాం బంధాదిన్ లభతే ఏవంతచ్ఛబ్దమపీతి భాష్యోక్తేః। దేవకీత్యాదితు గౌరాదిషు బోధ్యమితి కేచిత్ అనిపుంయోగాదితి సూత్రస్థమైన యీశబ్దేందు శేఖర గ్రంథమందు భార్యభర్తృ చేసిన పాపములన లభించునట్టి బంధాదులను బొందునట్లు భర్తృవాచక శబ్దమును నొందునని భాష్యమ్మునయుక్తి నుదాహరించుటం జేసి దాంపత్యరూప పుంయోగమే యీసూత్రమందు గ్రహింపవలయుఁగాని ఇతర సంబంధములు స్వీకరించుట భాష్యస్వారస్యముగాదని చెప్పఁబడియెనుగాన నపతాధి కారశేఖరంబునఁ గేక యీశబ్దమునొద్ద "జన్యజనక భావేతి" దాంపత్యలక్షణ ఏవపుంయోగస్సత్ర గృహ్యాత ఇతిమతే గౌరాదిత్వాన్ జీషితిబోధ్యమ్॥" అని దాంపత్యలక్షణమైన పుంయోగమే గ్రహియించి తక్కిన సంబంధమంగీకరింపని వారిమతమ్మున నీకారాంతములైన కేకయీత్యాది ప్రయోగమ్ములు గౌరాదులయందుఁ గేకయాదిపదములు పఠింపఁబడినచో సాధువు లగునని యున్నందునను కాలుని సోదరి యన్న యర్థమందు నైనక్షాలీ యనురూపము సర్వగ్రంథకర్తలకు సమ్మతమ్ము గాదనియు జయమంగళ వ్యాఖ్యప్రకారముననైన కాలుని సోదరుండైన యముని ప్రశంసించునదిగాన యమున కాలీ యనఁబడుచుకొను నన్న వ్యుత్పత్తి వివరణమంత దృఢయుక్తిగా నుండలేదనియు నందురేని వినుండు.

ఆత్మానం కాల మివాచరతి (వ్యవహరతి) యనఁగాఁ దన్నుసాఁరణ ధర్మమ్ములచేయమదేవశంబలె వ్యవహరించుకొనునది (తన్నుం గాలుసింబోలి నటించుకొనునది.) యన్న యర్థమందు సూ ౩-౧-౧౦॥ ఉపమానాదాచారే యను సూత్రమునఁ గాలశబ్దముకంటెఁ గ్యచ్ ప్రత్యయమ్ము రాఁగా క్యచిచ (౭-౪-33) యనుసూత్రమున నకారాంతకాల శబ్దమీకారాంతమగుఁ గాలీయతి యనురూపమగును. [illegible]త్ర్యర్థమం

డుఁ ద్విప్రత్యయము సేయఁగా నల్లోపయ లోపములు గలిగి సహాఖిన వర్తతఇతిసఖః తమిచ్ఛతీతిసఖీః సుఖమిచ్ఛతీతిసుఖీః॥ అనియాదంతప్రకరణమునఁ గౌముదిలో నుదాహరించినసఖీ, సుఖీరూపములవోలె 'కాలీః అనియాకారాంత రూపమ్మగును. (యమ) ధర్మరాజును బోలియుండు నది యనిఫలితార్థము. యమునాయములు గవలుగాన యముని నీలవర్ణాది ధర్మమ్ములు యమునయందేయుండును. అందున సామ్యముసర్వజనీనము ఆత్మానం కాల మివాచరతి యనితానేయుప మేయమెట్టులగు ననంగా వినుండు.

„కాంత్యాస్మరవధూయంతీత్యత్ర వాచకోపమే యలోపః అత్ర కాంత్యేతి విశేషణ సామర్థ్యాత్ స్వాత్మానం కామవధూమివాచరతీత్యర్థస్యగమ్యమానతయా స్వాత్మనఉపమేయస్య సహోపమావాచకేనా పాదానాత్ అనికువలయానందమందును, "ననూపమా నాదాచారేణేతికర్మణ్యుపమానాదాచారేక్యచో విధానాత్ స్మరవధూంరతిమివాచరంతీత్యవగమేఽపిఆత్మానమన్యాంవేతి కథంనిర్ణయస్తత్రాహ విశేషణేతిరత్యనుకూలాచరణస్య కాంతి కరణకరూపవిశేషణ సామర్థ్యాదిత్యర్థః కాంత్యాస్వారసతః స్వీయత్వావగమాదితిభావః" అని చంద్రికయందును „కాంత్యాస్మరవధూయంతి దృష్ట్వాతస్వైరహాసమరూ అనులుప్తోప మాశ్లోకమునందు స్వారస్యవశమునఁగాంతిస్వనిష్ఠమనిస్ఫురియించి రతిదేవింబలె నాచరించుటలోఁ గరణమ్మయి (సాధనమయి) యితరస్త్రీపరతి దేవింబలె ననుకొనుచున్నది. యన్నయర్థముగానీక „ఆత్మానమ్" అనుకర్మవాచకపదమును దెచ్చిపెట్టి తన్నునేరతిదేవింబలె ననుకొనుచున్నది. అనఁగాఁ దానేకాంతి చేరతిదేవివలె నున్నది. యన్నయర్థమగునని యెట్లు కాంతివిశేషణస్వారస్యమునఁ జెప్పంబడియెనో! యట్లైతే ప్రకృతమందును గాళీయసర్పము యమునానదిని బొందియుండుట యాబాలగోపాలమును జగత్ప్రసిద్ధమునుగాన (యమ)

ధర్మరాజుంబలెననుకొనుదానింబొందినవాఁడని సర్పవాచకమైన కాళియపదమునకు వ్యుత్పత్త్యర్థమును నిర్వచింపు తఱిని గాళియసర్ప ప్రకరణసందర్భంబునంజేసి యమునితోఁ గవగాఁబుట్టిన యమునయే యమునినీలవర్ణాది ధర్మసంబంధమున ఆత్మానంకాలమివాచరతి యన్నయమునింబలె ననిపించుకొనునది. అనఁగాఁ భోగించుకొనునది. యన్నయర్థమున విధిగాఁ దోఁచును. క్యచ్ ప్రత్యయాంతమయిన యీకాలీ శబ్దము (కాళీయ శబ్దములోనిది) శ్లో॥ దుఃఖిస్స్యాత్పితృ రౌద్రయోరదతి భేసాబంధకేశ్రక భేష్యగ్నానిస్స్వోకరాత్కృ భౌమదిసక్ర ద్వారేషు రోగార్తిఃక్రృత్॥ అను కాళిదాసకృతి వ్యవహారముగల కాలామృత గ్రంథమందలి యీశ్లోకములోనిదుఃఖిశబ్దమువంటిది కానఁ గవిప్రయోగమును గూడ పోలియున్నది. ఈదుఃఖిశబ్దమును నిప్రత్యయాంతమయినన కారాంతపుంలింగశబ్దముగా బఠింతురు. అప్పుడు శ్లోకములోని స్త్రీలింగమునకు దుఃఖియను పుల్లింగమెట్లువిశేషణమగు? దుఃఖినీ యనియుండఁదగు కాన దుఃఖమివాత్మానమాచరతీతిదుఃఖిః అనిక్యచ్ ప్రత్యయాంతముగాఁ తీరద, అనఁగాఁ దన్ను (మూర్తిమంతమగు) దుఃఖమును భోగించుకొనునది. యని ఫలితార్థమగు. దుఃఖస్వరూపురాలని భావము. దానంజేసి ప్రస్తుతకాలీ శబ్దదుఃఖిశబ్దములు పరస్పర సామ్యము నొందందగు కాళీగతుండుగాఁ గాళీయుఁడని యోగవిభాగంబున పిదప ఇకోహ్రస్వోఙ్యో గాలవస్య (౬-౩-౬౧) అనుసూత్రమున వైకల్పిక హ్రస్వముగలిగి గ్రామణీపుత్రః గ్రామణిపుత్రః అనురూపద్వయమువోలె కాలీయః కాలియః అనురూపద్వయమును సిర్థయంబుగా జగంబున విహరించెడి.

## పంచమంబగుపక్షంబు

"శ్లో॥ భానుః కరోమరీచిః స్త్రీపుంసయోర్దీధితిః స్త్రియామ్" అనునమరాది నిఘంటుపులంజేసి కరశబ్దమునకుఁ గిరణమర్థము. కరాః

అస్త్యనంతీతి 'కరీ' 'అతఇనిఠనౌ' (౫-౨-౧౧౫) అనుసూత్రమున నిని ప్రత్యయము. శ్లో॥ "భూమనిందా ప్రశంసాసు। నిత్యయోగే తిశాయనే సంసర్గేఽస్తివివక్షాయాం। భవంతి మతుబాదయః" అనున్యాయంబునఁ 'గరీ' అనుచోట బాహుళ్యార్థము. అనఁగాఁ గిరణబాహుళ్యముగలవాడని యర్థము. అంశుమాలియనియు, లేక సహస్రరశ్మియనియునని ఫలితార్థము. అథవా, ప్రశంసార్థముగాని, నిత్యయోగముగానియు నిప్రత్యయమున కర్థము. (తమస్సును నిర్మూలము సేయునంతటి) ప్రశస్తమౌ కిరణములు గలవాఁడని కాని, లేక, తేజోరాజుగానఁ జంద్రాదుల కిరణములు వోలెఁగాక యితర తేజస్సుచే నపహరింపఁబడనట్టి కిరణములతో నిత్యయోగము గలవాఁడని కాని భావము ఇట్టి యర్థముబట్టియే "(1) బబంధసానోత్తమసౌకుమార్యా। కుముద్వతీ భానుమతీవ భావమ్ (రఘు ౬-౩౬) (2) నిరరాజరథ ప్రష్ఠేర్వాలఖిల్యైరి వాంశుమాన్ (రఘు, 15 10)" ఇత్యాది కాళిదాసాది కవిప్రయోగంబులందు భానుమదంశుమ,దాదిశబ్దంబులు మత్వర్థీయాంతములు సూర్యునియెడఁ బ్రసిద్ధములగుచున్నవి. ఇని ప్రత్యయాంతమైన 'కరి' శబ్దము గజార్థమందే కానంబడునని యెవ్వరైన నందురేని, 'హస్తాజ్జాతౌ' (౫—౨—౧33) అనుసూత్రమున 'హస్తీ' అనురూపమందుంబలెఁ 'గరి' శబ్దమునకు నర్థవిశేషమందేయిని ప్రత్యయము వచ్చునన్న శాస్త్రనియమముగాన రాకున్నయది. కిరణార్థకమగు కరశబ్దముకంటెని నిప్రత్యయుంబన బిధానకారణంబున సంభవింపదనుటకుంగూడఁ దగినంత భాష్యాది ప్రమాణంబులు చూపట్టను "శ్లో॥ ఏకాక్షరాత్కృతో జాతే సప్తమ్యాంచ నతౌ స్మృతౌ" అనుభాష్యవచనంబున నైనయిని ప్రత్యయ నిషేధంబును బరిష్కృతంబునఁ గానగాదు. కాఁబట్టి యదంతములు గానందున, భాను, అంశు, గభస్తి, ఇత్యాది కిరణార్థకశబ్దములు మతుప్ప్రత్యయము మాత్రమే పొంది, భానుమాన్, అంశుమాన్, గభస్తిమాన్, అనురూపంబులై సూర్యపరము

లైనట్లే ప్రకృతంబునఁ గరశబ్దము హ్రస్వాకారాంతముగాన, నినిప్రత్యయమ్ము నొంది 'కరి' అనురూపంబై కేవలముగజార్థకమేకాకనానార్థతావశమ్మునసూర్యార్థకమ్మునుగావచ్చును. కరిణః=భానుమతః(సూర్యస్య) అపత్యం(స్త్రీ), 'కారి' అనురూపంబగు. (1) ఇట, 'ఇనణ్యనపత్యే' (౬-౪-౧౬౪) అనుసూత్రమున నపత్యార్థము కాని యర్థముల యందలి యణ్ ప్రత్యయము పరమగునపుడే 'ఇన్' అనుశబ్దము ప్రకృతిభావము నొందు ననుటంజేసియు, (2) గాథి, విదథికేశి, గణి, పణినశ్చ, (౬-౪-౧౬౫) అనుసూత్రమున నిన్నంతములైన యీశబ్దములు మాత్రమే యపత్యార్థమందును సైతము ప్రకృతిభావంబు నొందు ననుటంజేసియు, 'చక్రిణోఽపత్యం చాక్రిణః'— ఇత్యాదుల యందలి. 'ఇన్' శబ్దము వోలె నిట "సంయోగాదశ్చ" (౬-౪-౧౬౬) అనుసూత్రముననే ప్రకృతిభావమునకు విషయముగాకుంటంజేసియుఁ "ప్రకల్ప్యాపవాద విషయంతత ఉత్సర్గోఽభినివిశతే" అనుపరిభాష పురస్సరంబుగాఁగరిణ్ శబ్దమునకు నపత్యార్థకమయిన యణ్ ప్రత్యయము పరమగుచుండఁ నస్తద్ధితే, (౬-౪-౧౪౪) అనుసూత్రమునఁ 'గరిన్' శబ్దములోని 'ఇన్' శబ్దము లోపించి యాదివృద్ధిగలిగి టిడ్ఢాణఞ్ సూత్రమున ఙీప్ప రాఁగా 'కారి' అనుపూర్వోక్తరూపంబగునని యెఱుంగునది. కాన 'కారి' శబ్దము సూర్యపుత్రి యన్న యర్థమిచ్చుచు శ్లో॥ కాళిందీసూర్యతనయా యమునా శమనస్వసా" అనునిఘంటు ప్రకారముగ యమునానదికిఁ బర్యాయశబ్దమగు. అనంతరమున, "కారింయాతి ప్రాప్నోతీతి కారియః" అని పూర్వోక్త ప్రకారముననే ఢక్ప్రత్యయాంతరూపమయి యమునానదిని బొందినవాఁడన్న యర్థమగు "రలయోరభేదః" అనున్యాయమునఁ గాలేయః అనుశబ్దమును 'పూర్వోక్తార్థ'మే యిచ్చుచునుండెడి. మఱియు, 'ఙ్యాపోస్సంజ్ఞాఛందసోర్బహుళమ్, (౬-౩-౬౩) అనుసూత్రముచే బాహుళకంబున హ్రస్వముగలిగి కాలీయశబ్దమువలన హ్రస్వ

మధ్యంబగు కాళియశబ్దమగు. ఇట్లు దీర్ఘమధ్యరూపమే హ్రస్వమధ్యరూపమునకు మాతృస్థానమగు.

ఇట్లు శాస్త్రంబున నెన్నివిధంబులఁ జూచినను దీర్ఘమధ్యత్వమున నర్థవంతమౌ కాలీయశబ్దమే కాలియశబ్దమునకు మాతృస్థానీయమై శాస్త్రజ్ఞులచే శ్లాఘింపఁదగియుండు అటులు కేవలమును హ్రస్వమధ్యమగు సంజ్ఞాపదమే యని వచించు పక్షముననో! తానొక్కటియే యనర్థముం బొందక తనపక్షమునకు సైతమనర్థముం దెచ్చి పెట్టును. సంజ్ఞాపదమునకింత బ్రహ్మప్రయత్నముతో నర్థవిచారణయెందు కనిపెదవి విఱువఁగూడదు.

ఋ ఌ క్ సూత్రభాష్యమున 'అథఌకారోపదేశః కిమర్థః' అని యక్షరసమామ్నాయమందు ఌకారమును బఠింప నేమిప్రయోజనమని శంకించుకొని ఌతకుఁడను నామమ్ముకలవాఁ డుండవచ్చును. అట్టి సంజ్ఞాశబ్దమిగాదులకుఁ బరమ్మగుచో యణాదులు ఫలమ్మని ప్రత్యుత్తరమిచ్చి యశాస్త్రీయముగాని సంజ్ఞయేయుండుట న్యాయంబనుచు "న్యాయ్యాభావాత్కల్పనం సంజ్ఞాదిషు" అనువార్తికము నెత్తుకొని "న్యాయ్యస్యఋతకశబ్దస్య భావాత్కల్పనం సంజ్ఞాదిషు సాధుమన్యంతే। ఋతకఏవాసౌ నఌతక ఇతి॥ అపరఆహ। న్యాయ్యఋతకశబ్దశ్శాస్త్రాన్వితోఽస్తి। సకల్పయితవ్యః సాధుః సంజ్ఞాదిషు। ఋతుకఏవాసౌనఌతకః" అని యుపన్యసించి సాత్రింబగు ఋతిధాతువువలననైన ఋతకశబ్దము సంజ్ఞగా నుండఁదగుంగాని యశాస్త్రీయమైన ఌతకశబ్దము సంజ్ఞగా లోకములో నుండనేరదని ఖండించి నిశ్చయించె. కానఁ గాలీయాదిసంజ్ఞాశబ్దములు గూడ శాస్త్రంబున శిష్టాదరణీయము గావలయుం గాని యున్మత్తహస్తప్రస్తరంబులవోలె యథేచ్ఛముగాఁ బ్రయోగింపఁబడఁ గూడదు'

ఒకవేళఁ గొందఱు ధీమంతులు 'ఘనిలచౌ చ. (౫-3-౭౯)అను తద్ధితప్రకరణమందలి సూత్రమున నైన దేవియః, అనురూపమువోలె

(కాలియః, అనురూపము ఘఞ్ ప్రత్యయాంతమయి శాస్త్రీయమే యగునందు లేని యాశంకింపవలయు. "ద్వ్యక్షరం చతురక్షరం వా నామాకృతం కుర్యాన్న తద్ధితమ్" అను పస్పశాహ్నికభాష్యమందలి స్మృతివచనాదులఁ జేసియు, "కృదంతం నామ కుర్యాత్ స్వ్యతాప్రుక్తర్యాదితి, ఋ ౭ క్ సూత్రస్థకైయటోక్తిం జేసియుఁ గృదంతమయిన సంజ్ఞాశబ్దము శాస్త్రీయము గాని, తద్ధితంబు సద్ధితమ్ముగాదు, కాఁబట్టి తద్ధితాంత సంజ్ఞ శాస్త్రవిరుద్ధంబు. ఒకవేళఁ బామునకుఁ బాలుపోసినచో విషమగు నన్న లోకోక్తికి నాఁటిపీఠమ్మగుచు యాథార్థ్యమ్మగుఁ బాపనామమునందగి సద్ధితంబుగాని యాఘణినామంబు తద్ధితాంతమగుటయే యుక్తంబందు లేని యట్లనంగవలదు. ఆతనిని శాస్త్రీయమైన కృదంతనామంబుననే పిలువవలయు. అట్లయ్యేనేని యతండా పదసంఘటనకు వ్యతిరేకముగా నంతకృన్నామంబు నొందక యాపదసంఘటన సేయంబూడదు. ఎంతకుటిలగతులనైనను భూషించుట మంచిదిగాని దూషించుట మంచిదిగాదు. అట్టివారి నారాధింపవలయు. ఎట్టి విషపాతకులైనను సత్కరించుట సమంజసంబు. లోకములో నాగచతుర్థీవ్రతంబున నెందఱో తమపొట్ట కట్టిపెట్టుకొని పుట్టపట్టునకేగి నాగకుమారులకుఁ బాలీయ నాపాపజాతియంత నాపెట్టుపోఁతవారి పాణింబులనే తమపొట్టనుబెట్టుకొనఁగా నప్పుడైన నాకులంబు జనంబా కులంబుగాక పుట్టమాత్రి మచ్చుదల లేదనియు నాగులు నిజంబుగా నాగులేయనియు (నవిద్యతే ఆగః యేషాం తే) నమ్మిభోగులనుచు నింటను గద్దియ మెక్కించి చేతులుజోడించి నిరపరాధులు ముశిచిపెట్టుకొని నాగేంద్రుఁడా! తండ్రీ! ఇత్యాది ప్రార్థనాపూర్వకసంబుద్ధ్యంతములతో సాష్టాంగమ్ములు సమర్పించుచుఁ దమ పాలన్నియు నారిపాలు సేయఁగా నిప్పటికిని జూచుచుండమే? అట్టిస్థితిలో నీతండు చిరకాలమును యమునాతీర్థసేవ సేసిన పవిత్రమూర్తి. అందఱువాలెఁగాక యధికరసజ్ఞుండు. మహాహితత్త్వంబు దెలిసికొనవలెనంటిమూ?

ఈతనిచరిత్రమే తెలుంగవలయు సహజంబులగు చూడామణుల
చే నాగర్భశ్రీమంతుండుగాన భోగులలోని భోగి వాయుభక్షణ మాత్రం
బున శరీరస్థితి నిల్పుకొను నీతని గూఢ పాదసంచారంబు లానృష్టి కర్త
కైన నెఱుకలేమిం జేసి యోగులలోని యోగి యనం దగినవాం
డు వేఱచెప్పనేల? ఈతనికినా శ్రీమహావిష్ణువు చిన్నిపాపమై తలపై
చుట్ట మయ్యెంగదా! కావున నీకుండలి బిరుదాంకితుని నామక
రణంబున సద్ధితంబుగాని తద్ధితంబు మానితిమేని సంతసించి యస్మద్ధితం
బు నొంది కాటునాటకుండును కాటునాటకుంటయే కనకంబుగాదే!
ఆతనిపేరు హ్రస్వమే సేసినచో శాస్త్రప్రవృత్తికిని నాతని దయాప్రవృత్తి
కిని [illegible]కులమగుదును. ఆతనిపేరు దీర్ఘంబు సేసినచో నాతనికి మో
దంబుగల్గును శాస్త్రమ్మునకు నామోదంబుగల్గును. "ఆమ్రాశ్చసిక్తాః పి
తరశ్చతృప్తాః" అనున్యాయమ్మునకుం బాత్రుండగుదును. కాంబట్టి
యాతని నామమ్ము శాస్త్రోక్తముగాం గ్రహణము సేసి యుంకనునాతని ద
యగల్గుటకు సరియైన సూత్రమాలోచింపవలయు. అహా!! సరియైన
సూత్రమనుటతోడనే యిపుడు జ్ఞప్తికివచ్చినది. వేమాఱు సర్వనామప్ర
[illegible]మనంబున విక్రియంజెంది శాస్త్రప్రక్రియన్నలిచియేమేమో ప్ర
[illegible]తిమి. స్మృతివిరోధమటుండంగా నీతనినామంబునం దద్ధితఘన్ ప్ర
త్యయమువచ్చుటకు సరియైన సూత్రమేలేదు. బహ్వచో మనుష్యనా
మ్నష్ఠజ్వా "(౪—3—౭౮)" ఘనిలచౌచ (౪—3—౭౯) అను
శాస్త్రమ్మున మనుష్య నామంబు నెడ సందర్భించునట్టి ఘన్ ప్రత్యయ
ము సర్వనామమ్మునెడ నెట్లు సిద్ధించు? "అను కంపితో దేవదత్తః, దేవి
యః" అన్నట్టులు మనుష్యులలో నెవ్వండేని కాలదత్తుండుండినచో నెపు
డు 'కాలియః' అనర్థునాగు కాలదత్తుండీ వఱలో నశ్రుతచరుండు
భవిష్యత్కాలంబున [illegible]కి స్వరూప స్వభావంబుల నెవణుకం
డె వండైన మనుష్యులలో నుద్భవిల్లుటయేకాక శాస్త్రజ్ఞులచే బేరం

గూడ నవణుకాండగుట యామోదింపఁబడియె నేని యట్టి భుజంగమూర్తి చేతను సైతమా శ్రీకృష్ణమూర్తి పాదములే శిరసావహింపఁబడుంగాత ప్రకృతంబునఁ బూర్వోక్త శాస్త్రప్రక్రియం జేసి కాళియశబ్దమునకుఁ గాళీయశబ్దమే మూలస్థానీయము గావున వ్రాఁత పొత్తములయందును నచ్చుపొత్తములయందును శ్రీమద్భాగవతములయందుఁ గొన్నిశ్లోకములందు దీర్ఘమధ్యముగాను గొన్నిశ్లోకములయందు హ్రస్వమధ్యముగఁ గానిపించు రూపంబులు సాధువులుగాని యసాధులుగావు. భాగవతమందలి శ్లోకము లనుష్టుప్ శ్లోకములగుటం జేసి లక్షణము ననుసరించి దీర్ఘమధ్యమేయని నిశ్చయించుటకు వీలులేకున్నను నీక్రింద నుదాహరింపఁబడు శ్రీకృష్ణ సహస్రనామ శ్లోకము లక్షణంబునం జేసి దీర్ఘమధ్యమ్మని నిశ్చయింపఁగంకణము గట్టుకొని తార్కాణముగానుండి పైశాస్త్రప్రక్రియను ధ్రువపఱచుచున్నది.

శ్లో॥ కాళీయఫణమాణిక్యరంజిత శ్రీపదాంబుజః।

ఈశ్లోకమున గాళీయ శబ్దము హ్రస్వమధ్యమయ్యెనేని ప్రథమాక్షరమైన కావర్ణముమీఁదలీయఫ అనునది లఘుత్రయమ్మగాన నగణంబగును. మొదటియక్షరము తర్వాతననుష్టుప్పాదము నందునగణము గాని సగణముగాని, యుండఁగూడదు. ప్రమాణము. వృత్తరత్నాకరము. అనుష్టుప్ప్రకరణము. శ్లో॥ వక్త్రంనాద్యాన్నసౌస్యాతా। మబ్ధేర్యోనుష్టుభిఖ్యాతమ్ । నుష్టుభి=అనుష్టుప్ ఛందస్సునందు ఆద్యాత్ =మొదటియక్షరముకంటె, నసౌ-నగణసగణములు నస్యాతామ్-ఉండవు అబ్ధేః- నాల్గవయక్షరము తర్వాతియగణముండెనేని వక్త్రంఖ్యాతం-వక్త్రమని చెప్పఁబడియె, తక్కిన పథ్యావక్త్రాదికానుష్టుబ్భేదములయందుఁ బాదముల తత్తత్ప్రదేశములయందుంచుక గణభేదము చెప్పఁబడినను, నాద్యాన్నసౌ అనునది. అనఁగా పాదప్రథమాక్షరము తర్వాతను, నగణముగాని, సగణముగాని యుండఁ గూడదనునది యన్నివృత్తములకు సమానలక్షణము. కాఁబట్టియిట్లు కాళీయపదము ప్రథమసోపానస్థానీయమనియు, కాళియపదము ద్వితీయ సోపానస్థానీయ మనియు, శాస్త్రంబున నిశ్చయింపఁబడియె

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహమూర్తిగారు రచియించిన యీక్రిందిపద్యములో ప్రథమాతిక్రమణే కారణాభావాత్ ॥అనున్యాయం బునఁ బ్రథమసోపానస్థానీయమైన దీర్ఘమధ్య కాళీయపదమునుప్రయోగించుట యొప్పియుఁ బండితాదరణీయమైయున్న యది శ్రీరస్తు శ్రీ శ్రీ శ్రీ

గీతిః శ్రీకల్లూర్యన్వయ వేంకటరామాఖ్యేన శాస్త్రిణా చిత్యాత్॥ కాళీయపదం నిరవాచ్యేవంనయది బ్రువంతు శాస్త్రజ్ఞాః॥

—:o:—

దేశమాత-26—6—1918

# వ్యాకరణ విశేషములు.

దివాన్ బహదూర్ బిరుదార్హులు

—o—

శ్రీవిజయనగరము మహారాజావారి కాలేజీప్రిన్సిపల్ రావుబహదూర్ శ్రీమత్కిడాంబి రామానుజాచార్యులవారు దివాన్‌బహదూర బిరుదంబున భూషితు లగుటవిని రాజమహేంద్రవరము గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ ప్రథమగీర్వాణపండితులు కల్లూరి వేంకటరామశాస్త్రిలుగారు సానందపూర్వకముగా నొనరించిన యాశీర్వాదవిజ్ఞప్తి.

కవికంఠాభ వ్యాఖ్యాతలితరులగుట న్యాయ్యంబనియుఁ బండితమండలాధిష్ఠానం బగువిజయనగరమునందు స్వర్థము వివరించుసమయమున నీశ్లోకమునకు వన్నెహెచ్చించుననియు నెంచి రచనార్హ చేతదనఁ యాశీర్వాదవిజ్ఞప్తి మిక్కిలి తరుణములో నందవలయు నన్న యుత్సాహముతో నీశ్లోకముస్వల్పవివరణ సహితముగానే విజయనగరంబునకు నీజూన్ నెల 5 వ తేదియందుఁ బ్రేషితంబయ్యె పుణ్యశ్లోకునికిం జెందిన యీశ్లోకార్థము లోకమ్మునకు నామోదము సమకూర్చు నన్నతలంపున నీక్రింది యర్థవివరణముతో మిత్రులగు మ॥ శ్రీ॥ బోడపాటి రామలింగముగారి ప్రోత్సాహమునం జేసి చెన్నపట్నమందలి యాంధ్రపత్రి

కు నీజాన్ నెం 7 న తేదియందే ప్రపంచబడినది. కాని యావత్తుకే సముద్రతీరమై యున్న చెన్నపురియందుఁ దాను సముద్రం బగుట (ముద్రణముతోఁ గూడినది యగుట) యనవసరమ్మని యెంచెనో! యన, నీ శ్లోకము సముద్రతీరముగాని గౌతమీనదీ తీరమందలి యీచిన్నపురి యందే సముద్రంబై (ముద్రణముతోఁ గూడినదై) శ్రీనిదానం బగుచుఁ బ్రస్తుతమం నీసుదర్శ నాధికారినిఁ (శుభదర్శనముగలయధికారినిఁ సముద్రతమున, సుదర్శనమనెడి గొప్పచక్రముగల (అధిక—అరి విష్ణువి) దనయాశయమును. (తన శ్లోక) భావమును; పుత్రిక యైనలక్ష్మి హస్తము నని సముద్రతము) గ్రహియింపఁ గోరుచుండెడి. (సముద్రము శ్రీమహావిష్ణునిఁ దనకుమార్తె యైన లక్ష్మీదేవిహస్తము గ్రహింపఁ గోరునటు లీయాశీర్వాదశ్లోకము తనభావప్రకారమ్మున నీయధికారిని శీనిఁ జెందఁగా నాశాసించుచున్న దని భావము)

శ్లో॥ శ్రీమత్కిడాంబి రామానుజాచార్య విబుధాగ్రణీః।
భో! దివాన్ బహదూర్ గేయ! భూదివాన్ బహదూజకాయ॥

ప్రకృతమున “దివాన్ బహదూర్” అనుభాషాంతరపదమునుఁ వ్యాకరణశాస్త్రబలమున గీర్వాణభాషాపదముగా సంస్కరించుచు శ్లోకరచనాకర్త దేవేంద్రుఁడనినయర్థము సమర్థించెడి. అయ్యది యెట్లనఁగా:—దివమ్, త్రిదివమ్ అవతి ప్రాప్నోతీతి, దివాన్, అకారాంతదివశబ్దము పూర్వమందుఁ గల్గి గత్యర్థక ... భా... గర్త్రర్థమందుఁ గ్విప్ప్రత్యయము సేయ ... “... స్వక్వి” సూత్రమున నుపధాదీర్ఘము “మోనోధాతోః” ...సూత్రమున మకారమునకు నకారమును ... దివాన్” అను ... రూపమగు; స్వర్గగామి యని యర్థము దివాన్ పదము ... బర్యాయశబ్దమై స్వర్గనివాసి=దేవత యన్నయర్థ మిచ్చుచు.

“బహదూర్”—ఇయ్యది పదసిద్ధిసమయమున విసర్గాంతముగా నుండవలసియున్నను, సంహితా వాదసమయమున దకారపరేఫాంతముగా నుండెడి. కాననే పైశ్లోకమునలో రేఫాంతముగాఁ గాఁబ

దుచుండు ఇతరభాషలలో రేఫాంతము ప్రసిద్ధముగానఁ బ్రకృతమునఁ బైనఁహిందూస్థానములో రేఫాంతముగా నున్న శబ్దస్వరూపముచే నిర్, దుర్, అనిత్యాదులం బలెనను కరించి యర్థము వివరింపఁ బడుచున్న యది, "వబయోరభేదాత్" అనున్యాయముననియ్యది "వహాదూర్" అగు వహాంశ్వాసా, ఊర్చ్, వహాదూః (వహాదూర్) అనికర్మధారయ సమాసము కర్త్రర్థ క్విబంతమై రక్షణార్థకమైన "అవ" ధాతువునకు "జ్వరత్వర" అనుసూత్రమున ఊరురాఁగా "ఊర్" అను ప్రథమైకవచనరూపమగు. భరించుచున్న రక్షకుఁడని యర్థము. శ్లో॥ ప్రజానాం వినయాధానా ద్రక్షణాద్భరణాదపి" అని కాళిదాసు రక్షణభరణములు వేఱుగా వచించినందున నిచ్చటఁ బునరుక్తిదోషము లేదు. దివాన్-దేవతలయొక్క బహాదూర్-భరించుచున్న రక్షకుఁడు అనిషష్ఠీతత్పురుషము దేవేంద్రుఁడని యర్థము. భూదివాన్ బహాదూర్-(భోగవైభవంబులందు) భూదేవేంద్రుఁడని యర్థము. మఱియుఁ భూదివాన్ పదమును బహాదూర్ అనుపదముతో సమసింపఁ జేసినచో, బ్రాహ్మణుల భరణరక్షణకర్త యనివయర్థమగు. బ్రాహ్మణోపకారి యని ఫలితార్థము. ఇట బ్రాహ్మణులనుట వర్ణప్రాధాన్యమున గణింపఁబడినట్లు తోఁచినసర్వవర్ణములకు నుపలక్షణముగా నర్థమగు సర్వవర్ణోపకారి యని ఫలితార్థము. శ్లోకములోని భోశ్శబ్దము సంబుద్ధ్యర్థక హేశబ్దపర్యాయము. రెండవపాదములోని విబుధాగ్రణీశబ్దమునకుఁ బండితప్రభువనియుఁ దేవేంద్రుఁడనియు నర్థము. గేయ=శ్లాఘ్యపాత్రయని సంబుద్ధి దివాన్‌బహాదూర్ బిరుదంబు గలిగి కొనియాడందగినట్టి మ్యో॥శ్రీమత్కిడాంబి రామానుజాచార్య పండితప్రభూ (దేవేంద్రాంయని యుద్వాబ) బ్రాహ్మణాదిసర్వ వర్ణోపకారిత్వమును (భోగవైభవంబుల) బూదేవేంద్రత్వమునను సర్వోత్కర్షముతో వర్ధిల్లుతమని యాశీర్వాదము.

7—6—1918 రాజమహేంద్రవరము

# ఈవ్యాకరణములోవచ్చునట్టి గ్రంథాదులవివరము.



| గ్రంథకర్తలు. | గ్రంథసంకే. | గ్రంథములు పరిచ్ఛేదములు లేక తాశురములు ఆశ్వాసముల సంఖ్య. |
|---|---|---|
| తిమ్మకవి | అచ్చ. రా. | అచ్చ తెనుగు రామాయణము (6 |
| అబ్బయ | అని | అనిరుద్ధచరిత్రము (5) |
| వేంకనార్యుఁడు | ఆంధ్ర | ఆంధ్రభాషార్ణవము. (3) |
| కృష్ణరాయలు | ఆము | ఆముక్తమాల్యద (6) |
| పాపరాజు | ఉ. రా. | ఉత్తరరామాయణము (8) |
| అడిదము సూరకవి | కవి. త. ల. | కవిసంశయవిచ్ఛేదము. తరంగము లక్షణము |
| ... ... | ...కవిజ | కవిజనరంజనము. (3) |
| పింగళి సూరన్న | కళా | కళాపూర్ణోదయము (8) |
| మట్ల అనంతభూపాలుఁడు | కాకుత్స | కాకుత్స్థవిజయము (5) |
| మూర్తి | కావ్యా | కావ్యాలంకారసంగ్రహము. (5) |
| శ్రీనాథుఁడు | కాశీ | కాశీఖండము (10) |
| కుమారధూర్జటి | కృష్ణరా | కృష్ణరాజవిజయము (4) |
| మల్లన | చంద్ర | చంద్రభానుచరిత్రము (5) |
| వేంకటపతి | చంద్రా | చంద్రాంగదచరిత్రము (6) |
| పినవీరభద్రుఁడు | జై | జైమినిభారతము (8) |
| తిక్కనసోమయాజి | నిర్వ | నిర్వచనోత్తర రామాయణము (10 |
| తిమ్మకవి | నీలా | నీలాసుందరీపరిణయము. (3) |
| శ్రీనాథుఁడు | నై | నైషధము (8) |
| గ్రంథకర్తలు | గ్రంథసంకే | గ్రంథముల (పరిచ్ఛేదము లేక తాశురము. ఆశ్వాసముల సంఖ్య)) |

| | | |
|---|---|---|
| నారాయణకవి, వేంకటనాథుఁడు | పంచ | పంచతంత్రము, |
| శాకమూరిమూర్తి | పాంచా | పాంచాలీపరిణయము (5) |
| రామకృష్ణకవి | పాండు | పాండురంగమహాత్మ్యము. (5) |
| ముక్కుతిమ్మన్న | పారి | పారిజాతాపహరణము (5) |
| పింగళి సూరన్న | ప్రభా | ప్రభావతీప్రద్యుమ్నము (5) |
| బి. సీతారామాచార్యులు | ప్రౌఢ | ప్రౌఢవ్యాకరణము |
| భాస్కరుఁడు | భల్లా | భల్లాణచరిత్రము (5) |
| బమ్మెరపోతన | భాగ | భాగవతము (12) |
| రెట్టూరిరంగరాజు | భాను | భానుమతీపరిణయము (4) |
| నన్నయభట్టాదులు | భార | భారతము (18) |
| భాస్కరాదులు | భాస్క | భాస్కర రామాయణము. (6) |
| అనంతుఁడు | భో | భోజరాజీయము (7) |
| అల్లసాని పెద్దన్న | మను | మనుచరిత్రము (6) |
| మారన | మార్క | మార్కండేయపురాణము (8) |
| మొల్ల | మొల్ల | మొల్లరామాయణము (6) |
| తెలగనార్యుఁడు | యయా | యయాతిచరిత్రము. (5 |
| రంగనాథుఁడు | రంగ | రంగనాథ రామాయణము (6) |
| కోదండపతి | రస | రసమంజరి. (3) |
| తిమ్మకవి | రసి | రసికజనమనోభిరామము (7) |
| పింగళిసూరన్న | రాఘ | రాఘవపాండవీయము (4) |
| తిమ్మయ | రాజ | రాజశేఖరవిలాసము (3) |
| అయ్యలరాజు రామభద్రుఁడు. | రామా | రామాభ్యుదయము (8) |
| మల్లన | రుక్మాం | రుక్మాంగదచరిత్రము (5) |
| తిమ్మయ | రుక్మి | రుక్మిణీపరిణయము (5) |
| ఎఱ్ఱాప్రెగ్గడ | లక్ష్మీ | లక్ష్మీనృసింహావతారము(నృసింహపురాణము) (5) |

| గ్రంథకర్తలు | గ్రంథసంకేత | గ్రంథములు పరిచ్ఛేదముల లేక |
|---|---|---|
| నందిమల్లన, ఘంటసింగయ. | వరా | వరాహపురాణము (12) |
| రామరాజభూషణుడు | వసు | వసుచరిత్రము (6) |
| | తాకీరము | ఆశ్వాసముల సంఖ్య) |
| కాత్యాయనుడు | వా | వార్తికము |
| జక్కన | విక్ర | విక్రమార్కచరిత్రము (8) |
| చేమకూర వేంకటనాథుడు | విజ | విజయవిలాసము (3) |
| | | (సుభద్రాపరిణయము) |
| కేతన (అభినవదండి) | విజ్ఞా | విజ్ఞానేశ్వరీయము (3) |
| వెన్నెలకంటి సూరన్న | వి. పు | విష్ణుపురాణము (8) |
| బమ్మెరపోతన్న | వీర | వీరభద్రవిజయము (4) |
| శేషము వేంకటపతి | శశాం | (తా ా) శశాంకవిజయము(5) |
| గణపతిదేవుడు | శివ | శివయోగసారము (4) |
| కదిరీపతి | శుక | శుకసప్తతి (2) |
| మల్లారెడ్డి | షట్చ | షట్చక్రవర్తిచరిత్ర |
| ... ... | షట్చ | నలషట్చక్రవర్తిచరిత్రలోనినలచరిత్ర |
| యల్లన | షో | షోడశకుమారచరిత్రము (8) |
| కామేశ్వరుడు | సత్య | సత్యభామాసాంత్వనము (4) |
| తిమ్మయ | సర్వ | సర్వలక్షణ సారసంగ్రహము |
| చేమకూర వేంకటనాథుడు | సా | సారంగధర చరిత్రము. (3) |
| అయ్యలరాజు నారాయణామాత్యుడు | హంస | హంసవింశతి (5) |
| ఎఱ్ఱాప్రగడ | హరి. పూ. | హరివంశము పూర్వభాగము(9) |
| సోమనాథుడు | హరి. ఉ. | హరివంశము ఉత్తరభాగము. |
| శంకరకవి | హరిశ్చం | హరిశ్చంద్రోపాఖ్యానము (5) |
| రామరాజభూషణుడు | హరి [illegible] | హరిశ్చంద్ర[illegible] 5. |

# వ్యాకరణవిశేషాంశములు

భారతి, 15—7—1904

శబ్దరత్నాకరాది నిఘంటువులందును కొన్నిపత్రికలయందును బంచాంగములయందును పండిత పామర సాధారణముగా జ్యేష్ఠమాసమని వాడుచున్నారు. అదిజ్యైష్ఠమాసంబని యుండవలయును గాని జ్యేష్ఠమాసమనఁగూడదు "ప్రమాదోధీమతామపి" అనుటంజేసి ధీమంతులకే ప్రమాదంబుగాన సవరించుకొనుట యుక్తముగా దోచుచున్నది, ఇదియు నొకచిన్న సమాచారముగావున వృత్తాంతములలోఁ బొత్తుపఱిచినారము.

కల్లూరి వేంకటరామశాస్త్రి.

శ్రీభారతి ఫిబ్రవరి మార్చిఏప్రిల్ 1905

జ్యైష్ఠమాస శబ్దవిమర్శన,

జ్యైష్ఠమాసమని ఐత్వముతోఁ బలుకవలెనుగాని ఏత్వముతోఁ బలుకఁ గూడదని శ్రీభారతీ ప్రథమ పత్రికయందుఁ బ్రకటింపఁబడియె. తర్వాతను గొందఱు సజ్జనులు ఈశబ్దంబునకు శాస్త్రపూర్వకముగా రూపనిష్పత్తివ్రాసి పత్రికయందుఁ బ్రచురము చేయఁ గోరెదమని న్యాయైక గ్రహణ బుద్ధితో జాబులు పంపినందున దీనికింగల సాధక బాధక గ్రంథప్రయోగములు కొన్ని స్వయముగానే శంకించుకొని తోఁచినయట్టులు సిద్ధాంతీకరించుచున్నారము.

జ్యేష్ఠానక్షత్రముతోఁగూడిన పౌర్ణమాసి "జ్యైష్ఠిఅనఁబడును" నక్షత్రేణయుక్తః కాలః అనునట్టివ్యాకరణ సూత్రంబున అణ్ ప్రత్యయము వచ్చి ఆదివృద్ధిరాఁగా ఐకారయుక్త రూపంబగును. పిమ్మటను ఆనక్షత్రముతోఁ గూడిన పౌర్ణమాసిగలమాసము జ్యైష్ఠమనఁ బడును. సా

సాస్మిన్ పౌర్ణమాసీతి అనసూత్రంబునఁ దిరిగి అణ్ ప్రత్యయము రాఁగా మాసమర్థమైనప్పుడుఁ గూడ బైశబ్దమైకారముతో నుండవలెను. చిత్రానక్షత్రముతోఁ గూడిన పౌర్ణమాసిగల మాసము చైత్రమనియు, విశాఖానక్షత్రముతోఁ గూడిన పౌర్ణమాసిగలమాసము వైశాఖమనియు ఐకారముతోనుండిన రూపంబులే పైనిం జెప్పిన సూత్రంబుల మూలంబున లోకంబులో వ్యవహరింపఁబడుచున్నవి.

శ్లో॥ జ్యేష్ఠేమాసికర గ్రహోన శుభకృజ్జ్యేష్ఠాంగనాపుత్రయోర్జ్యేష్ఠే మాస్యపిజాతయోస్స్వయదివా జ్యేష్ఠోడు సంభూతయోః దంపత్యోర్వ్యదయేన కేనపిథి నా జ్యేష్ఠత్రయం చాస్తిచేత్రి) జ్యేష్ఠాహ్వాయ దోషదోహి సతతంనాప్యాద్వ గర్భద్వయే" అనుకాలామృత తృతీయ బిందువు నందుఁ బైశ్లోకములో మాసమర్థమైనప్పుడు సహితము పూర్వోక్త శబ్దమును ఏత్వంబుతోనే పఠించునట్టి లోకవ్యవహారంబు గలదనియు (౧)జ్యేష్ఠమాసము (౨)జ్యేష్ఠుఁడు (3)జ్యేష్ఠురాలు ఇట్టులు మూఁడుపర్యాయంబులు ఆశబ్దము తిరిగివచ్చినది.-గనుక నేకశేషవృత్తి చేతను నొకశబ్దమే మిగిలి యుంట సంభవించి త్రిజ్యేష్ఠదోషమని గ్రంథములోఁబొందుపఱచుటకు వీలైనదనియు, మాసమర్థమైనప్పుడు ఐకారముతోనుండెనేని యట్టిశబ్దంబును ఏత్వముతోఁ గూడిన తక్కినవయోవాచక శబ్దంబులును సమానరూపంబులు గాక యేకశేషవృత్తి దుర్ఘటంబై త్రిజ్యేష్ఠదోషమనిన గ్రంథకర్తల వాక్యంబులు అశాస్త్రీయ ప్రలాపంబు లనవలసియుండును గావున మాసవాచకమైనప్పుడు సహితము ఏత్వముతో నుండవచ్చునని యెవ్వరైనను వచింతురేని సావధానముగా వినుఁడు. పూర్వోక్త శ్లోకంబులో జ్యేష్ఠానక్షత్ర జాతక వధూవరులకు తన్మాసమందుఁ బెండిలి కూడదని కూడ చెప్పఁబడి యున్నది.

అనక్షత్రమందె పుట్టిన స్త్రీపురుషులు జాతార్థమందు నక్షత్రాణురాఁగా అదవృద్ధిచే నైత్వము వచ్చి జ్యైష్ఠులనఁ బడుదురు. కాని

ఏత్వముండద్దు కావుననే శ్లో॥ రో. రే. మ. మృ. జ్యే. చిషువృద్ధిరాదా ష్ఠాత్సేచ వాంత్యశ్రవశాశ్వయుక్షు॥

అన్నియా జుష ప్రయోరత్నము జాతకర్మ ప్రకరణమునందు రోహిణ్యాదినక్షత్ర జాతశిశువులను రౌహిణి, రైవత, మాఖ, మార్గశీర్ష, జ్యైష్ఠ అనిపిలువ వలెనని చెప్పఁబడినది. ఇప్పుడుకూడ నక్షత్రజాతకు లర్థమైనప్పుడు ఐత్వముతోఁగూడిన శబ్దంబులకును, ఏకారయుక్తమైనమాస వాచక శబ్దంబునకును (పూర్వపక్షులమతప్రకారంబున) ఏకశేషమర్ఘటంబుగాన "భక్తి తేషాంశు నేన రోగశాంతిః" అనులోకోక్తి ప్రకారంబుగా త్రిజ్యేష్ఠదోషమని చెప్పుట కవకాశమే లేకపోవును, మఱియుఁ బూర్వోక్త శ్లోకంబులలో పైమాసమందుఁ బుట్టినవారికి గూడనుఁ నామాసములో వివాహము కూడదని వచింపఁబడినది. ఆమాసమునందుఁ బుట్టిన దంపతులు అర్థమిచ్చునప్పుడు కాలాత్ తద్ వచ్చునుగాన నట్టివధూవరులు జ్యైష్ఠికులనఁ బడుదురు. ఇచ్చటను కూడ నేకశేషవృత్తి రాక త్రిజ్యేష్ఠదోషమని వచించుట దుర్ఘటంబేయగును, కాబట్టి మాసమర్థమిచ్చునప్పుడు ఏకారమె యుండునన్న వివాదమువలన లాభంబులేదు. పైశ్లోకములో "జ్యేష్ఠమాసి" అని ఐత్వముతోనే పలుకవలెను కాలామృతములోని ఏత్వము లేఖకుల ప్రమాదము కావచ్చును లేక జ్యోతిశ్శాస్త్ర గ్రంథములలో శబ్దసాధుత్వవిషయమై యంత పట్టుదలలేదు కావున "ధనిష్ఠ రేవత్యగతే ప్రయాణే" అనుపాఠము వంటిదే కాలామృతమును. కావచ్చును ఈగ్రంథములో నయితము ప్రమాదములుకొన్ని కానవచ్చుచున్నవి. శ్లో॥ దుఃఖస్యాత్పిత రౌద్రయోరదితిభే సా బంధకీశక్రభే" అని కాలామృత గ్రథమబిందువు లవ శ్లోకము మఖార్ద్రా నక్షత్రములయందు రజస్వలయైన స్త్రీదుఃఖియగునని చెప్పబడినది వ్యాఖ్యానములోఁ గూడ యస్యాః కన్యాయాః ప్రథమరజో దృశ్యతే సాదుఃఖస్యాత్" అని వ్రాయంబడియున్నది. శాస్త్రాంబునం జేసి "దుఃఖినీ". అను స్త్రీలింగరూపముండవలెను.

"దుఃఖినీస్యాత్" అన్నచో ఛందోభంగమగును. ఒకపక్షంబున "సుఖమాత్మన ఇచ్ఛతి" సుఖముతనకు గోరుచుండును అనిన యర్థమునందు క్యచ్ ప్రత్యయాంతంబైన సుఖశబ్దముకంటె క్విప్ ప్రత్యయము వచ్చి సుఖీఃఅని ఈకారాంతంబులలో శాస్త్రమున వ్రాయఁబడిన రీతిగానే దుఃఖఃమాత్మన ఇచ్ఛతి అనిన యర్థంబునందుం గూడ దుఃఖీః అన్నవిసర్గాంతరూపము పుల్లింగస్త్రీలింగ సాధారణముగా నుండును. గనుక శ్లోకములో నట్టి పాఠమేయుండవలయునని కాని లేక దుఃఖశబ్దంబునకు దుఃఖాభిన్నురాలు అనఁగా దుఃఖస్వరూపురాలన్న యర్థము చెప్పకాని యాశబ్దముకంటె చ్వి ప్రత్యయము చేసి అస్యచ్వౌ అనుసూత్రంబున ఈత్వము చేసినచో గంగీస్యాత్ అన్నట్టులే దుఃఖీస్యాత్ అన్నరూపము సాధువగునని కాని ఇట్టిచోటుల చెప్పఁదగు లేని ప్రకృతంబునఁ గూడ శాస్త్రజ్ఞులు జ్యేష్ఠమాసి అనియే పాఠము సవరింతురుగాక. ఇకను బూర్వపక్షోపలంబులు మీ చెప్పిన యట్లు మాసవాచకమైన పైశబ్దమునందు ఐత్వమున్నచోఁ దక్కిన వానితో నేకశేషవృత్తి వలను పడదు. గావున త్రిజ్యేష్ఠదోష మనిన వ్యవహారంబునకు గతి యేమియునియుడుగుదురేని సమాధానము వినుండు. కాలామృత. శ్లోకములో సర్వవిధంబులచేతను నేకశేషవృత్తి సంభవపడదని స్పష్టముగాఁ బైనిఁ జూపఁబడినది. ఆశ్లోకముయొక్క తాత్పర్యమేమనగా (౧)జ్యేష్ఠానక్షత్ర జాతకనరుఁడు. (౨)జ్యేష్ఠానక్షత్రజాతకురాలు కన్య.(3) జ్యేష్ఠానక్షత్ర యుక్తపౌర్ణమిగల మాసము ఇట్లుపైమూఁడింటి విశేషణంబులలోఁ బరంపరాసంబంధమున నంతర్భాగంబుగా జ్యేష్ఠశబ్దము ముమ్మారు తిరిగి వచ్చినప్పటికిని త్రిజ్యేష్ఠదోషమని గ్రంథకర్త తాత్పర్యముగాని ఏకశేషవృత్తియే యావశ్యకమన్న యభిప్రాయముగాను శ్లోకములోని తక్కిన యంశములలో గూడ నిట్టి యథాసంభవముగా గ్రహించుకొనవలయును, కనుక మాసవాచక శబ్దము విత్వయుక్తమైగానీ యుండవలయును జ్యేష్ఠఃశుక

శ్శుచిస్త్వయ్యం అని ఐత్వయుక్త పాఠమే యక్షరములో నుండవలయును. ఇచ్చోటున గురుబాల ప్రబోధికలో "జ్యేష్ఠానక్షత్రయుక్తా పూర్ణిమాస్మిన్" అని వ్యుత్పత్తి చైత్రవైశాఖాది శబ్దస్థలంబందువలెనె వ్రాయఁబడినది, కావున నిత్యాదిస్థలంబుల శాస్త్రజ్ఞులు జ్యైష్ఠశబ్దమనియే యూహింతురుగాక శబ్దరత్నాకరాది నిఘంటువులలో గూడ నీశబ్దమైత్వముతో నుండవలయునని యూహించునది. శ్లో॥ వీరాద్భుతాదిష్వరసేష్వరస ప్రసిద్ధిస్సిద్ధాకుతోఽపిపట యక్షవదావిభాతి లోకేగతానుగతికత్వవశాదుపేతామేతాంనివర్తయితుమేష పరిశ్రమోనః॥ అన్న సాహిత్య రత్నాకర రసతరంగోదాహృత శ్లోకంబున శృంగారమే రసమనియుఁ దక్కినవి యట్లుగాకున్నను మఱ్ఱిచెట్టును యక్షుఁడు (భూతవిశేషము) ఆవహించియున్నాడని యెవ్వండో పలుకఁగా దానిని లోకులందఱును గతానుగతికంబుగ నమ్మినట్లు శృంగారేతరములను రసములని వాడుచుండిరనియు నట్టిప్రసిద్ధిని మాన్పఁగా నింత శ్రమమాకుంగలిగెననియు భోజరాజు చెప్పిన వాక్యము ఈశబ్దముయొక్క ఐత్వవిచారణయొద్దను మాకు జ్ఞప్తికి వచ్చుచున్నది. ఇట్లుశాస్త్రంబున వైమాస శబ్దమందు నేకారము విధిగాఁ గనఁబడుచుండగా నింకను నెవ్వరైనను నేకారమే వచించుచుండి యామాసము జ్యేష్ఠలక్ష్మీనివాసమగుటయే తమకిష్టమని యాగ్రహింతురేని యట్టివారు చిరజీవులై యుందురుగాక!

కల్లూరి వేంకటరామశాస్త్రి.

# బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశికానుబంధము.

దేశమాత పత్రిక, 30—10—1918

## శేషాద్రిరమణకవులకు విశేషరమణీయంబౌ నుత్తరము.

బ్రహ్మశ్రీ శేషాద్రిరమణకవులు, బాలవ్యాకరణము చిన్నయ్యసూరిగారి స్వతంత్ర సామర్థ్యంబుననే రచింపఁబడినదిగాని హరికారికలకు నాంధ్రీకరణము కాదనియు, సూరిగారి గ్రంథకర్తృత్వము బ్ర॥ శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారికిఁ జెందింపుట యక్రమంబనియు, బ్ర॥ కల్లూరి వేంకటరామశాస్త్రులుగారు పరవస్తు చిన్నయ్యసూరిశబ్దంబును వ్యాకృతిని శబ్దమును బాండిత్య ప్రకర్షమ్మున శ్లేషించి కనంబఱిచినయట్టులు వారుచూపిన పదునాల్గుయుక్తు లిట్టివేయనియు, అక్టోబరు 26 తేది 1918 సం॥ము కృష్ణాపత్రికలో బ్రకటించిరి. పైనిం జూపినపదములు శ్లేషించుటకు స్థాలీపులాకన్యాయ లిఖితమైన గ్రంథములోని పదునాల్గుయుక్తులను గారణంబులగుచుండెడి. శ్లేషించుటకుఁ గారణమైన పదునాల్గుయుక్తులకు సమాధానము చెప్పక శ్లేషనుమాత్ర 'మేయెత్తుకొని, పదునాల్గుయుక్తు లిట్టివే' యనుట క్రమమ్ముగాదు. రాజమహేంద్రవరము గవర్నమెంటార్ట్సు కాలేజిలోని యుభయభాషాభూషితగురువులగు బ్ర॥ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రులుగారీయుక్తిపచనాదులం బరిశీలించియే గ్రంథకర్తృత్వము కృష్ణమూర్తిశాస్త్రులవారికి నిశ్చయించిరి. గ్రంథముద్రితమైన యావ్యాసప్రోక్తాభిప్రాయమును గనుంగొనవలయును. కొంతకాలమునకుముందున నీనగరంబున నార్ట్సుకాలేజీలోనే గీర్వాణపండితోత్తములైన బ్ర॥ కస్తూరి శివశంకరశాస్త్రులవారీపదునాల్గుయుక్తులం బరామర్శించియే "చిన్నయసూరికి సంస్కృతవ్యాకరణపాండిత్యమువిషయమై బాలవ్యాకరణములోని యంశములను జూడఁగా నాకు మిక్కిలి సందేహముగానున్నది" యని వ్రాయుచున్నారు. గ్రంథముద్రితమైన యాద్వైతీయశంకరమతమతల్లికను గణింపవలయును. ఇంతియకాక, శిష్టుకృష్ణమూర్తిశాస్త్రిగారి గ్రంథకర్తృత్వమునకు వ్యతిరిక్తాభిప్రాయులై ప్రకృతకవులచే స్వపక్షగృహీతులైన మ॥ శ్రీ॥ వావిలికొలను సుబ్బారావుగారును గుప్తార్థప్రకాశికావ్యాఖ్యానకర్తయుక్తులు యుక్తముగానేయున్నవని యొప్పుకొనుచు సత్యపరిశీలనాకాంక్షులయినట్టులు వారి ముద్రితాభిప్రాయమువలనఁ గానవచ్చుచున్నది. ఇట్లు పదునాల్గుయుక్తులను గీర్వాణాంధ్రములయందు గురుకులశిక్షితులైన పండితేంద్రులమనంబునాకర్షించి వారి పరిజ్ఞానదృష్టికిఁ బాత్రంబులై ప్రవర్తిల్లుచుండు. అట్టివానియెడ "పదునాల్గుయుక్తు లిట్టివే" యని పెదవివిఱిచి విరామమునొందుట యభిరామముకాదు. ఎత్తుకొనిన యీయంశము మిక్కిలి లోకోపకారకమయినదియు, చర్చనీయమయినదియునైయున్నది. బ్ర॥ వేంకటరామశాస్త్రులుగారు "చిన్నయసూరియే గ్రంథకర్తయని సమర్థించు మతిమంతుల యుక్తులు వందనపూర్వకముగ నందుకొని యభిప్రాయము మార్చుకొందు" రన్నట్లు గ్రంథమునఁ బెక్కుచోట్ల వ్రాయఁబడినది. వారికీవిషయమునఁ బట్టుదలలేదనుటస్పష్టము. కావునఁ బదునాల్గుయుక్తులను సమాధానము సంధింపఁ బ్రకృతకవులను బ్రార్థించెద. (కృష్ణాపత్రిక ముద్రింపనందున నిందు ముద్రింపఁబడియె.)

ఇట్లు, గ్రంథకర్తగారి శిష్యుఁడు,

ఆచంట సత్యనారాయణ. సీనియర్ బి. యే. స్టూడెంట్, ఆర్ట్సుకాలేజి, రాజమండ్రి.

N. 3. పైవ్యాస ప్రకటనకుఁ బిమ్మట గుప్తార్థప్రకాశికాకారులు సుమారెనిమిది సంవత్సరములు సంపూర్ణారోగ్యవంతులై యుండిరి. ఇక్కాలములోఁ బైఁ బేర్కొనంబడిన కవిద్వంద్వము గాని, మఱియేరునుగాని, వ్యతిరేకముగా వ్రాయంజాలరైరి.

శ్రీరామాప్రెస్, రాజమండ్రి.

